# దాశరథి రంగాచార్య రచనలు

## ఐదవ సంపుటం

# జీవనయానం

## గడచిన గుర్తులు




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

Dasarathi Rangacharya Rachanalu-Vol. 5 – JEEVANAYANAM

ప్రచురణ నెం. : 2135

ప్రథమ ముద్రణ : ఆగష్టు, 1999

కాపీలు : 1000



టైటిల్ డిజైను : చంద్ర



వెల: రూ.150-00

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంకు స్ట్రీట్,
హైదరాబాదు-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, (సుల్తాన్‌బజార్, అబిడ్స్),
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అక్షరకూర్పు: ట్వెంటీఫస్ట్ సెంచరీ, దిల్‌సుఖ్‌నగర్. ఫోన్: 4066986

ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్ విరల్‌వాడి, హైదరాబాదు. ఫోను : 3229831

# అంకితం



కష్టాల్లో
కల్లోలాల్లో
కన్నీళ్లలో
కలసిసాగుతున్న
కమలకు...

# నమామి

ఇది బతుకుపయనం – మీదీ, మాదీ అందరిదీ,
'జీవనయానం', వ్రాయమని ప్రోత్సహించినవారు
మిత్రులు డాక్టర్ ఏ.బి.కె. ప్రసాద్ గారు.
"జీవనయానం", 103 వారాలు ధారావాహికంగా ప్రచురించారు.
"వార్త", యాజమాన్యం, సంపాదకవర్గం.
జీవనయానం, సీరియల్‌కు యావదాంధ్రం స్పందించి లేఖలు వ్రాసింది.
జీవనయానం, జీవనదీ ప్రవాహం, అని వార్త, ఎడిటర్
కొండుభట్ల రామచంద్రమూర్తిగారు అమృత వ్యాసం వ్రాశారు.
జీవనయానం, పుస్తకంగా ప్రచురిస్తున్నారు
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు.
వారందరికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

సికిందరాబాదు. డాక్టర్ దాశరథి రంగాచార్య
15–8–1999.

# జీవనదీ ప్రవాహం 'జీవనయానం'

డాక్టర్ దాశరథి రంగాచార్య 'జీవన యానం' వార్త ఆదివారం అనుబంధంలో 103 వారాలపాటు ధారావాహికంగా ప్రచురించగలిగినందుకు గర్వపడుతున్నాం.

'ప్రతి రచనలో రచయిత ఆత్మ పలకాలి. ఆత్మలేని రచన నిర్జీవం' అని తరచూ చెప్పే దాశరథి ఈ విశ్వాసాన్ని నాటి 'చిల్లరదేవుళ్ళు' నుంచి నేటి 'జీవన యానం' దాకా అక్షరాలా పాటించారు.

చినగూడూరులో పుట్టి, భాగ్యనగరంతో పెనవేసుకుపోయిన జీవితం కర్మయోగిలా గడుపుతున్న రంగాచార్య ఆత్మకథ 'జీవనయానం' ఇందులో ఆరాటం ఉంది. పోరాటం ఉంది. కలలున్నాయి. కన్నీళ్ళున్నాయి. గెలుపు ఓటముల తారట్లాట ఉంది. ముషాయిరాలా హాయిగా కొన్నిచోట్ల, గజల్ లా గంభీరంగా మరికొన్నిచోట్ల, కొండలు, గుట్టలు ఢీ కొంటూ కొన్ని చోట్ల, ఒదిగిపోతూ, మలుపులు తిరుగుతూ, ఇంకొన్ని చోట్ల సాగిన జీవనది ప్రవాహం ఆయన జీవితం మొన్ననే సప్తతి సత్కారం అందుకున్న దాశరథి రంగాచార్య దాపరికం లేకుండా సరళమైన భాషలో తన జీవితంలోని బీభత్సానికి, భయాలకు, సాహసాలకు, విజయాలకు, విషాదానికి, సంతోషానికి అక్షర దర్పణం పట్టి సామాన్యులకు సైతం అర్థమయ్యే రీతిలో రచన సాగించారు. ఎక్కడా భేషజంలేదు. నాటకీయత కోసం కృతకయత్నం లేదు. గొప్పలు లేవు. గప్పాలు లేవు. గాంధీజీ సత్యప్రయోగాల (మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్) నివేదికలో కనిపించే నిజాయితీ, మానవీయత, వినమ్రత, స్పష్టత 'జీవనయానం'లో కనిపిస్తాయి. తన బలహీనతలను, తనవారి లోటుపాట్లను, గృహచ్ఛిద్రాలను, అవమానాలను, అన్యాయాలను...వేటిని చాపకిందికి నెట్టే ప్రయత్నం చేయలేదు.

ఇందులో కేవలం రంగాచార్య జీవితమే కాదు, ఏడు దశాబ్దాల తెలుగుజాతి జీవన చిత్రణ ఉన్నది. స్వతంత్ర పోరాటం, రజాకార్ల దౌష్ట్యం, కమ్యూనిస్టుల సారథ్యంలో తెలంగాణా సాయుధపోరాటం, ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమాలు, సాహిత్యోద్యమాలు...అన్నీ ఉన్నాయి. సరిహద్దులు రద్దు కావాలని కోరుకునే రచయితగా రంగాచార్య పదహారణాల తెలంగాణా వాడైనా ప్రత్యేక రాష్ట్రవాది కాదు. ఆయన ఏదో ఒకప్రాంతానికే పరిమితమైన రచయిత కాదు. అందుకే ఆంధ్రరాష్ట్రంలోని మూడుప్రాంతాల ప్రజానీకం ఆయన 'ఆత్మీయ కథనం' అకట్టుకుంది. వందవారాలకు పైగా క్రమం తప్పకుండా, ఆసక్తి తగ్గకుండా చదివిన పాఠకుల స్పందనే ఇందుకు నిదర్శనం. "మాహృదయాలని కదిలించిన అద్భుత అనుభవ సారస్వతంగా 'జీవనయానా'న్ని భావిస్తున్నాం" అంటూ ఓ తెలంగాణా పల్లెనుంచి ఉత్తరం వస్తే, "ఈ శతాబ్దపు అద్భుత రచనల్లో కచ్చితంగా జీవనయానం ఒకటి" అంటూ రాయలసీమ నుంచి మరో జాబు వచ్చేది. "కోనసీమ కొబ్బరినీళ్ళు

తియ్యనా...మా దాశరథి జీవనయానం తియ్యనా? అని సందిగ్ధపడిపోతున్నాం" అంటూ కోస్తాంధ్ర లేఖ ఒకటి పలకరించేది.

ఖరగ్‌పూర్‌లాంటి చోట నివసిస్తున్న ప్రవాసాంధ్రులు సైతం ప్రశంసల జల్లు కురిపించారు. నవలలకు, సీరియల్స్‌కు ఆదరణ బాగా తగ్గిన టీవీకాలంలో, నానా విధప్రయోజనకరమైన సమాచారంతో పేజీలు నింపుతున్న పత్రికాప్రపంచంలో క్రైం, సెక్స్, సస్పెన్స్‌లకు ఏమాత్రం తావులేని ఒక 'జీవితకథ'ను రెండేళ్ళకు పైగా ధారావాహికంగా ప్రచురించేందుకు సంపాదకవర్గానికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చిన 'వార్త' అధినేత గిరీష్‌సంఘి గారిది 'జీవనయానం' విజయోత్సవంలో కనిపించని కీలకపాత్ర. సంపాదక వర్గంలో అన్ని స్థాయిలవారూ ఏకగ్రీవంగా అభిమానించిన అసమాన రచన ఇది. రచనకాలంలో స్వయంగా ఎన్నో మధురమైన అనుభవాలు ఎదురై రచయితను కదిలించాయి. ఆయన ఎక్కడికి వెళ్ళినా జీవనయానం ప్రసక్తి తోనే సంభాషణ, పూర్వపరిచయం లేనివారు ఆయన ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళి అభినందించి, పాదాభివందనం చేసిన సందర్భాలు అనేకం. మచ్చుకో ఉదాహరణ – ఇటీవల ఒకానొక పొద్దునపూట చాలాసీదాసాదాగా, చెప్పాలంటే పెద్ద ఆర్థికస్థాయిలో ఉన్నవాడిలా కనిపించని పెద్దాయన ఒకరు 'అయ్యా, నేను మీతో మాట్లాడలేను. మీ జీవనయానం చదువుతున్నాను, పొంగిపోతున్నాను' అని దాశరథి గారి చేతిలో వెయ్యిన్నూటపదహార్లు పెట్టేసి, కాళ్ళకు దణ్ణం పెట్టుకుని వెళ్ళిపోయాడు. ఆయన పేరు బొలుసాని వెంకటేశమ్.

వేదాలను తేటతెలుగులోకి అనువదించిన బహుభాషావేత్త, మన తెలుగు రచయిత, మహా గట్టిమనిషి డాక్టర్ దాశరథి రంగాచార్య. అందరు తెలుగువాళ్ళలాగానే ఆయనకూ రావలసినంత ఖ్యాతి జాతీయస్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో రాకపోవడానికి తెలుగువాళ్ళే కారణమా? జీవనయానాన్ని ఆంగ్లంలోకి అనువదించే ఆలోచన త్వరగా ఆచరణలోకి రావాలని కోరుకుంటూ, ఆయన, ఆయన సతీమణి ఆనందంతో, ఆరోగ్యంతో నూరేళ్ళూ జీవనయానాన్ని అనాయాసంగా సాగించాలని ఆకాంక్షిస్తూ....

– కొండుభట్ల రామచంద్రమూర్తి

★ ★ ★

# వెలుగులు ప్రసారించిన జీవనయానం సువర్ణయానం

మహానుభావులు శ్రీ దాశరథి రంగాచార్యగారి స్వర్ణలేఖిని నుండి జాలువారిన జీవితానుభవమధనరసామృత గుర్తులు మా హృదయాలలో చెదరని మమతలను నింపింది. విజ్ఞానాన్ని, వివేకాన్ని అందించింది. చివరకు శుభదాయకంగా సర్వపాఠకులకు వేదనాదాల ఆశీస్సులను అందించింది. ఇన్నాళ్లు 'వార్త ఆదివారం అనుబంధానికి మకుటాయమానమై ప్రకాశించింది. ధారావాహిక జీవనయానం అప్పుడే అయిపోయినందుకు బాధ కలిగింది. గంగాస్వచ్ఛతరంగాల వలె సాగిన జీవనయానం అడుగుజాడలు శాశ్వతమైన వెలుగుజాడలను చూపింది. సత్యాన్ని ప్రదర్శించింది. చదువుతున్నంతసేపు యోగస్థితికి కొనిపోయినది. వారికి మా పాఠకలోకమంతా సంపూర్ణ కృతజ్ఞతలను చెల్లిస్తున్నది. అన్నింటికంటె వేదామృతాన్ని వచనరచనలో అనువాదం చేసి ఆంధ్రులకు అందించినందులకు చేతులెత్తి నమస్కరించుచున్నాను.

– ఎస్.ఎస్.పరిమి,
నందిగామ.

## భావితరాలకు మార్గదర్శకం

శ్రీ దాశరథి తమ 'జీవనయానం' ద్వారా తమ బాల్యంలోని శైశవానందంతో పాటు నిరంకుశ నిజాం కర్కశపాలనలోని అరాచకం హింసను అనుభవించటం, పిత్ప్రేమకు నోచక నిత్య పోరాటంతో గడపడం, స్వార్థరహితంగా పరహితం కోసం కంకణం కట్టుకొని ఎత్తుపల్లాలను, తీపిచేదులను, చీకటివెలుగులను, కష్టనిష్ఠూరాలను సహించి జీవితాన్ని మధించిన వైనాన్ని భావి తరాలకు మార్గదర్శకంగా ఎంతో చక్కగా చెప్పారు. సాహిత్య సౌరభాలను మనకు అందించారు స్వంత వ్యవహారాలను దాపరికంలేకుండా చెప్పుకున్న సహృదయులు 'జీవనయానం' ముగింపుతో ఒకేసారిగా చీకటి ఆవరించినట్లయింది. శ్రీ రంగాచార్యకి మా వందనాలు.

– శ్రీమతి బి. వెంకటనాగలక్ష్మి,
హైదరాబాదు.

## ఎదురుచూస్తాండేవాళ్ళం....

దాశరధిగారి 'జీవనయానం' ధారావాహిక ముగిస్తున్నట్లు ప్రకటించారు. ప్రతి ఆదివారం జీవనయానం కోసం ఎదురు చూస్తూ ఉండేవాళ్ళం. తమ పలుకులతో బంగారుబాటల్ని వేశారు దాశరధిగారు. ఇంత చక్కని ధారావాహిక ప్రచురించినందకూ మీకు, రచించిన దాశరధి గారికి హృదయ పూర్వక నమస్సులు. మరిన్ని విలువైన రచనలను మీ మేగజైన్ ద్వారా ఆశిస్తున్నాం.

– సి. రామమూర్తి,
తాడిపత్రి.

## అభినందనలు

దాశరథి రంగాచార్య నిండు జీవితానికి నిలువెత్తు అద్దం పట్టిన 'జీవనయానం'ని వారం వారం అందించి ఆంధ్రపాఠకులను ఆద్యంతం అలరించిన ఆదివారం వార్తకు అభినందనలు.

- చింతపల్లి వెంకటనారాయణ,
కైకలూరు.

## ఆణిముత్యం-జీవనయానం

డా. దాశరథి రంగాచార్యులు గారి 'జీవనయానం' అప్పుడే అయిపోయిందనే సరికే మాకు ఎంతో బాధ కలిగింది. వారి రచనాపటిమ మమ్మల్నెంతో ఆకట్టుకుంది. వార్తపత్రికకే తలమానికంగా వెలిగిన 'జీవనయానం' సీరియల్ ఒక అపూర్వరచన. నేటి నవలా లోకంలో ఇది ఒక స్వచ్ఛమైన స్ఫటికం అంటే అతిశయోక్తి కాదు. చేపల మార్కెట్టు ఎప్పుడూ రద్దీగానే వుంటుంది. జ్యువెలరీ షాపు మాత్రం ఎప్పుడూ ఒకరిద్దరు కస్టమర్లతోటే నిండి ఉంటుంది. అలాగే పిచ్చినవలంటే చెవికోసుకునే వారు లక్షల సంఖ్యలో ఉండే ఈ రోజుల్లో జీవనయానం వంటి మేలిమి ముత్యాన్ని అందించడానికి వెనుకాడని వార్త యాజమాన్యానికి మా కృతజ్ఞతలు. విలువ తెలిసిన వారే వెలకట్టడానికి అర్హులు. దాశరథిగారి జీవితం ఒక నిష్కల్మషమైన స్వచ్ఛమైన కపటమెరుగని కథాసాగరం. రచయితలు ఎందరో ఉన్నారు. కానీ తమ రచనాశక్తిని నీతి, నిజాయితీలతో ముడివేసి రచించేవారు చాలాచాలా అరుదు. ఇలాంటి రచయిత 'కోటికొక్కరు' అన్నా తక్కువే అవుతుంది. నేను మొదటి నుండి క్రమం తప్పకుండా చదివిన ఒకే ఒక సీరియల్ ఆ జీవనయానం. చదువుతున్నంతసేపూ, పరాయివారుకారు. మనలోనివారే 'గురుతుల్యులు' దాశరథీ రంగాచార్యులు గారు అనిపించింది. దీనిని గ్రంథరూపంలో విడుదలచేస్తే బావుంటుంది.

- ప్రొ. తీర్థాల సీతారామారావు,
వరంగల్.

## శైలి విన్యాసాలు

జీవనయానం చదువుతుంటే ఒక్కోసారి మనసు బరువెక్కుతోంది. ఒక్కోసారి దూదిపింజలా తేలిపోతోంది. దాశరథి రంగాచార్య శైలి విన్యాసాలు చిత్రకారుడి కుంచె చమక్కులు అనిపిస్తున్నాయి. నిజమే! జీవిత రచనా చిత్రానికి ప్రతిభావంతుడైన రచయితే అసలుసిసలు చిత్రకారుడు కాగలడు.

- కె. పద్మావతి,
సింహాద్రిపురం.

★ ★ ★

# జీవనయానం

బోద్ధారో మత్సరగ్రస్తాః ప్రభవః స్మయదూషితాః
అబోధోపహతాశ్చాన్నే జీర్ణమంగే సుభాషితమ్ (భర్తృహరి)

"పండితులు అసూయాపరులు. ప్రభువులు గర్వాంధులు. ఇతరులు తెలిసికోలేరు. అందువలన సుభాషితము నాలోనే జీర్ణమైంది."

జీవితం స్థావరం కానేకాదు. అంటే జీవితం ఒకచోట నిలిచి ఉండేది కాదు. జీవితానికి నిలకడలేదు. జీవితం జంగమం మాత్రం కాదు. అంటే జీవితానికి కదలిక మాత్రమే కాదు. కదలిందంతా జీవితం కాదు.

జీవితం ప్రవాహం. జీవితం నది. జీవితం స్రవంతి. [ప్రవాహం నిరంతరం కదులుతుంటుంది. కదలికలేని ప్రవాహం లేదు. నది నిరంతరం కదులుతుంది. కదలని లిప్తలేదు. అయినా నది కదలినట్లు కనిపించదు.

నిరంతరం కదులుతూ – కదలినట్లు కనిపించనిది జీవితం. జీవితం కదలిక. కదలిక జీవితం.]

చలనం జీవితం. నిశ్చలం మృత్యువు.

మన పూర్వులు జీవితానికి ఉపమానంగా వృక్షాలను అనేక సందర్భాల్లో వాడారు.

"భవన్తి నమ్రాస్తరవః ఫలోద్గిమైః," అంటాడు భర్తృహరి. కాసిన చెట్టు వంగుతుంది అంటాడు. సద్గుణవంతుడూ వంగుతాడు.

చెట్టు రుతువును బట్టి మారుతుంది. శిశిరంలో ఆకురాలుతుంది. చెట్టు ఎండినట్లవుతుంది. ఎండదు. వసంతం వస్తుంది. చెట్టు చిగురుస్తుంది. నవనవలాడుతుంది. పచ్చని మాను అవుతుంది.

జీవితమూ అంతే. వాడినా చిగురిస్తుంది. చిగురుస్తుంది!

*యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే*
*తావద్రామాయణ కథా లోకేషుప్రచరిష్యతి.*

భూమిమీద కొండలూ – నదులూ ఉన్నంత కాలం రామాయణ కథ ఉంటుంది అంటాడు వాల్మీకి.

జీవనానికి చెట్లు – కొండలు – నదులు ఉండాలి. ఈ నిత్య సత్యాన్ని మన పూర్వులు ప్రవచించారు. వీటిని పూజించమన్నారు. పూజించడం అంటే కనీసం హాని జరుపకుండడం.

*"త్వం హి త్రిపథగా దేవీ! బ్రహ్మలోకం సమీక్ష్యసే*
*భార్యాచోదధిరాజస్య లోకేస్మిన్ సంప్రదృశ్యతే!"*

"గంగాదేవీ! నీవు త్రిపథగవు. అందువలన బ్రహ్మలోకం దర్శిస్తావు. నీవు సముద్రుని భార్యవు. ఈ లోకమున ప్రత్యక్షదైవమవు." అంటుంది సీత గంగను దాటుతూ.

మనం చెట్లనూ, గుట్టలనూ, నదులనూ పూజించినంత కాలం – వాటికి నష్టం కలిగించనంతకాలం – ప్రకృతి మనను తన ఒడిలో లాలించింది.

చెట్లను గుట్టలను పూజించడం మూర్ఖత్వం అని పాశ్చాత్యులు మనకు నేర్పారు. వారు అన్నది నమ్మి నిజమైన మూర్ఖులం అయినాం మనం. అడవులను నరికాం! నదులను కలుషితం చేశాం, ఎండగొట్టాం! ప్రకృతి కన్నెర్ర చేస్తే ఇప్పుడు ఏడుస్తున్నాం!

ప్రకృతిని ఆశ్రయించినంత కాలం మానవ జాతి ప్రకృతితోపాటు పరవశించింది!

ప్రకృతికి ద్రోహం తలపెట్టగానే మానవజాతి ప్రకృతితోపాటు కన్నీరు రాలుస్తున్నది.

*సకల ప్రాణిజలం ప్రకృతిలో భాగం.*
*ప్రకృతితో జీవిస్తే దాని ఆకృతి నిలుస్తుంది.*
*ప్రకృతిని పాతం చేస్తే ప్రకృతిని చెరుస్తే*
*సకల ప్రాణజాలానికి విలయం తప్పదు!*

## జీవితం-ప్రవాహం:

నది జీవితం వంటిది అన్నాం. నది బిందువుగా మొదలవుతుంది. జీవితం బిందువుగా మొదలవుతుంది. నదిలో ఉపనదులు కలుస్తాయి. విశాలం అవుతుంది. జీవితంలో అనుభవాలు కలుస్తాయి. విశాలం అవుతుంది. నది ప్రశాంతంగా ప్రవహిస్తుంది. అయినా కదలిక కనిపించదు. జీవితం ప్రశాంతంగా ఉనంత కాలం ప్రవహిస్తుంది. అయినా కదలిక కనిపించదు. కొండలు కోనలు ఎదురవుతాయి. నది జలపాతం అవుతుంది. హోరును సృష్టిస్తుంది. ఇంద్రధనుస్సును సృష్టిస్తుంది. జీవితంలో ఆపదలు ఎదురవుతాయి. అప్పుడే జీవిత నాదం వినిపిస్తుంది. జీవితం వికసిస్తుంది. ఇంద్రధనుస్సులు సృష్టిస్తుంది. చిక్కుల్లోనే మనిషి ఎదుగుతాడు! ఆపదల్లోనే ఉన్నతుడు అవుతాడు. మనిషి అయినా జాతి అయినా అంతే. ఇది చరిత్ర చెప్పిన సత్యం!

*సుర్ఖ్‌రూ హోతామై ఇన్సాఁ ఠోక్‌రే ఖా నే కె బాద్*
*రంగ్ లాతీహై హేనా పత్థర్ పె ఘిస్నేకె బాద్*

దెబ్బలు తింటేనే మనిషి రాటు తేల్తాడు.
రాతిమీద రాస్తేనే బంగారంరంగు తేలుతుంది.

నదిలో మరొక నది కలిసిన సోయగం వర్ణనలకు అందదు. హిమాలయంలో అలకనంద – మందాకినితో కలుస్తుంది. ఆ దృశ్యం అపూర్వం.

జీవితమూ అంతే. జీవితంలోనికి ఒక భాగస్వామిని వస్తుంది. రావడమే కొన్ని సుడిగుండాలు ఏర్పడ్తాయి. ఒకరికి ఒకరు అర్థం కావడం కొంచెం కష్టం అవుతుంది. అర్థం చేసుకుంటే అంతే! నదీసంగమం. ఇద్దరు ఉండరు. మనసు ఒకటి – ప్రాణం ఒకటిగా మసలుకుంటారు! 'వాగర్థావివ సంప్రక్తౌ' అంటాడు కాళిదాసు. మాట – అర్థంవలె ముడిపడతారు! విడదీయరాదు! 'భాస్కరేం ప్రభాయథా' అంటాడు వాల్మీకి. సూర్యుడు వెలుగువలె విడదీయడం అసంభవం.

గంగా యమునలు – మందాకినీ అలకనందలు – ప్రాణహిత గోదావరులు – తుంగా కృష్ణలు, ఒక టేమిటి, నదులన్నీ మరొక నదిని కలుపుకొని సాగుతాయి.

జీవితమూ అంతే! కామక్రోధాదులు సాధారణంగా మనిషి అదుపులో ఉంటాయి. అయితే జీవితం సహితం ప్రకృతియే! దానికీ ఆటుపోట్లుంటాయి. కామ క్రోధాదులు హద్దుదాటినపుడు ప్రళయం వస్తుంది. తాను బాధపడ్తాడు. ఇతరులను బాధపెడ్తాడు.

అయితే సాధారణ జీవితంలో ఇవి అప్పుడు అప్పుడు మాత్రమే వస్తాయి. మనిషేకదా తప్పు చేస్తాడు! మానులు చేస్తాయా? అయితే తప్పును తెలుసుకోవడం – సరిదిద్దడం విజ్ఞుల లక్షణం. తప్పును దిద్దుకోవడం సృష్టిలో ఒక్క మానవునికి మాత్రమే సాధ్యం.

నది సాగుతుంది. కాలువలు అవుతుంది. పొలాలకు నీరిస్తుంది. నేలను సస్యశ్యామలం చేస్తుంది. సకల ప్రాణులకూ ఉపకారం చేస్తుంది.

జీవితం తన ఒక్కనికే కాదు. బహుజన హితాయ – బహుజన సుఖాయ. ఎక్కువ మంది హితమునకు – ఎక్కువ మంది సుఖమునకు. మానవుడు తెలిసి కొన్ని – తనకు తెలియక కొన్ని ఉపకారాలు చేస్తూనే ఉంటాడు.

నది పనిసొంతం తీర్చుకొని పాయలు అవుతుంది! సారవంతం అయిన భూమిని ఏర్పరుస్తుంది. "నదీనాం సాగరో గతిః." నది సముద్రం వైపు సాగుతుంది. సముద్రంలో కలిసిపోతుంది.

జీవితమూ అంతే. తన పని నెరవేర్చుకుంటుంది. సంతానం ఏర్పరుస్తుంది. వారి ద్వారా సమాజాన్ని సారవంతం చేస్తుంది. తనవు చాలిస్తుంది. అనంత విశ్వంలో లీనం అవుతుంది.

*ఆకాశాత్పతితంతోయం*
*సాగరం ప్రతిగచ్ఛతి.*

ఆకాశము నుండి పడిన నీరు సాగరం వైపు సాగుతుంది. పరిణామం జీవితం.

## పరిణామం-జీవితం:

నదిలో కదలిక ఉంది. జీవితంలో కదలిక ఉంది.

నదిలో నిరంతర మార్పు ఉంది. జీవితంలోనూ నిరంతర మార్పు ఉంది.

నది ప్రవహిస్తుంటుంది. ఒకే నీరు వలె కనిపిస్తుంది. కాని గత లిప్తలో ఉన్ననీరు ఈ లిప్తలో ఉండదు. ఒక నిర్దిష్టస్థలంలో ఉండి పరిశీలిస్తే ఈ విషయం కనిపిస్తుంది. నదికి నిరంతర పరిణామం ఉంది. అయితే అది స్థూల దృష్టికి కనిపించదు.

నిరంతర పరిణామమే జీవితం. జీవితంలోనూ నిరంతర పరిణామాన్ని పరిశీలించ వలసి ఉంటుంది. స్థూల దృష్టికి అది కనిపించదు. అందుకే కాల ప్రమాణం–సంవత్సరం ఏర్పరచారు. అయితే మార్పు సంవత్సరానికి ఒకసారి వస్తుందని అర్థంకాదు. నిరంతరం జరుగుతున్న మార్పును ఏడాదికి అంచనా వేస్తాం.

మార్పు ప్రకృతి సహజం. సమస్త చరాచరప్రపంచం నిరంతరం మారుతుంటుంది. ఇక్కడినుండి మార్పు శుక్లపక్షంవలె వృద్ధికావచ్చు. కృష్ణపక్షంవలె క్షయంకావచ్చు.

ఒక్కప్పుడు హిమవంతం లేదు. తరువాత వచ్చింది.

భారత భూమి ఆఫ్రికాను అంటి ఉండేదట! ఇప్పుడు లేని సరస్వతీనది ఒకప్పుడు ఉందట.

సృష్టి సమస్తం వలయం వంటిది. వలయంలో ఒక బిందువువద్ద వృద్ధి ప్రారంభం అవుతుంది. వలయపు ధృవంవరకు సాగుతుంది. అక్కడ క్షయం ప్రారంభం అవుతుంది. బయలుదేరిన బిందువువద్ద అంతం అవుతుంది.

అది మళ్లీ వృద్ధి చెందుతున్నదా? అదొక మహత్తమ మయిన ప్రశ్న. సమాధానాలు సిద్ధాంతాన్నిబట్టి ఉంటాయి. ఇంతకూ మార్పులేనిది లోకంలో ఏదీలేదు. ఇది జీవితపు నగ్నసత్యం. ఈశ్వరుడు తప్ప సమస్తం అశాశ్వతం.

## చారిత్రక సాక్ష్యాలు:

1. ఒకనాటి బ్రిటిష్ సామ్రాజ్యం మీద సూర్యుడు అస్తమించలేదు. ఈనాడు ఆ అనంత సామ్రాజ్యం అస్తమించింది. ఆ సామ్రాజ్యం ఒక చిన్నదీవికి పరిమితం అయింది.
2. హిట్లరు సమస్త విశ్వాన్ని చాపచుట్టి చంకలో పెట్టదలచాడు. తాను ఆత్మ హత్య చేసుకున్నాడు.
3. తన ధనమదంతో ప్రపంచాన్ని తన జేబులో పెట్టుకోవాలనుకుంది అమెరికా. సోషలిస్టు రష్యాను చూచి గిజగిజలాడింది. వెనక్కు తగ్గింది.
4. సామ్రాజ్యవాదానికి సమాధి నిర్మించగలదు అనుకున్న సోవియట్ యూనియన్ ఛిన్నాభిన్నం అయింది. అక్కడి సోషలిజం అంతరించింది.
5. నల్లమందు భాయీలు అనుకున్న చైనా, సోషలిజం సాధించి – ప్రపంచంలో అగ్రరాజ్యంగా పయనిస్తోంది.
6. భారతదేశం ఈ శతాబ్దంలోనే ఇటు బర్మానుంచి అటు అఫ్ఘనిస్తాన్ వరకు వ్యాపించి ఉండింది. క్రమంగా బర్మా పోయింది. అఫ్ఘనిస్తాన్ పోయింది. పాకిస్తాన్ కూడా పోయి, ఇప్పటి భారతదేశం మిగిలింది!
7. 1947లో ఏర్పడిన పాకిస్తాన్ పాతిక సంవత్సరాలయినా నిలువలేదు! అందులోంచే బంగ్లాదేశ్ పుట్టింది.

ఇవన్నీ మనం ఎరిగిన పరిణామాలు.

దేశాల హద్దులు – సముద్రాలు – పర్వతాలు – నదులు సమస్తం మారుతూనే ఉంటాయి.

ఏ వ్యక్తీ – ఏ రాజ్యమూ – ఏ సిద్ధాంతమూ – ఏ మతమూ పరిపూర్ణం కాదు. అన్నీ ఒక దశలో ఉన్నత ఆదర్శాలతో ప్రారంభం అయినవే. అన్నీ స్వప్రయోజనపరుల దివ్యహస్తాలతో ఆదర్శాలు అడుగంటినవే!

మానవ జాతి ప్రగతికి ఒక నిర్దిష్టలక్ష్యం లేదు. మానవుడు జన్మించినదాదిగా అది గంగవలె – నైలువలె – వోల్గావలె – యాంగ్ట్సీవలె – అమెజాన్‌వలె నిరంతరం ప్రవహిస్తూనే ఉంది. ప్రవహిస్తూనే ఉంటుంది.

## ఆసిఫ్‌జాహీలు:

ఔరంగజేబ్ మొగలు సామ్రాట్టులలో చివరివాడు. ఎంచాతంటే, తరువాత సామ్రాట్టులు లేరు. ఔరంగజేబు అత్యంత సమర్థుడు. దురాశాపరుడు. అంతులేని రాజ్యకాంక్ష కలవాడు. వీరుడు. మత దురహంకారి. మహాగర్వి. నియంత.

ఇన్ని దుర్లక్షణాలున్న ఔరంగజేబు వ్యక్తిగత జీవితం అతిసాధారణం. అతడు సాధారణ పౌరునివలె జీవితం గడిపాడు. అతడు ఖురానులు వ్రాసి అమ్మి జీవితం గడిపేవాడు.

ఔరంగజేబు అత్యంత సాధారణ జీవితానికి సజీవ సాక్ష్యం 'ఖుల్దానా' లోని అతని సమాధి. ఔరంగజేబు తాను నిర్మించుకున్న ఔరంగాబాదులో మరణించాడు. అతని సమాధిని గురించి అతడు వ్రాసిన వీలునామాలో అందుకు పదిహేనురూపాయలు మాత్రం ఖర్చుపెట్టమని వ్రాశాడు. సమాధిమీద ఎలాంటి నిర్మాణం చేయరాదన్నాడు. గోరీ మట్టిది కావాలి తప్ప రాతితో కట్టరాదన్నారు. మట్టి సమాధిమీద ఎప్పటికీ ఒక 'సబ్జా'కు మొక్క ఉండాలన్నాడు. తెల్లని చద్దరు తప్ప గోరీమీద ఎలాంటి అచ్ఛాదనా ఉండరాదన్నాడు.

ఖుల్దానాలో ఔరంగజేబు సమాధి ఇవ్వాల్టికీ అలాగే ఉంది.

ఒక వైస్రాయ్ వచ్చి అది చూచాట్ట. ఒక సామ్రాట్టు సమాధి ఉండవలసిన తీరు అది కాదన్నాడు. అప్పటికి ఆ ప్రాంతం నిజాముల పాలనలో ఉంది. వైస్రాయ్ నిజాముకు వ్రాశాడు. మంచి నిర్మాణం చేయవలసిందని వ్రాశాడు. నిజాముకు నవాబు ఔరంగజేబు వీలునామా ప్రతిని వైస్రాయ్‌కు పంపాడు. సమాధి చుట్టు పాలరాతి గోడమాత్రం నిర్మించాడు.

ఔరంగజేబు కొడుకు తన తల్లి సమాధిని తాజ్‌మహల్ వలె ఔరంగాబాదులో నిర్మించాడు. దాని పేరు 'బీబీకా మఖ్బరా.' అది తాజ్‌మహల్ వలె ఉన్నది కాని కళాకాంతులు లేవు.

ఔరంగజేబు దుష్టత్వాన్నీ – దుర్మార్గాన్నీ – దురహంకారాన్నీ – మతమౌఢ్యాన్ని మరిపించడానికి ఈ విషయం వ్రాయడం లేదు. అతడు రాజ్య కాంక్షతో సోదరులను చంపడం – తండ్రిని కారాగారంలో పెట్టడం – మందిరాలను కూల్చడం జగద్విదితం.

ఔరంగ్‌జేబ్ రాజ్య కాంక్షకు దక్షిణాపథం – దక్కన్ గురి అయింది. అతడు గోలకొండను – దక్కనును జయించాడు. ఔరంగాబాదును రాజధానిగా చేసుకుని పాలించాడు.

మీర్ ఖమ్రుద్దీన్ చిన్ ఖిల్జ్‌ఖాన్, ఫతెహ్‌జంగ్, నిజామ్ – ఉల్ – ముల్క్‌ను ఔరంగజేబు దక్కను సుబేదారుగా నియమించాడు. ఖమ్రుద్దీన్ దక్కనులోని ఔరంగాబాదు – బెరార్ – బీదర్ – బీజాపూర్ – హైదరాబాదు – ఖాందేశ్ అనే అరుసుబాలకు సుబేదారు.

ఖమ్రుద్దీన్ తల్లి షాహజహాన్ దర్బారులో మంత్రియైన సాదుల్లాకు ఏకైక పుత్రిక. అతని తండ్రి ఘయాజుద్దీన్ ఫిరోజ్‌జంగ్. ఔరంగజేబుకు సేనాధిపతి. గోలకొండ ముట్టడికి అతడే నాయకత్వం వహించాడు. అతని తండ్రి వంశం – అబూబాకర్ మొదట ఖలీఫాకు చెందింది. తల్లి తరపున మహమ్మదు ప్రవక్త వంశం.

ఖమ్రుద్దీన్ అసాధారణ ప్రతిభావంతుడు. సమర్థుడైన పాలకుడు. అసమాన ధైర్యసాహసాలు కలవాడు. రాజకీయ చాతుర్యం కలవాడు. సాహసి.

ఔరంగజేబు మరణించాడు. మొగలు దర్బారు నీరసించింది. అదీకాక ఢిల్లీనుంచి దక్కన్ను పాలించిన ఉదంతాలు తక్కువ. వీటిని అన్నింటినీ గ్రహించిన ఖమ్రుద్దీన్ స్వాతంత్ర్యం ప్రకటించాడు. నర్మద నుంచి కావేరి వరకు, మచిలీపట్నం నుంచి బీజాపూర్ వరకు దక్షిణ పీఠభూమిని అంతటినీ వశపరచుకున్నాడు.

1724 వ సంవత్సరంలో ఆసిఫ్‌జాహీ వంశాన్ని స్థాపించాడు. ఆ వంశానికి ఆద్యుడు అయినాడు.

ఇంతటి పెను తిరుగుబాటును చూస్తూ ఉండిపోయింది తప్ప మొగల్ దర్బారు ఏమీ చేయలేకపోయింది. మరీ చూస్తూ ఉండలేకపోయారు. ముబారిజ్ ఖాన్ అనే ఒక ఛోటా సుబేదారును ఉసికొల్పారు. షకర్‌ఖేల్డా వద్ద యుద్ధం జరిగింది. ఖమ్రుద్దీన్ ముబారిజ్ ఖాన్ను అణచేశాడు. ముబారిజ్ ఖాన్ తలను ఢిల్లీకి బహుమానంగా పంపాడు.

అంతటితో ఖమ్రుద్దీనుకు ఢిల్లీతో ఉండిన అతి పల్చని సంబంధం కూడా తెగిపోయింది.

ఒకటవ ఆసిఫ్జాహ్ ఖమ్రుద్దీన్ నిజామ్–ఉల్–ముల్క్ దక్కనుకు సర్వతంత్ర స్వతంత్రుడయిన ప్రభువు అయినాడు. అతను చిన్న చిన్న తిరుగుబాటులను అణచి వేయడమేగాక రూపుమాపాడు.

ఖమ్రుద్దీన్ మహారాష్ట్రులను మాత్రం అణచలేకపోయాడు. వారి దాడులు పెచ్చుపెరిగాయి. ఔరంగాబాదు మహారాష్ట్రంలో ఉంది. వారి దాడులకు విసిగిన ఖమ్రుద్దీన్ తన రాజధానిని తెలంగాణంలోని హైదరాబాదుకు మార్చాడు. అందువలన ఆసిఫ్ జాహ్‌కు మహారాష్ట్రుల ప్రత్యక్షపహారం తప్పింది.

తొలి ఆసిఫ్జాహ్ ఖమ్రుద్దీన్ తన భుజబలం – బుద్ధిబలం – సామర్థ్యంతో దక్కన్ సామ్రాజ్యం మీద ఈగ వాలకుండా కాపాడాడు. ఉద్రిక్త మహారాష్ట్రులను అదుపులో ఉంచాడు. భారతదేశాన్ని ముక్కలుగా మింగాలని పొంచి ఉన్న బ్రిటిష్ పోర్చుగీసు, ఫ్రెంచివారిని తన ఛాయలకు రానివ్వలేదు. ఒక విశాల సామ్రాజ్యాన్ని నిర్మించాడు. ఒక సుదృఢమైన ప్రభుత్వాన్ని ఏర్పరచాడు.

ఖమ్రుద్దీన్ను గురించి ఒక కథ ప్రచారంలో ఉంది. అతడు ఒకసారి వేటకు బయలుదేరాడు. వేట చాలసేపు సాగింది. పులులనూ, సింహాలనూ వధించాడు. ఒక జంతువు వెంటపడ్డాడు. అది అందలేదు. దానివెంట పరిగెత్తాడు. తన శిబిరానికి దూరం అయినాడు. మృగం దొరకలేదు. కాని, ఆకలి దప్పులు అతన్ని కృంగదీశాయి. అడవిలో దూరంగా అతనికి ఒక కుటీరం కనిపించింది. అంతట నవాబూ అక్కడికి చేరాడు. అది ఒక ఫకీరు కుటీరం. ఫకీరును నీళ్ళుపోయమని అర్థించాడు సామ్రాట్టు! ఫకీరు నీళ్ళు తెచ్చి ఇచ్చాడు. ఖమ్రుద్దీన్ నీళ్ళు త్రాగాడు. నీడలో కూర్చున్నాడు. ఆకలి మండిపోతుంది.

“ఆకలిగా ఉందా నాయనా?” అడిగాడు ఫకీరు.

“అవును. ఆకలి మండుతున్నది. ఆకలి ముందు సామ్రాజ్యాలు ఎందుకూ కొరగావని అర్థమైంది. అన్నం పెట్టండి, బడ జాగీరు ఇస్తాను.”

"ఆకలి ముందు సామ్రాజ్యాలు కొరగావన్నావు. ఒక జాగీరు ఇచ్చి అన్నం కొనాలనుకుంటున్నావు. మేము ఫకీరులం; అన్నం అమ్ముకోము, ఆకలి తీర్చుతాము. రొట్టెలు తెస్తాను, నిలువు" అని ఆ ఫకీరు ఒక పళ్లెంలో రొట్టెల మడతలు తెచ్చాడు. ఖమ్రుద్దీన్‌కు ఒక్కొక్కటీ ఇచ్చాడు. అతను ఆకలిగా ఉన్నాడు. ఏడు రొట్టెలు తిన్నాడు. మరొక రొట్టె తినమని ఫకీరు బలవంతం చేశాడు. ఖమ్రుద్దీన్ తినలేకపోయాడు.

ఖమ్రుద్దీన్ విశ్రమించాడు. మేలుకున్నాడు. ప్రయాణానికి సిద్ధం అయినాడు.

అంతవరకూ అతణ్ణి గురించి ఫకీరు అడగలేదు. ఎవరో ఆకలితో వచ్చాడు అనుకున్నాడు. అన్నం పెట్టాడు. అప్పుడు అడిగాడు.

ఖమ్రుద్దీన్ తాను సుల్తానును అని తెలియపరచాడు. కావలసింది కోరుకొమ్మన్నాడు.

"ఇచ్చేవాడు అల్లాహ్ నాయనా! నీకు సామ్రాజ్యాన్ని ఇచ్చాడు. నాకు ఈ కుటీరాన్ని ఇచ్చాడు. నాకు ఇంతవరకే అర్హత ఉంది. ఇంతకుమించి కోరే అధికారం లేదు. నాయనా, ఆసిఫ్జాహీ వంశం ఎంతకాలం ఏలుతుంది అనుకుంటున్నావు?"

"సూర్య చంద్రాదులున్నంతకాలం!"

"పిచ్చివాడా! ఈ విశ్వంలో అల్లాహ్ తప్ప ఏదీ శాశ్వతం కాదు. ఆసిఫ్జాహీ వంశం ఏడు తరాలు మాత్రం ఏలగలదు."

"జనాబ్! అట్లు అనకండి. నా వంశం కలకాలం నిలవాలని దీవించండి."

"వెర్రివాడా! నీవు ఏడు రొట్టెలే తిన్నావు కదా? బలవంతం చేసినా మరొకటి తినకపోతివి. నీవు ఏడుతరాలు అడుక్కున్నావు. అల్లాహ్ నీకు అంతే ఇచ్చాడు. తృప్తి చెందు. వెళ్లిరా."

ఖమ్రుద్దీన్ హైదరాబాదు చేరుకున్నాడు. కథ ఎంత నిజమో తెలియదు. కాని, ఆసిఫ్జాహీ రాజ్యం ఏడవ తరంతో అంతం అయింది!

**ఎంతటి వానికయినా తప్పనిది మృత్యువు.**

**జీవితంలో ఏదీ నిశ్చితం కాదు - మృత్యువుతప్ప.**

నిజామ్–ఉల్–ముల్క్–తొలి ఆసిఫ్జాహీ ఖమ్రుద్దీన్‌కూ అవసానకాలం సమీపించింది. అతడు తన ప్రభావాత్మకమైన జీవితాన్ని గురించి సుదీర్ఘంగా రాశాడు. తన వారసులకు కొన్ని సలహాలు ఇచ్చాడు.

1. సాధ్యమయినంతవరకు తమంతటతాము యుద్ధానికి ఉపక్రమించరాదు.
2. తగాదాలు, శత్రువులు తలెత్తినపుడు సామరస్యంగా పరిష్కరించుకోవాలి.
3. విధిలేని పక్షంలోనే యుద్ధానికి దిగాలి. భగవంతుని సాయం అర్థించాలి. యుద్ధరంగంలో శత్రువును ఓడించాలి. అతణ్ణి లోబరచుకోవాలి.

అవసాన సమయం ఆసన్నం అయినపుడు భార్యలను – సర్దారులను – నవాబులను – ఏడుగురిలో ఆరుగురు కొడుకులను పిలిపించుకున్నాడు. వారందరి సమక్షంలో గతాన్ని తలుచుకుంటూ, అల్లాను స్మరిస్తూ – తొంబైఒక్క సంవత్సరాల వయసులో నిజామ్–ఉల్–ముల్క్ ఆసిఫ్జాహీ ఖమ్రుద్దీన్ దివంగతుడైనాడు.

కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతింబొందరె
వారేరీ సిరిమూట కట్టుకొని పోవంజాలిరే భూమిపై
బేరైనంగలదే శిబిప్రముఖులం బ్రీతిన్ యశః కాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా!

ఇది శ్రీమద్భాగవతము ఎనిమిదవ స్కందంలోని పద్యం. రాజులూ, రాజ్యాలు వస్తాయి – పోతాయి. కాని, సత్కార్యం చేసినవాణ్ణే ప్రజలు గుర్తుంచుకుంటారు అంటాడు.

అసిఫ్జాహీలు చేసిన మంచి పనులు లేవు. ఇది వాస్తవ సత్యం.

ఖుతుబ్ షాహీలు చాల సత్కార్యాలు చేశారు. అందుకు కారణం వారు విజయనగరం రాజుల ప్రాపకం కలవారు. అందువలన వారికి మత సహనం, భాషాభిమానం కలిగాయి. వారు తెలుగు భాషను పోషించారు. ఇబ్రాహిమును తెలుగు కవులు "ఇభరాముడు" చేశారు. ఇభరాముడు కందుకూరి రుద్రకవికి రెంట చింతల అగ్రహారంగా ఇచ్చాడు.

రాసుతుడైన మల్కియిభరాముని కీర్తియు వెండికొండయున్
త్రాసున బెట్టితూన్ప రజతాచల మెత్తున దాకయుండినన్
భాసురలీల నిల్చి నల బ్రహ్మ సదాశివు జాహ్నవీపతిన్
వాసుకి కంకణున్ రుషభవాహను జంద్రకళావతంసునిన్

అన్నాడు రుద్రకవి. మల్కిభరాముని కీర్తిని ఒకవైపు, కైలాసాన్ని ఒకవైపు త్రాసులో ఉంచాడు. వెండికొండ ఉన్న త్రాసు వంగలేదు. అప్పుడు బ్రహ్మ శివుణ్ణే వెండి కొండమీద నిలిపాడు. మల్కిభరాముడు అంతటి కీర్తిశాలి అని కవి వర్ణన.

ఇభరాముడు గంగాధరకవి తపతీ సంవరణోపాఖ్యానం, తెలగనార్యుని యయాతి చరిత్ర కృతులు అందుకున్నాడు.

ఇభరాముని కొడుకు ఖులీఖుతుబ్ షా, అతడు సౌందర్యారాధకుడు రసహృదయుడు. స్వయంగా కవి. భాషాపోషకుడు. మతాల గోడలను – కోటలను కూల్చి భాగమతిని ప్రేమించాడు. ఆమె పేర భాగ్యనగరం నిర్మించాడు. భాగ్యనగర నిర్మాణ ప్రణాళిక అతని సౌందర్యారాధనకు మచ్చుతునక. దీనిని ఉద్యానాల నగరంగా నిర్మించాడు. చరిత్రలో ఒక ప్రియురాలి పేర సజీవ నగరం నిర్మించినవాడు ఖులీకుతుబ్ షా ఒక్కడే.

"జవరాలు ప్రేమపై యువరాజు నిర్మించె
పన్నీటి కాన్కగా భాగ్యనగరమ్ము" అన్నారు భాయ్‌జాన్ వార్ల చిరంజీవి.

ఖుతుబ్ – దక్కనీ ఉర్దూలో అనేక కవితలు వ్రాశాడు. ఖులీ తన దక్కనీ భాషలో అనేక తెలుగు పదాలు వాడాడు. తెలుగు పండుగలను గురించి తెలుగు సంస్కృతిని గురించీ వ్రాశాడు. ఖులీ తెలుగులోనూ అనేక కవితలను వ్రాశాడని వదంతి. అతని గ్రంథాలయం అగ్నికి ఆహుతి అయినపుడు అన్నీ దగ్ధమైనా యంటారు.

ఖుతుబ్ షాహీలలో చివరివాడు అబుల్ హసన్ తానాషాహ్. అతనినే మనం తానీషా అంటాం. అక్కన్న – మాదన్నలు అతని ఆస్థానంవారు. రామదాసు భద్రాద్రి ఆలయం నిర్మించింది అతని కాలంలోనే.

ఔరంగజేబు అబుల్ హసన్ను ఓడించాడు. గోలకొండను వశపరచుకున్నాడు. అప్పుడు అతని సైన్యాలు నిలిచిన చోటునకు ఫతెహ్‌మైదాన్ అని పేరు పెట్టాడు. అంటే విజయస్థలం అని అర్థం. అక్కడనే ఇప్పుడు లాల్ బహదూర్ స్టేడియం ఉంది. కొండమీద నగరా మ్రోగించి ఔరంగజేబ్ తన విజయం ప్రకటించాడు. అదే ప్రస్తుతపు నౌబత్‌పహాడ్.

ఆసిఫ్జాహీలు మత దురహంకారి అయిన ఔరంగజేబ్ ప్రాపకంలో పెరిగారు. అందువలన వారికి అన్ని దుర్లక్షణాలు ప్రాప్తించాయి.

1. వారు సంస్కారహీనులు.
2. వారికి పరమత సహనం అతి తక్కువ.
3. తెలుగును వారు భాషగా గుర్తించలేదు. తెలుగును దిగజార్చిన యశస్సు వారిది.
4. సత్కార్యాలు చేసిన జాడలు కనిపించవు.
5. వారు అసమర్థులు, బలానికి దాసోహం అన్నారు.
6. అత్యాశాపరులు.

అందువల్లనే ఆంధ్రదేశాన్ని వారు సుమారు 200 సంవత్సరాలు పాలించినా ఆంధ్రులు గర్వంగా చెప్పకోదగిన కార్యం ఒక్కటి కూడా చేయలేదు.

అందుకే "వారేరీ సిరిమూట కట్టుకొని పోవంజాలిరే భూమిపై?"

## క్షీణదశ:

**ఏదీ ఎవడూ తన కోసం మాత్రమే సాధించడు. సంపాదించడు. సమకూర్చడు ప్రతివాడూ తన వంశంకోసం - తన వారసులకోసం సాధిస్తాడు.**

**సంపాదించడం దుష్కర కార్యం. ఎన్నో బాధలు పడి సాధిస్తాడు - అది రాజ్యమైనా - సంపద అయినా.**

**సాధించడం ఎంత కష్టమో - సాధించినదానిని వారసులు నిలుపుకోవడం అంతకంటే కష్టం.**

తాతలు సాధించినదానిని నిలుపుకున్నవారు అతితక్కువ.

పులికడుపున పిల్లి పుడుతుందా? అనేది సామెత కాని, వీరాధివీరునికి పిరికిపందలు – మహాపండితులకు శుంఠలు పుడుతున్నారు.

సరిగ్గా ఖమ్రుద్దీన్ సంతానానికి ఆ గతే పట్టింది. తండ్రి సంపాదించుకున్నది నిలుపుకోలేకపోయారు. చాలవరకు పోగొట్టుకున్నారు.

ఖమ్రుద్దీన్ కొడుకులు రాజ్యం కోసం కొట్టుకున్నారు. ఈ కీచులాటలో ఇంగ్లీషు – ఫ్రెంచివారు ప్రయోజనం పొందారు. 'కోతులు – రొట్టెముక్కలు' కథ పాతదే! నీతి గొప్పదే! అందరూ ఎరిగిందే! అయినా ఆచరణశూన్యం.

నాసిర్‌జంగ్ ఖమ్రుద్దీన్ రెండో కొడుకు. అతడు బ్రిటిషువారి సాయం తీసుకున్నాడు. తన మేనల్లుడు ముజఫర్‌జంగ్ మీద యుద్ధం ప్రకటించాడు. ముజఫర్ ఫ్రెంచివారివెంట పడ్డాడు. ముజఫర్ ఓడాడు. చెరసాలకు చేరాడు. అయితే, నాసిర్‌కు ఫలితం దక్కలేదు. ఒక పఠాను వీరుడు నాసిర్‌ను ఓడించాడు. సమయం కని పెట్టి ఫ్రెంచివారు ముజఫర్‌ను గద్దె ఎక్కించారు. అయితే అతడూ కలకాలం

ఉండలేదు. మరొక పఠాను ముజఫర్‌ను తొలగించాడు. ఫ్రెంచివారు ఖమ్రుద్దీన్ మూడవ కుమారుడు సలాబత్‌జంగ్‌ను గద్దెకు ఎక్కించారు.

అసిఫ్షాహీరాజ్యంలోని తెలుగుప్రాంతాలను తెలంగానా అన్నారు. తెలుగులు ఉండు ప్రాంతం తెలంగానా. దీనినే తరువాత 'తెలంగాణం' అంటున్నాం. అప్పుడు ఈనాడు ఉన్న ఆంధ్రప్రదేశం సాంతం తెలంగాణమే.

సలాబత్‌జంగ్ ఫ్రెంచివారి రుణం తీర్చుకోదలచాడు. ఫ్రెంచివారు తమ సైన్యం కర్చు 26 లక్షల రూపాయలు అని తేల్చారు. సలాబత్ లెక్కలను గురించి బాధపడలేదు. కాని తన దగ్గర డబ్బులేదు. ఫ్రెంచి అప్పులవాళ్లు అతని వెంట పడ్డారు. అతడు 1753లో తెలంగాణంలోని 1. ముస్తఫానగర్, 2. రాజమహేంద్రవరం, 3. శ్రీకాకుళం జిల్లాలను ఫ్రెంచివారికి అప్పగించాడు. అప్పటి ఆ జిల్లాల సాలుసరి రాబడి 31 లక్షల రూపాయలు.

సలాబత్‌కు ఫ్రెంచివారిమీద నమ్మకం సన్నగిల్లింది. అతడు ఇంగ్లీషువారితో రాయబారాలు సాగించాడు. ఫ్రెంచి బుస్సీ అసాధ్యుడు. సలాబత్ పథకం సాగనీయలేదు. అయినా సలాబత్ వదలలేదు. తన రక్షణకుగాను ఇంగ్లీషువారికి తెలంగాణంలోని మరికొంతభాగం అప్పగించాడు. 1759లో సలాబత్ ఆంగ్లేయులకు 1. నిజాం పట్నం, 2. మచిలీపట్నం, 3. కొండవీడు, 4. వల్కమనేరు అప్పగించాడు.

ఫ్రెంచివారికి – ఆంగ్లేయులకు సర్కారు వారినుంచి వచ్చిన జిల్లాలు కావడాన సర్కారు జిల్లాలు అయినాయి. చరిత్ర గమనంలో ఫ్రెంచివారికి ఇచ్చిన జిల్లాలుకూడా బ్రిటిషువారి పరమయినాయి.

బలవంతుడయిన బుస్సీ నిర్గమించాడు. ఫ్రెంచివారి ప్రాబల్యం తగ్గింది. బ్రిటిషువారు సలాబతును నమ్మలేదు. అతన్ని తొలగించారు. ఖమ్రుద్దీన్ నాలుగవ కొడుకును 1762లో గద్దెకు ఎక్కించారు.

నిజామలీ నామ్‌కే వాస్తే రాజు. అధికారం సర్వం బ్రిటిషువారు చలాయించారు. ఈలోగా మహారాష్ట్రులు నిజాంఅలీ మీద దండెత్తారు. ఇంగ్లీషువారు సాయపడలేదు. నిజాంఅలీ ఓడాడు. మహారాష్ట్రులు విధించిన షరతులు అన్నింటికీ ఒప్పుకున్నాడు.

అప్పుడు 'మేము నిజామలీని రక్షిస్తా'మన్నారు ఆంగ్లేయులు. అతని రక్షణకు సైన్యం పెడ్తామన్నారు. వాటికి అయిన కర్చులు ఇవ్వాలన్నారు. నిజామలీ కాదనగలడా? కాని అతని దగ్గర డబ్బేది? అప్పటికే ఇంగ్లీషు కంపెనీల వద్ద అనేక అప్పులు చేశాడు. తన రక్షణ కోసం ఇంగ్లీషువారు నిర్వహించే సేనల ఖర్చులకుగాను బ్రిటిషువారికి 1. కంభం, 2. కర్నూలు, 3 ఆదోని, 4 రాయదుర్గ, 5. గుత్తి, 6. కడప, 7. గుర్రంకొండ, 8. బంగనపల్లి, 9. అనంతపురం, 10. బళ్లారి, 11. మదనపల్లి, 12. వాయల్పాడు జిల్లాలను బ్రిటిషువారికి ధారాదత్తం చేశాడు. అది 1800 సంవత్సరం.

ఈ విధంగా తెలంగాణంలోని మరికొన్ని జిల్లాలు బ్రిటిషువారి వశం అయినాయి. నిజాం బ్రిటిషువారికి దత్తం చేసినందున వాటికి 'దత్తమండలాలు' అని పేరు వచ్చింది.

అప్పటికి నిజాం రాజ్యంలో మిగిలిన తెలుగుప్రాంతం 'తెలంగాణం'గా మిగిలిపోయింది.

నలభై ఒక్క సంవత్సరాలు నామమాత్రంగా పాలించిన నిజామలీ 1803లో కన్నుమూశాడు.

రెండో నిజాం నిజామలీ తన రక్షణకోసం తెలంగాణంలో మరికొంత భాగాన్ని అంగ్రేజులకు అప్పగించి కన్నుమూశాడు. తరవాత వచ్చిన నిజాములను గురించి అంతగా చెప్పుకోవలసిందేమీ లేదు. అయితే, నవాబుల వెర్రిదనాన్ని తెలిపే విషయాలు చూద్దాం.

నాసిరుద్దౌలా నాల్గవ నిజాం ఏలుతున్న కాలం. బ్రిటిష్ రెసిడెంటు ఒక రెసిడెన్సీ నిర్మించాలనుకున్నాడు. మూసీ ఒడ్డున నిర్మించ తలపెట్టిన భవనపు ప్లాను తయారు చేయించాడు. నాసిరుద్దౌలా అనుమతి తీసుకోవాలనుకున్నాడు. అనుమతి ఎందుకంటే, ఆ భవనానికి అయ్యే కర్చు సొంతం నవాబు నెత్తిన వేయడానికి! ప్లాను ఎంతో వివరంగా తయారు చేయించాడు. అది చాలా పెద్ద కాగితం అయింది. రెసిడెంటు నవాబు దర్బారుకు వెళ్లాడు. సలాంలు మొదలైన లాంఛనాలు ముగించాడు. కాగితం చుట్ట విప్పాడు. నవాబుకు చూపించాడు. అంత పెద్ద కాగితం చూచి నవాబు భయపడ్డాడు. అది తన రాజ్యమంత ఉన్నది అనుకున్నాడు. అనుమతి నిరాకరించాడు.

రెసిడెంటు ఇంగ్లీషువాడు. అంత తేలిగ్గా వదులుతాడా? అదే ప్లానును సైజు తగ్గించి గీయించాడు. అక్కడ ఒక బాల్కనీ, ఇక్కడ ఒక కిటికీ తగ్గించాడు. మళ్లీ యథాప్రకారం దర్బారుకు వెళ్లాడు. లాంఛనాలు పూర్తి చేశాడు. చిన్నకాగితపు ప్లాను చూపించాడు. నవాబు సంతోషించాడు. రెసిడెంటు తన ఆదేశం పాలించాడు అనుకున్నాడు. మురిసిపోయాడు. రెసిడెన్సీ నిర్మాణానికి అనుమతించాడు. తన కర్చుతో రెసిడెంటుకు కోట నిర్మించి ఇచ్చాడు.

అదే ప్రస్తుతపు రెసిడెన్సీ కోఠీ. ప్రస్తుతం అందులో మహిళా కళాశాల, ఉస్మానియా మెడికల్ కాలేజీ ఉన్నాయి.

సుమారు అదేకాలంలో మరో విచిత్రం జరిగింది. నిజాం ఇంగ్లీషువారికి దత్తం చేసిన దత్తమండలాలలో నిరంతరం కరువు రాకాసి తాండవం చేసింది. మద్రాసులోని అంగ్రేజు సర్కారు కరువు నివారించడాన్ని గురించి ఆలోచించింది. తుంగభద్రా నదికి ఆనకట్ట కట్టాలని నిర్ణయించింది. అయితే, నిజాం రాజ్యంలోని 54 చదరపు మైళ్ళ నేల జలమయం అవుతుంది. 54 చదరపుమైళ్ల ముంపుకు అంగీకరించవలసిందని నైజామును కోరడం జరిగింది. నిజాం అందుకు అంగీకరించలేదు. మద్రాసు ప్రభుత్వం వారు ఢిల్లీకి ఈ విషయం తెలియపరచారు. ఢిల్లీ ప్రభుత్వం నిజామును ఆ ప్రతిపాదన అంగీకరించవలసిందని కోరింది. నిజాం ఒక వింత షరతు విధించాడు. జలమయం అయ్యేంత బ్రిటిషువారి భూమి తనకు పరిహారంగా ఇవ్వాలన్నాడు!

బ్రిటిషువారి వత్తిడికి లొంగి ఎంతో భూభాగం బ్రిటిషు వారికి ధారపోశాడు! ప్రజా ప్రయోజనం కోసం అర్థిస్తే కాదన్నాడు!

ఇదీ నవాబుల తెలివి! ఇదే తెలివి అని మురిసిపోయారు!

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం:

మన చరిత్ర వ్రాసినవారు అంగ్రేజులు! వారు 'మీకు చరిత్ర లేదు' అన్నారు. వారు పాలకులు, మనం బానిసలం! అవును, మాకు చరిత్ర లేదు అన్నాం. మేమే మీ చరిత్ర వ్రాస్తున్నాం అన్నారు ప్రభువులు. అదే మా చరిత్ర అన్నాం బానిసలం. ఇంకా అదే అని నమ్ముతున్నాం. నమ్మేటట్లు చేశారు అంగ్రేజులు!

మన దేశం మీద అనేకులు దండెత్తారు. మనకు తెలిసిన చరిత్ర ప్రకారం ఆర్యులుకూడా దండెత్తి వచ్చారు. ఆర్యులఘాటి భారతదేశం – మధ్య ఆసియా వరకు వ్యాపించి ఉందని ఒక వాదం. అలాంటప్పుడు ఆర్యులు దండెత్తి వచ్చినట్లు కాదు – తమ దేశంలోనే ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి తరలివచ్చినట్లు!

అది అప్రస్తుత అంశం. అయితే, భారతదేశం మీదకు దండెత్తిన వాడెల్లా గెలిచాడు. మనం ఎవరినీ వెనక్కు నెట్టలేకపోయాం. ప్రతి పోరాటంలోనూ తమ ప్రాణాలు అర్పించిన అమర వీరులను కీర్తించాం. వారి కీర్తిని గానం చేశాం.

అయితే, ఒక విశిష్టమైన అంశం ఏమంటే – వచ్చిన విజేతలందరూ భారతీయులు అయిపోయారు. అందరూ భారత జీవిత విధానానికి ముగ్ధులు అయినారు. దీనిని అవలంబించారు. సుసంపన్నం చేశారు.

మహమ్మదీయులు అన్యమతావలంబకులు. వారు మన దేశాన్ని సుమారు వేయి సంవత్సరాలు పాలించారు. తమ మతాన్ని– ఒక్కొక్కసారి బలప్రయోగంతో ప్రచారం చేశారు. కాని తాము భారతీయులం అని సగర్వంగా చెప్పుకున్నారు. అంతేకాదు, ఒక మిశ్రమ సంస్కృతికి తోడ్పడినారు. సంగీత సాహిత్యాల సహితంగా తాత్విక చింతనలోనూ భారతీయతను అలవరచుకున్నారు.

కొందరు మత ఛాందసులుతప్ప హిందూమత వికాసానికి సహితం అడ్డుతగలలేదు. తులసీ రామాయణం – రామానుజుని విశిష్టాద్వైతం – చైతన్యప్రభు వైష్ణవం – గీతగోవిందం – వీరశైవం మున్నగునవి అన్నీ మహమ్మదీయుల పాలనలోనే అభివృద్ధి చెందాయి.

సూఫీ సిద్ధాంతం మన భక్తితత్వానికి ప్రతీక

ఆంగ్లేయులు భారతదేశానికి వ్యాపారం మాత్రం చేసుకోవడమనే ప్రధాన లక్ష్యంతో వచ్చారు. వారు ఈస్టిండియా కంపెనీ పేరుతో వచ్చారు. అంటే, వారి ప్రథమ లక్ష్యం తూర్పు ఇండియాలో వ్యాపారం చేసుకోవడం మాత్రమే. అయితే, అనాటి భారతదేశ పరిస్థితులు ఒక వ్యాపార కంపెనీని ప్రభువులను చేశాయి.

చరిత్ర సాంతంలో భారతదేశం మీదికి వచ్చిన ఏ మొనగాడూ భారతదేశాన్ని తన బలంతో జయించలేదు. అనైక్యత – పరస్పర విరోధం భారతదేశపు ప్రధాన లక్షణం. మన జగడాలు – క్రమశిక్షణారాహిత్యం శత్రువును గెలిపించాయి.

వచ్చినవానికల్లా మనం బాహువులు చాచి స్వాగతం పలికాం.

మనమీద అందరూ దండెత్తారు!

మనం ఒక్కసారికూడా వేరుదేశంమీద దండెత్తలేదు!!

అనైక్యత – పరస్పరవిరోధం – ఈర్ష్యాద్వేషాలుకాక విలాస జీవనం మన జాతీయ తత్వంగా గోచరిస్తుంది. ఇందుకు ఉదాహరణగా ఒక చిన్న వృత్తాంతం:

నాదిర్‌షా ఢిల్లీ మీద దండెత్తాడు. మూడు హత్యలు చేశాడు. ఢిల్లీని ధ్వంసం చేశాడు. సర్వనాశనం చేశాడు. మొత్తం సంపదను కొల్లకొట్టాడు. అతనికి అడ్డు లేదు. తిరిగిపోవచ్చు. కాని, అతనికి ఇంక చిన్న ఆలోచన వచ్చింది.

నాదిర్‌షా మొగలు దర్బారులో ప్రవేశించాడు. సింహాసనం మీద ఆసీనుడు అయినాడు. అంతఃపురంలోని స్త్రీలందరినీ తన ముందుకు రావలసిందని ఆదేశించాడు.

అంతఃపురంలో గుసగుసలు మొదలయినాయి. పరపురుషుని ఛాయసహితం చూడని తాము నాదిర్‌షా ముందుకు పోవడమా? నాదిర్‌షా క్రౌర్యాన్ని గురించి విని ఉన్నారు. విధిలేదు అనుకున్నారు. అలంకరించుకుని కదిలారు.

నాదిర్‌షా దర్బారు అతివల అందాలతో వెలిగిపోయింది. సౌందర్యరాసులు కూడాను. అంతఃపురపు అందాల ఉద్యానాలు అక్కడ వెలిశాయి.

నాదిర్‌షా ఒకసారి ఆ అందాలను తిలకించాడు. తన మొలలో ఉన్న జంబియా తీశాడు. తన ముందున్న పీఠం మీద పెట్టాడు. నిద్రకు ఉపక్రమించాడు. గుర్రు కొట్టాడు!

అలా కొంతసేపు గడిచింది.

అంగనలు విసుక్కున్నారు. గుసగుసలాడుకున్నారు. కాని, నిలిచిన చోటునుంచి కదల్లేదు.

నాదిర్‌షా మేలుకున్నాడు. అందరినీ వెళ్లిపోవలసిందని ఆజ్ఞాపించాడు!

'ఎందుకు పిలిచినట్లు?' అనుకున్నారు అందరు. ఒక యువతి అడిగింది.

"జాతి నిర్వీర్యమయిందని తెలుసుకున్నాను. మీరు వెళ్లవచ్చు"అన్నాడు.

"అంటే?" మళ్లీ ఆ యువతి అడిగింది.

"వివరిస్తాను. విను. నేను పిలిచినపుడు మీరు నా ముందుకు వస్తారనుకోలేదు. ప్రాణాలు ఇస్తారనుకున్నాను. మీరు వచ్చారు. జంబియా ముందుంచి నిద్రపోయాను. జంబియా అందుకుని ఏ ఒక్కరయినా ప్రతీకారం కోసం ముందుకు వస్తారనుకున్నాను. ఇలాంటి పిరికివారికి వీరులు పుడ్తారని ఎలా ఆశించను? భారతదేశం మీద జైత్రయాత్ర సాగించిన మొగలు వంశం ఈనాడు ఇంత నిర్వీర్యం అయింది. ఇక దీనికి మనుగడలేదు" అని లేచి వెళ్ళిపోయాడు.

అదిగో అలాంటి సమయంలో ఇంగ్లీషువాళ్లు మనదేశంలో చొరబడ్డారు. ఇంగ్లీషు వారి దగ్గర ఉన్న ఆయుధం ఒక్కటే! అది క్రమశిక్షణ. ఆ క్రమశిక్షణతోనే వారు వేల మైళ్ళ దూరంలో ఉన్న ఒక చిన్న ద్వీపం నుంచి వచ్చి మనను కొల్లగొట్టారు.

ఇతరులవలె కాక ఆంగ్లేయులు మన జీవన విధానాన్ని – సంస్కృతిని – సభ్యతను రూపుమాపారు. ఒక నూరు సంవత్సరాలు మన రైతును బ్రతకనీయలేదు. మన కుటీర పరిశ్రమలను మననీయలేదు. వాళ్ళ దేశపు సరుకులు తెచ్చి అమ్మి, మన వర్తక వాణిజ్యాన్ని రూపుమాపారు.

ఆంగ్లేయ కంపెనీ అంతటితో ఆగలేదు. మన సంస్కృతి – సభ్యత – మతం మీద కత్తితో కాదు – కలంతో దాడి చేశారు. మనకు ఆనాటికి ఉండినది సాంతం కుళ్లు అని బోధించారు. వెలుగు సాంతం పశ్చిమ దేశాల్లో ఉందని నమ్మించారు. మన మేధావులు నమ్మారు. కాదు – నమ్ముతున్నాం. మనం ఆంగ్లేయుల రాజకీయ బానిసత్వం మాత్రమే వదిలించుకున్నాం. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాతనే పాశ్చాత్య సాంస్కృతిక బానిసత్వంలో మరింత కూరుకుపోతున్నాం.

అంగ్లేయులు నూరు సంవత్సరాలు ప్రజలను పీడించి – దోచుకుంటే పెదవి కదిపినవాడు లేడు. కంపెనీవారి దృష్టి దేశీయ సంస్థానాల మీద పడింది. రాజుల రాణుల వ్యక్తిగత జీవితాల్లో కూడా కల్పించుకున్నారు. గద్దె ఎక్కడం, దింపడం కంపెనీవారే నిర్ణయించారు. ఝూన్సీ లక్ష్మి పెంపుడు తీసుకోవచ్చా? అనే విషయం కూడా కంపెనీయే నిర్ణయిస్తానన్నది.

బిడ్డను రక్షించుకోవడానికి పిల్లి సైతం పులి అవుతుంది!

అందుకుతోడు సైనికులకు తోలు తూటాలు ఇచ్చారు.

ప్రజల్లోనూ – దేశీయ ప్రభువుల్లోనూ – కొంత భాగం సైన్యంలోనూ ఇంగ్లీషు వారిమీద ద్వేషం ప్రబలింది.

వీటన్నిటి పర్యవసానంగా 1857 నాటి మనం అనుకునే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగింది. **దీనిని సంగ్రామం అన్నదానికంటే విచక్షణారహితమైన దొమ్మి అనడం మేలు.** ఎంచేతంటే–

1. దీనికి ఒక నిర్ణీతమైన లక్ష్యం లేదు.
2. కేంద్రబిందువు కేంద్రనాయకత్వం లేదు.
3. చేతకాని – లేవలేని బహదూర్‌షాను చక్రవర్తినిచేయ సంకల్పించారు.
4. క్రమశిక్షణ బొత్తిగా లేదు. మూకలు విరుచుకుపడ్డాయి.
5. ఆయుధబలం ఏమాత్రం లేదు.
6. ఎదుటిబలాన్ని అంచనా వేయలేదు.

సుశిక్షితమైన కంపెనీ ప్రభుత్వం తిరుగుబాటును నిర్దాక్షిణ్యంగా అణచివేసింది. మనకు ఝూన్సీలక్ష్మి – తాంతియాతోపే వంటి అమరవీరులు, వారి కీర్తిగానాలు దక్కాయి.

హైదరాబాదులో కూడా స్వాతంత్ర్య సంగ్రామపు నీడ పడింది. దీనికి కొంతవరకు నిజాం అండకూడా ఉన్నట్లు చెప్పుకుంటారు.

17 జూలై 1857 నాటి సాయంకాలం తుర్రెబాజ్‌ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్ నాయకత్వంలో అయిదారువందలమంది రెసిడెన్సీమీద దాడి చేశారు.

అనుకోకుండా జరిగిన దాడి విషయం రెసిడెంటుకు పదిహేను నిముషాలముందు తెలిసింది. ఏడు నిమిషాల్లో సైన్యం ఆయత్తం అయింది. అర్ధరాత్రి వరకు అల్లర్లను అణచివేశారు. 18 జూలై తెల్లవారేవరకు సర్వం సాధారణంగా ఉంది.

తుర్రెబాజ్‌ఖాన్ – అల్లావుద్దీన్ పారిపోయారు. వారిద్దరినీ పట్టుకున్నారు. తుర్రెబాజ్‌ఖానుకు జీవిత ఖైదు విధించారు. అతడు జేలునుంచి పారిపోయాడు. వారంలో అతన్ని కనిపెట్టారు. తప్పించుకు పారిపోతూ దెబ్బతగిలి మరణించాడు.

అల్లావుద్దీన్ను అండమాను పంపారు. ఇరవై అయిదేళ్ళ యాతన తరువాత అతను మరణించాడు.

పోలీసు చర్య తరువాత తిరుగుబాటు జరిగిన చోట రెసిడెన్సీ రోడ్డుకు "తుర్రెబాజ్ ఖాన్ రోడ్డు" అని పేరు పెట్టారు. మనం స్వాతంత్ర్యాన్ని వలెనే ఆ పేరునూ మరిచిపోయాం.

పోరాటాలు అణచబడుతాయి. ఓడిపోతాయి. నిలిచిపోతాయి. అంతే.

పోరాటాలు వృధాకావు. వ్యర్థంకావు. అర్థం కాకపోవు.

కంపెనీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా లేచిన ఉప్పెనను – లావాను – తుపానును ఇంగ్లీషువారు నిర్దాక్షిణ్యంగా – క్రూరంగా – పాశవికంగా అణచివేశారు.

మనుషులను చెట్లకు కట్టి ఉరితీశారు.

మనుషులను ఫిరంగులకు కట్టి పేల్చివేశారు.

మనుషులను ముక్కలు ముక్కలుగా నరికారు.

పితూరి – తిరుగుబాటు – స్వాతంత్ర్య సంగ్రామాన్ని అణచివేశామని మురిసిపోయారు.

పోరాటాలు అణగవు. పోరాటాలు సమసిపోవు. పోరాటాలు ఆరవు. ఈ విషయం బ్రిటిషు ప్రభుత్వం గమనించింది. గ్రహించింది. అర్థం చేసుకుంది.

బ్రిటిషు ప్రభుత్వం అర్థం చేసుకోవడానికి కారణం ఏమిటి?

బ్రిటిషు ప్రభుత్వం నవాబులది కాదు. బ్రిటిషు ప్రభుత్వం నియంతృత్వం కాదు. బ్రిటిషు ప్రభుత్వం రాచరికం కాదు.

బ్రిటిషు ప్రభుత్వం ప్రజాస్వామ్య ప్రభుత్వం! ప్రజల ప్రభుత్వం! పార్లమెంటరీ ప్రజాస్వామ్యం.

బ్రిటిషు ప్రభుత్వానికి తిరుగుబాటులు తెలుసు. వాటి విలువలు తెలుసు. ఆ దేశంలోనే తిరుగుబాటులు వచ్చాయి.

బ్రిటిషు ప్రభుత్వానికి ఫ్రెంచి విప్లవం తెలుసు. అది కూలదోసిన రాచరికం తెలుసు.

బ్రిటిషు ప్రభుత్వానికి అమెరికా స్వాతంత్ర్య సంగ్రామం తెలుసు. అందులో దాని ఓటమి చేదు నిజం తెలుసు.

బ్రిటిషు ప్రభుత్వానికి స్వాతంత్ర్య పిపాస తెలుసు. ఆ పిపాస వెనుక ఉన్న అగ్నిగోళాలు తెలుసు. అగ్నిపర్వతాలు తెలుసు. దావాగ్నులు తెలుసు.

బ్రిటిషు ప్రభుత్వం అమెరికానువలె – భారతదేశాన్ని వదలదలచలేదు. కలకాలం భారతదేశాన్ని పీల్చుకు తినాలనుకుంది. సామ – భేదమును ప్రయోగించింది.

బ్రిటిషు ప్రభుత్వం భారతప్రజల కోపాగ్నిని పసి కట్టింది. కొంతవరకు అంచనా వేయగలిగింది. మండే అగ్నిమీద నీళ్లు చల్లింది!

బ్రిటిషు ప్రభుత్వం కంపెనీవారు దౌర్జన్యం జరిపారు అన్నది. అందుకోసం కంపెనీ ప్రభుత్వాన్ని తొలగించింది.

విక్టోరియా మహారాణి భారత ప్రభుత్వాన్ని చేపట్టింది. ఇది బ్రిటిషు ప్రభుత్వపు తొలి చర్య! భారతదేశంలో కొంత ఉపశమనం కలిగించింది.

తుంట దింపి మొద్దు ఎత్తుకోవడం అనే సామెత లాంటిది. బరువు అంతటిదే! కాని వస్తువు మారింది!!!

బ్రిటిషు ప్రభుత్వం గుర్తించిన విషయం ఏమంటే – వచ్చిన విప్లవానికి ప్రజాశక్తి కారణం కాదు. దేశీయ ప్రభువులు – రాజులు, నవాబులు కారణం.

కారణం అయినవారిని తాకరాదనీ – వారి విషయంలో జోక్యం చేసుకోరాదనీ నిర్ణయించింది. బ్రిటిషువారి అధీనంలోని భారత దేశంలోని రెండు వంతులు దక్కాలంటే ఒక వంతు వదులుకోవాలనుకున్నారు.

బ్రిటిషు ప్రభుత్వం – దేశీయ సంస్థానాల్లో ఐక్యం కలిగించుకోమనీ – వారి స్వాతంత్ర్యాన్ని గుర్తించడం మాత్రమేకాక రక్షిస్తామని ప్రకటించింది.

అంతటి మహావిప్లవానికీ – అంతటి రక్తపాతానికీ – అంతటి బలిదానాలకూ ఫలితం నవాబులకు, మహారాజులకు దక్కింది!

ఫలితాలను పరిశీలిస్తే వెల్లడి అయ్యే విషయాలు –

1. నవాబులకూ – మహారాజులకు ఇంగ్లీషువారి దినదిన గండం విముక్తి లభించింది.
2. నవాబుల – మహారాజుల విలాసాలకూ – దౌర్జన్యాలకూ – వెర్రివేషాలకు అడ్డులేకుండాపోయింది.

   మహారాజుల నవాబుల ఏహ్యాజీవనాన్ని గురించీ – వారి విశృంఖలత్వాన్ని గురించీ చవాన్ జర్మనీదాస్ "మహారాజ" అనే ఒక గొప్ప గ్రంథం వ్రాశారు.
3. సంస్థానాల ప్రజలను కట్టు బానిసలను చేసి – ప్రభువుల దయా దాక్షిణ్యాలకు వదిలారు. సుమారు 90 సంవత్సరాలు సంస్థానాల ప్రజలు నిరంకుశ ప్రభువుల కింద నిత్యయాతనలు అనుభవించారు.
4. భారతదేశం రెండుగా చీలింది. ఒకటి బ్రిటిషిండియా, రెండవది దేశీయ భారతం.
5. బ్రిటిష్ ఇండియాను ఇంగ్లండులో ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వం పాలించింది. అక్కడి ప్రజలకు కొంత స్వేచ్ఛ – కొన్ని హక్కులు – కొంత చైతన్యం లభించింది.
6. విప్లవానికి సమిధలు దేశీయ సంస్థానాల ప్రజలు! త్యాగాలు వారివి. పారిన రక్తం వారిది. పోయిన ప్రాణాలు వారివి. కూలిన మానాభిమానాలు వారివి. బ్రిటిషు ప్రభుత్వం తెలివయింది. వారినే శిక్షించింది!
7. స్వాతంత్ర్య సమరంలో అనంత నష్టానికి గురి అయినవారు సంస్థానాల అమాయక ప్రజలు. వీరికి కటిక చీకటి మిగిలింది.
8. సంస్థానాధిపతుల క్రూరత్వానికి హద్దులు లేవు. సంస్థానాల ప్రజా సంఘం పక్షాన జవహర్‌లాల్ నెహ్రూ కాశ్మీరం వెళ్తే అతనిని విచ్చుకత్తులు పట్టి సంస్థానంలో ప్రవేశించనీయలేదు!

## మహబూబ్ :

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ పర్యవసానంగా నిజాం రాజ్యానికి ఆంగ్లేయుల బెడద వదలింది. హైదరాబాదు రాజ్యం స్వతంత్రరాజ్యం అయింది. నామ మాత్రపు ఆంగ్లేయుల పెత్తనం తప్ప నిజాంరాజు స్వతంత్రప్రభువు.

అప్పటికి ఆంగ్లేయులు కాజేసిందిపోగా మిగిలిన హైదరాబాదు రాజ్య విస్తీర్ణం 82,698 చదరపుమైళ్లు. ఇది ఇంగ్లండు, స్కాట్లండు వైశాల్యాన్ని మించింది.

దీనిని 1. వరంగల్లు, 2. మెదక్, 3. గుల్బర్గా, 4. ఔరంగాబాదు సూబాలు అంటే సుమారు రాష్ట్రాలుగా విభజించారు. ఇది పాలనా సౌలభ్యం కోసం చేసిన విభజన.

ఇందులో తెలుగువాడు నివసించు తెలంగాణ జిల్లాలు 8. అవి: 1. వరంగల్లు, 2. కరీంనగర్, 3. అదిలాబాదు, 4. నిజామాబాదు, 5. మెదకు, 6. నల్లగొండ, 7. మహబూబ్ నగర్, 8. అత్రాఫ్ ఖుల్దా.

మిగిలిన 8 జిల్లాలు మరత్వాడీ – కర్ణాటకలవి.

తెలంగాణపు మొత్తం వైశాల్యం 41,502 చదరపుమైళ్లు.

హైదరాబాదు రాజ్యానికి స్వంత కరెన్సీ ఉండేది. దీనిని హాలీ సిక్కా అనేవారు. ఏడు హాలీ రూపాయలకు ఆరు బ్రిటిషు రూపాయలు. రాజ్యానికి స్వంత పోస్టల్ సర్వీసు, స్వంత కస్టమ్సు ఉండేవి. పరిపాలనలో సాధారణంగా ఇతరుల జోక్యం ఉండేదికాదు.

భారతదేశ వ్యాప్తంగా ఉండిన సుమారు 600 దేశీయ సంస్థానాల్లో హైదరాబాదు రాజ్యం అన్నింటికన్న పెద్దది!

అరవ నిజాం అఫ్జలుద్దౌలా 41 సంవత్సరాల వయస్సులో అల్లాకు ప్రియుడయినాడు. అతని తరువాత అరవ నిజాం మహబూబలీఖాను 1869లో గద్దె ఎక్కాడు. అప్పుడు అతని వయసు మూడు సంవత్సరాలు. అయితే, సమర్థుడయిన ప్రధాని సాలార్ జంగ్ నేతృత్వంలోనూ – ఆంగ్లేయుల ఛత్రచ్ఛాయలోనూ ఎలాంటి ఒడుదుడుకులు లేకుండా పరిపాలన సాగింది.

మహబూబ్ అంటే ప్రియుడు. మహబూబ్ యుక్త వయస్కుడయి ప్రజలకు మహబూబ్ – అంటే ప్రియుడయినాడు. మహబూబ్ సాత్వికుడు. ఉదారుడు. సహృదయుడు. మతసహనం కలవాడు. కాని, పాలకుడుగా అంత సమర్థుడు కాడు. సాలార్ జంగ్ ఛత్రఛ్ఛాయలో అతని బలహీనత కనిపించలేదు.

మహబూబ్ కాలంలో హైదరాబాదుకు స్థిరత్వం వచ్చింది. ఆర్థిక అనిశ్చితత దూరం అయింది. హైదరాబాదులోనికి కూడా ఆధునికత తొంగి చూచింది. రైలు వచ్చింది. విద్యుత్తు వచ్చింది. టెలిఫోను వచ్చింది. టెలిగ్రాం వచ్చింది. కొన్ని స్కూళ్లు వెలిశాయి. ఉర్దూ పత్రికలు వెలువడ్డాయి. గ్రంథాలయాలు వెలిశాయి.

సాలార్ జంగ్ గుణగ్రాహి. రత్నపరీక్ష అతనికి బాగా తెలుసు. అతడు అనేకమంది విద్వాంసులను – ప్రతిభావంతులను హైదరాబాదుకు చేర్చాడు. అలాంటివారిలో అఘోరనాథ్ ఛటోపాధ్యాయ ఒకరు. ఛటోపాధ్యాయ బ్రహ్మసమాజి. సంస్కరణవాది. సాలార్ జంగ్ అతన్ని హైదరాబాదు కాలేజీకి ప్రిన్సిపాల్ గా నియమించాడు.

ఛటోపాధ్యాయ ఇల్లు హైదరాబాదులో బ్రహ్మసమాజ స్థావరం అయింది. అతడు బాల్యవివాహాలకు వ్యతిరేకంగా – విధవా వివాహాలకు అనుకూలంగా అనర్గళంగా మాట్లాడేవాడు. వారి ఇంటికి వచ్చేవారి సంఖ్య రోజు రోజుకూ పెరగసాగింది. అతడు ఎన్నడూ ప్రభుత్వాన్ని విమర్శించలేదు. కాని, సంస్కరణలకు సంబంధించిన మాటలు సహితం సహించలేని కరడు గట్టిన ఫ్యూడల్ ప్రభుత్వం అది. ప్రభుత్వం అఘోరనాథ్‌ను అసహనంగా చూచింది. అతణ్ణి విప్లవకారుడు అని శంకించింది. అయినా అతడు ప్రిన్సిపాల్. సమయంకోసం నిరీక్షించింది.

సాలార్ జంగ్ గతించాడు. అతడు ప్రారంభించదలచిన రైల్వేలైను విషయంలో వివాదం ఏర్పడింది. రైల్వేలైను బ్రిటిషు వారి దయాధర్మాలమీద ఆధారపడిందనీ, దానికోసం రాజ్యంలో ఒక భాగం తాకట్టు పెట్టాల్సి వస్తుందనీ వదంతి ప్రారంభం

అయింది. రైల్వేలైను విషయంలో ప్రభుత్వం యదార్థాలు దాస్తున్నదనీ – వాటిని బయట పెట్టాలనీ కొందరు నగరవాసులు కోరారు. ఛటోపాధ్యాయ దానికి నాయకత్వం వహించారు. ఛటోపాధ్యాయ ప్రభుత్వాన్నే సవాలు చేస్తున్నాడు అనుకున్నాడు నిజాం. అసలే అక్కసుగా ఉంది. తీర్చుకున్నాడు.

రాజు తలచుకుంటే దెబ్బలకు కొదువా?

ఒకనాటి సాయంకాలం పోలీసులను తీసుకొని పోలీసు నాజమ్ ఛటోపాధ్యాయ ఇంటికి వచ్చాడు. ఒక కాగితం చూపించాడు. రైల్వేస్టేషనుకు నడవమన్నాడు. తలపాగ సహితం తీసుకోనివ్వలేదు. ఉన్నవాడిని ఉన్నట్లుగా బయటికి నడిపించారు.

అప్పటికి నాలుగేళ్ల పిల్ల అయిన అతని కూతురు సరోజిని దిగాలుపోయి చూచింది. ఈమెయే భారత కోకిల సరోజినీ నాయుడు.

అఘోరనాథుని రైల్వేస్టేషనులో గంటల తరబడి ఉంచారు. ఇతరులను అతని దరికి చేరనీయలేదు. అప్పుడు రైలు వచ్చింది. అతనిని సెకండ్ క్లాసులో ఎక్కించారు. 12 మంది పోలీసులు అతని వెంట ఎక్కారు. కాజీపేటలో 9 గంటలు ఉంచారు. మరొక బండి ఎక్కించి హైదరాబాదు రాజ్యం దాటించి, ఊపిరి పీల్చుకున్నారు!

మహబూబ్ దివాంధత్వానికి ఇది ఉదాహరణ. సంస్థానాధీశులు అందరూ అందరే! ఏ ఒక్కడూ అసమ్మతిని సహించడు. ఇలాంటి సర్కారు క్రింద నలిగారు తెలంగాణం ప్రజలు వందలయేళ్లు!

మహబూబ్‌కు ప్రియతమునిగా – ఉదారునిగా పేరు తెచ్చింది మూసీకి వచ్చిన వరద!

1908 సెప్టెంబరులో నగరంలో రెండు రోజుల్లో 19 అంగుళాల వర్షం నిరంతరాయంగా కురిసింది. నదీ పరివాహక ప్రాంతంలోని 221 చెరువులు తెగినాయి. మూసీకి ఉప్పెన ప్రళయంలా వచ్చింది. నదిమీద కట్టిన నాలుగు వంతెనలను ముంచింది. సెకండుకు లక్ష ఘనపుటడుగుల నీరు ఈ నదిలో పెరిగింది.

సొగసుగా ప్రవహించిన నది ప్రళయం సృష్టించింది. హైదరాబాదును ముంచింది. 20,000 ఇళ్ళు కూలాయి. 15,000 మంది మృత్యువాత పడినారు.

ఆ ప్రళయంలో ఒకేఒక చింతచెట్టు అనేకమందిని కాపాడింది. ఉస్మానియా హాస్పిటల్ ముందు ఉన్న పార్కులో ఆ చెట్టు ఇప్పటికీ సాక్ష్యంగా నిలిచివుంది.

ఈ వినాశాన్ని చూచి మహబూబ్ కదలాడు. ఒక వెండి చేటలో పసుపూ – కుంకుమ తెచ్చి, కోపం తగ్గించుకొమ్మని మహబూబ్ నదికి నమస్కరించాడని చెప్పుకొంటారు. మహబూబ్ స్వయంగా బాధితులను పరామర్శించాడు. బాధితులకు ఉదారంగా సాయం చేశాడు. అతన్ని జాగీరుదార్లు – ధనికులు అనుసరించారు.

ఆపదలో తన ప్రజలకు వాస్తవంగా సాయంచేసి అతడు ప్రజలకు మహబూబ్ – ప్రియుడు – అయినాడు.

1911లో మహబూబ్ బేగములలో ఒకామె తన పసివాణ్ణి మహబూబ్‌కు వారసునిగా ప్రకటించమని వత్తిడి తెచ్చింది. మహబూబ్‌కు అది ఇష్టం లేదు. అతడు మనస్తాపానికి గురి అయినాడు. పురానీ హవేలీ నుంచి ఫలక్‌నుమాకు చేరుకున్నాడు. మధువును ఆశ్రయించాడు. అతని ఆరోగ్యం దిగజారింది.

ఈ విషయం హైదారాబాదులో కార్చిచ్చులా వ్యాపించింది. జనం తండోపతండాలుగా ఫలక్‌నుమా చుట్టు చేరారు. దేవాలయాల్లో మసీదుల్లో ప్రార్థనలు చేశారు.

ప్రార్థనలు ఫలించలేదు. 11 అగస్టు 1911 మధ్యాహ్నం ఫలక్‌నుమాలో ఒక వాలు కుర్చీలో కూర్చొని మహబూబ్ అల్లాను చేరాడు. ఆ కుర్చీ ఫలక్‌నుమాలో ఇప్పటికీ ఉంది.

అప్పటి ప్రధాని మహారాజా కిషన్‌పర్షాద్ చాకచాక్యంగా మూడుగంటలలో మీర్ ఉస్మానలీఖాన్ను రాజుగా ప్రకటించాడు. లాంఛనంగా అవసరం అయిన అంగ్లేయుల ఆమోదం కూడా పొందలేదు. ఇఫ్తఖార్ – ఉల్ – ముల్క్, సుల్తాన్ యావర్ జంగ్ చార్‌మినార్ మీదికి ఎక్కాడు. నగారాలు ప్రయోగించడం జరిగింది. అతి ప్రధానమైన వార్త వినడానికి వేల జనం గుమి గూడారు. చార్మినార్ మీది నుంచి సందేశం వినిపించింది.

"మన ప్రియతమ ప్రభువు, మహాఘనత వహించిన మహబూబ్ అలీఖాన్ బహదూర్ ఈ మధ్యాహ్నం గతించారు. మహాఘనత వహించిన మీర్ ఉస్మానలీఖాన్ బహద్దూర్ నిజాం ప్రభువు అయినారు."

1911లో మీర్ ఉస్మానలీఖాన్ హైదరాబాదు రాజ్యానికి ప్రభువు అయినాడు.

1911లో భారతదేశపు రాజధాని కలకత్తానుంచి ఢిల్లీకి మారింది.

# రెండు

## పూర్వగాథలు

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవక్త – ప్రచారకులు – గొప్ప సంఘ సంస్కర్త – శ్రీమద్రామానుజులు క్రీస్తుశకం 1017–1137 మధ్య జీవించాడు. తిరుక్కోట్టియూర్ నంబి పంచములు. రామానుజులు తిరుమంత్ర ఉపదేశం నంబి వద్ద పొందదలచారు. నంబి రామానుజులను పదిహేడు సార్లు తిప్పారు. పద్దెనిమిదవసారి ఉపదేశించారు. తిరుమంత్రం అతి రహస్యం. ఇతరులకు ఉపదేశించరాదు అన్నారు.

శ్రీమద్రామానుజులు తిరునారాయణపురం వెళ్లారు. అక్కడ గొప్ప ఉత్సవం జరుగుతున్నది. వేలమంది కూడారు. అనేక కుల మతాలవాళ్లు ఉన్నారు. శ్రీమద్రామానుజులు దేవాలయ గోపురం ఎక్కారు. తన గురువు అతి రహస్యంగా ఉంచమన్న తిరుమంత్రాన్ని సమస్త జనులకు ఉపదేశించారు.

'ఓం నమోనారాయణాయ – జపించండి, తరించండి.' అని ఎలుగెత్తి అనేక సార్లు చాటారు.

తిరుక్కోట్టియూర్ నంబి రామానుజులను పిలిపించారు. "గురువు ఆజ్ఞను ఉల్లంఘించినావు. ఫలితము తెలియునా?" అని అడిగారు.

"స్వామి! తెలియును. రహస్యమైన మంత్రమును సదస్యము చేసిన నాకు రౌరవనరకము వచ్చును. అందరు జనుల విముక్తి కొరకు నేను రౌరవమునకు పోవుటకు సిద్ధమే" అన్నారు, రామానుజులు.

రామానుజుని త్యాగమునకు గురువు పొంగిపోయినారు. రామానుజుని గట్టిగా కావిలించుకున్నారు. ఆనంద బాష్పములు రాలగా అన్నారు:

"సద్గురుండవు నీవెపో జనులకెల్ల
మా కొరంతయు దీరె నీ మహిమ కతన."

శ్రీమద్రామానుజులు కుల మతాలకు అతీతంగా ప్రవర్తించారు. పదకొండవ శతాబ్దంలోనే హరిజనులను ఆలయ ప్రవేశం చేయించిన సంఘసంస్కర్త వారు.

వంశపారంపర్యంగా మేము శ్రీమద్రామానుజుని అనుయాయులం. విశిష్టాద్వైతులం. వైష్ణవులం.

శ్రీమద్రామానుజులకు ప్రధాన శిష్యులు ఇద్దరు. ఒకరు దాశరథి, రెండవవాడు కూరేశులు.

ఆనాడు కాంచీపురాన్ని పరిపాలించిన చోళరాజు 'క్రిమి కంఠుడు.' అతడు శైవమతాలంబి. అంతవరకు ఎవరికీ అభ్యంతరం లేదు. కాని, క్రిమికంఠుడు వైష్ణవాన్ని రూపుమాప దలచాడు. రామానుజుడు ఆదిశేషుని అవతారం. వారిని ఎదిరించడం ఇతరులకు అసాధ్యం. అందువలన రామానుజునికి హాని తలపెట్టదలచినాడు. శ్రీరంగంలో ఉన్న రామానుజుని తీసుకొని రమ్మని భటులను పంపించాడు.

రాజ భటులు శ్రీరంగంలో రామానుజుని ఆశ్రమం చేరుకున్నారు. తాము వచ్చిన పని చెప్పారు. అప్పుడు రామానుజులు లేరు. దాశరథి, కురేశులు ఉన్నారు. వారు రాజు పిలిపించిన కార్యం గ్రహించారు. రామానుజుని రక్షించ నిశ్చయించారు. తమలో ఒకరు రామానుజుని వేషంలో భటుల వెంట వెళ్లాలి. ఒకరు ఇక్కడ రామానుజుని రక్షణకు ఉండాలి. కూరేశులు భటుల వెంట వెళ్లడానికి నిశ్చయం అయింది. వారు రామానుజుని వేషం వేసుకున్నారు. భటుల వెంట వెళ్ళారు.

కూరేశులు కంచిలో రాజసభకు చేరుకున్నారు. సభ వారిని రామానుజులుగనే పరిగణించింది. అనేకమంది విద్వాంసులు – సభాసదుల సమక్షంలో రాజు రామానుజుని–

"శివాత్పరతరం నాస్తి" అనమన్నాడు. "శివుని మించినవాడు లేడు."

రామానుజుడు అందుకు అంగీకరించడు. ఆమాట అనడు. అది అందరికి తెలుసు. ఎంచేతంటే విష్ణువును మించినవాడు లేడు అనేది రామానుజ సిద్ధాంతం. అయినా, అతడు ఏమి అంటాడో అని ఆతృతగా ఎదిరి చూచారు.

"ద్రోణమస్తి తతః పరమ్" అన్నారు కూరేశులు.

రాజు సహితంగా సభ సాంతం ఆ మాటలకు ముందు ఆశ్చర్యపోయింది. ఎందుకంటే –

"శివ" అనేది ఒక ధాన్యపు కొలత. దీనిని లీటరు అనుకుందాం. ద్రోణం". అంతకన్న పెద్ద కొలత. అయిదు లీటర్లను కొందాం.

అనంతరం శివుని కించపరచినందులకు రాజు సహితంగా సభసాంతం కూరేశుని మీద కోపాగ్ని కురిపించింది.

"వీని కన్నులు పెరకండి" అని రాజు భటులకు ఆజ్ఞాపించాడు.

రాజ భటులు కూరేశుని అడివిలోకి తీసికెళ్ళారు. కళ్ళు పెరికేశారు. కూరేశుడు అందుకు బాధపడలేదు. రాజభటుల పాదాలమీద సాష్టాంగపడ్డాడు. అన్నాడు:

"భటులారా! మీరు నాకు నిజమైన మిత్రులు. ఇంత కాలంగా ఉన్న నా రెండు కనులను పెరికివేశారు. అవి నా నిరంతర శత్రువులు. భగవంతుని దర్శించనీయక పాడు పదార్థాలను చూపించాయి. ఇహ నాకు భగవద్దర్శనమే – అన్యంలేదు!" అని ఆనందంతో గంతులు వేశారు!!

రాజభటులు అది చూచారు. స్పందించారు. కూరేశుని పాదాలను ఆశ్రయించారు.

## మహాత్ములు - వంచన:

ఆదేకాలంలో వరంగల్లును కాకతీయ ప్రతాపరుద్ర చక్రవర్తి పాలిస్తున్నాడు. తెలుగు వారిని ఒకే ఛత్రం కిందికి తెచ్చిన ఘనత కాకతీయులది. జైన మతాన్ని తమ రాజ్యంలో నామ రూపాలు లేకుండా చేసిన నికృష్టతకూడ కాకతీయులదే! పర మతస్థులు మన దేశంలో దేవాలయాలు కూల్చారని – రాజకీయ లబ్ధికోసం – గొంతులు చించుకునేవారు; ఒక్కసారి మనం బౌద్ధ జైనాది మతాలను నాశనం చేయడం గ్రహిస్తే మంచిది. ఈ మతాలను రూపుమాపడానికి మనం మూకహత్యలు చేశాం. రక్తం పారించాం. ఆలయాలను కూల్చాం. లేదా, మార్చాం.

ఈ నాటి వీరభద్ర ఆలయాలు దిగంబర జైనులవి అని గ్రహించడం కష్టం కాదు.

కాకతీయులు శైవులు. వారు శైవమత ప్రచారానికి ఎంతో సాయం చేశారు. ఎన్నో ఆలయాలు కట్టించారు. అయితే, కాకతీయ వంశం ఒక శైవుని శాపం వల్లనే అంతం అయిందనే ఒక కథ ప్రచారంలో ఉంది.

శైవుల్లో రెండు రకాలు. ఒకరు లింగధారులు. అంటే, ఎల్లప్పుడూ లింగం ధరించే ఉంటారు. ఒకరు లింగం ధరించనివారు. కాకతీయులు లింగం ధరించని శైవులు.

హనుమ కొండ సమీపంలో ఒక లింగధారి ఆరాధ్య మహర్షి ఉండేవాడు. అతడు శివస్వామి. అతడు గుహలో ఉంటాడు. సూర్యునిలో నారాయణుడు ఉంటాడు. కాబట్టి అతడు సూర్యుని చూడడు. అతనిది అసూర్యంపశ్యవ్రతం. అతడు సూర్యుడు అస్తమించిన తరువాత బయటికి వస్తాడు. ఒక జొన్నగింజ నాటుతాడు. అది మరునాటి రాత్రికి జొన్నకంకి అవుతుంది. అది తింటాడు. తెల్లవారుతుండగా గుహలోనికి వెళ్లిపోతాడు.

శివస్వామిని గురించి ప్రతాపరుద్రునికి తెలిసింది. రాజుకు శివస్వామిది విపరీత ప్రవర్తన అనిపించింది. తమను దర్శించమని శివస్వామికి వార్త పంపాడు. 'లింగధారి కాని వాడిని తాను చూడను.' అని చెప్పి పంపాడు శివస్వామి. ప్రతాపరుద్రునికి పట్టుదల పెరిగింది. పండితులను పంపాడు. సంప్రదింపులు సాగించాడు. తనతో మాట్లాడినంతసేపు ప్రతాపరుద్రుడు లింగాన్ని పట్టుకొని ఉండాలి అనే షరతు విధించాడు శివస్వామి. ప్రతాపరుద్రుడు అందుకు అంగీకరించాడు.

ప్రతాపరుద్రుడు శివస్వామిని వేయిస్తంభాల గుడిలో కలుసుకున్నాడు. పండితులు – మతాచార్యులు – మంత్రులు – పుర ప్రముఖులు కూడారు.

రాత్రి సమయం. ప్రతాపరుద్రుడు లింగాన్ని పట్టుకుని కూర్చున్నాడు. శివస్వామి అనర్గళంగా ఉపన్యసిస్తున్నాడు. సభాంతం మంత్రముగ్ధంగా వింటున్నది.

ప్రతాపరుద్రుడు లింగాన్ని వదిలేశాడు.

శివస్వామి అది చూచాడు. రుద్ర రూపం దాల్చాడు. "ఒరే! శివునికే అపచారం చేస్తావా? నీ వంశం సమూలంగా నాశనం అవుతుంది. నీ రాజ్యం నామరూపాలుండవు. నీవు కట్టించిన దేవాలయాలలో పూజ ఉండదు. శివునికి ద్రోహం చేసినావు. సర్వనాశనం అవుతావు" అని శపించాడు.

శివస్వామి శివతాండవం చేశాడు.

శివస్వామి రుద్రతాండవం చేశాడు

శివస్వామి శివైక్యం చెందాడు.

కథ జరిగిందా, జరగలేదా? అనేది అటుంచితే మహాత్ములను మోసగించడం, వంచించడం మాత్రం క్షమించరానిది.

## దాశరథి:

ప్రతాపరుద్రుడు పూజించే లింగం భూమిని అంటదు. ఎత్తుగా ఉంటుంది. ఒకనాడు అది నేలను అంటింది. ప్రతాపరుద్రుడు విచలితుడు అయినాడు. కారణం తెలుసుకోవలసిందని ఒక మంత్రిని నియమించాడు. లింగం యథాస్థానానికి వచ్చేవరకూ అనశనం వహించాడు.

మంత్రి ఎంత మందినో అడిగాడు. మహానుభావులను సంప్రదించాడు. ఫలితం లేకపోయింది.

హనుమకొండ దగ్గరిలోని "ఆత్మకూరు"కు ఎవరో సన్యాసి వచ్చాడని విన్నాడు. అక్కడికి వెళ్లాడు.

ఆ వచ్చినవారు శ్రీమద్రామానుజులు. వారు వైష్ణవ ప్రచారానికి ఆంధ్రదేశం పర్యటిస్తున్నారు. ఆంధ్ర దేశ రాజధాని ఓరుగల్లు దగ్గర విడిశారు.

భద్రుడనే మంత్రి రామానుజుని దర్శించాడు. జరిగినది వివరించాడు. నివారణ ఉపాయం చెప్పమన్నాడు.

"రేపు సాయంకాలానికి లింగం యథాస్థానంలో ఉంటుంది" అన్నారు రామానుజులు.

"అది సరి స్వామీ! ఇంతకు ముందు వాలడానికీ – ఇప్పుడు నిలువడానికి కారణం సెలవియ్యండి" – అడిగాడు మంత్రి.

"మేము ఉన్న పరిధిలో ఇతర దేవతల బలం క్షీణిస్తుంది. రేపు మేం వెళ్ళిపోతున్నాం" అన్నారు రామానుజులు.

భద్రునికి నమ్మకం కుదరలేదు. డంబాలు అనుకున్నాడు. అయినా చేయగలిగింది లేదు. వరంగల్లు చేరాడు.

రామానుజులు చెప్పిన ప్రకారం లింగం నేలమీదినుంచి లేచింది. పూర్వస్థానం చేరుకున్నది.

మంత్రి ఆశ్చర్యానికి అంతులేదు. అతడు రామానుజుని ఆశ్రయించాడు. తనను శిష్యుని చేసుకొమ్మన్నాడు. వారివెంట తీసికెళ్ళమన్నాడు.

రామానుజుడు మంత్రికి వైష్ణవం ఇచ్చారు. మంత్రిగానే ఉండి వైష్ణవ ప్రచారం చేయమన్నారు. ప్రతిరోజు పన్నెండు మంది వైష్ణవులకు భోజనం పెట్టకుండా మంత్రి భోజనం చేయరాదని నియమం విధించారు.

మంత్రి రాచకార్యం మీద ప్రస్తుతపు హుజూర్‌నగర్ ప్రాంతానికి వెళ్ళాడు. వారం పాటు సాపాటుకు వైష్ణవులు దొరకలేదు. 8 వ నాడు మంత్రి స్వయంగా ఊరిబయట స్వాముల కోసం వేచి కూర్చున్నాడు.

మంత్రి అదృష్టం బాగుంది. సరిగ్గా పన్నెండు మంది వైష్ణవులు అటువస్తూ కనిపించారు. భద్రుడు వారిని ఆహ్వానించాడు. ఆరు బయట పందిళ్లు వేశారు. వంటలు అయినాయి. తిరువారాధన అయింది. స్వాములు సాపాట్లకు కూర్చున్నారు. మంత్రి బయట నిరీక్షిస్తున్నాడు. ఎంతకూ బోజనాలు పూర్తికావు. మాట వినిపించదు. సాయంకాలం అయింది.

మంత్రి లోనికి పోయి చూచాడు.!

పన్నెండు విగ్రహాలున్నాయి! వారు పన్నిద్దరు ఆళ్వారులు. వైష్ణవ మతానికి ఆచార్యులు పన్నెండు మంది.

మంత్రి విస్మయం చెందాడు. విగ్రహాలను పట్టుకొని ఏడ్చాడు. విస్తళ్లలో వారు వదిలిన శేషం భుజించాడు.

మంత్రి అక్కడ నిలువెత్తు ఆళ్వారుల విగ్రహాలకు గొప్ప దేవాలయం కట్టించాడు. అది హుజూర్‌నగర్‌కు దగ్గరలోని బూరుగు గడ్డలో ఉంది. ఆళ్వారులకు మాత్రం దేవాలయం ఇది ఒక్కటే. ఇప్పటికీ ఆరాధన ఉంది.

నా చిన్నతనంలో బూరుగు గడ్డ వైష్ణవుల తిరుమాళిగలో త్యాగరాజు స్వామివారి వీణను ధరించుకునే భాగ్యం కలిగింది.

శ్రీమద్రామానుజులు ఆంధ్రదేశంనుంచి వెళ్ళిపోతూ, వారి ప్రధాన శిష్యుడు దాశరథిని ఇక్కడ – వైష్ణవ ప్రచారానికి విడిచిపోయారు.

శ్రీమద్రామానుజులు పరమపదించిన తరువాత ఆచార్యపీఠం అధిష్ఠించినవారు దాశరథి.

మేము ఆ దాశరథి వంశీయులం. ఇళ్లపేర్లు సాధారణంగా ఊర్ల పేర్లు ఉంటాయి. ఒక ఆచార్యుల పేర ఇంటి పేరు ఉండడం అరుదు. మాకు ఆ అదృష్టం దక్కింది.

## "విద్వాన్ సర్వత్ర పూజ్యతే"

దాశరథివారు 'ఇంటిపేరు కస్తూరి' వారు కాలేదు. మా పితృవర్యులు దాశరథి వేంకటాచార్యులవారి వరకు అఖండ పాండిత్యంతో ఆచార్యత్వం నిర్వహించారు. మేము – అంటే మా అన్నయ్యా నేను; ఆధునిక – అభ్యుదయ – ప్రగతి పథాలను ఎన్నుకున్నాం. స్వచ్ఛందంగా ఆచార్యత్వం వదులుకున్నాం. మా మార్గంలో మేము కృషి చేశాం.

మా పూర్వులది భద్రాచలం. భద్రాచలంలో రామదాసు రామాలయం నిర్మించ డంలో దాశరథివారి ప్రోత్సాహం ఎంతో కొంత ఉండి ఉండాలి. కంచర్ల గోపన్న అనే రామదాసు దాశరథి శతకం రచించడంతో దాశరథివారి ప్రమేయం ఉన్నది అనడానికి ఆ శతకపు మకుటమే సాక్ష్యం.

భద్రాచలం; బ్రిటిషిండియాలో – తూర్పు గోదావరి జిల్లా లోనిది. దేవాలయం మాత్రం నిజాం రాజ్యం లోనిది. ఆంధ్రప్రదేశం ఏర్పడి భద్రాచలం ఖమ్మం జిల్లాలో చేరే వరకు కొనసాగింది.

మా ప్రపితామహులు వేంకటాచార్యులవారు. వారు తర్కంలో అఖండ పాండిత్యం కలవారు. నిరాడంబరి. భద్రాది రామచంద్రుని ఉపాసకులు.

ఒకసారి గద్వాల సంస్థానంలో తర్క పండితుల సభ జరిగింది. వేంకటాచార్యుల వారిని ఆహ్వానించలేదు. అయినా వెళ్ళారు. వారు సభలో చిట్ట చివరన చెప్పుల దగ్గర కూర్చున్నారు. వేదిక మీద తర్కం జరుగుతున్నది.

"తర్కం తెలిసినవారే లేరా! తడకల చర్చ జరుగుతున్నది?" అన్నారు మా ప్రపితామహులు.

అందరూ ఆ మాటలు అన్నవారిని చూచారు. మహారాజావారు వారిని వేదికమీది కాహ్వానించారు. వేంకటాచార్యులవారు తర్కం అంటే ఇది అన్నట్లు వాదించి, ఆంధ్రదేశపు పండితులందరినీ పరాజితులను చేశారు!

మహారాజావారు వేంకటాచార్యుల వారిని ఘనంగా సత్కరించారు.

**"వర చేలంబులొ, మాడలో, వన్యంబులో, గోవులో**
**హరులో, రత్నములో, రథంబు, తోవిమృష్టాన్నంబులో, కన్యలో**
**కరులో, కాంచనమో, నికేతనములో, గ్రామంబులో, భూములో**
**ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీ సురేంద్రోత్తమా!"**

శ్రీమద్భాగవతములో బలిచక్రవర్తి వామనుని అడిగినట్లు మహారాజావారు ఏది కావాలన్నా ఇస్తామన్నారు. అంత ప్రసన్నులయినారు మహారాజావారు.

వేంకటాచార్యులవారు ఆశలు ఎరుగనివారు.

"మహారాజా! మేము భద్రాద్రి రాముని ఛత్రచ్ఛాయలో జీవించు వారము. వారు మాకు క్షీణించని వాక్సంపద ప్రసాదించినారు. మీరు అన్నవి ఏమియు మాకు అక్కరకు వచ్చునవి కావు. నిధి కన్న రాముని సన్నిధియే సుఖకరము. నువ్వులు – బెల్లము పెట్టి మమ్ము పంపించుడు" అన్నారు.

వేంకటాచార్యులవారి మాటలకు మహారాజావారు చకితులయినారు. వస్త్ర వాహనములు ఇచ్చి, మా ముత్తాతగారిని భటులను ఇచ్చి పల్లకిలో భద్రాచలం పంపారు.

వేంకటాచార్యులవారు వస్త్రవాహనాలను రామునకే సమర్పించారు!

దాశరథివారికి కూనవరంలో అనేక ఇనాం భూములుండేవి. భద్రాచలం దండకారణ్యం. కీకారణ్య ప్రాంతం. సింహాలు – పులుల వంటి జంతువులు తిరగడం సర్వసాధారణం! మార్గంలో దొంగలబెడద!!

వేంకటాచార్యులవారు కౌలు డబ్బుకోసం కాలిబాటన కూనవరం వెళ్ళారు. డబ్బు అందింది. మూట కట్టుకున్నారు. అప్పుడు రూపాయినాణాలే. నోట్లు లేవు. మహారణ్యం. పాపిటలాంటి కాలి బాటలో నడిచి భద్రాచలం వస్తున్నారు. మార్గమధ్యంలో దొంగలు వెంటపడ్డారు. వారికి అందకుండా పరిగెత్తారు. ఒక చేను కనిపించింది. మంచెమీద మనుషులు కనిపించారు. వారిని చేరుకోవాలి. దొంగలు అందుబాటులో ఉన్నారు.

వేంకటాచార్యులవారు చేతికర్ర ఊతంతో కంచెమీది నుంచి ఎగిరి చేలో దూకారు.

కాని తుమ్మముల్లు చీరుకొని కనుగ్రుడ్డు ఊడిపడింది! అప్పటినుంచి వారిని గ్రుడ్డి వేంకటాచార్యులు అన్నారు. అందుకు "మనమంతా గ్రుడ్డివాళ్లమే! చూపుకోసం ఆరాట పడుతున్నవాళ్ళం" అనేవారట!

ఆ రోజుల్లో డబ్బు తేవడం – దాయడం అంతకష్టం. అందుకే పాతిపెట్టేవారు!

వేంకటాచార్యులవారికి లక్ష్మణాచార్యులవారు – లక్ష్మమ్మగారు ఇద్దరు సంతానం. లక్ష్మమ్మగారిని భద్రాచలం శఠగోపంవారి ఇంటికి ఇచ్చారు. నా భార్య కమల అమ్మమ్మ రాగమ్మగారికి లక్ష్మమ్మగారు అత్తగారు.

లక్ష్మణాచార్యులవారికి నిజాం రాజ్యం మానుకోట తాలూకా చినగూడూరు గ్రామం గోవర్ధనం వరదాచార్యులవారి కూతురు బుచ్చమ్మగారిని ఇచ్చి వివాహం చేశారు.

కాలినడక తప్ప వేరే సౌకర్యం లేని ఆ రోజుల్లో అంతదూరపు సంబంధాలు ఎలా కుదిరాయో! ఎలా చేశారో!!

లక్ష్మణాచార్యులవారు విద్వాంసులు, వైద్యులు. దేవాలయంలో "దారోగా" ఉద్యోగం చేశారు. దేవాలయపు ఉద్యోగం అంటే నిజాం ఉద్యోగం! దారోగా అంటే సబిన్ స్పెక్టరంతటిది.

లక్ష్మణాచార్యులవారికి కూనవరంలో భూములు – భద్రాచలంలో ఇల్లు – దేవాలయంలో ఉద్యోగం – వైద్యవృత్తి – విద్వత్తు సలక్షణంగా ఉన్నాయి.

**ప్రకృతికి పరిపూర్ణత్వం లేదు. ప్రతిదానికీ – ప్రతివానికీ వారు రాజులు కానీ – రారాజులు కానీ ఒకలోపం ఉండాల్సిందే!** మా తాతగారు లక్ష్మణాచార్యుల వారికి దగ్ధ సంతానం! అమృత హస్తంగల భిషగ్వరులువారు. తమ సంతానాన్ని రక్షించుకోలేకపోయారు!

ఇదే జీవిత వైచిత్రి!

'విధి'కి ఇక్కడే ప్రాధాన్యత!

**మానవశక్తి పనిచేయనిచోట విధి ప్రత్యక్షం అవుతుంది!**

బుచ్చమ్మగారు – ఆ తల్లి – ఆరుగురిని కని గోదావరి వడ్డున పెట్టింది! ఆమె గుండె ఎంత చెరువయి ఉంటుంది? ఆమె ఎట్లు సహించి యుండును?

వారు నమ్ముకున్నది రాముని. రాముడు వారికి సాయం చేయలేదు.

బుచ్చమ్మగారి ఏడవ సంతానం బావుంది. అందుకు ఆ దంపతులు మురిసిపోయారు. అదిగో, అప్పుడే జగన్నాథం నుంచి దంపతులు భద్రాద్రియాత్రకు వచ్చారు. మా తాతగారి ఇంట్లో దిగారు. బుచ్చమ్మగారి బిడ్డను చూచి మురిసి, తమకు ఇవ్వాల్సిందనీ – పెంచుకుంటామనీ అన్నారు.

లక్ష్మణాచార్య దంపతులకు భద్రాచలం మీదా – భద్రాద్రి రాముని మీదా విశ్వాసం సన్నగిల్లింది. ఇక్కడ బిడ్డ బ్రతికి బట్టకడ్తాడు అనుకోలేదు. తమ బిడ్డ ఎక్కడయినా క్షేమంగా ఉండాలనుకున్నారు. బిడ్డను వారికి ఇచ్చారు!

**తమ కన్న బిడ్డను ఇతరులకు అప్పగించడం ఎంత బాధాకరం మాతృమూర్తికి! తాను బాధపడ్తుంది! అయినను తమ బిడ్డ క్షేమంగా ఉండాలి! ఎక్కడి అనుబంధం! ఎంతటి అనుబంధం!**

తల్లి ఆశలు అడియాసలయినాయి!

పిడుగువంటి వార్త భద్రాద్రి చేరింది!

సవతి తల్లి బిడ్డకు విషంపెట్టి చంపిందని వార్త!

ఆ తల్లి కన్నీటితో గోదావరికి వరద వచ్చింది!

లక్ష్మణాచార్యుల కుటుంబంలో కటిక చీకటి నిండింది! వారి విలాపం అక్షరాలకు అందనిది.

ఎంతటి కటిక చీకటీ కలకాలం నిలువదు!

చీకటి డొక్కను చీల్చుకొని కాంతిరేఖ అవతరిస్తుంది!

విళంబినామ సంవత్సర ఆశ్వీజ శుక్లసప్తమి గురువారంనాడు బుచ్చమ్మగారికి కాంతిరేఖగా మా నాయనగారు జన్మించారు.

మా నాయనమ్మకు భద్రాద్రి రాముని మీది విశ్వాసం పూర్తిగా నశించింది. రాముని ముఖాన దోసిళ్లతో దుమ్ముపోసింది. మా తాతగారు వెంటరాకున్నా, పిల్లవాణ్ణి భుజాన వేసుకుని వంటరిగా – కాలినడకన – మహారణ్యమార్గాన చిన్న గూడూరు చేరింది. అప్పటికి వారి తండ్రిగారు వరదాచార్యులవారు పరమపదించారు. బుచ్చమ్మగారి తమ్ముడు భట్టరాచార్యులవారు అక్కగారిని బరువుగా భావించలేదు.

భద్రాచలంలో లక్ష్మణాచార్యులవారు భార్యను కొడుకును వదిలి ఉండలేక పోయారు. ఇల్లు, భూములు, ఉద్యోగం, వృత్తి తృణప్రాయంగా వదిలి చిన్నగూడూరు – కట్టు బట్టలతో చేరారు.

ఎంతటి అనుబంధం! ఎంత ప్రేమ! ఎంతటి అనురాగం! ఎంతటి ఆత్మీయత! తన భార్యకోసం – కొడుకు కోసం సర్వం వదిలి వచ్చారు! అసలు ఆస్తిని లక్ష్యం చేయలేదు! మానవ సంబంధానికి ప్రాధాన్యత ఇచ్చారు!

ప్రాణంలేని ఆస్తికంటే ప్రాణం - హృదయం ఉన్న మనిషి ఉత్తమోత్తముడు!

ఎంతటి ఆత్మవిశ్వాసమంటే వారికి – అన్నీ వదలుకొని పై పంచెతో కదలివచ్చారు! రాతిమీద బియ్యం పండించగలననే విశ్వాసం! విద్య ఉంది బ్రతకగలననే విశ్వాసం!

"విద్వాన్ సర్వత్రపూజ్యతే" – విద్వాంసునికి అంతటా గౌరవం లభిస్తుంది.

బుచ్చమ్మ లక్ష్మణాచార్యులవారలు పరమపదించేవరకు మళ్లీ భద్రాద్రి ముఖం చూడలేదు!

తనకు కష్టాలు వచ్చినందుకు దేవుని మీద దుమ్ము పోయడం, తిరిగి అటు చూడకుండడం వివేకవంతుల లక్షణం మాత్రం కాదు!

**దేవుడు మనకు సేవ చేయడానికే ఉన్నాడా? మనకు మేలు కూర్చినపుడేనా అతనిని పూజించేది! మన కను సన్నలలో భగవంతుడు మసలవలెనా? నష్టం జరిగినపుడు దుమ్ము పోయడమేనా?**

**ఏదో కొంత భగవంతునికి ఇచ్చి సర్వం సాధించాలనుకోవడం భగవంతునితో వ్యాపారం చేయడం అగునుకాని భక్తి కాదు.**

**మానవ జీవితం వారికర్మమీద ఆధారపడి ఉన్నది. కర్మ అంటే పని. మన పనినిబట్టి ఫలితం ఉంటుంది. నిన్నటి పనికి ఇవ్వాళ ఫలితం ఉన్నట్లే గత జన్మలోని కర్మకు ఈ జన్మలో ఫలితం ఉంటుంది.**

ఇందును గురించి మహాభారతంలో ఒక కథ ఉంది.

ఒక స్త్రీకి ఒక కొడుకు. అతడు పసివాడు. ఆటలకు పోయినాడు. పాము కరిచింది. మరణించాడు. ఆమె తన కొడుకు శవాన్ని పెట్టుకుని ఏడుస్తున్నది.

ఇంటిపక్కన ఉన్నవాడు పామును చంపుతానని కర్ర పట్టుకొని వచ్చాడు. తన కొడుకు కర్మవలన చచ్చాడు. పాముది దోషం కాదు. చంపవద్దన్నది.

పాము అక్కడికి వచ్చింది. "తల్లీ! నాదేమీ తప్పులేదు. నేను నిమిత్తమాత్రను. మృత్యువు ఆదేశించాడు. నేను కాటేశాను" అన్నది. పాము వెళ్ళిపోయింది.

మృత్యువు అక్కడికి వచ్చాడు. "తల్లీ! నాదేమీ తప్పులేదు. నేను నిమిత్తమాత్రుణ్ణి. యముడు ఆదేశించాడు. నేను పాముకు చెప్పాను" అన్నాడు. మృత్యువు వెళ్ళిపోయాడు.

యముడు అక్కడికి వచ్చాడు. "తల్లీ! నాదేమీ తప్పు లేదు. నేను నిమిత్తమాత్రుణ్ణి. కాలానికి అధీనుణ్ణి. కాలం ఆదేశించింది. నేను ఆచరించాను" అన్నాడు. వెళ్ళిపోయాడు యముడు.

కాలం అక్కడికి వచ్చింది. "తల్లీ! నాదేమీ తప్పులేదు. నేను నిమిత్తమాత్రుణ్ణి. నేను కర్మవశుణ్ణి. కర్మ ఆదేశించింది. నేను ఆచరించాను" అన్నది. వెళ్ళింది కాలం.

కర్మ రాలేదు. ఎంచాతంటే, అది మనిషి చేతిలోనిది! మానవుని భవిష్యత్తు దాని చేతిలో ఉంది అంటుంది భారతం! మనిషి మీదా – మనిషి పని మీదా అంత నమ్మకం మనవాళ్ళకు!

**నిష్కామంగా భగవంతుని ఆరాధించిందే భక్తి!**
**కోరికల కోసం భగవంతుని ఆరాధించడం వర్తకం!**

**"దమ్‌భర్‌మేఁ మస్జిద్ ఖడాకర్దీ ఈమాఁకీ హరారత్‌వాలోఁనె**
**దిల్‌వహీ పురానా పాపేథా ఉమకా భర్‌మె నమాజీ న బన్‌సర్"**

అంటాడు ఇక్బాల్.

భక్తి ఆవేశంలో క్షణంలో మసీదు కట్టాడు. హృదయం మాత్రం పాపిష్టిది. జీవితంలో భక్తుడు కాలేకపోయాడు.

లక్ష్మణాచార్యులవారు ధన్వంతరి. చినగూడూరులో ఒక సంపన్నుని ప్రాణం రక్షించారు. అతడు ఆచార్యులవారికి ఒక ఇల్లు కట్టించి ఇచ్చాడు.

నిజాంలో సాలార్‌జంగ్ కాలం వరకు భూముల సెటిల్‌మెంట్ జరుగలేదు. ఊళ్ళకు ఊళ్ళు దేశ్‌ముఖులకు గుత్తకు ఇచ్చేవారు. దేశముఖులు కిస్తు కట్టేవాళ్లు కారు. కిస్తు అడగడానికి వచ్చిన వారిని అన్నంలో విషం పెట్టి చంపేవారు. అందువల్ల దేశముఖులు పెట్టిన తిండి తినడం మానేశారు. గుడారాలు వేసుకొని కిస్తు వసూళ్లు చేశారు. దేశముఖులు గుడారాలు తగలపెట్టించారు. సర్కారు మనుషులు ఆయుధాలతో వచ్చారు. బలవంతంగా శిస్తులు వసూలు చేశారు. దేశముఖులు శిస్తులు ఇచ్చారు. తమ మురాలను పంపి అరణ్యమధ్యంలో సర్కారు మనుషులను దోపిడీ చేయించేవారు.

దేశముఖుల ఈ దౌర్జన్యం రూపుమాపడానికి సాలార్‌జంగ్ "ఘర్ ఘర్ దేశముఖు" నినాదం ప్రవేశపెట్టాడు. అందరినీ భూస్వాములను చేయడానికి సెటిల్‌మెంట్

చేశాడు. దరఖాస్తు ఇచ్చినవారికల్లా భూములు ఇచ్చారు సర్కారు. దేశముఖులు దరఖాస్తు ఇవ్వనీయలేదు. అక్కడక్కడ తప్ప భూములన్నీ తమ పేరనే చేసుకున్నారు.

చిన్నగూడూరు దేశముఖు రావుల రంగారెడ్డి. అతడంటే చుట్టు పక్కల గర్భనిర్భేద్యం. తనను వ్యతిరేకించినవాణ్ణి తుపాకితో కాల్చి పారేసేవాడు!

అలాంటి రంగారెడ్డి, లక్షణాచార్యులవారి భక్తుడు. వారు మా పితామహుల ఇంటికి వచ్చి, ఆరెకరాల పొలానికి దరఖాస్తు మీద సంతకం పెట్టవలసింది అన్నారు. 'నేను కిస్తు కట్టలేను. నాకు వద్దు' అన్నారు మా తాతగారు. రంగారెడ్డిగారు అంతటితో మానుకోలేదు. వారే లక్ష్మణాచార్యుల సంతకం పెట్టి, తుమ్మిడి చెరువు, తూము పక్కన, దేశముఖుల పొలాలకన్నముందు నీరు వచ్చే ఆరు ఎకరాల, రెండు పంటల సుక్షేత్రం అయిన మాగాణి ఇప్పించారు. అందులో ఎకరంన్నర రంగారెడ్డిగారి కొడుకు గుంజుకున్నాడు. విశ్వప్రయత్నం చేసీ – మా నాయనగారు దాన్ని సాధించలేకపోయారు. 1979లో మా నాయనగారు పరమపదించిన తరువాత అనాలుగున్నర ఎకరాలు మేము అమ్ముకున్నాం!

భూమి అంత సమృద్ధంగా ఉన్న రోజులవి కాదనుకుంటా! ఆశ అంత తక్కువగా ఉన్న రోజులవి! ఇప్పుడు భూమి తగ్గలేదు. ఆశ భూమిని మించిపోయింది.

భద్రాద్రిని – రామచంద్రుని వదిలి – అచంచలం అయిన ఆత్మవిశ్వాసంతో తరలివచ్చిన దాశరథి లక్ష్మణాచార్యులవారు చిన్న గూడూరులో పొలం, ఇల్లూ సంపాదించి స్థిరపడ్డారు.

మా నాయనగారికి – వారి తాతగారి పేరు – వేంకటాచార్యులు అని పెట్టారు. ఇది సర్వసాధారణం. ఈ రోజులవలె పేర్లు గాలించవలసిన పనిలేదు. ఇందులోని సౌలభ్యం ఏమిటంటే – 1. పూర్వుల పేరు తలచుకున్నట్లు అవుతుంది. 2. తాత పేరు వెంటనే గుర్తుకు వస్తుంది.

మా నాయనమ్మ తన తమ్ముడు గోవర్ధనం భట్టరాచార్యుల ఇంటికి వచ్చింది కదా! చిన్నగూడూరుకు దగ్గరలోని రాజుల లేక కొంగల కొత్తపల్లికి చెందిన కళకుంట వేంకటాచార్యులవారి కూతురు ఆండాళమ్మతో భట్టరాచార్యులవారి వివాహం జరిగింది. అండాళమ్మ అంటే మా అమ్మమ్మ, మా అమ్మ వేంకటమ్మను కని పురిటిలోనే కన్నుమూసింది. మా అమ్మను నేనే సాదానంటుంది మా నాయనమ్మ. నేనే సాదానంటుంది కొత్తపల్లిలోని మా అమ్మమ్మ అక్క.

మొత్తంమీద మా అమ్మ – నాయన కలిసి ఆడుకున్నారు. కలిసి పెరిగారు. మేనరికమే కావడంవల్ల వాళ్ళకు బాల్యంలోనే వివాహం జరిగింది.

మా నాయనగారు మా ఉభయ మహులవద్ద చదువు ముగించారు. ఇహ చదువు లేదు అక్కడ. ఏంచేయాలని మా ఉభయ మహులు – బావ బావమరదులు ఆలోచించారు. గోలకొండ పట్నం – హైదరాబాదు – వెళ్లాలా? చెన్నపట్నం – మద్రాసు వెళ్లాలా అని ఆలోచించారు.

మా తండ్రిగారి జననం 1898. వారికి పది, పదిహేను సంవత్సరాలు అనుకుంటే సుమారు 1912 ప్రాంతంలో చిన్న గూడూరు వంటి ఊళ్ళో ఈ ఆలోచన వచ్చినవారు ఉండి ఉండరు. జ్ఞానతృష్ణ ఇలాంటి ఆలోచనకు కారణం అవుతుంది!

గోలకొండ పట్నంలో మ్లేచ్ఛ విద్య పనికిరా దనుకున్నారు. చెన్నపట్నం వెళ్లడానికి నిశ్చయించుకున్నారు. నిశ్చయించుకున్నదే తడవు బయలుదేరారు. లక్ష్మణాచార్యుల వారు మరొకసారి చిన్నగూడురులో ఇల్లూ – పొలం వదిలి, కేవలం ఆత్మవిశ్వాసంతో – తెలియని భాష – తెలియని ప్రాంతం మద్రాసు చేరుకున్నారు. మా తాతయ్య, నాయనమ్మ – మా అమ్మ, నాయన మద్రాసు చేరుకున్నారు. అంతా కొత్త. అయోమయం. అరవం.

కేవలం ఆత్మ విశ్వాసంతో మా తాతగారు ఆమహా నగరం చేరారు. సత్రంలో ఉండగా మా వాళ్ళకు ఏడుపులు వినవచ్చాయి. మా తాతగారు పరిగెత్తారు. ఒకతను అవసాన దశలో ఉన్నాడు. వెంటనే కంటికి కలికం వేశారు. కుప్పె రంగరించి నాలుకకు రాశారు. ఎవరి అదృష్టమో తెలియదు – అతను బయట పడ్డాడు. కొద్దిరోజుల్లో బాగయినాడు. వారు గోదావరి ప్రాంతపు సంపన్న వైశ్యులు. వారికి తిరువళిక్కేణిలో ఉన్న ఇంటిని మా తాతగారికి వప్పగించారు. వారి వైద్యం గురించి కూడా ప్రచారం చేసిన వైశ్య కుటుంబం స్వగ్రామం వెళ్ళిపోయింది.

ప్రతిభకు ప్రాంతం – భాష – దేశం ఏవీ అడ్డురావు. మా తాతగారి వైద్యం మద్రాసు మహానగరంలో దివ్యంగా సాగింది. మా నాయన మద్రాసు విశ్వవిద్యాలయం "విద్వాన్"లో చేరారు.

స్త్రీ విద్య నిషేధం అన్నది మా కుటుంబానికి వర్తించలేదు. మా అమ్మకు మా తాతగారు – మా నాయన చదువు చెప్పారు. మా అమ్మ వేంకటమ్మగారు పంచకావ్యాలు క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. వారికి ద్రావిడ, సంస్కృతాలతో పరిచయం ఉన్నా ఆంధ్రం వారి అభిమాన విషయం.

మా అమ్మగారు తిరువళిక్కేణ్ణిని గురించీ – పార్థసారథి స్వామి ఆలయాన్ని గురించీ ఎంతో ఆవేశంగా, ఆప్యాయంగా వివరించేవారు. అది మా మీద ఎంతటి ముద్ర వేసిందంటే – మద్రాసు వెళ్ళినప్పుడు తిరువళిక్కేణి – ట్రిప్లికేన్ – పార్థసారథి స్వామి ఆలయానికి వెళ్తాం. ప్రసాదం తీసుకొని అక్కడ కొంతసేపు గడుపుతాం. బహుశా ఈ చోటనే మా తాతగారు – నాయనమ్మ, నా నాయన, అమ్మ తిరిగి ఉంటారు, కూర్చొని ఉంటారు – ముచ్చట్లు చెప్పుకొని ఉంటారు అన్న అనుభూతి పొందుతాం.

**జంగమములకన్న స్థావరముల అనుబంధమే మిక్కుటమైనది.**

**కాళిదాసు శకుంతలకు చెట్టు చేమలతో విడదీయరాని అనుబంధం కలిగించాడు.**

**భవభూతి రాముణ్ణి సీతలేని పర్ణశాల చూపించి ఏడిపిస్తాడు!**

వేంకటాచార్యులవారు "విద్వాన్" పట్టా సంపాదించారు. వారి భవిష్యత్తు మద్రాసులో వికసించే సదవకాశం ఉంది.

లక్ష్మణాచార్యుల వారి వైద్యం ఆరుకాయలుగా సాగుతున్నది. అయినా వారు మద్రాసులో నిలవదలచలేదు. వచ్చిన పని అయిపోయింది. భద్రాచలం, గూడూరు వదిలినట్లే మద్రాసు వదిలారు. ఎందుకు వదిలారు? అంటే, మనిషి తనవాళ్ళమధ్య ఉండాలి అన్నారు. మళ్ళీ తనవాళ్ళమధ్యకు చిన్న గూడూరు వచ్చి చేరారు.



దాశరధి సోదరుల తాతయ్య దాశరధి లక్ష్మణాచార్యుల వారు నాయనమ్మ బుచ్చమ్మగారు



దాశరధి సోదరుల మాతా మహులు గోవర్ధనం భట్టారాచార్య సీతమ్మగారలు

# మూడు

## జననీ జన్మభూమిశ్చ:

**అపిచేత్ స్వర్ణమయీ లంకా న మమరోచతే**
**జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి.**

ఇది వాల్మీకి రామాయణంలోని శ్లోకం. "లంక స్వర్ణమయం అయింది. అయినా నాకు రుచించదు. జనని, జన్మభూమి – ఈ రెండు స్వర్గంలో కూడా లభించవు" అంటాడు రాముడు.

మాతృదేశం అయిన భరతభూమి రాజకీయుల చేతులలో పడి తన రూపాన్ని విధిలేక మార్చుకుంటుంది. దక్షిణ పీఠభూమితప్ప భారతదేశం అనేకసార్లు – రాజులు – రాజకీయుల బలాబలాల్నిబట్టి మారుతూ వచ్చింది. మారుతున్నది.

మేరువుకు దక్షిణాన సముద్రం తాకేవరకు భారతదేశం వ్యాపించిన రోజులు ఉన్నాయి. ఇరాన్ – అఫ్గాన్ – భారతదేశంలో భాగం కూడా కావచ్చు. అన్ని దేశాల హద్దులు రాజకీయులే మారుస్తారు.

**రాజకీయ భారతం కంటే సాంస్కృతిక భారతం సువిశాలం అయింది. సుమారు ఆసియా ఖండం నిండా - మతాల ప్రసక్తికి అతీతంగా - భారత సంస్కృతీ పరిమాణాలు వ్యాపించి ఉన్నాయి. ఇవి ప్రజల హృదయాల్లో నిక్షిప్తమయి ఉన్నాయి. రాజకీయుల సంకుచితత్వాలు వాటిని చేరలేవు.**

**ఇస్లాం ఒకే భగవంతుని విశ్వసిస్తుంది. ఇస్లాం ఒకే సంస్కృతిని విశ్వసిస్తుంది. ఇన్ని ముస్లిం రాజ్యాలు ఎందుకు? ఒకటిగా ఉండరాదా? రాజకీయం పడనీయదు.**

**యూరోప్ మొత్తం సుమారు ఒకే సంస్కృతి - ఒకే మతం! కలిసి ఉండవచ్చు కదా? మళ్లీ రాజకీయం! అనేక రాజ్యాలు!!**

**రాజకీయం మనిషిని చీల్చగలదు. ఏకం చేయలేదు!**

**సాహిత్యం, సంస్కృతి మనిషిని ఏకం చేస్తాయి. చీల్చలేవు!!!**

అంగ్లేయుల దుష్టచింతన కారణంగా తొలి భారత స్వాతంత్ర్య సమరం తరువాత భారతదేశం రెండుగా చీలింది. ఒకటి బ్రిటిషు భారతం. ఇది భారతదేశంలో సుమారు మూడింట రెండు వంతులుంటుంది. ఇది బ్రిటిషు ప్రభుత్వ పాలనలోనిది. అంటే, అంత విశాల భారతం ఒకే ప్రభుత్వం క్రింద ఉంది. దానిని బ్రిటిషు పార్లమెంటుకు జవాబుదారీ అయిన మంత్రిమండలి పాలిస్తుంది.

రెండోది విదేశీయ భారతం. ఇది మూడింట ఒకవంతు వైశాల్యం కలది. దీనిలో చిన్నా, పెద్దా 600 సంస్థానాలున్నాయి. ఈ 600 మంది పాలకులకు హక్కులు తప్ప బాధ్యతలు లేవు. నిరంకుశత్వం తప్ప శాసనం లేదు. విలాసాలు తప్ప విజ్ఞత లేదు.

బ్రిటిషిండియాలో మహాత్ముని నాయకత్వాన మహోద్యమం సాగింది. మహాత్ముని అహింసాయుధాన్ని ప్రపంచంలోని మేధావులందరూ ఆసక్తితో గమనిస్తున్నారు.

భారతదేశంలో స్థితిగతులను గురించి విచారించడానికి బ్రిటిషు ప్రభుత్వం సైమన్ నాయకత్వాన ఒక కమీషన్ నియమించింది. దాని పేరు "సైమన్ కమీషన్." ఆ కమీషనులో ఒక్కడూ భారతీయుడు లేడు. ఆ కారణంగా కాంగ్రెస్ సైమన్ కమీషన్ను బహిష్కరించింది. అనేక చోట్ల "సైమన్ తిరిగిపో"అని నల్లజండాల ప్రదర్శనలు జరిగాయి. లాఠీఛార్జీలు – కాల్పులు సాధారణం అయిపోయాయి.

ఆ సందర్భంలోనే లాలా లజపతిరాయ్ మీద పోలీసులు విరుచుకుపడ్డారు. అతని రొమ్ముమీద లాఠీలతో బాదారు. ఆ దెబ్బలకు కొద్దికాలం తరువాత లాలాజీ అమరులయినారు. లాలాజీ మరణం భారత వ్యాప్తంగా రోషాగ్ని ప్రజ్వరిల్లచేసింది.

అదిగో, అదే సంవత్సరం నిరంకుశ నిజాం రాజ్యపు పీడిత తెలంగాణంలోని వరంగల్లు జిల్లా, మహబూబాబాదు తాలూకా చిన్న గూడూరు గ్రామంలో నేను జన్మించాను.

అది 1928 వ సంవత్సరం.

విభవనామ సంవత్సర అధిక శ్రావణ శుక్ల సప్తమి మంగళవారం ఉదయం అయిదు గంటలకు దాశరథి రంగాచార్య జన్మించాడు.

వాస్తవం ఇంత కచ్చితంగా ఉండగా పుట్టిన తేదీని గురించి ఒక నిర్దిష్టత లేదు.

వాస్తవం ఎంత గహనం అయిందో తెల్పడానికి ఈ విషయం చెపుతున్నాను.

1952లో ఆంధ్ర మెట్రిక్యులేషను పరీక్షకు కట్టేప్పుడు దామాషాగా నా జనన తేది 12–3–1930 అని వ్రాశాను. అందుకు కారణం మా కుటుంబ విచ్ఛిత్తి. మా తండ్రిగారు మాకు దూరంగా ఉండడం.

ఆ తరువాత 1966లో మా నాయనగారు నా పుట్టినరోజు జాతక చక్రం ఇచ్చి ఇంగ్లీషు తేది 24–8–1928 అని వ్రాసి ఇచ్చారు.

ఆ తరువాత ఒక జ్యోతిష మిత్రుడు ఇంగ్లీషు తేదీ సరియైంది కాదని, 24–7–1928 సరియైంది అని చెప్పారు!

మా తల్లిదండ్రులు శ్రీరంగయాత్ర చేసి వచ్చిం తరువాత నేను పుట్టానట. అందువల్ల నాకు "రంగడు" అని పేరు పెట్టారు.

మా అన్నయ్య మహాకవి, డాక్టర్, ఆస్థాన కవి "దాశరథి" అనే కలం పేరుగల దాశరథి కృష్ణమాచార్యులవారు. క్రోధననామ సంవత్సర శ్రావణ శుక్ల విదియ 22–7–1925న జన్మించారు.

ఇక్కడ మహబూబాబాదును గురించి చెప్పాలి. దాని అసలు పేరు మ్రానుకోట. మ్రానుకోట అంటే చెట్ల కోటగా గలది. ఇది అనాడు మహారణ్య ప్రాంతం. ఆరవ నిజాం మహబూబలీ బాదుషా ఇక్కడికి వేటకు వచ్చాడు. వారి శుభాగమన సందర్భమున మ్రానుకోట మహబూబాబాదుగా మారింది.

చిన్న గూడూరు మ్రానుకోట తాలూకాలోనిది.

ఈ విధంగా మతాంతరీకరించిన మరిన్ని పేర్లున్నాయి. ఇందూరు నిజామాబాదు అయింది. పాలమూరు మహబూబ్‌నగర్ అయింది. ఎలగందల కరీంనగర్ అయింది. ఎద్దులపల్లి ఆదిలాబాదు అయింది. ఇలాంటివే హుజూర్‌నగర్ – హుజూరాబాదు మొదలైనవి.

వాస్తవపు భాగ్యనగరం హైదరాబాదుగా మారెను కదా!

"హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితమ్ ముఖమ్" అంటుంది ఈశావాస్యోపనిషత్తు.

సత్యము యొక్క ముఖమును బంగారు పాత్ర మూసివేసినది. బంగారు పాత్ర అంటే, సంపద కావచ్చు, అధికారం కావచ్చు. ఈ రెండు సత్యపు ముఖానికి మసి పూస్తాయి. ఎలా పూస్తాయీ అంటే మనం మసినే సత్యం అనుకుంటాం!

అధికారము - సంపద అంత దుష్టములు. అంత క్రూరములు. అంతకుటిలములు. అయినా, సమాజం వాటిమీదనే ఆధారపడి ఉంటుంది. అది తప్పదు.

కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ విలపించే సత్యాధిదేవత కన్నీరు తుడిచేవారూ - ఓదార్చేవారూ ఉండరు. ఉండరుగాక ఉండరు. ఇదీ లోకం మహానుభావా!

నా చిన్ననాటి చందమామ చిన్నగూడూరు. అది అందాలరాశి. వప్పాల కుప్ప. వయ్యారిభామ. అది వసంతం. అది గ్రీష్మం. అది హేమంతం. అది శరత్తు. అది వర్షం. అది శిశిరం.

చిన్న గూడూరు కరువనున్న కారు మబ్బు. మబ్బుకు ఎండపొడ తగిలి విరిసిన ఇంద్ర ధనుస్సు. అది వెన్నెల. అది ఎండ. అది పైరగాలి. అది తోట. అది చేను. అది ఏరు. అది వనము.

అది తామరలు నిండి చెరువు. తామరాకుల మీద నీటి బిందువులు. సూర్యకిరణాలకు తళతళలు. విచ్చుకున్న తామరలు - అరవిచ్చినవి - మొగ్గలు. వాటిపై ఝుమ్మని తిరిగే తుమ్మెదలు! అబ్బో - ఎంత అందం! అది అందానికి అందం!! అక్షరానికి అందని అందం.

"తామరపూలు" కథ వ్రాశాను. అదంటే నాకు ముద్దు!

మొత్తం మీద చిన్నగూడూరు ప్రకృతిమయం. అనాకృతమూ - అప్రాకృతమూ ఎరుగని కాలం అది. పంచభూతాలు తమ పనులు తాము చేసుకున్నాయి. వాటిలో మనిషి జోక్యం లేదు. ఈనాటి వలె పంచభూతాలను కలుషితం చేయలేదు. మనిషి వాటిని 'రేప్' చేయలేదు. హింసించలేదు.

'కలుషితం' అనే పదం ఆనాటి భాషలో లేదు. నిఘంటువులో లేదు. మనిషి ఎరుగడు.

చిన్నగూడూరుకు ఒకవైపున "ఆకేరు. నిర్మలంగా స్వచ్ఛంగా ప్రవహిస్తుంది. దానికి కట్టలు లేవు. స్వేచ్ఛగా ప్రవహిస్తుంది. ఆకేరుకూ వరద వస్తుంది. ఉప్పెన వస్తుంది. పొంగుతుంది. మనకు ఏ శాస్త్రమూ తెలియదు, అన్నీ మేమే నేర్పాం అంటారు ఆంగ్లేయులు. మనం బానిసలం కదా - నమ్ముతాం.

వాస్తు తెలియనే తెలియదని తెల్లవారి ముద్రపడిన మన వాస్తు నిపుణులు ఎంతటి వరద వచ్చినా ఊరికి అంటనంతటి భద్రమైన స్థలంలో ఊరు నిర్మించారు. చిన్నగూడూరే కాదు - అన్ని ఊళ్ళు అలాగే నిర్మించారు.

మానవుడు దురాశాపరుడు అయినాడు. ఆ హద్దులను దాటి ఇళ్లు కట్టుకున్నాడు. మునిగాడు. ముంచింది ఆశ - వరద కాదు!

వాస్తు ప్రకారం భద్రాచలం ఆలయ పర్వతం వెనుకది. అది ముంపుకు గురికాదు. దురాశతో గోదావరి ఒడ్డున కట్టినవే మునిగేది.

ఖుతుబ్‌షా భాగ్యనగరం చార్మినార్ నుంచి మొదలవుతుంది. ఎంతటి వరద అయినా మూసీ ముంచలేదు. దురాశవల్లనే భాగ్యనగరం 1908 లో మునిగింది.

చిన్నగూడూరు మరొక వైపు "తుమ్మిడి చెరువు" ఉంది. ఇది పెద్ద చెరువు. దీని కింద రెండు పంటలు పండుతాయి. దీని క్రిందనే మాకు పొలం ఉండింది.

తుమ్మిడి చెరువు నిండుతే "మత్తడి" మీది నుంచి దూకుతుంది. ఆ నీరు "కట్టు కాలువ"లో నుంచి ప్రవహిస్తుంది. కట్టు కాలువ నీరు "ముత్యాలమ్మ కుంట" నింపుతుంది. ఇదే తామరల అందాలరాణి. ముత్యాలమ్మ కుంటనీరు "తిరుమణి కుంట" నింపుతుంది. ఇంకా నీరువస్తే ఏటిలోకి వెళ్లిపోతుంది. గ్రామాన్ని అంటదు.

ఇంజనీరింగ్ తెలియని మన మూర్ఖులు పారుదల విషయంలో ఇంతటి నైపుణ్యం ప్రదర్శించారు!

ఊరిని అనుకుని ఒక పెద్ద మామిడితోట ఉండేది. అది "ధర్మతోట." అది ఒకరికి చెందింది కాదు. గ్రామానిది. ఆ తోట కాయలు అమ్మరు. ఆడుకునే పిల్లలు తప్ప కోయరు! అది పక్షుల ఆహారం కోసం వేసింది. అక్కడ ఎండిన మామిడి ఆకు మీద అడుగువస్తే ఒక లయబద్ధ ధ్వని వచ్చేది. చిలకలు గుంపులుగా కిలకిల లాడేవి. చిలకలు గుంపులుగా ఆకాశానికి ఎగిరితే పంట చేలు ఆకాశంలో తేలియాడుతున్నట్లు ఉండేది.

వీధులు మరీ తిన్నగా ఉండవు. వంకరలుగా ఉన్నా ఏ సందునుంచి వచ్చినా ముఖ్య మార్గానికి కలుస్తాయి. వీధులు శుభ్రంగా ఉండేవి. నిత్యకృత్యంగా అన్ని ఇళ్ళముందూ ఊడిచి పెండనీళ్లు చానిపించల్లేవారు. పచ్చని నేలమీద పడుచు పిల్లలు తెల్లని ముగ్గులు వేసేవారు. ముగ్గు అంటే రాతిపిండి కాదు. వరి పిండి – బియ్యం లేక నూకల పిండి. అది చీమలలాంటి వాటికి ఆహారంగా పనికి వస్తుంది. సాయంకాలం కాగానే ఇళ్లముందరి గూళ్ళలో – ముందు – ప్రమిదలు వెలిగించి పెట్టేవారు. అవి వీధికి వెలుగు! గూటికి అందం!!

ఇదంతా స్వచ్ఛందం. అనూచానంగా వస్తున్న ఆచారం. సంప్రదాయం. దీనిలో ఎవరి బలవంతమూ లేదు. పంచాయతి కమిటీ లేదు. పన్నుల వసూళ్లు లేవు. పదవి కోసం పోరాటం లేదు. డబ్బుకోసం కుమ్ములాటలు లేవు.

ప్రభుత్వం భూమిశిస్తుపై రూపాయికి ఒక అణాచొప్పున లోకల్ ఫండు – స్థానిక నిధి వసూలు చేసేది. సర్కారువారి దయాధర్మాలనుబట్టి అక్కడక్కడా మంచినీటి బావులు ఏర్పరచేవారు.

సర్కారువారి దయా ధర్మాలమీద ఆధారపడక – ధర్మాత్ములు మంచినీటి బావులు – దేవాలయాలు – సత్రాలు నిర్మించేవారు. ఇందుకు ఒక విశిష్టం అయిన వ్యవస్థ ఉండేది. వర్తకులు రూపాయికి ఒక పైస చొప్పున ధర్మఖాతా నిర్వహించేవారు. ఆ డబ్బు విషయంలో మాత్రం మోసం చేయడంగాని – అబద్ధం ఆడడంగాని చేసేవారు కాదు. ఆ డబ్బు ధర్మకార్యాలకే వెచ్చించేవారు.

మరొక విషయం. కీర్తికి అధిక ప్రాధాన్యత ఉండేది. కీర్తికోసం బావులు

తవ్వించేవారు. తోటలు వేయించేవారు. ఇవి సంతానం వంటివి. వీటిని సప్త సంతానాలు అనేవారు.

గృహనిర్మాణం విషయంలో తరతరాలుగా వస్తున్న ఒక వాస్తుపద్ధతిని అనుసరించేవారు. ఇందుకు అనుభవం తప్ప అధ్యయనం లేదు. ప్రతి ఇంటికీ విడిస్థలం తప్పనిసరి. ఇంటి ముందు ఆచ్ఛాదన కింద అరుగులు ఉండాలి. అవి బాటసారులకు ఉపయోగపడడానికి..

మా ఇంట్లోనే కాదు. అందరి కుటుంబాల్లో ఉందనుకుంటా – ఒక మానవతా పూర్ణ ఆచారం. భోజనం చేసేముందు ఇంటి ముందున్న అరుగుల మీద చూడాలి. కుల మతాలతో సంబంధం లేదు. అతడు అతిథి దేవుడు. అతనికి ముందు వడ్డించాలి. అతని భోజనం అయింతరువాతనే ఇంటివారి భోజనం.

**అన్నం అమ్మడం మహాపాపం! పట్టపగలు భోజనానికి వచ్చిన అతిథి ఈశ్వరుడు!**

ఇళ్లు కట్టడానికి గ్రామంలో లభించే పదార్థాలు మాత్రమే వాడేవారు. పనివాళ్లూ ఊళ్ళో వాళ్లే. మేకులు, గొళ్ళేలు, గడియలు వంటి ఇనుప పదార్థాలు బయటినుంచి తెచ్చుకునేవారు. అడవి ఊరు ప్రక్కనే. వాసాలు వగైరా అక్కడివి. నక్కల ఊళలు వినిపిస్తుండేవి. చిరుతపులులు – ఎలుగ్గొడ్ల లాంటివి ఊళ్ళోకి రావడం, ఉమ్మడిగా వాటిని సాగదోలడం సర్వసాధారణం.

ఊళ్లో ఎక్కువ మట్టి ఇళ్లు – పూరిండ్లు. మట్టిగోడలు పెంకుటిళ్లు తక్కువ. పెంకులు కుమ్మరి చేసేవాడు. వడ్లతను –ఉప్పరి అంతా వూరివారే.

గడీ మాత్రం ఇటుక సున్నంతో కట్టిన మేడ. “గడీ” అంటే మహారాష్ట్రంలో కోట అని అర్థం. గడీ అనే పదం అక్కడినుంచే వచ్చింది. దేశ్‌ముఖ్ – దేశపాండ్యా సంప్రదాయం కూడా మహారాష్ట్రులదే. నిజాం రాజులు మహారాష్ట్ర పద్ధతిని తమ రాజ్యమంతటా ప్రవేశపెట్టినట్లున్నారు.

గడీ అంటే దొర ఇల్లు. దాన్నిమించింది ఊళ్ళో ఉండడానికి వీల్లేదు. ఉండదు. ఎంచాతంటే – **భూములన్నీ దొరవే! ఊరు సొంతం దొరకు ఊడిగం చేయడానికే ఏర్పడింది. ఇది దొర అభిప్రాయం మాత్రం కాదు. సమాజం దాన్ని అంగీకరించింది. అలాకాకుంటే ఏ శాసన బలమూ లేకుండా దొరలు అంత విశృంఖలంగా – నిరంకుశంగా పాలించలేరు!**

ఒక కథనం ప్రకారం దొరలే గ్రామాలను ఏర్పరచారు. అడవులు కొట్టించారు. చెరువులు వగైరా సాగునీటి ఏర్పాటు చేశారు. వ్యవసాయానికి, ఆవాసానికి అనువయిన వాతావరణం సృష్టించారు. జనాన్ని పిలిపించి ఊళ్లల్లో ఉంచారు.

గ్రామం ఏర్పడడానికి మొట్టమొదటి అవసరం వృత్తిపని వాళ్లది. • చాకలి, మంగలి, కుమ్మరి, కమ్మరి, కంచరి, వడ్ల, మూల మాదుగులు. వీరు గ్రామానికి సప్తాంగములు. వారిని పిలిపించడానికి ఇనాములు ఇచ్చారు. ఇనాము భూముల మీద సర్కారు కిస్తు లేదు. వీటిని అమ్మడానికి, కుదువ పెట్టడానికి వీలులేదు. వంశపారంపర్యంగా వృత్తులు చేయాలి, అనుభవించాలి. అందువల్ల భూమిలేని వృత్తి పనివారు తెలంగాణంలో లేకుండిరి.

వేల సంవత్సరాల నుంచి వచ్చిన గ్రామ వ్యవస్థ అత్యంత పటిష్ఠం అయింది. ఇది సమాజం ఏర్పరచుకున్నది. రాజకీయంతో ఏమాత్రం నిమిత్తం లేనిది. ఎన్ని దండయాత్రలు జరిగినా. ఎన్ని ప్రభుత్వాలు మారినా ఈ వ్యవస్థ చెక్కు చెదరలేదు!

ఈ వ్యవస్థలో భూమి లేనివాడు, ఇల్లు లేనివాడు, పని లేనివాడు, తిండి లేనివాడు ఉండడు. కాకుంటే వ్యత్యాసాలు విపరీతంగా ఉంటాయి.

పరిపూర్ణం అయిన వ్యవస్థ ప్రపంచంలో లేదు. ఎందుకంటే, సృష్టిలో భగవంతునికి తప్ప దేనికీ పరిపూర్ణత లేదు. దేనికయినా అలవాటు పడాల్సిందే!

వృత్తుల వారికి ఇచ్చిన ఇనాములు ఆంధ్రప్రదేశం వచ్చిం తరువాత పట్టాలు చేశారు. వృత్తి పనులవారు వాటిని అమ్ముకున్నారు. బస్తీలు పట్టారు. ఈ సమస్యను నేను రచించిన "జనపదం" నవలలో చర్చించాను.

దొరల బలం మీద ఊరి ప్రాధాన్యత ఆధారపడి ఉండేది. చిన్న గూడూరు దొరలు రావులవారు. వారు బలవంతులు. కావున ఆ చుట్టుపట్ల గ్రామాలలో దానికి ప్రాధాన్యత వచ్చింది. వర్తకులు తమ భద్రత చూచుకుంటారు. వ్యాపారాన్ని బట్టి ప్రాధాన్యత వస్తుంది. ఈ ఊరిలో యాభైకి పైగా వర్తక కుటుంబాలుండేవి. దుకాణాలు, లావాదేవీలు బాగా ఉండేవి. కాబట్టి చుట్టుపట్ల జనం అమ్మకానికి, ఖరీదుకు, అప్పులకు, దాచుకోవడానికి ఇక్కడికే వచ్చేవారు.

నిజాం రాజ్యంలో పోలీసునాకా – స్కూలు – టపాఖానా ఉన్నది ప్రధాన గ్రామం. ఈ ఊళ్లో ఇవన్నీ ఉన్నాయి. "మాసూమలీ" అనే పోస్టు బంట్రోతు విచిత్రంగా ఉండేవాడు. అతని నడుముకు పటకా, వానికి తళతళమెరిసే ఇత్తడి బిళ్ల. దానిమీద ఊర్దూలో నిజాం సర్కారు ఉద్యోగి టపాజవాను అని వ్రాసి ఉండేది. అతని చేత ఒక బల్లెం. ఆ బల్లానికి గజ్జెలు. గజ్జెలు గలగలలాడిస్తూ ఉరికేవాడు.

టపాపని – మదర్స అంటే స్కూలు సదర్ ముదర్రిస్ అంటే ప్రధానోపాధ్యాయుడు నిర్వహించేవాడు. మదర్సలో ఛౌదీ జమాత్ అంటే నాలుగవ క్లాసువరకు ఉండేది. ముగ్గురు మదర్సీలు అంటే టీచర్లు. ఉర్దూమీడియంలో చదువు.

గడీముందు పోలీసునాకా. దానిముందు వేపచెట్లు. వాటికింద అరుగుంది. దొర అక్కడే ఉండేవాడు. పోలీసులు దొర బంట్రోతులని జనం నమ్మకం. పోలీసుల నమ్మకం కూడా అదే! సరిగ్గా ఎదురు సందులో పట్వారీ – కరణం ఇళ్ళు.

ఇండ్లు మట్టివి అని ఇదివరకు చెప్పాను. కొందరు – కోమట్లవి ఇటుక సున్నం ఇండ్లు ఉండేవి. నేల మాత్రం అలుకే. ఎర్రమన్ను లేక పుట్టమన్ను పేడతో కలిపి అలుకుతారు. దానిమీద నాము ముగ్గు రక రకాలుగా అందంగా పెట్టారు. పండుగలు వస్తే గోడలు కూడా అలికి పట్టెలు పెడ్తారు. పండుగ వస్తే ఊరు కళకళ లాడుతుంది.

అన్ని ఇండ్లకూ బావులు ఉండేవి. మా మాతామహులు భట్టరాచార్యులవారి ఇంట్లో ఎంత తవ్వినా బావిలో నీరు రాలేదు. వారు కొండ్లెవారి ఇంటినుంచి తెచ్చుకునేవారు.

ప్రతి ఇంట్లోనూ ఏవో పండ్ల చెట్లుండేవి. కూరగాయలు ఇండ్లలోనే కాసేవి. సొర పాదులు, గుమ్మడి పాదులు పాకిన గుడిసెలు ఎంతో అందంగా ఉండేవి. కూరగాయలు అమ్మటం ఎరుగరు. ఒకళ్లకు ఒకళ్లు ఇచ్చుకోవడమే! అయితే, ఎండకాలం కూరగాయలు వుండవు. అందుకు సిద్ధంగానే ఉండేవారు. గొయ్యి తవ్వి దోసకాయలు, బూడిదలో పెట్టేవారు. ఒరుగులు, వడియాలు, పప్పాలు, మామిడికాయలు, చింత పండుతో వెళ్లదీసుకునేవారు. తప్పాల చెక్క, ఉప్పాడు పిండి, కుడుములు, అట్లు, గారెలు – అప్పుడు తినే పిండి వంటలు. అరిశెలు, బూరెలు, జంతికలు, చక్కినాలు, చేగోడీలు, అటుకులు, పోపుబియ్యం వగైరాలు – నిలవ ఉండే పిండి వంటలు.

అది వంటరి బ్రతుకు కాదు. ఉమ్మడి బ్రతుకు. నిలవా పిండి వంటలకు ఊళ్లో బంధువులు లంతా కూడుతారు. ముచ్చట్లు, నవ్వులాటలు, పాటలు. పనిలా ఉండదు. ఆటలా ఉంటుంది. ఒక పండుగలా ఉంటుంది.

పాడికూడా సర్వసాధారణం. పాలు అమ్మటం పాపంగా భావించేవారు. దాలిలో కాచిన పాలు – ఎర్రగా మీగడ కట్టి! పాడి ఉన్నా పాలు తాగడం లేదు. టీ కాఫీ పేరు తెలియదు. కవ్వంతో చల్ల చేయడం ఒక కళ. ఆ శబ్దం ఒక స్వరం. వెన్న తీసి నేయి కాస్తుంటే కమ్మని వాసన!

ఏదండీ ఆ నేయి! ఏదండీ ఆ చల్ల!

కాఫీ అంటే ఒక విషయం గుర్తుకు వస్తున్నది. నేను చాల చిన్న వాణ్ణి. మా అన్నయ్య మదర్సలో చదువుతున్నాడు. గుంటూరు నుంచి శేషాచార్యుల వారు వచ్చారు. వారు వైష్ణవపు ద్రావిడ మత గ్రంధాలను తెనిగిస్తారు. తమ ముద్రణాలయంలో అచ్చువేస్తారు. అవి అమ్ముకోవడానికి నైజాంలో సంచారం చేస్తారు. ఆ విధంగా మా ఇంటికి వచ్చారు. వారు "కాఫీ" అన్నారు. ఇంటివారికి అందరికీ ఆశ్చర్యం! వారు కాఫీ చేశారు. అది రుచి చూపించడానికి నేను స్కూలు నుంచి మా అన్నయ్యను పిల్చుకుని వచ్చాను. అది తొలిసారి కాఫీ వినడం – రుచి చూడడం. అది బహుశః 1931. నాకు మూడేళ్లు ఉంటాయి!

వంటకు చాల వరకు అందరూ మట్టి పాత్రలే ఉపయోగించేవారు. మా ఇంట్లోనూ ఒక్క అన్నం వార్చడం తప్ప – కూరలు వగైరాలు మట్టి పాత్రలే. బిందెలు, గుండీలు, కంచాలు మాత్రం ఇత్తడివి. అప్పటివారు చాల ముందు చూపుగలవారు. బల్లపీటలు కుర్చీలు, పాత్రలు ఏమి చేయించినా తరతరాలు ఉండేటట్లు చేయించేవారు.

భోజనాలు విస్తళ్లల్లోనే – అయినా కంచాలుండేవి. వాటికి కళాయి పోసేవారు. చద్దన్నంలో మామిడికాయ పచ్చడి – పేరిన నెయ్యి కలిపేది మా అమ్మ. మా అన్నయ్యనూ, నన్నూ కూర్చుండబెట్టుకునేది. చెరొక ముద్దా పెడ్తుండేది. ఆ ముద్ద అమృతం. అది అమృతానందం!

ఇప్పుడు మృష్టాన్నాలు తింటున్నాం. ఆ ఆనందం రాదు! అది అమ్మ పెట్టింది కదా!

మా అమ్మ 1960లో కన్నుమూసింది.

"దేవుడు లేడనేవాడున్నాడు.
అమ్మ లేదనే వాడున్నాడా?" అని మా అన్నయ్య సినీమా పాట వ్రాశాడు.

"జననీ జన్మభూమిశ్చ" అన్నాడు వాల్మీకి.

వరిపంట తక్కువ. మెరక పంటలు జొన్న, సజ్జలు ఎక్కువ పండేవి. బ్రాహ్మణులు, కోమట్లు, మరి కొందరు సంపన్నులు తప్ప – వరి అన్నం తినేవారు కారు.

వరి ఒకేరకం "కోణామణి" పండేది. బియ్యం దొడ్డువి. ప్రతి బియ్యపు గింజమీదా ఒక ఎర్రటి చార ఉండేది.

నా చిన్నతనంలో గ్రామస్తుల ఒక సంభాషణ విన్నాను.

"సాంబలు వచ్చినయట – ముదనష్టపుపంట. మనిషి తింటే కుట్లు పడ్తయట. గడ్డి గొడ్డుకు వేస్తే వాతం కమ్ముతదట!"

జొన్నలు – సజ్జలు తినేవారు. తెల్లవారు జామున పాటలు పాడుతూ వాటిని దంచేవారు. అది ఒక లయ.

**ఆ జీవితమే ఒక లయ!**

**ఇప్పటివి లయ తప్పిన జీవితాలు!**

ఆ జొన్నన్నం – సద్దన్నం తినేవారు. కంచుతో చేసిన లోయ గిన్నెలాంటి పళ్లెంలో అన్నం వేసుకునేవారు. కంచుడునిండా మజ్జిగ. ఉప్పు, ఉల్లిగడ్డ లేక ఉప్పు పచ్చిమిరపకాయతో తినేవారు.

ఇందులో హెచ్చు తచ్చులు ప్రసక్తి లేదు. ఎవరి అలవాట్లు వారివి!

అనాడు గ్రామం ఉమ్మడిగా జీవించింది. అది వంటరిగా జీవించలేని సమాజం. అనాదిగా వస్తున్న భారత సంప్రదాయం సామాజికం.

"సహనావవతు, సహనౌభునక్తు, సహవీర్యం కరవావహై" అంటుంది కఠోపనిషత్తు.

కలిసి కాపాడుకుందాం. కలిసి భుజింతాం. కలసి ఎదిరింతాం.

చిన్నగూడూరులో కులాలూ మతాలూ ఉన్నాయి. కాని, ఉన్నట్లు కనిపించవు. మహమ్మదీయులు మనవలెనే ఉండేవారు. వారు వేరు అనుకోలేదు. ఇస్మాయిల్ పటేల్ మా అన్నయ్యకు ఉర్దూ చెప్పేవాడు. మాలో కలిసి ఉండేవాడు.

కులాలు స్థిరపడిపోయినాయి. ఎవరి అంతస్తు వారికి తెలుసు. ఉమ్మడిగా ఒక కులం – మరో కులంమీద పెత్తనంలాంటిది లేదు.

పేర్లకు కులాలకు సంబంధించిన తోకలు – రెడ్డి, రావు, ఆచార్య ఉండేవికావు. రంగయ్య, కిష్టయ్య, వెంకటయ్య – అంతే. పేర్లు కావు, వరసలతో పిలుచుకునేవారు.

చాకలి – మంగలి కులాల్లో "కట్టు" అయిక్యత ఎక్కువ. ఒక్కడు కాదంటే అందరు కాదన్నట్లే. ఒకరికి పోటీగా మరొకరు పోరు. ఇది అనూచానంగా వస్తున్న ట్రేడ్ యూనియన్. నేను రచించిన "మోదుగుపూలు" నవలలో మంగళ్ల సంఘటిత శక్తిని చూపించాను.

ఏ కులానికి ఆ కులానికి పెద్ద యింటారు. సాధారణంగా ఈ పెత్తనం వయసును బట్టే వస్తుంది. వారికి ఉన్న – కుటుంబ, కుల సమస్యలను వారే పరిష్కరించుకుంటారు. కుల తప్పుకింద వేసిన జరిమానాలు కులవిందులకే గాని

వ్యక్తికి కాదు. ఇలాంటి ఒక కులపు తగాదాను నా నవల "శరతల్పం"లో చూపించాను. కుల పెద్దలు తీర్చలేని తగాదాలు దొర దగ్గరకు వెళ్తాయి. దొర పరిష్కారానికి సాధారణంగా తిరుగు ఉండదు. దొర పరిష్కారంలో దొర ప్రయోజనం కొంత ఉంటుంది. అయినా ఊరు దాటి కోర్టుకు ఎక్కడం అరుదు.

సర్కారు బడికి పిల్లలను ఎక్కువమంది పంపేవారు కారు. ఉర్దూ చదువు నిత్యజీవితంలో పనికి వచ్చేది కాదు. పెద్ద చదువులు చదివినా – తురకలకు తప్ప – ఉద్యోగాలు రావు. అందువల్ల వీధి బళ్లలో చదువు. అక్షరాలు – పెద్ద బాల శిక్షతో చదువు ముగింపు. నిత్య జీవితానికి అక్కరకు వచ్చేవన్నీ పెద్ద బాలశిక్షలో ఉంటాయి. అంతకుపైన చదవదలచినవారు పండితుల వద్ద పోతన భాగవతం చదివేవారు.

చిన్నగూడురులో అరు శ్రీవైష్ణవ కుటుంబాలు, ఒక బ్రాహ్మణ కుటుంబం ఉండేది. మూడు కుటుంబాలు మా మాతామహుల సహితంగా నాలుగు ఉద్దండ పండిత కుటుంబాలు. ఎవరు కోరినా వారు ఉచితంగా ఆంధ్ర, ద్రావిడ, సంస్కృతాలు బోధించేవారు. వాళ్ల ఇళ్లలో ఉంచుకొని భోజనాలు పెట్టి చదువు చెప్పిన ఉదంతాలు కూడా ఉన్నాయి.

ఊళ్లో ఇద్దరు వైద్యులుండేవారు. ఒకరు మా పితామహులు, ఇంకొకరు వడ్ల కుంట సాయెబు అని గౌండ్లతను. సాయెబుకు భారత భాగవతాలతో కూడా పరిచయం. మా తాతగారికి సాయెబుకు ప్రాణ స్నేహితం. కలిసి తినడం లేదు కాని, వారిది అవ్యాజమైత్రి.

సాధారణంగా మందుల సంచీ తీసుకొని వైద్యులే రోగుల ఇళ్లకు వెళ్లేవారు. రోగులు వైద్యుల దగ్గరికి రావడం తక్కువ. ఒకసారి ఆకాశవాణి వారికి వైద్యాన్ని గురించి ఒక రూపకం వ్రాశాను. అందులో వైద్యుడు రోగి దగ్గరకు వెళ్లడం తెలిపాను. ఇది చైనా పద్ధతి అన్నారు ఆకాశవాణివారు. ప్రాగ్దేశాలు – తూర్పుదేశాలన్నింటిలో అదే ఆచారం అని వివరించాల్సి వచ్చింది.

**మన జీవన విధానం, మనకు తెలియకుండా చేస్తున్నాయి - మన ప్రచార సాధనాలు!**

అసలు జీవన విధానంలోనే ఆరోగ్య సూత్రాలు, వ్యాయామం ఇమిడి ఉన్నాయి. కాబట్టి వైద్యుల అవసరం ఉండదు. ఉదయంలేచి వేపచెట్టు ఎక్కి పళ్లపుల్ల విరుచుకోవాలి. దొడ్డికి చెంబు పట్టుకొని నడిచి పోవాలి. స్నానానికి ఏటికి గాని, చెరువుకు గాని వెళ్లాలి. లేకుంటే బావిలో నీళ్లు చేది పోసుకోవాలి. ఎక్కడికి పోయినా నడిచి పోవాలి. ఇదంతా పురుషులకు స్వతస్సిద్ధంగా జరిగే వ్యాయామం.

స్త్రీలు ఇళ్లు అల్లుక్కోవాలి. దూరం నుంచి మంచినీళ్లు తెచ్చుకోవాలి. వడ్లు దంచుకోవాలి. పప్పులు విసురుకోవాలి. నీళ్లు తోడుకోవాలి. మజ్జిగ చేయాలి. వారి నిత్యకృత్యంలోనే కావలసినంత వ్యాయామం ఉంది.

అవి 'కల్తీ' అనే పదం పుట్టని రోజులు! అన్నీ స్వచ్ఛమైన ఆహార పదార్థాలు. నువ్వుల గానుగనూనె, ఇంటవండిన ఆముదం. తెలియకుండానే స్వచ్ఛమైన వాతావరణం.

అప్పుడు – వైద్యుని అవసరం ఎప్పుడో!

అగ్గిపెట్టె సహితం లేని వ్యవస్థ అది. కుంపట్లో ఊక–పిడక వేసి ఉంచేవారు

ఎప్పుడూ. చిన్నతనంలో నా కాలు కుంపట్లోపడి కాలింది. నూనెరాసి తుమ్మపొడి వేశారు. మరొకసారి రక్త విరేచనాలు అయినాయి. విసపుగోళ్లు ఇచ్చారు. ఇలాంటి గృహవైద్యాలు అందరికీ తెలుసు.

ఆముద ప్రమిద దీపాలు. ఎక్కడో తప్ప కిరసనాయిలు లాంతర్లు ఉండేవి కావు.

అన్నీ మనుషులు కాని, జంతువులు కాని కష్టించి చేయవలసిన పనులే. 'మర' పేరు తెలియదు.

మేరు బసవయ్య ఊళ్లోకి సింగర్ మిషను తెచ్చాడు. అదొక పెద్ద వింత! ఊళ్లకు ఊళ్లు వచ్చి చూచారు. నేనూ, మా అన్నయ్య గంటల తరబడి నుంచోని చూచాం. అదొక వింత అనుభూతి! ఇలా తొక్కగానే చక్రం తిరుగుతుంది. లయబద్ధ ధ్వని, బట్టను కుట్టడం. బహుశః ఇప్పుడు చంద్రుని మీద దిగినా అలాంటి అనుభూతి రాదు.

ముల్కరాజ్ ఆనంద్ అనే మహా రచయిత – ఊరికి కుట్టుమిషన్ రావడం – ఊళ్లో సంచలనం, గురించి ఒక మంచి కథ ఆంగ్లంలో వ్రాశాడు.

వినోదాలకు సంబంధించినంతవరకు వ్యక్తిగా టిక్కెట్టు కొనడం తెలియదు. తోలు బొమ్మలాట – వీధి భాగవతం – పగటివేషాలు – హరికథ – బుర్రకథ వంటివి అన్నీ ఎవరో చెప్పిస్తారు. అంతా వింటారు.

ఊళ్లో రామాలయం ఉంది. ఉత్సవాలు – ఊరేగింపులు – జాతరలు – ముత్తాలమ్మకు బోనాలు – పురాణాలు – సంగీత కచ్చేరీలు – ఇవన్నీ భక్తిపరములయిన ఉచిత వినోదాలు.

పండుగలు కూడా వినోదాలే. నా నవలలు అన్నింటిలో ఒక్కొక్కదానిలో ఒక్కొక్క పండుగను గురించి వ్రాశాను.

వీటన్నింటిపై మహాభూతం దొర! అతని దయాధర్మాలమీద ఊరు బతుకుతుంది. సంపద – అధికారం – రెండూ కలిస్తే ఇక పట్టపగ్గాలు ఉండవు.

భూస్వామ్య విధానపు ప్రథమ లక్షణం ఏమంటే – ప్రజలు దొరను తమ ప్రభువుగా గుర్తించడం. వాస్తవంగా దొరలకు శాసన ప్రకారం ఎలాంటి అధికారాలూ లేవు. పట్వారి అంటే కరణానికి ఉన్నాయి. అయినా దొరపెత్తనమే చెల్లుతుంది.

దొరతనపు ముఖ్య లక్షణం ఊళ్లో ఉన్న మంచి వస్తువులన్నీ గడీలోనే ఉండాలి. బయట ఉంటే గడీలో తెచ్చిపెట్టుకోవాలె.

తెలంగాణా పల్లెలో దొరపోలిక పిల్లలు ఉండేవారు. అందుకోసామెత ఏమంటే "దొరకు పుట్టినోడు దొరికాదు. దొర్సానికి పుట్టినోడు దొర."

ఆడ బాపలనేది ఒక దుర్భరం అయిన ఆచారం! తరతరాలుగా వారు వేశ్యల అన్న హీనం అయిన జీవితం గడుపుతారు. దొర బంధువుల గదుల్లోకి పోవాలి. వారి కామ తృష్ణను తీర్చాలి. ఈ అమానుషం అయిన వ్యవస్థను తెలుగుసాహిత్యంలో తొలిసారిగా నా "చిల్లర దేవుళ్లు" నవలలో చిత్రించాను. నేను కల్పించిన పాత్ర నాకు గర్వం కలిగేంతగా ఎదుగుతుంది! రచయితకు అంతకంటె పరమానందం ఏముంటుంది? వనజ కల్పిత పాత్ర! అయినా, ముద్దొస్తుంది నాకు. అంత అందంగా నేను వనజను చెక్కాను.

"జోనతర్వేతో పత్థర్ థే – జో తర్వేతో ఖుదా బన్ బైదే"

తరచుకున్న రాళ్లు – తరచిన దేవుళ్లు!

వనజ నా మస్తిష్కంలో ప్రభవించడానికి స్ఫూర్తినిచ్చిన ఒక ఉదంతం వివరిస్తాను.

నేను చిన్నవాణ్ణి. బహుశా నాలుగేళ్లుంటాయి. గూడూరులో మా ఇంటి పక్కన "అమృతపాణి" అని ఆడబాప ఉండేది. ఆమె చాల అందమైంది. స్త్రీలు మోహించేంత అందం ఆమెది. ఆమె చేతి మీద "అమృతపాణి" అని పచ్చపొడుపు ఉండేది. ఆమెకు ఒక కూతురు. పేరు పిచ్చి. చింతచెట్టు కింద మాతో ఆడుకోవడానికి వచ్చేది. అమాంతంగా మానేసింది. అంతగా పట్టించుకోలేదు. అమృతపాణిని – అమృతవాణిగా "జనపదం"లో పాత్రను చేశాను.

ఒకనాడు చింతకింద ఆడుకుంటున్నాం. దొర మనుషులు వచ్చారు. మేము ఆటలు మానాం. నిలుచున్నాం. చూచాం.

దొరమనుషులు అమృతపాణి ఇంట్లో చొరపడ్డారు. వారిని చూచి పిచ్చి ఉరుకుతున్నది. అమృతవాణి బ్రతిమాలుతున్నది. పిచ్చి వినడం లేదు. తుదకు దొర మనుషులు పిచ్చిని పట్టుకున్నారు. కాళ్లు చేతులు పట్టుకొని గుంజుకొని వచ్చారు. పిచ్చిని కాళ్లు చేతులు పట్టుకొని గడీలోనికి తీసికెళ్తున్నారు.

నా చిన్న మనసుకు ఏదో అన్యాయం జరుగుతున్నదని అనిపించింది. "దౌర్జన్యం" అనే పదం అప్పటికి తెలియదు. నేనూ పిచ్చిని లాక్కుపోయే మనుషుల వెంట వంటరిగా వెళ్ళాను. అందరూ చూస్తున్నారు. ఒక్కడూ కదల్లేదు. నేను గడీదాకా వెళ్లాను. ఇంకా పిచ్చి గుంజుకుంటున్నది. ఏడుస్తున్నది.

పిచ్చిని గడీ గేట్లోకి తీసికెళ్ళారు.

గడీగేటు మూసివేశారు.

నేను వంటరిగా అక్కడ నుంచున్నాను. కాస్తసేపు ఉన్నాను. అశక్తుడను అయినట్లు తిరిగి వచ్చాను.

ఒకనాడు గడీకి వెళ్ళాను. దొర్సానికి పిల్లలు లేరు. నేనంటే ఇష్టపడేది. అప్పుడప్పుడూ వెళ్లేవాణ్ణి. పండ్లు మాత్రం తినేవాణ్ణి. ఇంకేం పెట్టినా 'కులం చెడుతుంది' అనేవాణ్ణి. నా నోట ఆ మాట ముద్దుగా ఉండేది ఆమెకు. అందుకోసం ఏదో పెడ్తానంటుండేది.

ఆరోజు గడీముందే భయంకరం అయిన దృశ్యం కనిపించింది. ఒకణ్ణి గొలుసులకు కట్టారు. దొర అరుగు మీదినుంచి పురమాయిస్తున్నాడు. మనుషులు కొడ్తున్నారు. వాడు దెబ్బలకు తాళలేకపోతున్నాడు. మొత్తుకుంటున్నాడు. రక్తం కూడా వస్తున్నది.

మళ్లీ అది అన్యాయం అనిపించింది.

దొర నన్ను పిలిచాడు, లోపలికి రమ్మని.

నేను వెనక్కు తిరిగి మా ఇంట్లో పడేదాకా పరిగెత్తాను.

ఇదే నా "చిల్లరదేవుళ్లు" నవలలో పేరిగాని ఉదంతం అయింది.

దొరల దౌర్జన్యాలు, ప్రజల పోరాటాలు ఇతివృత్తంగానే "చిల్లరదేవుళ్లు" "మోదుగుపూలు" "జనపదం" నవలలు వ్రాశాను.

చిన్నగూడూరు దొర రామరెడ్డిని సాయుధ పోరాటంలో కమ్యూనిస్టులు కాల్చి చంపారు.

నా బాల్యంలోనే బ్రిటిషిండియాలో పరిశ్రమలు మొదలయినాయి. పల్లెలనుంచి వలసపోవడం ప్రారంభం అయింది. చిన్నగూడూరునుంచి ఒకటి రెండు పద్మశాలి కుటుంబాలు షోలాపూర్ వెళ్లిపోయాయి.

మేముకూడా చిన్ననాటి చిన్నగూడూరు వదిలే పరిస్థితి వచ్చింది.

మా నాయనగారి సంపాదన గూడూరులో లేదు. ఉన్నపొలం సాగు చేయడం చేతకాదు. వారు పురాణాలు – కాలక్షేపాలు చెప్పి ఆచార్యత్వంగా ఆర్జించేవారు. గూడూరు నుంచి ప్రయాణ సౌకర్యం లేదు. బండ్లు కట్టుకొని మానుకోటకు రైలుకు వెళ్లాలి. అది వారికి కొంత ఇబ్బంది కలిగించింది.

మా అన్నయ్యకు గూడూరు చదువు అయిపోవచ్చింది. అప్పటికి మా కులం వాళ్లతో సంప్రదాయ విద్యలోనే ఉన్నారు. కాని మానాయన కాలగమనం కనిపెట్టినట్టున్నారు. మా అన్నయ్యకు "మ్లేచ్ఛవిద్య" చెప్పించడానికి నిర్ణయించారు.

ఈ సమయంలో మా తాతలకు, నాయనకు ఘర్షణ జరిగినట్లున్నది. మా నాయన మా మాతామహులు భట్టరాచార్యుల వారిని బహిష్కరించారు.

మాతామహులకు మా అమ్మ వేంకటమ్మ పుట్టగానే భార్యా వియోగం జరిగింది. తరువాత సీతమ్మగారు మా అమ్మమ్మ అయింది. ఆమెకు సంతానం లేదు. మేమంటే ఎంతో ప్రేమగా చూచేది. ఒకప్పుడు మా అన్నయ్యను పెంపుడు తీసుకోవడానికి కూడా ప్రతిపాదించారు. ఎందుకో తెలియదు. బద్ధవైరం ఏర్పడింది.

మా అన్నయ్యా, నేనూ అమ్మమ్మ ఇంట ముందుపడి ఏడ్చేవాళ్లం. మా తాతయ్య, అమ్మమ్మ లోపల ఏడ్చేవారు. మా నాయన భయానికి తలుపు తీసేవారుకాదు. మా నాయన మా ఇద్దరినీ లాక్కుపోయేవాడు.

బహుశా ఊరు మండడానికి ఇది కూడా ఒక కారణం కావచ్చు.

మా తాతలు ఇద్దరూ బావ – బావమరదులు – వారు సఖ్యంగా ఉండేవారు. తనవాళ్లకోసం లక్ష్మణాచార్యులువారు మద్రాసు వదలి వచ్చారు. వారికి గూడూరు వదలడం ఇష్టంలేదు. ఈ విషయంలో తండ్రీ కొడుకులకు ఘర్షణ. మా నాయనమ్మ కొడుకు పక్షం. మా అమ్మను అడగడం లేదు సరే తల్లిగారింటికీ పోనియ్యడం లేదు!

లక్ష్మణాచార్యులవారు వృద్ధులు అయినారు. కొడుకు మీద ఆధారపడవలసిన దశకు చేరుకున్నారు. వారిమాటకు విలువలేకుండా పోయింది! తాను కొడుకు కోసం చేసినవన్నీ ఏకరువుపెట్టవలసి వచ్చింది. ఇది దయనీయస్థితి!

అయినా, మా తండ్రిగారు గూడూరు వదలడానికి నిశ్చయించుకున్నారు. ఖమ్మం చేరాలనుకున్నారు.

చిన్నగూడూరుకు వీడ్కోలు చెప్పేరోజు రానేవచ్చింది.

మా నాయన్ను రక్షించుకోవడానికి తరలివచ్చిన ఊరు, మా నాయనను కాపాడిన ఊరు, మా తాతయ్యకు గ్రాసవాసములు సమకూర్చిన ఊరు, వారికి అనేక అనుబంధాలు పెనవేసిన ఊరు, మా అమ్మకూ నాయనకూ పెళ్లి జరిగిన ఊరు, మా నాయనను మద్రాసు పంపి విద్వాంసుని చేసిన ఊరు, మా నాయనమ్మ

తల్లిగారి ఊరు, మా అమ్మ పుట్టిన ఊరు, మా అన్నయ్యా, నేనూ పుట్టిన ఊరు, మా బంగారు బాల్యం కొంత గడచిన ఊరు, మా అమ్మమ్మగారి ఊరు, ముత్తాలమ్మకుంటలో తామరల ఊరు, మా నర్సిగాని ఊరు, మా సీత ఊరు, నా బాల్యపు చందమామలోని పొన్నచెట్టు కింద ఆడుకున్న ఊరు, కంటికి దూరం దూరం కానున్నది. మనసులో కాపురం పెట్టింది. కదలనంటున్నది.

**మంచి గంధపు చెక్క మా ఊరు - గూడూరు**

**చూడవస్తిర మీకు శుభము పలికేము**

**మనసీయ వస్తిరా మరచిపోతారు**

**మనువాడ వస్తిరా మరలిపోలేరు**

ఆనాడు బండ్లు వచ్చి ఇంటిముందు నిలిచాయి. బండ్లను దించారు. ఎడ్లను విప్పారు.

ఏదో సానుతాప వాతావరణం కమ్ముకున్నది.

ఒకరొకరుగా జనం కూడుతున్నారు. వింత వాతావరణాన్ని చూస్తున్నారు. వ్రేళ్లు ఊడ పీక్కొని ఊరు వదిలి పోవడం ఇదే తొలి అనుభవం ఊరికి!

మా నాయన అడావుడిగా ఉన్నారు. మనుషులు మంచాలు, పెట్టెలు, మనుండిగలు, పాత్రలు, పరపులు ఇంట్లోంచి తెస్తున్నారు. బండ్లలో నింపుతున్నారు.

మా తాతయ్య, వడ్లకుంట సాయెబు సహితంగా చింతచెట్ల కింద కూర్చున్నాడు. **వసిష్ఠుని ఆశ్రమం నుంచి విశ్వామిత్రుడు లాక్కుపోతున్న శబళలా ఉన్నారు వారు.** మళ్ళీ కలుస్తామో లేదో అన్నట్లు మిత్రులు ఇద్దరూ మనసులు ఒలకపోసుకుంటున్నారు.

**మా అమ్మ పెరట్లో - బావిదగ్గరి నారింజ చెట్టుకింద - శింశుప క్రింది సీతలా కూర్చుని ఉంది.** నేను కాస్సేపు ఆమె వడిలో, కాసేపు అటూ ఇటూ తిరుగుతున్నాను. మా అన్నయ్య గ్లాసులు, చెంబులు అందిస్తున్నాడు.

వీధిసాంతం జనంతో నిండిపోయింది.

బండ్లకు ఎడ్లను కట్టారు. మా నాయనమ్మ బండి ఎక్కింది.

మా అమ్మను బండి ఎక్కించారు. నన్నూ మా అన్నయ్యనూ ఎక్కించారు.

మా తాతయ్య – సాయెబు చేయి పట్టుకొని సాగాడు. ఇంటిముందరి అరుగుల మీద కూలబడ్డాడు. దర్వాజ చూచాడు. తాళం కనిపించింది. దుఃఖం పొంగివచ్చింది. పెద్దగా ఏడ్చాడు!

కూడిన జనం సాంతం కంటతడి పెట్టుకుంది. కళ్లు తుడుచుకుంది.

ఊరిమీద దుఃఖపుమేఘాలు కమ్ముకున్నాయి.

బాష్పవర్షం కురువనున్నది. కురువలేదు.

సాయెబు మా తాతయ్యను ఓదార్చాడు. తన కండువాతో మా తాతయ్య కళ్లు తుడిచాడు. ఇద్దరూ బండ్లవెంట సాగారు.

బండ్లు మలుపుకు చేరుకున్నాయి.

మా అమ్మమ్మ – తాతయ్య కన్నీటి పచ్చికుండలు తలమీద పెట్టుకుని నుంచున్నారు.

మా అమ్మ వారిని చూచింది. ఓర్చుకోలేకపోయింది. భోరుమని ఏడ్చింది.

దూరంగా మా అమ్మమ్మ తాతయ్యల తలలమీది పచ్చికుండలు పగిలాయి!

**తల్లిదగ్గరకు పోనున్న బిడ్డను లాక్కుపోతున్నట్లు బండ్లు కదిలాయి.**

తాతయ్యకు అమ్మ, అమ్మకు తాతయ్యా దూరం అయినారు. మసకమారారు, మాయం అయినారు.

దారికి ఇరుపక్కలా అడా, మగా, పిల్లలూ బారులు తీరి నిలిచారు.

గడీ ముందు రంగారెడ్డి గారు కనిపించారు. తాతయ్య దుఃఖం మళ్లీ పొంగింది. మళ్ల చూస్తనో లేనో అని భళ్లు మన్నారు. దొరవారు ఓదార్చారు. కొంతదూరం అడుగులు వేశారు. నిలిచిపోయారు.

ఊరు దాటింది. జనం పల్చబడ్డారు. బండ్ల వెనుక తాతయ్య – సాయెబు వస్తున్నారు.

ఆకేరు అడ్డం వచ్చింది. మౌనంగా పారుతున్నది.

"ఓద కాన్తం స్నిగ్ధోజనో అనుగన్తవ్య" – ఆత్మీయులను నీటివరకే సాగనంపాలి.

మర్రిచెట్టు కింద తాతయ్య – సాయెబు కౌగిలించుకొని ఏడ్చిన దృశ్యం ఈనాటికీ మనసును కలతపెట్తుంది.

వారి ఆర్తనాదానికి ఏరు నిశ్చలమై నిలిచింది.

చెట్లు – పుట్టలు, జంతువులు – పక్షులు, కొండలు – కోనలు కో అంటే కో అన్నాయి. గుండెలు చెమర్చాయి. కన్నులు కొలకులు అయినాయి.

కాలం కరకుది. అది దేనికోసమూ ఆగదు.

ఏటి వడ్డున సాయెబు.

తాతయ్య సాగిపోతున్నాడు.

ఈ ఒడ్డున తాతయ్య.

ఆ ఒడ్డున సాయెబు.

ఇద్దరు కర్రలు ఊపి శలవుతీసుకున్నారు.

ఇద్దరూ వెనుదిరిగి సాగిపోయారు.

**స్నేహానికి కులాలు, మతాలు, దేశాలు, ప్రాంతాలు అడ్డుకావు. స్నేహం మానసికం అయింది. మనసుకు కులమతాలు లేవు.**

సాయెబు గొండ్లు – మా తాతయ్య బ్రాహ్మణుడు! ఒక్క భోజనం దగ్గర తప్ప వారిలో భేదం కనిపించలేదు.

**ప్రణయానికి అవసరం ఉంది. స్వార్థం ఉంది.**

**స్నేహానికి అవసరం లేదు. స్వార్థం లేదు.**

**మంచి స్నేహితుడే – మనిషికి మహాసంపద!**

మిత్రుడు లభించడం కన్న మహాభాగ్యం జీవితంలో మరొకటి లేదు.

బండ్లు సాగిపోతున్నాయి. ఎల్లంపేట దగ్గర వరంగల్లు – ఖమ్మం రోడ్డు ఎక్కాయి.

అది కంకర రోడ్డు. ఆ రోడ్డు మీద అరోజుల్లో రోజుకు ఒకటి రెండు చిన్న సైజు బస్సులు నడిచేవి. లారీ అనే పేరు ఆనాటికి తెలియదు. ప్రైవేటు వాహనాలు అరుదు. బస్సు ఎంతో దూరంలో ఉండగా రొద వచ్చేది. ఆ రొదకు రక్కసిని చూచినట్లు – ఎడ్లు బెదిరేవి! బండ్లవాళ్లు దిగి – వాటిముందు నుంచునేవారు.

బస్సు దాటిపోయి, దాని రొద దూరం అయ్యేవరకు అదే విధంగా నుంచునే వాళ్లు! అంత జాగ్రత్త పడినా ఒక్కొక్కసారి ఎడ్లు బెదిరి – బండిని లాక్కొని పోయి బోల్తాపడేసేవి!

**దుఃఖం సుఖం ఏదీ శాశ్వతం కాదు.**
**కాలం అన్ని గాయాలను మాన్పగల మందు!**
గూడూరుతోపాటే దుఃఖం దూరం అయింది.
మధ్యన వంటలు – భోజనాలూ అయినాయి.
మా బండ్లు ఖమ్మంమెట్టు చేరుకున్నాయి.

# నాలుగు

## వెలుగు వాకిలి:

అంగీరస 1932లో మేము ఖమ్మం చేరాం. అప్పటికి నాకు నాలుగేండ్లు.

బండ్లు ఖమ్మంమెట్టు వంతెన వద్దకు చేరుకున్నాయి. బండిముందున్నారు మా నాయన. నేను లోన ఉన్నాను. నాయన నన్ను బయటికి తెచ్చారు. రెండు చేతులతో ఎత్తారు. నాకు కారును చూపారు. అది ఎర్రగా ఉంది. దాని కప్పు కాన్వాసుది. చూస్తుండగానే అది మమ్ములను దూసుకొనిపోయింది. దుమ్ములేపి పోయింది. జీవితంలో కారు చూడడం అదే తొలిసారి.

అయితే ఆ కారు నామీద అంత ప్రభావం వేసినట్లు కనిపించడం. మున్నేరు – దాని మీద వంతెన నన్ను ఎంత ప్రభావితుణ్ణి చేశాయో! నేను గూడూరులో ఆకేరు చూచాను. దాని ప్రవాహం చూచాను. కానివంతెన – వారధి చూడలేదు. అది నాకు ఎంతో నచ్చింది. దిగువ పారుతున్న నది. దాని మీద వంతెన. వంతెన మీద సాగుతున్న బండి. ఏదో వింత! ఆశ్చర్యం! అబ్బురం! నాయన వడిలో కూర్చుని బండి వంతెనమీద నుంచి ఏరు దాటడాన్ని ఎంతో ఆసక్తిగా చూచాను.

ఆశ్చర్యం నా మనోఫలకం మీద చెరగని ముద్ర వేసింది. ఈ నాటికీ – అరవై ఐదు ఏళ్ల తరువాత – ఆ దృశ్యం తడి తడిగా నిత్య నూతనంగా కనిపిస్తూనే ఉంది. కనిపిస్తూనే ఉంటుంది.

**జీవితంలో మిగిలేవి గుర్తులే – అవి తీపివి అయినా చేదువి అయినా! ఆ గుర్తుల సంపదను మించింది ఎవరూ ఆర్జించలేరు!!**

మా నాయన విద్వాంసులు. అఖండ పాండిత్యం గలవారు. మంచి వక్త. వేదాంతంలో ఎంత కఠిన విషయాన్నయినా ఎంతో తేలిగ్గా బోధించగలరు. వారు ఎంతటి వారినైనా తనను వాక్పటిమతో వశం చేసుకోగలరు. అది మా కుల వృత్తి. అయినా మా నాయన దగ్గర ఉన్న శక్తి అపారం!

వారు అప్పటికే మా కోసం ఒక ఇల్లు సిద్ధం చేసి ఉంచారు. అది గుంటమల్లన్న బజారులో, చాకలి బజారుకు వెళ్లే సందు పక్కది. అది విశాలమయిన ఇల్లు. ఆ రోజులే విశాలములు. ఇరుకులు కావు. ఆరు పెద్ద గదులు. ముందరి వసారాకు

ఇనుపసీకులు – వెనుక చాకలి బజారు వరకు దొడ్డి. ఇంటిముందు మురికి పోయేందుకు రాతితో కట్టిన కాలువ. విశాలమయిన రోడ్డు!

బండ్లు ఆ ఇంటి ముందు ఆగాయి. మా నాయన శిష్యులు వచ్చారు. వారి మనుషులు వచ్చారు. సామానులు దించారు. నాకూ మా అన్నయ్యకు అడావుడి. మేము చెంబు, తప్పేలా చేరవేశాం. ఇంటినిండా సామాను పరుచుకుంది. ఇంక సర్దుకోవాలి. చూడమ్మగారు వచ్చారు. వారి ఇంటికే సాపాటుకు రమ్మన్నారు.

చూడమ్మలు చాలామంది ఉన్నారు. అది వైష్ణవనామం. శూడిక్కుడుత్తనాచ్చియార్ – దానికి సంక్షిప్తం చూడమ్మ. తన తలలో పెట్టుకొని సమర్పించిన అమ్మ అని ఆ అరవ పేరుకు అర్థం. దానికి సంస్కృతం "అముక్త మాల్యద" – ఆ పేరిట శ్రీకృష్ణదేవరాయలు ఒక మహాకావ్యం రచించాడు. అది వారి పాండిత్యంకే కాక – వారి లోకజ్ఞతకూ నిదర్శనం.

తమిళ ప్రాంతపు శ్రీవిల్లిపుత్తూరు. వైష్ణవ మహానుభావుడు విష్ణుచిత్తుడు. వారికి తులసివనంలో ఒక పసిపాప లభించింది. ఆమె ఆండాళు. విష్ణుచిత్తునకు రంగనాథుని కైంకర్యమే వృత్తి. వారు రోజూ పూలు తెచ్చి సాయంకాలం మాలలు అల్లి ఉంచేవారు. ఆండాళు వాటిని తన తలలో ముడుచుకుని – బావిలోని నీటిలో తన రూపం చూసుకుని మురిసి – మళ్లీ యథా స్థానంలో ఉంచేది. అలా ఆమె ముడుచుకుని తీసిన పూలను విష్ణుచిత్తుడు రంగనాథునికి అర్పించేవారు – ఆ విషయం తమకు తెలియకనే!

ఒకనాడు విష్ణుచిత్తులు ఆండాళు పూలు ముడుచుకోవడం చూచారు. వారించారు. వేరే పూలు తెచ్చారు. మాలలు కట్టారు. స్వామి వారికి సమర్పించడానికి తీసికెళ్లారు. స్వామి వాటిని స్వీకరించలేదు. ఆండాళు ధరించిన పూలే తమకు ఇష్టం అన్నారు. ఆనాటి నుంచి ఆండాళు ముడుచుకొని తీసిన పూలనే రంగనాథునికి సమర్పించారు. అందువలన ఆమె పేరు శూడిక్కుడుత్త నాచ్చియార్ – ఆముక్త మాల్యద అయింది.

ఆండాళు 30 పాశురాలుగల తిరుప్పావై రచించింది. పాశురం అంటే పద్యం. తిరుప్పావై తమిళ సాహిత్యానికి మకుటాయమానం. ఆ గ్రంథాన్ని అనుసరించే వైష్ణవులు మార్గశిర మాసంలో "మార్గళి" నిర్వహిస్తారు. ఆమె కవిత్వం అత్యంత సుందరం అయింది. "మదినిరయంద నన్నాళాళ్" – మనసును మురిపించే వెన్నెల రోజులు అంటుంది.

చూడమ్మగారు మాకు దగ్గరి బంధువు – నా భార్య కమలకు అమ్మమ్మ అవుతుంది. అంటే, సాక్షాత్తు కమల అమ్మమ్మకు స్వంత అక్కగారు. చూడమ్మ గారు ఆత్మవిశ్వాసం, స్వాభిమానంగల వ్యక్తి.

చూడమ్మగారి అత్తగారిది హైదరాబాదు దగ్గరలోని బహద్దూర్ గూడెం. ఆమె భర్త మంచి వ్యవహర్త. ఇండ్లు, తోటలు, దొడ్లు కలవాడు. వారు అకాల మృత్యువాత పడినారు. ఆమె వయసులోనే విధవ అయింది. అక్కడివారు ఆస్తులన్నింటినీ కాజేశారు. ధైర్యంగా ఎదిరించింది. ఓడింది. ఆస్తులన్నింటినీ వదిలింది. ఆత్మ విశ్వాసంతో ఖమ్మానికి – తన తమ్ముడు రత్నమాచార్యులవారి దగ్గరకు వచ్చింది.

వారి దగ్గరగా ఉండలేదు. ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నది. స్వతంత్రంగా పూటకూళ్ళు – అంటే, భోజన హోటలు – పెట్టింది.

ఖమ్మం చుట్టుపట్ల ఉన్న కరణాలూ, వైష్ణవులు కచ్చేరీ, అంటే ఆఫీసు పనుల మీద ఖమ్మం వచ్చేవారు. ఆ రోజుల్లో భోజనాల విషయంలో కుల నియమాలు గట్టిగా పాటించేవారు. వారికి చూడమ్మగారి పూట కూళ్లే శరణ్యం. అలా వచ్చిన వారు చూడమ్మ గారికి పావలా ఇచ్చి పోయేవారు. ఆమె మధ్యాహ్నానికి వారికి సంతృప్తిగా భోజనం పెట్టేది. ఆ వచ్చిన వారు పూట కూళ్ళకు వచ్చినట్లు కాక బంధువుల ఇంటికి వచ్చినట్లు భావించేవారు.

చూడమ్మగారు అందరినీ తమ బంధువులుగానే భావించేవారు. పేదవారిని అనేకమందిని ఆమె పోషించారు.

చిన్నగూడూరులో అన్నం – పాలు – కూరగాయలు అమ్మడం పాపంగా భావించేవారు. బస్తీలలో దిక్కులేని విధవలు మాత్రమే అన్నం అమ్ముకునేవారు. శ్రీనాథుడు "విశ్వస్త వడ్డించగా" అన్నాడు. అంటే – విధవరాలు వడ్డించిందని అర్థం. గురజాడవారి కన్యాశుల్కంలో పూటకూళ్ళమ్మ కూడా విధవరాలే! ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశంగారి విధవ తల్లి ఒంగోలులో పూటకూళ్లు పెట్టి కొడుకును చదివించింది. అంటే, అన్నం అమ్ముకోవడం విధిలేని దశలోనే జరిగింది!

ఇప్పుడు అన్నం అమ్ముకోవడం ఒక పెద్ద పరిశ్రమగా మారింది. శ్రీమద్భాగవతంలో చెప్పిన కలియుగ లక్షణాల్లో అట్టి "శూలాన్యధికో భవంతి" – హోటళ్లు ఎక్కువ అవుతాయి. అని చెప్పడం జరిగింది. ఈ యుగం లక్షణాలను వ్యాసుడు ఎంతో ముందుగా దర్శించాడు.

శ్రీమద్భాగవతం పన్నెండవ స్కందంలో నేను అనువదించిన వానిని ఉటంకిస్తాను.

"కలికాలమున దినదినమునకు ధర్మము, సత్యము, శౌచము, క్షమ, దయ, ఆయుష్షు, స్మృతి లోపించును. ధనమున్నవాడే ఆచారవంతుడు, గుణవంతుడు, బలవంతుడు, ధర్మపరుడు, న్యాయపరుడు, సర్వనియంత అగును. పెళ్లిళ్లలో కులము, యోగ్యత, శీలము చూడరు. వరునకు కన్య, కన్యకు వరుడు నచ్చిన వివాహములగును. నిజాయితి లోపించును. మోసము చేయగలవాడు, అబద్ధము లాడగలవాడు వ్యవహార దక్షుడగును. స్త్రీ విలువ – శీలముపై కాక, ఆమె రతి కౌశల్యముపై ఆధారపడి ఉండును. బ్రాహ్మణుని బ్రాహ్మణత్వము బ్రహ్మజ్ఞానము వలన కాక – జందెము వలన వ్యక్తమగును. బ్రహ్మచారులుగాని, సన్యాసులుగాని ఆశ్రమ ధర్మములను పాలించరు. వేసిన వేషముతోే తృప్తి చెందెదరు. వాగినవాడు పండితు డగును. అసాధుత్వమే సాధుత్వము. అసౌజన్యమే సౌజన్యము, స్వీకారమే వివాహమగును. దూరముగా ఉన్న బురదగుంట తీర్థము, వెంట్రుకలు పెంచుట లావణ్యము, కడుపు నింపుకొనుట పురుషార్థము, కుటుంబ పోషణే ఘనకార్యము, యశస్సు కోరుటే ధర్మ సేవనము అగును. ఇట్టి దుష్ట జనులే లోకమంతటను నిండియుందురు."

ఇది ఈ కాలమునకు ఎంత వరకు అన్వయించినది పరిశీలించాలి. సామాజిక శాస్త్రంలో భారతీయులు చేసినంత కృషి, ఏర్పరచిన ఆచారములు, చేయించిన ఆచరణలు మరొకరు చేయలేదు. ఇది గ్రహించడానికి మనం ముందుగా పాశ్చాత్య బంధనాలను పటాపంచలు చేసుకోవాలి. ఆ బంధాలు మన ఆలోచనలకు సంకెళ్లు వేశాయి!

చూడమ్మగారు విధవరాలు, పేదరాలు, పూటకూటి ఇంటిది, బంధుత్వంతో మమ్ములను భోజనానికి ఆహ్వానించింది. మేము సహితము ఆమె అంతస్తును గురించి ఆలోచించలేదు. స్థిరపడేవరకు వారి వెంటనే భోజనాలు చేశాం.

చూడమ్మగారికి సంతానం లేదు. ఆమె చెల్లెలు రాగమ్మగారి కూతురు సింగరమ్మను పెంచుకున్నది. సింగరమ్మత్తయ్య చాల అందంగా ఉండేది. ముట్టితే మాసిపోతుంది అనిపించేది. ఆమె ఆనాటికే స్నోలు, పౌడర్లు, సబ్బులు వాడేది. అది మాకు విచిత్రం. అప్పటికే ఆమెకు పెళ్లయింది. వారు మాకు వరుసకు మేనమామ. ముఖాన స్ఫోటకం మచ్చలతో అనాకారి కాకున్నా అత్తయ్యకు తగినవాడు కాడు.

సింగరమ్మత్తయ్యకు నేనంటే ఎంతో ఇష్టం. ఆమె నన్ను ఎత్తుకొని ముద్దులాడేది. అదేదో మహదానందంగా ఉండేది. ఎప్పుడూ ఆమె ఒడిలోనే ఉండిపోవాలనిపించేది. అందువల్ల స్థిరపడిన తరువాత సహితం ఎక్కువ సింగరమ్మత్తయ్య దగ్గిరే ఉండేవాణ్ణి. అప్పటికి నాకు ఇంకా పుట్టు వెంట్రుకలు తీయలేదు. అత్తయ్య నాకు జడవేసి, కాటుక పెట్టి "నువ్వు రంగమ్మవు" అని నన్ను ముద్దులాడేది. ఆమె ముద్దుల్లో నేను పరవశం అయ్యేవాణ్ణి.

అత్తయ్య నాకు సబ్బు రాయడంగాని, స్నో పౌడర్లు వేయడంకానీ చేసేది కాదు. ఎంచాతంటే, మావాళ్ల దృష్టిలో అవి బ్రాహ్మలు వేసుకునేవి కావు. భోగం వాళ్లు వేసుకునేవి! అందుకే అత్తయ్యను వాళ్లు దూరంగా ఉంచేవాళ్లు. నన్ను అక్కడికి వెళ్లనిచ్చేవాళ్లు కారు. అయినా నేను దొంగతనంగా పోయేవాణ్ణి. ఆమె ఒడిలో ఒదిగిపోయేవాణ్ణి.

చూడమ్మ అమ్మమ్మ ఇంటికి తరచువెళ్లడానికి మరొక కారణం ఉంది. వాళ్ల వాకిట్లో కూర్చుంటే వచ్చే పోయే బస్సులు కనిపించేవి. అప్పుడు ఖమ్మం నుంచి రెండు బస్సులు సూర్యాపేటకు, రెండు బస్సులు వరంగల్లుకు వెళ్లటం – రావటం జరిగేది. అవీ చిన్నవిగా ఉండేవి. అన్నయ్యా, నేనూ వచ్చే పోయే బస్సులను చూచి మురిసిపోయేవాళ్ళం.

అప్పుడు బస్సుల డిపో సరిగ్గా స్టేషను పక్కనే ఉండేది. R.T.D. రైల్వేకు అనుబంధంగా ఉండేది. అందువల్ల దానికి N.,S.R., R.T.D. అనిపేరు. అది నిజాం స్టేట్ ట్రాన్స్పోర్టు డిపార్ట్మెంట్ అది పూర్తిగా ప్రభుత్వ సంస్థ. బహుశా రవాణాను జాతీయం చేసిన తొలి ప్రభుత్వం నిజాముదే కావచ్చు.

ఇక్కడ NSRను గురించి కొంత వివరించాలి: ఇంగ్లీషు కంపెనీవారు నిజాంలో రైల్వే లైను వేస్తామన్నారు. పెట్టుబడి ప్రభుత్వానిది, పని ఇంగ్లీషు కంపెనీ చేస్తుంది. మహబూబ్ అలీఖాన్ నిజాం నవాబు అందుకు అంగీకరించలేదు. రైలు అంగ్రేజు ప్రాంతం నుంచి తెలివి తేటలు మోసుకొని వస్తుందని అతని భయం! అయితే అది వ్యక్త పరచలేక, నష్టాలు రావచ్చు అన్నాడు. ఇంగ్లీషువారు నిజామును తలతన్నినవారు,

వదులుకుంటారా? నిజాముకు నష్టం రాకుండా కొంతకాలం వరకు గ్యారంటీ ఇచ్చారు. అందువల్ల అది N.G.S.R. అంటే, నిజామ్స్ గ్యారంటీడ్ స్టేట్ రైల్వే అయింది. గ్యారంటీ పీరియడ్ అయిపోయింతరవాత N.S.R అయింది. బహుశః ప్రభుత్వం నిర్వహించిన రైల్వే కూడా ఇదే మొట్టమొదటిది కావచ్చు.

## ఖమ్మముపుర చరిత్ర:

ఖమ్మం పురానికి అధిష్ఠాన దేవత శ్రీ లక్ష్మీనరసింహస్వామి. వారి ఆలయం గుట్టమీద ఉన్నది. ఖిల్లా దగ్గర ఉన్నది. నరసింహస్వామి ఇక్కడే అవతరించి హిరణ్యకశిపుని వధించాడనే ఒక వదంతి ఉన్నది. అయితే అది సరికాదు. నరసింహస్వామి అవతరించింది కర్నూలు జిల్లాలోని అహోబిలంలో నరసింహుడు తెలుగు దేవర. నేను రచించిన శ్రీమద్భాగవతాన్ని అంకితం సమర్పిస్తూ "తెలుగు దేవర సింగన వెలుగు వేల్పు" అన్నాను.

ఏది ఎట్లున్నావదంతినిబట్టే దీనికి "స్తంభాద్రి" అని పేరు వచ్చినది. అంటే స్తంభముగల కొండ అని అర్థం. కాని నరసింహస్వామి గుట్టమీద స్తంభం లేదు. ప్రఖ్యాతుడయిన హరిభట్టు "శ్రీమహిత స్తంభాచల" అన్నారు. అయితే ఆ పేరు ఎక్కువ కాలం నిలిచినట్టు లేదు. గుట్టకు మెట్లు ఉండడాన "కంబముమెట్టు పురము" అన్నాడు మరొకచోట హరిభట్టు.

క్రీ. శ. 591లో మహదేవశర్మ ఈ ప్రాంతానికి అధికారిగా ఉండేవాడు. 950లో ఓరుగల్లు నుంచి గుప్తధనం తెచ్చిన రంగారెడ్డి, లక్ష్మారెడ్డి, వెలమారెడ్డి ఖమ్మం మెట్టును ఆక్రమించుకున్నారు. ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉన్న దుర్గం – ఖిలా నిర్మించారు. 1006లో వారు దుర్గ ప్రవేశం చేశారు. వారి వంశం వారు 1424వరకు పాలించారు.

తెలుగువారి కాకతీయ సామ్రాజ్యం పడిపోయింది. కాపానాయుడు, ప్రోలానాయుడు ఖమ్మంమెట్టు చేరుకున్నారు. ఆంధ్ర సామ్రాజ్యం పునరుద్ధరించడానికి ప్రయత్నించారు. కాని సఫలీకృతం కాలేదు. షితాబుఖాను అను బిరుదము గల సీతాపతి రాజు ఖమ్మం దుర్గాన్ని ఆక్రమించుకొని పాలించాడు. 1526లో కుతుబ్ షాహీలు అతనిని ఓడించి ఆక్రమించుకున్నారు. శ్రీకృష్ణదేవరాయలు జయించిన దుర్గాల్లో "గంబంబు మెట్టు గ్రక్కున గదల్చె" అని ముక్కు తిమ్మన "పారిజాతాపహరణం"లో పేర్కొన్నాడు. ఖుతుబ్ షాహీల పక్షాన ఖమ్మం దుర్గాన్ని పాలించిన జఫరుద్దౌలా అతి క్రూరుడు. అతనిని ప్రజలు ధ్వంసుడు అన్నారు. ఆ తరువాత ఖమ్మం అసఫ్జాహీల పాలనలోకి వచ్చింది. దుర్గం మాత్రం – జఫరుద్దౌలా వంశీయులకే కావచ్చు – జాగీరుగా ఉండిపోయింది.

ఖమ్మం పట్టణంలో "హరిభట్టు" అనే ఒక విద్యత్కవి నివసించినాడు. అతడు పోతనామాత్యునివలె నరాంకితమునకు విరుద్ధుడు. అతడు అష్ట ఘంటావధాన పరమేశ్వర బిరుదాంకితుడు. హనుమత్ప్రసాదలబ్ధవరప్రసాద సహజ సారస్వత వేత్త.

ఈ మహాకవి సంస్కృత – ఆంధ్రములలో అఖండ పాండిత్యం కలవాడు. తెలుగులో మత్స్య, వరాహ, నృసింహ పురాణాలను, భాగవతంలోని 6 వ, 11 వ 12 వ

స్కంధాలను రచించాడు. సంస్కృతంలో "రతిరహస్యం" అనే గ్రంథం రచించాడు. దానిని గద్వాల సంస్థానాధీశుడు సోమ భూపాలుడు 1769లో ఆంధ్రీకరించాడు. జర్మనువాడయిన స్మిత్ "రతి రహస్యం" అనే గ్రంథాన్ని జర్మనీలోకి అనువదించాడు.

శ్రీకృష్ణదేవరాయలు – హరిభట్టు కవితా వైభవాన్ని గుర్తించాడు. హరిభట్టు తనకు అంకితం ఇవ్వకున్నా "చిన్నపల్లె" అనే గ్రామాన్ని "శ్రీరామ సముద్రం"గా మార్చి హరిభట్టుకు అగ్రహారంగా సమర్పించాడు.

ఖమ్మం మెట్టును హరిభట్టు పురం అనవచ్చు. ఖమ్మం పురానికి అక్షరఖ్యాతి కలిగించినవాడతడు.

**రాజులనేకాని కవులను గుర్తుంచుకునే సంస్కారం మనకు లేదు!**

ఖమ్మం మెట్టుకు ఒకవైపు ముని+ఏరు = మునేరు ప్రవహిస్తుంది. దీని మీద కమానులుగల వంతెన ఉన్నది. వేసవిలో సహితం చిన్న పాయ ఉంటుంది. ఆ రోజుల్లో ఖమ్మం కొత్త బజారు దాహం మునేరు తీర్చేది. నీటిని బళ్లమీద తీసికెళ్లి కాణీకి బిందె చొప్పున అమ్మేవారు.

మునేరు కాలువకు దగ్గరలో గుంటు మల్లేశ్వరస్వామి ఆలయం ఉంది. ఈ స్వామి రెడ్డి రాజులకు ఇలవేల్పు. బహుశః లక్ష్మారెడ్డి – రంగారెడ్డి – వెలమారెడ్డి ఆ దేవాలయాన్ని కట్టించి ఉంటారు.

ఆ ఆలయం ముందు, ఒక గొప్ప ఊడలమర్రి ఉండేది. ఎవరో ధర్మాత్ముడు దాని చుట్టు ఒక విశాలం అయిన వేదిక నిర్మించాడు. ఒకరు మంచి బావి తవ్వించారు. పేదలు – ముఖ్యంగా బిచ్చగాళ్లు ఆ మర్రికింద ఉండేవాళ్ళు. వారిలో బైరాగులు తంబురా శ్రుతి పెట్టి శ్రావ్యంగా తత్వాలు పాడేవారు. రాత్రిపూట వంటలకు వరుసగా పొయ్యిలు వుండేవి. అలా మండడం ఒక అందమైన దృశ్యం జ్వాలా తోరణంలా ఉండేది.

ఆ మర్రి ఇప్పుడు లేదు. నా మనసులో శాశ్వతంగా నిలిచిపోయింది. "మర్రిచెట్టు" అని ఒక కథ రాశాను.

ఖమ్మానికి ఒక పక్కన నరసింహస్వామి గుట్ట ఉంది. మరొక పక్కన చెక్కుచెదరని దుర్గం – ఖిలా – ఉంది. ఆ ఖిలా బావి నీళ్లే ఆ ప్రాంతం వారికి మంచినీళ్లు.

ఆ రోజుల్లో ఖిలాలోను – గుట్ట మీదనూ పులులు ఉండేవి. ఖిలా పక్కన శివాలయం ఉంది. ఆ ఆలయంలో పూజ చేస్తున్న బ్రాహ్మడిని పులి పంజాతో పుర్రె బద్దలు చేసి చంపింది.

ఇవికాక ఎనిమిది హనుమదాలయాలు – ఒక వేంకటేశ్వరాలయం – ఒక రామాలయం అప్పటికి ఉన్నాయి.

## సైకిలు సవారి:

మేము గుంటి మల్లన్న బజారులోని విశాలం అయిన గృహంలో స్థిరపడ్డాం. మా తాతయ్య మాత్రం ఇరుకు ఇరుకు గాను – బలవంతంగానూ ఉన్నారు.

ఖమ్మం గూడూరు వలె సుప్తగ్రామం కాదు. ఇది వ్యాపార కేంద్రం. కంకర

రోడ్ల మీద నిరంతరం దుమ్ము లేపుతూ బండ్లు పోతూండేవి. లారీ అనే పదం అప్పటికి తెలియదు.

గూళ్ళలో దీపాలు పెట్టటం లేదు. లోకల్ ఫండ్ – అంటే ఎన్నికలు లేని మున్సిపాలిటీ వారు – దీపాలు పెట్టేవారు. అక్కడక్కడా స్తంభాలకు గాజు పంజరాలుండేవి. సాయంత్రం కాగానే ఒకడు కానట్లో వెలుగుతున్న చిమ్నీలు – బుజానికి నిచ్చెన వేసుకొని వచ్చేవాడు. కావడిలో అన్ని చిమ్మీలు వెలుగుతుంటే నేలకు దిగిన నక్షత్రాల్లా ఉండేవి. అతడు కావడి దింపుకునేవాడు. స్తంభానికి నిచ్చెన వేసేవాడు. ఒక చిమ్నీని గాజుపంజరంలో పెట్టి, మూసి వెళ్ళిపోయేవాడు.

ఇళ్లలో కిర్సనాయిలు లాంతర్లు – బుడ్లు ఉండేవి. ఊకతో వెలిగించే కుంపటి ఊసేలేదు. అగ్గిపెట్టెలు వాడేవారు. పాలు – కూరగాయలు అమ్మేవారు. పాడి ఉన్న ఇండ్లు తక్కువ ఉన్నా, అమ్ముకునేవారు కాని, ఉచితంగా ఇచ్చేవారు కారు.

గూడూరులోవలె వడ్లు దంచుకోవడం – పప్పులు విసురుకోవడం – నూనె గానుగ పట్టించడం లేవు. ఖమ్మంలో ధాన్యం మిల్లులు – నూనె మిల్లులు ఉండేవి.

అవి వేరు శనగ కొత్తగా వస్తున్న రోజులు. వేరు శనగ చాల ప్రమాదకరం అయిందని ఎవరూ ముట్టుకునేవారు కారు. దీనివల్ల ఉన్న ప్రమాదాన్ని వివరించే వారు. "వేరు శెనగమ్మో వేరు శనగమ్మా!" అని బుర్రకథలు చెప్పేవారు. రాసుల కొద్ది పడివున్నా వాటిని అంటుకునేవారు కాదు. కోతులు తింటే పిచ్చి ఎక్కింది అనుకునేవారు. వేరుశనగ నూనె వాడేవారు కారు. నువ్వులనూనె – మరలో పట్టింది, వాడేవారు. నెయ్యి గూడూరులో వలె మంచిది దొరికేది కాదు. నీళ్లకు మాత్రం బావులు – చాదలే. పంపులు – లైట్లు అనే పదాలు అప్పటికి తెలియవు.

గూడూరులోవలె ఉచితంగా గాని – వినిమయ పద్ధతిలో కాని దొరికే పదార్థం ఏదీ లేదు. అన్నీ డబ్బు పెట్టి కొనాల్సిందే! ఖమ్మంలో ద్రవ్య వినియోగం విచిత్రం అయింది. ఇది నిజాం రాజ్యం. అందువల్ల నిజాం కరెన్సీ మాత్రమే చెల్లాలి. ఏడు నిజాం రూపాయలకు ఆరు బ్రిటిషు రూపాయలు. ఇదీ మారక విలువ.

ఖమ్మం బెజవాడకు దగ్గర. లావా దేవీలు ఎక్కువ బెజవాడతో ఉండేవి. కాబట్టి ఖమ్మంలో "కాణుల చెలామణి సాధారణంగా ఉండేది. ఈ కాణీ విలువ నైజాం పైసన్నరా, రెండు పైసలూ ఈ వ్యాపారంలో లక్షలు ఆర్జించిన వారున్నారు.

ఖమ్మం నాణేల మీద చార్‌మినార్ బొమ్మ – బ్రిటిషు నాణేల మీద రాజు లేక రాణి బొమ్మ ఉండేవి. నిజాం నవాబు ముస్లిము. ఇస్లాం ప్రకారం ప్రతిమలు – బొమ్మలు నిషిద్ధం. అందువల్ల చార్‌మినార్ బొమ్మ. ఉభయ నాణేల పరిమాణం ఒకటే. రూపాయికి పదహారు అణాలు. అణాకు పన్నెండు పైసలు. విలువ మాత్రం నిజాం నాణెంది తక్కువ.

ఆ రోజుల్లో ఖమ్మం మొత్తంలో పిండిమిల్లు ఉండేది కాదు. ఇళ్లలో విసుర్రాళ్ళు – రోళ్ళు – రోకళ్ళు – రుబ్బురాళ్ళతోనే పని. చాలకాలం తరువాత చేగొమ్మ వారి కొట్లలో ఒక పిండిమిల్లు పెట్టారు. కాని అది సరిగా నడిచేది కాదు.

వైద్యవిధానం ఆయుర్వేదమే. కాని, గూడూరులో వలె నిరాడంబరం కాదు. అత్యంత ఆడంబరం. వైద్యంలో మా తాతయ్యను మించినవారు ఖమ్మంలో లేరు.

అయితే మా తాతయ్య విరక్తులయినారు. ఎంత చెప్పినా వారు వైద్యం చేయలేదు. అప్పుడప్పుడూ వైద్యులు మా తాతయ్య సలహాకోసం వచ్చేవారు. అది కూడా వారికి అంత నచ్చేది కాదు.

అప్పటికి M.B.B.S. లేదనుకుంటా. L.M.P. డాక్టర్లు ఇద్దరు ఉండేవారు.

ఆ కాలంలో జరిగిన ఒక విచిత్ర సంఘటన ఉటంకించాలి:

ఒక ఆయుర్వేద వైద్యునికి ఇంగ్లీషు వైద్యం మీద మోజు గలిగింది. ఒక రోగికి ఇంజక్షను ఇచ్చాడు. ఆ రోగి చేయి పడిపోయింది. అతడు సర్కారుకు షికాయతు చేశాడు. ఆ కేసు బాబె-హుకూమత్, అంటే మంత్రిమండలిదాకా పోయింది. ఆ వైద్యుడు నైజాం రాజ్యంలో ప్రాక్టీసు చేయరాదని ఫర్మాన్ జారీ అయింది. ఆ వైద్యుడు చాల తెలివయినవాడు. ఖమ్మం వదిలాడు. సికిందరాబాదులో ప్రాక్టీసు పెట్టాడు. అప్పుడు సికిందరాబాదు బ్రిటిషువారి అధీనంలో ఉండేది.

ఇది వైద్య విధానంలో మారుతుండిన నమ్మకాలకు ప్రతీక.

ఊరి మొత్తంలో రెండే కార్లుండేవి. అయిదారు సైకిళ్లు ఉండేవేమో! సైకిలు ఉన్న వాళ్ళలో రామానుజాచార్యుల మామయ్య ఒకడు. వారు సైకిలు మీద మా ఇంటికి వచ్చినపుడల్లా అది ఎక్కాలని నా ఉబలాటం! దాన్ని ముట్టుకోనివ్వకపోయే వాడు మామయ్య. ఒక వింత సంఘటనలో నేను సైకిలు ఎక్కగలిగాను.

ఒకనాటి రాత్రి తాతయ్య, నాయన, నేను, అన్నయ్య భోజనాలు చేస్తున్నాం. మగవారి భోజనాలు అయింతరువాత ఆడవాళ్లు భర్తల ఎంగిలి విస్తళ్లలో భోజనాలు చేసేవారు. మగవారితో సహ పంక్తిన భుజించే అర్హత వారికి లేకుండేది.

మా అమ్మ వడ్డిస్తున్నది. చల్లమిరపకాయ నాకు వడ్డించబోయింది అమ్మ. వాడు తినలేడు అని మా నాయన వారించారు. నేను తినగలను అని సవాలు చేశాను. కాయమొత్తం ఒకేసారి తినాలి, రూపాయి ఇస్తా అన్నాడు నాయన. నేను అలాగే అన్నాను, చల్లమిరపకాయ వేయించుకున్నాను. మొత్తం తిన్నాను. పప్పుముద్ద నమిలాను. చెంబెడు నీళ్లు తాగాను.

అది చూచి మా నాయనకు ఆశ్చర్యం అయింది. మా తాతయ్యకు భయం అయింది. మా అమ్మ నన్ను ఎత్తుకుని బెల్లం తినిపించింది.

తెల్లవారి రూపాయి అడిగాను. రూపాయి వాస్తవంగా పెద్ద మొత్తం. మా నాయనకు బుద్ధి పుట్టలేదు. రామానుజాచార్యుల మామయ్యను పిలిపించాడు. వారు నన్ను ఏం కావాలని అడిగారు. సైకిలు ఎక్కించాలి. రబ్బరు బూట్లు కొనిపెట్టాలి అన్నాను. అప్పుడు వారు సైకిలు ఎక్కించుకొని ఖస్బా బజారు తీసికెళ్ళారు. అదొక మహాదానందం! ఇప్పుడు రాకెటు ఎక్కినా, చంద్రునిమీద వాలినా అంత ఆనందం ఉండదు. పావలా పెట్టి రబ్బరు బూట్లు కొనిపెట్టారు. ముప్పావలా మా నాయనకు తిరిగి ఇచ్చారు.

## వానర స్తంభాద్రి:

ఖమ్మంమెట్టులో చాలవరకు పెంకుటిళ్లు. గూడూరు గూనకు ఖమ్మం పెంకుకు భేదం ఉంది. గూడూరు గూన కుమ్మరి సారెమీద చేస్తారు. కుమ్మరివారే చేస్తారు.

అది గుండ్రంగా ఉంటుంది. దానిని చేతిలోకి తీసుకొని సగానికి విరక్కొడితే గూన అవుతుంది. ఖమ్మం పెంకు కుమ్మరిసారి మీద తయారు కాదు. మట్టితో బిళ్లలు చేస్తారు. వాటిని ఒక దుంగమీద వంచుతారు. పెంకు సిద్ధం అవుతుంది. దానిని మధ్యకు పగుల కొట్టాల్సిన పని లేదు. అయితే గూన, పెంకు రెండూ కాలుస్తారు.

ఖమ్మం మెట్టులో కోతులు ఎక్కువ. ఇంటి మీద పెంకు లుండనీయవు. ఊడ పీకుతాయి. అందువల్ల ఇళ్ల కప్పుల మీద రేగు కంప పరిచేవారు. వేసవి కాలంలో బండ్ల మీద రేగు కంప అమ్మేవారు. వేసవిలో ఇళ్లు కప్పించేవారు. కప్పించడం అంటే పెంకులు తీసి మళ్ళీ పేర్చడం.

పెంకులు పేర్చడం ఒక క్రమ పద్ధతిలో జరుగుతుంది. రెండు వరుసల పెంకులు తల క్రిందులుగా ఒక్కొక్కటీ ఒక కాలువలా పేరుస్తారు. ఈ రెంటిమీద ఒక వరస పెంకులు బోర్లించి పేరుస్తారు. అందువల్ల రెండు వరసల సందు పూడుతుంది. అలా ఎన్నివరుసలయినా కప్పవచ్చు. అలా పెంకు కప్పడం పూర్తి అవుతుంది. అప్పుడు రాగోలతో కంపదొంతరలు తీసి కప్పుమీద పరుస్తారు. తరువాత తాళ్లు పెట్టి జారిపోకుండా కడ్తారు. ఆ విధంగా కంపవేయడం వల్ల కోతుల చేతులకు గుచ్చుకుంటాయి. పెంకు కదలించలేవు. వర్షంవస్తే ప్రతి పెంకూ ఒక కాలువ అవుతుంది. వాన ధారలు అనేకం రాలుతుంటాయి.

**వర్షధారలు అనేకం!**

**ఒకే రీతి - ఒకే లయ!**

కప్పు కింద నిలిచి రెండు చేతులతో అన్నయ్యా, నేను వాటిని పట్టడం – కిలకిలా నవ్వడం. అన్ని ఇండ్ల ముందు నుంచి రాతితో కట్టిన మురికి కాలువలుండేవి. వాటిలో వాననీరు వేగంగా ప్రవహిస్తుంది. కాగితపు పడవలు అందులో వేస్తే వేగంగా కొంత దూరం సాగి మునిగేవి. అలా పోయినప్పుడు అదొక మహదానందం!

**అసలు బాల్యమే ఆనందం!**

**మిగతా బతుకంతా పోయిన బాల్యాన్ని వెతుక్కోవడమే!**

మొగల్ చక్రవర్తి జహంగీర్ – అతని బేగం నూర్‌జహాఁ కవులు. కవితా ప్రియులు. ఆమె పేరులోనే కవిత ఉంది! నూర్ అంటే వెలుగు. జహాఁ అంటే లోకం. నూర్ జహాఁ అంటే లోకాలకు వెలుగు. అంత అందకత్తెట ఆమె!

షహిన్‌షా – అతని భేగం మేడమీద నుంచున్నారు. పురవీధిని తిలకిస్తున్నారు. ఒక పండు ముదుసలి – షేర్వానీ – తల పాగాతో – నడుం వంగి – నేలను చూస్తూ – చేతులు ఆడిస్తూ సాగిపోతున్నాడు.

"బేగం! అతడేమిటి అలా వంగి ఉన్నాడు? నేలమీద దేన్నో వెదుక్కుంటున్నాడు" అడిగాడు జహంగీర్.

"హుజూర్! జీవిత భారానికి నడుం వంగి పోయింది! పోయిన బాల్యం దొరుకుతుందేమోనని వెదుకుతున్నాడు" అన్నది నూర్‌జహాఁ.

బేగం కవితా వివరణకు జహంగీర్ పొంగిపోయారు.

దొరుకుతుందేమోనని బాల్యం వెదుకసాగాడు.

"బచ్పన్‌క జమానా థీక్యా ఖూబ్ జమానా థా"

"బాల్యంలో కాలం ఎంత అందమయింది!" అంటాడు ఒక ఉర్దూకవి.

"దుర్మార్గాలకీ, దుఃఖాలకీ ఇవతలిగట్టున

తొంగి తొంగి చూస్తున్నలోకం బాల్యం" అంటాడు మా అన్నయ్య - డాక్టర్ "దాశరథి" కృష్ణమాచార్య.

గూడూరు తామరల చెరువులో, ఖమ్మం ఊడల మర్రిలో బాల్యం దాచుకున్నాననే అపోహ నాది!

గూడూరులో చెరువుంది - తామరలు లేవు!

ఖమ్మంలో గుంటమల్లన్న గుడి ఉంది- ఊడల మర్రిలేదు.

నా బాల్యం వాటిల్లో దాచుకున్నాను! ఎక్కడ వెదకను? దొరకదని తేల్చుకున్నాను. తామరపూలు - మర్రిచెట్టు కథల్లో బాల్యం దాచుకున్నాను.

బాల్యం అంటే అంతే! ఆవేశంలో కొట్టుకుపోతాను. ఇండ్లమీద పెంకులు కప్పులను గురించి కదా చెప్పుతుంటిని!

కోతులు ఖమ్మం మెట్టు ప్రజలను నానా యాతనలు పెట్టేవి. ఇండ్ల కప్పులు ఉండనీయవు. చెట్టుకు కాయ దక్కనీయవు. ఇళ్లలోకి దూరి, తెలిసినట్టే అందుకొని చెట్టెక్కుతాయి! కోతులు నానా బాధలు పెట్టే ప్రాణులు.

అయినా ఒక వానర ప్రియుడు - వానర భక్తుడు - ఉండేవాడు. అతడు చిక్కా నరసింహం. బీటు బజారులో రైల్వే లైను ముందున్న వీధిలో ఉండేవాడు. అతడు జిలేబీలు పట్టుకొని కూర్చునేవాడు. కోతులు గుంపులుగా - మిత్రుని దగ్గరకివలె - వచ్చేవి. అతనికి హాని కల్పించేవి కావు. కనీసం బెదిరించేవి కూడా కావు. అతని చేతిలోంచి బుద్ధిగా జిలేబీలు తీసుకునేవి. అతని చుట్టు కూర్చొని తినేవి. కొన్ని మాత్రం జిలేబీలు అందుకొని ఇండ్ల కప్పుల మీదికి ఎక్కేవి. జిలేబి ముక్క పడిపోతే దాని కోసం పెంకులు పెరికేవి. అందువల్ల చిక్కా నరసింహం అంటే జనానికి కోపం! అయినా ఎవరూ అతని మీదికి జగడానికి పోయేవారు కారు!

వానరుడు హనుమత్ స్వరూపుడు.

హరిభట్టు హనుమత్ ప్రసాదలబ్ధవరప్రసాదుడు.

ఈ ఊళ్లో ఎనిమిది హనుమద్దేవాలయాలున్నాయి!

అంతేకాదు - జంతువుల విషయంలో కరుణ కనబరచడం భారత సంప్రదాయం. చీమలకు చెక్కర, పాములకు పాలు పోయడం మన సంప్రదాయం.

సకలభూత సమత్వమే యోగం.

## విస్తళ్ళ ప్రస్తావన:

ఖమ్మం మెట్టులో ఇంటి పరిశ్రమ విస్తళ్లు కుట్టడం. పల్లెలలో మోదుగాకులు. అడవి నుంచి తెస్తారు. తోరణాలుగా గుచ్చుతారు. ఎండ పెడ్తారు. అలా ఎండిన మోదుగాకుల తోరణాలు ఎడ్ల బండ్లమీద ఖమ్మానికి తెస్తారు. ఆ తోరణాలను ఇంటి ముందే కొంటారు. తోరణాలు పెట్టుకునేంత విశాలంగా ఉండేవి ఇళ్లు. ఆ

తోరణాల ఆకులు తడుపుతారు. దొంతరలుగా చేస్తారు. వాటి మీద విసుర్రాళ్లు పెడ్తారు. ఆ బరువుకు తెల్లవారేవరకు అవి అణుగుతాయి. ఆకులు విస్తళ్లు కుట్టడానికి అనువుగా అణుగుతాయి. అంతకుముందే చొప్పనుంచి చీరిపెట్టిన పుల్లలుంటాయి.

విస్తళ్లది మహిళల పరిశ్రమ. వారు తమ పనులు తీర్చుకొని వసారాల్లో చేర్తారు. ఇద్దరు ముగ్గురు గృహిణులు ఒక ఇంట్లో కూడ్తారు. విస్తళ్లు కుడ్తుంటారు. ముచ్చట్లు పెడ్తుంటారు. ఊరి ముచ్చట్లన్నీ అక్కడే! ఎక్కడెక్కడి వార్తలు - వ్యాఖ్యలు సంపాదకీయాలూ ఉంటాయి. వ్రాయని వార్తాపత్రిక!

విస్తళ్లు కుడ్తుంటారు. పాటలు - ఒక్కొకరు విడిగా సామూహికంగా పాడుతుంటారు. అందులో సీతమ్మవారి వేవిళ్లు - ఊర్మిళ నిద్ర - సుభద్ర పరిణయం - ఒక్కటేమిటి అనేకం ఉంటాయి. ఇది వేదికలేని సాంస్కృతిక ప్రదర్శనం! ఇది పేరు తెలియని వినోదం.

విస్తళ్ళు కుడ్తుంటారు. ఒక తల్లి చిరుతిండి వంతులవారిగా చేసి తెస్తుంది. నవ్వులాటలు - పరిహాసాలు- దరహాసాలు - కోపాలు - చిరుతగాదాల మధ్య చిరుతిండ్లు. ఇది సామూహిక జీవనం - సామూహిక వ్యవహారం. ఇది పేరులేని క్లబ్బు.

ఇదంతా మహిళలు కలిసి చేసే ఆలిన్ వన్. అప్పుడు మహిళా సంఘాలు లేవు. పదవులకు పోట్లాట లేదు.

సాయంకాలం అవుతుండగా ఎవరి ఇళ్లకు వాళ్లు చేర్తారు. తాజాగా తయారవుతారు. కొప్పులో పూలు ముడుచుకొని మగవారికి స్వాగతం పలుకుతారు!

ఇదీ మన జీవన విధానం.

దీనిని మటుమాయం చేసింది మరలనాగరకత!

మళ్లీ ఇంతటి ప్రశాంత జీవితం కనీసం కలలో చూడగలమా?

ఖమ్మం మెట్టు విస్తళ్ళకు ప్రసిద్ధి. విస్తళ్ల వర్తకం బాగా జరిగేది. అప్పుడు నూరు మంచి విస్తళ్ల కట్ట పావలా!

## డాబాలు - కమానులు:

చాలవరకు పెంకుటిళ్లని చెప్పాను. అయితే బీటు బజారులో సంపన్న వర్తకులకు డాబా ఇండ్లుండేవి. అయితే వాటి కప్పులు సిమెంటువి కావు. అప్పుడు సిమెంటు అతి తక్కువ. కప్పుకు ఇనుపవిగాని, కలపవిగాని వాట్లు వేసి దాని మీద పలాస్త్రి పరిచి సున్నం వేసి, కట్టేవారు. కాలవ గట్టున సున్నం బట్టీలు ఉండేవి. ఇండ్లు ఎట్లా కట్టినా ముందు వసారా తప్పక ఉండేది. అది నలుగురు కూడాదానికి - రాత్రిళ్ళు అతిథులు, ఆగంతుకుల విశ్రాంతికి పనికివస్తాయి.

ప్రస్తుతపు గాంధీచౌక్ అప్పటి బీటు బజారు. బీటు అనే పేరు BID నుంచి వచ్చింది. అప్పుడు ఇదే మార్కెట్టు! ఉదయం బండ్లతో నిండి కిటకిటలాడుతుండేది. చుట్టుపట్ల పల్లెల నుంచి - గూడూరు నుంచి గూడా - బండ్లలో సరుకులు తెచ్చేవారు. ధరల నిర్ణయానికి వర్తకులు అక్కడ కూడి BID అంటే, మాట లేక పాట ద్వారా ధర నిశ్చయం అయ్యేది. అయితే ధరల విషయంలోనూ - తూకం విషయంలోనూ - చెల్లింపుల విషయంలోనూ వర్తకులు రైతులను మోసం చేసేవారు.

ముంచేవారు. ప్రభుత్వం ఇది గమనించింది. రైతన్నను కాపాడడానికి మార్కెటు క్రమబద్ధీకరణ చట్టం తెచ్చింది. మార్కెటును సర్కారు ఏర్పరచింది. కాలువ వడ్డున ఒక విశాల స్థలం – ఒక రేకులషెడ్డు ఏర్పరచింది. మార్కెటు బీటు బజారు నుంచి కాలువ వడ్డుకు మారింది. అక్కణ్ణుంచి గుట్టల బజారుకు తరలింది.

ఇండ్లకంటే ధర్మసత్రాలు గట్టిగా కట్టేవారు. అప్పటికి కొత్త బజారులో అర్వపల్లివారి సత్రం మాత్రమే ఉండేది. తరువాత మిషన్ ఆస్పత్రి దగ్గర శిరం వారి సత్రం వెలిసింది.

పల్లెల్లో సత్రాలు ఉండవు. ఎందుకంటే, అక్కడి అతిథులకు భోజనానికి కరువు ఉండదు. బస్తీలలో ఆ ఉదారత అప్పటికే లోపించింది. బయటినుంచి పనులకోసం వచ్చిన అతిథులు సత్రాలను ఆశ్రయించేవారు. పూటకూళ్లు తప్ప హోటలు వ్యవస్థ బలపడలేదు. అంతేకాక, భోజన ఖాజనాల విషయంలో కుల నియామాలుండేవి. అందువల్ల సత్రాలు అవసరం అయినాయి.

సత్రాలలో ఉచిత వసతి కల్పించేవారు. వంట సామగ్రి, అంటే పాత్ర సామగ్రి ఉచితంగా ఇచ్చేవారు. కొన్నిచోట్ల వంటకు అవసరం అయిన పదార్థాలుకూడా ఇచ్చేవారు. ఖమ్మంలో కాదు కాని, మరికొన్ని చోట్ల కులాలవారీ సత్రాలుండేవి. అతిథులకు వండుకునే ఇబ్బంది లేకుండా సిద్ధాన్నం వడ్డించేవారు.

ఆరోగ్యరీత్యా స్వయంపాకం ఉత్తమమని తేలింది.

హోటలు తిండ్లు అనేక రోగాలకు కారణం అని వెల్లడి అయింది.

వీటిని దృష్టిలో ఉంచుకుని సత్ర వ్యవస్థ వ్యక్తిగత, సామాజిక ఆరోగ్యానికి ఉపకరించిందని ఇంకా అంగీకరించలేకపోతున్నాం.

ఇంటికన్న సత్రం – సత్రం కన్న గుడి, గట్టిగా – పటిష్టంగా నిర్మిస్తారు. గుడి రాతి కట్టడం. అది కోటలా ఉంటుంది. గుడి దేవుడిది మాత్రం కాదు. దానికి బహుళ ప్రయోజనాలున్నాయి.

1. భద్రత : దండయాత్రలు– దోపిళ్ళు – తుపానులు వచ్చినప్పుడు గ్రామ ప్రజలను రక్షిస్తాయి. 1977లో వచ్చిన దివిసీమ ఉప్పెనలో దేవాలయాలు ఎందరినో కాపాడినాయి.

2. వినోదం : విజ్ఞానం – దేవాలయంలోనే హరి కథలు, పురాణాల వంటివి జరిగేవి. భారత సంస్కృతికి మూల స్తంభాలయిన రామాయణ, భారత, భాగవతాలను ప్రజలలోనికి తీసుకొనిపోయిందీ, వానిని పరిరక్షించిందీ దేవాలయాలే! అందుకే అవి అన్యమతస్థుల ఆగ్రహానికి – దోపిడికి – వినాశానికి గురి అయినాయి.

3. పాపభీతి : దేవుని ముందు ప్రమాణం చేసి అబద్ధం చెప్పరాదనీ – దేవుని ముందు చేసిన వాగ్దానం నిలపెట్టాలనీ, అలా కాకుంటే పాపం తగిలి ఏదో అరిష్టం జరుగుతుందనీ భయపడేవారు. ఆ భయమే సామాజిక జీవితాన్ని న్యాయమార్గంలో నడిపించింది.

4. సమానత : దేవునిగుడిలో కులం – అధికారం – సంపద అనే వ్యత్యాసం లేదు. అందరూ ఒకే పంక్తిలో తీర్థ ప్రసాదాలు తీసుకుంటారు. ప్రసాదం ఇవ్వడంలో ముందువెనుకలు తప్ప వ్యత్యాసాలు లేవు.

5. అధ్యాత్మికత : ఈ జీవితం కేవలం శరీర పోషణకు మాత్రం కాదు. ఆత్మలేని దేహానికి చలనం లేదు. అంతం దేహానికే. ఆత్మ నిత్యం అయింది. దానికి అంతం లేదు. ఆత్మ అరువు తెచ్చుకున్నది – శరీరం. ఇల్లు కాళీ చేసేటప్పుడు మేకులను కూడా పీక్కొనిపోతాం. మేకుల రంధ్రాలను వెంట తీసుకొని పోలేము. ఆ రంధ్రాలే ఒక జన్మ సంస్కారాలు. వాటిని ఆత్మ మరో జన్మకు తీసుకొని వెళ్తుంది. కావున శుద్ధము – సాత్వికము – ప్రశాంతము – న్యాయము అయిన జీవితం ద్వారా ఆత్మను రక్షించుకోవాలని అధ్యాత్మిక విద్య బోధిస్తుంది. ఇది దేవాలయాలలోనే సంప్రాప్తం అవుతుంది.

6. సామాజికం : గ్రామంలో ఎక్కడ కలిసినా, కలవకున్నా గుళ్లో కలుసుకుంటారు. ఒకరి కథలు ఒకరికి చెప్పుకుంటారు. ఈ చెప్పుకోవడంలో ఉన్న ఊరట దేనిలోనూ లేదు.

ఒక పాతికేళ్ల కిందటి ఒక వృత్తాంతం వివరిస్తాను : ఒక మిత్రుని భార్యకు గుండె జబ్బు వచ్చింది. నాకు తెలిసిన ఒక డాక్టరు మిత్రుని దగ్గరికి తీసికెళ్ళాను. అతడు నాస్తికుడు. అన్ని పరీక్షలు చేశాడు. "మీ ఊళ్ళో గుడి ఉందా?" అని అడిగాడు. ఆమె "లేదు" అన్నది. "అందుకే ఈ జబ్బు" అన్నాడు డాక్టరు.

నాస్తికుడు గుడి సంగతి మాట్లాడ్డం నాకు విచిత్రం అనిపించింది. "గుడికి గుండెకు లంకె ఏమిటి?" అని అడిగాను.

"ఉంది. వీళ్ళు దొరలు. తమ సౌధంలో ఒంటరి జీవితం గడపాలి. ఒకరు ఈమెతో – లేక ఈమె" ఒకరితో మాట్లాడ్డానికి దొరతనం అడ్డు వస్తుంది. గుడి ఉంటే అక్కడ ఎవరయినా కలుస్తారు. వారితో మనసు విప్పుకుంటుంది. ఈమెకు జబ్బు ఏమీలేదు" అని పంపించాడు.

వాళ్లు ఆ ఊళ్లో హనుమదాలయం నిర్మించారు. ఆమె క్షేమంగా ఉంది.

బహుళార్థ సాధకాలయిన దేవాలయాలను గుర్తించడం లేదు. మన సమాజాన్ని వలెనే ఆలయాలను శిథిలావస్థకు చేరుస్తున్నాం.

"వృద్ధుల బుద్ధులు సంచలింపవే" అన్నారు పెద్దలు. నేనూ వృద్ధుణ్ణే. ఏదో చెప్పబోయి ఏదో చెప్పాను. చెప్పదలచుకున్నది డాబాల బజారును గురించి కదా!

నైజాంలో మున్సిపాలిటీలు లేకుండెను అని చెప్పాననుకుంటా. నైజాంలో అంతా సర్కారే! సర్కారువారికి ఖమ్మంలో డాబాలు ఉండాలి అనిపించింది. సర్కారుకు ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా ఆగదు.

సర్కారువారు కొన్ని ప్లాట్లు చేశారు. డాబాలు కట్టిన వారికి మాత్రమే కేటాయిస్తామన్నారు. సంపన్న వర్తకులు తీసుకున్నారు. ఆ వీధి సాంతం డాబాలు కట్టారు. అది డాబాల బజారు అయింది.

అలాగే ప్రతి ఇంటికీ కమాను ఉండాలని సర్కారు హుకుం జారీ చేసింది. అందువల్ల అది కమాను బజారు అయింది. ఆ బజారులోనే వేంకటేశ్వర ఆలయం ఉంది.

## పంపర పనస:

మా తండ్రిగారు మహా విద్వాంసులు. వక్త. మనిషిని వశరచుకునే వాక్కు ఉంది. కొందరు వారివద్ద వశీకరణ మంత్రం ఏదో ఉన్నది అనేవారు. కాని అది అంత వాస్తవం అనిపించదు. కొద్దిరోజుల్లోనే వారు ఖమ్మంలో ప్రఖ్యాతులు అయినారు. వారిపేరు వేంకటాచార్యులు అని ఎవరికీ తెలియదు. "గూడూరు అయ్యవారు" అంటే అందరికీ తెలుస్తుంది.

మా నాయనమ్మ బుచ్చమ్మగారు పెద్దముత్తైదువు. గూడూరు అయ్యవారి తల్లి. అందువలన ఆమెను తరచు పేరంటానికి పిలుస్తుండేవారు. ఒకసారి ఆకారం నరసింహం ఇంటికి వాయనానికి పిలిచారు. మనిషి వచ్చాడు. వెంటపెట్టుకుపోయాడు. వెంట నేనూ వెళ్లాను. నరసింహంగారి భార్య నాయనమ్మకు బొట్టు పెట్టింది. కాళ్ళకు పసుపు రాసింది. ఒక పెద్ద గంపనిండా పంపర పనస కాయలు తెచ్చారు. ఆ బుట్టను ఇద్దరు చెరొకవైపు లాంఛనంగా పట్టుకున్నారు.

ఆమె "ఇచ్చుకుంటి వాయనం" అన్నది.

నాయనమ్మ "పుచ్చుకుంటి వాయనం" అన్నది.

అలా ఇద్దరూ మూడు సార్లు అన్నారు. తంతు ముగిసింది. పళ్ళగంప నెత్తిన పెట్టుకొని మనిషి సాగాడు. మేము అతనిని అనుసరించాం.

పంపర పనస నిమ్మజాతి పండు. చిన్న గుమ్మడికాయంత ఉంటుంది. పొట్టు చాల మందం. తొనలు నారింజవలెనే ఉంటాయి. కాని ఎర్రగా పెద్దగా ఉంటాయి. పంపర పనస పసిడి రంగులో అందంగా ఉంటుంది.

పంపర పనసలు గోడ అల్మారీలో వరుసగా అమర్చారు. అవి పసిడి బంతుల్లా – కాదు, అంతకంటే అందంగా – అన్ని ఒక చోట చూసినపుడు నేను మురిసిపోయేవాణ్ణి. అవి తరుగుతుంటే బాధ కలిగేది. కాని తుదకు అల్మారీ ఖాళీ కానే అయింది.

పంపర పనస ఇప్పుడు కనిపించడం లేదు. ఈ అర్ధశతాబ్దంలోనే కొన్ని ఫలజాతులు మాయం అయినాయి.

వడ్లపూడి నారింజపండ్లు ఎంతో అందంగా రుచిగా ఆరోగ్యంగా ఉండేవి. నాగపురపు సంత్రాలవలె గుల్లగా ఉండేవి. కాణీకి ఒకటి సమృద్ధిగా వచ్చేవి. వడ్లపూడిలో నారింజతోటలు కొట్టివేశారట. పసుపు పండిస్తున్నారట!

"నారింజ" అనే మాట లేకుండా అయింది. అలాగే గజ నిమ్మకాయ – తునికి పండ్లు మచ్చుకు కనిపించకుండా మాయం అయినాయి!

సృష్టిలో ఇలాంటివి ఎన్ని పోయినాయో – ఎన్ని వచ్చినాయో!

# అయిదు

## తెలంగీ - బేఢంగీ:

నిజాం రాజ్యంలో మహబూబ్ అలీఖాను వరకు ఫారసీ రాజకీయ భాషగా ఉండేది. ఆరవ నిజాం ఉర్దూను రాజకీయ భాష చేశాడు.

మొగలులు ఏర్పరచిన భారతీయ భాష ఉర్దూ. మొగల్ సైన్యంలో అనేక ప్రాంతాలవారు ఉండేవారు. వారికి సంధాన భాషగా ఏర్పడిందే ఉర్దూ భాష. "ఉర్దూ"కు అర్థం "సైన్యం."

ఉర్దూ సైన్యంకోసం ఏర్పడిన భాష. అయినా దాని సౌలభ్యంతో అది ప్రజల భాష అయింది. ఉర్దూ సుమారు ఉత్తర భారతంలో మాట్లాడే భాష. కొంత ఫారసీ కలిసి ఉంటుంది. ఉర్దూకు లిపి లేదు. ఫారసీ లిపిని స్వీకరించారు. అది ఎడమ నుండి కుడికి సాగుతుంది.

లోకంలో లిపిలేని భాషలే చాల ఉన్నాయి. ఎంతో సంస్కారం గల భాషకు గాని లిపి ఉండదు. సంస్కృతానికి లిపి దేవనాగరి. ఉత్తర భారత భాషలకు, మరాఠీకి లిపులు లేవు. ఆ భాషలన్నింటికి దేవనాగరియే లిపి.

అత్యంత నాగరకం అనుకుంటున్న యూరోపు భాషలకు రోమను లిపియే!

ఫారసీ లిపితో భారత భాషల్లో ఉర్దూ చాల సుందరమయిన భాష. ఉర్దూలో ఎంతో ఉత్తమ సాహిత్యం వచ్చింది. ఉర్దూ కవిత పసిపాప చిరునవ్వులా ఆహ్లాదంగా ఉంటుంది. ఉర్దూ కవితకు సంప్రదాయాలు ఫారసీవి. షమాపర్వానాగుల్ గులిస్తాఁ – మహబూబ్ – మహబూబా – మై, మైఖానా – సాఖీ – హరాబ్ – ఇవన్నీ ఫారసీ సంప్రదాయాలు. వారి వలపు ఫలించదు.

ఫారసీక దేశం అంటే ఇరాన్‌లో, ఒకరకం గులాబీ ఉంటుంది. దానికి మధ్యన నిటారుగా ఒక ముల్లు ఉంటుందట. ఒక ప్రత్యేకమయిన పక్షి ఆ గులాబీని ప్రేమిస్తుందట. ఆ పక్షులు ఆ గులాబీ తోటను విడువవు. వాటిమీదనే తిరుగుతుంటాయట. సాయంకాలం అవుతుంటే ఇహ విరహం భరించలేవట. వేగంగా వచ్చి గులాబిముల్లుమీద పడ్తాయట. గులాబీ ముల్లు పక్షి గుండెలో గుచ్చుకుంటుంది.

**విలవిల తన్నుకొని ప్రాణం వదులుతుంది.**

**కాని గులాబీని ప్రేమించడం మానదు!**

ఉర్దూ కవితలో లతాంగి వర్ణన మెడ దిగదు.

వక్షోజాల వర్ణన నిషిద్ధం.

గాలిబ్ – మీర్ – జఫర్ – జవుఖ్ వంటి ఎందరో కవులు ఉర్దూ కవితను అమృతమయం చేశారు.

మా అన్నయ్య, కీర్తిశేషులు డాక్టర్ దాశరథి (కృష్ణమాచార్య) గాలిబ్ గీతాలపేర గాలిబ్‌ను తెనిగించారు. వాటికి బాపుగారు కూర్చిన చిత్రాలు సువర్ణానికి సుగంధం కలిగించాయి.

నేను జవుఖ్ – జఫర్ – ఇక్బాల్ కవితలు తెలిగించాను. తెలుగు కథలను "తెలుగుకే అఫ్సానే" అని ఉర్దూలోనికి అనువదించాను. "జిలానీ బానూ" ఉర్దూ కథలను, తెలిగించాను. "ఉమ్రావ్ ఖాన్ అదా" అనే కవితామయం అయిన ఉర్దూ నవలను తెనిగించాను.

ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే, భాషగా ఉర్దూమీద మాకు ఆదరం – అభిమానం, వలపు ఉన్నాయి. కాని చివరి నిజాం మీర్ ఉస్మానలీఖాన్ ఉర్దూ భాషను మతానికి అంటకట్టి – ఆ మతపు ఆయుధంతో ఒక జాతి

సంస్కృతిని సొంతం అపమానించడానికి, కాలరాయడానికి, సమాప్తం చేయడానికి ప్రయత్నించాడు. ఒక జాతి వేష భాషలను అణగదొక్కడానికి కంకణం కట్టుకున్న కర్కోటకుడు, చరిత్రలో ఉస్మాన్‌తప్ప – మరొకడు కనిపించడు.

ప్రజల ఉద్యమం నిజాం నవాబు నియంతృత్వానికి – నిరంకుశత్వానికి – రాక్షసత్వానికి వ్యతిరేకంగానే కాని, ఏ మతానికి, ఏ భాషకు వ్యతిరేకంగా కాదు.

మీర్ ఉస్మానలీఖాను 1911లో గద్దె ఎక్కాడు. అప్పటినుంచీ ఒక పథకం ప్రకారం తెలుగును తుడిచిపెట్టడానికి ఉర్దూ బావుటాను కరవాలంగా ఉపయోగించాడు. అంతకుముందు ఉండిన ప్రభుత్వాలు సైతం తెలుగును గుర్తించలేదు. ప్రోత్సహించలేదు. కాని ఒక పథకం ప్రకారం తుడిచిపెట్టడానికి ప్రయత్నించలేదు.

ఉస్మాన్ రాజకీయ చతురుడు. అతడు తన భద్రత కోసం ఒక భాషనూ, ఒక మతాన్ని పోషించాడు. అతనికి ప్రజలతోను, ప్రజల భాషతోనూ, ప్రజాభిమతంతోనూ పని లేదు. తాను నిరంకుశంగా పాలించగలననీ – ప్రజా ఉద్యమాలను అణచి వేయగలననీ తన ప్రభువులయిన అంగ్రేజులకు తెలియపరచదలచాడు. అంగ్రేజు సర్కారు సైతం – తమ భవిష్యత్ ప్రయోజనాల దృష్ట్యా – భారత దేశపు నడి బొడ్డున – నిజాము వల్ల త్రాచును పాలు పోసి పెంచింది. నిజాం దుష్టత్వాన్ని, దుర్మార్గాన్ని, దౌర్జన్యాన్ని, మత ఛాందసాన్ని చూచి మందలించకపోగా మిన్నకున్నది.

ఉత్తరాన మహమ్మదలీ జిన్నాను – దక్షిణాన మీర్ ఉస్మాన్ను – తమ స్వప్రయోజనాల కోసం ఆంగ్లేయులు ప్రోత్సహించారు.

1918లో ఉస్మాన్ – ఉస్మానియా యూనివర్సిటీని ప్రారంభించాడు. ఉస్మానియాలో ఉర్దూ బోధనాభాషను చేశాడు. ఇది ఉర్దూ ఉద్ధరణ కోసంకాక తెలుగును, ఇతర దేశీయ భాషలను రూపుమాపటానికి పన్నిన కుట్ర.

బ్రిటిషిండియాలో ప్రజల భాషను బోధనాభాషగా అంగీకరించడం జరిగింది. అంతేకాక తెలుగు సాహిత్య వికాసానికి చార్లెస్ ఫిలి బ్రౌను వంటి ఆంగ్లేయులు చేసిన కృషి చిరస్మరణీయం. తెలుగు సాహిత్యంలో ఆధునిక భావాల ప్రవేశానికి అంగ్రేజుల ప్రభావం ఉందనడంలో వివాదం లేదు.

అలాంటి సమయంలో భారతదేశపు నడి బొడ్డున కేవలం ఉర్దూకు విశ్వవిద్యాలయం స్థాపించడంలోని కుయుక్తిని కప్పిపుచ్చుకొనదలచుకున్నాడు ఉస్మాన్. తాను దేశాభిమానిని అనీ భారతీయ భాష ఉర్దూ అభివృద్ధికి యూనివర్సిటీ ప్రారంభిస్తున్నాననీ జాతీయ నాయకులకు తెలియపరచాడు. అలా చేసి వారి మన్ననలు పొందాలని ప్రయత్నించాడు.

ఈ కుట్రను బయలుపరచి, జాతీయోద్యమ నాయకులకు వాస్తవ విషయం తెలియపరచగల ప్రజా ఉద్యమం నిజాం రాజ్యంలో లేదు. అందువలన రవీంద్ర కవీంద్రుడు ఉస్మాన్ విశ్వవిద్యాలయ స్థాపనను ప్రశంసిస్తూ నిజాంకు లేఖ వ్రాశారు. మహాత్ముని వంటివారు ప్రశంసించకున్నా – స్వంత కారణాల వల్ల – నిరసించలేకపోయారు.

నిజాం ఎన్నడూ ఉభయ మతాల తన ప్రజలను నమ్మలేదు. అన్ని విషయాలను ఉర్దూలోనికి అనువదించడానికి లక్నోనుంచి విద్వాంసులను – కవులను వందల కుటుంబాలను రప్పించాడు. హైదరాబాదులో లక్నో ముస్లిముల వీధులు వెలిశాయి.

అతి కొద్ది కాలంలోనే మెడిసిన్, ఇంజనీరింగ్ సహితంగా సబ్జక్టులు అన్నీ ఉర్దూలో అనువాదం కావడం – పాఠ్యపుస్తకాలు సిద్ధం కావడం వల్ల – బోధన ప్రారంభం చేయగలిగారు.

ఉస్మానియాలో నామమాత్రంగా తెలుగు శాఖను ఏర్పాటు చేశారు. దానికి తొలి ఆచార్యులు 'ఏ దేశమేగినా ఎందుకాలిడినా' గేయ రచయిత, ప్రఖ్యాత భావ కవి రాయప్రోలు సుబ్బారావుగారు. నిజాం కొలువులో రాయప్రోలు వారు షేర్వానీ ధరించి కొలువుకు వెళ్ళేవారు. తెలుగును ధ్వంసం చేయ పూనుకున్న నిజాం కొలువులో దేశభక్తిగేయ కవి రాయప్రోలు! ఇది వింతయే కాని ఇది – వాస్తవం.

రాయప్రోలువారు నిజాంను ప్రశంసిస్తూ రచించిన జాడలు లేవు.

బ్రిటిషాంధ్రం నుంచి నిజాం కొలువులో చేరిన కురుగంటి సీతారామయ్య "ఆదర్శప్రభువు" అనే గ్రంథం రచించి, ప్రభువు వారి మన్ననలు పొందారు. ఈ పుస్తకానికి రాయప్రోలువారు పీఠిక వ్రాశారు. ఇటువంటి గ్రంధాల ప్రచురణకు ఆంధ్రసాహిత్య పరిషత్తును స్థాపించారు. ఈ పుస్తకం తెనాలిలో అచ్చయింది.

ఆ రోజుల్లో తెలుగువారి తరఫున నిజామును పొగడడానికి రప్పించిన ముగ్గురికి రా.కా.సి అని పేరు పెట్టారు స్థానిక తెలుగులు. రాయప్రోలు – కాసింఖాను – సీతారామ భట్టాచార్య, శ్రీరంగం శ్రీనివాసవారుగారు కూడ కొంతకాలం నిజాం కొలువు చేశారని చెప్పుకుంటారు.

ఉస్మానియాలో తెలుగు శాఖ ఉన్నమాట నిజం. ఆ శాఖ నిజాం ప్రశంసలకే కాని తెలుగును ప్రోత్సహించడానికి కాదని ప్రజలకు తెలుసు. అదీకాక తెలుగు శాఖలో చేరేవారిపై ప్రభుత్వదృష్టి ఉండేది.

"తెలంగీ – బేఢంగీ" – 'తెలుగు వికారభాష' అనే నినాదం ప్రభుత్వ ప్రోత్సాహంతో ప్రచారంలోకి వచ్చింది. అందువల్ల విద్యార్థులు తెలుగులో చేరడానికి జంకేవారు. అది కాక బి.ఏ. వరకు ఉర్దూలో మాత్రం చదివినవారికి తెలుగు ఎలా వంట పడుతుంది? 'తెలుగు' ప్రభుత్వం గుర్తించని భాష. అందులో డిగ్రీ పొంది ప్రయోజనం శూన్యం.

ఇన్ని అవరోధాలను అధిగమించి వరంగల్లు ఇండ్లామడికొండకు చెందిన పల్లా దుర్గయ్య ప్రథమ విద్యార్థిగాను – ఏకైక విద్యార్థిగాను ఉస్మానియాలోని తెలుగు శాఖలో చేరారు.

పల్లా దుర్గయ్యగారు సాత్వికులు. విద్వత్కవి. మనుచరిత్రను పరిశోధించి డాక్టరేట్ పొందారు. "గంగిరెద్దు" వంటి ఖండ కావ్యాలు రచించారు. ఉస్మానియా నుంచి తెలుగు ప్రొఫెసరుగా పదవీవిరమణ చేసి దివంగతులైనారు.

నిజాంలో రాజభాష ఉర్దూ. ఇక్కడి శాసనాలు ఉర్దూ – ఆఫీసుల్లో వ్యవహార భాష ఉర్దూ – కోర్టు భాష ఉర్దూ – జరీదా అనగా గెజిటు భాష ఉర్దూ – నాణేల మీద భాష ఉర్దూ – దుకాణాలు వగైరాల బోర్డులన్నీ ఉర్దూ. నిజాం సొంతం ఉర్దూ మయం. ఎవరయినా తెలుగు మాట్లాడినట్లు వినిపిస్తే –

"తెలంగీ బేఢంగీ అని వెక్కిరింపు!

నాటి స్థితికి దవళా శ్రీనివాసరావు గారి ఆవేదన –

'హాలీ' యందువు 'గాలిబం'దువు సదా 'యిక్బాలె'పో షాయిరియన్
చాలా చాల నఫీసులుట్టిపడ మాషల్లా రచించెన్ యటం
చాలాపించుచు జిందగీ గడచెనయ్యా! నీదు భాషాసతీ
లీలా మాధురులొల్కు వ్రాసిన కవుల్లేరే స్మరింపన్ మదిన్!

హాలీ, గాలిబు, ఇక్బాల్ ఉర్దూ కవులు. నఫీసు అంటే అందం. మాషల్లా మెచ్చుకునే పదం.

'ఉర్దూ కవులను మెచ్చుకుంటూనే జీవితం గడుపుతావా? మధురమైన తెలుగులో రచించిన కవులే లేరా? అని పై పద్యపు తాత్పర్యం.

**ఏ కాలంలోనయినా విద్యను పాలకులు నిరసించారు. నిరసిస్తున్నారు. నిరసిస్తారు. పాలకులు అనుమతించిన విద్యనే సహిస్తారు. తమకు వ్యతిరేకం అయిన విద్యను పాలకులు నిరసిస్తారు. నిర్బంధిస్తారు. నిషేధిస్తారు.**

కాని వెలుగును చూచిన గుడ్లగూబవలె చదువును చూచి బెదిరినవాడు ఉస్మాన్! తాను స్వయంగా కవినని చెప్పుకుంటాడు. కవితలు జరీదా – గెజెటులో ప్రకటించుకుంటాడు. మరొకడు చదువుకోరాదనే మూర్ఖుడు! అతడు విద్యా విధానాన్నే అలా తయారుచేశాడు.

నిజాం పాఠశాల విద్యలో ఉర్దూను బోధనా భాష చేశాడు. ఉర్దూ మాతృభాష అయిన ఒక మతస్తులను ప్రోత్సహిస్తున్నట్లు నటించాడు. వాస్తవానికి తన ప్రజల మీద అతనికి విశ్వాసం లేదు. పెద్ద ఉద్యోగాలలోకి బయటినుంచి ఉర్దూవారిని నియమించేవాడు. తనను గద్దె నెక్కించిన కిషన్ పెర్షాద్ తరువాత ఉస్మాన్ నియమించిన ప్రధానులు అందరూ బయటివారే.

ఇందుకు వ్యతిరేకంగా రాజ్యంలో ముసల్మానులు ఆందోళన లేవదీశారు. తత్ఫలితంగా నిజాం నవాబు 'ముల్కీ' నిబంధనలు ప్రవేశపెట్టాడు. రాజ్యంలోని ముసల్మానులకు ఉద్యోగం లభింపచేయడం అతని ఉద్దేశం.

ముల్కీ నిబంధనలు పుట్టడానికి కారణం అది.

ఉన్నత విద్యలో ఉర్దూ ప్రధాన భాష చేశాడు. తెలుగు మూడవ తరగతిలో మొదలవుతుంది. ఏడవ తరగతి వరకు సాగుతుంది. ఎనిమిదవ తరగతినుంచి తెలుగు ఆప్షనల్ – ఐచ్ఛికం. చాల తక్కువ మంది తెలుగు తీసుకునేవారు. ఎందుకంటే మెట్రిక్ తరువాత తెలుగు ఉండదు.

ఉర్దూ భయానికి తెలుగువారు తమ పిల్లలను స్కూళ్ళలో చదివించేవారు కారు. తెలుగు వారికి ఉద్యోగం దొరుకుతుందని నమ్మకం లేదు. పల్లెల్లో కులవృత్తులు అడుగంట లేదు. వ్యవసాయం ప్రధాన వృత్తిగా ఉండేది.

నిజాం రాజ్యంలో చదువు వచ్చినవారి సంఖ్య వేయికి 82. అందులో ముసల్మానుల్లో 59. హిందువుల్లో 23.

నిజాంలోని విద్యావిధానమే విద్యకు వ్యతిరేకం.

పాఠశాలలూ, కళాశాలలూ అన్నీ సర్కారువే. అవి ఏర్పరచడానికి ప్రమాణాలు–

ప్రతి సూబాకు ఒక ఇంటర్‌మీడియట్ కాలేజి. నిజాం రాజ్యంలో నాలుగు. అంటే – రాజ్యం మొత్తంలో నాలుగే ఇంటర్ కాలేజీలు.

ప్రతి జిల్లాకు ఒక ఫౌఖాన్యా – అంటే హైస్కూలు.

ప్రతి తాలూకాకు వస్తాన్యా – అంటే మిడిల్ స్కూల్.

గ్రామ ప్రాముఖ్యతనుబట్టి తహతాన్య – అంటే ప్రైమరీ స్కూలు.

నిజాం నవాబు ఖాన్గీబడులు – అంటే వీధి బడులను ఫర్మాను ద్వారా నిషేధించాడు. అందువల్ల పంతుళ్లు తమ ఇళ్లలోనే తెలుగు చదువు చెప్పేవారు.

ఆ రోజుల్లో ఖమ్మం తాలుకా కేంద్రం మాత్రమే. ఒక దువ్వమ్ తాలూకాద్దారు, డిప్యూటీ కలెక్టరు – ఉండేవారు. అయినా, పట్టణ ప్రాధాన్యతను గుర్తించి, ఖమ్మంలో ఫౌకాన్యా–అంటే హైస్కూలు ఏర్పరచారు. రెండు తహతాన్యాలు–అంటే ప్రైమరీ స్కూళ్లు ఉండేవి. ఒకటి దికాబజార్ తహతాన్యా – రెండోది ఖస్బా బజారు తహతాన్యా.

ఇది విద్యావిషయకంగా రాజకీయ పరిస్థితి.

సామాజిక పరిస్థితులు ఇందుకు భిన్నంగా లేవు. ఊళ్లలో దొరల పెత్తనం. కులమతాలా ప్రభావం. బ్రిటిషిండియాలో వలె సంస్కరణ ఉద్యమాలు శూన్యం. ఉద్యమం అంటే సర్కారుకు మంట. కనీసం అభివృద్ధిని సహించలేని దుష్ట ప్రభుత్వం! ప్రజల్లో విద్యా విహీనత!! చైతన్య రాహిత్యం!!!

మాది సనాతన సంప్రదాయ వంశం – కుటుంబం. ఇతరుల నీడ పడితే మైల పడిపోతాం అన్నంత ఛాందసం. మా ఇంట్లో మడి కట్టుకుంటే ద్రావిడ, సంస్కృతాలు మాట్లాడాలి. మడి విడిచిన తరువాత తెలుగు. తెలుగు – మడికి పనికి రాని భాష అని వారి ఉద్దేశం. రెండు పూటల తిరువారాధన.

మా నాయనగారు పుట్టింతరువాత భద్రాచలం వెళ్లలేదు. అక్కడికి వెళ్తే ఏదో అనర్థం జరుగుతుందని మా నాయనమ్మ ఆవేదన. మా నాయనమ్మ గారు అచ్చం భద్రాద్రి రాముని వంటి "వామాంక స్థిత జానకి" విగ్రహాలు సంపాదించారు. వివిధ సాలిగ్రామాలు. సాలిగ్రామాలకు శాస్త్రం వుంది. అది మా నాయనగారికి బాగా తెలుసు. సాలిగ్రామాలు నేపాలు గండకీనదిలో ఉంటాయట! నేపాళ మహారాజు సంవత్సరానికి ఒకసారి బంగారు వలవేసి వెలికి తీస్తారట. అప్పుడు అక్కడ ఉన్న మహాత్ములకు, విరాగులకు అందిస్తారట. వారివద్ద మనం సాధించాలి అని చెప్పేవారు.

మా ఇంట్లో మార్గళి – ధనుర్మాసం ఎంతో వైభవంగా చేసేవారు. ఆ నెలరోజులు తెల్లవారేవరకు వేడి వేడి చెక్కర పొంగలి – నేయి కారుతుండగా – వందల మందికి వినియోగం చేసేవారు. 'నాహి నాహి' వంటి విశేష దినాలలో రాసులకొద్ది పులిహోర శ్రీవైష్ణవుల పులిహోర అంటే అందరికీ నోరూరేది! మా అమ్మ చేతివంట రుచి మరింత! వేలమంది వచ్చేవారు.

'కూడారై' నాడు పాయసం గుండీలతో చేసేవారు. గోతులు తీసి, వాటిని నీళ్ళతో నింపి గుండిగలు అందులోకి దింపేవారు. పాయసం చల్లారడానికి ఆ ఉపాయం. పాయసంలో ఏలకులు – కుంకుమ పూవు – జీడిపప్పు – ద్రాక్ష వగైరాలు వేసేవారు. పాయసం నోటిదాకా పోకముందే ఘుమ ఘుమ! చెంబులు, తప్పేలాతో ఎంతమంది వచ్చినా వినియోగం జరుగుతుంది.

ఆ రోజు ఇంటినిండా పాలు – పాయసం!

తిరువారాధన సమయంలో వైష్ణవులు – ఎందరో – పాశురాలు చదువుతుంటే – అర్థం అయినా కాకున్నా కర్ణపేయంగా ఉండేది. తరువాత వందల స్వాముల సాపాట్లు, తరువాత చందన గోష్ఠి – తిరునామాలు – మంగళ హారతుల గానం! అదొక హృదయంగత – కళాపూర్ణమయిన సత్సంప్రదాయం!

తిరునామాలు – శ్రీవైష్ణవులు మాత్రమే కనుగొన్న – రచించిన; గానం చేసిన – ఒక సాహితీ ప్రక్రియ. ఇది సుమారు జానపదం! ఈ పదాల్లో వైష్ణవ తత్త్వం సులభ, సరళ శైలిలో పాడడం జరుగుతుంది. వీటిలో చక్కని సాహిత్యం ఉంది. ఈ మధ్య తిరునామాల మీద డాక్టరేటు చేసిన వారున్నారు.

మా నాయన గారికి శిష్యులు అనేకులు. మరొక శ్రీవైష్ణవ సంప్రదాయం "శేషం". మా నాయనగారు మజ్జిగ సాదం కలిపినపుడు శిష్యుల వరస ఏర్పడేది. అంతా వైష్ణవులు మాత్రమే. ఒక్కొక్కరు చేయి చాచితే వారి శేషం అంటే ఉచ్ఛిష్ట మజ్జిగ ప్రసాదం ఇసుమంత వారికి ఇచ్చేవారు. అది వారు మహాప్రసాదంగా భావించేవారు.

ధనుర్మాసంలో ప్రతిరోజూ సాయంకాలాల్లో తిరుప్పావై శ్రీసూక్తి సాయించేవారు మా తండ్రిగారు. వేదాలు – ఉపనిషత్తులు – రామాయణ, భారత, భాగవతాలనుంచి ఉదాహరణలు ఇస్తూ గంటల తరబడి అమృతప్రాయంగా ఉపన్యసించేవారు. శ్రోతలు తన్మయులై – అచేతనులవలె వినేవారు. తరువాత హారతి – పంచకజ్జాయ వినియోగం.

ఈ సంప్రదాయం సొంతం శ్రీమద్రామానుజ యతి ఏర్పరచింది. కులాల వ్యత్యాసాలను తొలగించడానికి యత్నించిన ఆద్యులు శ్రీమద్రామానుజులు. అయితే వారి తరువాత కొత్త కులాలు పుట్టాయి. అలాంటిదే శ్రీవైష్ణవ కులం! బసవేశ్వరుని తరువాత కూడా "ఆరాధ్యులు" అనే బ్రాహ్మణకులం – జంగములు అవతరించారు.

మేము బ్రాహ్మణ శ్రీవైష్ణవులం. మేము శాత్తిన వైష్ణవులం – అంటే శిఖాయజ్ఞోపవీతములు దాల్చినవారం. శాత్తాదవైష్ణవులు ఉన్నారు. వారు శిఖాయజ్ఞోపవీతములను వదిలారు. వారు బ్రాహ్మణులుకారు. సంస్కృతం జోలికి పోరు. వారిది ద్రావిడ ప్రబంధం!

మాకు దృష్టి దోషం ఉండేది. అంటే ఇతరులు చూస్తుంటే భోజనం చేయం. అలాంటప్పుడు ఇతరుల దగ్గర తినడం అనే ప్రసక్తి లేనేలేదు. మంచి తీర్థం సహితం మరొకళ్ళ చేత తాగేవాళ్లం కాదు. ఎంగిలి చేసి నీళ్లు తాగడం నిషిద్ధం. ఎత్తిపోసుకోవాలి. మేము ఇతరుల నీళ్ళు తాగడం సరే, ఇతరులుకూడా మాకు ఇచ్చేవారు కారు. అత్యవసరం అవుతే మజ్జిగ – అది లేకుంటే మజ్జిగ చుక్క వేసిన నీరు ఇచ్చేవారు! ఇది ఆచారంలో సర్దుబాటు!!

ఇప్పుడు ఎవరి నీళ్ళు వారు వెంట తీసికెళ్తున్నారు.

బహుశః ఇది ఆ సదాచారపు కొనసాగింపేమో!

నీరు రోగవాహిక అని పాశ్చాత్యులు కొత్తగా చెప్పారని అనుకంటున్నాం. మన వాళ్ళు ఎటుపోయినా నీళ్లు వెంటతీసుకొని పోయేవారు. తాబేలు బుర్రలు – సొర బుర్రలు అందుకు ఉపయోగించేవారు.

ఒకే పరమాత్ముడు శ్రీమన్నారాయణుని నమ్ముకునేది వైష్ణవం. శ్రీమన్నారాయణుడు ఒక్కడే భగవానుడు. అన్యులు దేవతలు కారు. ప్రపత్తి మార్గాన శ్రీమన్నారాయణుని మాత్రమే ఆశ్రయించాలి. అన్యదేవతలను ఆశ్రయించడం పాపహేతువు.

ఒక్క శివుణ్ణి మాత్రం నమ్ముకున్నది శైవం. శివాత్పర తరం నాస్తి. శివుని మించిన దేవత లేదు. శివుని వీర భక్తి పూర్వకంగా అరాధించిన వారికి మోక్షం లభిస్తుంది. అన్యదేవతలను ఆరాధించడం పాపహేతువు.

భారత సంప్రదాయంలో - ఇతిహాసంలో - చరిత్రలో మనకు ఏకదేవ ఉపాసన లేదు. మనం బహుదేవతా ఉపాసకులం. మనకు ప్రకృతి శక్తులు - వాటి అధిష్ఠాన దేవతలు అందరు పూజనీయులే. చెట్టు, పుట్ట సహితంగా అనేక స్త్రీ పురుష దేవతలున్నారు. "ఏప్యన్య దేవతా భక్తాః" అని గీతలో ఉపదేశించిన శ్రీకృష్ణ పరమాత్మ అన్య దేవతలను ఉపాసించవచ్చును అన్నాడు.

నాగరకతలు - సిద్ధాంతాలు - ధర్మాలు - కళలు - సాహిత్యం అన్నీ ప్రాగ్దేశాలు - అంటే, తూర్పు దేశాల్లోనే పుట్టాయి. పశ్చిమ దేశాల్లో మర పుట్టింది. మనిషిని మరను చేసింది. తూర్పు దేశాలు అన్నింటిలో ప్రకృతి శక్తులను - అనేక దేవతలను ఉపాసించారు.

ఒకే ఒక భగవంతుని గురించిన సిద్ధాంతం మొట్ట మొదట జీసస్ క్రీస్తు ప్రతిపాదించాడని నా ఉద్దేశం. అయితే 500 సంవత్సరాల తరువాత మహమ్మదు ప్రవక్త అవతరించేవరకు, తరువాతకూడా జెరూసలం చుట్టుపక్కల అరబ్బుల మీద క్రైస్తవ ప్రభావం కనిపించదు. మహమ్మదుకు ముందు అరబ్బు దేశాలలో బహుళ దేవతారాధన - విగ్రహారాధన విచ్చలవిడిగా ఉండేవి. "అల్లా తప్ప అన్యదేవత లేదు. మహమ్మదు అల్లా యొక్క చివరి దూత" అనే సిద్ధాంతాన్ని మహమ్మదు ప్రవక్త ప్రవచించినాడు. స్థిరపరచినాడు.

ఏకేశ్వర ఉపాసనను గట్టిగా విశ్వసించింది, ప్రచారం చేసింది, ఇస్లాం మాత్రమేనని నా అభిప్రాయం. ఇస్లాం ఎంతో వేగంగా వ్యాపించింది. మహమ్మదు ప్రవక్త తరువాత రెండు మూడు శతాబ్దాలకే ఇస్లాం భారతదేశంమీద దండయాత్ర చేసింది.

ముస్లిముల దండయాత్ర - యుక్తాయుక్తత గురించి చెప్పడానికి నేను చరిత్ర చెప్పడం లేదు. ఏకేశ్వరోపాసనను గురించి అవ్యక్తంగా ఆదిశంకరుని - వ్యక్తంగా రామానుజుని, బసవేశ్వరాదులను ప్రభావం చేసింది ఇస్లాం ఆలోచనావిధానం అని నా నమ్మకం. దీనిని గురించి విజ్ఞులు పరిశోధించాలి.

శ్రీవైష్ణవులకు శ్రీమన్నారాయణుడు తప్ప అన్యదేవతలు లేరు అని మనవి చేశాను. ఇతర దేవతల — ముఖ్యంగా శివుని పేరు మేం ఉచ్చరించం. సత్యం — శివం — సుందరం అనం. సత్యం— శుభం — సుందరం అంటాం. శివుని పేరు ఉచ్చరించడం మహాపాపం.

మేము గుంటిమల్లన్న బజారులో ఉన్నాం. మా ఇంటికి కొద్ది దూరంలోనే శివాలయం. చుట్టుఅయినా మా నాయనగారు శివాలయం వెనుకనుంచి వెళ్ళేవారు

తప్ప, ముందునుంచి వెళ్ళేవారు కారు. మల్లేశ్వర స్వామి సేవవస్తే తలుపులన్నీ బిగించి దొడ్లో కూర్చునేవారు.

అయితే జీవితం ఉందే – అది చిత్రాతిచిత్రమైన త్రాపదం. తన చిరునామా వ్రాయవలసి వచ్చినపుడు మా నాయనకు 'గుంటి మల్లన్న బజారు' అనక తప్పేది కాదు. కాలక్రమంలో కుటుంబ కలహాల వలన గుంటి మల్లన్న బజారు వదలాల్సి వచ్చింది. మా నాయనగారు మారినది "శివాలయం వీధి!"

నేను అతివైష్ణవ వాతావరణంలో పెరిగాం. నేను మూడో తరగతిలో ఉన్నాను. ఉర్దూ వాచకం చదివించే పీరియడు ఉండేది. నేను చదువుతున్నాను. "శివాయ్" అనే పదం వచ్చింది. ఉర్దూలో శివాయ్ అంటే "తప్ప" అని అర్థం. నేను వీర వైష్ణవుణ్ణి "శివ" అంటానా! అక్కడ ఆగిపోయాను. టీచర్ షేఖ్ మీరాఁ చదవమన్నాడు. నేను మౌనం వహించాను. అతడు పేము బెత్తంతో బాదుతున్నాడు. అయినా నేను పలకను.

పర్వయ్యగారని మా నాయన శిష్యుడు – ఆ బడిలో ముద్రిస్, అంటే టీచరు. వారికి నేనంటే ఎంతో ప్రేమ. వాళ్ళకు పిల్లలు లేరు. నేను వాళ్ల ఇంట్లోనే ఉండేవాణ్ణి. వాళ్లు అపక్వాహారులు. అందువల్ల మా నాయన అనుమతించారు.

షేఖ్ మీరాఁ నన్ను బాదుతుండడం చూచారాయన. పరిగెత్తుకు వచ్చారు. వారించారు. విషయం అడిగారు. 'బచ్చా హుషార్ హై. ఆగే పఢ్తానహీ' పిల్లవాడు తెలివైనవాడే. తరువాతిది చదవడు అన్నాడు. నన్ను అడిగారు. "శివాయ్" వేలుతో చూపించి "ఇది చదవను" అన్నాను. నర్సయ్యగారు చేతితో తలబాదుకున్నాడు. "ఆప్‌దూర్ డాలియే యహ్ నహీ కహేగా" – 'మీరు చంపండి. ఈ మాటలనడు అని' కారణం వివరించారు. అప్పుడు క్లాసులో పిల్లలు, టీచరు అంతా గొల్లున నవ్వారు.

పర్వయ్యగారు నన్ను మా ఇంటికి తీసికెళ్లి మా నాయనకు వివరించారు. నేను వీరవైష్ణవుణ్ణి అయినందుకు నన్ను మెచ్చుకున్నారు. కాని అంటుకోలేదు. "బడ బట్టలు విడిచి స్నానం చేసిరా" అన్నారు.

అలాంటి విశ్వాసాలు గలవాళ్ళం మేము. అప్పటికి మా వాళ్లలో ఎవరూ తమ పిల్లలకు మ్లేచ్ఛ విద్య చెప్పించి మైల పడేయదలచలేదు. సంప్రదాయ విద్య – శిష్య సంచారం – ఇసుమంత వ్యవసాయం. అంతటితోనే సరిపుచ్చుకున్నారు.

మా అన్నయ్యకు మ్లేచ్ఛ చెప్పించడానికి మా నాయనగారి నిర్ణయం ఎంతో ముందడుగు అని చెప్పాలి. వారు మొత్తం కులాన్ని ఎదిరించారు. మా మాతామహి, పితామహులను ఎదిరించారు. మా నాయనగారి అఖండ పాండిత్యపు అండలేకుంటే మేము కుల బహిష్కారానికి గురి కావలసివచ్చేది.

మా నాయనగారి ఆ సంస్కారం మద్రాసు నివాసంవల్లకావచ్చు. వారికి గాంధీజీ అంటే ఎంతో ప్రీతి. రాముడు, కృష్ణుని గురించినట్లువలె మహాత్ముని గురించి చెప్పేవారు. గూడూరులో కూడా వారానికి రెండుసార్లు వచ్చే "గోలకొండ పత్రిక" తెప్పించేవారు.

జీవితంలో ఇలాంటి సంఘటనలు ఎంతో ప్రభావం వేస్తాయి! మా నాయనగారు ఆనాడు ఆ నిర్ణయం తీసుకుని ఖమ్మం మారకుంటే మేమూ శిష్య సంచారాలు చేస్తూ కాలక్షేపాలు చెప్పుకునేవాళ్ళం.

రాజమహేంద్ర వరంలో ప్రకాశం పంతులుగారి పడవ వెళ్ళిపోయి ఉంటే అయన ఏమయ్యేవాడో?

మా అన్నయ్య ఖమ్మం రికాబ్ బజార్ తహతాన్యాలో నాలుగవ తరగతిలో చేరినట్లు గుర్తు. ఇంట్లో సంప్రదాయ విద్య నేర్పేవారు.

నా చదువు విషయం కుటుంబంలో మళ్ళీ ఒక సమస్య అయింది.

1. మా వంశంలో తెలిసినంతవరకు – ఒక్కడే మగ పిల్లవాడు. మేమే ఇద్దరం. మాలో ఒకరు ఉండరు – అంటే బ్రతుకరు అని నిశ్చయించుకున్నారు. ఆ బతకనివాణ్ణి నేనే అని వారికి తెలిసిన శాస్త్రం ప్రకారం నిశ్చయించుకున్నారు. నన్ను చదివించి ప్రయోజనం లేదని నిశ్చయించుకున్నారు.
2. నేను బతుకుతానే అనుకున్నా ఉన్న శిష్య సంపద సంప్రదాయం నాకు అప్పగించడం మంచిది అనుకున్నారు. కలకాలంగా వస్తున్న వృత్తిని వదులు కోవడం ఇష్టం లేదు.
3. మా అన్నయ్య చదువుకుని తహసీల్దారు అవుతాడు. అప్పటికి అదే పెద్ద ఉద్యోగం. కనుక గ్రామంలో ఉండి వ్యవసాయం చూసేవాడు కూడా కావాలి. అది నాకు అప్పగించదలిచారు. వార్ధక్యంలో మా మాతాపితరులు నా దగ్గర ఉండి "రామా కృష్ణ" అనుకుంటారు.

ఇంత ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిందేమంటే – నాకు సంప్రదాయ విద్య చెప్పించాలి. అయిదు రోజులు వైభవంగా నా ఉపయనం చేశారు. వందల బండ్లలో బంధువులు వచ్చారు. వారాల తరబడి ఉన్నారు. అదొక వైభవం. అది బంధు ప్రేమకు నిదర్శనం! మా అన్నయ్య ఉపనయనం అంతకుముందే జరిగింది.

రామ శబ్దంతో నా విద్య ప్రారంభం అయింది.

అది సంధియుగం. అప్పుడు ప్రతిదాన్ని గురించీ అంత ఆలోచన. ఇప్పుడు ఆలోచన లేదు. అంతా స్థిరపడింది. అందరికీ అంగ్రేజీ నేర్పడమే! కాన్వెంటు స్కూల్లో చేర్చడమే!

నన్ను ఉమామహేశ్వరరావు బళ్లో చేర్పించారు. ఉమామహేశ్వరరావు గారు బ్రాహ్మణులే కాని విద్యావంతులు కారు. శతకాలు, పెద్ద బాల శిక్ష చదివాడు. బ్రాహ్మణులు ఎవరూ పిల్ల నివ్వలేదు. ఒక స్త్రీని చేరదీశాడు. వారికి ఒక కూతురు. అందమైంది. వయసులో ఉంది. చిలిపి పనులు చేస్తుండేది. అప్పుడప్పుడు చదువుకూడా చెప్పేది. ఆ పిల్ల వారికి కలిగింది కాదు అనుకునేవారు.

నా చదువుకు నెలకు పావలా ఇచ్చేవారు

గడియారాలు – సమయం ఇంకా స్థిరపడలేదు. బడి తెల్లవారు జామునుంచి సాయంకాలం దాకా ఉంటుంది. ముందు వచ్చి వసారాలో కూర్చున్నవాడు "శ్రీ" తరువాత వచ్చినవాడు "చుక్క" ఆ తరువాత ఒక దెబ్బ – రెండు దెబ్బలు. అట్లా చివరికి వచ్చినవాడికి అందరికంటే ఎక్కువ దెబ్బలు!

పంతులుగారు లేవరు. బయటికి రారు. పంతులుగారు బయటికి వచ్చింతరువాత "శ్రీ" పంతులు ముందుకు వెళ్తాడు. అతని చేతులో సరస్వతి చుడ్తారు. శ్రీ

చెప్పిన వాని చేతులో బెత్తంతో కుచ్చి చుక్కను చేస్తారు. తరువాత వాడిని చుక్క చెపుతాడు. వాడికి ఒక దెబ్బ. అలా చివరివాడిదాకా సాగుతుంది.

పంతులు వచ్చేదాకా బడిపెద్ద గుణింతాలు – ఎక్కాలు – ఎరుసులు చదివిస్తాడు. ఒకడు చెపుతాడు. అంతా కలిసి చదువుతారు.

పంతులుగారు లేచి వచ్చి కొత్తపాఠం చెపుతారు. అది కూడా కంఠోపాఠమే – నోటికి రావలసిందే. ఎక్కువగా చదివేది ఉండదు. గుణింతాలు, ఎక్కాలు బాగా వస్తాయి. కాబట్టి సాధారణంగా తప్పులు ఉండవు. ఎరుసులు అంటే సుమారు ఎక్కాల లాంటివి. కాసులు ఎరుసు. అణాల ఎరుసుల – గిద్దెల ఎరుసు ఇలా ఎన్నో చెప్పుతారు. ఇన్ని కాసులు ఎంత? ఇన్ని అణాలు ఎంత? ఇన్ని గిద్దెలు ఎంత? ఇత్యాదయః. అన్నీ నోటికి ఉంటాయి. కాబట్టి టక్కున చెప్పుతారు. సుమారు కంప్యూటర్‌లాగే. కాగితం కలం అక్కరలేదు. అంతా నోటికే!

తిథులు – నక్షత్రాలు – వారాలు – మాసాలు – ఋతువులు – సంవత్సరాలు – నదులు – పర్వతాలు మున్నగు చరిత్ర, భూగోళం, సామాజిక శాస్త్రం, నీతి శాస్త్రం వగైరా నిత్య జీవితానికి అవసరం అయినవి అన్నీ చెప్పుతారు.

సుమారు ఎనిమిదింటికి పళ్ల తోముకొని ముఖం కడుక్కోవడానికి వదులుతారు. అప్పుడు పిల్లలు ఇండ్లకు వెళ్తారు. ముఖాలు కడుక్కుంటారు. చద్దన్నం – మామిడి ఊరగాయ తింటారు. అప్పటికి టీలు – కాఫీలు లేవు. తిరిగి బడికి చేరుకుంటారు. మళ్ళీ మధ్యాహ్నం అలాగే భోజనాలకు వెళ్ళివస్తారు. సాయంకాలం నీతి శతకాలు చదివించి 'దీపం జ్యోతి' చదివించి బడి వదులుతారు.

పిల్లలు ఇంటివద్ద చేసేపని – అంటే హోంవర్క్ ఉండదు. బడి వదులుతే ఆటలే! తొక్కుడు బిళ్ల – బిళ్ళంగోడు – ఉప్పు బెర – చెడుగుడు – కోతి కొమ్మంచి వగైరా.

ఈ మధ్య ఆనాటి పద్ధతి ఆరోగ్యానికి అనుకూలం అయింది అంటున్నారు.

1. ఒక్క పలక – ఒక పుస్తకం – కూర్చునే గోనెసంచి లేదా చిరుచాప తప్ప పిల్లలు మోసుకొని పోవలసింది లేదు. పలక అంటే రాతిపలక కాదు. చెక్క పలక. దానికి ఒక రకం ఆకు బొగ్గు దంచి పట్టించాలి. అది నల్లనవుతుంది. మధ్య మధ్య అలా చేస్తుండాలి. అదికూడా లేకుండా ఇసుకకుప్పమీద అక్షరాలు వ్రాసే పద్ధతి ఉంది.

   పుస్తకాల బరువు కరీదు తండ్రికి లేదు. మోసే భారం పిల్లలకు లేదు.

2. చదువు మొత్తంలో కంటిమీద భారం లేదు. చదివేది తక్కువ. జ్ఞాపకం చేసేది ఎక్కువ. కాబట్టి బాల్యంలోనే దృష్టిలోపాలు రావు.
3. బడి వదులుతే పిల్లలకు విశ్రాంతి. Home Work బెడద లేదు. తల్లిదండ్రులకూ, పిల్లలకూ మానసిక విశ్రాంతి. ఇది పిల్లలు ఆరోగ్యంగా ఎదగడానికి ఉపకరిస్తుంది.
4. సమయం ప్రకారం; నిర్దిష్ట విరామం – తరువాత భుజించడం ఆరోగ్యకరం అని డాక్టర్లు అంటున్నారు. నిర్విరామంగా వేళా పాళా లేకుండా తినడమే అనేక రోగాలకు కారణం అంటున్నారు.

5. ఎవరి వృత్తులు వారికి సిద్ధంగా ఉండేవి. ఉద్యోగాన్వేషణలు, మానసిక వత్తిడులు లేవు. జీవితంలో పరుగు పందాలు లేవు. కాళ్ళు కూలటం లేదు.

6. చదివిన చదువు నిత్య జీవితానికి అక్కరకు వస్తుంది. సరిపోతుంది.

7. అన్నింటినీ మించి ఆనాటి విద్యా విధానం దురాశలకు పోనీయదు. యాంత్రిక యుగపు దుఃఖాలన్నింటికి కారణం దురాశయే!

వారాంతపు శలవులు ఉండేవికావు. అనధ్యయనత్రయం – అంటే త్రయోదశి – చతుర్దశి – పౌర్ణమి లేక అమావాస్య. ఆ విధంగా 15 రోజులకు మూడు రోజులు శలవు. శలవు అనే పదం వీధి బడులకు తెలియదు. శలవును ఆటవిడుపు అనేవారు.

అది భయం, విధేయత మీద ఆధారపడిన సమాజం. "భీషాషూర్యో ఉదేతి". భయంతోనే సూర్యుడు ఉదయిస్తాడు, గాలి వీస్తుంది అంటుంది వేదం. పిల్లలం తండ్రి ఎదుటకు పోవడానికి జంకేవాళ్ళం. తండ్రి చెప్పింది అక్షరాల వినాలి. లేకుంటే శిక్ష, దెబ్బలు కొట్టడం – కళ్లల్లో శొంఠిగంధం వేయడం – గదిలో వేసి తలుపు వేయడం ఇలాంటివి. తల్లి చూస్తూ ఉండాల్సిందే – అడ్డురావడానికి వీల్లేదు. పిల్లలు తల్లితండ్రులకు విధేయులు.

పంతులుకు సైతం పిల్లల మీద సకల హక్కులూ ఉండేవి. బడికి పిల్లవాడు రాకుంటే పంతులుగారు నలుగురు పిల్లలను పంపించి పట్టి తెప్పించేవాడు. పాఠాలు చదవకున్నా, చెప్పిన మాట వినకున్నా వివిధ శిక్షలు ఉండేవి. 1. దెబ్బలు, 2. గోడ కుర్చీ, 3. తొడపాశం, 4. కోళ్లగుది 5. కోదండం 6. ఎండలో నిలబెట్టడం లాంటివి.

పంతులుగారి ఇంటి పనులు కూడా పిల్లలు చేయాలి. శ్రీకృష్ణుడు – సుదాముడు తమ గురువయిన సాందీపని కోసం అడవికి పోయి కట్టెలు తెచ్చారు. మేము బట్టలు ఉతకడం – అంట్లు తోమడం – బజారు నుంచి సరుకులు తేవడం లాంటి పనులు చేసేవాళ్లం.

పంతులుగారికి – అయ్యవారికి – నశ్యం తెచ్చి ఇవ్వాలి. పరిగెత్తి వెళ్లి, పరిగెత్తి రావాలి. గడియారం లేదు. ఇన్ని నిముషాల్లో రమ్మని చెప్పడానికి వీల్లేదు. అందువల్ల ఎండలో ఉమ్మేసి పోవాలి. అది ఆరేవరకు పరిగెత్తుకు రావాలి. ఉమ్మి ఎండిపోయిన తరువాత వస్తే దెబ్బలు!

భయం మీద ఆధారపడిన సమాజం నాకు నచ్చదు. సమాజం ప్రేమాభిమానాల మీద ఆధారపడాలని నా ఉద్దేశం. అందరినీ ప్రేమించడం సాధ్యం అవుతే, ఎవరికీ ఎవరూ హాని చేయరు. ఒకరి కోసం ఒకరు త్యాగం చేస్తారు. త్యాగం తెలిసిన సమాజంలో సుఖసంతోషాలు వెల్లివిరుస్తాయి.

వాల్మీకి త్యాగం మీద ఆధారపడిన సమాజాన్ని దర్శిస్తాడు. రాముడు తండ్రి కోసం రాజ్యం వదులుకుంటాడు. సీతాలక్ష్మణులు రాముని కోసం రాజ్యభోగాలు వదులుకుంటారు. భరతుడు అన్న కోసం రాజ్యం వదులుకుంటాడు. "నా ఇహం అర్థపరో దేవీ" అంటాడు రాముడు. నేను అర్థపరుణ్ణి కాదు, ధర్మపరుణ్ణే అంటాడు. అతడు ధర్మంకోసం అర్థాన్ని త్యజించాడు.

రంతి దేవుడు తనకు ఉన్నది సొంతం ఇచ్చి – తనకు తిండిలేకున్నా సకల ప్రాణిజాలపు దుఃఖాలన్నీ తనకే కలిగించమనీ – ప్రాణిజాలం సొంతం సుఖంగా వర్ధిల్లాలనీ ప్రార్థిస్తాడు. రంతి దేవుని ప్రార్థన మానవుల విషయంలో మాత్రం కాదు. చెట్టు, చేమ, పక్షులు, పశువులు అన్నింటికీ వర్తింప చేసి "అహం బ్రహ్మాస్మి" నేనే బ్రహ్మను అన్న దశకు ఎదిగాడు.

శిబి తనను శరణు కోరిన పావురం కోసం తన శరీరం మాంసం కోసి ఇచ్చి ప్రేమ పూర్ణుడు – త్యాగ ధనుడు – మహా మహిమాన్వితుడు అయినాడు.

గౌతముడు, క్రీస్తు, ప్రేమవేదం ప్రవచించినారు.

నేటి సమాజానికి లక్ష్యం లేదు. అది సరంగులేని ఓడవలె దిక్కులేకున్నది. దీనికి భయము, విధేయత లేవు. ప్రేమ, అభిమానము లేవు. ఈ సమాజానికి ఉన్నవి దురాశ – డబ్బుమాత్రమే. ఈ రెండూ మానవుని మనసును తొలగించి రక్కసిగా మార్చాయి.

రక్కసుల రాజ్యం కలకాలం కొనసాగడానికి వీళ్ళేదు!

మా పంతులు గారు ఉమామహేశ్వర రావుగారికి మిరపకాయలు ఎక్కువగా ఉన్న పులిహోర ఇష్టం. మా అమ్మ వేంకటమ్మగారు అన్నపూర్ణ. ఆమెకు పెట్టటంలో మహదానందం! గిన్నెనిండా పోపు మిరపకాయలు ఎక్కువగా ఉండే పులిహోర అదిమిపెట్టి – దానిమీద మోదుగాకుల విస్తరి మూతవేసి నా తలమీద పెట్టేది. నేను మోసుకొని పోయి పంతులుగారికి ఇచ్చేవాణ్ణి. ఆ పులిహోరను పంతులుగారు మెచ్చుకుంటునే ఉండేవాళ్లు.

పిల్లలు ఎవరింట ఉన్నవి వారు – కూరగాయలు, పండ్లు, పప్పులు, ధాన్యం తెచ్చి ఇచ్చేవారు. ప్రతినెల పంతులు గారికి ఇచ్చేది పావలా. నెల అంటే ఒకటవ తేదీ కాదు. అమావాస్య.

దసరా – విజయదశమిల – రాక పంతుళ్ళకు పిల్లలకు పెద్ద సంబరం. పిల్లలు మంచి బట్టలు వేసుకొని కాగితపు జండాలు పట్టుకుని 'జయీభవ విజయీభవ', 'దిగ్విజయీభవ' అని పంతులుగారి వెంట ఊరేగింపుగా వెళ్తారు. ప్రతి పిల్లవాడి ఇంటికి వెళ్తారు.

"రేపురా, మాపురా మళ్లి రమ్మనక
పావలా పరకయితె పట్టేది లేదు.
అయ్యవారికి చాలు అయిదు వరహాలు
పిల్లవాళ్ళకు చాలు పప్పు బెల్లాలు."

అవి దసరా పద్యాలు చదువుతారు. తరువాత ఆ పిల్లవాడితో ముఖ్యంగా పద్యాలు వగైరా చదివిస్తారు. ఇంటివాళ్లందరూ కూడి ఆనందం పంచుకుంటారు.

అదంతా జరిగింతరువాత పంతులుగారిని – తమ తమ అంతస్తును బట్టి – బట్టలు వగైరాలతో సత్కరిస్తారు. పిల్లలకు పంచదార చిలకలు, బత్తీసాలు, నువ్వుండలు, పప్పు బెల్లాలు, ఒక్కొక్కరు ఒక్కొక్కతీరు పంచి పెడ్తారు.

తతంగం ముగుస్తుంది. పిల్లలు మహదానందంతో "జయీభి జయీభవ – దిగ్విజయీభవ" అని ముక్త కంఠంగా నినాదం చేస్తూ బయల్దేరుతారు. అలా అందరి పిల్లల ఇండ్లకూ వెళ్తారు.

మా ఇంటికి వచ్చినపుడు నేను బళ్లో చెప్పిన పద్యాలు మాత్రమే కాక ఇంట్లో నేర్చుకున్న శ్లోకాలు కూడా చదివేవాణ్ణి. పంతులువారి సహితంగా మా ఇంటి వాళ్లందరూ మురిసిపోయేవారు. మా అమ్మ నన్ను ఎత్తుకొని ముద్దాడేది. అది అవధుల్లేని ఆనందం.

తల్లి ప్రేమను మించింది ఏ లోకంలోనూ లేదు.

మా అమ్మ కష్టాలకే పుట్టింది. 1960లో గార్లలో పరమపదించారు.

మా నాయనగారు – తాతగారు మెచ్చుకునేవారు కారు. చిన్నలను పెద్దలు మెచ్చుకోరాదట. ఇందుకు సంబంధించిన మహాకవి – కిరాతార్జునీయ మహా కావ్య కర్తకు సంబంధించిన ఒక కథ ఉంది.

భారవి మహాపండితుడయినా తండ్రి మెచ్చుకునేవాడు కాడు. భారవి కోపం పరాకాష్టకు వచ్చింది. అతడు తండ్రిని వధించడానికి సిద్ధం అయినాడు. "మన భారవి గొప్పదనం నాకంటె తెలిసినవాడు లేడు. పెద్దలు చిన్నలను మెచ్చుకొంటే చిన్నలకు ఆయుక్షీణం అవుతుంది. ప్రతిభ తగ్గుతుంది" అని తండ్రి తల్లితో చెప్పడం భారవి వింటాడు. తండ్రి కాళ్ళమీద పడ్తాడు. తనకు శిక్ష విధించమని మొండిపట్టు పడ్తాడు. గంజిపోసేవరకు అత్తవారింట్లో ఉండమని తండ్రి శిక్ష విధిస్తాడు.

అత్తవారింటి భారవి కథ రసవత్తరమయింది. కాని మనకు అప్రస్తుతం.

మా ఇంట్లో పిల్లలకు మాత్రం బత్తీసాలు దొరికేవి. ఉమామహేశ్వరరావు వారు మా తాతయ్యకు, నాయనమ్మకు పాదాభివందనం చేసేవారు. "ఆశీర్వచనం" చాలును అనేవారు. మా పితామహుల ఆశీస్సుల ముళ్ళతో – అందరి ఇళ్లను మించి మురిసిపోతూ – పంతులుగారు మా ఇంటినుంచి బయటపడేవారు.

మా తాతయ్య బహిర్భూమినుంచి వస్తూ, చెంబు బయట పెట్టి – సాయంకాలం కర్రతో బడిలో ప్రవేశించేవారు. ఉమామహేశ్వరరావు గారు సాదరంగా ఆహ్వానించేవారు. వారి స్థానం మా తాతగారికి ఇచ్చేవారు. వారికి అది పర్వం.

మా తాతగారు కొన్ని విశేషాలు పంతులుగారికి మాకు మాంధాత నుంచి నేటి వరకు అనేక కథలు చెప్పేవారు. ప్రతిరోజూ వచ్చేవారు కారు. అయినా తరచు వచ్చేవారు. నాతో పద్యాలు – శ్లోకాలు చదివించుకుని సంతోషించేవారు. మెచ్చుకునే వారు కాదు. మా పంతులు గారు మెచ్చుకుంటే వారించేవారు. అప్పుడే వారు భారవి కథ చెప్పారు.

అలా ఒకసారి మా తాతగారు వచ్చారు. "రంగనికి బాల శిక్ష అయిపోయింది. మొదటి వాచకం కొనిపెట్టండి" అన్నారు ఉమామహేశ్వరరావుగారు. మా నాయన మొదటి వాచకం కొనలేదు. మూడో వాచకం అడిగి తెచ్చారు. నేను ఎంతో సులువుగా మూడోవాచకం పూర్తిచేశాను.

ఒకనాటి ఉదయం బడికి వెళ్లాను. అంతా బోసి బోసిగా ఉంది. పిల్లలు వచ్చినవాళ్లు వచ్చినట్లు వెళ్లిపోతున్నారు – పంతులుగారు ఖిన్నులయి ఉన్నారు. పంతులమ్మ తలబాదుకొని ఏడుస్తున్నది. పంతులమ్మ చిలిపి కూతురు కనిపించలేదు. నేను వెళ్ళిపోలేదు. పంతులుగారి పక్కన కూర్చున్నాను. అలా కొంతసేపు మౌనంగా

కూర్చున్నాను. పంతులుగారు దుఃఖాతిశయంలో ఉన్నారు. వారి చెంపలమీంచి కన్నీరు పారుతున్నది. కాని, వారి ఏడుపు వినిపించడం లేదు. మౌనంగా విలపిస్తున్నారు.

నేను పంతులుగారిని చూస్తున్నాను. వారిలోని దుఃఖం క్రమంగా నాలో ప్రవేశిస్తున్నది. ఉండి, ఉండి బోరుమని ఏడ్చాను. అప్పుడు పంతులుగారు నా ఉనికి గమనించారు. వారు నన్ను లాక్కొని వారి వడిలో వేసుకున్నారు.

"రంగడూ! లేచిపోయిందిరా" అని పెద్దగా ఏడిచారు.

వారి ఏడుపు విని నేను బిత్తరపోయాను. నాకేమీ అర్థం కాలేదు. లేచి నుంచొని నా చొక్కాతో వారి కన్నీరు తుడిచాను. వారి దుఃఖ సముద్రపు కట్టలు తెగాయి. నన్ను కావలించుకుని, పెద్దగా ఏడ్చారు. లోన ఏడుస్తూండిన పంతులమ్మ లేచి వచ్చి పంతులుగారి మీదపడి ఏడ్వసాగింది.

వారి ఏడుపులు దిగ్దిగంతాల ప్రతిధ్వనించాయి.

కాని ఒక్క నరమానవుడు తొంగి చూడలేదు

ఏమీ ఎరగనట్లే సూర్యుడు ఉదయించాడు.

వీధిలో బండ్లు గంటల చప్పుడుతో బీటుకు పోతున్నాయి.

మా అన్నయ్య వచ్చి వాకిట్లో నుంచున్నాడు. నన్ను రావలసిందని సైగ చేస్తున్నాడు. పంతులుగారు నన్ను పట్టుకున్నారు. వదలడం లేదు.

మా అన్నయ్య మాటి మాటికీ రమ్మని పిలుస్తున్నాడు. చాల సేపటికి పంతులుగారు మా అన్నయ్యను చూచారు. చప్పున ఏడుపు మానారు. నన్ను వదిలారు. పంచెతో కన్నీరు తుడుచుకున్నారు.

నేను అయోమయంలో పడ్డాను. వెళ్ళాలా? వద్దా?

అన్నయ్య పిలుస్తున్నాడు. పంతులుగారికి పాదాభివందనం చేశాను. ఎందుకో పంతులుగారు మళ్ళీ కనిపించరు అనిపించింది. బయటపడ్డాను. అన్నయ్య భుజంమీద చేయివేసి నడిపించాడు.

"అన్నయ్యా! లేచిపోవటం అంటే ఏమిటి? రెక్కలొస్తాయా?"

"నాకూ తెలియదు. నాయన నిన్ను తీసుకు రమ్మన్నారు. నడువు ఇంటికి" అన్నాడు.

ఇల్లు చేరుకున్నాం. మా నాయన నిప్పులు చెరుగుతున్నారు. నన్ను చూసి మరీ మండిపడ్డారు. ఆరోజు నా వీపు బద్దలయ్యేదే. కాని, నన్ను వారు ముట్టుకోరాదు.

"వెర్మాఃకొడకా! బట్టలు విడిచి స్నానం చేయి" అన్నారు.

"లేచిపోయింది అంటే ఏమిటి? రెక్కలొస్తాయా?" ఈ ప్రశ్న ఎందుకో ఇంట్లో ఎవరినీ అడిగే ధైర్యం లేకపోయింది. సింగరమ్మ అత్తయ్య దగ్గరికి వెళ్ళాను. ఆమె అద్దం ముందు కూర్చుంది. తల దువ్వుకుంటున్నది. నేను ఆమె పక్కన కూర్చున్నాను. అద్దంలో కనిపిస్తున్నాను. అయినా మాట్లాడలేదు. నేనే అడిగాను.

"అత్తయ్యా! లేచిపోయింది అంటే ఏమిటి? రెక్కలొస్తాయా?"

అత్తయ్యలో చెప్పరాని ఆవేశం వచ్చింది. "నా పిచ్చి నాయన! వెర్రినాయన! ముద్దు నాయనా!" అని ముద్దులు కురిపించింది కాని అదేమిటో చెప్పలేదు.

చూడమ్మ అమ్మమ్మ విన్నది. "ఎవతో నిన్ను తీసుకు లేచిపోతుందిలే" అని గల గల నవ్వి పాన్ తిన్నది.

నాకు ఏమీ అర్థం కాలేదు. ఇంటికి చేరుకున్నాను. పాపం, పంతులుగారు అంత దుఃఖంలో ఉన్నారు. నాయన కెందుకు వారిమీద కోపం?

మనిషిని ఆదుకోలేని పాండిత్యం పనికిరాదు అనిపించింది. ఇవ్వాళ చెబుతున్నంత స్పష్టంగా కాకపోవచ్చు. కాని నా చిన్న మనసులో అలాంటి భావమే కలిగింది.

తెల్లవారి ఇంట్లో దెబ్బలు కొడ్తారని తెలిసీ పంతులుగారింటికి వెళ్లాను. తాళం వేసి ఉంది. ఎందుకో ఎంతో బాధ అనిపించింది. పంతులుగారు వెళ్లిపోయారు. వసారాలలో కాసేపు కూలబడ్డాను. లేచి గుంటి మల్లన్న మఠ్రికిందికి వెళ్లాను. గుడిలో చూచాను. సత్రంలో చూచాను. కనిపించలేదు. బడి పిల్లవాడు రాములు కనిపించాడు. అడిగాను. "ముఖం చూపించలేక పారిపోయాడు" అన్నాడు. అట్లా అని వాళ్ళ అమ్మ చెప్పిందట. వాడికి అంతే తెలుసు.

మళ్లీ పంతులుగారు కనిపించలేదు!

1943లో బెంగాల్లో భయంకరం అయిన క్షామం వచ్చింది. 50 లక్షల మంది తిండి దొరక్క మలమల మాడి చచ్చారు. మొత్తం భారతదేశం కదిలింది. కరువు బాధితుల కోసం జోలెలు కట్టుకుని భిక్షాటనకు బయల్దేరిన వాళ్లలో నేనూ ఉన్నాను.

అర్వపల్లివారి సత్రపు అరుగుల మీద జనం మూగి ఉన్నారు. వెళ్లి చూచాను. ఆ శవం ఉమామహేశ్వరరావు పంతులుగారిది! నామీద గుట్టలు కూలాయి. శవం మీద పడి ఏడ్చాను. బెంగాలు కరువు కోసం వసూలయిన డబ్బులో కొంత దహన సంస్కారానికి ఇమ్మన్నాను. అలా వీలుపడదన్నారు. నా జోలె వారికి ఇచ్చేశాను.

కనిపిస్తున్న శవసంస్కారానికి సాయం చేయలేని వారు బెంగాలు బాధితులను ఆదుకుంటామనడం నాకు విడ్డూరం అనిపించింది.

అక్కడ ఉన్న కొందరితో కలిసి చందాలు వసూలు చేశాం. ఉమామహేశ్వరరావుగారి దహన సంస్కారం మునేరు వద్దున చేశాం.

ఎక్కడ పుట్టినవాడో ఇక్కడ బూడిద అయినాడు! విధి ఎంత బలీయం అయింది! కాలోఽయం దురతిక్రమః అన్నాడు వాల్మీకి కాలాన్ని అతిక్రమించడం అసాధ్యం!

బెంగాలు కరువును గురించి భవానీ భట్టాచార్య ఇంగ్లీషులో రెండు మహత్తరం అయిన నవలలు వ్రాశారు. 'So Many Hungers' అనే నవలను మానేపల్లి తాతాచార్యులవారు తెనిగించారు. అది గోలకొండ పత్రికలో సీరియల్‌గా వచ్చింది. ఆ పత్రికవారే పుస్తకంగా ప్రచురించారు.

భవానీ భట్టాచార్య రెండవ నవల He Who Rides A Tiger. దాన్ని నేను తెనిగించాను. 1960లో వట్టికోట అళ్వార్‌స్వామిగారు వారి దేశోద్ధారక గ్రంథమాలలో ప్రచురించారు.

మా అన్నయ్య హైస్కూలులో మొదటి ఫారం అంటే 5 వ తరగతిలో చేరారు. అప్పటికి అది పెద్ద తరగతే. అన్నయ్య కోసం కొత్త బట్టలూ – కొత్త పుస్తకాల అడావుడీ.

ఉమామహేశ్వరరావుగారి బడి మూతపడటంతో నా చదువు మళ్ళీ సమస్య

అయింది. మా తాతయ్య నాకు అమరం ప్రారంభించారు. మా నాయన ఇంట్లో ఉంచుకొని, భోజనం పెట్టి, ద్రావిడ వేదం బోధించే శిష్యులు ఉండేవారు. వారికి తీరిక దొరకదు. కుంటుతూ నా చదువు సాగుతున్నది.

లంకా వెంకట నరసయ్యగారు రికాబ్ బజారు తహతాన్యా సదర్ ముద్రిస్ – అంటే హెడ్‌మాస్టరు – మా నాయనకు శిష్యులు. వారు పండితులు. యోగ్యులు. కొత్త విషయాలలో ఆసక్తి కలవారు. వారు "ప్రాథమిక హితచర్య" అనే తెలుగు పుస్తకం రచించారు.

వెంకట నరసయ్యగారి భార్య అప్సరస. ముట్టుకుంటే మాసిపోతుంది అన్నట్టు ఉండేది. ఆమె రోజూ వడ్లపూడి నారింజ రసం తాగేది. నేను వెళ్తే నాకూ తొనలు వలిచి పెట్టేది.

ఒకనాడు వారిని అడిగాను. "నారింజ రసం తాగుతే అంతా మీవలె అవుతారా?"

"నేను అంత బాగున్నానా?"

"అవును. సింగరమ్మత్తయ్యకంటే బావున్నారు?"

"వెర్రివెధవ" అని చేతితో నా చెంపను తాకి తన చేతిని ముద్దు పెట్టుకుంది. నారింజ పండు వలిచి పెట్టింది. ఆమె నన్ను దగ్గర కూర్చుండపెట్టుకొని మంచి మంచి కథలు చెప్పేది.

వారికి పిల్లలు లేరు!

లంకా వెంకట నరసయ్య గారు రిటైరు అయింతరువాత మామిళ్ల గూడెంలో మొదట ఇల్లు కట్టారు. అలా చాల ఇళ్లు కట్టి అమ్మారు.

లంకా వెంకట నరసయ్యగారు – మట్టుపల్లి సర్వయ్య గారు నా చదువును గురించి మా నాయనగారితో మాట్లాడారు. సర్కారీ మదర్సాలో చేర్పించవలసిందని నచ్చచెప్పారు. ఒప్పించారు. కాని, మళ్లీ ఒక సమస్య. ఉర్దూ మొదటి క్లాసు – అవ్వల్ జమా అత్‌లో చేర్పిస్తే మూడో తరగతికి మూడేళ్లకుగాని చేరను. సువ్వమ్ జమాలిత్‌లో చేరాలంటే త్వర త్వరగా ఉర్దూ నేర్చుకోవాలి. నాకు ఉర్దూ నేర్పే బాధ్యత సర్వయ్యగారు తీసుకున్నారు.

సర్వయ్యగారిని గురించి ఇంతకు ముందు ప్రస్తావించాను. వారి భార్య భద్రమ్మను నేను "అమ్మ" అని పిలిచేవాణ్ణి. సర్వయ్య గారు నాకు అలిఫ్ – బె మొదలుపెట్టారు. చదువు చెప్పేటప్పుడు వారు చాల కరకుగా ఉండేవారు. అర్థం చేసికోవడంలో ఆలస్యం అవుతే పేము బెత్తంతో కొట్టేవారు. సర్వయ్యగారు నన్ను కొట్టినప్పుడల్లా భద్రమ్మగారు తగాదా పడేది. చదువు చెప్పడం చేతకాక కొట్టడం ఏమిటి? అని విరుచుకుపడేది. ఇద్దరూ నాకోసం ఘర్షణ పడేవారు. నాకు ఒక అరటిపండు ఇవ్వడంతో వారు రాజీపడేవారు. వారు అపక్వాహారులు. వారింట్లో ఎప్పుడూ అరటిగెల ఉండేది.

నేను ఉర్దూ బాగానే నేర్చుకుంటున్నానని సర్వయ్యగారు మా నాయనతో చెప్పేవాడు. తమకేమీ పట్టనట్లు – బాధ్యత సొంతం సర్వయ్య గారిదే అన్నట్లు మా నాయన మాట్లాడేవారు. సర్వయ్యగారు అందుకు నొచ్చుకునేవారుకారు.

ఆరునెలల్లో నేను ఉర్దూ రెండవ తరగతి వరకు పూర్తి చేయగలిగాను. తారీఖ్ – చరిత్ర – జగ్రాఫియా – భూగోళం – జియాజియాత్ – లెక్కలు అన్నీ క్షుణ్ణంగా

నేర్చుకున్నాను. అలా అనడంకంటే సర్వయ్యగారు ఎంతో శ్రద్ధగా నేర్పారనడం సమంజసం - సబబు - వాస్తవం.

లంకా వెంకట నరసయ్యగారి పలుకుబడితో నేను నేరుగా సర్కారీ మదర్సాలో తీస్రీ జమాలిత్‌లో మూడవ తరగతిలో చేరాను. ఇది ఒక ఘన కార్యమే. ఎందుకంటే, ఒకటి నుంచి రావాలి తప్ప నేరుగా చేర్చుకోరు.

ఇన్ని తిప్పలు పడితేగాని సర్కారీ బడికి పోవడం సాధ్యపడలేదు. అది సంధియుగం. చాలామంది విషయంలో ఇట్లాగే జరిగింది. అందువల్లనే ఎక్కువ మంది సర్కారీ చదువుకు ముందుకు వచ్చేవారు కారు.



దాశరథి సోదరుల నాయనగారు
దాశరథి వేంకటాచార్యులవారు, అమ్మగారు వేంకటమ్మగారు ఆమె వడిలో చెల్లెలు లక్ష్మి.

విచిత్రం అయిన విషయం ఏమంటే - మా కుటుంబంలో తెలుగుకు ఆదరణ లేదు. సంస్కృతం - ద్రావిడం మాత్రమే భాషలు అనేవారు మా నాయన. తెలుగును ఒక భాషగా వారు అంగీకరించేవారు కాదు. స్కూల్లో తెలుగు విషయం ప్రస్తావించడమే దోషం. అలాంటి స్థితిలో మా అన్నదమ్ములకు తెలుగుమీద ఎనలేని అభిమానం!

మా అమ్మగారు తెలుగులో మంచి విద్వత్తు గలవారు. మా అన్నయ్య-చాటుగా - మా అమ్మగారి దగ్గర తెలుగు పంచకావ్యాలు - అప్పకవీయంవగైరా నేర్చుకున్నారు. మాతృభాషను చాటుమాటుగా నేర్చుకోవలసిన దుర్గతి!

తెలుగు అంటే ఒక తృష్ణ - ఒక పిపాస - ఒక దాహం! తెలుగు బోర్డులు - తెలుగు పత్రిక - తెలుగు దనం చూడడానికి మాత్రమే నేను



దాశరథి సోదరులు చదివిన ఖమ్మం హైస్కూలు. ప్రస్తుతం డి.ఇ.ఒ. ఆఫీసు

**బెజవాడ వెళ్లేవాణ్ణి అంటే మీకు అత్యంత ఆశ్చర్యం కలుగుతుంది. అ భూత కల్పన కూడా అనిపించవచ్చు. కాని, ఇది వాస్తవ సత్యం. తెలుగుకు బానిసత్వం లేని విజయవాడను చూస్తే విముక్తదేశంలో - స్వేచ్ఛా ప్రదేశంగా అనిపించేది. కడుపు నిండా తెలుగు పత్రికలు చదివి - కంటి నిండా తెలుగు చూచి - మనసు నిండా తెలుగు నింపుకొని - కొవ్వవి నవలలు ఓ పది కొనుక్కొని ఖమ్మం చేరేవాణ్ణి.**

ఇది మూడో తరగతిలో ఉన్నప్పటి మాట కాదు. ఆ తరువాత కాలపు విషయం—

సర్కారీ మదర్సలో చేరడం నాకు కొంత బాగనిపించింది. రికాముగా ఉన్నవాడికి ఒక క్రమజీవితం ఏర్పడింది.

నేను చేరింది ఖస్బా బజార్ తహతాన్యా పేరుకే ఖస్బా బజారు. ఆ స్కూలు నయాబజార్ కొత్త బజారులో ఉండేది. హనుమదాలయం ఉన్న కాలువ దగ్గర. అది తరువాత కాలంలో నయాబజార్ తహతాన్య అయింది.

1. స్కూలు ఉదయం తొమ్మిది నుంచి సాయంకాలం నాలుగు వరకు ఉండేది. మూడు పీరియడ్లు. డ్రిల్లు – డ్రాయింగు – దస్తకారీ (చేతిపనులు) తరగతులు ఉండేవి. అయిన తరువాత ఒక్కొక్క బృందానికి ఒక్కొక్క మండి కేటాయించేవారు. అవి ఆకుకూరలు – కూరగాయలు మళ్లు. నీళ్లు పోయడం, పెంచడం ఆ బృందాల బాధ్యత. కూరగాయలు సాధారణంగా ముద్రిసులు, ఉంటే టీచర్లు తీసికెళ్లేవారు.

2. "దీన్యాత్" అంటే మత విద్య - ఖురాన్ పీరియడ్ ఒకటి ఉండేది. ముస్లిం విద్యార్థులు తప్పని సరిగా చదవాలి. ఇతరులకు ఐచ్ఛికం. వారికి అఖ్లాఖియాత్, అంటే నీతివాచకం ఉండేది. అదీ ఉర్దూలోనే.

3. ముస్లిముల నమాజు దినం అయిన శుక్రవారం వారాంతపు శలవు. ప్రధాన శలవు "హుజూర్‌సాల్గిరా" అంటే ప్రభువు వారి జన్మదినం. ఆ రోజు పిల్లలందరూ ఊరేగింపుగా నరసింహస్వామి గుట్ట దగ్గరి ఖేల్ మైదాన్, అంటే ప్లేగ్రౌండుకు చేరుకుంటారు. అన్ని మదర్సల తుల్బా, అంటే అన్ని స్కూళ్ల విద్యార్థులు చేర్తారు. ఆటల పోటీలు జరుగుతాయి. ఒకే ఒక మార్వాడీ దుకాణం నుంచి తెప్పించిన నేతి మిఠాయీలు అందరికి ఇచ్చేవారు. అవి ఘుమ ఘుమ లాడేవి. అయితే మేము తినేవాళ్ళం కాదు. తినగూడదని మా నాయన శాసనం. శాసనం అని కాదు. మాకు కూడా నమ్మకమేమో! ఇతరులకు ఇచ్చేవాళ్లం.

ఆ రోజుల్లో ఖమ్మంలో ఒకే ఒక మిఠాయి దుకాణం ఉండేది. ఖస్బా బజారులో అది మార్వాడీలది. దుకాణం ముందు పంజరంలో చిలక గ్రాహకులకు స్వాగతం చెప్పేది. యజమానురాలు గోమతీబాయి విధవరాలు. మా నాయన శిష్యురాలు. గంపలో జిలేబీలు పంపించేది. మేం తినేవాళ్లం కాదు. పంచిపెట్టేవాళ్లం.

ఉర్దూ భాషలో సౌలభ్యం - అర్థం - అందం ఉన్నాయి. సాల్గిరా - జన్మదినం ఒక మంచి పదం. సాల్ అంటే సంవత్సరం, గిరాహ్ అంటే ఊడిపడింది.

రాలిన సంవత్సరం అని అర్థం. సార్థక పదం కదా! ఎంత వాస్తవం! నాకు తెలిసిన భాషల్లో ఇలాంటి అర్థం జన్మదినానికి లేదు.

మొహర్రం - పీర్ల పండుగకు 15రోజులు సెలవులు.

రమ్జాన్ ఏ కాలంలో వచ్చినా ఉదయపు బడి మాత్రమే. అంటే, ఒంటి పూట బడి.

రమ్జాన్ నెల ఏకాలంలో వస్తుందో స్థిరత్వం లేదు. ముస్లిములకు, ఆంధ్రులకు చాంద్రమాసమే కాలపు కొలత. "గోవధ చేయు తురకలకు దైవంబవ" అంటాడు అల్లసాని పెద్దన, చంద్రదుూహణలో. చంద్రుని గతి ప్రకారం నెలకు సుమారు 27 రోజులవుతాయి - నక్షత్రాలు 27 కాబట్టి. ఆంధ్రులు అయిదు సంవత్సరాలకు రెండు చొప్పున అధిక మాసాలు లెక్కిస్తారు. ఆ ప్రకారం సూర్య సంవత్సరం $365\frac{1}{4}$ రోజులను కలుపుతారు. అందువల్ల ఋతువులు సరిగ్గా వస్తాయి. ముస్లిములకు అధికమాసం లేదు. కాబట్టి సౌర సంవత్సరానికి కలవదు. అందువల్ల రమ్జాన్ ఒకసారి వేసవిలో వస్తుంది. వర్షంలో వస్తుంది. చలిలో వస్తుంది.

వేసవి సెలవులు నెలా పదిహేను రోజులు. లేక, నెలలో స్కూళ్ళు మూస్తారు. 'అమర్దాద్'లో తెరుస్తారు. నిజాం కేలండర్ ఇంగ్లీషు నెలలు జనవరి ఫిబ్రవరితో సాగదు. తురక నెలలు అజూర్ - దై - బహమన్‌తో సాగుతాయి. సంవత్సరాల లెక్క క్రీస్తు శకం ప్రకారం కాదు - హిజ్రీ ప్రకారం ఉంటుంది. రెంటికీ సుమారు 500 సంవత్సరాల తేడా ఉంటుంది.

హిజ్రీ అంటే మహమ్మద్ ప్రవక్త మక్కా వదలి మదీనా వెళ్లడం.

నాజిర్ సాహెబ్‌ము అయినా - డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఇనస్పెక్షనంటే ఎక్కడ

లేని హడావుడి. స్కూలును అలంకరించేవారు. ఉపాధ్యాయులు, విద్యార్థులు మంచి దుస్తుల్లో వచ్చేవారు. నాజిర్ వచ్చిపోయేదాకా ముద్రిసల ప్రాణాలు బిక్కు బిక్కు మంటుండేవి.

ముద్రిస్‌లలో ముస్లిములే ఎక్కువ. చుడీదార్ పైజామా, షేర్వానీ, కుచ్చుటోపీ ధరించేవారు. హిందువులు ధోవతి, షేర్వానీ, బూరుటోపీ ధరించేవారు. అప్పటికి పిల్లలకు దుస్తుల నియమాలు లేవు. నేను అందరి మధ్య పరాచికాలవాడివలె ఉండేవాణ్ణి. ఒక చడ్డీ అంటే, నిక్కరు – ఒక కమీజు, అంటే షర్టు వేసుకునేవాణ్ణి. నాది బోడి గుండు, పిలక. ముఖాన ఊర్ధ్వ పుండ్రాలు! నన్ను అందరూ – ముఖ్యంగా తురక పిల్లలు 'ఏక్‌సౌగ్యారా' అంటే నూటపదకొండు అని హేళన చేసేవారు.

అలా అంటే తురక పిల్లలందరూ నన్ను ద్వేషించారని అర్థం కాదు. నాకు ఖాజా, మహమ్మద్ అనే మంచి మిత్రులు ఉండేవారు.

ఉపాధ్యాయులు చాల శ్రద్ధగా పాఠాలు చెప్పేవారు. విద్యార్థులు కూడా శ్రద్ధగా వినేవారు.

ఉర్దూ మూడవ తరగతి పాఠ్య పుస్తకంలో "కమల్ కే ఫూల్" – తామర పూలు అని ఒక పాఠం ఉండేది. ఆ పాఠం షేఖ్ మీరాఁ అనే ముద్రిస్ ఎంత అందంగా బోధించాడంటే – గూడూరులో తామరపూలున్న "ముత్యాలమ్మ కుంట" నా మనసులో మసిలింది. అది నామీద ఎంత ప్రభావం వేసిందంటే, స్కూలు వదలగానే ఇంట్లో చెప్పకుండా కాలినడకన – వంటరిగా – రోడ్డుమీద పడిపోతూనే ఉన్నాను.

చిన్నతనం కదా! గూడూరు దూరం తెలియదు. ఇలా నడిచిపోతే వస్తుందనీ – తామరపూలు చూడవచ్చనీ భ్రమ. వంటరి పిల్లవాణ్ణి మునేరు వంతెన దాటి నడిచిపోతున్నాను. అలా కొంతదూరం నడిచాను. ఒక ఎద్దుల బండ్ల వరస కనిపించింది.

"ఏ ఊరుపోతవు?' ఒక బండివాడు అడిగాడు.

"గూడూరు – చిన్నగూడురు" చెప్పాను.

"అది ఇక్కడేదున్నది? ఇది తల్లంపాడు తోవ."

యల్లంపేట దగ్గర గూడూరున్నదని నాకు తెలుసు. తల్లంపాడే యల్లంపేట అనుకున్నాను.

"నన్ను తీసుకపోతరా?"అడిగాను.

నన్ను బండెక్కించుకున్నారు. తల్లపాడు చేర్చారు. శ్రీవైష్ణవులకు అప్పగించారు. వారు మా బంధువులని నాకు తెలియదు. ఆ రాత్రి భోజనం పెట్టారు. పడుకోబెట్టారు. తెల్లవారి సైకిలు మీద తీసికెళ్తుంటే మురిసిపోయాను. మా ఇంటికి చేర్తే మా నాయన అగ్గిమీద గుగ్గిలంలా ఉన్నారు. నన్ను చూడడమే లాక్కుపోయి విపరీతంగా కొట్టారు. నేను మొత్తుకుంటున్నాను. ఇంటి ముందు జనం కూడారు. మా అమ్మ సహితంగా సాక్షులయి నుంచున్నారు. ఒక్కడూ మా నాయనకు అడ్డుతగిలే ధైర్యం చేయలేదు. అలసిపోయి వారే వదిలేశారు.

మా నాయన వదిలిం తరువాత మా అమ్మ నన్ను పట్టుకొని ఏడ్చింది. స్నానం పోసి అన్నం కలిపి ముద్దలు చేతిలో పెడ్తూ "ఎందుకుపోయినవురా?" అని అడిగింది.

"తామరపూలు చూడటానికి" అన్నాను. అమ్మ ముందు తల బాదుకుంది. తరువాత దగ్గరికి తీసుకుంది.

"మళ్లీ అట్లుపోకు నాయనా!" అన్నది.

తెల్లవారి నాకు జ్వరం వచ్చింది. మా తాతయ్యా నాయనమ్మా నా మంచం దగ్గరినుంచి కదల్లేదు. మా అమ్మ మడికట్టుకొని వంటింట్లో దూరిందంటే బయటికి వెళ్లలేదు.

మా తాతయ్య మూలపడేసిన మందుల సంచీ తీశారు. సానమీద కుప్పె అరగదీశాడు. కైచిప్పలో ఎత్తి తేనె కలిపి నాకించాడు.

సర్వయ్యసార్ వచ్చి చూచారు. ఒక పాఠం. నన్ను అంత కదిలించినందుకు వారు నన్ను మెచ్చుకున్నారు. షేఖ్ మీరాం కూడా మెచ్చుకొనడమే కాదు, పొంగి పోయారట. మా నాయన ఇంట్లోకి రానివ్వరని రాలేదట!

నేను స్కూలుకు వెళ్ళినాను. జనాబ్ షేఖ్ మీరాం సాహెబ్ నన్ను ఎంతో మెచ్చుకున్నాడు. జమాఅత్ లో పిల్లలందరికీ నన్ను గురించి మెచ్చుకోలుగా చెప్పారు.

ఇది జరిగింతరువాత నన్ను హేళన చేయడం చాల వరకు తగ్గింది.

అలాంటి ముద్రవేసిన మరొక పాఠం "సుదామాకీ కహానీ" కుచేలుని కథ. కుచేలుడు – శ్రీకృష్ణుడు కలుసుకోవడం – వారి బాల్యాన్ని తోడిపోసుకోవడం అద్భుత కథనం! ఉర్దూలోనే అయినా రచించినవాడు అందులో లీనమై వ్రాశాడు.

ఆ కథను నాటకంగా ఇతర మిత్రులతో కలిసి గుంటిమల్లన్న సత్రంలో వేశాం.

అలాంటి ప్రభావం వేసినవే నీమ్‌కాపేడ్ – వేపచెట్టు, దాల్ కీ ఫర్యాద్ – పప్పుమొర, బేగరజ్ దోస్తీ – నిర్వ్యాజస్నేహం.

ఇవన్నీ మూడు, నాలుగు తరగతుల ఉర్దూ పాఠ్యాంశాల్లోనివి.

1936లో నేను నాలుగవ తరగతిలో ఉన్నాను. నిజాం నవాబు గద్దె ఎక్కి పాతిక సంవత్సరాలు అయినాయి. సిల్వర్ జూబ్లీ ఉత్సవాలు రాజ్యమంతటా ఘనంగా చేశారు. జూబ్లీహాలు అప్పటి నిర్మాణం. జూబ్లీహిల్స్, జూబ్లీక్లబ్, జూబ్లీబజార్ అన్నీ అప్పటి నామకరణాలే.

నిజాం కిరీటపు చిన్న ప్రతిరూపం చేసి స్కూళ్లలో అణాకు ఒకటి చొప్పున బడి పిల్లలకు అమ్మారు. ప్రతి విద్యార్థి అది కొనడం తప్పనిసరి చేశారు. మా నాయనను అడుగుతే, తురక కిరీటం ఇంటికి రావడానికి వీల్లేదు అన్నాడు. అణా ఇవ్వలేదు.

అబ్దుల్ అలీం మా క్లాసు టీచరు. వారికి నేనంటే అభిమానం. పరిస్థితి గ్రహించారు. ఒక ఉపాయం చెప్పారు.

ఉర్దూకు వ్రాత అంటే దస్తూరి ప్రాణం. ఉర్దూకు అచ్చుములకులు లేవు. బండమీద చేతితో వ్రాసి అచ్చువేయాలి. అందుకోసం విద్యార్థులతో 'ఖత్తాతి' వ్రాయించేవారు. అచ్చు అక్షరాల మీద ఉల్లిపొర కాగితం వేసి ఉంటుంది. అక్షరాల ప్రకారం నల్లసిరాతో వ్రాయాలి. అది కాస్త శ్రద్ధతో చేయవలసిన పని. పిల్లలందరూ చేయగలిగేవారు కాదు.

అబ్దుల్ అలీం సాహెబ్ నలుగురు పిల్లల ఖత్తాతి పని నాతో చేయించి అణా ఇప్పించారు. ఆ అణాతో కిరీటం కొన్నాను.

అప్పుడు అణా అంటే సామాన్యం కాదు – శేరు జొన్నలు వచ్చేవి.

చెప్పడంలో మరిచిందేమంటే – నిజాం రాజ్యంలో స్కూలు చదువు ఉచితం. ఫీజులు ఉండేవి కావు.

ముద్రిసుల వేతనం గౌరవ ప్రదంగా ఉండేవి. వారి వేతన స్కేలు గుమాస్తా కంటె పది రూపాయలు ఎక్కువగా మొదలయ్యేది.

పాఠశాల – ప్రభువును సంరక్షించమనే ప్రార్థనతో మొదలయ్యేది. తొలుత "ఇలాహీ తా జహాఁబాసత్" అనే ఫార్సీ ప్రార్థన ఉండేది. తరువాత ఉర్దూకు మార్చారు.

"తాబద్ ఖాలిఖ్ అలమ్ యహ్ రియాసత్ రఖే
తుఘ్‌కో ఉస్మాన్ బసద్ –ఎ – ఇజ్లాల్ సలామత్ రఖే
జైసెతూ ఫ(క్రెసలాతీఁహై బాఫజలె యజ్దాఁ
యూఁహి ముమ్తాజ్ తేరె దౌరె హుకూమత్ రఖే"

ఆచంద్రతారార్కం ఈ రాజ్యం ఉండాలి.
ఉస్మాన్! భగవంతుని అనంతకాంతులు నిన్ను రక్షించాలి.
నీవు రాజవంశాలకే గర్వంగా విరాజిల్లుతున్నావు
నీ శాసనయుగం సాంతం సగర్వంగా వర్థిల్లాలి!

# ఆరు

## తెలుగురవ్వ :

ఈ సమస్త సృష్టి – సకల ప్రకృతి సాంతం సత్యం – శివం – సుందరం.

సమస్త ప్రాణిజాలం – లెక్కలేనన్ని జీవరాసుల్లో మానవుడు ఉత్తముడు – మహత్తముడు – మహిమాన్వితుడు. మానవుని మించిన మరో ప్రాణి ఈ విశ్వంలో, విశ్వాంత రాళంలో ఎక్కడా లేదు.

మానవునికి మేధస్సు ఉన్నది. అదే అతని పాలిట వరం. అదే అతని పాలిటి శాపం! మానవుడు సృష్టించుకున్న అత్యంత ప్రధానములు 1. రాజకీయము 2. సంపద. ఇవి అగ్నివంటివి. మానవుని అదుపులో ఉన్నంతవరకు ఉపకరిస్తాయి. అదుపు తప్పితే దహనం చేస్తాయి! ఇప్పుడు అవి అదుపు తప్పుతున్నాయి.

మానవునికి మాత్రమే మనసుంది! అతనికి ప్రేమాభిమానాలు - ఆత్మీయత - అనురాగం - అనుబంధం - రాగద్వేషాలు - పట్టుదలలు - ప్రతీకారాలు - రోషకావేశాలు ఇత్యాదులున్నాయి. ఇవి రాజకీయ హద్దులకు - మతాల సరిహద్దులకు - కులాల కూటాలకు - ప్రాంతాల పరిమాణాలకు అతీతంగా మానవులందరికీ ఉన్నాయి.

రాజకీయ హద్దులు లేకుంటే సమస్త విశ్వంలోని మానవాళి సొంతం ఒకటి - ఒక్కటే! కొందరు స్వప్రయోజనపరులు దేశం పేర - మతం పేర - ప్రాంతం పేర - కులం పేర - ఇజంపేర మనుషులను విడకొట్టి కట్టిపడేశారు. అవిలేకుంటే విశ్వ మానవునిది ఒకే కుటుంబం.

"వసుధైవ కుటుంబం!"

ఇవి నా అభిప్రాయాలు - నా ఊహలు - నా స్వప్నాలు! మనిషికీ మనిషికీ మధ్య ఆత్మీయత ఉంది. ప్రేమ ఉంది. అభిమానం ఉంది. అనురాగం ఉంది. అనుబంధం ఉంది. కొన్ని స్వప్రయోజన వర్గాలు విషం చిలుకుతున్నాయి!

ఆ స్వప్రయోజన వర్గాల మూలంగా ఒక మతాన్ని పేర్కొనవలసి వస్తున్నందుకు వ్యధగా ఉంది. బాధగా ఉంది. అయితే వాస్తవాలు చెప్పడం విధి. చరిత్ర గతిని వివరించడం బాధ్యత. ఆ విధి – బాధ్యత నిర్వహించడానికే తప్ప నాకు మనిషి విషయంలో ప్రేమ తప్ప – ద్వేషం మచ్చుకయినా లేదని సవినయంగా మనవి చేస్తున్నాను. నా గుండెలోని ఈ బాధను గుర్తిస్తారని విశ్వసిస్తున్నాను.

మీర్ ఉస్మాన్ అలీఖాన్ – హిజ్ ఎగ్జాల్టెడ్ హైనెస్ – లెఫ్టినెంట్ జనరల్ – సిపహసాలార్ – అసఫ్జాహ్ ముజప్ఫరుల్ ముల్క్ వాల్ ముమాలిక్ – నిజాము ముల్క్ – నిజాముద్దౌలా – ఫతెహజంగ్, జి.పి., ఎస్.ఐ., జిబిఇ సుల్తానుల్ ఉలూమ్‌దుష్టుడు, దుర్మార్గుడు, దురాశాపరుడు, సమర్థుడు, రాజకీయ ప్రావీణ్యం, చాతుర్యంగలవాడు. పరిపాలనా సమర్థుడు. లోభి, స్వార్థపరుడు, సంకుచితుడు, మత దురహంకారి, స్వప్రయోజన పరుడు, మతాన్ని తన రాజకీయ స్వార్థానికి వాడుకున్న జన్మ జన్మాల బూజు.

అసిఫ్జాహీవంశంలో మొదటివాడు ఇమ్రుద్దీన్ చివరివాడు ఉస్మాన్ తప్ప మిగిలిన అయిదుగురు అసమర్థులు, నిష్ప్రయోజకులు.

ఖమ్రుద్దీన్ స్వార్థము – ద్రోహము అనే సామర్థ్యంతో సమస్త దక్షిణా పథపు సామ్రాజ్యం సాధించాడు.

ఉస్మాన్ అదే స్వార్థము – ద్రోహంతో రాజ్యాన్ని, వంశాన్ని అంతమొందించాడు.

తన రాజ్యాన్ని నిలపెట్టుకోవాలనే సాధారణ వాంఛకోసం మాత్రం కాక – ఒక జాతి వేషభాషలను, సాహిత్యసంస్కృతలను నిర్మూలించ పూనుకున్న ఉస్మాన్ మతాన్ని తన స్వార్థంకోసం, స్వప్రయోజనంకోసం వాడుకున్న రాక్షసుడు.

ఈ రాక్షసత్వం పూర్తిగా అతని ఆలోచన అనుకోను. ఇంగ్లీషువారు దురాలోచనులు – దూరాలోచనులు. తాము ఎప్పుడో ఒకసారి భారతదేశాన్ని వదులుకోవాలి. అలాంటి స్థితిలో భారతీయులను చిక్కుల్లో పెట్టాలి. అందుకు భారతదేశపు నడి బొడ్డున ఒక మతపిశాచ రాజ్యం నెలకొల్పదలుచుకున్నారు. తమ పథకం ఫలించడానికి ఉస్మాన్ను మించినవాడు దొరకలేదు.

సామ్రాజ్య వాదుల సూత్రం; విభజించి పాలించడం. ఆ సూత్రాన్ని అనుసరించి ఉత్తరాన మహమ్మదలీ జిన్నాను – దక్షిణాన ఉస్మాన్ను ప్రతిష్ఠించారు ఆంగ్లేయ ముష్కరులు.

ఉస్మాన్ అమాయకుడు కాడు. తన ఏలికలు ఆంగ్లేయులు – తన రాజ్య రక్షణకు తోడ్పడుతున్నందుకు సంతోషించాడు. భారత దేశపు గుండెలమీద మతపుచిచ్చు రగిల్చాడు. ఉస్మాన్ అతి ప్రమాదకరమైన మతపు చిచ్చును కొంగున కట్టడానికి ప్రయత్నించాడు. అతనిది వినాశకరమార్గం – అది మార్గంకాదు – వినాశ విధానాన్ని అనుసరించాడు.

ఒక జాతి జీవన విధానాన్ని రూపుమాప చూచిన పాలకుడు మానవ చరిత్రలో ఉస్మాన్ మాత్రమే!

ఉస్మాన్ – భారత సంస్కృతికి భిన్నంగా – భారత దేశానికి దూరంగా – ఒక సర్వతంత్ర స్వతంత్ర కరకు తురక రాజ్యం ఏర్పరచాలని కలలు కన్నాడు.

1. ఉస్మాన్ ఇస్లామును రాజకీయమతంగా ప్రకటించాడు. అంతేకాదు, "అనల్ మలిక్" అనే నినాదాన్ని ప్రభుత్వ నినాదం చేశాడు. అనల్ మలిక్ అంటే ముస్లిములందరు ప్రభువులే అని అర్థం. అంటే, ఒకమతం వారికి ఇతర మతాలవారు ఊడిగం చేయాలి.

'పూటకు గతిలేని ఫకీరు ప్రభువు ఎట్లా అవుతాడు!' అని మఖ్దూమ్ ప్రశ్నించాడు. నిజాం నవాబు పేద ముస్లిముతో దస్తర్ ఖాన్ పంచుకున్నాడా? వారి సరసన నిలిచి నమాజు చేశాడా? తన కొడుకులకు కనీసం తన రాజ్యపు ముస్లిం యువతులను చేసుకున్నాడా?

మతపు ఉన్మాదంలో మెజారిటీ తురకలు ఈ విషయాలు గుర్తించలేదు. గమనించలేదు. ఇతర మతాల మీద పెత్తనమూ – దౌర్జన్యమూ చేశారు.

2. ఉస్మాన్ "తబ్లీగ్" అనే ప్రమాదకరం అయిన ఉద్యమాన్ని ప్రభుత్వ పరంగా ప్రారంభించాడు. తబ్లీగ్ అంటే మతాంతరీకరణం. ప్రభుత్వ పరంగా బడ్జెటులో ఇందుకు ధనం కేటాయింపు జరిగింది. ప్రతి తాసీల్ కార్యాలయంలో ఇందుకోసం ఒక అధికారిని నియమించారు. ఇందుకుగాను ఏర్పడిన శాఖ "ఉమూర్ మజుహబీ."

ఇత్తెహాదుల్ ముసల్మీన్ – ఉస్మాన్ యొక్క మానసిక సంతానం. మహెద్వి తెగకు చెందిన బహదుర్ ఖాన్ను ప్రోత్సహించి అతనిని బహదూర్ యార్ జంగ్ చేశాడు. మతం మార్పిడి చేయడానికి రాజ్యం మీదికి పిచ్చి కుక్కను వదిలాడు.

ఆర్యసమాజ నాయకుడు, కీర్తిశేషులు నరేందర్ జీ నాతో ఒక వింత విషయం చెప్పారు. అసలు బహద్దుర్ ఖాన్ ముస్లింకాడు – ఇత్తెహాదుల్ ముసల్మీన్ నాయకుడు ఎలా అవుతాడని? వారి వాదం ఏమంటే "మహెద్వీలు" ముస్లిములు కారు. ముస్లిం అయినవాడు మహమ్మద్ నే చివరి ప్రవక్తగా విశ్వసించాలి. మెహద్వీలు మహమ్మద్ తరువాత వాడయిన "మెహద్వి"వారు. కాబట్టి ముసల్మానులు కారు అని వారి వాదం.

ఉస్మాన్ కు ఈ విషయం తెలియకుండా ఉండదు. అతనికి బహుద్దుర్ ఖాన్ మంచి వక్త – కార్యకర్త – విశ్వాస పాత్రుడుగా కనిపించాడు. అతనికి కావలసింది మతం కాదు. తన రక్షణ. అదీ రాజకీయం!

ప్రస్తుతం పాకిస్తాన్ లో మెహద్వీలను క్రూరంగా అణచివేయడం జరుగుతున్నది.

బహద్దుర్‌ఖాన్ మతం మార్చిన విధానాన్ని నేను రచించిన "చిల్లర దేవుళ్లు" నవలలో సవివరంగా వర్ణించాను.

"చిల్లర దేవుళ్లు" వ్రాతప్రతిగా ఉన్నపుడు మతాంతరీకరణ భాగాన్ని ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావుగారికి వినిపిస్తున్నాను. మంగళసూత్రాలు త్రెంచిన ఘట్టం. ఆంధ్ర పితామహులు ఎక్కెక్కి ఏడ్వడం ప్రారంభించారు. నావల్ల ఏమైనా తప్పు జరిగిందేమో అనుకున్నాను. నివ్వెరబోయాను. వారు దస్తీతో ముఖం కప్పుకొని చాలసేపు దుఃఖించారు. వారి గొంతునుంచి మాట పెకల్లేదు.

హనుమంతరావుగారు లోనికి వెళ్ళారు. ముఖం కడుక్కున్నారు. తుడుచుకున్నారు. రెండు కప్పుల్లో చాయ్ తీసుకొని వచ్చారు. ఆ దశలో "ఈ శ్రమ మీకెందుకు?" అనే సాహసంకూడా లేకపోయింది నాకు. హనుమంతరావుగారు మా నాయనగారికి, మా అన్నయ్యకూ సన్నిహితులు, నామీద వారికి వాత్సల్యం.

హనుమంతరావుగారు సగం టీ త్రాగి, కప్పు పక్కన పెట్టి అన్నారు –

"రంగాచార్లూ! మతం మార్చిన సన్నివేశం నీవు వ్రాసిన తీరు నన్ను కదలించినది. ఇటువంటి దృశ్యములను ఎన్నింటినో ప్రేక్షకులంగా చూచిన దౌర్భాగ్యము మాది. ఆ దురదృష్టము నిజామాంధ్రులందరిది. ఒక్కసారి అటువంటి దృశ్యము లెన్నియో మనసులో మసలినవి. దుఃఖము పొంగినది. భేష్! మేము చేయలేని పని చేసినావు!" అని నా వీపు నిమిరినారు.

ఉస్మాన్ రాజ్యము అంతటి పిశాచరాజ్యము

ఉస్మాన్ ప్రారంభించి – బహద్దూర్‌ఖాన్‌చే నిర్వహింపచేసిన తబ్లీగ్ – మతాంతరీకరణ ఫలితంగా జనాభాలో హిందువుల సంఖ్య తగ్గిందనడానికి నిజాం ప్రభుత్వం నిర్వహించిన జనాభా లెక్కలే నిదర్శనం.

మొత్తం జనాభాలో హిందువుల శాతం:–

| | |
|---|---|
| 1901 | 88.6 |
| 1911 | 88.9 |
| 1921 | 85.4 |
| 1931 | 84.0 |

నిజాం ప్రభుత్వం చేపట్టిన ఈ పాశవిక విధానానికి – అసమ్మతి తెలిపే అవకాశం కూడా ఇవ్వలేదు. హైదరాబాదు రాజకీయ సంస్కరణల సంఘంవారు హైదరాబాదులో ఒక సభ జరపాలనుకున్నారు. పదేళ్లవరకూ ప్రభుత్వం అనుమతించలేదు. అప్పుడు వారు రాజ్యానికి ఆవల అకోలాలో సభలు జరుపుకున్నారు.

3. నిజాం ప్రభుత్వపు పతాకం ఇస్లాం పతాకం. పసుపు పచ్చని పతాకంలో అర్ధచంద్రుడు నక్షత్రం. నిజాం ప్రజలు ఇస్లాం వ్యతిరేకులు గాని, ఇస్లాం పతాక వ్యతిరేకులుగాని కారు. ఒక మతానికి రాజ్యాధికారం వప్పగించినట్లు నటించే ప్రభుత్వ దుష్ట విధానానికి వ్యతిరేకులు.
4. ముసల్మానులు జనాభాను పెంచి చూపడానికి ఉత్తర భారతంనుంచి అనేకానేక ముస్లిం కుటుంబాలను నిజాం రాజ్యంలోకి దిగుమతి చేసుకున్నారు. అందుకు విరుద్ధంగా స్థానిక ముస్లిములు అసమ్మతి ఉద్యమం నిర్వహించారు. తత్ఫలితంగానే ముల్కీ నిబంధనలు అమల్లోనికి వచ్చాయి.

వాస్తవం ఏమిటంటే – నిజాం నవాబు తన ప్రజలను హిందువులను, ముస్లింలను ఎవరినీ విశ్వసించలేదు. ఉన్నతాధికారులంతా గైర్‌ముల్కీ, ముస్లిములే.

5. 1931 లెక్కల ప్రకారం ఉద్యోగులసంఖ్య ఇలా ఉంది: సైన్యంలో ముస్లిములు 51,149 కాగా, హిందువులు 6,495. ఉద్యోగాల్లో 58,188 మంది ముస్లిములు కాగా, హిందువులు 16,878 మంది మాత్రమే! వీరిలో వంశపారంపర్యంగా వచ్చే గ్రామాధికారులను కూడా చేర్చారు. వారిని మినహాయిస్తే హిందువుల సంఖ్య నామమాత్రం అవుతుంది.

6. **ఏ మతమూ స్వంతభాషను సృష్టించుకోలేదు. వాస్తవంగా మతానికి భాష లేదు. ప్రజల భాషలనే తమ స్వంతం చేసుకున్నాయి. భారత ముస్లిములు, ముఖ్యంగా ఉత్తర భారత ముస్లిములు – హైదరాబాదు రాజ్య ముస్లిములు; ఉర్దూ ముస్లిముల భాష అనే భ్రమలో పడిపోయారు.**

నిజాం నవాబు హైదరాబాదు రాజ్యంలో ఉర్దూ ముస్లిముల భాషగా ప్రకటించాడు. మైనారిటీ ప్రజల మాతృభాష అయిన ఉర్దూను మెజారిటీ ప్రజలమీద రుద్దాడు. ఉర్దూ రాజకీయ భాషగా, బోధనా భాషగా – న్యాయాలయాల భాషగా చేశాడు. అంతవరకు ఫరవాలేదనుకుందాం. ఎంచాతంటే, ఆంగ్లేయులు ఇంగ్లీషును బ్రిటీషిండియన్ల మీద రుద్దారు. కాని, వారు దాన్ని మతభాషగా రుద్దలేదు.

నిజాం చేసిన దుర్మార్గం ఏమంటే, ఇతర జాతీయ భాషలను ధ్వంసం చేయడానికి ఉర్దూను ఆయుధంగా ఉపయోగించాడు.

ఉర్దూ ముస్లిముల భాష మాత్రం కాదనడం వాస్తవసత్యం. బెంగాల్ ముస్లిములకు ఉర్దూ రాదు. వారు బంగ్లా భాషను ప్రేమిస్తారు. ఆరాధిస్తారు. పాకిస్తాన్ ప్రభుత్వం వారిమీద ఉర్దూను రుద్దడానికి ప్రయత్నించింది. బెంగాల్ ముస్లిములు తిరుగుబాటు చేశారు. పాకిస్తాన్‌నుండి విడిపోయారు. "బంగ్లాదేశ్" ఏర్పరచుకున్నారు.

ఇతర దేశాల ముస్లిములకు ఉర్దూభాష ఉందని కూడా తెలియదు.

**ఉర్దూను ఇస్లాంకు అంటకట్టటం ఒక రాజకీయకుట్ర!**

7. నిజాం నవాబు ఇస్లాం సంవత్సరాన్ని – హిజ్రీని – రాజకీయ సంవత్సరం చేశాడు. ఇస్లాం నెలలు అజూర్, దై, బహమన్, ఇస్ఫందార్, ఫర్వర్దీ, అర్దీబెహిష్త్, ఖుర్దాద్, తీర్, అమర్దార్, షహరేహర్, మెహర్, అబాన్‌గా ఉండాలని ఆదేశించాడు. వారాలపేర్లు కూడా ఏక్‌షంబా, దోషంబా అని ఉర్దూపేర్లే ఉండేవి.

8. ముస్లిముల షేర్వానీ – టోపీ రాజకీయ వేషం. సంప్రదాయ హిందువుల రాజకీయ వేషధారణ వింతగా ఉంటుంది. వాళ్లు ధోవతి కడ్తారు. షేర్వానీ వేస్తారు. నొసట తిలకం దిద్దుతారు. తలమీద టోపీ పెట్టుకుంటారు.

ఇది బలవంతపు వేషం. చరిత్ర తెలియని కొందరు – చరిత్రను వక్రీకరించే ప్రయత్నంలో కొందరు – ఇప్పుడు ఈ వేషాన్ని మత సామరస్యంగా ప్రచారం చేస్తున్నారు.

9. ప్రధాన ముస్లిం దినాలను శలవులుగా ప్రకటించారు.
ముస్లిముల నమాజు దినం శుక్రవారం వారపు శలవు.
మొహర్రం సందర్భంగా సుదీర్ఘ శలవులు.

రమ్జాన్‌సందర్భంగా ఒక పూట ఆఫీసులు
ముస్లిం పర్వదినాలన్ని తప్పని సరి శలవులు

10. రమ్జాన్ సందర్భంగా తిను బండారాలు కనిపించనీయరాదు. హోటళ్ళకు, మిఠాయి దుకాణాలకు నల్లని తెరలు విధిగా వేయాలి.

మసీదులకు వంద గజాలు అటు, వంద గజాలు ఇటు బాజాలు ప్రయోగించరాదు. అది దేవుని సేవగాని, పెళ్లి ఊరేగింపుగాని, శవయాత్రగాని - ఈ నియమం పాటించవలసిందే. శిక్షాస్మృతి ప్రకారం అది నేరం అవుతుంది. శిక్షపడుతుంది.

11. దీన్యాత్ అనే మత విషయకమయిన పీరియడును విద్యాలయాల్లో ప్రవేశ పెట్టారు. ఈ పీరియడ్‌లో ఖురాన్ బోధించబడుతుంది. ముస్లిమేతరులకు ఇది తప్పనిసరి కాదు. కాని వారి మత గ్రంథాలు బోధించరు. "అఖ్లాఖియాత్" అంటే సుమారు నీతిశాస్త్రం బోధిస్తారు.

12. విగ్రహాలు ఇస్లాంకు విరుద్ధం కాబట్టి రాజ్యంలో ఎక్కడా బహిరంగ ప్రదేశాల్లో విగ్రహాలు ఏర్పరచడం జరగలేదు.

నిజాం రాజ్యం కరకు తురకరాజ్యం అనడానికి ఈ నిదర్శనాలు చాలు. ఇంతటి మూర్ఖపు మతరాజ్యపు ప్రజలు మత విద్వేషం పెంచుకోకపోవడం వారి ఉన్నత సంస్కారానికి చిహ్నం. నిజామును వ్యతిరేకించిన ఏ ఉద్యమమూ - ఆర్యసమాజం సహితంగా - మతప్రాతిపదిక మీద జరుపలేదనే చారిత్రక సత్యం. నిజాం ప్రజల ఉదారతకు - విశాల హృదయానికి సజీవ నిదర్శనాలు.

నైజాము సర్కారోడు నాజీల మించినోడు. నిజాం నిరంకుశుడు. అతడు హద్దులు ఎరుగడు. అతనికి నియమ నిబంధనలు లేవు. అతనిది వెర్రివాని చేతిరాయి.

కమాల్‌ఖాన్ అనే నవాబు ఇల్లు కట్టుకున్నాడు. నిజామును గృహప్రవేశానికి ఆహ్వానించాడు. "కోట బావుంది. నాకు నజ్రానా ఇవ్వు" అన్నాడు. కమాల్ ఖాన్‌కు తప్పలేదు. నజ్రానా సమర్పించుకున్నాడు. ఇనుపగేట్లకు K.K. అంటే కమాల్ ఖాన్ అని చెక్కించుకున్నాడు. అది మార్చకుండానే ఉస్మాన్ దానిలో దిగిపోయాడు. K.K.ను కింగ్‌కోఠీ చేశాడు.

నిజాముకు గ్వాలియర్ మహారాజు ఒక టన్ను వెన్న పంపాడు. అది వాడలేదు. వాసన పట్టింది. దానిని అమ్మి డబ్బు చేయవలసిందిగా కొత్వాల్ వెంకటరామారెడ్డి గారిని ఆదేశించాడు. రెడ్డిగారు అదంతా మూసీలో వేసి నిజాంకు డబ్బు సమర్పించుకున్నాడు.

జోష్ అని ఒక కవి ఉత్తర భారత నుంచి వచ్చి హైదరాబాదులో స్థిరపడ్డాడు. జోష్ వాస్తవంగా గొప్పకవి. వారు అపుడప్పుడు నిజామును దర్శిస్తుండేవాడు. ఒకసారి దర్శించినపుడు నిజాం అడిగాడు -"మీ బేగంకు జబ్బుగా ఉండెకదా! ఎలా ఉంది?" అని. ఎన్ని మందులు ఇచ్చినా గుణం కనిపించడం లేదు అన్నారు. ఈ వైద్యులు బేవఖూఫులు నేను మందిస్తాను వాడండి. వెంటనే తగ్గుతుంది అని ఏదో ఇచ్చాడు. జోష్ ఆ మందు అవతల పారేశాడు. కాని, భార్యకు ఆరోగ్యం చేకూరిందని నిజాముకు విన్నవించారు.

ఇది నిజాం స్థితి. అతను కాక జాగీర్దారులు, దొరలు, దళారులు వారి తాబేదారులు పటేల్ పట్వారీలు మున్నగువారంతా ఛోటానిజాములే.

తెలంగాణా ప్రజ ఇందరి పిశాచాల మధ్య బతికి బట్ట కట్టడమే మహత్కార్యం. అంతేకాదు, ఆ ప్రజ ఉద్యమించింది! తెలంగాణా ప్రజ అనేక ఆటంకాలు – అవరోధాలు – అడ్డంకులు – అసౌకర్యాలు – విరోధాలను తట్టుకోవలసి వచ్చింది.

1. భారత జాతీయ కాంగ్రెస్ దేశీయ సంస్థానాల పాలనలో జోక్యం కలిగించుకోలేదు. వారి పోరాటం బ్రిటిషిండియాకు మాత్రమే పరిమితం అయింది. మహాత్ముడు దేశీయ రాజ్యాల విషయంలో కల్పించుకోబోమని ప్రకటించారు. అలా చేసి వారి విశృంఖలత్వానికి లైసెన్సు ఇచ్చారు. నవాబులు, రాజులు, మహారాజులు ప్రజల రక్తాన్ని వారి ఇచ్ఛవచ్చినంత పీల్చారు.

భారత జాతీయ కాంగ్రెస్, మహాత్ముని – ఆ పాలసీ వలస మూడోవంతు భారతదేశం కట్టుబానిస అయింది. అయినా, వారు పట్టించుకోలేదు. మహారాజుల దుశ్చర్యలను గురించి దీవాన్ జర్మనీదాస్ "మహారాజా" అనే ఇంగ్లీషు పుస్తకంలో వివరించారు.

కాంగ్రెస్ వారు నాలుగవ దశకంలో తమ తప్పు గ్రహించారు. అందుకు కారణం హైదరాబాదు, తిరువాన్కూరు వంటి సంస్థానాల్లో కమ్యూనిస్టులు బలపడడం. అప్పుడు వారు ఇండియన్‌స్టేట్స్ పీపుల్స్ కాంగ్రెస్ ప్రారంభించారు. దానికి జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షులు. నెహ్రూ కాశ్మీర్ వెళ్తే, కాశ్మీర్ ప్రభుత్వం బాయ్‌నెట్లతో అతన్ని నిరోధించింది.

కాంగ్రెస్ వారు దేశీయ సంస్థానాలలో కూడా జాతీయోద్యమం నిర్వహించి ఉంటే కాశ్మీర్ సమస్య ఇంత జటిలం అయ్యేదికాదు.

కాశ్మీర్ మహారాజు నిజాం కన్న తక్కువ నిరంకుశుడేమీకాదు. కాశ్మీరం వాడయిన కిషన్ చందర్ అనే గొప్ప ఉర్దూ రచయిత "మేలేయాదోఁకె చీనార్"అనే తమ ఆత్మకథలో కాశ్మీర్ స్థితిగతులను గురించి వివరించారు.

2. మహాత్ముడు హైదరాబాదు వచ్చారు. వచ్చినపుడల్లా తాను రాజకీయాలు మాట్లాడనని మాట ఇచ్చారు. నిర్మాణ కార్యక్రమాల గురించి తప్ప మాట్లాడలేదు. మహాత్ముడు మాట తప్పడు. అది నిజాంకు తెలుసు.

జాతీయ నాయకురాలు – భారత కోకిల సరోజినీనాయుడుగారి నివాసం హైదరాబాదు. వారి నివాసం గోల్డెన్ త్రెషోల్డ్‌లో ప్రస్తుతం యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు ఉంది. సరోజినీ నాయుడు రాజకీయ నాయకత్వం హైదరాబాదు రాజ్యానికి ఆవలనే! హైదరాబాదు వచ్చినపుడు రాజకీయానికి సంబంధించి పల్లెత్తు మాట మాట్లాడేవారు కారు!

నిజాం రాజ్యానికి అవల సరోజినీ రాజకీయ నాయిక. నిజాం రాజ్యంలో కవయిత్రి మాత్రమే!!

నిజాం రాజు అభీష్టానికి అనుకూలంగా – జాతీయ నాయకులు ఎవరూ నిజాం రాజ్యాన్ని భారతదేశంలో భాగంగా గుర్తించలేదు.

3. నిజాం రాష్ట్రంలో తెలుగు జిల్లాలు కాక మహారాష్ట్ర కన్నడ జిల్లాలు కూడా ఉండేవి. మహారాష్ట్రులు తమను శివాజీ వారసులం అనుకునేవారు. సమస్త రాజ్యానికి తామే రక్షకులం. అని భావించేవారు. ఆ రాజ్యంలో తెలుగువారిని తమకన్న తక్కువవారిగా చూచేవారు. తురకలవలెనే తెలుగువారిని పీడన చేసేవారు.

కాలక్రమంలో ఉద్యమాలలో తెలుగువారు మహారాష్ట్రులను అధిగమించారు.

4. బ్రిటిషాంధ్రం నుంచి వచ్చి నిజాం కొలువులో చేరి నిజాం నవాబుకు వంది మాగధులయిన వారు తెలంగాణం తెలుగువారిని మనుషులుగా గుర్తించేవారు కారు. 'రాకాసి'ముఠా రాయప్రోలు – కాసింఖాను – సీతారామయ్య ఆంధ్రుల ఉద్యమాన్ని గురించి నిజాం ప్రభుత్వాన్ని హెచ్చరించేవారు.

**తెలంగాణం ఆంధ్రుల ఉద్యమం భాషా ఉద్యమం మాత్రమే కాదనీ – రాజకీయాగ్ని అందులో రాజుకుటూందనీ పాలకోడేటివారు ప్రభుత్వాన్ని హెచ్చరించారు.**

5. బ్రిటిషాంధ్రులు నిజామాంధ్రులను తమ సోదరులని కాని, తమతో సములనిగాని గుర్తించలేదు. బ్రిటిషాంధ్ర జాతీయ నాయకు లెవరూ తెలంగాణా ప్రజను పట్టించుకోలేదు.

'తెలంగాణంలో కూడా కవులు ఉన్నారా?' అని ప్రశ్నించినాడొక కవిశేఖరుడు. సురవరం ప్రతాపరెడ్డి గారు దానిని ఛాలెంజిగా తీసుకున్నారు. మూడువందల యాభైనాలుగుమంది తెలంగాణ కవుల కవితలు కూర్చి, "గోలకొండ కవుల" సంచిక ప్రచురించారు.

పురాణం పుల్లయ్యగారు తమ కవితలో అన్నారు –

ఇట్టి పండిత సత్తము లెందరో ని
జాము రాష్ట్రంబునందు నెసగుచుండ
కవులు లేరన్నయతని వాగ్గరిమ నెంచ
అంధుడు జగంబులేదని యనుట గాదే!

ఈ విధంగా తెలంగాణం తెలుగుమీద కారంచల్లి బాధించారు.

ఇది బ్రిటిషాంధ్రులందరికీ వర్తించదు. స్వప్రయోజనపరులు కొందరు మాత్రమే ఇలా అవమానించారు. ఇందుకు మొత్తం ప్రాంతాన్ని, ఆంధ్రజాతిని తప్పు పట్టడం భావ్యంకాదు.

6. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రులు తమిళుల పోరు పడలేకపోయారు. తమిళుల పెత్తనం వదిలించుకోవడానికి ఆంధ్రులు తమకు భాషా రాష్ట్రం కావాలన్నారు. అది సాధించడానికి ఆంధ్రమహాసభ ఏర్పడింది. ఆ విధంగా భారతదేశంలో భాషారాష్ట్రప్రతిపాదన తెచ్చిన తొలివారు ఆంధ్రులు అయినారు.

బ్రిటిషాంధ్రులు కోరిన భాషారాష్ట్రం బ్రిటిషిండియాలోని ఆంధ్రులకే పరిమితం అయింది. తెలంగాణాంధ్రుల గురించి అందులో ప్రస్తావన లేదు.

పొట్టి శ్రీరాములుగారి ఆత్మాహుతి, శ్రీభాగ్ ఒడంబడికలో కూడా తెలంగాణం ప్రస్తావన లేదు.

తెలంగాణా సహితమైన విశాలాంధ్రను కోరినవారు కమ్యూనిస్టులు. పుచ్చలపల్లి సుందరయ్యగారు "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనే ఒక గొప్ప గ్రంథం రచించి, అనాటి బ్రిటిష్ తెలంగాణా ఆంధ్రయువకులను ఉత్తేజపరచారు.

అనాటికి అటు మద్రాసు ఆంధ్రంలోనూ – ఇటు నిజామాంధ్రంలోను కమ్యూనిస్టు ఉద్యమం మాత్రమే బలమైన ఉద్యమంగా ఉండింది. భారతదేశంలో తొలి కమ్యూనిస్టు ప్రభుత్వం – విశాలాంధ్రలోనే ఏర్పడుతుందని ఆశించాం. కాని, ఆ గౌరవం కేరళ రాష్ట్రానికి దక్కింది.

కమ్యూనిస్టులు తమ స్వయంకృత అపరాధాలతోనే విశాలాంధ్రలో ప్రభుత్వం ఏర్పరచే అవకాశాన్ని పోగొట్టుకున్నారు.

కాంగ్రెస్‌వారు తెలంగాణాంధ్రులను కలుపుకొనిపోయే ప్రయత్నం చేయలేదు.

తెలంగాణ ప్రజకు తమ యాతననుంచి విముక్తులు కావడానికి ఏ దిక్కునుండీ సహాయ సహకారాలు అందలేదు. ఉత్సాహవంతులయిన రావి నారాయణరెడ్డివంటి యువకులు బ్రిటిషిండియాలో సత్యాగ్రహం చేయవలసిన నిస్సహాయదశ కలిగించాడు నిజాము ముసలి నక్క.

అంతటి నిరంకుశత్వం – దౌర్జన్యం – మతపైశాచిక విధానం సహితం ప్రజా ఉద్యమాలను నిలువరించలేకపోయినాయి.

1. తెలంగాణంలో ఆంధ్రోద్యమం 1901లో శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయ స్థాపనతో ప్రారంభం అయిందని చెప్పవచ్చు. అయితే, అది నిజామాంధ్రు రాజ్యంలో నిజాంలో స్థాపించిన గ్రంథాలయం కాదు.

నిజాం రాజ్యంలో బ్రిటిషు దీవి మునగాల పరగాణా – ఆ పరగణా రాజావారికి హైదరాబాదుతోనే ఎక్కువ సంబంధాలుండేవి. ఆ గ్రంథాలయము స్థాపించిన గౌరవము రాజా నాయిని వేంకట రంగారావుగారికి దక్కుతుంది.

ఈ గ్రంథాలయము స్థాపించిన సుల్తాన్ బజార్ ఆ రోజులలో నిజాం పాలనలోనిది కాదు. అది రెసిడెంటు పాలన, అనగా బ్రిటిషు పాలనలోనిది.

2. 1920లో బ్రిటిషువారు టర్కీ సుల్తాను మతాధికారాలను తొలగించారు. దానిని వ్యతిరేకించడానికి హిందువులు – ముస్లిములు కలిసి "ఖిలాఫత్" ఉద్యమం నిర్వహించారు. దానికి గాంధీ మహాత్ముడు నాయకత్వం వహించారు.

ఖిలాఫత్ నిజాం రాజ్యానికి పాకింది. హైదరాబాదులో హిందువులు – ముస్లిములు ఇరవై వేలు, పాతికవేలు పాల్గొని, నిరసనలు, ఊరేగింపులు నిర్వహించారు. కసీ విసీ ఎరుగని మత సామరస్యం – ప్రజాచైతన్యం వెల్లివిరిశాయి.

ఆ ఐక్యత – చైతన్యం చూచి నిజాం నవాబు బెదిరిపోయాడు. ఆ జనమంతా తన మీద పడుతున్నట్లు భయపడ్డాడు. నిజాముకు జనమంటే బుగులు! చదువంటే బెదురు! వెలుగంటే అదురు!

ప్రభుత్వ అనుమతి లేకుండా సభలు జరుపరాదని ఆజ్ఞాపించాడు. అదే అతి క్రూరం అయిన గస్తీనిషాన్ తిర్యన్ – అంటే సర్క్యులర్ నెం. 53. అది నిజాం ప్రజల సమస్త హక్కులను హరించింది. వారిని కట్టేసింది. నోరు కుట్టేసింది.

3. కాశీనాథరావు వైద్య వంటివారు 1932లో హిందూ స్టాండింగ్ కమిటీ ఏర్పాటు చేశారు. నిజాం మతాంతరీకరణ గురించి, హిందువుల జనాభా తగ్గడాన్ని గురించి, హిందువులను అణచివేసే విధానాన్ని గురించి కరపత్రాలు వేశారు. ఈ కరపత్రాల ప్రభావంతో "టైమ్స్ ఆఫ్ ఇండియా" వంటి పత్రికలు సంపాదకీయాలు, వ్యాసాలు ప్రచురించాయి.

4. 11-11-1922న కార్వే పండితుని అధ్యక్షతన నిజాం రాష్ట్ర సంఘసంస్కరణ మహాసభ సమావేశమైంది. అధ్యక్షులు కొంత మహారాష్ట్రంలోనూ, కొంత ఇంగ్లీషులోను ప్రసంగించారు. ఆ సభలో ఉండిన మాడపాటి హనుమంతరావు గారి వంటి తెలుగువారికి ఆంధ్రులనుగురించి ప్రస్తావించకపోవడం మనస్తాపం కలిగించింది.

అలంపల్లి వెంకట్రామారావు గారు తెలుగులో ఉపన్యాసం ప్రారంభించారు. సమావేశంలో ఉన్న మహారాష్ట్రులు సహించలేదు. చప్పట్లు కొట్టారు. గేలిచేశారు. ఉపన్యాసం సాగనివ్వలేదు. తెలుగువారు అది తమకు అవమానంగా భావించారు. అసమ్మతి సూచకంగా సభనుంచి బయటికివచ్చారు.

**కొన్ని అవమానములు మహత్తర ఉద్యమములను నిర్మిస్తాయి. ఈసంఘటనయే ఆంధ్రోద్యమానికి అంకురార్పణ అయింది.**

**దక్షిణాఫ్రికాలో మహాత్మునికి జరిగిన అవమానమే భారతదేశంలో మహోద్యమం అయింది.**

తెల్లవారి, అనగా దుర్మతి కార్తీక శుద్ధ ద్వాదశి, 1-18 దై 1331 ఫసలీ – 12-11-22న ట్రూపు బజారులోని టేకుమాల రంగారావు గారి ఇంట్లో 11 మంది ఆంధ్రులు సమావేశమయినారు. వారు 1. మాడపాటి హనుమంతరావుగారు, 2. టేకుమాల రంగారావుగారు, 3. మిట్టా లక్ష్మీనరసయ్యగారు, 4. ఆదిరాజు వీరభద్రరావుగారు, 5. నడింపల్లి జానకిరామయ్యగారు, 6. మందుముల నర్సింగ రావుగారు, 7. బూర్గుల రామకృష్ణారావుగారు, 8. కొమ్మవరపు సుబ్బారావుగారు, 9. బూర్గుల నరసింగరావుగారు, 10. పందిటి రామస్వామినాయుడుగారు, 11. బోయినేపల్లి వెంకటరామారావుగారు. ఆ రోజు – ఆ సమావేశంలో "ఆంధ్ర జన సంఘం"స్థాపించబడింది.

'విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత' అన్నట్లు ఆనాటి ఆంధ్ర జన సంఘం చరిత్రాత్మకమైన సాయుధ పోరాటం జరిపి గోలకొండ ఖిల్లా కింద నైజాం సర్కారోని గోరీ కట్టింది. చీలి ఉండిన తెలుగువారిని ఏకంచేసి "విశాలాంధ్ర" ఏర్పరచింది. **కాని, సుందరయ్యగారి స్వప్నం - "ప్రజారాజ్యం" - కలగానే ఉండిపోయింది.**

త్వరలోనే ఆంధ్ర జన సంఘంలో నూరుగురు సభ్యులు చేరారు. 22 ఫర్వర్ది 1331-24-2-1922న, 13 అర్దిబెహస్త్ 1331 – 17-3-1922న, 31 ఫర్వర్ది 1331 – 4-4-1922న కొండా వేంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన సమావేశం జరిపిన ఆంధ్ర జన సంఘం స్థూలంగా నాలుగు సూత్రాల నియమావళిని ఆమోదించింది:

1. ఈ సంఘానికి "నిజాంరాష్ట్రాంధ్ర జన సంఘం" అని పేరు.
2. నిజాం రాష్ట్రాంధ్రులలో పరస్పర సహకారం కలిగించి, వారి అభివృద్ధికి తోడ్పడడం.

3. నిజామాంధ్రులకు సంఘాలు స్థాపించడం, ఉన్నవాటికి సాయం చేయడం, సభలు ఏర్పరచడం.
4. 18 సంవత్సరాలు దాటిన ప్రతి ఆంధ్రుడు సభ్యుడు కావచ్చును. అతడు నిజాంరాష్ట్ర నివాసి కావాలి.

కొద్దిరోజుల్లోనే ఆంధ్ర జన సంఘాలు నగరంలోనూ – ఇతర ప్రాంతాలలోనూ ఏర్పడ్డాయి. సమావేశాలు, ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం జరిగింది. తెలుగు వారిలో జాగృతి – ఉత్సాహం వెల్లివిరిశాయి. ఆంధ్ర జన సంఘాలకు ఒక కేంద్ర సంఘం కావలసి వచ్చింది.

1923లో హనుమకొండలో జరిగిన ప్రతినిధుల సభలో ఆంధ్ర జన కేంద్ర సంఘం స్థాపించబడింది. పాఠశాలలు, గ్రంథాలయాలు, వర్తక సంఘాలు స్థాపించడం, లఘుపుస్తకాలు ప్రచురించడం లక్ష్యాలుగా నిర్ణయించారు.

ఆంధ్ర జన సంఘం రాజకీయాల జోలికి పోకుండా జాగ్రత్తపడింది. సంస్కరణలు మాత్రమే లక్ష్యంగా నిర్ణయించుకున్నది. అయినా, నిజాం ప్రభుత్వం సహించలేదు.

సూర్యాపేటలో ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథాలయం ఏర్పడింది. అది పురప్రజలలో ఆసక్తి కలిగించింది. విజ్ఞానం ప్రసాదించింది.

తలూక్దారు – కలెక్టరు – సహించలేకపోయారు. ప్రభుత్వ అనుమతి లేనిదే గ్రంథాలయం నడుపరాదన్నారు. మూయించివేశారు.

సిరిసిల్లలో ఉన్న గ్రంథాలయాన్ని చూచిన తహసిల్దారు ‘సర్కారువారి దఫ్తరములలో – ఆఫీసుల్లో – వ్యవహారమంతయు ఉర్దూలో ఉండగా చచ్చిపోయిన తెలుగును బైటికి గుంజవలసిన పనిలేదు అని మూసివేయించాడు.

వరంగల్లు జిల్లా మడికొండలో ఆంధ్ర గ్రంథాలయం స్థాపించబడింది. ఇందుకు ప్రభుత్వ అనుమతి అవసరం అని పోలీసు పటేలు పట్టుపట్టాడు. కార్యదర్శి అది అవసరం లేదన్నాడు. గ్రంథాలయం నిర్వహించడం కష్టం అయింది. ఇలా ఉండగా అదాలత్ – కోర్టునుంచి కార్యదర్శి పేర ఒక లేఖ వచ్చింది.

“ప్రతిరోజు సదరు లైబ్రరీకి పుస్తకములు, పత్రికలు చదువుకొనగలందులకు జనులు వచ్చుచున్నారు. మరిన్నీ ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, ముషీర్ దక్కన్ వగైరా పత్రికలు వస్తూ ఉన్నవి. హాలు – ప్రస్తుతం – సదరు లైబ్రరీ ఖాయం చేయుటకు యే మహద్మ – డిపార్ట్‌మెంటునుండి అయినా హుకుం – అనుమతి పొంది వున్నారా? అగరు – ఒకవేళ – పొందకున్నట్లయితే ఫేరన్ – వెంటనే – పొందవలసింది. కెంకె – ఎందుకనగా – అక్సరు – తరచు – మజహబీ – మతపు – వార్తలతో జగడాలు అవుతూ ప్రాణహాని కూడా కలుగుతూ ఉన్నది. కాబట్టి మరియొక హుకుం వరకు గ్రంథాలయము మూసి ఉండవలెను.”

తెలంగాణంలో ఆంధ్రోద్యమం ప్రారంభం అయిం తరువాత ప్రజలలో ధైర్యము, ఉత్సాహము కలిగాయి. గ్రంథాలయాలు స్థాపించారు. తెలంగాణంలో గ్రంథాలయం పుస్తకాలు ఉండే స్థలంమాత్రం కాదు. అది చైతన్య నిలయం. ప్రజలు ఒకచోట చేరడానికీ వివిధ విషయాలు చర్చించడానికీ, కార్యక్రమాలు రూపొందించడానికీ

ఉపకరించే స్థలం! ప్రతి గ్రంథాలయం ఒక రాజకీయ శిబిరం. అందుకే గ్రంథాలయం అంటే నిజాముకు బెదురు. ఏదో ఒక కారణం చూపి వాటిని మూయించాడు.

ఆంధ్ర జన సంఘం తెలంగాణ ప్రజలలో ఎంతో స్ఫూర్తిని ఇచ్చింది.

ఉద్యమము మొదలయిన తొమ్మిది నెలల్లో సబ్నవీసు వేంకట రామనరసింహారావుగారి సంపాదకత్వాన నల్లగొండనుంచి తొలి తెలుగు పత్రిక "నీలగిరి" వెలువడింది. తొలి సంచిక 24-8-1922న వెలువడింది.

ఆ తరువాత మూడు రోజులకు వరంగల్లు జిల్లా ఇనుగుర్తి నుంచి "తెలుగు పత్రిక" వెలువడింది. దీనికి బహుభాషా వేత్తలు, పండితులు, సహృదయులు ఒద్దిరాజు సీతారామచంద్రరావుగారు సంపాదకులు కాగా, వారి సోదరులు రాఘవరావుగారు ఉప సంపాదకత్వం వహించారు. దీని తొలి సంచిక 27-8-1922న వెలువడింది. ఒద్దిరాజు సోదరులు తమ గ్రామంలో అచ్చుశాల ఏర్పరచి, మత గ్రంథాల నుండి సైన్సు గ్రంథాల వరకు రచించి, అచ్చువేసిన మహనీయులు. ఈ సంవత్సరం (1994) ఒద్దిరాజు సోదరుల శతజయంతి ఉత్సవాలు జరిగాయి.

ఉద్యమ ప్రారంభం తరువాత నాలుగున్నర సంవత్సరాలకు హైదరాబాదునుండి – సురవరం ప్రతాపరెడ్డిగారి సంపాదకత్వాన గోలకొండ పత్రిక వెలువడింది. దీని తొలి సంచిక 10-5-1926న వెలువడింది. "గోలకొండ" పత్రిక మాత్రమే కాదు – సురవరం వారు సంపాదకులు మాత్రమే కాదు. వారు వెలుగుకు నిలయాలు. ఒక సంస్థగా – ఒక శక్తిగా గోలకొండ పత్రిక తెలంగాణకు చేసిన సేవ అపారం.

కొంతకాలానికి "తెలుగు పత్రిక", "నీలగిరి పత్రిక" నిలిచిపోయాయి. కాని గోలకొండ పత్రిక ద్వైవార పత్రికగా మొదలయి, దిన పత్రికగా విశాలాంధ్రం ఏర్పడిన తరువాత కూడా నడిచింది. ఆధునిక వ్యాపార వత్తిడులకు తట్టుకోలేక – ఆంధ్రపత్రిక వలెనే – మూతపడింది.

"ఆంధ్ర" పదం నిజాముకు బెదురు. ఆ పేరుతో ఒక పత్రికకు అనుమతి ఇవ్వలేదు. అందువలన పత్రికకు "గోలకొండ" అని పేరు పెట్టారు.

ఆంధ్ర జన సంఘపు తొలి సమావేశం హైదరాబాదులో మాడపాటి హనుమంత రావుగారి ఇంట్లో జరిగింది. రావుబహదూర్ వెంకట రెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో వెంకటరామ రెడ్డిగారిని అధ్యక్షులుగాను, మాడపాటి హనుమంతరావుగారిని కార్యదర్శిగను ఎన్నుకున్నారు.

ఈ సమావేశంలో 1. గ్రంథాలయాలు, పాఠశాలలు స్థాపించడం, 2. విద్యార్థులను ప్రోత్సహించడం, 3. విద్వాంసులను గౌరవించడం, 4. తాళపత్ర గ్రంథాలను, శాసనాలను సేకరించడం, పరిశోధించడం, 5. విజ్ఞాన ప్రచారం, 6. ఆంధ్రభాషాప్రచారం, 7. వ్యాయామము, కళలను ప్రోత్సహించడం, 8. అనాధలకు సహాయం అందించడం కార్యక్రమాలుగా నిర్ణయించడం జరిగింది. ఇది 26-7-1923న జరిగింది.

రెండవ సమావేశం నీలగిరి పత్రిక సంపాదకులు సబ్నవీసు వేంకటరామ. నరసింహారావుగారి కార్యాలయ ఆవరణ – నల్లగొండలో జరిగింది. దీనికి వేంకట రెడ్డిగారే అధ్యక్షత వహించారు. ఈ సభ 21-3-1924న జరిగింది. ఈసభలో నిర్ణయించిన కార్యక్రమాలు –

1. నిజాం రాష్ట్రాంధ్ర నిధి ఏర్పాటు చేయబడింది. దీనికి కొండా వెంకటరంగారెడ్డి గారిని వ్యవహర్తగా నియమించారు.
2. వేతనమిచ్చి ఒక ప్రచారకుని నియమించడం.
3. పరిశోధన విభాగాన్ని కేంద్ర జన సంఘానికి మార్చడం.
4. ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి ఆంధ్రభాషలో ప్రథమముగా ఉత్తీర్ణులయిన వారికి వెండి, బంగారు పతకాలు బహూకరించడం.
5. తెలుగుభాష వ్యాప్తికి పరీక్షలు నిర్వహించడం.
6. నిజాంరాజ్యమందలి ఆంధ్రుల స్థితిగతులను తెలియపరచే చిన్నపుస్తకం ప్రచురించడం.

మూడవ సభ మధిరలో జరిగింది. మాడపాటి తిరుమలరావుగారి అధ్యక్షతన ఆహ్వాన సంఘము ఏర్పాట్లు చేసింది. వెంకటరామ రెడ్డిగారే అధ్యక్షత వహించారు. సభలో చేసిన ప్రధాని నిర్ణయాలు:

1. ఆంధ్రపరిశోధక మండలికి కార్యవర్గం ఎన్నుకోవడం జరిగింది.
2. ఇంజనీరింగ్ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయిన ఆంధ్రునికి సువర్ణపతకంతో గౌరవించడం.
3. ఆంధ్ర భారతీ తీర్థ (విజయనగరం) పరీక్ష ఇవ్వడాన్ని ప్రోత్సహించడం.
4. బొంబాయి ఆంధ్రులు చూపిన సానుభూతికి కృతజ్ఞతలు తెలియపర్చడం.

ఇంతవరకు ప్రభుత్వం అంతగా ఆటంకం కలిగించలేదు. కాని, దినదినాభి చెందుతున్న ఆంధ్ర జన సంఘం విషయంలో అప్రమత్తంగా ఉంది.

ఇంతవరకు జరిగిన సభలకు వంద – రెండు వందలకు మించి ప్రజలు రాలేదు. తీర్మానాల్లో రాజకీయ జాడ గాలించినా కనిపించలేదు.

కాని, 21–2–1925న మధిరలో జరిగిన సభకు ఒక విశిష్టత ఉన్నది.

1. ఆంధ్ర జన సంఘ సభతోపాటు గ్రంథాలయ మహాసభ కూడా 22–2–1925న జరిగింది.
2. బొంబాయి ఆంధ్రులు సానుభూతి తెలిపారు. నిజాం గ్రంథాలయాలను సహించలేదు. రాజ్యపు అవలివారి సంబంధాలను అసలు ఓర్చలేదు.

సూర్యాపేటలో జరుప తలపెట్టిన 4 వ సభలకు అంతరాయం కలిగించాడు.

నాలుగవ మహాసభలు సూర్యాపేటలో జరపడానికి కోదాటి రామకృష్ణారావు గారి అధ్యక్షతన అహ్వాన సంఘం ఏర్పడింది. ఆంధ్ర జన సంఘ సభలతోపాటు గ్రంథాలయ మహాసభ, విద్యావిషయక, సామాజిక సభలు కూడా జరపడానికి నిశ్చయించారు. వెంటనే "ప్రభుత్వము వారి అనుమతి లేక సభలు జరుపరాదు" అని ఆదేశించారు. అంతేకాదు, "ప్రభుత్వపు అనుమతి లేకుండా సభలు జరుపడానికి ప్రయత్నిస్తే పరిణామాలు తీవ్రంగా ఉంటాయి." అనే సుగ్రీవాజ్ఞను సూర్యాపేట పురప్రముఖులకు చాలామందికి పంపారు.

దీనితో ఉత్సాహవంతులయిన పురజనుల్లో నిరుత్సాహం వ్యాపించింది. అంతేగాని, పట్టుదల సన్నగిలలేదు. మాడపాటివారు పోలీసు అధికారిని కలిశారు. ఇవి రాజకీయ సభలు కావని నచ్చచెప్పడానికి ప్రయత్నించారు. అతడు ససేమిరా వినలేదు.

అది ప్రభుత్వ ఆదేశం! అధికారి ఏం చేయగలడు?

అమరవాది వేంకట నర్సయ్యగారు నల్లగొండ జిల్లా న్యాయస్థానంలో మనవి

పత్రం సమర్పించి సూర్యాపేట సభలకు అనుమతి కోరారు. జిల్లా న్యాయాధికారి "ప్రభువువారి ఫర్మానాను అనుసరించి బాబెహుకూమత్ అనుమతి పొందుట తప్పనిసరి" అని తీర్పు ఇచ్చాడు.

దీనిమీద హైకోర్టుకు అపీలు చేయగా హైకోర్టు ఇచ్చిన తీర్పులో ప్రధానాంశాలు:

1. రాజకీయముకాని విద్యాసంబంధమైన సభలకు నిర్బంధము కలిగించుట ప్రభువువారి ఫర్మాను భావము కాకపోవచ్చును.
2. ఒక సభ రాజకీయము అగునా కాదా అన్నది సభ జరిగిన తరువాతగాని తెలియదు. ప్రభువువారి ఫర్మానుకు విరుద్ధమైతే శిక్షపడక తప్పదు. అలాంటి సందర్భంలో అది రాజకీయం అవునా కాదా అని నిర్ణయించు హక్కు కోర్టువారికి ఉంటుంది.

ఈ తీర్పువల్ల స్థూలంగా నిర్ణయమైంది ఏమంటే – ఆంధ్ర సంఘానికి చెందిన ఏ సభ జరపాలన్నా బాబెహుకూమత్ – మంత్రిమండలి – నుంచి అనుమతి పొందాలి.

బాబెహుకూమత్ అనుమతి కోరితే వారు ఎంతకూ తేల్చి చెప్పలేదు.

1927లో బ్రిటిషిండియా ప్రభుత్వం రెవెన్యూశాఖ మంత్రిని – పోలీసుశాఖాధ్యక్షుని నిజాం ప్రభుత్వంలో ఇంగ్లీషువారిని నియమించింది. DG.గా లెఫ్టినెంట్ కర్నల్ ట్రెంచ్ వచ్చాడు. మాడపాటివారు ట్రెంచ్‌ను కలిసి, సూర్యాపేట సభలకు అనుమతి సాధించారు.

అవిధంగా 1926లో జరగవలసిన సభలు ప్రభుత్వ దమననీతి కారణంగా సూర్యాపేటలో 28, 29, 30 మే 1928లో అత్యంత వైభవంగా జరిగాయి. సభలు విజయవంతంగా జరగడానికి, ప్రజలలో ఉత్సాహం వెల్లివిరియడానికి రెండేళ్ళపాటు ప్రభుత్వం పెట్టిన తిప్పలు ప్రముఖ కారణం కావచ్చును. మూడు రోజుల్లో ఏ రోజునా వేయికి తక్కువ జనం రాలేదు. సుమారు 50 మంది ఉపన్యాసా లిచ్చారు. ఆంధ్ర జన సంఘ సమావేశాలకు కొండా వెంకటరంగా రెడ్డిగారు అధ్యక్షత వహించారు. దానితో పాటు మరికొన్ని ప్రధాన సభలు జరిగాయి.

1. ద్వితీయ గ్రంథాలయ మహాసభ – మహారాష్ట్రుడయిన వామన నాయక్ అధ్యక్షులు.
2. వర్తక సంఘ వార్షికోత్సవం – అధ్యక్షులు వై. అంజయ్యగారు.
3. స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవం – అధ్యక్షులు సురవరం ప్రతాపరెడ్డిగారు.
4. స్థానిక భజన సమాజ వార్షికోత్సవం అధ్యక్షులు ఆదిపూడి సోమనాథరావుగారు.
5. మహిళాసభ – అధ్యక్షులు చట్రాతి లక్ష్మీనరసమ్మగారు.
6. ఆంధ్ర యువజన మహాసభ – అధ్యక్షులు లోకనంది శంకరనారాయణరావుగారు.
7. ఆంధ్ర సంఘ సంస్కార సభ – అధ్యక్షులు గాడేపల్లి సూర్యప్రకాశరావుగారు.
8. వైశ్యుల సభ – అధ్యక్షులు పులిగళ్ల అంజయ్యగుప్తగారు.

తరువాత నల్లగొండ – మిర్యాలగూడెం – తిప్పర్తిలలో కూడా అత్యంత ఉత్సాహంగల జనబాహుళ్యంతో జరిగాయి సభలు.

ఇక్కడ గమనించవలసినవి.

1. సాధారణ సభ జరుపుకోవడానికి మంత్రిమండలినుంచి అనుమతి కావాలనడం రాక్షసం – పాశవికం – క్రూరం.

2. నిజాం క్రూరత్వాన్ని చూచి బ్రిటిషు ప్రభుత్వం తన అధికారులను పంపింది. బ్రెంచ్, టాస్కర్లు ఆంధ్రోద్యమానికి ఎంతో సాయపడ్డారని మాడపాటివారు వ్రాశారు.
3. న్యాయస్థానాలు నిజాం చెప్పుచేతల్లో ఉన్నాయి.
4. ప్రజలను ఎంత అణచిపెడ్తే అంత పెల్లుబుకుతారు.
5. ఆంధ్రోద్యమానికి నల్లగొండ జిల్లా తావరం అయింది.
6. తెలుగువారిని ఈసడించిన మహారాష్ట్రులు ఆంధ్రుల సభల్లో పాల్గొనడం.

ఇంతటితో నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమంలో తొలి దశ విజయవంతంగా ముగిసింది. ఈ కొద్ది కాలంలో ఆంధ్రులకు ఒక సంస్థ ఉన్నదని విశ్వాసం ఏర్పడింది. వర్తకులలో ముఖ్యంగా మంచి ప్రాబల్యం సంపాదించింది. వర్తకులకు సంఘం వల్ల కొన్ని ప్రయోజనాలు కలిగాయి. వారికి దొరల, అధికారుల బెడద కొంతలో కొంత తగ్గింది. వర్తకులు మనస్ఫూర్తిగా అన్ని విధాల సంఘానికి సాయం చేశారు.

ఈ దశలో కేంద్ర సంఘం వివిధ సంఘాల సంధాన కార్యం మాత్రం నిర్వహించింది. అందువల్ల తెలంగాణం అంతటికీ ప్రాతినిధ్యం వహించే సంస్థ అవసరం అయింది. ఈ అవసరాన్ని కార్యకర్తలు, ప్రజలు గుర్తించారు. బ్రిటిషాంధ్రం నుంచి సుసర్ల శ్రీ రామనరసింహగారు విస్తృత ఆంధ్ర సంస్థ అవసరాన్ని ఆంధ్ర సంఘానికి తెలియపరచారు. వీటిని అన్నింటిని దృష్టిలో పెట్టుకొని ఆంధ్రమహాసభ అవతరించింది.

## ఆంధ్రమహాసభ అవతరణ:

తొలి ఆంధ్ర మహాసభ మెతుకు జిల్లా – అందోలు తాలూకా జోగిపేటలో 3, 4, 5 మార్చి 1930లో జరిగింది. దీనికి విద్వాంసులు, ప్రగతిగామి సురవరం ప్రతాపరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

సభలు జరుపుకోవడానికి అనుమతికి 1929 డిసంబరులో అర్థిస్తే, 22–2—1980నాడు దిగువ షరతులతో అనుమతి లభించింది.

1. అధ్యక్షుడు గైర్ ముల్కీ – రాజ్యానికి చెందనివాడు – కాకూడదు.
2. ఇతర మతస్థులకు అనుమానముకాని, మనస్తాపంగాని కలిగించరాదు.
3. రాజకీయాల జోలికి పోమని మీరిచ్చిన మాటకు కట్టుబడి ఉండాలి.

ఈ సభలో విశేషం ఏమంటే – బాబెహుకూమత్ కార్యదర్శి మెహిదీనవాజ్ జంగ్ వంటి ప్రభుత్వాధికారులు సందేశాలు పంపడం. వీరి పేరిటనే మెహిదీపట్నం ఏర్పడింది.

ఈ సభలో ఒక అడుగు ముందుకు వేయడం జరిగింది. సంఘ సంస్కరణలకు సంబంధించిన తీర్మానాలు ఆమోదించడం జరిగింది. బాల్యవివాహాల నిషేధం. వితంతువివాహాలు వంటి తీర్మానాలు చేశారు. ఇవి ఆహ్వాన సంఘాధ్యక్షుని సహితంగా సనాతనులకు బాధ కలిగించాయి.

అంటరానితనం తొలగించడానికి, హరిజన విద్యాభివృద్ధికి సంబంధించిన తీర్మానాన్ని హరిజన నాయకుడు శ్రీ భాగ్యరెడ్డి వర్మగారు ప్రతిపాదించారు. ఒక హరిజనుడు

అందరినీ అంటుకుంటూ సభావేదికపైకి పోవడం సనాతనులు సహించలేదు. సభనుంచి వెళ్ళిపోవడానికి సిద్ధం అయినారు. వామననాయక్‌గారు వారిని సమాధానపరచి కూర్చోపెట్టారు.

ఈ తీర్మానాన్ని శేషాచార్యులు, అనంత వెంకటరామ వెంకటేశ్వర గుప్త, విఠలశాస్త్రి, భుజంగశాస్త్రిగారలు వ్యతిరేకించారు. అయినా, సమావేశం తీర్మానాలను ఆమోదించింది.

ఈ సభతోపాటు మహిళాసభ జరిగింది. ప్రభుత్వ పశుచికిత్స, వ్యవసాయ శాఖలు ప్రదర్శనలు ఏర్పాటు చేశాయి. కొంత అసమ్మతి – ఉన్నా జోగిపేట సభలు దిగ్విజయంగా సాగాయి.

జోగిపేట సభతో సనాతనుల ఘర్షణను ఎదుర్కొనే స్థితికి ఆంధ్రమహాసభ ఎదిగింది.

ఘర్షణనుంచే ప్రగతి ఉద్భవిస్తుంది.

## రెండవ ఆంధ్రమహాసభలు – దేవరకొండ:

రెండవ ఆంధ్రమహాసభ 3, 4, 5 మార్చి 1931న నల్లగొండ జిల్లా దేవరకొండలో జరిగింది.

ఈ సభకు కూడా జోగిపేట సభవంటి షరతులు పెట్టారు. అనుమతి ఇస్తూ టాస్కరుగారు మాడపాటివారితో "మీ ఉద్యమముతో ఈ రాష్ట్రమున మేలు చేయదగిన యోగ్యతలు చాల కలవు. అయినను ముందు ముందు ఇది అపాయకరముగా పరిగణించగలదు" అన్నారట. అది అత్యంత వాస్తవమని నిరూపించబడింది!

ఈ సభకు బూర్గుల రామకృష్ణారావుగారు అధ్యక్షత వహించారు. మహారాష్ట్రులయిన పండిత కేశవరావు గారు అధ్యక్షులను తమ కారులో తీసికెళ్ళారు. కేశవ మెమోరియల్ స్కూలు వీరిపేరనే వెలసింది.

నగరంనుంచి బస్సులలో వచ్చిన ప్రతినిధులకు, అతిథులకు బాదేపల్లి ప్రజలు అపూర్వ సన్మానం చేశారు. వారికి భోజన ఫలహారాదులు పెట్టి, బాజాబజంత్రీలతో దేవరకొండ చేర్చారు.

రెడ్డిహాస్టలు – దీనిది మహత్తర చరిత్ర – విద్యార్థులు నాలుగు రోజులముందే కాలినడకన బయల్దేరారు. గ్రామగ్రామాన ప్రచారం చేస్తూ, యువకులను ఉత్సాహపరుస్తూ దేవరకొండ చేరుకున్నారు.

ఆంధ్రమహాసభతో ప్రత్యక్ష సంబంధం లేక సభకు విచ్చేసిన ప్రముఖులు, మహారాష్ట్రులు పండిత కేశవరరావుగారు, వామన నాయక్‌గారు, వారి పుత్రులు శ్రీధర్ నాయక్‌గారు, విద్యాశాఖాధికారి గాడేపల్లి ప్రకాశరావుగారు, హైదరాబాద్ బులిటిన్ సంపాదకులు బుక్కపట్నం రామానుజాచార్యులవారు, చారిత్రకులు మారేమండ రామారావుగారు, బ్రిటిషాంధ్రులు, ప్రజామిత్ర పత్రికా సంపాదకులు గూడవల్లి రామబ్రహ్మంగారు – బెజవాడ.

ప్రభుత్వాధికారులు పోలీసు శాఖామంత్రి భాస్కర్‌గారు, విద్యాశాఖ నాజిమ్ – డైరెక్టర్ – మహమ్మద్ హుసేన్‌గారు, కొత్వాల్ వెంకటరామారెడ్డిగారు, నిజాం

కాలేజి ప్రిన్సిపల్ టర్నరుగారు, బళ్ళారి జేలులో దేశభక్తికిగాను శిక్ష అనుభవిస్తున్న సుసర్ల శ్రీరామ నరసింహగారు సభకు సందేశాలు పంపారు.

అధ్యక్షులను అశ్వారూఢులను చేసి, క్రిక్కిరిసిన పురవీధులనుంచి ఊరేగింపుగా సభాస్థలికి చేర్చారు. ఆహ్వాన సంఘాధ్యక్షులు గంభీరమైన ఉపన్యాసం చేశారు.

ఈ సభలో ప్రధాన విషయం గ్రస్తీనిషాన్ తిర్దన్ – సర్క్యులర్ నెం.53ను ఉపసంహరించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించడం. ఇది చరిత్రాత్మక సంఘటన. అంతకుముందు నిజాం రాజ్యంలో ఇలాంటి తీర్మానం చేసే దమ్ములు ఎవరికీ లేకుండింది. ఇది సంఘసంస్కరణకన్న ముందడుగు.

మహిళాసభ జరిగింది. దానికి టి. వరలక్ష్మమ్మగారు అధ్యక్షత వహించారు. స్త్రీలలో విద్యావశ్యకత – మాతృభాషలో విద్య – ఆరోగ్యపరిజ్ఞానములను గురించి చర్చలు జరిగాయి.

ప్రత్యేకంగా హరిజన సభ జరగడం ఈ సభ విశిష్టత. హరిజనులు చుట్టుపట్ల గ్రామాలనుంచి వచ్చారు. చిత్తారయ్యగారు అధ్యక్షత వహించారు. విజ్ఞానదాయకమైన ఉపన్యాసాలు జరిగాయి.

నిమ్నజాతుల ఉద్ధరణను గురించి గురుకుల మల్లేశరావుగారు తీర్మానం ప్రతిపాదించారు. మహాసభ దాన్ని ఆమోదించింది.

జీవరక్షా సమితివారు – ప్రభుత్వశాఖలు ప్రదర్శనలు నిర్వహించారు.

ఈ విధంగా రెండవ ఆంధ్రమహాసభ సభలు అత్యంత వైభవంగా, చైతన్యపూర్వకంగా, దిగ్విజయంగా పరిసమాప్తి చెందాయి.

## మూడవ ఆంధ్రమహాసభ - ఖమ్మంమెట్టు:

రెండో ఆంధ్రమహాసభలో గస్తీనిషాద్ తిర్దన్ విషయమయిన తీర్మానంతో నిజాం బెదిరిపోయాడు. సూర్యాపేటసభకువలెనె ఖమ్మంసభకు అనేక ఆటంకాలు కల్పించాడు.

1. మహబూబ్‌నగర్ జిల్లాలోని జటప్రోలు సంస్థానంలో మూడో మహాసభలు జరగాలని నిర్ణయించబడింది. సభకు అనుమతించాలని సంస్థాన కార్యచర్చిని అర్థించారు. ఒక నెల తరువాత "ఇట్టి అధికారం మాకు లేదు. నిజాం ప్రభుత్వపు అనుమతి పొంది మాకు చూపవలసినది" అనే శ్రీముఖం అందింది.

మళ్లీ జిల్లా అవ్వల్ తాలుక్దారు – కలెక్టరును – అర్థించారు. వారు దానికి "జిల్లా అధికారులు సంస్థాన వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోరు. దేవరకొండ సభవలెనే అనుమతి పొందగలరు" అనే ప్రత్యుత్తరం పంపి చేతులు దులుపుకున్నారు.

మహాసభ కార్యదర్శి హనుమంతరావుగారు ముందు తాలుక్దారుగారికి వ్రాశారు. ప్రయోజనం శూన్యం. అప్పుడు వారు హోం సెక్రటరీకి వ్రాశారు. దానికి ఒక నెల తరువాత సాక్షాత్తు ప్రధానమంత్రి మహారాజా కిషన్ పెర్షాద్ నుంచి ఉత్తరం అందింది–

"సంస్థానము లోపలనగుగాక, బయటనగునుగాక మహాసభ సమావేశపరచుటకు అనుమతి ఇవ్వబడదు."

దీనినిబట్టి ప్రభుత్వం ఎంత బెదిరిపోయిందో అర్థం అవుతుంది. సభలకు అనుమతి ఇవ్వము అని ప్రధాని అంతటివాడు చెప్పడం ఇందుకు నిదర్శనం.

ఆంధ్రమహాసభ రాజకీయ ఉద్యమం కాదు ఉత్తరువును పునరాలోచించవలసినది అని మాడపాటివారు ప్రభుత్వానికి వినతిపత్రం సమర్పించారు. జవాబు లేదు. మళ్లీ వ్రాసుకున్నారు. అయిదునెలల తరువాత పోలీసు శాఖామంత్రిని దర్శించమని ఆదేశం అనుగ్రహించారు. 19-7-1932న కలుసుకొమ్మన్నారు. ముఖము చాటు వేసినారు. తుదకు 3-8-1932 పగలు 12-00 గంటలకు దర్శనం ఇచ్చారు. అప్పుడు అక్కడ పోలీసు శాఖ అధ్యక్షుడు, హోం సెక్రటరీ కూడా ఉన్నారు. కర్నల్ ట్రెంచ్‌గారు మాడపాటివారితో సుదీర్ఘంగా చర్చించి, ఒక శ్రీముఖం అందజేశారు.

ఆ లేఖ సారాంశం ఇలా ఉంది:

1) విద్యావిషయక, రాజకీయ ఇతర విషయాలలో ప్రభుత్వపు పాలసీగాని, ఆదేశములను గాని సభలో చర్చించరాదు. ఎందుకనగా, వాటిని గురించి వ్యక్తికిగాని, సంఘానికిగాని ఉన్న ఆక్షేపణలు నివేదించుకోవడానికి అవకాశాలున్నాయి.

2) హనుమంతరావుగారు, సభా నిర్వాహకులు రెండువేల రూపాయీల నగదు ప్రభుత్వానికి ధరావతు చెల్లించాలి. పై షరతు అతిక్రమించబడిందీ లేనిదీ నిర్ణయించే పూర్తి అధికారం ప్రభుత్వానికి ఉంటుంది.

ఈ హుకుంనామాను గురించి నిర్ణయించడానికి మహాసభ కార్యవర్గం 29-8-1932న సమావేశమయింది. "ఆంధ్ర మహాసభకు రాజకీయాలతో సంబంధం లేదు. ఇది రాజకీయ సంస్థ కాదు. అందువలన ధరావతు విషయం తొలగించి అనుమతించ వలసింది. ఇంకను 3-8-1931 నాటి ప్రభుత్వ హుకుం జనులకు తెలియజేయుటకు అనుమతి ఇవ్వగలరు" అని వ్రాశారు.

ప్రభుత్వ ఉత్తరువును ప్రకటించరాదని పోలీసు శాఖామంత్రినుండి జవాబు వచ్చింది.

ఎంతటి క్రూరత్వం అంటే - సభ జరుపుకోనివ్వరు. అలాంటి ఉత్తరువును బహిరంగపరచనీయరు. ఇలాంటి నికృష్టపరిస్థితుల్లో ఉద్యమాన్ని నిర్వహించినవారు వందనీయులు. నిస్వార్థంగా వారు చేసిన నిరంతర సేవకు ఆంధ్రజాతి వారిని నిత్యం స్మరించాల్సి ఉంది.

అసలు విషయం ప్రభుత్వం తేల్చదు. జవాబు వ్రాయదు. విసుగు చెందక నిరంతరం విన్నపాలు పంపుకున్నమీదట 20 నెలల తరువాత పోలీసు శాఖామాత్యులు తమను దర్శించుకొనుటకు అనుమతి నొసంగినారు.

5-3-1934 నాడు బూర్గుల రామకృష్ణారావుగారు, మాడపాటి హనుమంత రావుగారు కర్నల్ ట్రెంచ్‌ను కలుసుకున్నారు. అప్పుడు పోలీసుశాఖాధిపతి ఆర్మ్‌స్ట్రాంగ్‌గారు, హోం సెక్రటరీ కూడా ఉండిరి. మహాసభ పక్షాన బూర్గులవారు మాట్లాడారు. సంభాషణ ఇలా సాగింది:

బూర్గుల:- మా ఉద్యమం రాజకీయేతరం. గ్రంథాలయాలద్వారా విజ్ఞానం వ్యాపింపచేయడమే మా ఉద్దేశ్యం.

ఆర్మ్‌స్ట్రాంగ్:- అయ్యా! గ్రంథాలయోద్యమం అంటే ఏమిటో నాకు బాగా తెలుసు. ఇందు విషయంలో బెంగాల్లో మంచి అనుభవం సంపాదించాము. గ్రంథాలయం అంటే విప్లవ సంఘం. విప్లవాన్ని మించింది గ్రంథాలయం.

ట్రెంచ్ – ధరావతు చెల్లించడానికి ఆక్షేపణ ఎందుకు? అంతమాత్రం డబ్బు మీ దగ్గర లేదా? లేక ఆ డబ్బు ప్రభుత్వం గుంజుకుంటుందని భయమా?

బూర్గుల – మేము రాజ్యంలో అర్ధభాగానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాం. అంతమాత్రం డబ్బులేకా కాదు, ప్రభుత్వం లాక్కుంటుందని భయమూ కాదు. అది మా ఆత్మగౌరవానికి భంగకరం. మహాసభ నిర్వహిస్తున్న విద్యావైజ్ఞానిక సామాజిక సేవలను గురించి ప్రజల గౌరవ భావాన్ని ఈ షరతు నిర్మూలిస్తుంది. అందువల్ల అందుకు మేము వప్పుకోజాలం.

తరువాత గత సభలో తీర్మానాలనుగురించి ప్రభుత్వంవారు ఆక్షేపణ తెలిపారు. తుదకు సభ జరుపుకోవడానికి అనుమతి ఇవ్వవలసిందిగా సిఫార్సు చేస్తామన్నారు.

ట్రెంచ్ – ఇకముందయినా బుద్ధిగల పిల్లలవలె ప్రవర్తించండి.

20–6–1934న హోంసెక్రటరీనుంటి కార్యదర్శికి దిగువ షరతులమీద అనుమతి ఇవ్వబడుతుందని తెల్పారు:

1. బహిరంగసభల విషయంలో ప్రభుత్వనిబంధనలను ప్రత్యక్షరం పాటించాలి. ఇందుకు కరారునామా సమర్పించాలి.
2. సభ జరుపు స్థలము – సభాధ్యక్షుని పేరు తెలియపరచాలి.
3. భూమిపన్ను తగ్గించుటను గురించి తీర్మానించరాదు.
4. ప్రభుత్వాధికారులకు పనులు చేయరాదని బోధించకూడదు.
5. ప్రభుత్వానికి, కార్యకర్తలకు ఘర్షణ జరగకుండా బాధ్యత వహించాలి.
6. ఈ నియమాలను ఉల్లంఘిస్తే మహాసభ కార్యదర్శి అందుకు బాధ్యత వహించాలి.

మహాసభ ఖమ్మంమెట్టులో జరుగుతుందనీ, పులిజాల వేంకట రంగారావుగారు సభకు అధ్యక్షత వహిస్తారనీ, సభలు 13, 14, 15 డిసంబరు 1934లో జరుగుతాయనీ ప్రభుత్వానికి తెలియపర్చడం జరిగింది.

ప్రభుత్వంనుంచి 5–12–1934న జారీ అయిన హుకుంలో స్పష్టత లేదు. "వరంగల్లు జిల్లా అవ్వల్ తాలూక్దారు – కలెక్టరుగారికి ఖమ్మంమెట్టులో మహాసభా సమావేశాలను గురించి వ్రాయటం జరిగింది. ఆదేశాల వివరాలు వారినుంచి అందుకొనవలసినది."

అనుమతి ఇచ్చినట్లు, ఇవ్వనట్లు తెలియదు. అక్కడ మరెన్ని చిక్కులు కల్పించమన్నదో తెలియదు. ఈ ఉత్తరువులు కూడా సభ జరగడానికి సరిగ్గా ఒక వారం ముందు ఇచ్చారు.

## సనాతనుల బెడద:

మూడేళ్లు ముప్పతిప్పలుపెట్టి సర్కారు అనుమతించినట్లు నటిస్తే, ఖమ్మం మెట్టు సనాతనులు మరిన్ని ఇబ్బందులు కలిగించారు.

మహాసభలో సంఘసంస్కరణల చర్చ జరుగుతుంది. అది హిందూ సంప్రదాయ వాదులకు బాధ కలిగిస్తుంది. తద్వారా ఘర్షణలు చెలరేగవచ్చు. శాంతికి భంగం కలుగవచ్చు. కాబట్టి ఖమ్మంమెట్టులో ఆంధ్రమహాసభ జరపనీయరాదని సనాతనులు మహాజర్లు పంపారు.

ఈ సనాతనుల దుష్ప్రచార కార్యక్రమంలో మా నాయనగారి హస్తం బలంగా ఉంది.

"సంకరము నరకమూలమగు
తండ్రితాతల ధర్మము తప్పరాదు"
అనేది రేకు స్టెన్సిలు తీయించి ఊరిలోని గోడలన్నింటిమీదా రుద్దించారు.

"అస్పృశ్యులను దూరముగా ఉంచవలెను" అని ఒక కరపత్రం అచ్చు వేయించి పంచిపెట్టారు. నేను కూడా ఆ పత్రాలు కొన్ని ఇండ్లలో వేశాను.

మహాసభలో మాల, మాదుగులతో కలిసి తింటారనీ, అందువల్ల వర్ణసంకరం జరుగుతుందనీ, అది పాపహేతువనీ ఖమ్మంపురానికి అరిష్టదాయకమనీ ప్రచారం చేశారు.

మహాసభ జరుగుతే మాల, మాదుగులు ఇళ్ళలో జొరబడ్తారనీ, చేతికి అందినవి ఎత్తుకు పోతారనీ జనాన్ని భయకంపితులను చేశారు. మహాసభకు జనం వెళ్లకుండా, సాయం చేయకుండా కట్టుదిట్టం చేశారు.

ఆంధ్ర జన సంఘానికి అన్ని విధాల సహకరించినవారు వర్తకులే. ఆ వర్తకులే ఇప్పుడు సహాయనిరాకరణ చేశారు.

తమ ప్రయోజనం మాత్రమే చూసుకోవడం వర్తకుల వ్యాపారుల స్వభావం.

మాదిరాజు వేంకటేశ్వరరావు, ఇటిక్యాల రాజేశ్వరరావుగారలు సనాతనులకు నాయకత్వం వహించారనీ, అసలు కథ సొంతం గుంటూరునుంచి కాశీకృష్ణాచార్యులవారు నడిపించారనీ మాడపాటివారి అభిప్రాయం.

నిజాం ప్రభుత్వమే కాశీకృష్ణాచార్యులవారితో ఇదంతా చేయించి ఉండవచ్చు. నిజాం రాజు – తన ఉనికికోసం రాజ్యం బయటివారితో సంబంధాలు ఏర్పరచుకున్న నిదర్శనాలూ సందర్భాలూ ఉన్నాయి.

"దగాకోరు బటాచోరు
రజాకారు పోషకుడవు" అన్నారు దాశరథి.

ఇక్కడ ఒక విషయం తెలియపరచాలి. మాడపాటివారు మహిళలకు తెలుగులో విద్య బోధించాలని తమ ఇంట్లోనే ఒక పాఠశాల నడిపారు. అందులో వారి భార్య మాణిక్యమ్మ సహితంగా ఏడుగురు మహిళలు ఉండిరి. వారిని మెట్రిక్యులేషనుకు సిద్ధం చేశారు. బ్రిటిషాంధ్రంలోని ఒక విశ్వవిద్యాలయాన్ని – ఆ మహిళలను మెట్రిక్యులేషన్ పరీక్షకు అనుమతించవలసిందిగా కోరారు. నిజాం నవాబు ఆ సంస్థకు లక్షరూపాయలు విరాళం ఇచ్చారు. ఆ విద్యాలయం "మాకు దేశీయ సంస్థానాలతో సంబంధం లేదు" అని తెలియపరచింది.

తదుపరి హనుమంతరావుగారి నిరంతర ప్రయత్నంవల్ల మహారాష్ట్రలోని కార్వే విద్యాలయం వారు ఈ మహిళల కోసం ప్రత్యేకంగా తెలుగు విభాగం ప్రారంభించి, తెలుగులో పరీక్షలు నిర్వహించి, డిగ్రీలు ప్రదానం చేశారు.

ఖమ్మంమెట్టులో జరుగుతున్న ఆంధ్రమహాసభకు ఖమ్మంపురంనుంచి అంతగా సాయం లభించలేదు. ఎర్రుపాలెం, రేమిడిచర్ల, రామన్నపేట, పెదమండవ,

కొదుమూరు నుండి కార్యకర్తలు వచ్చి, కార్యభారం వహించారు. వారిలో జమలాపురం కేశవరావు, మాడపాటి రామచంద్రరావు ముఖ్యులు.

ఇన్ని అడ్డంకులు – ఆటంకాలు – సహాయ నిరాకరణలమధ్య ఖమ్మంలో మూడవ ఆంధ్రమహాసభ విజయవంతంగా జరిగింది. సభకు రెండు వేలవరకు ప్రతినిధులు వచ్చారు. సాయంత్రం 5.00 గంటలకు పురవీధులనుంచి – నినాదాలు ప్రతిధ్వనించగా – ఊరేగింపు జరిగింది. ఈ ఉరేగింపు మధ్యలో ఛాందసులు ఒకటి రెండు వందల మంది కలిశారు.

ఊరేగింపు సభాస్థలికి చేరింది. సభ ప్రారంభం అయింది. ఆహ్వాన సంఘాధ్యక్షులు అయితరాజు జీడికంటి రామారావుగారు వారి ఉపన్యాసం చదవడం ప్రారంభించారు.

సభను విచ్ఛిన్నం చేయడానికి వచ్చినవారు లేచి, ఉపన్యాసంలో తమకు అభ్యంతరకరమైన విషయాలు ఉన్నాయనీ, చదవరాదనీ అభ్యంతరం చెప్పారు. సభలో గందరగోళం నివారించదలచి, అహ్వాన సంఘాధ్యక్షులు ఉపన్యాసం చదవడం మానేశారు.

ఈ సభకు పులిజాల వేంకట రంగారావుగారు అధ్యక్షత వహించారు.

ఈ సభ విశేషం ఏమంటే – ఎర్రుపాలెం నుంచి వచ్చిన గురునాథ శర్మగారి వేదమంత్ర పఠనంతో ప్రారంభం అయింది. అంతకుముందు జరిగిన సభల్లో వేద మంత్ర పఠనం జరగలేదు. ప్రతిపక్షుల వ్యతిరేక ప్రచారాన్ని అడ్డుకోవడానికి దీనిని ప్రవేశపెట్టినట్లున్నారు.

అధ్యక్షోపన్యాసాన్ని అధ్యక్షులవారు గంభీరంగా, ఉత్సాహంగా చదివారు. ప్రేక్షకులకు ఆంధ్రాభిమానం – ఉత్సాహం కలిగించారు.

సభ ముగిసింది. రాత్రి పదకొండు గంటలకు విషయ నిర్ణాయక సభ ప్రారంభం అయింది. అప్పుడు కలెక్టరుగారు తహసీల్దారును పంపారు. హనుమంతరావుగారిని – బూర్గుల రామకృష్ణరావుగారిని పిలిపించారు. వారు కలెక్టరు దగ్గరకు చేరుకున్నారు. అప్పటికే ప్రతిపక్ష నాయకులు – మరికొందరు అధికారులు అక్కడ ఉన్నారు. కలెక్టరుతోనూ, ఛాందసులతోనూ మూడు గంటలు చర్చలు జరిగాయి. వారి వత్తిడి ఫలితంగా 6 వ తీర్మానం చర్చలేకుండా ఆమోదించడానికి – 13, 20, 21 తీర్మానాలు విరమించడానికి అంగీకరించక తప్పిందికాదు.

ఆ తీర్మాలను గురించి తెలుసుకుంటే – ఈనాడు – అపహాస్యం అనిపిస్తుంది.

6 వ తీర్మానం ప్రభువువారికి కృతజ్ఞతలు చెప్పేది. 13 దేవాలయాలలో హింసను నివారించడానికి, 20 బాల్య వివాహాలు, వరకట్న వ్యతిరేకవుది. 21 హరిజనుల అభ్యుదయానికి సంబంధించింది.

రెండవనాటి సభలో మిగతా తీర్మానాలు ఆమోదించబడినాయి.

మహిళా సభ ఎల్లాప్రగడ సీతాకుమారి అధ్యక్షతన జరుగుతున్నది. సభాస్థలము మహిళలతో కిటకిటలాడుతున్నది. చట్రాతి లక్ష్మీనరసమ్మగారు మున్నగువారు ఉపన్యసిస్తున్నారు.

కలెక్టరుగారు మరల ఛాందస మహాశయులను వెంటనిడుకొని, రవి తేజము లలరగ – సభాస్థలికి విజయము చేసినారు. ఆంధ్రమహాసభ కార్యదర్శి మాడపాటి హనుమంతరావుగారిని పిలిపించినారు. వెంటనే మహిళా సభను నిలుపుచేయించ వలసినదని ఆదేశము అనుగ్రహించినారు.

హనుమంతరావుగారు సాధు స్వభావులు, సాధారణంగా ఆవేశపడరు. కార్యము సాధించుట వారి స్వభావము. కయ్యం కొనుక్కోవడం కాదు.

అలుగుటయే యెరుంగని మహామహితాత్ముడు – ఆంధ్రపితామహుడు అలిగినాడు!

"అయ్యా! ఈ సభకు తమరు ఎన్నియో విధముల ఆటంకములు, చిక్కులు కల్పించుచున్నారు. జరుగుచున్నది స్త్రీల సభ. నేను దానిలోనికి ప్రవేశించజాలను. మీరు అవలంబించు విధానమేదియో నిరభ్యంతరముగ అవలంబించవచ్చును. నన్ను తమరు అరెస్టు చేసి, తగిన చర్యలు గైకొనవచ్చును" అని తమ కోపాన్ని గుమ్మరించారు.

వచ్చిన కలెక్టరు – ఛాందసులు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు. దడుచుకున్నారు. కారులో పడ్డారు. తోక ముడిచారు!

అట్లు లేని తోకలు ఎందుకు ముడిచారనగా – గోరంతలను కొండంతలు చేసిన – సర్కారువారి ఆగ్రహాగ్నిలో భస్మము కావలసివచ్చునుకదా!

అవిధంగా ఖమ్మంమెట్టులో తృతీయ ఆంధ్రమహాసభలు – ఆటంకాలు, అవం ధాలు, అహంకారాలు, అసమ్మతులు, విరోధాలు, కుట్రలు, కుహకాల మధ్య – విజయవంతంగా కాకున్నా, ప్రశాంతంగా ముగియడానికి నిర్వాహకుల కార్యదీక్ష, కార్యదక్షత మాత్రమే కారణాలు. తుదకు వారు కత్తిమీద నడిచి సర్కసు చేయవలసి వచ్చింది.

పరిస్థితి అతి సున్నితమైంది. సభకు విఘాతం జరుగుతే ప్రజలలో ఇంత కాలంగా ఏర్పరచిన విశ్వాసం కూలిపోతుంది. ప్రజల్లో నిరాశా నిస్పృహలు వ్యాపిస్తాయి. ప్రభుత్వం చంకలు గుద్దుకుంటుంది. అందువల్ల ఎన్నిటికో లొంగి సభలు నిర్వహించాల్సి వచ్చింది.

తదనంతర కాలంలో దీనికి మితవాదం అని ముద్ర వేసినవారు గ్రహించ వలసిన విషయం ఏమంటే - ఆనాటి మితవాదం లేకుంటే అపరిమితవాదం ఉండేది కాదు. మితవాదపు భుజాల మీదనే అమిత వాదం నిలిచింది. ఒక రాజకీయ ఎత్తుగడగా మితవాదాన్ని నిందించవచ్చు. ఈనాడు మితవాదంగా ముద్రపడిందే అనాడు 'అతివాదం' అనే విషయం చారిత్రక సత్యం.

ఒక సభమాత్రం జరుపుకోవడానికి 'ముసలినక్క' మీర్ ఉస్మాన్ ఇన్ని చిక్కుల పాలుచేసిన 1934లో బ్రిటిషిండియాలోని నేషనల్ అసెంబ్లీలో ప్రజల ప్రాతినిధ్యం ఉంది. ఆనాటి ఢిల్లీ లెజిస్లేటివ్ అసెంబ్లీలో ప్రజా ప్రాతినిధ్యం ఇలా ఉంది:

కాంగ్రెస్ పార్టీ 44, కాంగ్రెస్ నేషనలిస్ట్ పార్టీ 11, ఇండిపెండెంట్ పార్టీ 22, యూరోపియన్ గ్రూపు 11, అధికారులు 26, నామినేటెడ్ అనధికారులు 13.

1935 భారత శాసనం ప్రకారం అధికారం ప్రజలకు వప్పగించే దిశకు బ్రిటిషు ప్రభుత్వాన్ని మళ్ళించిన మహాత్ముని మహోద్యమం నడచిన భారతదేశపు నడిబొడ్డున

ఒక నిరంకుశ ప్రభువు ప్రజల కనీసపు సమావేశ హక్కును దిగమింగిన మధ్య యుగాలనాటి కరాళ కర్కశ విధానం కొనసాగింది!

ఇంత అక్కసు, ఇంత దౌర్జన్యం, ఇంత కుట్ర ఎందుకు? రెండో మహాసభలో – ప్రజల సమావేశపు హక్కును మింగిన – గస్తీ నిషాన్ తిర్దన్ ఉపసంహరించుకోవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేసినందుకు!

ఆ తీర్మానంతో ప్రభుత్వం బెదిరిపోయింది. పిచ్చికుక్కలా వ్యవహరించింది.

సభ జరుపుకోవడానికి మంత్రిమండలి అనుమతి కావలసిరావడం ఎక్కడయినా ఉందా?

'సభ జరపుకోనివ్వం' అని ప్రధానమంత్రి ఆదేశం పంపించి బెదిరించడం ఎక్కడయినా ఉందా?

హిందువులే పనికి రారని తురకలను రెచ్చగొట్టిన ప్రభుత్వం, హిందూ సనాతనులను ఆశ్రయించడం ఎక్కడయిను ఉందా?

సభలు బాగా జరుగుతున్నాయని ఈగంతో సనాతనులు అనే తొత్తులను చంకన పెట్టుకొని ఆడవాళ్ళ సభను అపుచేయ ప్రయత్నించడం ఎక్కడయినా ఉందా?

**దీనితో స్పష్టంగా తేలిన విషయం ఏమంటే – జన్మ జన్మాల బూజు నిజాం రాజుకు మతంతో కాదు సంబంధం – అతనికి అధికారంతో సంబంధం! అది నిలుపుకోవడానికి అతడు ఏ మతాన్నయినా, ఏ ధర్మాన్నయినా ఆశ్రయించగలడు. ఎంతటి నీచానికయినా పాల్పడగలడు. ఎవరినయినా ఆశ్రయించగలడు. ఎవరికయినా దాస్యం చేయగలడు. చాకిరి చేయగలడు.**

నిజాం పిశాచపు ప్రథమ లక్ష్యం అధికారం!

**అసలు అధికారమే అలాంటిదేమో!**

**అది పులిని ఎక్కడం లాంటిది.**

**పులిని ఎక్కడం తేలికే!**

**ఎక్కింతరువాత భయం – భయం – భయం.**

**ఇహ దిగడం తేలిక కాదు.**

**దిగుతే పులి మింగుతుంది!**

## ఏడు

### కలతల కుటుంబం:

గోవర్ధనం నరసింహాచార్యులవారు ఖమ్మం దగ్గరి పోలేపల్లి అగ్రహారీకులు. అగ్రహారం అంటే జాగీరులాంటిది. బ్రాహ్మణుల జాగీరును అగ్రహారం అంటారు. వారు సంపన్నులు. మామిళ్ల గూడెం దారిలోని రైల్వేగేటు పక్కన అతి విశాలం అయిన స్థలంలో చాల పెద్ద బంగళా ఉండేది. ఆ రోజుల్లో గ్రామోఫోనులు కూడా అతి తక్కువ. అవీ పెద్ద బూరతో ఉండేవి. వాళ్ళ ఇంట్లో గ్రామోఫోను ఉండేది.

గ్రామోఫోనులోంచి పాట వినిపిస్తే ఎక్కడినుంచి వస్తున్నదా అని ఆశ్చర్యం! అందులో మనిషి ఉండి పాడుతున్నాడేమో అనుకునేవాణ్ణి! అన్నం నీళ్లు లేకుండా మనిషి ఎట్లా ఉంటాడు అని అనుమానం! ఎవరిని అడిగినా చెప్పరు. వారికే తెలియదేమో! గ్రామోఫోను పెద్దే అక్కడే ఉండా లనిపించేది. ఎంతసేపు ఉంటాం? మా నాయనవెంట పోవడం - రావడం

వాళ్ళ ఇంట్లో ద్రాక్షచెట్టు ఉండేది. విశాలం అయిన వంటిల్లు, వంట మనుషులు ఉండేవారు. భోజనం వేళకు ఎంత మంది ఉన్నా వారి పంక్తికి కూర్చునేవారు. అందరికీ వెండి పూలున్న పీటలు - వెండి విస్తళ్లు! తిరువారాధన - చందనగోష్ఠి వైభవంగా ఉండేది. వారు ఎంతో ఉదారులు. దానశీలురు.

రైలుకట్ట ప్రక్కన - ప్రహరీకి ఇవతల చింతచెట్టుకు ఊయల మంచం ఉండేది. విశ్రాంతిగా ఉన్నపుడు నరసింహాచార్యులవారు - ధొరవారు - తెల్లని పరుపుమీద - తెల్లని దిండ్లు వేసుకొని ఊగుతుండేవారు. వారు లేనపుడు మాకు అభ్యంతరం లేదు. నేనూ మా అన్నయ్యా ఊగేవాళ్ళం.

ధొరవారు - వారి ఇద్దరు కొడుకులు రామానుజాచార్యులవారు, శ్రీనివాసా చార్యులవారు మా నాయనకు పరమ శిష్యులు. వారిని మేము మామలు అనే వాళ్లం - మా నాయన పాదములు పట్టి దిగిన ఫోటో ఇప్పటికీ నా దగ్గర ఉంది.

ధొరవారు తమ ప్రజల విషయంలో దుర్జనులు - దౌర్జన్యపరులు. ప్రజలు వీరి బాధలు పడలేక తరిమి కొట్టారట! రెవెన్యూ అధికారులు జోక్యం చేసుకున్నారు. ప్రజలు ఖమ్మం వచ్చి ధొరవారికి శిస్తు కట్టేటట్లు - ధొరవారు ఆ ఊళ్లో అడుగు పెట్టక ఉండేటట్లు ఏర్పాటు చేశారు. అదే ఏర్పాటు కొనసాగుతున్నది.

దొరలు బయటి వారికి అత్యంత ఉదారంగా కనిపిస్తారు. భారతదేశంలో కళలన్నీ తామే పోషిస్తున్నట్లు వ్యవహరిస్తారు. తమ ఊళ్లలో మాత్రం గర్భనిర్భేద్యంగా వ్యవహరిస్తారు.

ఒక ఊరి దొర ఇంటిపేరు - ఆ ఊరిలోని మంగలి ఇంటిపేరు ఒకటే. మంగలితో ఇంటిపేరు మార్చుకొమ్మని ఆదేశించారు. "తాతల తండ్రుల కాడినుంచి వస్తాందె, బాంచెను. ఇంటి పేరెట్లు మార్తది దొర" అన్నాడు వాడు. ఎదురు చెప్పినందుకు తుపాకితో కాల్చి పూడ్చిపెట్టించాడు, మంగలి కుటుంబం మొత్తాన్ని దరిదాపుల్లో లేకుండా వెళ్లగొట్టించాడు దొర.

ఒక దొర చావిట్లో కూర్చున్నాడు. అతని ముందునుంచి చొక్కా తొడుగుకున్నవాడు పోతున్నాడు. చొక్కా వంటిమీదనే చిరిగేదాక కొట్టి పంపించాడు.

దొరముందునుంచి పోవాలంటే తలగుడ్డా, చెప్పులూ - సాధారణంగా ఉండవు. ఒకవేళ ఉంటే - చొక్కా సహితంగా దూరంగానే అన్నీ విప్పి చేతుల్లో పట్టుకొని - వంగి దండం పెడ్తూ సాగిపోవాలి.

గడీలు కోటల్లా ఉంటాయి. అందులోకి వెళ్లిన మనిషి తిరిగి వచ్చేదాకా నమ్మకం లేదు. ఒక ఊరుగడీ - పేరు తెలుసుకాని, చెప్పను - ఆ గడీలోకి ముత్యాల వర్తకులు వచ్చారు. దొరలు, దొరసానులు ఖరీదు చేశారు. మరొకసారి మరీ విలువయినవి

తెమ్మన్నారు. రత్నాల వర్తకులు తెచ్చారు. దొరలు, దొరసానులు కొన్నారు. దొరల చుట్టాలు – దొరసాన్ల బంధువులు కొన్నారు. మరిన్ని వజ్ర, వైఢూర్యాలు తెమ్మన్నారు. వర్తకులు లాభానికి ఆశపడ్డారు. తెచ్చారు. వారిని చంపించి, పాతిపెట్టించారు. వజ్ర వైఢూర్యాలు కాజేశారు. వర్తకుల కోసం వెదుకుతూ వచ్చినవాళ్లను, ప్రాణాలు దక్కవని బెదిరించారు. బయటినుంచే సాగనంపారు.

నా "చిల్లర దేవుళ్లు" నవలలో చింతకాయలు తెంపినందుకు చావకొట్టిన దొర కథ ఉన్నది.

**ఇలాంటివి కోకొల్లలు. అయితే ప్రజలు సహించినన్నాళ్ళు సహించేవారు, తిరగబడ్తే దొరల ప్రాణాలు తీసేవారు. అప్పుడప్పుడూ ఆ వార్తలూ వచ్చేవి.**

దొరను – నట్టనడి ఊళ్లో – పట్టపగలు – గునపం గుచ్చి చంపారు.

ప్రజలు బండరాతితో దొర మెదడు చితక్కొట్టారు.

ఒక ఊళ్లో దొరను గొడ్డళ్లతో నరికారు.

ఒక ఊరి దొరను ముక్కలు ముక్కలుగా నరికి కాకులకు, గద్దలకు వేశారు.

ఇలాంటి వార్తలు తరచుగా కాకున్నా అప్పుడప్పుడూ వినిపిస్తుండేవి.

అదిగో, ఆ భయంతోనే దొరవారు పోలేపల్లిలో అడుగు పెట్టేవారుకారు.

**ఇది తెలంగాణా ప్రజల సహజ స్వభావంలా ఉంది. పడి ఉన్నవాళ్లు పడి ఉంటారు. విజృంభించారంటే గిరిగుహలోని సింహాలే! ఇహ వదలడం లేదు. నిజాం సహితంగా అంతు చూడాల్సిందే. అందుకే ఈ గడ్డన – ఎక్కడా రాని విప్లవాలు వచ్చాయి.**

పోలేపల్లి అగ్రహారీకులు మా నాయనకు గృహదానం చేస్తామన్నారు. ఇల్లు పెద్దది. చాల పెద్దది. ఇటునుంటి మల్లన్న బజారు నుంచి వెనుక వీధిదాకా వ్యాపించి ఉంది. ఎందుకో ఆ ఇల్లు తాతయ్యకు నచ్చలేదు. ఆ ఇల్లు మంచిది కాదు, అరిష్టదాయకం వద్దంటారు.

**తాతయ్య అన్న దాంట్లో కొంత అర్థం ఉంది. అంత ఇల్లు చాలకాలంగా పాడుబడి వుంది. మంచి రోడ్డుకు ఉంది కదా ఎవరూ అద్దెకు ఉండడం లేదు. అంతేకాదు, ఆ యింటి యజమానికి ఎన్నో బాధలు కలిగాయట. అమ్ముకున్నాడు.**

"పుచ్చిన సొమ్ము బాపన్ల పాలు" అని ఒక సామెత. పోలేపల్లివారు అది వదిలించుకోడానికి దానం చేస్తున్నారని మా తాతయ్య వాదన. పిల్లలు గలవాడవు, ఆ ఇంట్లోకి పోవడం మంచిది కాదు అనేది పెద్ద మనిషి సలహా.

మా నాయనకు అంత ఇల్లు వదులుకోవడం ఇష్టం లేదు. భగవారాధన – తడియారాధన అన్ని అరిష్టాలను దూరం చేయగలదని మా నాయన వాదన. **అయితే,** నిర్ణయించాల్సింది మా నాయన. గృహదానం తీసుకోవడానికే నిర్ణయించారు.

**కాని, అనంతర పరిణామాలు మా తాతయ్య వాదననే నిజం చేశాయి.**

గృహదాన కార్యక్రమం చాల అట్టహాసంగా జరిగింది. తెల్లవారు జామున – పెట్రోమాక్సులైట్ల వెలుగు – బాజా బజంత్రీలు మా నాయన కూర్చున్న మేనాను అగ్రహారీకులు సహితంగా అనేకమంది శిష్యులు మోశారు. వేదం – ద్రావిడవేదం –

ఉచ్చైస్వరంతో పఠిస్తుండగా – ముందు పూర్ణకుంభంతో మా కుటుంబం ఇంట్లో ప్రవేశించింది.

తరువాత చాల కార్యక్రమాలు జరిగాయి. భగవదారాధనలు ద్రావిడ వేద అధ్యయనాలు – చేరలకొద్ది నేయితో – వేలమందికి లడ్డూల సాపాట్లు – చందన గోష్ఠులు, తిరునామాలు, మంగళ హారతులు ఒక మహాపర్వ వాతావరణాన్ని కలిగించాయి.

ఆ ఉత్సవాల వైభవానికి మా తాతయ్య సహితం పొంగి పోయారు. శాంతి జరిగింది అని తృప్తిచెందారు.

## అంపశయ్య:

మా తాతయ్యకు ఆ ఇంటితోనే కాదు. అసలు ఖమ్మంతో తృప్తిలేదు. వారి అణువణువునా చిన్న గూడూరు – వారి మిత్రుడు వడ్లకుంట సాయెబు చేరారు. వారు గూడూరు వెళ్తాననడం, మా నాయన వారించడం సాధారణం అయిపోయింది. అది వారిమధ్య అభిప్రాయ భేదాలు – కలతలు – అశాంతి కలిగించాయి.

ఒక విచిత్రం ఏమంటే – మా తాతయ్య పుట్టి పెరిగింది భద్రాచలంలో. వారికి భద్రాచలం మీద లేదు. ఇల్లు, వాకిలి, పొలాలు, ఉద్యోగం వదులుకొని వచ్చారు. మళ్లీ అటుతొక్కి చూడలేదు. మద్రాసులో ఎంతో వైభవంగా వైద్యం చేశారు. అటూ తిరిగి చూడలేదు. మరి ఏముందో తెలియదు చిన్న గూడూరు వారి మనసులో గూడు కట్టుకుంది.

**మనం అన్నింటికీ హేతువులు నిర్ధారించలేం. ముఖ్యంగా మనసుకు సంబంధించిన విషయాల్లో హేతువు మనకు అందదు. ప్రేమాభిమానాలు - ఈర్ష్యాద్వేషాలకు సరియైన కారణాలు కనిపించవు.**

లైలా మజ్నూల కథ ప్రఖ్యాత ప్రేమకథ. లైలా అంత అందమయింది కాదు. కారునలుపు. మజ్నూ ఎంతో అందగాడు. ఆమె ప్రేమలో పడ్డాడు. పిచ్చివాడు అయినాడు. రాళ్లదెబ్బలు తిన్నాడు. అయినా, లైలాను వదలడు.

రాజు మజ్నూను పిలిపించాడు. "లైలా వికారి. నీవు అందగాడవు. ఏముందని ప్రేమిస్తున్నావురా దాన్ని?" అని అడిగాడు.

మజ్నూ జవాబు విని రాజు విస్తుపోయాడు.

*"జహాఁపనా! లైలాకో మజ్నూకే నజ్రోఁసే దేఖో"* "మహాప్రభూ! లైలాను మజ్నూ దృష్టితో చూడండి." అన్నాడు మజ్నూ!

మా తాతయ్యదీ ప్రేమగాథే. వారు చినగూడూరును ప్రేమించారు. ఆ ఊళ్లో ఏదో ఆకర్షణ ఉంది. అది నన్నూ మురిపిస్తుంది!

"బ్రతికి ఉండగా నన్ను గూడూరు చూడనియ్యవు" అనేవారు మా తాతయ్య.

"నీకేం రోగమా నాప్పా! చూడవచ్చులే" అనేవారు మా నాయన.

ఈ విషయంలో రోజూ తగాదాయే. అది తెగదు.

తాతయ్య నశ్యం పీలుస్తారు. అందమైన వెండి పొన్ను నశ్యం కాయలుండేవి. వారు చొక్కా వేయలేదు. నశ్యంకాయ రొంటిన దోపుకునేవారు. మా నాయన

కూడా చొక్కా తొడగలేదు. తాతయ్య స్వయంగా నశ్యం చేసుకునేవారు. ఎదురు బద్ద చీరి – అందులో పొగాకు పెట్టి, నిప్పు సెగకు కాచేవారు. కొద్దిగా సున్నం వేసి ఖల్వంలో నూరుతే మెత్తని నశ్యం తయారయ్యేది.

రావి చెట్టు దగ్గరి రైల్వేగేటు దగ్గర పొగాకు దొరికేది. తాతయ్య అది కొనుక్కోవడానికి వెళ్లారు. రైలు కట్టమీద పడిపోయారు. ఎరిగినవారు ఇంటికి తీసుకొని వచ్చి వదిలారు. "నిన్ను ఎవరు పొమ్మన్నారు?" అని నాయన తాతయ్యమీద ఎగిరారు. మా నాయనమ్మ కూడ గలగలా అంది. మా అమ్మ దెబ్బలకు సున్నం రాసింది. నేను తాతయ్య దగ్గరే పడుకున్నాను.

మా తాతయ్య నిజంగా మంచివాడు.

## ఫోటో సిత్రం:

ఆనాడు ఖమ్మంలో ఫోటోగ్రాఫరర్లు ఉండేవారు కారు. బెజవాడనుంచి వచ్చి ఫోటోలు తీసేవారు. అలా ఒకసారి ఫోటోగ్రాఫరు వచ్చినపుడు మా నాయన పిలిపించారు. తాతయ్య – నాయనమ్మల ఫోటో తీయించాలనుకున్నారు.

"వర్చస్సు తగ్గుతుంది. ఫోటో దిగను" అన్నారు తాతయ్య. అయినా, బలవంతం చేసి నాయన ఇద్దరినీ సిద్ధం చేయించారు. ఇంట్లో తీయరాదన్నారు. ఆ వింత చూడ్డానికి అందరం గుంటి మల్లన్న సత్రానికి వెళ్లాం.

మా తాతయ్యను, నాయనమ్మను లోపలి అరుగుమీద కూర్చోపెట్టారు. ఎదురుగా మూడు కర్రలమీద ఒక పెట్టె – కెమెరా పెట్టాడు ఫోటోగ్రాఫరు. నల్లని ముసుగు వేసుకున్నాడు. అందులోంచి చూస్తాడు. ముసుగు తీస్తాడు. కూర్చున్నవాళ్లను కదిలిస్తాడు. ఇటు అటూ అంటాడు. తుదకు కెమెరా మూత తీశాడు. అయిపోయింది అన్నాడు. అడావుడి పూర్తి అయింది. బొమ్మ చూపలేదు. అందరమూ ఇంటికి తిరిగి వచ్చాం.

ఆనాడు మా నాయన ఫోటో తీయించకుంటే మా తాతయ్య – నాయనమ్మల పటం మాకు దక్కేదికాదు.

1991 నవంబరులో గుంటి మల్లన్న గుడిముందు – పోయిన మర్రి అరుగుమీద – సాహితీ హారతివారు – మా అన్నయ్య వర్ధంతి సానుతాప వాతావరణంలో నిర్వహించారు. అప్పుడు వచ్చిన మా పిల్లలు, పిల్లల పిల్లలకు గుంటి మల్లన్న సత్రంలో మా తాతయ్య – నాయనమ్మ ఫోటో దిగిన ప్రదేశం – విధం – చూపాను – వివరించాను.

ఒకనాడు తాతయ్యకు నిండు పండుగ అయింది. ఆనాడు చేతిలో నేతి తప్పేల – భుజం మీద బస్తాతో – చిన్న గూడూరు నుండి వడ్లకుంట సాయెబు దంపతులు వచ్చారు.

మా తాతయ్య వారిని చూచారు. వారిలో ఆనందం అవధులు దాటింది. పొంగింది. ఉప్పొంగింది. చంద్రుని అంటింది. వారు ఉక్కిరి బిక్కిరి అయినారు. ఎదురునకు ఉరికారు. చేతిలో తప్పేలా – భుజలమీద బస్తా కూడా చూడలేదు. సాయెబును గట్టిగా కౌగలించుకున్నారు. రుద్ధకంఠంతో 'సాయెబూ!' అన్నారు.

కన్నీరు జలజలా దొలింది – రాలుతూనే ఉంది.

సాయెబు కన్నుల్లో జలపాతాలు.

తప్పేల కిందపడిందీ – బస్తా జారిందీ గమనించలేదు.

అది ఆనందానికి పరాకాష్ఠ!

అది అపూర్వ అనుభూతి!!

అది అనంత రసానుభూతి!!!

అది మైత్రి. అది స్నేహం. అది సహవాసం. అది ప్రేమ. అది అనుబంధం. అది ఆత్మీయత. అది అనురాగం.

ఎంతోసేపు అలా వారు అపూర్వ మధురానుభూతిలో మునిగారు. వారికి లోకం తెలియదు. నాకం తెలియదు. తెలుసుకొని చూస్తే చుట్టూ జనం!

"నన్ను మరిచావులే సాయబూ!"

"మరుస్తే ఇందాక వస్తానుండి?"

చేతులు పట్టుకొని ఇంట్లో ప్రవేశించారు. ఇహ వదల్లేదు! వారి ముచ్చట్లు వడిసిపోలేదు.

వారు ఏటికి వెళ్ళారు. స్నానాలు చేశారు. బట్టలు ఉతుక్కున్నారు. ఆరేసుకున్నారు. నేను వారివెంట.

మా తాతయ్య ముందు కూర్చొని కొసరి కొసరి వడ్డించి తినిపించారు. తాను వారి పంక్తిన తినలేదు. అంతేతప్ప వారు విడిచి ఉండలేదు.

స్నేహం మనసుకు సంబంధించింది. మనసుకు కుల మతాలవంటి సంకుచి తత్వాలు లేవు. ఒకరు బ్రాహ్మలు. ఒకరు గొండ్లు ఏమి విచిత్ర బంధం! విశిష్ట బంధం!!

ఈ అనుబంధపు ప్రేరణతో "శరతల్పం" అనే నవల వ్రాశాను. అది ఒక శ్రీవైష్ణవునికి, ఒక హరిజనునికి స్నేహపు కథ. ఒక మర్రిని పెనవేసుకుని తాటి చెట్టు పెరుగుతుంది. ఈ రెంటినీ ఒక తీగ పెనవేసుకుని పాకుతుంది! ఈ బంధాన్ని ఎవరు విడదీయగలరు!

"రాళ్లది, ఏళ్ళది, లేళ్లది, జోళ్లదేకులమో ఆ కులమే మదీయము" అన్నాడు దాశరధి.

తాతయ్య, సాయెబులతో నేను ఏటికి వెళ్లాను. మర్రికిందికి వెళ్లాను. గుంటి మల్లన్న సత్రానికి వెళ్లాను. నరసింహస్వామి గుట్టకు వెళ్లాను. ఖిల్లా ఎక్కాను. బజారులు తిరిగాను.

మూడు రోజులు గాలిలో ఎగిరిపోయాయి!

నాలుగవనాడు సాయెబు దంపతుల ప్రయాణం! ఈ విరహాన్ని ఎవరూ వర్ణించలేదు – లేరు. వారి మనసుల్లో గుబగుబ ఆరాటం – ఆందోళన. వారి వదనాలు మ్లానములు. వారి గుండెల చప్పుళ్లు వినిపిస్తున్నాయి.

సాయెబు దంపతులు మూటలు అందుకున్నారు.

తాతయ్య కాలు కాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతున్నారు.

"ఒక్కసారి గూడూరు వెళ్లొస్తారా!" నాయనతో తాయయ్య దేబరింపు.

"పోదువుగానిలే, సాయెబును సాగనంపిరా."

"సాయెబూ! వీడు నన్ను ప్రాణాలతో గూడూరు చూడనియ్యడు." తాతయ్య నిస్పృహ.

"అట్ల అనొద్దు లక్ష్మయ్యగారు! మీరేగద చెప్పిన్రు - ఎప్పుడు మంచి తలచాలె, మంచి చూడాలె, మంచి చెప్పాలని." రాండి పోదాం బస్సుకాడికి. అని కదిలాడు సాయెబు తాతయ్యను తీసుకొని – నేనూ వారివెంటనే.

అప్పుడు బస్సులు గుంటి మల్లన్న గుడి దగ్గర ఆగేవి. బస్సు వచ్చి ఆగింది. ఒకరిని ఒకరు వదలరు. సాయెబు బస్సెక్కాడు. జలజలా బాష్పధార రాల్చారు.

"సాయెబూ! మళ్ల నిన్ను చూస్తనా?" తాతయ్య ఎదపగిలి కన్నుల్లోంచి ప్రవహిస్తూంది.

డ్రైవరు, కండక్టరు సహితంగా బస్సులోనివారి కళ్లు చెమర్చాయి.

శకుంతలను సాగనంపడానికి కాళిదాసు వ్రాసిన నాలుగు శ్లోకాలూ చాలవనిపించాయి.

కాలం కదలక ఆగదు. బస్సు సాగిపోయింది!

తాతయ్య తలపట్టుకొని రాతిమీద కూలబడ్డారు.

ఆ బాధ వారి మనసులో గూడు కట్టుకున్నది. వదల్లేదు. తాతయ్య మళ్లీ కోలుకోలేదు.

అనాటి నుంచి తాతయ్య ఏదో మూలధనం పోగొట్టుకున్నట్లు వెతుకుతున్నారు తనువు మాత్రమే ఇక్కడుంది. తాను గూడూరులో విహరిస్తున్నారు.

కాలం కర్పూరంలా కరుగుతున్నది. తాతయ్య నిలువలేకపోతున్నారు.

తాతయ్య ఒకనాటి పట్టపగలు ఒక మూట – గొడుగు తీసుకొని బయల్దేరారు. నాయన ఎదురుగా అడ్డు నిలుచున్నారు.

"ఎక్కడికి వెళ్తావు?"

"గూడూరు."

"ఎట్లా వెళ్తతావు?"

"కాలినడకన" అని నాయనను పక్కకు నెట్టారు. ఆ నెట్టడంలో గొడుగు కిందపడింది. నాయన తూలి నిలదొక్కుకున్నారు. తాతయ్య అడుగు ముందుకు వేశారు. నాయన గొడుగు అందుకొని, తాతయ్య బుజంమీద బలంగా కొట్టారు.

తాతయ్య కూలబడ్డారు. మూలిగారు. అంతే – ఆనాటినుంచి ప్రాయోపవేశం. అన్నం ముట్టలేదు. మందు వేసుకోలేదు. నాయన ముఖం చూడలేదు.

ఒకనాటి ఉదయం మా అమ్మ ఏటికి మంచినీళ్లకు బయల్దేరింది. నేనూ వెంట వెళ్లాను. తడిచీరతో, తలమీద బిందెతో ఇంట్లో అడుగుపెట్టాం.

తాతయ్య మంచం దిగారు. కండవా నేలమీద పరుచుకున్నారు. పడుకుంటూ "తీర్థం" అన్నట్లు చేతితో సంజ్ఞ చేశారు.

"మామగారు ఎట్లనో చేస్తున్నారు!" మా అమ్మ అరిచింది.

నేను యాంత్రికంగా కదిలాను. నాయన తరుమన్నాపు చేసుకుంటున్నారు. వారిముందు "శ్రీపాద తీర్థం" ఉంది. అందుకున్నాను. పరిగెత్తి తాతయ్య నోట్లో మూడు సార్లు అర్పించాను. అంతే – అంపశయ్యమీద భీష్ముడు అంతరించాడు!

అనాడు యువ సంవత్సర వైశాఖ అమావాస్య.

భద్రాచలంలో శ్రీరామచంద్రుని సాన్నిధ్యంలో అవతరించిన దాశరధి లక్ష్మణాచార్యులవారు నృసింహ సన్నిధిలో ఖమ్మంమెట్టులో తనువు చాలించారు. గోదావరీ తీరాన జన్మించిన తాతయ్య పాంచభౌతికం మునేటి ఒడ్డున అగ్నికి ఆహుతి అయింది.

మా నాయన కర్మకాండ చాల అట్టహాసంగా చేశారు.

చాలమంది వచ్చారు. వడ్లకుంట సాయెబు కనిపించలేదు!

## దురాశలు:

**ఆశ - దురాశ - నిరాశల మధ్యదే జీవితం. జీవిత వృక్షానికి ఆశ చివురు లాంటిది. చివురు వేయని చెట్టు, ఆశలేని జీవితం నిలవడం దుర్లభం. చివరి శ్వాసవరకూ ఆశ వదలడు నరుడు!**

**దురాశ, నిరాశ జీవిత వృక్షానికి చెదలు లాంటివి. అవి జీవితాన్ని క్రుంగదీయడానికి పనికివస్తాయి.**

గూడూరులో దురాశలకు అవకాశం తక్కువ. ఖమ్మంలో ఎక్కువ. మా నాయనకు ఉన్న శిష్యుల్లో అధికభాగం వర్తకులు – సంపన్నులు. వారిని చూచి తానూ సంపన్నుడు కావాలనే దురాశ మా నాయనలో ప్రవేశించింది.

మా నాయన – అన్నయ్య కలిసి ఒక పథకం తయారుచేశారు.

నిజాం రాజ్యం సర్వతంత్ర స్వతంత్రం. కాబట్టి రాజ్యం బయటినుంచి వచ్చే సరుకులమీద సుంకం విధిస్తారు. దాన్ని ఆంగ్లంలో కస్టమ్స్ అంటారు. ఉర్దూలో కరోడ్గిరి అంటారు. నిజాం ప్రభుత్వంలో కరోడ్గిరి ఒక శాఖ. ప్రతి రైల్వే స్టేషను దగ్గర కరోడ్గిరి భవనం ఉండేది. ఆ భవనాలు ఇప్పటికీ ఉన్నాయి. వాటిల్లో వేరే కార్యాలయాలున్నాయి.

రైలు దిగిన ప్రయాణీకు లందరినీ – కరోడ్గిరీ వారు – వారి సామానులు చూస్తారు. కొత్త వస్తువులకు కరోడ్గిరి సుంకం వసూలు చేస్తారు. ఈ విషయం నా నవల 'మోదుగుపూలు'లో ప్రస్తావించాను.

బెజవాడ నుంచి వెండి తెచ్చి, కరోడ్గిరి చెల్లించకుండా అమ్మడం చేస్తే లాభాలు ఆర్జించవచ్చునని మా నాయన పథకం. మా నాయన వెండి మూటు బెజవాడనుంచి తెస్తాడు. వంటి రెక్క దగ్గర మా అన్నయ్య నుంచుంటాడు. మా నాయన పడేసిన మూటను మా అన్నయ్య అందుకుని ఇంటికి తెస్తాడు. ఆ విధంగా కరోడ్గిరి తప్పించి, వెండి తెచ్చారు. దాన్ని అమ్మడానికి వెళ్తే, కరోడ్గిరీ చీటీ కావాలన్నారు. అది లేకుంటే దొంగసొమ్ము అవుతుంది, పోలీసులకు పట్టించాల్సి వస్తుంది అన్నారు. వెండి బెజవాడ తీసికెళ్తే తక్కువధరకు అమ్ముడయింది. లాభానికి పోతే నష్టం ఎదురయింది.

"స్వధర్మే నిధనంశ్రేయః" అనే గీతావాక్యం మీద మా నాయన అనర్గళంగా ఉపన్యసించగలరు. వారే భయావహమైన పరధర్మం అవలంబించి భంగపడ్డారు.

అనుభవపూర్వకంగా తెలుసుకున్నదేమంటే, వృత్తిరీత్యా వేదాంతం – వైరాగ్యం – బోధించేవారికి ఉన్నంత దురాశ, తామసం సామాన్యులకు ఉండవు. 'ధనం

సకల దుర్గుణాలకు తావరం. అది మీవద్ద ఉండరాదు. మాకు సమర్పించండి' అనేది వారి దివ్యబోధ!

## కన్నీటి కత:

మా నాయన నిత్యం కాలక్షేపం సాయించేవారు. వారి శిష్యుల్లో స్త్రీలు – విధవలు బాల విధవలు కూడా ఉండేవారు. ఒక రిద్దరు విధవ యువతులు నిరంతరం గురువుగారికి సేవ చేయడానికి ఇంట్లో ఉండేవారు. వారు మా నాయనకు తలంట్లు స్నానాలు, బట్టలు ఉతకడం, కాళ్లు పిసకడంలాంటి సేవలు చేస్తుండేవారు.

మా అమ్మ ఏటిలో మునిగి, తడి చీరతో మంచినీళ్లు తెచ్చి వంటింట్లో దూరిందంటే ఏ మధ్యాహ్నమో బయటికి వచ్చేది. విధవ శిష్యురాండ్ల వ్యవహారం అమ్మ సహించేది కాదు. వాళ్లను అమ్మ వారించినా వినేవారుకారు. వెళ్లగొట్టినా పొయేవారు కాదు. "మా గురువు తండ్రితో సమానం" అనేవారు. ఆ మాట వినగానే అమ్మ మండిపోయేది. చెంబు, తప్పేల నేలక్కొట్టేది. మా నాయన మండి పడేవాడు. అమ్మమీద చేయి చేసుకునేవాడు. అమ్మ ఏడిచేది. ఏం చేయగలదు? శాపనార్థాలు పెట్టేది.

అమ్మ శాపాలకు భయపడి శిష్యురాండ్రు స్థిరనివాసం మానుకున్నారు. అమ్మ అనుమానం అంతటితో తీరలేదు. వాళ్లు గురువుగారికి అత్తరు, పన్నీరు, వాసన నూనెలు అందిస్తున్నారని ఆరోపణ. వాళ్లు వచ్చినపుడల్లా మన్నులు – దుమ్ములు పోసేది. నాయన అమ్మను చావబాదేవాడు. "నన్ను చంపి వాళ్లతో ఊరేగాలని చూస్తున్నారు" అని మరిన్ని తన్నులు తినేది.

మా నాయనమ్మ ఇదంతా నాటకంలా చూస్తుండేది. ఇప్పుడైనా మా అమ్మనే అనేదికాని, కొడుకు మీద ఈగ వాలనీయకపోయేది. మా అమ్మకు అదొక బాధ! కొడుక్కు చెప్పకూడదా అనేది – అత్తగారితో అమ్మ. నాయన లేనపుడు అత్తమీద కేకలు వేసేది. నాయనమ్మ అన్నీ వింటుంది. మాట్లాడదు.

"వాడు అన్నీ తెలిసినవాడు, నేనేం చెప్పత?"

"అన్నీ తెలిసినవాడయితే ఇట్లనేనా చేసేది?'ట అమ్మ రెచ్చిపోతుంది. నాయనమ్మ నల్లమందు వేసుకుంటుంది. మళ్లీ మాట్లాడదు.

ఈ విధంగా ఇల్లు నిత్యం రణరంగం అయింది.

అలా ఉండగా ఒకనాడు నాయన – అమ్మ పుండు మీద కారం చల్లాడు.

ఇంట్లో సామానుల – సరుకుల గది తాళం వేశాడు. తాళం చెవి మొలత్రాటికి కట్టుకున్నాడు. అపూట వంటకు కావలసిన బియ్యం, ఉప్పు, పప్పులాంటివి కొలిచి ఇచ్చాడు. అమ్మ ఓపిగ్గా తీసుకున్నది. కాని క్రుంగిపోసాగింది.

బంధువుల రాకపోకలు మామూలు. ఒకనాటి పగలు మేమిద్దరం స్కూలు నుంచి వచ్చాం. అన్నం అయిపోయింది. లేదు. అమ్మ సొమ్ములను పట్టుకొని ఏడ్చింది.

"పిల్లలకు కడుపునిండ పెట్టుకునే సాహంత్రం లేకుండయింది. నా ఇంట్లనే నేను వంటమనిషిని అయిన. నా ఇంట్లనే నేను దొంగనయిన" అని గోడు గోడున ఏడ్చింది.

నాయన ఇంట్లో లేడు. రణరంగం మొదలు కాలేదు. అన్నం లేకున్నా - అన్నయ్యా నేనూ అందుకు సంతోషించాం. వట్టి డొక్కలతోనే మదర్సకు వెళ్లాం - ఇత్తడి చెంబులతో నీళ్లు త్రాగి!

ఇలా ఎప్పుడూ రగులుతూనే ఉండేది. ఒకప్పుడు పొగ! ఒకప్పుడు నిప్పురవ్వలు! - ఒకప్పుడు సెగమంటలు! మంటలు! దవానలం! కుటుంబాన్ని కుంగదీస్తున్నది.

బాల్యం బాధల బరువులకు కృంగదీస్తున్నది. అయినా, ఊడల మర్రిమీద "కోతికొమ్మంచి" ఆడాం. కొత్తగా పెట్టిన పెట్రోమాక్సు వీధిలైటు కింద ఉప్పా చెరలాడాం. బలిగుడు ఆడాం.

ఖమ్మంలో చిమ్నీలైట్ల బదులు ప్రధాన వీధుల్లో పెట్రోమాక్సులు ఏర్పరచారు. ఒక గడకు లైట్లు తగిలించుకుని వస్తాడు. వెలుగు మనిషి. వెలుగులు తెస్తున్న మనిషిని చూస్తే విచిత్రం అనిపించేది. చిమ్నీలు అందంగా ఉండేవి. పెట్రోమాక్సులు విచిత్రంగా ఉండేవి! వెలుగుమనిషి తీగ కొక్కానికి లైటు తగిలిస్తాడు. తీగను లాగుతుంటే పైకి వెళ్లిపోతుంది. లైటు పెట్టిన తొలిరోజు మా సంబరానికి అవధుల్లేవు. తెల్లవార్లూ ఆడాం.

గుడి వెనుక ఏటి కాలువలో మునగడం - నీళ్లతో కొట్టుకోవడం - నీళ్లలోంచి ఉరికి, తుడుచుకోకుండానే కట్ట ఎక్కడం - ఎండకే నీరు ఎండిపోవడం. అదొక పండుగ!

కాలువ ప్రక్కనున్న మామిడి చెట్లు ఎక్కడం - పసి కాయలు తెంపడం - పారేయడం - ఎగిరే చిలకలతో ఆట - అదొక సంబరం!

గుంపుగా బయల్దేరడం - పొలాల్లోంచి సాగడం - పచ్చి పెసరకాయలు, పచ్చివేరు శెనగలు ఏరుకొని తినడం - మునేటి లింగం మడుగులో మునగడం - తేలడం - జలకాలాటలు - ఇసుక మీద బట్టలు ఆరేసుకోవడం - అది అక్షరానికి అందని అనుభూతి!

1991లో బాల్య మిత్రుడు కృష్ణారావు - కలకాలం తరువాత - నన్ను కలుసుకోవడానికి ప్రత్యేకంగా సికందరాబాదు వచ్చాడు. కలిసి ఖమ్మం వెళ్లాం. లింగం మడుగు లేదు. నా మనువుల సహితంగా వంతెన కాలువ దగ్గరికి వెళ్లాం. బాల్యం నాటకం ఆడాలనుకున్నాం. కాని, ఆ సత్తువ లేదు. ఏట్లోకి దిగాం. మునిగాం. కాని ఉరుకులు పరుగులు చేత కాలేదు. బయటికి వచ్చాం.

చిలకలు గుంపులు గుంపులుగా ఎగురుతున్నాయి.

కొమ్మ కొసలకు గిజిగాని గూళ్లు వ్రేలాడుతున్నాయి.

"రంగన్నా! మనకేమైంది? ఎంతలో ఓడిపోయాం!" ఖిన్నవదనుడై అడిగాడు కృష్ణారావు.

"కృష్ణా! వయసు బరువుకు వంగిపోయాం. ఓడిపోవడమే - ఇంక గెలవలేం!" అన్నాను.

నా మనుమరాలు సహజ - మనుమడు సమీర్ నదిలో మునిగి కేరింతలు కొడుతున్నారు.

చిలకలు పలుకుతున్నాయి!

మునేరు గలగలా పారిపోతున్నది.

బాల్యయవ్వనాల మధ్య గడచిన కాలం
నేటికి యాదికి వచ్చును ఖమ్మం చూస్తే
నా ఆశల సౌధానికి నాడూ నేడూ
ఖమ్మం కళకళలాడే బంగరు గుమ్మం! – "దాశరథి."

## తల్లివెంట బిడ్డ:

ఆ రాత్రి ఏం జరిగిందో తెలియదు – అమ్మ శోకమూర్తిగా కనిపించింది. అలాగే ఉదయం ఏటికి మంచినీళ్లకు బయలుదేరింది. తోవలో బిందెతో రామంచార్ల మామ కనిపించాడు. నేను వెంట వెళ్లాను.

రామంచార్ల మామ సింగరమ్మత్తయ్య భర్త – అత్తయ్య ఎంత సుకుమారంగా – అందంగా ఉంటుందో మామయ్య అంత మొరటగా – వికారంగా ఉంటాడు. ముఖం నిండా స్ఫోటకం మచ్చలు మేము మచ్చల మామ అనే వాళ్లం. అమ్మకు తమ్ముడు అంటే, సాక్షాత్తు కాదు. మా అమ్మకు, నాయనకు ముందు వెనుకా ఎవ్వరూ లేరు. రామంచార్ల మామతల్లీ – అమ్మతల్లీ స్వయాన అక్కచెల్లెళ్లు.

రామంచార్ల మామవెంట సింగరమ్మత్తయ్యను పంపను అన్నది చూడమ్మ – అమ్మమ్మ. అందుకని మామయ్య ఇక్కడే ఉంటాడు. ఈ విషయంలో మామయ్య మా నాయనను ఆశ్రయించాడు. మాయల మరాఠీ వెనుక కుక్కలా అత్తయ్య వచ్చేట్లు చేస్తానన్నాడు నాయన. ఏవో మందులు చేసేవారు నాయన. వాటికి అవసరం అయిన పాము కుబుసం – గద్ద గుడ్డు కోసం నేనూ మామయ్య వెంట తిరిగేవాణ్ణి. మందులయినాయి. మంత్రాలయినాయి. కాని మామయ్యను కుక్కను, అత్తయ్యను మరాఠీని చేశాయి.

అత్తయ్య సోయగం అలాంటిది!

ఎవడయినా జీవితకాలం గులామ్ కాగలడు!!

రామంచార్ల మామ రోజూ నీళ్లకు వస్తాడు. రోజూ అక్కాతమ్ములు కలుసుకుంటారు. వారి ముచ్చట్లు తెగవు. ఏట్లో స్నానం చేసి, తూర్పు ముఖం పెట్టి, చెరి గుండి చెంబడు నీళ్లు తాగుతారు. బిందెలు ఎత్తుకొని బయలుదేర్తారు. అదే అమ్మకు కొంత సాంత్వనం!

ఆ రోజు అలాగే కలిశారు. ఏటి దగ్గర అమ్మ ఎంతో ఏడ్చింది. మామయ్య కూడా ఏడ్చాడు. నేను జలకాలాడలేదు. ఏట్లో మునిగి వచ్చాను. ఇసుకమీద కూర్చున్నాను. ఇద్దరూ బిందెలెత్తుకొని బయలుదేరారు. ఇద్దరూ ముభావంగా ఉన్నారు. మామయ్య వాళ్లఇంటికి విడిపోయాడు.

అమ్మ రోడ్డుపక్క నుంచుంది. నేను ఆమె పక్కనే ఉన్నాను.

"రంగడూ! నాతోని వస్తవా?" అనడిగింది. నేను 'ఎక్కడికి? ఎందుకు?' అనడగలేదు. "వస్త" నన్నాను.

ఆ రోజు భోజనాలయినాయి. నాయనా, నాయనమ్మా పడుకున్నారు. అమ్మ చెంబు తీసుకున్నది. నన్ను తీసుకున్నది. తలుపు దగ్గరికి వేసింది. బయలుదేరింది.

మేము కాలువ గట్టున సాగాం. బారాదరి దగ్గర కాలువ దిగాం. రైలు కట్ట ఎక్కాం. పాపిటపల్లివైపు సాగుతున్నాం.

నేను ఆవు వెంట దూడవలె సాగిపోతున్నాను. పలుకు పలకలేదు.

అమ్మ నెత్తిన దుఃఖపు కుండ ఉంది. ఆమె కూడా పెదవి కదపలేదు.

గమ్యం తెలియక – మౌనంగా – ఎడారిలోంచి వలె సాగిపోతున్నాం.

ఒక పొగబండి – కూత కూసుకుంటూ – మమ్ములను వదిలి – మేము వెళ్లే వైపే వెళ్లిపోయింది.

అమ్మ వెంట నడవడం విసుగనిపించడంలేదు. ఒక మామిడి తోట వచ్చింది. మామిడి నీడన – బండమీద – కూలబడ్డాం.

కాళ్లనొప్పులు తెలుస్తున్నాయి.

"అమ్మా! మనం ఎక్కడికి పోతున్నాం?"

"గూడూరు" అని కన్నీరు గుమ్మరించింది.

అడిగినందుకు బాధ – తామరల గూడూరు వెళ్తున్నందుకు ఆనందం – నాలో ముసురుకున్నాయి.

అమ్మ చెంబులో పిండి, బెల్లం తెచ్చింది. నాకు పెట్టింది. అమ్మ తినలేదు. దిగుడు బావిలో నీళ్లు త్రాగాం. మళ్లీ నడకసాగించాం. సాయంకాలానికి పాపిటపల్లి స్టేషను చేరుకున్నాం. చీకట్లు ముసురుతున్నాయి. పడుకున్నాం.

చిమ్నీ వెలుగులో స్టేషను మాస్టరు మమ్ములను చూశాడు. ఏదో అడిగాడు. అమ్మ ఏదో చెప్పింది. 'రాత్రిళ్లు పెద్దపులి తిరుగుతున్నది' అని వాళ్ల ఇంటికి తీసికెళ్లాడు. ఆ రాత్రి మంచినీళ్లు త్రాగి పడుకున్నాం.

తెల్లవారి పాపిటపల్లి ఊళ్లోకి వెళ్లాం. అమ్మ తనచేతి బంగారు గాజు అమ్మ జూపింది. ఒక దుకాణం వాడు దయతలచాడు. ఎంతో కొంతడబ్బు – గాజు తన వద్ద ఉంచుకొని – ఇచ్చాడు. స్టేషనుకు వచ్చి రైలెక్కాం. మానుకోట – మహబూబాబాదులో దిగాం. దేవాలయం ముందటి భాగవతుల సీతమ్మగారింటికి వెళ్లాం. వాళ్లు మాకు బంధువులు. ఆమె అమ్మను ఓదార్చింది. స్నానాలు భోజనాలు అయినాయి. పడుకొని నిద్రపోయాం.

సాయంత్రం ఒక కంసాలి వచ్చాడు. మా అమ్మ మరొక గాజు కొన్నాడు. రూపాయిలు బండమీద మోగించి ఇచ్చాడు. అప్పటికి కరెన్సీ నోట్ల వాడకం విరివిగా లేదు.

తెల్లవారి డబ్బు మూట కట్టి నా రొంటికి కట్టారు.

నేను రైలు ఎక్కాను. పాపిటపల్లిలో ఆగాను. స్టేషను మాస్టర్ను కలిశాను. జరిగిన వృత్తాంతం వివరించాను. పాపిటపల్లి ఊళ్లో ఆ దుకాణానికి వెళ్లాను. రొంటి డబ్బు విప్పి ఇచ్చాను. అతడు గోటితో ఎగరేసి చూసుకొని, రూపాయిలు లెక్కించుకున్నాడు. తీసుకున్నాడు. తన దగ్గరిగాజు నాచేతికి తొడిగాడు. అది దండకడియం అయింది. దాని మీదినుంచి బట్టకట్టాడు. షర్టు వేసుకుంటే ఎవరికీ

కనిపించదు. నేను స్టేషనుకు వచ్చాను. స్టేషను మాస్టరు కత్తిరించిన సగం టిక్కెట్టు ఇచ్చి రైలెక్కించాడు. మానుకోటలో దిగి, సీతమ్మగారి ఇంటికి వెళ్లాను. గాజు తీసి ఇచ్చాను.

సీతమ్మగారు కంచంలో చద్దన్నం, గోంగూర, పేరిన్నెయ్యి కలిపి ముద్దలు చేశారు. కంచం చుట్టూ వాళ్ల పిల్లలతోపాటు నేనూ కూర్చున్నాను. తన కొడుకులతోపాటు నాకూ ముద్దలు పెట్టింది. అది అమృతం! నేను వద్దంటుంటే చివరి ముద్ద, నా తలపట్టుకొని నోట్లో కుక్కింది. ఆ అనుభూతికి అక్షరాల్లేవు – అలాంటి తల్లులూ లేరు.

**చిమ్మ చీకటిలో సైతం ఎక్కడో వెలుగురవ్వ మిణుకు మిణుకుమంటుంది.**

అక్కణ్ణుంచి కచ్చడం – సవారిబండిలో – అడవి బాట దాటి చిన్న గూడూరు అమ్మమ్మ ఇంటికి చేరుకున్నాం. బండి దిగగానే, అమ్మ, అమ్మమ్మ, తాతయ్య ఒకరి మీద ఒకరు పడి ఏడుపులు – అమ్మలక్కలు కూడడం – ముక్కున వేలేసుకోవడం జరుగుతున్నాయి.

నేను ఛెంగున గంతేసి, చింతలకింది నర్సిగాణ్ణి తీసుకొని, కాలువ నీటిలో కాళ్లు లాక్కుంటూ, ముత్యాలమ్మ కుంట కట్ట ఎక్కాను. తామరలు చెరువు నిండా పూసి ఉన్నాయి! నీరు కనిపించడం లేదు. ఆకుల మీది నీటి బొట్లు ముత్యాల్లా మెరిసిపోతున్నాయి. వికసించిన తామరలమీద నల్లని తుమ్మెదలు తిరుగుతున్నాయి.

ప్రకృతిలోని అందాలన్నీ ఆ చెరువులోనే గూడు కట్టుకున్నట్లుంది.

చెరువుకట్టకింద నాగజముళ్లు పడగెత్తాయి. వాటికి అవల పచ్చని పొలాలు. వాటి మధ్య మామిడితోట – దానిమీద ఎగిరే చిలకలూ, గోరవంకలు!

ప్రకృతి పరవశించింది.

వనమూ ప్రకృతిలోని అంతర్భాగమే!

నా మనసు పరవశించింది.

నేను ఒడలు ఎరుగను!

ఇంటికి చేరుకుంటే ఎర్రమంటి అలుకునేల, గాలికి కదలాడే ఆముదపు దీపాలు, బావి పక్కన మల్లెపందిరి, పెరట్లో మొక్క జొన్న చేను – ఖమ్మం చెరనుంచి గూటికి చేరుకున్నట్లుంది!

అమ్మ సహితం మంచు విడిన మొగ్గలా కాస్త తెప్పరిల్లింది.

తాతయ్య, అమ్మమ్మ మాత్రం భయం – భయంగా ఉన్నారు. "నెత్తిమీదికి ఏం తెస్తడో మహానుభావుడు!" అని క్రుంగిపోతుండేవారు.

**బాల్యం లేడి పరుగులాంటిది. లేడికి భయం అవుతే క్షణం నిలుస్తుంది. అటూ ఇటూ చూస్తుంది. మళ్లీ ఛెంగు ఛెంగున ఎగురుతూ సాగిపోతుంది.**

అమ్మ దుఃఖభారంతో నా బాల్యం క్షణం నిలిచింది. అమ్మమ్మగారింట అది గంతులు వేసింది. మా అమ్మమ్మ సీతమ్మగారు అమ్మను కన్న తల్లికాదు. అమ్మ పురిట్లోనే అమ్మమ్మ గతించింది. తాతయ్యకు రెండో భార్య. కాని, మాకు మొదటి అమ్మమ్మే.

సీతమ్మగారిది పసిడి ఛాయ. ఆమె ముఖాన పసుపు కాపురం ఉండేది. సూర్యుడు పొడిచినంత కుంకుమ బొట్టు, పెద్దది రాళ్లముక్కెర, చెవులకు ఎర్రరాళ్ల దిద్దులు, మెడ నిండా నగలు, పాలపిట్టరంగు నేత చీర, నడుముకు వడ్డాణం, కాళ్లకు అరకిలో కడియాలు, పావుకిలో మట్టెలు – లక్ష్మీదేవి తామరపూవు దిగి వచ్చినట్లుంటుంది. ఆమె పెరట్లో నడుస్తే – మట్టెల చప్పుడు – వాకిట్లోకి వినవచ్చేది.

సీతమ్మగారికి సంతానం లేదు. అమ్మమ్మ మేమంటే ప్రాణాలు ఇచ్చేస్తుంది. నాయన వాళ్ల ఇంటికి పోనిచ్చేవాడు కాదు. ఇప్పుడా ఇబ్బంది లేదు. వాళ్లింట్లోనే వాలిపోయాన్నేను. ఇప్పుడు ఇక్కడ నేను మహారాజును. తాతయ్య, అమ్మమ్మ నాకు సేవకులు. ఏది కావాలంటే అది వచ్చేది. అయినా అడగడానికేముంది? బొంగరం అడిగాను. తాతయ్య వడ్లవాడి ఇంట్లో కూర్చొని చేయించి ఇచ్చాడు.

అమ్మమ్మ ఇంట్లో దొంతుల గది నిండా చిరుతిండ్లే. ఒక కుండలో అటుకులు, ఒకదానిలో సత్తుపిండి, ఒకదానిలో ఏపుడు బియ్యం. అరిశెలు, జంతికలు, చక్కిలాలు, చేగోడీలు – ఏది అడుగుతే అది తక్షణం హాజర్.

పెరట్లో మొక్కజొన్న కంకులు విరిచి, బొగ్గుల నిప్పులమీద కాల్చి, పచ్చిమిరపకారంలో వెన్న కలిపి, మొక్కజొన్న పొట్టలో పెట్టి ఇచ్చేవారు. ఒక్కొక్కసారి అమ్మ వలిచి చేతులో పోసేది. గింజలు నోట్లో పోసుకుని, వెన్న కలిపిన పచ్చిమిరప కారంతో నములుతుంటే చందమామ మీద – పొన్న చెట్టుకింద ఆడుకున్నంత ఆనందం.

ఈ మొక్కజొన్న కంకులు తినడాన్ని నా నవల "చిల్లర దేవుళ్లు"లో చేర్చాను. ఆ నవలకు వ్రాసిన పీఠికలో దేవులపల్లి రామానుజరావుగారు మొక్కజొన్న కంకులను వదలలేకపోయారు. "తెలంగాణాలో మొక్కజొన్న కంకులను కాల్చి, వెన్న, మీగడ మరియాలతో కలిపి తినిన రుచి..... చక్కగా వర్ణించి పాఠకుని మనస్సునకు హాయిని కూర్చినారు" అని వ్రాసినారు.

నర్సిగాడు, నేను ఒక పథకం వేశాం. తాతయ్య ఖాతా ఉన్న కిరాణం దుకాణంలో నేను రెండు కుచ్చాల పైసలు తెచ్చాను. వాటిని చింతచెట్టు కింద పాతిపెట్టాం. కుచ్చం అంటే నాలుగు పైసలు. అవి చెట్లు మొలుస్తాయనుకున్నాం. వాటికి పైసలు కాస్తే మనకేం తక్కువ ఉండదు. దానికి రోజూ నీళ్లు పోస్తున్నాం.

కిరాణం దుకాణం అతను మా తాతయ్యతో చెప్పాడు, నేను పైసలు తెచ్చానని. తాతయ్య నన్ను అడిగారు. చెప్పాను. పాతిపెట్టానని – పైసలు కాస్తాయని తాతయ్య నన్నేమీ అనలేదు. నర్సిగాణ్ణి పిలిపించి కోప్పడ్డారు. వాడు తనకేమీ తెలియదన్నాడు. అందరూ చింతకింద తవ్విచూశారు. ఏమీలేదు పోలీస్‌పటేల్ నర్సిగాని తండ్రి రామదాసును బెదిరించాడు. రామదాసు రెండు కుచ్చాలు తెచ్చి తాతయ్యకు ఇచ్చాడు. కాళ్లు పట్టుకున్నాడు!

ఎనిమిది పైసలంటే ఆనాడు పెద్ద మొత్తమే! పైస కనిపించడం కష్టం! సుమారు వినిమయం పద్ధతే.

**ఆనాటి మా తాతయ్య, అమ్మమ్మల నిశ్చింతమూ, నిరామయము, ఆరోగ్యకరము, ఆత్మీయము అయిన జీవితాన్ని తలచుకుంటే అది అందని ఆకాశంలా, దొరకని ఇంద్రధనుస్సులా, చేరరాని తారాపథంలా అనిపిస్తుంది!**

తాతయ్య, అమ్మమ్మా కోడి కూతతో మేల్కొనేవారు. అంటే, కోడి కూతను వినిలేస్తారని కాదు. వారు లేవడం, కోడి కూయడం ఒకేసారి జరుగుతాయి.

అమ్మమ్మ ఇంటిపనిలో మునిగిపోతుంది. వంటిల్లు అలకడం, అంట్లుతోమడం వగైరా పనులు ముగించేవరకు తెల్లవారుతుంది. అప్పుడు బిందె, చెంబు తీసుకొని చెరువుకు చేరుతుంది. పసుపు కొమ్ము రాతిమీద అరగదీసి ముఖానికి రాసుకుంటుంది. స్నానం చేస్తుంది. బిందె, బిందెమీద చెంబుతో నీళ్లు తలకు ఎత్తుకుంటుంది. సాధారణులం పట్టి బిందె మోయడం కష్టం. తలమీద బరువు, మట్టెల చప్పుడుతో చెరువునుంచి ఇంటికి బయలుదేరుతుంది.

తాతయ్య భుజాన కండువా – చేతులో క్రర్రతో మసక చీకట్లో, మందానిలంలో బయల్దేరుతారు. వేపచెట్టు దగ్గర ఎవరయినా కనిపిస్తే పుల్ల విరిచి ఇస్తారు. కాకుంటే అంతవయసులో వారే చెట్టు ఎక్కుతారు. పుల్లను నములుతూ, పళ్లు తోముతూ సాగుతారు. ఎక్కడో మోట బావి దగ్గర ఆగుతారు. తోటవాణ్ణి పిలుస్తారు. ప్రశాంత వాతావరణంలో పదాలు పాడుతూ మోటకడ్తున్న తోటవాడు మోట ఆపి వస్తాడు. అక్కడ కాసిన కూరగాయ ఏదో ఒకటి తాతయ్యకు ఇస్తాడు. తాతయ్య కండువాలో మూట కట్టుకుంటారు. సాగిపోతారు.

తాతయ్య ఏటికి – ఆకేటికి చేరుకుంటారు. బహిర్భూమి ముగించుకుంటారు. మోదుగు ఆకులు తెంపుతారు. ఆకులూ, కూరగాయలు ఇసుకమీద పెడ్తారు. వారు కండువా కట్టుకుంటారు. ధోవతి పిండి ఇసుకమీద ఆరవేస్తారు. నదిలో స్నానం చేసి బయటికి వస్తారు. ధోవతి ధరిస్తారు. కండువాలో ఒక కొనకు కూరలు, మరొక కొనకు ఆకులు కట్టుకుంటారు. భుజాన వేసుకుని ఇంటికి బయల్దేర్తారు.

విచిత్రం ఏమంటే తాతయ్య, అమ్మమ్మ కచ్చితంగా – నిర్దిష్టంగా – ఒకేసారి ఇంటిముందుకు చేరుకుంటారు. గడియారమే ఎరుగని వారు అంత సమయపాలన ఎలా చేస్తారో ఆశ్చర్యం!

ఇంటికి చేరుకుని తాతయ్య – అమ్మమ్మ తలమీద నుంచి బిందె దించడానికి సాయపడ్తారు. తెచ్చిన కూరగాయల పాక విధానాన్ని గురించి చర్చించుకుంటారు. తాతయ్య కూరగాయలు తరుగుతుండగా అమ్మమ్మ పొయ్యిలో నిప్పువేస్తుంది. వంట ప్రారంభం అవుతుంది.

తాతయ్య తిరుమన్నాపు తిరువారాధన ముగించుకొని, అనుసంధానం కొనసాగిస్తూ మోదుగు ఆకుల పచ్చని విస్తళ్లు – జనసంఖ్యను బట్టి కుడ్తారు. అంతలో వంట సిద్ధం అవుతుంది. ఆరగింపు జరుగుతుంది. ఉన్న బంధువులతో భోజనం.

పీటల ముందు ఆకుపచ్చని విస్తరి. అందులో తెల్లని అన్నం. పసుపుపచ్చని పప్పు, ఎర్రని ఊరగాయ – వర్ణ చిత్రంలా ఉంటుంది. ఘుమ ఘుమలాడే నూకల నేయి, ఎర్రని మీగడ పెరుగు సుష్టుగా భుజిస్తారు.

భోజనం తరువాత తాంబూలం – పగటినిద్ర. నిద్రలేచి చేయవలసిన ఫలహారపు చర్చ. ఫలహారం – ఉపాహారం ముగింపు, సూర్యాస్తమయం ఒకేసారి.

తరువాత తాతయ్య ఇంటి ముందరి అరుగుమీద చేర్తారు. ఊళ్లో పెద్దలు ఒక్కొక్కరూ కూడ్తారు.

తాతయ్య ముచ్చటగా ప్రారంభించే రామాయణ - భారత భాగవతాల్లోంచి ఉపన్యాసం ప్రారంభిస్తారు. చీకటి పడుతుంది. దీపాలు పెడ్తారు. వారు అనర్గళంగా సాగిపోతారు. చీమ చిటుక్కుమనదు. దొరవారు వచ్చినా చెప్పులు విప్పి, తలపాగా తీసి కూర్చుంటారే కాని, ఆటంకం కలిగించరు. గంటలు గడిచిపోతాయి. చివరకు నిత్యకృత్యపు ముచ్చట్లలోకి వచ్చి ముగిస్తారు.

ముగించి ఇంట్లోకి వచ్చి స్నానం చేసి, తిరువారాధన చేసి, సాపాట్లు చేస్తారు. పడుకుంటారు. పడుకొని మాట్లాడే విషయాలేమంటే, పచ్చడికి ఏ చెట్టు చింతకాయ మంచిది? నిమ్మకాయలు, మిరపపండ్లు వగైరా ఎక్కణ్ణుంచి తెప్పించాలి?

అలా వారి జీవితాలు గడిచిపోయాయి. ఆ జీవన విధానంలో అవసరం అయినంత పరిశ్రమ, ఆరోగ్యకరమైన ఆహారం, మనసును వికసింపచేసే వాతావరణం - అన్నిటినీ మించి తృప్తి, ఆత్మోపజీవనానికి పుణ్య కథాశ్రవణం - అన్నింటినీ తలతన్నిన శాంతి సమకూరి ఉన్నాయి.

మనం ఈనాడు భౌతికంగా ఎంతో, ఎంతో ముందడుగు వేశాం. చంద్ర, గ్రహ నక్షత్రాలను జయించాం. ఈ యంత్ర నాగరకత మనిషిని మనసులేని యంత్రాన్ని చేసింది. మనసు పోగొట్టుకున్న మనిషి వంటరి వాడయి కొట్టుమిట్టాడుతున్నాడు. దురాశ మనిషిని మింగుతున్నది. ఈ దురాశ పంచ భూతాలను కలుషితం చేస్తున్నది. మానవ జాతి సొంతం వినాశం వైపు పరుగులు తీస్తున్నది.

ఇది భస్మాసుర హస్తం.

ఎన్నడో భస్మం చేయకమానదు!

ఈ విషయం పాశ్చాత్యులు గ్రహించ నారంభించారు. "పల్లెలుకు మళ్లుదాం" అనే నినాదం అక్కడ ప్రారంభం అయింది. మనం, మన రామన్న తరాలు - బతికి బట్ట కట్టాలంటే పల్లెలకు తరలక తప్పదు. ఇది హెచ్చరిక మాత్రం కాదు. ఒక సజీవ సత్యం.

ఒకనాడు - ఖమ్మంనుంచి గోవర్ధనం నరసింహాచార్యులవారు దిగారు. మా తాతయ్య, అమ్మమ్మతో ఏదేదో మాట్లాడారు. అమ్మ కంటికి కడివెడుగా విలపించింది. ఆడదాని పరాధీనత అంతుపట్టదు! కన్నవారికే బరువవుతుంది! ఊరికే భారం అవుతుంది!

జనకుడు సీతను ఛాయేవానుగతా తవ - నీ నీడవలె అనుసరిస్తుంది అని అప్పగించాడు. సీతమ్మ ఎన్ని కష్టాలు పడ్డది! జనకుడు మళ్లీ కనిపించడు!!

ద్రుపదుడు ద్రౌపదిని పంచ పాండవులకు అప్పగించాడు. ఆమెకు జరిగినన్ని అవమానాలు మరే మహిళకూ జరిగి ఉండవు. ఆమెను ఆదుకొనేందుకు ద్రుపదుడు కనిపించడు. కుంతీ అంతే!

అమ్మను ఖమ్మం పంపించడానికి ఏర్పాట్లు జరిగాయి. గూడూరు - ఆకేరు - తామరల కుంట - జోడు చింతలు - నర్సిగాడు వీరిని వదిలిపోవడం నాకు బాధగానూ - అయిష్టంగానూ ఉంది.

**ఎవరి ఇష్టానిష్టాలతో జీవితానికి సంబంధం ఉండదు. జీవితం దారి జీవితపుది.**

**మనం జీవితాన్ని శాసించలేం. జీవితం మనను శాసిస్తుంది. ఈ శాసించే దాన్నే "విధి" అంటాం.**

నరసింహాచార్యులవారు – అమ్మా – నేను ఎద్దులబండిలో బయలుదేరాం. మా తాతయ్య, అమ్మమ్మ కన్నీరు రాల్చడం – అమ్మ ఏడవడం – ఏటిదాకా వచ్చి తాతయ్య సాగనంపడం జరిగిపోయాయి.

ఎల్లంపేట ఊళ్లో సీతాఫలాల గంప – గంప సహితంగా పావలాకుకొన్నారు. ఎల్లం పేట బస్సు స్టేజిలో బస్సెక్కి ఖమ్మం చేరుకున్నాం.

ఖమ్మంలో ఇంటి వాతావరణం మారింది. నాయనమ్మ మమ్ములను చూచింది. ముక్కు విరిచింది. లోనికి వెళ్లిపోయింది. నాయన నరసింహాచార్యులవారికి స్వాగతం చెప్పారు. అమ్మ వసారాలో కూలబడింది. అమ్మ పక్కన నేను నుంచున్నాను. తాను సామానుగదికి తాళం వేయడం లేదనీ ఇంకేమేమో నాయన నర్సింహాచార్యుల వారికి వివరించారు. వారు వెళ్లిపోయారు. మమ్ములను పలకరించినవారు లేరు.

అమ్మ మెల్లగా లేచింది. లోనికి వెళ్లింది. సామాను గదికి తాళం లేదు. కాని గదిలో బస్తాలు, డబ్బాల కొద్ది ఉన్నదంతా కాళీ. బియ్యం పప్పులు మరీ కొద్దిగా ఉన్నాయి. అమ్మ స్నానం చేసి మడి కట్టి వంటచేసింది. అందరికి పెట్టింది. తాను తిన్నది. ముడుచుకుని పడుకుంది.

అమ్మ – తన ఇంట్లో పరాయిదానిలా, పనిమనిషిలా కాలం వెళ్లబుచ్చుతున్నది.

**కాలానికి కళ్లులేవు. మనసులేదు. అది కరవాలంకన్న కరకు అయింది. అది దేనికోసమూ ఆగదు. సాగిపోవడమే దాని పని.**

కాలం గడిచిపోయింది. సంవత్సరమో, రెండు సంవత్సరాలో కావచ్చు. ఒకనాడు నాయన, నాయనమ్మ, అన్నయ్య మూటలు సర్దుకుని ప్రయాణమై పోయారు. రోజూ ఏదో గొడవలూ – తగాదాలు – అమ్మను కొట్టడాలు – అమ్మ ఏడ్పులు మామూలు అయిపోయాయి! ఈ ప్రయాణం ఏ తగాదా పరిణామమో తెలియదు.

అప్పటికి కుటుంబానికి మరో ఇద్దరు చెల్లెళ్లు చేరారు. ఇంట్లో సరకులు లేవు. డబ్బులేదు. నలుగురికి గడవాలి! ఉపవాసాలు – ఉప్పిళ్లు. ఉన్నది మాకు పెడ్తుంది అమ్మ. తన పిల్లల ఆకలి ఓర్చలేదు తల్లి! తాను ఉపవాసం ఉంటుంది. ఒక్కొక్కసారి అందరమూ ఉపవాసమే! అయినా, నేను స్కూలుకు మాత్రం వెళ్లేవాణ్ణి. అమ్మ కష్టాలు చూడడం శక్యం అయ్యేది కాదు. అలాఉద్దీన్ దీపం లాంటిది, అలీబాబా ఖజానా లాంటిది దొరకాలనిపించేది. ఆలోచనలు నా వయసును మించిపోయేవి. కష్టాల్లో మనిషి కాకలు తీరుతాడు!

ఎలాగో మా నాయన విజయవాడలో ఉన్నారనే సమాచారం సాధించింది అమ్మ. బెజవాడ ప్రయాణం అయినాం.

ఆ రోజుల్లో రైళ్లు ఆవిరి ఇంజనుతో నడిచేవి. ఇంజనులో రాక్షసిబొగ్గు మంట – ఆకలి మంటలను మించి – భగ భగ మండుతుండేది. బొగ్గుమనిషి పారతో బొగ్గు మంటలో వేస్తుంటాడు. పొగ కక్కుకుంటూ – ఆవిరి చిమ్మకుంటూ – కూత

కూసుకుంటూ రైలు సాగుతుంది. రైలు మొత్తం అయిదారు పెట్టెలకు మించి ఉండేవి కాదు. ఒకటే లైను. ఎదురు బండి వస్తే స్టేషనులో ఆగిపోవాలి. అది సాగిపోయాక – ఇది కదలాలి. మద్రాసు – ఢిల్లీల మధ్య నడిచే జి. టి. ఎక్స్‌ప్రెస్ తప్ప – మిగతా రెండు పాసింజర్లే. అన్ని స్టేషన్లలో ఆగుతాయి. బెజవాడ వరకు N.S.R. నిజాం స్టేట్ రైల్వే. బెజవాడ నుంచి M.S.M. – మద్రాస్ సదరన్ మహారాష్ట్ర రైల్వే. బెజవాడలో N.S.R.కు గుర్తింపులేదు. దానికి స్వంత ప్లాట్ ఫారం ఉన్నా గంటల తరబడి వంటిరెక్క దగ్గర నిలిపివేసేవారు.

అది నాకు తొలి రైలు ప్రయాణం. ఎంతో ఉద్వేగం కలిగించింది. చెట్లు గుట్టలు వెనక్కు పోవడం – పట్టాలమీద రైలు లయబద్ధ ధ్వని – రైలు కూత – ఆగడం – సాగడం – అన్నీ వింతగా – వినోదంగా – విచిత్రంగా ఉన్నాయి. రైలు టిక్కెట్టు ఖమ్మం నుంచి బెజవాడకు రూపాయి పావలా.

మేము బెజవాడలో దిగాం. ఆ ప్లాటుఫారం సందడి – ఆ రైళ్లు – అక్కడి దుకాణాలు – నాకు కొత్తలోకంలా అనిపించింది. బయటికి వస్తే జన సందోహం – గుర్రబ్బళ్లు – అంతా వింతగా ఉంది.

గుర్రబ్బండిలో కొత్త గుళ్ల దగ్గరి రామానుజ కూటం చేరుకున్నాం. అన్నయ్య ఎదురు వచ్చి మూటలు అందుకున్నాడు. నాయన, నాయనమ్మ బిగుసుక్కూర్చున్నారు. అమ్మకు గత్యంతరం లేదు. ఇంట్లోకి వెళ్లింది. కొళాయికింద కాళ్లు కడుక్కుంది. నాయననూ నాయనమ్మనూ పలకరించింది.

అన్నయ్య నాకు రామానుజ కూట భవనం చూపిస్తున్నారు. అలాంటి భవనం అంతకు ముందు నేను చూడలేదు. గోడలకు కరెంటు – కొళాయి చూడ్డం నాకు అదే మొదలు. లైటు వెలిగించడం – ఆర్పటం ఒక వింత!

అది నిడుముక్కల సుబ్బారావు రామానుజకూటం – అంటే శ్రీవైష్ణవుల సత్రం. ఎందరు శ్రీవైష్ణవులు వచ్చినా మూడురోజులు ఉచిత భోజనం లేదా మనిషికి పావలా చొప్పున ఇచ్చి వసతి వంటపాత్రలూ ఇచ్చేవారు.

అక్కడ అమ్మకు హాయిగా ఉండింది. కట్టెల వంట అనుమతించేవారుకాదు. బొగ్గుల వంట – పొగ తప్పింది – పంపునీళ్లు – నీళ్లు చేదడం, ఏటినుంచి తేవడం తప్పింది. పాత్రలకు మసి ఉండదు. మసి తోమడం తప్పింది. ఊదవడం, చల్లడం తప్పాయి. అమ్మ కాస్త నవ్వుతూ కనిపిస్తే నాకు ఎంతో ఊరట!

అన్నయ్యా నేనూ లాకుల దగ్గర కూర్చునేవాళ్లం. పడవ రావడం – కాల్వ తలుపులు తెరవడం – పడవదాటగానే మళ్లీ మూయడం – ఎంత చూచినా తనివి తీరదు – కృష్ణకట్టమీదినుంచి పడుతున్న జలపాతం – దూరంగా రైల్వే బ్రిడ్జిమీద రైళ్లదాకా పొగలు అన్నీ ఏదో చిత్రంలా ఉండేవి.

కాళేశ్వర రావు మార్కెటు కనుల పండుగ. కూరగాయలు – పండ్లూ – పూలూ వాటి పరిమళం అద్భుతం. దమ్మిడీకి ఏదయినా కొనవచ్చు. కానీకి మూడు దమ్మిడీలు. తాటాకు బుట్టలనిండా పచ్చని కూరలు పట్టుకెళ్లేవాళ్లు! మార్కెటు ముందు సిమెంటు గొడుగుకింద ఎర్రటోపీ పోలీసు. అంతే. అది దాటిపోలేదు. గవర్నరుపేట చూడలేదు.

ఈ సంబరం ఎన్నాళ్ళుందో లెక్కలు లేవు కాని, నాకు త్వరగా ముగిసింది అనిపించింది. అందరు ఖమ్మం చేరుకున్నాం.

బెజవాడలో రైలెక్కేప్పుడు అమ్మను చూస్తే మెడ బోసిగా ఉంది. తరువాత తెలిసిన విషయం ఏమంటే – నాయన అమ్మను కృష్ణకు తీసికెళ్ళారు. తన కండువా చాపి, అమ్మ నగలన్నీ అందులో వేస్తేనే అమ్మతో ఖమ్మం వస్తా నన్నారు. అమ్మ మెడలోని నగలు తీసి ఇచ్చింది. చెవుల దిద్దులు, ముక్కుపుడకలూ ఇచ్చి, పుల్లలు పెట్టుకుంది. చేతికి ఉన్న నాలుగు జతల గాజులు రాలేదు. నాయన సబ్బు పెట్టి తీశారు. తన వెంట తెచ్చిన గిలేటు గాజులు వేశారు.

అమ్మ పద్మములేని లక్ష్మివలె – వీణలేని సరస్వతివలె అనిపించింది. అమ్మ భర్త ఆదరం నోచుకోని గృహిణి!

కాలగమనం ఆగదు. నగలన్నీ వలిచి ఇచ్చి కలతలు దూరం చేసుకుందామనుకున్న అమ్మ కల చెదిరిపోయింది. కలతలు మరింత పెరిగాయి. జగడాలు తప్పలేదు. అమ్మకు తన్నులు తప్పలేదు. ఇల్లు నరకం అయింది.

ఒకనాడు అమ్మ ప్రాణం విసిగింది. బావిలో పడటానికి ఉరికింది. పిల్లలం గొల్లుమన్నాం. పిల్లల ఆర్తనాదం విని ఏ తల్లి చావగలదు? మమ్ములను పట్టుకొని కంటికి కడివెడుగా ఏడ్చింది. మేము అసమర్థులం! ఏడవడం తప్ప ఏం చేయగలం?

నాయన మమ్ములను వదిలి నెలలు తరబడి వెళ్లిపోయేవారు. నాయనమ్మకు నల్లమందుకు మాత్రం డబ్బిచ్చి వెళ్లేవాడు. మళ్లీ అర్ధకళ్లు – ఉపవాసాలు – చిరిగిన బట్టలు. ఇల్లు భయం భయంగా ఉండేది.

అన్నయ్య ఒకటి రెండు ట్యూషన్లు – నేను రెండూ చెప్పే వాళ్ళం. విచిత్రమైన పరిస్థితిలో హమాలి లింగయ్యతో నాకు పరిచయం అయింది. లింగయ్య – తాను చెమటోడ్చి సంపాదించిందాంట్లో – నాకు రోజూ బేడ ఇచ్చేవాడు. లింగయ్య ఎంత ఇచ్చాడని కాదు. బేడా కూడా ఆ రోజుల్లో ఎక్కువే – శేరు బియ్యం వచ్చేవి. నా కష్టాలు చూచి అతను స్పందించిన విధం దొడ్డది!

నాయన ఎప్పుడో వచ్చేవారు. మెరుపులా వచ్చేవారు. తనకు కావలసినన్ని తెచ్చుకునేవారు. సబ్బులు – వాసన నూనెలు – వెండి వరఖు జరదా తాంబూలాలూ – గ్లాస్కో పంచెలూ – కాశ్మీర్ శాలువలు! వారు ఉన్నన్నాళ్ళు ఇల్లు ఆడంబరంగా – సందడిగా వైభోగంగా ఉండేది. అదిమాత్రం చూచిన వారికి మా బాధలు కల్లలుగానే కనిపించేవి.

ఈ వెలుగు చీకట్లమధ్య – నాయన లేనపుడు, మా అన్నయ్య – మా అమ్మ వద్ద తెలుగు పంచకావ్యాలు – అప్పకవీయం చదువుకున్నాను. అష్టకష్టాల్లోనూ కవితను వివరించేప్పుడూ – విశ్లేషించేప్పుడూ – మా అమ్మ ముఖంలో ఆనందం తొణికిసలాడేది! సుకవితా యద్యస్తిరాజ్యేనకిం? సుకవితయె యున్న రాజ్యమది ఏల – అన్న భర్తృహరి మాట నిత్యసత్యం అనిపిస్తుంది.

ఒకసారి నాయన మందీమార్బలంతో అట్టహాసంగా దిగారు. ఆ వచ్చింది శ్రీమద్రామానుజుల తిరునక్షత్రం – జన్మదినం జరపడానికి. ఏర్పాట్లుకూడా అట్టహాసంగా జరిగాయి. వంట మనుషులు వచ్చారు. బండితో వంటచెరుకు దిగింది.

కొట్టేవాళ్లు గొడ్డళ్లతో కొట్టారు. బస్తాలు, డబ్బాలతో సామగ్రి దిగింది. పాలు, పెరుగు బిందెలతో చేరాయి. వైష్ణవులు వందలకొలది వచ్చారు.

ఇక్కడ ఒక విషయం వివరించాలి. నాయన చాదస్తం – అలా అనలేం. ఆనాటి సమాజం సంప్రదాయపు సంకెళ్లలో అంతా ఇరికి ఉంది. ముస్లిం వేషం వేయకుంటే ప్రభుత్వం గుర్తించదు! సంప్రదాయ వేషధారణకు దూరం అవుతే పెద్దలు గుర్తించరు.

సాధారణంగా నాగరక వేషం తలవెంట్రుకల సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. అప్పటికి పిలకగల బోడిగుండే సంప్రదాయ వేషం. క్రాఫింగుకు ఇంకా ప్రాచుర్యం రాలేదు. రామానుజాచార్యులు అనే ఒక వకీలు క్రాఫింగు పెట్టుకున్నాడు. నాయన అతనిని "ముందరి జుట్టువాడు" అని వెక్కిరించేవారు. సంప్రదాయం ప్రకారం వెనుక పిలక – జుట్టు ఉండాలి. అందుకు ముందరి జుట్టు వెక్కిరింత!

రామానుజాచార్యులవారు అర్వపల్లివారి సత్రంలో శ్రీమద్రామానుజుల తిరునక్షత్రం ఘనంగా జరపడానికి ఏర్పాట్లు చేశారు. వారు తనకు పోటీకి దిగారనే అభిప్రాయం నాయనకు ఏర్పడింది. 'ముందరి జుట్టువాడు తిరునక్షత్రం చేయరాదు. అక్కడికి ఒక్క వైష్ణవుడూ వెళ్లరాదు' అని నాయన నిషేధం విధించారు. అంతే! అక్కడికి ఒక్క వైష్ణవుడూ వెళ్లలేదు. వకీలుగారి తిరునక్షత్రం భగ్నం అయింది. వారిని మా ఇంటి తిరునక్షత్రానికి రానివ్వలేదు.

అంతటి మూర్ఖపు సంప్రదాయంలోంచి బయటపడడం ఎంత దుస్తరమో ఊహించాల్సిందే – వ్రాయడం అసాధ్యం!

మా యింట్లో శ్రీమద్రామానుజుల తిరునక్షత్రం అత్యంత వైభవంగా – ఒక పెండ్లిని మించి జరిగింది. చేరలకొద్ది నేమి – పిండి వంటలు – తీపి పదార్థాలు – కూరలు – పప్పులు – పులుసులు – పెరుగుతో అనేకమందికి సాపాట్లు. పచ్చకప్పురం, జాజికాయ, జాపత్రి తాంబూలాలతో సాపాట్లు ముగిశాయి.

పందిళ్లలో వరుసలుగా కూర్చున్న స్వాముల వంటికి చందనాదులు సమర్పించడం. ఆ తరువాత ఉచ్చైస్వరంతో తిరునామాలు – మంగళహారతులు – అంతటితో తిరునక్షత్ర సంరంభం ముగిసింది.

రాత్రివరకు – పెళ్లి తరువాత ఇల్లులా, కాళీ అయింది. ఇల్లు వెలవెల బోయింది. అనేక రోజుల ఏర్పాట్లకు మంగళం పలకడం జరిగింది. సంరంభం ముగిసింది. మేమే మిగిలాం.

ఇంటి ముందర వసారా గడపమీద లాంతరు పెట్టుకున్నాం. ఒకపక్క నేను – ఒకపక్క అన్నయ్యా – చదువుకుంటున్నాం. చెల్లెళ్లు నిద్రపోయినట్లున్నారు. అమ్మా – నాయన – నాయనమ్మ ఇంటివెనుక దొడ్లో ముచ్చట్లలో ఉన్నారు.

అమాంతంగా అమ్మ పెట్టిన గావుకేక వినిపించింది. అది విని మేమిద్దరం పరిగెత్తాం. ఆ ఆతురతలో మా కాలి తాకిడికి లాంతరు బోర్లపడి – కిర్సనాయిలు క్రిందపడి – మంట అంటుకున్నది గమనించనేలేదు. మేము అటువెళ్తుంటే మా నాయన ఇంటి ముందుకు వెళ్తున్నారు. తరువాత తెలిసిన విషయం ఏమంటే, వారు – బజారు జనం రాకుండా – ఇంటి ముందు తలుపుకు తాళం వేసి – కిరసనాయిలు మంట ఆర్పివచ్చారు.

మేము వెనక్కు వెళ్లి చూస్తే అమ్మ రక్తం మడుగులో ఉంది! బాధకు తాళజాలక

మొత్తుకుంటూ౦ది. నాయనమ్మ నోరుమూసి – 'ఇరుగు పొరుగు వాళ్లు వస్తారు అరవకు' అని వారిస్తూ౦ది. మేము నిర్విణ్ణులం అయినాం. ఏమయిందీ అర్థం కాలేదు. క్షణం నోటమాట రాలేదు. తరవాత అమ్మమీద పడి గొల్లుమన్నాం. ఆ రొదకు చెల్లెళ్లు కూడా లేచారు. వాళ్లూ అమ్మమీద పడి ఏడ్చారు.

మా ఏడుపుకు ఇల్లు ప్రతిధ్వనించింది.

నాయన వాకిలి బంధించి వచ్చి మమ్ములను గద్దించారు. అంతే. అందరం నోళ్లు మూసుకుని – ఏడుపును నిలువరించుకొని అమ్మ ప్రక్కన మంచున్నాం.

అమ్మ మోకాలి ఎముక పగిలింది. రక్తం ప్రవహిస్తున్నది. పక్కనే – రక్తసిక్తమయిన – ఇనుప అట్లకాడ పడి ఉంది! నాయన అట్లకాడతో అమ్మను కొట్టారు అని అర్థం అయింది.

నాయన ఇంగువ నీళ్లల్లో కలిపి, నిరంతరం గాయం మీద పోస్తున్నారు. రక్తం కట్టడం లేదు.

కాలానికి మాన్పే శక్తి ఉంది. క్రమంగా రక్తం కట్టింది. అది కాళరాత్రి! ఆకలి నిద్రలు ఎగిరిపోయాయి! ఇలాంటి అనుభవం ఏ పసిపిల్లలకూ కలుగరాదు.

తెల్లవారి నాయన ఒక కాంపౌండరును పిలిపించారు. అమ్మకు వళ్లంతా సలుపులు, జ్వరం! కాంపౌండరు కట్టుకట్టి మందిచ్చాడు.

నాయన కొన్నాళ్లున్నారు. ఎవరో కాలక్షేపం సాయించడానికి ఆహ్వానిస్తే – అమ్మ గాయాన్ని కాంపౌండరుకు అప్పగించి వెళ్లిపోయారు.

అమ్మ చాలకాలానికిగాని కోలు కోలేదు. అన్నయ్యా, నేనూ ఇంటి పనీ – వంటా చేసేవాళ్లం. మాకు ఉపనయనాలూ – సమాశ్రయణాలూ అయినాయి కాబట్టి, నాయనమ్మకు అభ్యంతరం ఉండేది కాదు. ఏటినుంచి మంచినీళ్లు తేవడం – ఇంటిపని – వంటపని – స్కూలు – ట్యూషన్లు – వీటితో మాకు సరిపోయేది.

**ఇంతకూ నాయన ఎందుకు కొట్టారో తరవాత తెలిసింది. తిరునక్షత్రానికి తెచ్చిన సామానులో మిగిలింది దుకాణాలకు తరలిస్తానన్నారట నాయన. పిల్లలు ఉపవాసాలుంటారు అమ్మవద్దందట అమ్మ. ఆ విషయం మీదే మాటా మాటా పెరిగింది. పక్కనున్న ఇనుప అట్లకాడ విసిరారు. అది మోకాలికి తగిలి ఎముక పగిలింది. మా అదృష్టాన డొక్కలో గుచ్చుకోలేదు! అదే జరిగి ఉంటే.....!**

## ఎనిమిది

### తేయాకు - టీ - చాయ్:

ఇంగ్లండులో వచ్చిన పారిశ్రామిక విప్లవాన్ని నాటి కవులు - రచయితలు - కళాకారులు హర్షించలేదు. వారి వ్యథ నాటి నవలల్లోనూ - కవితల్లోనూ స్పష్టంగా కనిపిస్తుంది. రాబిన్‌సన్ క్రూసో, డాన్‌క్విక్సాట్ నవలలు గోల్డ్‌స్మిత్, వర్డ్స్‌వర్త్, షెల్లీ, బైరన్ల కవితలు ఇందుకు ఉదాహరణలు.

యాంత్రిక నాగరకత సాహితీస్రష్టల - మేధావుల భావనలను లెక్కచేయదు. పొగ చిమ్ముతూ, కూత పెడ్తూ - వారి ధ్వనిని మూలుగుగా మారుస్తుంది. అది రోడ్ రోలర్‌వలె అన్నింటినీ అణగదొక్కుతూ సాగిపోతుంది.

యంత్రం మనిషిని మనసులేని మరగా మార్చింది. ఈ నాగరకతకు దురాశ - దుష్టవిత్తం మూలం. డబ్బు దీని ప్రధాన సూత్రం. డబ్బు - పెత్తనం కోసం అది మానవ జాతిని అంతం చేయడానికి సైతం వెనుకాడదు.

యంత్రం ఉత్పత్తిని పెంచుతుంది. పెరిగిన ఉత్పత్తిని అమ్ముకోవడానికి మనిషిని అలవాట్లకు బానిసను చేస్తుంది. ఆలోచనలను చంపి, అలవాట్లను పెంచడం ఈ నాగరకత. ఇది నాగరకత కాదు - ఉత్పత్తి విధానపు ప్రధాన లక్ష్యం. మనం ఈనాడు వాడుతున్న పదార్థాలలో వాస్తవంగా జీవితానికి అవసరం అయినవి అతికొద్ది మాత్రమే!

ఆంగ్లేయులు తమ మార్కెటును విస్తరించుకోవడానికి జనాన్ని తేనేటికి బానిసలను చేశారు. ఈ విధానం ఎలాంటిదంటే - అది బానిసలను చేస్తుంది. మనను బానిసలం అని గుర్తించనీయదు.

టీ – ఛాయ్ – తేనీరు ప్రచారం చేయడానికి వారు అవలంబించిన విధానం తెలుసుకుంటే – ఆధునిక ప్రచార సాధనాలద్వారా అన్నింటికీ అదే విధానం అనుసరించారని అర్థం అవుతుంది.

మూడో దశకంలో ఖమ్మంలో తేనీటి ప్రచారం ప్రారంభం అయింది. ప్రతి కూడలివద్దా ఒక టేయిలు – దానిమీద తలపాగా చుట్టుకున్న – ఆనందం వలకబోస్తున్న భారత రైతు – కప్పులో పొగలు చిమ్ముతున్న చాయ్ చప్పరిస్తుంటాడు. నేలమీద కిర్సనాయిల్ స్టౌ వెలిగిస్తారు. స్టౌ – దాని ధ్వని – దాని మంట ఒక వింత! స్టౌమీద తెల్లగా తోమిన ఇత్తడిగిన్నెలో నీళ్లు, గిన్నెమూతమీద టీ పొడి. నీరు మెల్లగా వేడి అవుతుంటుంది.

జనం వినోదం చూడటానికి గారడివాడి చుట్టువలె మూగుతారు. ఆంగ్లేయ వేషంలో ఉన్న ఒక వ్యక్తి ఇంగ్లీషులో ఒక్కొక్క వాక్యంగా టీ చేసే విధానాన్ని వివరిస్తాడు. పక్కనున్న భారతీయ వేషధారి దాని తెలుగు అనువాదం చెపుతుంటాడు. వారు చెప్పే విధానం ఎంతో ఆకర్షణీయంగా ఉంటుంది. జనం చుట్టూ మూగుతారు.

ఆంగ్లేయుడు తన అధికార దర్పం కనబరుస్తూ కదలడు. భారతీయుడు మరుగుతున్న నీటిని చూపుతాడు. టీ పొడి వేయడాన్ని వివరిస్తాడు. వేస్తాడు. విధానం వివరిస్తూ డికాక్షన్ వడపోస్తాడు. చక్కెర – పాలు కలుపుతాడు. కప్పులతో పోసిన చాయ్ అక్కడ కూడినవారికి అందిస్తాడు.

విచిత్రం ఏమంటే – అంతదాకా వింత చూచిన జనం టీ అందుకోకుండానే చెదిరి పోతారు. ఒక్కడూ టీ త్రాగడు. చేసిన టీ సాంతం పారబోస్తారు. మళ్లీ కార్యక్రమం ప్రారంభం! ఇలా విసుగూ – విరామం లేకుండా చాలకాలం కొనసాగింది. తరువాత టీ తాగిన వారికి కప్పులు ఉచితంగా ఇచ్చారు. కొంతకాలానికి జనంలో కొందరు – కప్పులకోసం – టీకి అలవాటు పడ్డారు. కప్పు నేటి బోనసులాంటిది!

నరసింహస్వామి గుట్ట దగ్గర ఒక తడకల సినిమాహాలు వెలసింది. అందులో టీ సినీమా చూపారు. సినీమాకు టిక్కెట్టు కాణీ. ఒక కప్పునిండా చాయ్ ఇస్తారు. అది తాగింతరువాత కప్పు ఉచితం – సినీమా చూడొచ్చు. అయితే టీ మాత్రం వాళ్ల ముందు తాగాలి!

నేనూ కొందరు మిత్రులూ కానులు సంపాదించాం. చాయ్ కోసం కాదు – సినీమా కోసం! అసలు మనం – అగ్రవర్ణం అనిపించుకొనేవాళ్లు – వాళ్లు చేసిన చాయ్ తాగవచ్చునా అనే మీమాంస మాకు! పాలు వేసిన నీళ్లు త్రాగవచ్చుగదా! టీ అంటే వేడిపాలేగదా అని సంతృప్తి! ఇంతా ఎందుకంటే – సినిమా చూడ్డానికి! మాకు సినిమా చూడ్డం ప్రధానం – వాళ్లకు చాయ్ తాగించడం ప్రధానం!

ఈనాటికీ ప్రచారపు మూలసూత్రం అదే!

కానీ ఇచ్చి – ఎవరూ చూడలేదని మేము అనుకొని – టీ తాగి – కప్పులు ఇంట్లోకి రానివ్వనందున వదిలి, సినిమాహాల్లో జొరబడ్డాం. అందరూ నేలమీదనే! అక్కడ వ్యత్యాసాలు లేవు.

తెరమీద సినీమా – ఒక ఆడ మనిషి జీవితంలో విసిగిపోతుంది. నూతిలో పడడానికి వస్తుంది. నూతి దగ్గర ఒకడు టీ కప్పు అందిస్తాడు. ఆమె టీ తాగుతుంది. ఆమెలో ఉత్సాహం ఉరకలు వేస్తుంది. ఆడుతుంది. పాడుతుంధి. ఆమె భర్త టీ కప్పుతో వస్తాడు. ఇద్దరూ ఆడుతూ పాడుతూ సాగిపోతారు!

ఒక రైతు పొలం దున్నుతుంటాడు. అలసిపోతాడు. డీలా పడిపోతాడు. అరకమీద – ఉసూరుమంటూ – కూలబడ్తాడు. ఎద్దులు అతన్ని పడేస్తాయి. సాగిపోతాయి. రైతు చతికిలపడి ఆకాశాన్ని చూస్తుంటాడు. రైతు భార్య చద్దితోపాటు టీ తెస్తుంది. కప్పులో భర్తకు అందిస్తుంది. తానూ అందుకుంటుంది. వారిలో ఉత్సాహం పొంగుతుంది. ఇద్దరూ చెట్టపట్టాలు వేసుకొని ఎగురుతారు. ఎద్దులు అరక తెచ్చి వారిముందు పెడ్తాయి.

ఇలాంటివే ఒక ఫ్యాక్టరీ వర్కరు, విద్యార్థి వగైరాలకు కలిగిన ఉత్సాహపు అనుభవాలు చూపారు.

సినీమా నుంచి బయటికి వచ్చి మేమందరం అనుకున్నదేమంటే – టీ తాగితే మార్కులు బాగా సంపాదించవచ్చని! ఆనాటి పరిస్థితుల్లో ఆ సినిమా మమ్ముల్ని ఆ నిర్ణయానికి రావడానికి పురికొల్పడం అత్యంత అద్భుతం! అద్భుతాది అద్భుతం!!

కూడళ్లలో చేసిన టీ పారపోయడానికే ఎక్కువ ఉపయోగపడింది. కొంతకాలానికి అవి మాయం అయినాయి. అక్కడ టీకి అలవాటుపడినవాళ్లూ – వినోదం కోసం వచ్చినవారూ నిరాశ చెందారు.

అంతటితో టీ వాళ్లు విరమించలేదు. పద్ధతి మార్చారు. కెటిల్ పట్టుకొని ఇంటింటికి వెళ్లారు. తమముందు త్రాగేవారికి టీ ఇచ్చారు. కప్పులు ఇవ్వడం మానారు. ఈ పథకం పనిచేసింది.

ఇప్పుడు ఇళ్లకు వెళ్లడం మానారు. కెటిల్‌తో ఒక కేంద్రంలో కూర్చునేవారు. జనం వారిచుట్టూ మూగేవారు. అలా కొంతకాలం సాగింది. తరువాత డికాక్షన్

మాత్రం ఇచ్చారు. పాలు – చెక్కెరా కలుపుకొమ్మన్నారు. ఆ దశలో జనం విరగబడ్డారు. అలా కొంతకాలం జరిగింది!

తరువాత పద్ధతి మార్చారు. టీ పొడి పొట్లాలు ఉచితంగా ఇచ్చారు. అవి తగ్గించారు. జనం దుకాణాలకు ఎగబడ్డారు! కొంతకాలం తరువాత అదీ మానేశారు. ఒక హ్యాటు పెట్టుకున్న, వ్యక్తి – మరొకడు, తోసే – ఎర్రటి బండిలో దుకాణాలకు టీ పొడి సరఫరా చేస్తుండేవాడు!

ఆ విధంగా పాకిన టీ ప్రపంచమంతటా అసంపూర్యం అయింది!

అయితే వాస్తవంగా టీ మనిషికి అంత అవసరం అయిందా అనే విషయం ఆలోచించకుండా చేయడమే వాణిజ్య వ్యవస్థ లక్షణం.

మాలాంటి సంప్రదాయ కుటుంబాలు తేనీటిని – తొలిరోజుల్లో – తమ ఛాయలకు రానివ్వలేదు. 'అప్రాచ్యుల ఆచారం' అని చాలమందిని దూరంగా ఉంచడానికి ప్రయత్నించారు. అయితే, పెట్టుబడిదారునిది కబంధ హస్తం. వీరుకూడా వారి పిడికిట్లో చిక్కుకున్నారు!

టీ అంటరానిదని భావించిన మాతామహులు చివరి రోజుల్లో చెంచెడుచాయ్ గ్లాసులో పోసుకుని త్రాగారు. అప్రాచ్య ఆచారం అని నిరసించిన నాయన ఉదయాన చాయ్ లేకుండా ఉండలేకపోయారు. అమ్మకు వేళకు చాయ్ లేకుంటే నరాలు బిగపట్టినట్లు అనిపించేది.

ఇది కొద్దిలో టీ – చాయ్ – తేనీటి వృత్తాంతం.

ఆ రోజుల్లో టీ – కాఫీల మీద దండకాలు వచ్చాయి.

## పిండిమర:

ఖమ్మంలో ధాన్యపు – నూనె గిర్నీలు – మిల్లులు ఉన్నాయని చెప్పాను. అయితే జనుల నిత్యజీవితాన్ని అవి అంతగా ప్రభావితం చేయలేదు. ఇంటి – వంట పనిముట్లలో మార్పు రాలేదు.

అలా ఉండగా ఒకనాడు చేగొమ్మవారి కొట్లలో ఒకదానిలో పిండిమర వెలిసింది. అది మహిళాలోకంలో సంచలనం కలిగించింది. "ఇటు గింజలు పోస్తే – అటు పిండి వస్తుందట – ఆదేం చోద్యమమ్మా!" అని చెప్పుకున్నారు. చాలమంది దాన్ని చూడ్డానికిమాత్రమే వెళ్లారు.

మేమూ చూడ్డానికి వెళ్లాం – గొట్టంలో గుప్పున పొగ – పెద్ద రొద – చక్రాలు గిరిగిరా తిరగడం – మరలో గింజలు పోస్తే పిండి అయి డబ్బాలో పడడం వింత! విసుర్రాళ్లతో పిండి ఎంతకాలం విసరాలి? అమ్మకు శ్రమ తప్పింది అనుకున్నాం. ససేమిరా కుదరదు అన్నారు నాయన!

## మాట్లాడే స్తంభం:

బీటు బజారులో విజ్ఞాన నికేతన గ్రంథాలయం ఉండేది. ఆనాటి గ్రంథాలయాలు విద్యకు – విజ్ఞానానికి – వికాసానికి – చైతన్యానికి నిలయాలు! ఆ గ్రంథాలయానికి

రేడియో వచ్చింది. ఆ పేరు ఎవరికీ తెలియదు. "మాట్లాడే స్తంభం" వచ్చిందనుకున్నారు. అప్పుడు రేడియో అంత పెద్దగా ఉండేది. స్తంభం పలకడం చూడడానికీ వినడానికీ జనం బాగా కూడేవారు. తొలిరోజుల్లో మాకు స్తంభం కనిపించలేదు. మాటా – పాటా వినిపించాయి. అప్పుడు మేము అనుకున్నాం "ఆకాశవాణి"లా ఉందని! అది "ఆకాశవాణి" కావడానికి స్వాతంత్ర్యం రావలసి వచ్చింది. అర్ధశతాబ్దంలో రేడియో టీకన్న పాపులర్ అయింది.

## కదిలే బొమ్మ:

"కదిలే బొమ్మ" అంటే ఒకనాడు వింత. మనకు తోలుబొమ్మలు ఉన్నాయి. వాటి ఆటలు – పాటలు సహితంగా తెల్లవార్లూ సాగేయి. ఊరంతా రాత్రి సాంతం – అందులో లీనమై – చూసేది. కాని, అది ఈనాటి సినిమా కాదు. దానికి టిక్కెట్టు అక్కరలేదు.

సినిమా మొదలయింది "కదిలే బొమ్మ"తో. ఇప్పటికీ దీని పేరు మువీ – అంటే చలన చిత్రం. ఖమ్మంలో మొత్తం రేకుల – అంటే గోడలు సహితంగా రేకుల హాలు ఉండేది. దాని పేరు "పిక్చర్ పేలస్". మూగ సినిమాలు వచ్చేవి. నేను ఒకటి రెండు చూచాను. అవి ఇంగ్లీషువి. ఏవో ఎగరడం, గంతులు వేయడం. సినీమా పేరు గుర్తు లేదు. పాసింగ్ షో కావచ్చు. అందులో ఒకడు సిగరెట్టు పెదవుల మధ్య బిగిస్తాడు. అది అమాంతంగా బారెడు అవుతుంది. చప్పున వేలెడు అవుతుంది!

తరువాత మాటల సినిమాలు వచ్చాయి. పిక్చర్ పేలస్ "నవాబ్ టాకీస్" అయింది. హరిశ్చంద్రలాంటి పౌరాణికాలు పద్యాల సహితంగా వచ్చాయి. పుల్లయ్యగారనుకుంటా – అచ్చం పిల్లలతో అనసూయ – ధ్రువుడు – సుమతి కథలు సినిమాగా తీశారు. అనసూయ దిగంబరంగా ముమ్మూర్తులకు పాలివ్వడాన్ని అద్భుతంగా చిత్రించారు. ధ్రువుని చిత్రం నామీద ఎంత ప్రభావం వేసిందంటే – ఏటి వడ్డుకు తపస్సుకు వెళ్లిపోయాను!

ఎందుకో నవాబ్ టాకీసు మూత పడింది. అరకాలవాళ్ల బావిదగ్గర టూరింగు సినీమా వచ్చింది. ఆ రోజుల్లో దేశభక్తి, సంఘసంస్కరణ ప్రధాన లక్ష్యంగా సినిమాలు తీసేవారు. నాయన ఎంత ఛాందసుడయినా మమ్మలను "మాలపిల్ల" పిక్చరుకు తీసికెళ్లారు. తరవాత రైతుబిడ్డ, గృహలక్ష్మి తెలుగువారి మీద చెరగని ముద్ర వేశాయి! ఆ పేర్లతో ఆనాడు చీరలు వచ్చాయి. కన్నాంబ "పల్నాటి యుద్ధం", "చండిక" అద్భుత దృశ్యాలు. దేశభక్తి ప్రదీపకాలు.

హిందీలో "వాడియా మువోటీన్" వారి సలుంటు చిత్రాలు. అన్నింటిలో నాడియాయే హిరోయిన్. అదే హీరోయిన్ అదే కారు, అదే గుర్రంతో అనేక సినిమాలు వచ్చాయి. పేర్లు దొరక్క "పంజాబ్ మెయిల్", "పంజాబ్ మెయిల్ కి బేటీ" ఇలాంటి పేర్లుండేవి. అన్నింటిలో కథ ఒక జమీందారు దౌర్జన్యం – దాన్ని ఎదిరించడమే! అయినా ఏదో వెరయిటీ! అన్నీ చూసేవాళ్లు.

ఉర్దూలో సికందర్ – పుకార్ భారతదేశాన్ని అదరగొట్టాయి. సికిందర్‌లో యుద్ధపు సీనులు అద్భుతం! "పుకార్"లో సొహరాబ్ మోడీ సుదీర్ఘములయిన ఉర్దూ

డయలాగులకు హాలులో కరతాళ ధ్వనులకు విరామం ఉండేది కాదు. తరువాత వచ్చిన "ఖజాంచీ" అశోక్ కుమార్ – లీలా చిట్నీస్‌ల "అఛూత్ కన్యా", "బసంత్" "ఖిస్మత్" జనాన్ని ఉర్రూతలూగించాయి!

హిందీ – ఉర్దూ సినిమాలు వచ్చినపుడు వ్యాఖ్యానం చెప్పేవారు. డైలాగుల కన్నింటికీ ఒకరకపు గ్రాంథికంలో చెప్పతూ పోయేవారు. అది భాష తెలియని వాళ్లకు హుషారు – తెలిసినవాళ్లకు విసుగు కలిగించేది.

అప్పుడప్పుడూ నాటకాల కంపెనీలు వచ్చేవి. "సత్యహరిశ్చంద్ర" – "శ్రీకృష్ణ లీలలు," "పాండవ ఉద్యోగ విజయాలు", "కురుక్షేత్రం" వేసేవి. అవి ఆడినన్నాళ్లూ ప్రజల నాలుకలమీద పద్యాలు నాట్యమాడేవి. తిరుపతి వేంకట కవులు పద్యాన్ని ప్రజాయత్తం చేశారు!

నాటకం యాంత్రికకళ కాదు. అది సజీవ కళారూపం. సామాన్యుడు స్టేజీమీద తన వేషంలో జీవించడాన్ని చూడడం ఒక అద్భుత అనుభవం. స్టేజీమీది నటనకు స్టేజి కిందివారి స్పందన – ఈలలు – 'వన్స్ మోర్'లు, స్టేజీమీది వారి ప్రతిస్పందన – ఆ ఆనందంలో మళ్లీ పాడడం, అదంతా ఒక అద్భుతస్పందన!

తోలుబొమ్మలు – పగటివేషాలు – దొమ్మరిఆటలు – హరికథలు – కాలక్షేపాలు – అరుదుగా పాటకచేరీలు – వగైరాలు వినోదాలు

ఒకసారి ఆంధ్ర వాల్మీకి వావిలికొలను సుబ్బారావుగారు వచ్చారు. వారి గడ్డం – కళ్లలో మెరుపు ఆకర్షణీయంగా ఉండేవి. వారు మంధరం వ్రాస్తున్నారు! వారి చుట్టూ జనం! వారి రామాయణ ప్రవచనం పటికిబెల్లం, "రామకోటి" వ్రాయించడం వారే ప్రారంభించారనుకుంటా!

## తొమ్మిది

### "సత్యానురూపం ఫలం":

1938 హైదరాబాదు రాజ్య చరిత్రలో ఉజ్వల సంవత్సరం. ఆ సంవత్సరం రాజ్యంలో రాజకీయపార్టీ స్థాపనకు ప్రయత్నాలు జరిగాయి. నిరంకుశ నవాబు పార్టీ ఏర్పడకముందే నిషేధించాడు! ఇది చరిత్ర ఎరుగని విచిత్రం!! ఏర్పడనున్న పార్టీని నిషేధించడం అంటే, పుట్టక ముందే మరణ శిక్ష విధించడం!!! నిజాముకు జనం – సంఘం – పార్టీ – చదువు అంటే బెదురు. అవి తనను కూలదోస్తాయని బెదురు. అయితే, అతను బెదిరినట్లుగానే జరిగింది. జనం అతని అధికారానికి గోలగొండ కిల్ల కింద గోరీ కట్టారు.

1937–38 భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో కూడా ప్రభావాత్మకం అయిన సంవత్సరాలు. భారత ప్రభుత్వ శాసనం, 1935 ప్రకారం బ్రిటిషిండియాలోని రాష్ట్రాల అధికారం ప్రజలకు అప్పగించడం జరిగింది. 1937లో ఎన్నికలు జరిగాయి. మొత్తం 1585 సీట్లల్లో కాంగ్రెసు 715 సీట్లు గెలుచుకుంది. మద్రాసు – బొంబాయి – సంయుక్త పరగణాలు – మధ్య పరగణాలు – బీహార్ – ఒరిస్సాలలో మెజారిటీ

స్థానాలు సాధించి, ప్రభుత్వాలు ఏర్పరిచింది. అస్సాంలో 108కి 35, సరిహద్దు ప్రాంతాల్లో 36కు 15, బెంగాల్లో 250కి 60, పంజాబులో 175కు 18, సింధులో 60కి 8 సీట్లు వచ్చాయి.

ఈ ఎన్నికల్లో మత – మిత పార్టీలు ఓటమి చవిచూడ్డం విశేషం. కాంగ్రెసును ఎదిరించిన లిబరల్ మితపక్షం స్వరాజ్య పార్టీ మితపక్షం, చెరిగిపోయాయి. హిందూ మహాసభ విఫలం అయింది. జిన్నా ముస్లింలీగుకు బెంగాల్లో కొంత విజయం కలిగింది. అయితే, ముస్లిములు అధికంగా ఉన్న రాష్ట్రాల్లో నాలుగు శాతం ఓట్లు మాత్రమే లభించాయి.

గమనించవలసిందేమంటే – బ్రిటిషిండియాలోని ప్రముఖ రాష్ట్రాల్లో, ప్రభుత్వం చేస్తున్న కాంగ్రెస్ పేర – హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఏర్పడడానికి జన్మ జన్మాల బూజు, నిజాం రాజు సహించలేకపోయాడు.

బ్రిటిషిండియాలో సాగుతుండిన స్వాతంత్ర్య పోరాటస్ఫూర్తి దేశీయ సంస్థానాల్లో కూడా కనిపించింది. మైసూరు – తిరువాన్కూరు – రాజకోట్ సంస్థానాల్లో ప్రజా ఉద్యమాలు పెల్లుబికాయి.

భారత స్వాతంత్ర్య పోరాట ప్రభాకరుని కాంతిని అరచేతితో అడ్డడానికి ప్రయత్నించిన నిజాం ముష్కరుని ప్రయత్నం ఫలించలేదు.

బ్రిటిషిండియాలో వెలిగిన చైతన్య జ్వాల నిజాంరాజ్యపు హద్దులను దాటి ప్రజల్లో ప్రవేశించింది. వుజం రాజ్యంలో తొలి రాజకీయపార్టీ – హైదాబాదు స్టేట్ కాంగ్రెస్ – స్థాపనకు ప్రయత్నాలు జరిగాయి.

29 జనవరి 1938నాడు హైద్రాబాదు స్టేట్ కాంగ్రెస్ ఏర్పాటు చేయాలనే నిర్ణయం జరిగింది. ఒక తాత్కాలిక కమిటీని ఏర్పాటుచేసి, సభ్యులను చేర్పించడం వంటి ప్రాథమిక కార్యక్రమం అప్పగించారు. తాత్కాలిక కమిటీ వారు – మతాలతో సంబంధం లేని – రాజకీయ పార్టీ అవశ్యకతను వివరిస్తూ ఒక అప్పీలు విడుదల చేశారు. అందులో నవాబు ఆగ్రహానికి గురికాకుండే పదజాలాన్ని ఉపయోగించారు. నిజాం ప్రభువులకు విశ్వాస పాత్రులం అనే శపథం చేశారు. మతాలతో సంబంధం లేదని ఘంటాపథంగా చెప్పారు. తమ పార్టీకి రాజ్యానికి బయటి ఏ పార్టీతోనూ సంబంధం లేదని ప్రకటించారు.

తాత్కాలిక కమిటీ అప్పీలు అద్భుతంగా పని చేసింది. ఎంతకాలంగానో ఇలాంటి విన్నపానికి ఎదురు చూస్తున్నట్లు ప్రజలు ప్రతిస్పందించారు. ఒక్క నెలలో స్వచ్ఛందంగా 1200 మంది సభ్యులు అయ్యారు. దుష్టనిజాం రాజ్యపు ప్రమాణాలకు ఇది అశ్చర్యకర సంఖ్య!

ప్రజల నుంచి లభించిన ఈ ఉత్సాహాన్ని – ప్రోత్సాహాన్ని చూచిన నిర్వాహకులు 9 సెప్టెంబరు 1938న సర్వసభ్య సభ జరిపి నియమావళిని రూపొందించడం – కార్యవర్గాన్ని ఎన్నుకోవడం జరగాలని నిశ్చయించారు.

నిర్వాహకుల ఈ నిశ్చయం మాత్రమే నిజామును నిద్రాహీనం చేసింది. అతడు ఉలికిపడ్డాడు. ప్రజలు తనను ముట్టడిస్తున్నట్లు కలలు గన్నాడు. తాను పట్టుకున్న

సింహాసనాన్ని గుంజుకుపోతున్నట్లు కలవరించాడు. ఏడు తరాల అసఫ్జాహీ వంశం అంతరిస్తున్నట్లు అరాటపడ్డాడు.

నిజాం రాజు – తొమ్మిదిన కావలసిన సభను నిషేధిస్తూ రెండు రోజులముందు – 7–9–1938 ఫర్మానాను జారీ చేశాడు. అందులో చూపిన కారణాలు ఏమంటే –

1. పైకి ప్రజాసంస్థగా కనిపించినా ఇది మత విద్వేషం చెలరేపటానికి ఏర్పడుతున్న పార్టీ.
2. వేషానికి సౌమ్యంగా కనిపించినా ఇది ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్రోహం ప్రేరేపించే పార్టీ.
3. ఈ పార్టీ తన ఉనికిని కాపాడుకోవడానికి "కాంగ్రెస్" అనే పేరును వాడుకోవాలనుకుంటున్నది.

ఫర్మానుదారి ఫర్మానుది. పోలీసులు తమ బలప్రయోగం చేశారు. పోలీస్ కొత్వాలు తాత్కాలిక కమిటీ ప్రముఖ సభ్యుణ్ణి పిలిపించాడు. అతని ఇంట్లోనే సభ జరగాల్సింది. సభ జరిగినా – వాళ్ల ఇంట్లో జరిగినా – అతని ఇల్లు జప్తు చేస్తామని బెదిరించాడు. అలాంటి ఉత్తరు వేదీ లేదు. అది నోటి మాటే కాని, నిజాం రాజ్యంలో వ్రాత పూతలుండవు. నోటిమాటకే తలలు ఎగిరిపోతాయి! అంతేకాదు, అవి కొత్వాలు మాటలు మాత్రం కావు, అవి హుంజూర్ అనిపించిన ఆజ్ఞలు!

ఆ ప్రముఖ సభ్యుడు ప్రభువు ఆగ్రహాన్ని కమిటీకి తెలియపరచాడు. కమిటీ – మర్యాద దక్కించుకోవడానికి – సర్వసభ్య సమావేశాలను నిరవధికంగా వాయిదా వేసింది!

పుట్టని కాంగ్రెసును నిషేధించిన వారానికి గాంధీజీ 'హరిజన్' పత్రికలో ఇలా వ్రాశారు:

"సర్ అక్బర్ హైదరీ విద్యావేత్త, తాత్వికుడు పుట్టని సంస్థను ఖండించే ప్రకటనకు అతడు కారకుడు కావడం విచారం. మతరీత్యా ఒక ప్రజ అత్యధికంగా ఉన్న రాజ్యంలో మతతత్వం అంటే అర్థం ఏమిటి?"

సర్ అక్బర్ హైదరీ ఆనాటి నిజాం రాజ్యపు ప్రధాని.

జనరల్ బాడీ సమావేశపు తేదీ మాత్రమే నిర్ణయించగా ఏర్పడనున్న సంస్థను నిషేధించడం నిర్వాహకులకు – సంస్థకు – ప్రజలకు అవమానం అనిపించింది. తాత్కాలిక కమిటీవారు కరుణించవలసిందని ప్రభువు వారికి అనేక విన్నపాలు చేశారు. కాని, వీరి శంఖం నిజాం చెవిటికి వినిపించనే లేదు.

తాత్కాలిక కమిటీ సభ్యుల్లో ఒకరయిన మందుముల నరసింగరావుగారు స్వయంగా ప్రభుత్వంతో మంతనాలు జరిపారు. వారి మిత్రుడు అలీయావర్ జంగ్ ఖాన్ అప్పటి ప్రభుత్వ సెక్రటరీ ఉభయులకూ ఎడతెగని చర్చలు జరిగాయి. ఒక దశలో సంస్థ పేరునుంచి "కాంగ్రెస్" తొలగించడానికి సహితం నిర్వాహకులు అంగీకరించారు. బాధ్యతాయుత ప్రభుత్వ నినాదం వదులుకోవాలని ప్రభుత్వం పట్టుపట్టింది. కాంగ్రెస్ వారు అంగీకరించలేదు. ప్రభుత్వం నిషేధం తొలగించలేదు. చర్చలు విఫలం అయినాయి.

కాంగ్రెసువారు ప్రభుత్వపు దమన నీతిని ఎదిరించడానికి నిర్ణయించారు. ఒక నెల తరువాత ప్రొవిజనల్ కమిటీని రద్దు చేసి ఆక్షన్ కమిటీ ఏర్పరచారు. కార్యాచరణ సమితివారు ప్రభుత్వాన్ని సత్యాగ్రహం ద్వారా ఎదిరించాలని నిర్ణయించారు. తొలి బృందంలో 1. రావి నారాయణరెడ్డి, 2. బూర్గుల రామకృష్ణరావు, 3. కాశీనాథరావు వైద్య, 4. జనార్దనరావు దేశాయ్, 5. సిరాజుల్ హసన్ తిరంజీ, 6. రామకృష్ణధూత్, 7. గోవిందరావు నానల్‌ను పంపడానికి నిశ్చయించారు.

వయోవృద్ధుడు గోవిందరావు నానల్‌ను తొలి కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నుకున్నారు.

చివరి నిముషంలో కుటుంబ కారణాల వల్ల సిరాజుల్ హసన్ తిరంజీ విరమించుకున్నారు.

24 అక్టోబర్ 1938న గోవిందరావు నానల్ నాయకత్వాన అయిదుగురు సత్యాగ్రహుల బృందం – వేలమంది ప్రజల ఎదుట అరెస్టయింది.

రామానంద తీర్థ డిక్టేటర్‌గా మరొక బృందం సత్యాగ్రహం చేసింది. ఈ బృందంలో వందల మంది పాల్గొన్నారు. త్రివర్ణ పతాకాలు రెపరెపలాడగా – వందేమాతరం నినాదాలు ప్రతిధ్వనించగా అశేష ప్రజానీకంముందు సత్యాగ్రహులు అరెస్టయ్యారు.

"యువకులారా! నిరంకుశత్వాన్ని ఎదిరించడం భగవదారాధనతో సమానం. ఈ జ్వాలను ఆరనివ్వద్దు. మేము తరలినంతమాత్రాన ఈ పని ఆగరాదు" అని రామానంద తీర్థ ఆవేశపూరితమైన ఉపన్యాసం ఇచ్చారు.

అది విస్ఫారవ్వలా పని చేసింది. జనం చేసిన వందేమాతరం నినాదంతో దిక్కులు పిక్కటిల్లాయి. నిజాం పోలీసు – తొలిసారి – ప్రజా సందోహంమీద విరుచుకు పడక, మిన్నకున్నది!

ఇది ప్రజల్లో చైతన్యాన్నీ – ప్రభుత్వానికి నిరాశనూ కలిగించాయి.

రాజ్యం నలుమూలలనుండీ ప్రతిరోజూ సత్యాగ్రహులు అరెస్టు కావడం ప్రారంభం అయింది. ప్రభుత్వం బెంబేలెత్తుతున్న సమయంలో ఆర్యసమాజం – హిందూమహాసభ వారి చర్య నిజాం ప్రభుత్వానికి తోడ్పడింది.

జరిగిందేమంటే కాంగ్రెస్ సత్యాగ్రహం ఊపందుకొంటున్న వేళ ఆర్యసమాజం – హిందూమహాసభ కూడా సత్యాగ్రహానికి పూనుకున్నాయి. వారు సత్యాగ్రహులను బయటనుంచి తెచ్చారు. ఆ విధంగా చేసి – ప్రభుత్వం దీనికి మతపు రంగు పులుమడానికి అవకాశం కలిగించారు.

హైదరాబాదు రాజకీయాలు అంటరానివిగా భావించిన హైదరాబాదు నివాసి – జాతీయ నాయకురాలు సరోజినీ నాయుడుకు ప్రధాని సర్ అక్బర్ హైదరీతో సన్నిహిత పరిచయాలున్నాయి. ప్రధాని ఆ పరిచయాలను వాడుకున్నారు. సరోజినీదేవి ద్వారా గాంధీజీకి సత్యాగ్రహం మతపరమవుతున్న విషయం తెలియపరచారు. సహజంగా మతపర ఉద్యమాన్ని మహాత్ముడు సహించరు. అదీకాక సాక్షాత్తు సరోజినీదేవి తెలియపరచడం దానికి మరింత బలం చేకూరింది. అదీకాక అక్బర్ హైదరీకి మహాత్మునితో పరిచయాలున్నాయి.

వీటిని అన్నింటినీ దృష్టిలో ఉంచుకొని మహాత్ముడు కాంగ్రెస్ నాయకులను

వార్తాకు పిలిపించారు. సత్యాగ్రహం మతపరం కావడాన్ని సహించని మహాత్ముడు హైదరాబాదులో సత్యాగ్రహం విరమించవలసిందిగా ఆదేశించారు!

మహాత్ముని ఆదేశానుసారం 24 డిసెంబరు 1938న సత్యాగ్రహం విరమించడం జరిగింది.

"గాంధీజీ ఆదేశం యువకులమైన మాకేమాత్రం నచ్చలేదు. సత్యాగ్రహాన్ని మేము విరమిస్తే, అస్త్రసన్యాసం చేసి ఉద్యమాన్ని మతతత్వవాదుల చేతపెట్టినట్లవుతుందని మేమంతా అభిప్రాయపడ్డాము. కానీ గాంధీజీ ఆదేశాన్ని ఎదిరించే ధైర్యం ఆ రోజుల్లో ఎవరికున్నది?" అన్నారు రావి నారాయణరెడ్డిగారు.

మహాత్మునిమీద అచంచల విశ్వాసంగలవాళ్లలో నేనొకణ్ణి. అయితే వాల్మీకి అన్నట్లు "న కశ్చిన్నాపరాధ్యతి?" – తప్పు చేయనివాడెవడు? మహాత్ముడే తాను హిమాలయం అంత తప్పు చేశానని అంగీకరించారు.

నావరకు సత్యాగ్రహం విరమింప చేయడంలో గాంధీజీ నిజాం ప్రభుత్వ కుట్రను గమనించలేకపోయారని అనిపిస్తుంది. అది వాస్తవం కాకపోవచ్చు. కాని, ఎదుగుతున్న పోరాటాన్ని నిలిపినందుకు అలా అనిపిస్తుంది. చౌరా చౌరీ ఉదంతం తరువాత మహాత్ముడు సరిగ్గా ఇలాగే ఉద్యమం విరమించారు. అప్పుడు మోతీలాల్ నెహ్రూ చాల కటువుగా మహాత్మునికి వ్రాశారు.

**ఇది పోరాటం నిలిచిపోయిందని బాధ మాత్రమే! మహాత్ముని నిర్ణయాన్ని సంశయించడం – శంకించడం మాత్రం కాదు. మహాత్ముని వంటివారు ధరిత్రిమీద అరుదుగా అవతరిస్తారు.**

స్టేట్ కాంగ్రెస్ నిషేధం విషయంలో మహాత్మునికీ అక్బర్ హైదరీకి సుదీర్ఘం అయిన పత్రవ్యవహారం జరిగింది. కాంగ్రెస్‌మీద నిషేధం తొలగలేదు. కాని, కాంగ్రెస్ సత్యాగ్రహులను 10 ఏప్రెల్ 1939లో బేషరతుగా విడుదల చేయడం జరిగింది.

ఇది నిజాం రాజ్యంలో తొలి రాజకీయపోరాటం.

## వందేమాతరం:

బ్రిటిషువారు భారతదేశంలో కలకత్తాను రాజధానిగా చేసుకున్నారు. పాశ్చాత్యుల ఉదారవాద విధానంవల్ల సంస్కారవాదం, ప్రజాస్వామ్యం, విప్లవవాదం తొలిసారిగా బెంగాల్లో మొదలయినాయి. ఉద్యమాలు సాగాయి.

స్వాతంత్ర్యకాంక్ష బెంగాలు రచయితల్లోకూడా పెల్లుబికింది. బంకించంద్ర చటోపాధ్యాయ "ఆనందమఠం" అనే నవల వ్రాశాడు. అందులో "వందేమాతరం" గీతం ఉంది. దాని అర్థం మాతృభూమికి వందనం మాత్రమే! కాని, అది దేశభక్తి చిహ్నంగా – చైతన్యానికి గుర్తుగా – విప్లవానికి సంకేతంగా పరిణమించింది. వందేమాతరం ఆధారంగా ఈ శతాబ్దపు ఆదిలో అనేక విప్లవోద్యమాలు రగులుకున్నాయి.

"వందేమాతరం" బ్రిటిషు ప్రభుత్వపు గుండెల్లో తుపాకులు పేల్చింది. "వందే మాతరం" బ్రిటిషు ప్రభుత్వ వ్యతిరేక నినాదం అయింది. "వందేమాతరం" స్వేచ్ఛకు సంకేతం – స్వాతంత్ర్య పోరాట నినాదం అయింది. ఆంగ్లప్రభుత్వం "వందేమాతరం" అర్పడానికి తన పశుబలాన్ని సాంతం ప్రయోగించింది. అప్పుడు వందేమాతరం

దవానలం అయింది. బడ బానలం అయింది. మహాశివుని ముక్కంటి మంట అయింది!

1939లో "వందేమాతరం" చిచ్చు ఉస్మానియా యూనివర్సిటీలో అంటుకుంది. అంతకుముందు విద్యార్థులు తమ తమ గదుల్లో వందేమాతరం పఠించారు. అది ప్రభుత్వ దృష్టికి రాలేదు. తరువాత విద్యార్థులు హాస్టలులో ఉమ్మడిగా వందేమాతరం ఆలపించారు. ఒక్కరోజు కాదు, ప్రతిరోజూ ప్రార్థనలు చేశారు.

"వందేమాతరం" నిజాం గుండెల్లో పిడుగుల వర్షం కురిపించింది. "వందేమాతరం" ప్రార్థించరాదని ఉత్తరువు జారీ అయింది. ఆ ఉత్తరువు విద్యార్థులలో చిచ్చు రగిలించింది. వారు మరింత దృఢనిశ్చయంతో ప్రార్థనలు జరిపారు. ప్రార్థన సమయంలోనే కాదు, వందేమాతరం సర్వత్ర నినాదం అయింది.

వందేమాతరం జామే ఉస్మానియానుంచి నగరంలో ఇతర విద్యాలయాలకు పాకింది. నగరంలోని విద్యాలయాలన్నీ వందేమాతరంతో ప్రతిధ్వనించాయి. ఈ ఉద్యమం క్రమంగా రాజ్యమంతటికీ పాకింది. ప్రతి విద్యార్థి నోటా వందేమాతర మంత్ర జపం వినిపించింది.

నిజాం బిత్తరపోయాడు. తనను చుట్టుకున్న అగ్నిని ఆర్పడానికి సర్వశక్తులు వినియోగించాడు. హాస్టలు విద్యార్థులను ఖాళీ చేయమని ఫర్మాను విసిరాడు. విద్యార్థులు వినలేదు. హాస్టళ్లను వదలలేదు. మరింత ఆవేశంతో - ఉత్సాహంతో - ఉద్రేకంగా వందేమాతరం చదివి, ఉస్మానియా రాతిగోడలను గడగడలాడించారు.

నిజాంలో వందేమాతరం ఉద్యమవార్త భారతదేశంలో కార్చిచ్చులా పాకింది. గాంధీజీ స్పందించారు. వందేమాతరం చదివేహక్కు విద్యార్థులకు ఉంది" అన్నారు. లొంగకండి. పోరాటం కొనసాగించండి. ప్రభుత్వమే లొంగి వస్తుంది అన్నాడు సుభాస్‌చంద్ర బోస్. సావర్కార్ - నెహ్రూ ఉద్యమాన్ని బలపరచారు.

నిజాం ఉస్మానియాకు సాయుధ దళాలను రప్పించాడు. విద్యార్థులు వారిముందే 'వందేమాతరం' ఆలపించారు. ప్రభుత్వానికి తోచలేదు. విశ్వవిద్యాలయం సహితంగా విద్యాసంస్థలన్నింటిని రాజ్యవ్యాప్తంగా మూసివేయించింది.

ఉస్మానియా విద్యార్థులు కేంపస్ వదలలేదు. నినాదాలు మానలేదు. మరింత ఉత్సాహంతో ఉద్యమం సాగించారు. 'క్షమాపణ చెప్పండి. లేకుంటే తొలగిస్తాం' అని ప్రభుత్వం ప్రకటించింది. తల్లిదండ్రులు బలవంతంవల్ల ఏ కొద్దిమందో తప్ప క్షమార్పణలు చెప్పలేదు.

నిజాం రాజు నిషేధాస్త్రం ప్రయోగించాడు. పన్నెండు వందలమంది విద్యార్థులను యూనివర్సిటీనుంచి తొలగించాడు. తొలగించిన విద్యార్థులు అడ్మిషన్లకోసం ఇతర యూనివర్సిటీలకు ఉరికారు. దానితో నిజాం రాజ్యంలో అప్పటికా ఉద్యమం చల్లారింది అనలేం - నివురు కప్పింది.

రెండోసారి ఆంధ్రవిశ్వవిద్యాలయం నిజామాంధ్రులకు సహాయం నిరాకరించింది. మొదటిసారి మహిళా విద్యార్థినులకు మెట్రిక్యులేషను అడ్మిషను నిరాకరించింది. ఇప్పుడు ఉస్మానియా బహిష్కరించిన విద్యార్థులను చేర్చుకోవడానికి నిరాకరించింది.

నిజాం రాజు సి. ఆర్. రెడ్డిగారికి - ఆంధ్ర విశ్వవిద్యాలయం కొరకు లక్ష

రూపాయలు విరాళం ఇచ్చాడని ఆంధ్రపితామహులు నాతోనూ మరికొందరితోనూ – వ్యధగా వ్యక్తీకరించారు.

ఉస్మానియా బహిష్కరించిన విద్యార్థులకు నాగపూర్ విశ్వవిద్యాలయం స్థానం కల్పించింది.

నాగపూరు విశ్వవిద్యాలయ స్ఫూర్తితో ఆ విద్యార్థులలో కొందరు తరువాత జరిగిన నిజాం వ్యతిరేక సమరంలో ప్రధాన పాత్ర నిర్వహించారు. వారిలో పి. వి. నరసింహారావుగారు ఒకరు.

వందేమాతర ఉద్యమ స్ఫూర్తి ఖమ్మానికీ పాకింది. మమ్ములను మిన్నకుండ నీయలేదు. అంతకుముందునుంచే ఉర్దూ ప్రార్థన చదవడానికి వ్యతిరేకంగా ఉన్నాం. అందుకు కారణం ఆర్యసమాజం.

1875లో స్వామి దయానంద ఆర్యసమాజం స్థాపించారు. సమాజం విగ్రహారాధనను వ్యతిరేకించింది. వేదంలోనే సర్వం ఉందనీ – దాన్ని అనుసరించాలని బోధించింది. ఆర్యసమాజం హిందూమత సంస్కరణకు, పునరుజ్జీవనానికి ప్రాధాన్యతను ఇచ్చిన సంస్థ. బ్రిటిషిండియాలో ఆర్యసమాజం రాజకీయ శక్తిగా ఎదగలేదు.

నిజాం రాజ్యంలో ఆర్యసమాజం తొలి రాజకీయ శక్తిగా రూపొందింది. ఇందుకు కారణం తేటతెల్లం. మెజారిటీ హిందువులున్న రాజ్యాన్ని ఇస్లాం రాజ్యంగా మార్చడానికి దృఢసంకల్పుడయిన కరకు తురక నిజాం ఇందుకు కారకుడు!

1938కి పూర్వం నిజాం ముస్లిం పక్షపాత విధానాలను వ్యతిరేకించిన ఏకైక సంస్థ ఆర్యసమాజం. నిజాం ప్రభుత్వం ఆర్యసమాజ కార్యకర్తలను నిర్బంధించింది. వేద్‌ప్రకాశ్ వంటివారిని హతమార్చింది.

నిజాం ప్రభుత్వపు 'తబ్లీగ్' మత మార్పిడిని తమ శుద్ధి ఉద్యమం ద్వారా ఎదుర్కొన్నది ఆర్యసమాజం. బహదుర్ యార్‌జంగ్ ఇస్లాం మతానికి మార్చిన అనేకమందిని 'శుద్ధి' ఉద్యమం ద్వారా నరేందర్‌జీ హిందువులను చేశారు. ఆ విధానాన్ని నా నవల "చిల్లరదేవుళ్లు"లో వివరించాను. వాస్తవానికి హవనం చేసి, తిరిగి హిందూమతంలో చేర్చుకోవాలి. కాని, నరేందర్‌జీకి గ్రామాల్లో అంత సహకారం లభించేది కాదు. అందువల్ల తమ వెంట తెచ్చిన జలాన్ని గంగాజలం అని వారిమీద చల్లి మళ్లీ హిందువులను చేసేవారు.

"హమారేపూరే కోషిషోఁ పర్ గిడ్డా పానీ ఫేర్నా రహాహై" అని బహదూర్‌యార్ జంగ్ నిజాం నవాబుకు మొర పెట్టుకున్నాడని నరేందర్‌జీ నాతో స్వయంగా చెప్పారు. మన ప్రయత్నాలన్నింటిని పొట్టివాడు నీట ముంచుతున్నాడు అని దాని అర్థం.

"పొట్టివాడు" అంటే నరేందర్‌జీ, 'పానీ ఫేర్నా', అనే ముహావిరా – జాతీయం – చక్కగా అతికింది.

"పానీ ఫేర్నా" అంటే నీరు చల్లటం – నీట ముంచడం రెండూ అవుతాయి. నరేందర్ జనంమీద నీరు చల్లి సర్కారును నీటముంచుతున్నారు అని బహద్దూర్ మొర!

1938 సత్యాగ్రహంలో అరెస్టయిన సత్యాగ్రహుల్లో కాంగ్రెస్ వారు 400 కాగా ఆర్యసమాజంవారు 7,500. అయితే, వీరిలో ఎక్కువమంది బయటిప్రాంతాలనుంచి – జయపూర్, గ్వాలియర్, రావల్పిండినుంచి వచ్చినవాళ్లు.

నిజాం రాజ్యంలో ఆనాటి అన్ని రాజకీయ పోరాటాల నాయకులు - ఎక్కువమంది - **తొలుత** ఆర్యసమాజంతో ప్రభావితులు అయినవారే!

గుంటిమల్లన్న బజారులో మా ఇంటి ఎదురు వరుస చివరలో ఆర్యసమాజపు కార్యాలయం అనడానికి వీల్లేదు - గృహం ఉండేది. అక్కడ రోజూ హవనం జరిగేది. కేశవదేవ్‌గారు హిందూమతానికి జరుగుతున్న ద్రోహాలను గురించి వివరించేవారు. కొన్ని పత్రికలు - పుస్తకాలు ఉండేవి.

మా అన్నయ్యా, నేను తరచుగా అక్కడికి వెళ్లేవాళ్లం. పండిత కేశవదేవ్ ఉపన్యాసాలు మమ్ములను ప్రభావితులను చేశాయి. పరిస్థితులు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

గుంటిమల్లన్న సత్రంలో "పాండురంగ భక్తసమాజం" ఉండేది. వాళ్లు చేసేవి భజనలే అయినా, నాకు ఏదో ఆవేశం - సందేశం వినిపించేది. వారు అప్పుడప్పుడు నాటకాలు వేసేవాళ్లు. నేనూ ఒక చిన్న వేషం వేసినట్లు గుర్తు.

వీటన్నింటివల్ల వాస్తవంగా ఒక మతం విషయంలో మనసులో బద్ధవ్యతిరేకత ఏర్పడింది. మత ఉద్యమాలు ప్రజా ఉద్యమాలు కావని తరవాత కాలంలో గ్రహించాం. అప్పుడు అర్థం అయిందేమంటే - ఆర్యసమాజం స్వమత అభిమానంకంటే పరమత ద్వేషం ఎక్కువ నేర్పింది.

**కొంత పరిపక్వత వచ్చిన ఈనాడు స్పష్టం అయిందేమంటే - ద్వేషం ఆధారంగా ఏ ఉద్యమమూ నెరవేరడం దుస్సాధ్యం అని.**

ఈ మత వ్యతిరేకత వల్ల స్కూల్లో చదివే ఉర్దూ ప్రార్థన వ్యతిరేకించాలనే అభిప్రాయం ఏర్పడింది. నేను 'తాబిశ్ ఖాలిక్' చదివేవాణ్ణి కాదు. అంతమందిలో నన్ను ఎవరూ గమనించేవారు కాదు. క్రమంగా అలా చదవడం మానేసినవాళ్లం కొంతమందిమి చేరాం.

అలా కొంతకాలం జరిగింది. ఒకనాడు మేం రామాలయంలో కూడాం. దాన్ని సమావేశం అనలేం. అది రహస్యంగా జరిగింది. అందులో నిర్ణయించిందేమంటే - ప్రార్థన చదవకుండా ఉండడంతో సరిపోదు; అందరూ ఉర్దూ చదివేప్పుడు వందేమాతరం గొణగాలి.

అలా కొంతకాలం సాగింది. అప్పుడు ఉస్మానియాలో వందేమాతరం ఉద్యమం వచ్చింది. అది విద్యార్థులను ఉత్తేజపరిచింది. మాతో అనేకమంది కలిశారు. అయితే అందరూ గొణగడమేగాని ఎవరూ పైకి చదవలేదు. సంఖ్య ఎక్కువ అయింది. రహస్యం బయటపడింది. ఉద్యమ ప్రభావంకూడా కావచ్చు - ముద్రిసులు కనిపెట్టారు. అది సదర్ ముద్రిస్ - హెడ్‌మాస్టరుదాకా పోయింది.

సదర్ ముద్రిస్ ఒకనాడు తన ఇజ్లాస్ - ఆఫీసుకు పిలిపించాడు. "తుమ్ గద్దార్‌హో" - నీవు రాజద్రోహివి అని పేం బెత్తంతో విపరీతంగా కొట్టాడు. "పహెలా జుర్మ్ హై - మాఫ్ కర్తాహూ c, ఫిర్‌హువాతో ఖారిజ్ కరూఁగా" తొలినేరం క్షమిస్తున్నాను. మళ్ళీ జరుగుతే బహిష్కరిస్తాను అని బెదిరించి పంపించాడు.

నాకు ఇవ్వాల్టికీ ఆశ్చర్యం కలిగించేదేమంటే, పదకొండేళ్లవాణ్ణి అన్ని దెబ్బలుతిన్నా ఏడవలేదు, బెదరలేదు!

ఇంటికి చేరుకుంటే నాయన చింత బరికెతో సిద్ధంగా ఉన్నారు. బెబ్బలిలా నామీద పడ్డారు. నాయనమ్మ సహితంగా ఎవరు అడ్డంవచ్చినా ఆగలేదు. నేను ఏడ్చినా, మొత్తుకున్నా వినలేదు. చింత బరికె విరుగుతే అవతల పారేశారు!

నాయన కొట్టిన దెబ్బలకు వంటినిండా దద్దులయి, జ్వరం వచ్చింది; తగ్గింది. ఆర్యసమాజపు ఛాయలకు వెళ్లవద్దని నాయన హెచ్చరించారు.

జ్వరం తగ్గింతరువాత మదర్సకు వెళ్లాను. అంతా ముక్తకంఠంగా "తాబిదఖాలిఖె ఆలం" చదువుతున్నారు. నేను చదవలేదు. వందేమాతరం గొణగలేదు. రామాలయం మీటింగులు బంద్! ఒక్కడూ అటు తొక్కలేదు!

1940లో కాంగ్రెసువారు వ్యక్తిసత్యాగ్రహానికి పిలుపు ఇచ్చారు. 11-9-1940 రాత్రి 10.30 కు స్వామి రామానంద తీర్థను అరెస్టు చేసి, నిజామాబాదు జేలుకు పంపించారు. ఆ తరువాత గోవిందాస్ ష్రాఫ్‌యుక్తంగా అనేకమందిని ఔరంగాబాదులో అరెస్టు చేశారు. సుమారు రెండేళ్ల నిర్బంధం తరువాత విడుదల చేశారు.

## కుచ్చుటోపీ సమ్మె:

1940లో అనుకుంటా - నిజాం నవాబు ఒక ఫర్మాను ద్వారా విద్యార్థులకు యూనిఫాం ఆజ్ఞాపించాడు. విద్యార్థులందరూ విధిగా చుడీదార్ పైజామా - నీలం లేక నలుపు షేర్వాణీ - కుచ్చుటోపీ ధరించాలి. ఇది పూర్తిగా ముస్లిముల వేషం అని మేము అభిప్రాయపడ్డాం. ముస్లిముల వేషాన్ని హిందువుల మీద రుద్దుతున్నారు అనుకున్నాం. అది చాలవరకు వాస్తవం కూడా. దాన్ని వ్యతిరేకించాలి అని నిర్ణయించాం.

మళ్లీ చాటుమాటు సమావేశాలు! బయటికి పొక్కరాదు. ప్రచారం చేయరాదు. ఇవ్వాళ జరిగినచోట మళ్లీ సమావేశం జరపరాదు. ఇండ్లల్లో ఎవరూ మీటింగు పెట్టనివ్వరు! రామాలయంలో ఒకసారి, గుంటిమల్లన్న గుడిలో ఒకసారి - ఏటిదగ్గర ఒకసారి, నరసింహస్వామి గుట్టమీద ఒకసారీ సమావేశం అయినాం. సమ్మె చేయాలని నిర్ణయించాం.

చుడీదార్ పైజామా, షేర్వాణీ విషయంలో అభ్యంతరం లేదు. నెహ్రూగారు ఆ బట్టలే వేసుకుంటారు! కుచ్చుటోపీ పెట్టుకోం. వేరే టోపీ పెట్టుకుంటాం. వేరే టోపీ అనుమతించేదాకా సమ్మె చేస్తాం. ఈ విషయం విద్యార్థుల్లో రహస్యంగా ప్రచారం చేశాం. చాలమంది సమ్మెకు అనుకూలంగా ఉన్నట్లు అనిపించింది. సమ్మెతేదీ నిర్ణయించాం.

తెల్లవారితే సమ్మె అనగా ఆ రాత్రి ఈ విషయాలన్నీ బ్లాక్‌బోర్డుమీద వ్రాసి పెట్టాం. భయం భయంగా ఏం జరుగుతుందో అని చూచాం.

సమ్మెరోజు దూరం దూరంగా నుంచున్నాం. స్కూలుముందు నుంచోవడంతో - పిల్లలను వెళ్లవద్దని హెచ్చరించడం సాధ్యపడదు. అయినా, విద్యార్థులు అయిక్యంగా నిలిచారు.. తురకపిల్లలు - ఒకళ్లిద్దరు ఇతరులు తప్ప, స్కూలుకు రాలేదు. ప్రార్థనలో అతి కొద్దిమంది విద్యార్థులు కనిపించారు. క్లాసులు ఖాళీ. గంటలు మాత్రం కొడ్తున్నారు.

అలా జరగడం అదే తొలిసారి. ముద్రిసులు – ఉపాధ్యాయులు దిక్కు దిక్కుమంటున్నారు. సర్కారు ఏమంటుందో? ఏం చేస్తుందో అని సదర్ ముద్రిస్ గడగడలాడాడు. ఎడారిగా మారిన పాఠశాలలో పాపం, పంతుళ్లు గజగజలాడుతున్నారు!

ఆ సాయంకాలం మామిళ్లగూడెంలోని ప్లేగ్రౌండులో జరిగిన మీటింగుకు విద్యార్థులు తండోపతండాలుగా వచ్చారు. అక్కడక్కడా పోలీసులు కనిపించారు. అయినా అంతమందిమి కూడాం కదా – భయం మాయం అయింది.

మాట్లాడిన నలుగురం ఆవేశంగా – ఘాటుగా – ఉద్రేకంగా మాట్లాడాం. అందరూ విద్యార్థులే. విద్యార్థులు తప్ప ఎవరూ లేరు. అలా మూడు రోజులు సమ్మె జరిగింది. మూడు రోజులూ మీటింగులు జరిగాయి. ఊరంతా ఉడికిపోయింది. అందరినోటా సమ్మె తప్ప వేరేమాట లేదు. ఊళ్లోకూడా భయం భయంగా ఉంది.

"పిల్లలు సర్కార్ను ఎదిరిస్తున్నరు! ఏమైతదో!"ఇదేమాట అందరినోట!

నాలుగోనాడు స్కూలుముందు బ్లాక్ బోర్డుమీద మా కోరిక మన్నించినట్లు వ్రాసి, హెడ్మాస్టరు సంతకం పెట్టాడు. గాంధీటోపీ తప్ప ఏ టోపీ అయినా పెట్టుకోవచ్చని వ్రాశారు.

అది చూచాం. మా ఆనందానికి పట్టపగ్గాలు లేకుండాపోయాయి! ఆ సాయంకాలం జరిగిన సభలో చాలమంది విద్యార్థులు మాట్లాడారు, సభ ముగియగానే నన్ను ఎత్తుకున్నారు. ఎగిరారు. గంతులు వేశారు. సమ్మె ముగిసినట్లు ప్రకటించాం.

తెల్లవారినుంచి పాఠశాల కళకళలాడింది. అందరం స్కూలుకు వెళ్లేం. క్లాసులు నడిచాయి. అందరూ నన్ను మొనగాణ్ణి చేశారు. మొనగాడిగా చూశారు. నేనూ సంబరపడి ఉంటాను. కాలరు ఎగరేసి ఉంటాను. ఒక వారంపాటు హీరోను అయినాను.

ఒకనాడు హెడ్మాస్టరు పిలిపించాడు. వెళ్లాను. అక్కడ మరో నలుగురు టీచర్లున్నారు. హెడ్మాస్టరు నాకు ఒక కాగితం అందించారు. అది నన్ను స్కూల్లోంచి తొలగించినట్లూ – నిజాం రాజ్యంలో ఎక్కడా చేరకుండా చేసిన రాజాజ్ఞ! అది చూచాను. కళ్లు చీకట్లు కమ్మాయి. అయినా నిబ్బరంగా నుంచున్నాను. కన్నీటి బొట్టు రాలనీయలేదు.

హెడ్మాస్టరు "గద్దారీకీసజా – రాజద్రోహపు శిక్ష" అన్నాడు. అక్కడ ఉన్న టీచర్లసహితంగా హెడ్మాస్టరు వికటంగా నవ్వాడు.

అది నాకు అవమానం అనిపించింది. దుఃఖం ముంచుకువస్తున్నది. కాగితం పట్టుకుని బయటికి వచ్చాను. క్లాసులోకి వెళ్లలేదు. పుస్తకాలు తీసుకోలేదు. బయటికి వచ్చి, స్కూలు ముందరి మైదానంలో కూలబడి భోరున ఏడ్చాను. నేనే ఓదార్చుకున్నాను. విద్యార్థులకు ఈ విషయం తెలిసి, స్కూలు వదులుతే అందరూ నాకు సాయపడ్తారనీ – మళ్లీ సమ్మె చేస్తారనీ ఆశించాను. చొక్కాతో కళ్లు తుడుచుకున్నాను. స్కూలు ముందరి అరుగుమీద కూలబడ్డాను.

స్కూలు వదిలారు. పిల్లలు గుంపులు గుంపులుగా వెళ్లిపోతున్నారు. ఒక్కడూ నావైపు కన్నెత్తి చూడలేదు. పెదవి విప్పి పలకరించలేదు. అంతా వెళ్లిపోయారు. నేను క్రుంగిపోయాను. నిరామయంలో కూలబడ్డాను.

ఎంతసేపని కూర్చుంటాను? దుఃఖం నిండిన గుండెతో వంటరిగా —కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరాను. నాయన ఆకలిగొన్న పులిలా ఉన్నారు. జంకాను. బయటనే ఉన్నాను. "నువ్వు రాజద్రోహివి. నా యింట్లో స్థానం లేదు!" అని గొంతుచించుకుని తలుపులు దభాల్న వేశారు!

**అప్పటి నా దుస్థితిని తలచుకుంటే ఇప్పుడూ నా గుండె దడదడలాడుతున్నది!**

"నీవేతప్ప ఇంతఃపరం బెరుగ" అనడం కూడా తెలియక కాళ్లీడ్చుకుంటూ మునేటికి చేరుకున్నాను. ముఖం కడుక్కున్నాను. నీళ్లు తాగాను. వంతెన కమానుక్రింద — శ్మశానం పక్కన — బండమీద కూలబడ్డాను. అప్పుడు ఏడుపు రాలేదు. నదీప్రవాహాన్ని చూస్తూ కూర్చున్నాను.

అలా కూర్చున్న నన్ను హమాలి లింగయ్య పలకరించాడు. అంతకుముందు అతను నాకు తెలియదు. అతడే పరిచయం చేసుకున్నాడు. నా కథ విన్నాడు. కరిగాడు. తినడానికి ఏదయినా తెచ్చిపెడ్తా నన్నాడు. "**మేము శ్రీవైష్ణవులం. ఇతరులు వండినవి తినం" అన్నాను.** లింగయ్య నన్ను వాళ్లఇంటికి తీసికెళ్లాడు. అరటిపళ్లు తెచ్చిపెట్టాడు. తిన్నాను. వాళ్లఇంట్లో నీళ్లు త్రాగలేదు. కాలవలో నీళ్లు తాగాను. **నరసింహస్వామి గుట్టమీద తపస్సు చేస్తాను అన్నాను. పులులు ఉన్నాయి మింగుతాయి అన్నాడు లింగయ్య.**

రెండు రోజులు అలా గడిచాయి. మూడోనాడు అన్నయ్య వచ్చాడు. నేను **శూద్రుని ఇంట్లో ఉండడం నాయనకు తలవంపులవుతున్నదట. నన్ను తీసుకు రమ్మని అన్నయ్యను పంపించారు.** నాకు అమ్మ గుర్తుకు వచ్చింది. అన్నయ్య వెంటవెళ్లాను. అమ్మ నన్ను పట్టుకొని పెద్దగా ఏడ్చింది. తన నిస్సహాయతను తానే నిందించుకున్నది. నేను స్నానం — తిరుమన్నాపు చేసుకున్నాను. నాయన జంధ్యం మార్పించారు.

**అమ్మ అన్నం కలిపి తినిపించింది.**

**దుఃఖం, అవమానం అన్నింటినీ మరిపించింది.**

ఖమ్మంలో ఉన్నంతకాలం లింగయ్య స్నేహం వదల్లేదు. అతనికి నేను చేసింది లేదు. అతనే మాకు ఎంతో సాయం చేశాడు. మా కుటుంబం క్లిష్టదశలో ఉన్నప్పుడు లింగయ్య తాను బస్తాలు మోసి సంపాదించినదాన్లోంచి ప్రతిరోజు బేడ ఇచ్చాడు!

తరవాత ప్రయత్నించాను — లింగయ్య కనిపించలేదు!

నిజాం సర్కారు అంత తొందరగా — అంత తేలిగ్గా — విద్యార్థుల కోరిక ఎందుకు మన్నించినట్లు? తరువాత కాలంలో అర్థం అయిన విషయాలు:

1. విద్యార్థుల వెనుక ఎలాంటి సంస్థ లేకపోవడం
2. ఉద్యమం ఇతరచోట్లకు పాకకుండా అరికట్టడం
3. వందేమాతరంలోవలె చేతులు కాల్చుకోతలచుకోకపోవడం
4. భేదనీతి ప్రయోగించి — సమ్మెతరువాత — విద్యార్థులును భయపెట్టడం.

నాకు ఈనాటికీ అర్థంకాని విషయాలు:

1. వాస్తవంగా నేను అంతటి సమ్మెను నడిపానా?
2. ఆవేశం కనపరచి బలిపశువును అయినానా?
3. ప్రభుత్వం వందేమాతరంనాటి నామీద పగ ఇలా తీర్చుకున్నదా?

అప్పటికి నా వయసు పన్నెండేళ్లు. నేను ఆరో క్లాసులో ఉన్నాను. కొంత కుర్రతనం - కొంత ఆవేశం!

ఈ వయసులోనూ ఆవేశానికి కొదువలేదు.

అన్యాయం సహించలేను.

"ఏషమే సహజోదోషః స్వభావో దురతిక్రమః" అంటాడు వాల్మీకి. ఇది పుట్టుకతో వచ్చిన గుణం. స్వభావాన్ని అతిక్రమించడం అసాధ్యం.

మరొక ముఖ్యవిషయం – అప్పటికే నాకు పెళ్లయింది!

అదొక కథ.

మానవ స్వభావాన్ని మించిన విచిత్రం మరొకటి లేదు. మనిషి ఇతరుల బాధలు లెక్కించడు. తన మాట నెగ్గినందుకు సంబరపడతాడు.

నన్నుబడినుంచి బహిష్కరించినందుకు నాయన బాధపడలేదు. నాకు ఈ చదువు అబ్బదు అన్న తన మాట నెగ్గినందుకు ఉబ్బిపోయారు. నన్ను సన్నిధి స్వామిని చేసుకుని తమవెంట తిప్పారు. వంటసహితంగా వారికి సకల పరిచర్యలు చేయడం నా పని. వారికి తీరిక ఉన్నపుడు నాకు ద్రావిడమూ – సంస్కృతమూ చెప్పారు.

నాయనమ్మకు తీవ్రంగా జబ్బుచేసింది. ఆమెకు ఆమెపుత్రుడే సర్వస్వం. అన్యం ఆమె ఆలోచించలేదు. నాయనకూడా అలాగే సేవలు చేశారు.

నాయనమ్మ జబ్బు విషయం తెలిసింది. నాయనా నేనూ ఇంటికి చేరుకున్నాం. నాయన ఏ లోటూ రానివ్వలేదు. అమ్మ అన్నీ మరచి మూత్ర పురీషములు ఎత్తిపోసి – అపరిమితం అయిన పరిచర్యలు చేసింది. శక్తివంచన లేకుండా మేమూ చేశాం.

నాయనమ్మ నుంచి ఏదో దుర్గంధం ఇంటినిండా వ్యాపించింది. భరించడం కష్టం అయింది. అదికాక తాతయ్య పరమపదించిన నక్షత్రం మంచిదికాక కొంతకాలం ఇల్లు వదలాల్సి వచ్చింది. వీటిని దృష్టిలో ఉంచుకొని నాయనమ్మను ఎదుటి ఇంటికి మార్చారు.

అక్కడా ఆమెకు ఎలాంటి లోటూ రానివ్వలేదు. దుర్గంధం భరించరానిది అయింది. అపస్మారంలోనూ ఆమె పోయిన భర్తను తలచలేదు. ఉన్న తమ్ముని తలచలేదు. కోడలు, మనుమలు, మనుమరాళ్లు ఎవరినీ తలచలేదు.

తన పుత్రుడు వేంకటాచార్యులవారి వడిలో - వారి చేతితో తీర్థం ఉంచగా - మేమందరం పరివేష్ఠించి ఉండగా - నాయనమ్మ దాశరథి బుచ్చమ్మగారు - ప్రమాది సంవత్సర శ్రావణ శుక్ల షష్ఠినాడు పరమపదించారు.

గోవర్ధనంవారింట యల్లపేటలో పుట్టి – భద్రాచలం దాశరథి వారింట మెట్టి – పుత్రరక్షణార్థం చినగూడూరు చేరి – బుచ్చమ్మగారు ఖమ్మంమెట్టులో పరమపదించారు.

మునేటి వడ్డున – తాతయ్యను దహనం చేసినదానికి పక్కన నాయనమ్మ భౌతిక కాయాన్ని అగ్నికి ఆహుతి చేశారు.

నాయనమ్మ తీర్థ తిరువధ్యయనాలు నాయన – మా పెళ్లిళ్లకన్నా అట్టహాసంగా చేశారు. నాయనమ్మకు తమ్ముడు – అమ్మకు తండ్రి – నాయనకు మామ – మాకు మాతామహులు అయిన భట్టరాచార్యులవారిని నాయన పిలువలేదు. వారు రాలేదు. మా కుటుంబంలో పైతరం అంతరించింది.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## పది

### శిథిలాలయం:

మార్పు ప్రకృతి సిద్ధం. మార్పుకు లొంగనిది సృష్టిలో ఏదీలేదు. ప్రతిదీ మారుతుంది. వృద్ధి – క్షయాలే మార్పులే.

ప్రకృతి సాంతం ఒక వలయం. వలయంలో ఒక నిర్దిష్ట బిందువునుంచి వృద్ధి ప్రారంభమవుతుంది. అది వలయపు ఉపరి బిందువు వరకూ పెరుగుతుంది. అక్కడినుంచి క్షయం ప్రారంభమవుతుంది. మళ్లీ ఆరంభ బిందువు వరకూ క్షీణిస్తుంది. అక్కడ అంతరిస్తుంది.

అంతరిస్తుంది అంటే నశిస్తుంది అని అర్థం కాదు. పరిణామం చెందుతుంది. మరొక రూపం దాలుస్తుంది. ప్రకృతి సాంతంలో ఏ పదార్థానికి నాశం లేదు. మార్పు మాత్రమే ఉంటుంది. అంటే, అది రూపం మార్చుకుంటుంది. అంతే. కర్ర కాలుతుంది. బొగ్గు అవుతుంది. బొగ్గు బూడిద అవుతుంది. బూడిద మట్టి అవుతుంది. నీరు ఆవిరి అవుతుంది. మేఘం అవుతుంది. మళ్లీ నీరు అవుతుంది. ఇది ప్రకృతి శాసనం. ప్రకృతి నియమం. దీనిని పరిశీలించడమే గాని మార్చడం అసాధ్యం. అసంభవం.

వ్యక్తి జీవితానికివలె సమాజానికి మారుట సహజం. సమాజం విరాట్ రూపం గలది. వ్యక్తిజీవితంతో పోల్చినపుడు సమాజపు ఆయువు అనంతం. పరిధి అనంతం. రూపం అనంతం. ప్రకృతి పదార్థాల్లో కనిపించి నంత సులభంగా సామాజిక మార్పులు రావు. కనిపించవు. భౌతిక పరిణామపు కాల ప్రమాణం సామాజిక ప్రమాణానికి వర్తించదు. హిమవంతం పెరగడాన్ని మనిషి చూడలేదు. అధ్యయనం చేయాలి. అలాగే సామాజిక పరిణామాలు కనిపించవు. అధ్యయనం చేయాలి.

ప్రతి సమాజానికీ కొన్ని అలవాట్లు– ఆచారాలు సంప్రదాయాలూ ఉంటాయి. అలవాట్లు స్థిరపడితే ఆచారాలవుతాయి. ఆచారాలు స్థిరపడితే సంప్రదాయాలు అవుతాయి. సమాజం సంప్రదాయ బలంమీద జీవిస్తుంది. రాజకీయ బలం మీద కాదు. సంప్రదాయాన్ని – సమాజాన్ని శాసించే శక్తి ప్రభుత్వాలకు లేదు. ప్రభుత్వాలు సంప్రదాయాలను గుర్తించగలవు. మార్చలేవు.

ఒక్కొక్క సంప్రదాయం ఏర్పడడానికో - మార్పు చెందడానికో శతాబ్దాలు, సహస్రాబ్దాలు పట్టినా ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు.

సంప్రదాయాలు సాధారణంగా ఉత్పత్తి విధానాల మీద ఆధారపడి ఉంటాయి. ప్రపంచంలో వ్యవసాయ నాగరకత, దాని మీద ఆధారపడిన ఆచారాలు సంప్రదాయాలు - లెక్కకు సాధ్యం కానంతకాలం నుంచి అమలులో ఉన్నాయి పారిశ్రామిక - యాంత్రిక నాగరకత - అనాదిగా వస్తున్న వ్యావసాయిక నాగరకతను ఛిన్నాభిన్నం చేసింది. కాని, తన స్వంత సంప్రదాయాలను సృష్టించలేక పోయింది. పారిశ్రామిక నాగరకతలో సామాజిక నేతలు ఉండరు. ఆర్థిక నేతలు మాత్రమే ఉంటారు. వారు రాజకీయాలను తమ గుప్పెట్లో పెట్టుకుంటారు.

గత అర్ధశతాబ్దంలో వచ్చిన సామాజిక మార్పు లేక పతనం - మానవుడు తన చరిత్రలో చూసివుండడు. ఇవ్వాల్టినుంచి గత అర్ధశతాబ్దం క్రితపు కాలాన్ని పరికిస్తే అదేదో కలలా - కల్పనలా కనిపిస్తుంది. నాటి సమాజాన్ని నేటి సమాజాన్ని పరిశీలించినపుడు ఒక చిత్రకారుడు తన కాన్వాసు మీద. ముందు ఉండిన చిత్రాన్ని పూర్తిగా చెరిపి ఒక సరికొత్త చిత్రాన్ని చిత్రించినట్లుంటుంది. అవశేషాలు సహితం మిగలకుండా మారిపోయింది.

నాటి ఉమ్మడి కుటుంబాలు స్వపరిపాలనా సంస్థలు. వేరు కుటుంబాలు వచ్చిం తరువాత "ఉమ్మడి" అనే పదం వచ్చింది. అంతకు ముందు అది 'కుటుంబం' మాత్రమే. కుటుంబంలో మూడు నాలుగు తరాలు కలిసి ఉండేవి. ఈ తరాలకు పైతరం వాడు 'కర్తలేక యజమాని' - ఆ తరం ఒకరినిమించి ఉంటే పెద్దవాడు యజమాని అవుతాడు.

యజమాని ఆ కుటుంబానికి ప్రభువులాంటివారు. మిగతా కుటుంబాలు సభ్యులు - ప్రజల్లాంటివారు. వీరందరూ యజమాని అధీనులు. అతని శాసనానికి లొంగవలసినవారే. కుటుంబ ఆస్తులకు అతడే యజమాని. శుభాశుభ కార్యాలకు అతనే కర్త. అతని శాసనానికి తిరుగులేదు. ఎదురులేదు. కుటుంబ సభ్యుల అభ్యుదయము - సంక్షేమము చూడవలసిన బాధ్యత కర్తది.

పూర్తి నుంచి - పూర్తి చెడువున్న సంస్థ సృష్టిలో లేదు. ఉమ్మడి కుటుంబంలో లోలోపాట లేకపోలేదు. కాని పరస్పర సహకారం - అనుబంధాలు, ప్రేమలు ఉండేవి. అన్నింటిని మించింది భద్రత!

ఏ సంస్థ అయినా దానిని నిర్వహించే వ్యక్తిమీద ఆధారపడి ఉంటుంది. పండంటికి సోషలిస్టు వ్యవస్థను నిర్మించినవారూ - నాశనం చేసినవారూ వ్యక్తులే! అలాగే ఒక కుటుంబపు మంచి చెడ్డలు యజమాని మానవతమీద ఆధారపడ్డాయి.

ఈనాటి పరిస్థితులనుంచి చూస్తే ఆనాటి స్త్రీల స్థితి గతులు హీనంగా - దీనంగా - అధ్వాన్నంగా - అన్యాయంగా ఉండేవి. కుటుంబంలోని స్త్రీలకు నామమాత్రపు స్వతంత్రం లేదు. వారు పురుషుల ఆస్తిగా పరిగణించబడేవారు. ఇక్కడ మళ్లీ వ్యక్తి అతనిలోని మానవత; సంబంధాలను

నిర్ణయిస్తుంది. అన్యోన్యదాంపత్యాలు అనేకం ఉండేవి! అనుకూల దాంపత్యాలు లేనిసమాజం వర్ధిల్లదు!

సమాజం స్త్రీకి ఆస్తిహక్కు కల్పించలేదు. ఒక విధవకు భర్త ఆస్తి సంక్రమించినా ఫలితం మాత్రమే అనుభవించగలదు. క్రయ విక్రయ దాన ధర్మాల అధికారం ఆమెకు లేదు. సమాజం స్త్రీ ధనాన్ని గుర్తించింది. దానిమీద సంపూర్ణ అధికారం ఆమెదే. దానిమీద భర్త – కర్త ఎవరి అధికారమూ లేదు.

బహు భార్యత్వ దురాచారం అమల్లో ఉండేది. పురుషుడు ఎందరు భార్యలనయినా చేసుకోవచ్చు. స్త్రీ తనను కట్టుకున్నవాడిని విడువరాదు. అయితే ముప్పాతిక మువ్వీసం మంది ఒక భార్యతోనే కాపురం చేశారు. "ఉంచుకోవడం"అనే అతి దుష్ట సంప్రదాయం ఉండేది. దీనికి సంఖ్యాపరిమితి లేదు. ఉంచుకున్న ఆమెకు, ఆమె పిల్లలకు ఎలాంటి హక్కులూ ఉండవు. అయితే భార్యను మించి విశ్వాసపాత్రులయిన ఉంపుడుకత్తెలు - భార్యను మించి ఆదరించిన పురుషులూ లేకపోలేదు. ఇది వ్యక్తిస్థాయినిపట్టి ఉంటుంది.

వ్యవస్థ ఎలాంటిదయినా మనిషి మానవత్వం మీదా - మంచితనం మీదా ఆధారపడి ఉంటుంది.

వేశ్యావృత్తిని సమాజం గుర్తించింది. దీనినిబట్టే "దొరకు పుట్టినోళ్లంతా దొరలు కారు – దొరసానికి పుట్టినోడే దొర" అనే సామెత వచ్చింది. వేశ్యల కంటే హీనమయిన ఆడబాపలు ఉండేవారు.

వేశ్యావృత్తిని సమర్థించడం కాదు కాని ఆనాడు AIDS వ్యాధిలేదు. అంటే ఈనాడున్నంత లైంగిక విశృంఖలత్వం లేదు. సమాజం కొన్ని గ్రామ కట్టుబాట్లను బట్టి వ్యవహరించింది. ఈనాడు ఉన్నది స్వేచ్ఛకాదు - విశృంఖలత!

బాల్య వివాహాలు ఆనాటి ఆచారం. ఆడపిల్లకు రజస్వలకు ముందే వివాహం చేయాలి!

ఆనాటి - ఏనాటి దురాచారాలనయినా నిరసించాలి. మార్చాలి. కాని ఈనాటి దృష్టితో ఆనాటిని చూడడం సరికాదు. ఆనాటి పరిస్థితుల్లో అవి ఏర్పడటాన్ని సామాజిక శాస్త్రజ్ఞులు పరిశీలించాలి. గతం సాంతం దుష్టత్వం అనడం సమంజసం కాదు. ఎంచేతంటే, మనం గతానికి వారసులం!

నేనూ ఒకప్పుడు అనాలోచితంగా గతాన్ని నిరసించాను.

*"గతానికీ, మతానికీ కళ్లులేవు.*

*మనిషికీ, మనసుకూ నకళ్లులేవు"* అన్నాను.

ఈ నేపథ్యంలో మాకు బాల్యవివాహాలు జరిగాయి.

ఖమ్మం – బీటు బజారులో రత్నమాచార్యులవారు ఉండేవారు. మాకు దగ్గరి బంధువు. బహుముఖ ప్రజ్ఞాశాలి. వారికి సంగీతం – చిత్రలేఖనం – నటన వైద్యం – పాండిత్యం అన్నింటిలోనూ ప్రావీణ్యత ఉంది. వారు చూడమ్మ అమ్మమ్మకు సోదరులు.

వారింట్లో శ్రీముఖిలో నారాయణాచార్యులు వారి ధర్మపత్ని – వారి మేనకోడలు ప్రసవించారు. ఆడపిల్లను కన్నారు. ఆ సందర్భంలో నాయన రత్నమాచార్యుల వారి ఇంటికి వెళ్ళారు. బాలింతరాలు సీతమ్మగారు మా నాయనతో "నా బిడ్డను మీ కొడుక్కు చేసుకోండి" అన్నారు. నాయన ఉపాయంగా తప్పుకున్నారు. వాగ్దానం చేయలేదు. కాని, విధి బలీయం అయింది. అలాగే జరిగింది. పెళ్లిళ్లు పైలోకంలో నిశ్చయం అవుతాయి అంటారు.

ఇది వద్దనుకున్నా జరిగింది. కాని – పుట్టినపుడే వరుణ్ణి నిశ్చయించడం – అనుకొన్న మాట ప్రకారం పెళ్లిళ్లు జరగడం సర్వసాధారణం. తొట్లెలకు బాసికాలు కట్టి పెళ్లిళ్లు చేశారు అనేవారు. కాని అది అవాస్తవం అనుకుంటా.

అలా నిశ్చయం అయినవారూ - మేనమామ - మేనత్తల పిల్లలూ బాల్యం నుంచే భార్యా భర్తలుగా పెరుగుతారు. అవే ఆటలు ఆడుకుంటారు. మగపిల్లలు తమ సహజ పురుషాధిక్యత కనబరుస్తారు. ఆడపిల్లలను మొట్టికాయలు వేస్తారు. అమ్మాయి ఏడ్చుకుంటూ తల్లితో "బావ కొట్టాడు" అని చెపుతుంది. 'బావే కదమ్మా, కొడ్తే మానేలే' అని తల్లి ఆనాటినుంచే మొగుని దెబ్బలు అలవాటు చేస్తుంది. ఆప్యాయతలూ ఉంటాయి. ఒకరికి పెట్టకుండా ఒకరు తినరు. ఒకరిని చూడకుండా ఒకరు ఉండలేరు.

చినగూడూరులో సీతతో నాకు అలాంటి పరిచయం. మేము వెళ్లిపోయింతరవాత అమే మరొకరికి దక్కింది. ఆమెకు పెళ్లయింది. పిల్లలు లేరు. ఆరవ దశకంలో ఆమెను కేన్సరు అస్పత్రిలో చూచాను. కళ్లనిండా నీళ్లతో "బావా! నువ్వు చేసుకుంటె ఇట్ల జరిగేది కాదు" అన్నది. నాకూ గుండెనీరయింది. కళ్లల్లోకి రానీయలేదు. సీత చేయి నా చేతిలోకి తీసుకొని "ఛీ! ఏమిటా కన్నీరు" అని తుడిచి, "ఎందుకా అధైర్యం! నువ్వు బాగవుతావు. నీకు పిల్లలు కలుగుతారు" అని ఉత్తుతి ధైర్యం చెప్పాను. నా మాటలకే సీత మురిసిపోయింది.

మాటకే కదా మనిషి తపించేది!

సీత వెళ్లిపోయింది. అది భరించలేక ఆమె భర్తా వెళ్లిపోయాడు!

సీతది అంత అనురాగం!

సీత కథ – బాల్యం నాటిది; "తామరపూవులు" కథలో చెప్పాను.

మా అన్నయ్యకు పదిహేనేళ్లు వచ్చాయి. వచ్చే సంవత్సరం మెట్రిక్ పెళ్లిప్రయత్నాలు ప్రారంభం అయినాయి. పిల్ల పుట్టగానే అనుకున్న సంబంధాన్నిగురించి రామాచార్లమామ నాయనతో ప్రస్తావించారు. నాయన అందుకు అనుకూలంగా స్పందించలేదు. ఇంకా చాలమంది వచ్చారు. 'చూద్దాం' అని దాటవేశారు.

ఇంతమంది మా సంబంధానికి రావడానికి కారణం ఉంది. అప్పటికి మా వాళ్లు ఇంకా సంప్రదాయ విద్యను వదల్లేదు. అప్పటికి మా వాళ్లలో బహుశా మేమే "మ్లేచ్ఛవిద్య" చదువుతున్నాం. అంతేకాక, ఆస్తిపాస్తులు ఉండిన సంప్రదాయ కుటుంబం.

నాయన అన్నయ్య పెళ్లి విషయంలో అప్పటికి ఉన్న సంప్రదాయానికి భిన్నంగా నడిచారు. పెళ్లికి ముందు పిల్లలు చూసుకోవడం అనాటి ఆచారం కాదు. నాయన

అన్నయ్య – నచ్చిన పిల్లను చేయాలనుకున్నారు. ఆడపిల్లల వాళ్లకు అదొక వింతగా విడ్డూరంగా తోచింది. చాలమంది అన్నయ్యకు తమ కూతుళ్లను చూపడానికి అంగీకరించలేదు. నాయన పట్టు వదల్లేదు. కొందరు చూపించారు. తుదకు యాదగిరిగుట్ట ఆస్థాన విద్వాంసులు నరసింహాచార్యులవారి కూతురు రామానుజమ్మను మా అన్నయ్య మెచ్చాడు. నాయన స్థిరపరచారు.

నాకు అప్పటికి పన్నెండేళ్లు. ఇవన్నీ సరదాగా వినేవాణ్ణి. అన్నయ్య అప్పటికే కవిత్వం వ్రాస్తున్నారు. ఎదిగిపోయాడు. నాతో అంత దగ్గరగా ఉండడం లేదు. అందువల్ల అన్నయ్య చెప్పేవాడు కాదు. నాయన చెప్పరు కదా! అమ్మ చెప్పేది. సింగరమ్మత్తయ్య చెప్పేది.

కట్నం పిశాచం అప్పుడప్పుడే అడుగు పెడ్తున్నది! కాలగతి విచిత్రం అయింది. అనతికాలంలోనే "కన్యాశుల్కం" "వరవిక్రయం" అయింది. అన్నయ్యకు నూట పదహార్లు కట్నమూ లాంఛనాలు పెడ్తామన్నారు.

ఇది ఇలా ఉండగా అనుకోని మరో అధ్యాయం అవతరించింది. నాకు పిల్లనిస్తామని రావడం మొదలయింది. నాయన చూద్దాం అని దాటవేస్తున్నారు. భక్తలాపురం – వాళ్లు పట్టు బట్టారు. వాళ్లు చెప్పిన అంశాలు.

1. రెండు పెళ్లిళ్లూ ఒకేసారి చేయవచ్చు. వాళ్లుకూడా పెళ్లిపిల్ల లక్ష్మిని, యాదగిరి గుట్టకే తీసుకొని వస్తారు. నాయనకు ఒక పెళ్లి కర్చుతో రెండు పెళ్లిళ్ళూ జరుగుతాయి.
2. లక్ష్మి చిన్నపిల్ల, ఇప్పట్లో కాపురానికి రాదు. ఆమె భారం నాయనకు ఉండదు. పిల్లను ఇస్తారు కాబట్టి నా చదువు భారం కొంత వారు భరిస్తారు.

నాయన అంత సుముఖంగా లేరు. చిన్నవాడు, వాడికేం పెళ్లి అనే ధోరణిలో మాట్లాడారు. కాని, వాళ్లు వదల్లేదు. రోజూ వచ్చి నాయనను సతాయిస్తున్నారు. నాయన విసుక్కోవడం లేదు.

అన్నీ నాకు తెలుస్తున్నాయి. నేను గ్రహిస్తున్నాను. పెళ్లి తప్పిపోతే బావుండును అనుకుంటున్నాను. అమ్మ నిరాసక్తంగా ఉంది. అన్నయ్య సంబంధం విషయంలో ఆమె తెలుసుకున్నది కాని, ఆమెకు చెప్పలేదు. సంప్రదించడం పెద్ద పదం! నా పెళ్లి విషయంలో పట్టనట్లే ఉంది! ఆమెకు చెప్పకున్నాను. "నేను ఎవ్వరికి కావాలె! నన్నెవ్వరు అడుగతరు?" అన్న ధోరణిలో మాట్లాడింది. సింగమ్మత్తయ్యతో చెప్పాను. "పెళ్లి చేసుకోపిల్లగా, పిల్లతో ఆడుకోవచ్చు" అన్నది. నాకు సిగ్గనిపించింది.

వాళ్లు నిర్దిష్టం అయిన ప్రతిపాదనలతో వచ్చారు:

1. అన్నయ్యకు ఇచ్చినట్లే నూట పదహార్లు, లాంఛనాలు ఇస్తారు.
2. పిల్లకు పెట్టే బంగారం విషయంలో నాయన ఇష్టం. వాళ్లు అడగరు.

నాయన ఈమాట కోసమే ఎదిరి చూస్తున్నారు. మెత్తపడ్డారు. కాని, వెంటనే అంగీకరించలేదు. మూడు నాలుగు రోజుల తరువాత అంగీకరించారు. తాంబూలాలు పుచ్చుకున్నారు.

వాళ్లెవరు? అక్కడ పిల్ల ఎలాంటిది? ఆ కుటుంబ పరిస్థితి ఏమిటి? సంప్రదాయం ఏమిటి? ఏమీ ఆలోచించలేదు. పెళ్లికి వప్పుకున్నారు. నాకు అది ఏమాత్రం బాగనిపించలేదు. అన్నయ్యమీద ఇసుమంత ఈర్ష్య కూడా కలిగింది అన్నాను

అన్నయ్యతో. నేనేం కావాలనలేదు, నాయనే చూపించారు, ధైర్యం ఉంటే అడుగు అన్నట్లు మాట్లాడారు.

ఈరోజుల వలె పెండ్లాన్ని వెంట తెచ్చుకొని తల్లిదండ్రులను దీవించమనే కాలం కాదది. "నేను అమ్మాయిని ప్రేమించాను. వాళ్ల తల్లిదండ్రులతో మాట్లాడండి" అన్నాడు నా కొడుకు నాతో. అంతరం అంత అయ్యింది.

నాయనముందు నుంచునే ధైర్యం లేదు. ఏదయినా కావాలనిగాని వద్దనిగాని అనే సాహసం లేదు. వారిది సుగ్రీవాజ్ఞ. చెప్పింది వినడమే మనపని.

నాలోనే ఒక వింత పరిణామం. ముందు పెళ్లి వద్దే వద్దు అనుకున్నాను. ఇప్పుడు అన్నయ్య విషయంలో వలె నాకూ జరగాలనుకుంటున్నాను. మిత్రులు నా పెళ్లి మాటకు నన్ను పరిహసిస్తున్నారు. నాకు లజ్జగా ఉంది. దోస్తులను విడువలేను. వారితో తిరగలేను. వంటరితనం భరించలేను. అదొక విచిత్రమయిన స్థితి. ఆ వయసుకు తగిందికాదు. నిస్సహాయంగా - నా ఇష్టంతో నిమిత్తం లేకుండా - దారిలేని అరణ్యంలో సాగిపోతున్నాను.

ఇది ఇట్లుండగా రంగంమీద కొత్తపాత్రలు ప్రవేశించాయి.

పుట్టినప్పుడు అనుకున్న సంబంధం – బాబాయ్ నారాయణాచార్యులవారు – సీతమ్మగారు సికిందరాబాదులో ఉంటారు. మా అన్నదమ్ముల పెళ్లి విషయం వారికి ఆలస్యంగా తెలిసింది. అప్పుడు వారికి వేడెక్కింది. ఏ విధంగానయినా కార్యం సాధించాలనుకున్నారు. సీతమ్మగారి చెల్లెలు సింగరమ్మత్తయ్య. ఈ కార్యభారం సింగరమ్మత్తయ్యకు –రామంచార్ల మామకు అప్పగించారు.

మామయ్య మా ఇంటికి వచ్చాడు. నాయనతో వాదించడం అసాధ్యం అని అతనికి తెలుసు. అమాంతంగా కాళ్లు పట్టుకున్నాడు. కథ సాంతం విన్నవించుకున్నాడు. మాట ఇచ్చేదాకా కాళ్లు వదలనంటాడు. కావలసినవాళ్లు – అనుకున్న సంబంధం – ఏవేవో చెప్పాడు.

నాయనకు మామ అంటే కొంత అభిమానమే. చిన్నతనంనుంచి కలిసి తిరిగినవాళ్లు. కాని, కుదిరిన సంబంధం ఎత్తగొట్టడం ఎట్లారా అంటారు. ఏదయినా మీరే చేయాలే. మీ శరణు జొచ్చాను. రాముడు శరణుజొచ్చిన విభీషణునికి రాజ్యం ఇచ్చాడు. మీరు మాట ఇవ్వాలె అనేది మామయ్య ధోరణి.

నాయన మెత్తపడలేదు. కాదనీ అనలేదు. మామయ్య వస్తున్నాడు. ప్రతిరోజూ శరణాగతుడు అవుతున్నాడు. నాయన శ్రీసూక్తి సాయిస్తున్నారు.

మామయ్య – అమ్మ రోజూ ఏటికి వెళ్లేవారు మంచినీళ్లు తేవడానికి. మామయ్య అమ్మతో మంతనాలు సాగించాడు. అమ్మ సులభంగా మెత్తపడింది. ఒకటి – ఆమెతో సంప్రదించడమే ఆమెకు మహదానందం అయింది. రెండు – నాయనకు వచ్చకున్నా తనమాట నెగ్గుతుంది. అది ఆమెకు గెలుపు. మూడు – తమ్ముని తరఫు సంబంధం. కోడలు తన పక్షపుది అవుతుంది. అది ఆనందం.

మామయ్య పథకం ఏమంటే, నాయన ఒప్పుకోకున్నా – అమ్మ అనుమతితో – నన్ను ఎత్తుకుపోయి పెళ్లి చేయాలని.

చూడమ్మ అమ్మమ్మ – అత్తయ్య నన్ను ఎంతో ఆదరిస్తున్నారు. ముఖానికి సబ్బు – పౌడరు వేస్తున్నారు. తినడానికి మంచి మంచి పదార్థాలు పెడ్తున్నారు. మంచి ముచ్చట్లు, కథలు చెప్పుతున్నారు. సింగరమ్మను చేసుకొమ్మని రోజూ కమ్మగా బోధిస్తున్నారు. సింగరమ్మంటే సికిందరాబాదు పిల్ల. వారు నన్ను మహారాజును చూసినట్లు చూస్తున్నారు.

అమ్మా, నాయనా ఇద్దరు వప్పుకోకున్నా – నా ఇష్టంతో నన్ను ఎత్తుకుపోయి పెళ్లి చేయాలని పథకం.

రోజులు దొర్లిపోతున్నాయి. ఇంట్లో పెళ్లి పనులు జరుగుతున్నాయి. ముహూర్తం దగ్గర పడుతున్నది.

ఒక రోజు మామయ్య వచ్చి సాష్టాంగ పడ్డాడు. కాళ్లు వదల్లేదు. ప్రాయోపవేశం చేస్తున్నానన్నాడు. "లాభం లేదురా, నీ నక్క వినయాలు, నా దగ్గర చెల్లవు" అన్నారు నాయన. "బావగారూ! నా మాట వినండి. రెండు వందల పదహార్లు ఇస్తాం. మంగళసూత్రం కూడా మాది. మిమ్ములను పైసా అడగం. కర్చులన్నీ మావే. పిల్లకు పెట్టాల్సిన బంగారం విషయం పట్టుపట్టం. యాదగిరి గుట్టలో ముహూర్తానికే పెళ్లి చేస్తాం. పెళ్లి పీటల మీద నేనూ – మా ఆవిడ కూర్చుంటాం" అని కొంత ముట్ట చెప్పినట్లున్నారు. "బావగారూ! రంగణ్ణి మాకు వప్పగించండి. మిగతా కథ నేను నడిపిస్తాను. ముందు 'ఊఁ' అనండి, చాలు" అని ప్రార్థించాడు.

నాయన మెత్తపడ్డారు. "అరే, సాధించావురా! ఊఁ అనేటట్లు చేశావు. అయితే ఈ విషయంలో నాకేమీ తెలియనట్లే! మీ అక్కా నువ్వు కథ నడిపించుకోండి. నన్ను రంగంలోకి దింపవద్దు. ఈ విషయం నాకేమీ తెలియదు. తెలియదు. తెలియదు. ముమ్మాటికి గుర్తించుకో" అన్నారు. లేచి వెళ్లిపోయారు.

మామయ్య – అత్తయ్య సంబరానికి అంతులేదు. తనకు స్వతంత్రం వచ్చినందుకు అమ్మకూడా మురిసిపోయింది. అమ్మ "రంగడూ! మామయ్య చెప్పినట్లు చెయ్యి. వాండ్లు మనకు కావలసిన వాండ్లు" అన్నది. తొలిసారి అమ్మ సంబర పడడం చూశాను. అమ్మకు నచ్చిన పని చేస్తున్నందుకు నాకూ ఎంతో సంతోషం కలిగింది.

నాకు సంతోషం కలగటానికి – చిన్నతనం నుంచీ నాకు ఇష్టమయిన సింగరమ్మత్తయ్యను సంతోషపెట్టడం – సికిందరాబాదు, హైదరాబాదు – చార్మినార్ వగైరాలు చూడడం. అయితే, నాకు ఆనాడు కలిగిన భావాల్లో పెళ్లికి సంబంధించినవి లేశమాత్రం లేవు.

నేను ముందు పెళ్లి వద్దనుకున్నాను. తరువాత అన్నయ్యను చూచి ఈర్ష్యపడ్డాను. ఇప్పుడు ఒకరి సంబరం కోసం స్వచ్ఛందంగా వప్పుకున్నాను. మనిషి మనసు కుప్పిగంతులు వేస్తుంది!

ఒకనాడు నాకు తలంటి పోశారు. అమ్మా, నేనూ అమ్మమ్మ ఇంటికి వెళ్లాం. అక్కడ నాకు అత్తరు రాసి, పన్నీరు చల్లి, తాంబూలం ఇచ్చి, జరీ కండువా – ఉంగరం పెట్టారు. అవి తీసుకొని ఇంటికి వచ్చాం. నాయన వాటిని తీసుకున్నారు. దాచిపెట్టారు.

పెళ్లికి తరలిపోయే రోజు వచ్చింది. తెల్లవారి అన్నయ్యను తీసుకొని అంతా వెళ్లారు. ఆ సాయంకాలం అమ్మ నన్ను దొడ్లోకి తీసికెళ్లింది. నేరేడు చెట్టు కింద

కంటతడి పెట్టింది. కంటతడి పెడ్తే నేను వెళ్లను అన్నాను. "అది కాదురా, నేను మీ అమ్మను. నన్ను నీ పెండ్లి చూడకుండ చేసిస్రను. పీటలమీద కూచునే అదృష్టం లేకుండ చేసిస్రను. నిన్ను వాళ్లకు పట్టించే కర్మ పట్టించిస్రను. మాకు తెలియకుండ మామయ్య నిన్ను ఎత్తుక పోతున్నడు. ఇక ఏడుపు రాక ఏమైతదిరా?" అని కుమిలి కుమిలి ఏడ్చింది. ఈ విషయం ఇంట్లో ఉన్న బంధువులకు తెలియరాదు!

అమ్మ తానే ఏడుపు మానింది. కొంగుతో కళ్లు తుడుచుకున్నది. దొడ్డి దారిన నన్ను అమ్మమ్మ ఇంటికి తీసికెళ్లింది. "రాములూ – సింగమ్మా! నా కొడుకును మీ చేతుల్లో పెడ్తున్న. మీరే రంగనికి తల్లిదండ్రులు" అని పెద్దగా ఏడ్చింది. నాకూ ఏడుపు వచ్చింది. ఏడ్చాను. అమ్మ నన్ను సమాధానపరచింది. వాళ్లు అమ్మను సమాధానపరిచారు. మామయ్య అమ్మను దొడ్డి దర్వాజవరకూ పంపించి వచ్చాడు.

మామయ్య, అత్తయ్య నన్ను తీసుకొని స్టేషను చేరారు. చీకటి పడింతరువాత రైలెక్కాం. తెల్లవారి సికిందరాబాదులో దిగాం. సికిందరాబాదు ముందు బెజవాడ పల్లెలా కనిపించింది. టాంగాలో జేమ్స్‌స్ట్రీట్ – ఇత్తడి బొమ్మ దగ్గరి నారాయణాచార్యులవారి ఇంటిముందు దిగాం. నాకు ఘన స్వాగతం లభించింది.

పట్టుగౌను తొడిగిన ఏడేళ్ల పెళ్లిపిల్ల నన్ను చూచి తుర్రుమన్నది. మెరుపులా మాయం అయింది. ఆ పిల్ల – సింగరమ్మ – నేను కనిపించగానే చాటున నక్కేది. అందీ అందనట్లుండేవి!

అత్తవారింట్లో – ఇప్పుడది నిశ్చయంగా అత్తవారిల్లు – నాకు రాజోపచారాలు జరిగాయి. ఎర్రరంగు ఉన్న కోటు – పాంటు – కమీజు కుట్టించారు. నేను దర్జీ దగ్గరినుంచి కదల్లేదు. నాకు తొలిసారి బూట్లు – టైకూడా కొనిపెట్టారు.

అక్కడ నాకు ఎలాంటి లోటు లేదు. కావలసినవాటికి మించి ఉన్నాయి. అయినా అమ్మ గుర్తుకు వచ్చేది. నాయన – అన్నయ్య – అన్నయ్య పెళ్లి తలపుకు వచ్చేవి. బాధ కలిగేది. కాని అమ్మ చెప్పింది – బయటపడనిచ్చేవాణ్ణి కాను.

సికిందరాబాదు బ్రిటిషువారి పాలనలో ఉండింది. అక్కడ శారద యాక్టు – బాల్య వివాహ నిషేధ చట్టం – అమల్లో ఉంది. పెళ్లి గుట్టుచప్పుడు కాకుండా జరగాలి.

పెళ్లిరోజు వచ్చింది. తలంట్లూ వగైరాలు జరిగాయి. పీటలమీద కూర్చున్నాం. అమ్మా – నాయన స్థానంలో రామంచార్ల మామ, సింగరమ్మత్తయ్య కూర్చున్నారు. మంత్రాలు – బాజాలు – బంధువులు సందడిగానే ఉంది. అట్టహాసం లేదు.

మంగళసూత్రం నాచేతి కిచ్చారు. పెళ్లిపిల్ల సింగరమ్మకు కట్టమన్నారు. నేను కట్టబోయాను. ఆమె ఏడ్చింది. అత్తగారు ఊరడించారు. ఆమె తలవంచింది. అత్తగారు ఆమె జడ ఎత్తి పట్టుకున్నారు. మంగళవాద్యాల మధ్య నేను సింగరమ్మ మెడలో మంగళసూత్రం కట్టాను. మూడు ముళ్లు వేశాను.

సరిగ్గా ఆ సమయానికి బయట పోలీసు వచ్చాడు. అందుకుగాను ఏర్పాటు చేసిన వ్యక్తి సత్యనారాయణ వ్రతం అని ఏదో ముట్టచెప్పిపంపాడు.

దంపతులం – అప్పుడు దంపతులం అయ్యాం కదా – చాల హుషారుగా పోటీలు పడి తలంబ్రాలు పోసుకున్నాం. చెంబులోని ఉంగరాన్ని పట్టి పట్టి తీశాం. మా ఇద్దరినీ చెరొకరు ఎత్తుకొని – వాద్యానికి తాళబద్ధంగా అడుగులేస్తూ డేగాట

ఆడారు. మేమిద్దరం ఒకరిమీద ఒకరం పంతంగట్టి బుక్కాగులాలు చల్లుకున్నాం. మేం రంగురంగులయినాం.

వెండి పళ్లేలు – వెండి గిన్నెల్లో రకరకాల వంటకాల భోజనాలు. నా పళ్లెంలోవి ఆమె పళ్లెంలో వేశాను. ఆమె నా పళ్లెంలో వేసింది. రాత్రిపూట లైట్ల వెలుగులో పూబంతులు ఆడించారు. ఆ విధంగా అక్కడ ఉన్నన్ని వెలుగులో పూబంతులు ఆడించారు. ఆ విధంగా అక్కడ ఉన్నన్ని సాయంకాలాలు ఆడించారు.

ఆ రోజుల్లో పెళ్లిళ్లు అయిదురోజులు జరిగేవి. బహుశః ఒక్కరోజు జరిగిన పెళ్లి నాదే మొదటిదేమో! ఎంచాతంటే – నాది అన్ని విధాల దొంగపెళ్లి కదా!

నాయన వచ్చింది డబ్బుకోసం. నాకు పెట్టిన బట్టలు వగైరాల బాబతు మినహాయించుకొని ఇస్తామంటారు మామగారి వాళ్లు. మొత్తం కావాలంటారు నాయన. నాయన తమ పంతం నెగ్గించుకున్నారు. డబ్బు మూట కట్టుకొని వెళ్లిపోయారు.

భక్తలాపురం వాళ్లు బండ్లమీద సమస్త సామగ్రి సహితంగా పెళ్లి పిల్లను చేసుకుని గుట్టమీద దిగారు. ఆ స్థితిలో పెళ్లి తప్పిపోయిన హృదయవిదారకస్థితిని ఊహించవలసిందే! వాళ్లు పెళ్లి పందింట్లో మన్నులూ – దుమ్ములూ పోశారు. శాపనార్థాలు పెట్టారు. కనీసం భోజనాలు చేయకుండా అవే బండ్లలో వెళ్లిపోయారు!

నాయన చెప్పిన ప్రకారం మేము రైలెక్కాం. అత్తవారి పక్షాన మామగారి తమ్ములు అళహసింగరాచార్యులవారు వచ్చారు. వంగపల్లిలో ఆ పెళ్ళివాళ్లు మా పెట్టెలోనే ఎక్కారు. వదినను తొలిసారి చూచాను. అన్నయ్య ఎన్నికను మెచ్చాను. వదిన మంచిది. నాకోసం ప్రత్యేకంగా లడ్డూలు తెచ్చి పెట్టింది! అమ్మ మా ఇద్దరినీ దగ్గరకీ తీసుకుంది. ఇరుపక్కల కూర్చుండపెట్టుకున్నది. కంటతడి పెట్టింది!

ఖమ్మంలో దిగాం. మమ్ములను అమ్మమ్మ ఇంట్లో దింపారు. మావాళ్లు మా ఇంటికి చేరారు. ఆ రాత్రి ఊరేగింపు. మా నలుగురినీ టాపులేని కారులో కూర్చుండ పెట్టారు. ముందు బాజాలు – పక్కన పెట్రోమాక్సు లైట్లు – మా వాళ్లు – మెల్లగా సాగుతున్నాం. సరిగ్గా తాసిల్దారు ఇంటిముందు కారు మొరాయించింది. బిస చెడింది – బాగుచేయడం కోసం ఆగింది.

తురక తాసిల్దారు బయటికి వచ్చాడు. కారులో మమ్ములను చూచాడు. “క్యాహై” అడిగాడు. “షాదీహై” చెప్పారు.

“బచ్చోంకా ఖేల్ దిఖ్తాహై” పిల్లల ఆటలా కనిపిస్తోంది అన్నాడు. సర్వయ్యసార్ వగైరాలు అతనికి సవినయంగా వివరించారు. “అచ్చా, అయిసాహైతో రైరో” అని లోనికి వెళ్లాడు. కారు బాగయింది. కదలడానికి లేదు.

తాసిల్దారు బేగం సహితంగా మిఠాయీలు వగైరా తెచ్చాడు. “బచ్చే అచ్ఛె లగై హైఁ” పిల్లలు బాగనిపిస్తున్నారు అని భార్యకు చూపాడు. మిఠాయీలు వగైరా మాకు ఇచ్చాడు. సాగిపోయేవరకూ నుంచుని చూశారు.

ఇక్కడ గ్రహించాల్సిన విషయం ఒకటి ఉంది. పాలకులు ప్రజలకు ఎంత దూరంగా ఉన్నారో అర్థం అవుతుంది. ప్రజల ఆచార వ్యవహారాలు కూడా వారికి తెలియవు.

దేవుని సేవకు కూడా తాసిల్దారు అనుమతి అవసరం. ఒకసారి సీతాకళ్యాణపు ఊరేగింపుకు అనుమతి అడగడానికి వెళ్లారు. వివరించారు. 'హమ్ ఏక్‌షాదీసే బేజార్ హైం. ఎహ్‌హర్ సాల్‌కీ షాదీక్యేసీ. మేము ఒక్క పెళ్లికే బేజారవుతున్నాం. ఏటేటా ఈ పెళ్ళిళ్ళేమిటి?' అన్నాడు. తరవాత వీళ్లు వివరించారు. అనుమతిచ్చారు. అదిసరే. సర్కారు ప్రజలకు దూరంగా కోట కట్టుకుని కూర్చుకునేది అనడానికి ఇది నిదర్శనం.

ఆ రాత్రి మా ఇంట్లో వధువులు కుడికాలు పెట్టి వధూప్రవేశంచేశారు. బంధువుల సందడి – భోజనాలు – అడావుడి – మరిన్న లాంఛనాలు, ఆచారాలు అన్నీ ముగిశాయి.

నా ధర్మపత్ని సింగరమ్మ పేరు కమలమ్మగా మారింది. అళహసింగరాచార్యులవారు పిల్లకు బంగారం పెట్టాల్సిందని అడిగారు. రామంచార్ల మామతో వప్పందంలో బంగారం ప్రస్తావన లేదు. నాయన చకితులయినారు. కాని, ఆ మాట అనలేదు. యుద్ధంవల్ల బంగారం తులం ధర 15 నుంచి 20కి పెరిగింది. తగ్గింతరువాత పెట్తామన్నారు. మా దగ్గర డబ్బు వసూలు చేసినట్లే బంగారం పెట్టాల్సిందే అని నిలదీశారు అళహసింగరాచార్యులవారు. నాయనకు తప్పలేదు. కొన్ని అమ్మవి – కొన్ని నాయనమ్మవీ నగలు – మెరుగు పెట్టించి పెట్టారు. వాటి పట్టిక తయారు చేశారు. నాయన వారిని ముట్టినట్లు సంతకం పెట్టమన్నారు.

సంతకం పెట్టమన్న మాటవిని అళహసింగరాచార్యుల వారు మండిపడ్డారు. ఇది బంధుత్వమా? వ్యాపారమా? మీకు డబ్బిచ్చినపుడు రశీదు అడిగామా? మీరు విద్వాంసులు – పెద్దలు అనుకొని పిల్లనిచ్చాం. మీ బంగారమూ వద్దు మీ సంబంధమూ వద్దు అని కమలను చంకనేసుకుని బయలుదేరాడు. నాయన, అమ్మ మిగతా బంధువులూ బ్రతిమిలాడి శాంతింప చేశారు. నాయన నగలిచ్చి పంపించారు. వధువులూ బంధువులూ వెళ్లిపోయారు. పెళ్లిళ్ల కార్యక్రమాలు ముగిశాయి.

ఆ విధంగా పన్నెండేళ్ళ నాకూ ఏడేళ్ళ కమలకూ – మా వాళ్లసంబంధం లేకుండా నాయనకు కర్చులేకుండా పెళ్లి జరిగింది. మేము అనుకూలంగా ఉన్నాం. మా పెళ్లి సంగతి కమలకు గుర్తే లేదు. నా షష్టిపూర్తి సంర్భంగా ఆమెకు మళ్లీ నేను కట్టిన మంగళసూత్రమే ఆమెకు గుర్తు. 1993లో నేను కమలకు షష్టి పూర్తి జరిపాను. మహిళలకు సహితం షష్టిపూర్తి జరగాలి అనే సంప్రదాయానికి నాంది పలికాను. భార్యకు భర్త షష్టి పూర్తి చేయడంలో నేనే మొదటివాణ్ణేమో!

మేము సుఖాలకు నోచుకోలేదు.

కష్టాలు కలిసి పంచుకుంటున్నాం.

విధి విచిత్రం అయింది. అది మానవుని ప్రణాళిక ప్రకారం నడవదు. మా వదిన రామానుజమ్మ కాపురానికి రాకుండానే గతించింది.

ఇక్కడ ఒక విషయం మనవి చేయాలి. బ్రిటిషిండియాలో సాంఘిక సంస్కరణలు - ఆంగ్లేయుల ఆచారాల అనుకరణగా జరిగాయి. కాబట్టి సంఘసంస్కర్తలకు ప్రభుత్వపు పూర్తి మద్దతు లభించింది.

నిజాం సర్కారుకు వెలుగంటే బెదురు. సంఘసంస్కరణ విద్రోహం కింద లెక్క. నిజాం రక్కసి సంఘసంస్కరణలను పూర్తి శక్తియుక్తులతో నిరోధించింది. నిజాం రాజ్యంలో చెప్పుకోదగిన సంఘసంస్కరణ ఉద్యమం రాలేదు.

# పదకొండు

## మనుషులు చేసిన దేవుళ్లు:

నాయనకు గూడూరు మీద ధ్యాస పడింది. అంతేకాదు. ఏదో పని పడింది. గూడూరు నుంచి శేషయ్య మామ వచ్చారు. ఏవో మాటలు, ముచ్చట్లు జరిగాయి. ఒక నఖాషీ – శిల్పిని ఇచ్చి శేషయ్యమామను పంపించారు.

గూడూరు నుంచి ధాన్యం అమ్మడానికి వచ్చిన బండ్ల తిరుగు ప్రయాణంలో మేము బయలుదేరాం. రాత్రి – పండు వెన్నెలలో మా ప్రయాణం. వెన్నెట్లో – బండ్ల బిడారులో – బండివాళ్ల కూనిరాగాల్లో – మెల్లనిగాలిలో పయనం పరమానందంగా ఉంది.

బండ్ల బిడారు తెల్లవారి పిండిపోలు చేరుకుంది. బండ్లు విడియడానికి – వంటలకు మామిడి తోటలు, మోట బావి ఉన్నాయి. బండ్లు విడిశాయి. బండ్లవాళ్లు వంటల ఏర్పాట్లు చేసుకుంటున్నారు. ఎద్దులు విశ్రాంతిగా గడ్డి మేస్తున్నాయి.

మేము అందరు చూడగా వంటలు చేసుకోం. దూరంగా ఒక పరుపు బండనీళ్ల వసతి చూసి వచ్చారు. మేము వంట సామగ్రి సహితంగా అక్కడికి తరలాం. అమ్మ వంటలు చేసింది. మేము మర్రి ఆకుల విస్తళ్లు కుట్టాం. పరుపు బండ పక్కనే మర్రి చెట్టుంది. నాయన తిరువారాధన – ఆరగింపు ముగించారు.

అమ్మ తప్ప అందరం భోజనాలకు కూర్చున్నాం. ఒకవాయి ముగించాం. అంతే, తేనెటీగల దండ్లు – మర్రి చెట్టునుంచి భయంకరంగా దాడి చేశాయి. ఒక్కొక్కళ్లను వందల ఈగలు కుడుతున్నాయి. అన్నాలు వదిలి – మొత్తుకుంటూ – ఏడ్చుకుంటూ – అందరం పరిగెత్తుతున్నాం. ఈగలు మబ్బుల్లా గుంపులు గుంపులు మా వెంట వస్తున్నాయి. మేము అతి కష్టంగా బండ్లున్న చోటికి చేరుకున్నాం.

తేనెటీగలు బండి మనుషులనూ – ఎడ్లనూ కుట్టసాగాయి. బండి మనుషులు మమ్ములను గొంగళ్ళలో చుట్టారు. వాళ్లంతా వచ్చి పోయేవాళ్లమీద దాడి చేస్తూనే ఉన్నాయి. చాలసేపటి తరువాత అవి నిర్గమించాయి.

తేనెటీగలు నిర్గమించిన విషయం తెలుసుకొని బండ్లమనుషులు బావిలోంచి బయటికి వచ్చారు. మమ్ములను గొంగళ్లలోనుంచి తీశారు. అందరి శరీరాల నిండా తేనెటీగలు నాటిన ముళ్లు, శరీరాలు వాచిపోయాయి. వణుకు, చలి, కొంత భయం – కొంత జ్వరం.

ఆ స్థితిలోనూ ఇతరుల చేతి నీళ్లు తాగం! నాలుకలు ఆరుకుపోతున్నాయి. ఆ దశలో అమ్మ బిందె తోమి, మోట బావిలో దిగి – నీళ్లు తెచ్చింది. అందరం తాగాం. అందరం వణుకుతున్నాం. చెల్లెళ్లు మరీ! పెద్దగా ఏడుస్తున్నారు. నాయన గద్దింపులు ఏడుపులు ఆపలేకపోయాయి.

బండి మనుషులు గొంగళ్లు కప్పుకొని పరుపుబండ నుంచి సామగ్రి తెచ్చారు. బండ్లు బయలుదేరాయి. వణుకు, జ్వరాలతో గూడూరు చేరాం. మామూలు మనుషులం కావడానికి చాలాకాలం పట్టింది.

గూడూరులో ఒకనాటి ఉదయం నాయన; దొర – కరణం – సావుకార్లనూ అందరినీ పిలిపించారు. ఇల్లు వారితో నిండిపోయింది. నాయన ఒక సుదీర్ఘమయిన 'శ్రీసుక్తి' సాయించారు. సారాంశం ఏమంటే – వారికి వేకువ జామున ఒక కల వచ్చింది. శ్రీ సీత, రామ, లక్ష్మణ హనుమానులు దర్శనం ఇచ్చారు. వారు ఈ ఊరి పొలిమేరల్లో నివసిస్తామని చెప్పారు. నాయనను వెంట రమ్మన్నారు. ఒక గుహ వరకు తీసికెళ్లారు. మేము ఈ గుహలో ఉంటాం అన్నారు. అదృశ్యులు అయినారు. ఆ ప్రదేశం నాయనకు గుర్తుంది. దాని చుట్టూ తులసిపొదలున్నాయి.

నాయన ఈ వివరాలు చెప్పారు. స్వప్న వృత్తాంతాన్ని పరీక్షించాలన్నారు. అందరూ స్నానాలు చేసి వస్తే భజన చేస్తూ సాగవచ్చునన్నారు. శ్రీరామచంద్రమూర్తి గూడూరును కరుణించినందుకు అంతా మురిసిపోయారు. ఇండ్లకు తరలారు.

నాయన స్నాన సంధ్యాదికాలు ముగించుకున్నారు. ఊర్ధ్వపుండ్రాలు, తులసిపూసలు – తామరపూసలు ధరించిన గ్రామ వైష్ణవులు చేరుకున్నారు. కొద్ది సేపట్లోనే స్నానాలు ముగించి, బొట్లు పెట్టుకొని జనం గుంపులుగా కూడారు. హార్మోనీలు, మద్దెలలు వచ్చాయి. రామ భజన సాగింది.

జనం భజన చేస్తూ నాయన వెంటసాగింది. ముత్యాలమ్మ కుంట – తిరుమణికుంట చెరువుల కట్టలు దిగారు. మరి కొంతదూరం నడిచారు. నాయన నిలిచారు. జనం నిలిచింది. భజన ఆగింది.

నాయన ఒక బండమీద నుంచున్నారు. 'ఇక్కడి వరకే గుర్తున్నది. చుట్టుపట్ల తులసి పొదలు వెదకండి" అన్నారు. అక్కడే కూర్చున్నారు. ధ్యానంలో నిమగ్నులయినారు.

జనం గుంపులుగా అన్ని దిశలా వెదుకసాగారు. శేషయ్యమామ వచ్చి "తులసి పొదలు కనిపించినయి" అన్నాడు. ఆమాట అందరికీ తెలిసింది. జన సమూహాలు కూడాయి. మళ్లీ భజనలు మొదలయినాయి.

నాయన ధ్యానం నుంచి బయటికి వచ్చారు. "స్వామి ప్రత్యక్షం అయినారు, ప్రత్యక్షం అయినారు" అని గంతులు వేశారు. వాద్యాలు, భజనలతో నాయన సాగారు. ఒక బోడు ఎక్కారు. అటూ ఇటూ వెదికారు. "అదిగో పరిమళం – ఇక్కడే స్వామి ఉన్నారు" అని ఒక గుహలోకి దారి తీశారు.

గుహలో పూలు, తులసి చల్లి ఉన్నవి. నేతి ప్రమిద వెలుగుతున్నది. 'అదిగో నా స్వామి' అని నాయన సాష్టాంగపడిపోయారు. అందరూ వారిని అనుసరించారు. నాయన రుద్ధకంఠంతో అనుసంధానం చేస్తూ – బాష్పపూర్ణ నేత్రాలతో ముందుకు సాగారు. ఎదురుగా రాతిమీద లీలగా ఆకారాలు కనిపించాయి. 'ఇదిగో రాముడు నా స్వామి – ఇదిగో సీతమ్మ మా యమ్మ – ఇదిగో లక్ష్మణుడు మా అన్న – ఇదిగో హనుమ రామమాత' అని భజన సాగించారు. ఆరాధనాదులు జరిగాయి. అందరూ తిరిగి వచ్చారు.

వార్త కార్చిచ్చులా సాకింది. గుహవద్ద మరునాటి నుంచి – చుట్టు పట్లనుంచి వేల జనం, ఒక తిరునాళ్లు అయింది. దుకాణాలు వెలిశాయి. నిత్యధూపనైవేద్యాలు సాగాయి.

ఒకనాడు ప్రధాన ఉత్సవం – బహుశః ప్రతిష్ఠ కావచ్చు – జరిగింది. చాల హడాఉడిగా – అట్టహాసంగా జరిగింది. పందిళ్లు వేశారు. హోమాలు – జపాలు –

పూజలు – పారాయణాలు. నాకు బాగనిపించింది. తట్టల కొద్ది తామరపూలు తెచ్చి పూజ చేశారు. అన్ని తామరలు దొంతరలుగా పేర్చడం ఎంతో బావుంది.

అన్నదానాలూ – సంతర్పణలూ జరిగాయి. వేలమంది భోజనాలు చేశారు. ఉత్సవం ముగిసింది.

మేము గూడూరులో ఉన్నన్నాళ్లు బాగానే జరిగింది. మేము గూడూరు వదిలి ఖమ్మం చేరుకున్నాం. గుహలోని రామునికి పూజ లేకుండా పోయింది.

## పన్నెండు

### ప్రమాదాలు - వివాదాలు:

భారతదేశం బానిసత్వంలో మగ్గినపుడు ప్రజల ఆరోగ్యాన్నిగురించి ప్రభుత్వం అంతగా పట్టించుకోలేదు. ఇంగ్లీషు వారు భారతదేశాన్ని దోచుకోవడానికి వచ్చారు. ఉద్ధరించడానికి రాలేదు. దేశంలో ప్లేగు – కలరా – మశూచి – మలేరియా – ఫ్లూవంటి అంటువ్యాధులు విపరీతంగా ప్రబలాయి. మూక చావులు. వందలు, వేలు పిట్టలు చచ్చినట్లు చచ్చారు.

నిజాం రాజ్యం విషయం వివరించపనిలేదు. కలరా – గత్తర ఊళ్లల్లో వ్యాపిస్తే వందలు వేలు చచ్చేవారు. కలరాకు మందూ, మాకూ లేదు. మంత్రాలమీద ఆధారం. ఒక పద్ధతి ప్రకారం అమ్మవారిని కొలిచేవారు. ఈ విషయాలు నా నవల “మోదుగుపూలు”లో వివరించాను.

మా పెద్ద చెల్లెలు “లక్ష్మి” గత్తరకు బలి అయింది. దాని కథాక్రమంబెట్టిదనిన:–

నేను పుట్టిన తరువాత అయిదేళ్లకు లక్ష్మి పుట్టింది. ఆమె సర్వయ్య సార్ ఇంట్లో పెరిగింది. సర్వయ్య సార్ భద్రమ్మలను కూడా అమ్మా – నాయనా అనేది. భోజనానికి మాత్రం ఇంటికి వచ్చేది. మిగతా సమయం వాళ్లింట్లోనే. ఆమెకు వాళ్లతోనే అనుబంధం ఎక్కువ.

లక్ష్మికి ఎనిమిదేళ్లుండగా సర్వయ్య సార్‌కు ‘తొర్రూరు’ బదిలీ అయింది. వారు లక్ష్మిని వదలలేక బదిలీ రద్దుకోసం విశ్వప్రయత్నం చేశారు. ఫలించలేదు. భద్రమ్మ లక్ష్మిని వదిలిరానని స్పష్టంగా చెప్పింది. సర్వయ్యగారు ఒక్కరే వెళ్లారు. వారి ఆరోగ్యం మంచిది కాదు. జబ్బు పడి వచ్చారు. ఎంతకాలం శలవు పెడ్తారు? భద్రమ్మ ఇరకాటంలో పడింది. అటు భర్త – ఇటు లక్ష్మి – ఇద్దరినీ విడిచి ఉండలేదు.

సర్వయ్యగారు, భద్రమ్మ మా ఇంటికి వచ్చారు. లక్ష్మిని తమతో పంపించవలసిందని – కన్నీటితో – నాయనను అర్థించారు. వైష్ణవుల ఇంట్లో ఉంచుతామన్నారు. తమ ఇంట్లో నీళ్లు కూడా తాగనీయం అన్నారు. పెళ్లి కావలసిన పిల్ల. కోమట్ల ఇంట్లో ఉండడం మంచిది కాదని నాయన పంపనంటే పంపను అన్నారు. ప్రార్థనలు వమ్మైనాయి.

విధిలేని దశలో సర్వయ్యవాళ్లు ప్రయాణం అయ్యారు. లక్ష్మి భద్రమ్మను కరిచి పట్టుకుంది. మర్కట కిశోరంలా పట్టుకుంది. వదలదు. వాళ్ల ఏడుపులు. ఈమె

ఏడుపు. వీధి సొంతం కూడింది. అందరి కళ్లూ చెమ్మగిల్లాయి. ఆ దృశ్యం తలచుకుంటే ఈనాటికీ – అర్థశతాబ్దం తరువాత కూడా – హృదయం ద్రవిస్తుంది. అభిజ్ఞాన శాకుంతలం గుర్తుకు వస్తుంది.

సర్వయ్య సార్ వాళ్లు మూడు సార్లు ప్రయాణం అయి మానుకున్నారు. సారుకు అధికారుల వత్తిడి ఎక్కువయింది. రాత్రికి రాత్రి లక్ష్మికి తెలియకుండా వెళ్లిపోయారు.

తెల్లవారి లక్ష్మి ఏడ్చిన ఏడుపుకు – చేసిన గందరగోళానికి వీధి సొంతం తల్లడిల్లింది. నాయన లేరు. మేమేం చేయలేం. లక్ష్మి నిరశనం వహించింది. మూడు రోజులయింది. జ్వరం, అపస్మారంగా ఉంది. వాళ్లనే పలవరిస్తుంది. ఇల్లు ఎడారిలా ఉంది. బావురుమంటున్నది. అమ్మ ఏడుస్తుంది. వంట లేదు. అందరం ఉపవాసం అయినా లక్ష్మి బాధ చూడలేకున్నాం.

లక్ష్మి కలలో వచ్చిందట – రమ్మన్నదట! సర్వయ్య దంపతులు దిగారు. వాళ్ల ఏడుపు – లక్ష్మి ఏడుపు – అమ్మ ఏడుపు – మా ఏడుపులతో ఇల్లు శోకతప్తం అయింది. కొంతసేపటికి తాపం తగ్గింది. లక్ష్మి వాళ్లను పట్టుకొని కూర్చుంది. వదలనంటుంది. వారు వాళ్ల ఇంటికి వెళ్లలేదు.

అమ్మ ఆనాడు స్నానం చేసింది. వంట చేసింది. లక్ష్మి సహితంగా అందరం భోజనాలు చేశాం.

ఉద్యోగమన్నా వదులుకుంటాం – లక్ష్మిని వదిలిపో నంటుంది భద్రమ్మ. మేము స్వతంత్రించాం. లక్ష్మిని దక్కించుకోవాలంటే వారి వెంట పంపాలనుకున్నాం. లక్ష్మి మహదానందంగా వారి వెంట వెళ్లింది.

**ఈ అనుబంధాలే ఇంకా మానవతను కాపాడుతున్నాయి. డబ్బుతో సాధించలేనివానిలో అనుబంధం ప్రధానం అయింది. అనుబంధాలు ప్రకృతి సిద్ధంగా వసంతంలా - వెన్నెలలా - వరదలా రావాలి. మానవు మేధస్సుకు అందనిది - కార్య, కారణ, ఫలితాలు. ఎరగనిది అనుబంధం! అనుబంధం మరణంతో అంతం కానిది. జన్మ జన్మాలకు సాగేది! అనుబంధాలతోనే బ్రతుకు సొగసు!**

కొన్నాళ్లకు నాయన దిగారు. లక్ష్మిని పంపినందుకు మా అందరిమీద కేకలు – కూకలు – అరుపులు కురిపించాడు. తిట్లు – సాపెనలు – క్రోధాలు – ఇంటిమీద ఇల్లు పడ్డట్టు చేశారు. కనీసం భోజనం చేయకుండా తొర్రూరు వెళ్లడానికి బస్సుకు వెళ్లారు.

**మనిషి తాపత్రయం సొంతం అధికారం - పెత్తనం కొరకే! అంతర్జాతీయ స్థాయినుండి సాధారణ వ్యక్తి వరకూ ఎంతో కొంత అధికారం ఉంటుంది. ఈ అధికారానికి గండి పడితే మనిషి సహించలేడు. మళ్లీ ఆ పెత్తనం సాధించడానికి గిజగిజలాడ్తాడు. ప్రపంచ యుద్ధాలనుంచి కుటుంబ కలహాల దాకా ఇదే కథ!**
నాయనకు ఆగ్రహం కలిగిందీ అందుకే! ఇంతకాలం నిర్నిరోధంగా తన మాటకు తిరుగులేకున్నది. ఇప్పుడు తనను ఎదిరించి కాదు కాని – తన ప్రమేయం లేకుండా ఒక పని జరిగింది. మళ్లీ ఇలా జరక్కుండా చేయాలి. తన పెత్తనం మొక్క

పోరాదు. దీన్నే అహంకారం అంటాం. దీన్ని వదులుకొమ్మనే సకల శాస్త్రాలు - మతాలు - విధానాలూ బోధిస్తున్నాయి!

నాయన తొర్రూరులో దిగగానే లక్ష్మి గడగడలాడి పోయింది. నాయన సర్వయ్యగారి మీద వంటికాలుమీద లేచారు - నానా మాటలు అన్నారు, తనకు తెలియకుండా లక్ష్మిని తీసుకొని వచ్చినందుకు! భార్యా భర్తలు ఇద్దరూ నాయన పాదాలమీదపడి వేడుకున్నారు. మన్నించలేదు. అలగోడు బాలగోడు మధ్య లక్ష్మిని గుంజుకొని వచ్చి ఖమ్మంలో పడేశారు. కాలక్షేపం సాయించడానికి ఇనుగుర్తి వెళ్లారు.

లక్ష్మి గడగడలాడిపోతున్నది. ఆమె నరనరాన భయం నిండిపోయింది. ఆకు అల్లాడితే ఏడుస్తుంది. అమ్మ ఆడది. మేం పిల్లలం - ఏం చేయగలం? లక్ష్మి ఎంగిలి పడుతుంది. కాని తినదు. రాత్రిళ్లు ఉలిక్కిపడి లేస్తుంది. పలవరిస్తుంది. మేము ప్రేక్షకులం మాత్రమే! నిస్సహాయులం. అప్పటికీ అమ్మ బొట్టు పెట్టించింది. మొక్కులు మొక్కింది. ముడుపులు కట్టింది.

సర్వయ్యవాళ్లు బెదిరిపోయారు! ఇటు రాలేదు.

గుంటి మల్లన్న మర్రికింద ఇద్దరు బిచ్చగాళ్లకు గత్తర - కలరా - తగిలి చచ్చిపోయారని వార్త. అది విని ఊరంతా గడగడలాడింది. గత్తర వ్యాప్తిని నిరోధించే ఉపాయం లేదు. అమ్మవారికి ఊరి తరఫున మొక్కుకున్నారు. అంతకుమించి చేయగలిగింది లేదు.

**మనిషికి సాధ్యంకానప్పుడు దేవుడు దిక్కు అవుతాడు.**

ఆనాటి ఉదయం లక్ష్మి నలిగినట్లనిపించింది. కడుపునొప్పి అన్నది. సోడా ఉప్పు ఇచ్చాం. తగ్గలేదు. వాంతులు అయినాయి. విరేచనాలు మొదలయినాయి. తోట కూర కాడవలె పడిపోయింది. అది గత్తర - కలరా అని అర్థం అయింది. కాని, ఏం చేయాలో అర్థం కాలేదు.

గత్తర అని బయటికి చెప్పకూడదు. చెపితే వీధివాళ్లు ఇంట్లో ఉండనివ్వరు!

అదొక నికృష్టస్థితి! లక్ష్మికి పడక దగ్గరనే వాంతులు - విరేచనాలు అవుతున్నాయి. మృత్యువు ద్వారం ముందు వేచి ఉంది. చావు రానున్నదని తెలుసు. ఏమీ చేయలేం. అప్పటికి ఈ రోగానికి మందున్నదని తెలియదు. మందు వేస్తే అమ్మవారికి అలక! మంత్రాలే మార్గం!!

ఇంటిముందు నాయుడుగారు ఉండేవారు. వారికి మంత్రాలు వచ్చునని వాడుక. పిలుస్తే వచ్చారు. ఏవో మంత్రాలు వేశారు. కొబ్బరికాయ తలక్రిందులుగా పూడ్చమన్నారు. ఎంత అడిగినా నీళ్లు మాత్రం ఇవ్వద్దన్నారు. వారు రెండు మూడుసార్లు వచ్చి చూచారు.

ఈ స్థితిలో ఇంట్లో కానీలేదు. నేను లక్ష్మిదగ్గర ఉన్నాను. అన్నయ్య ఎక్కణ్ణుంచో పది రూపాయలు తెచ్చాడు. అన్నయ్యను ఉంచి నేను లింగయ్య దగ్గరికి వెళ్లాను. అతను విలవిల్లాడాడు. అతని దగ్గరా లేదు. ఎవరినో అడిగి ఇచ్చాడు. తాను వస్తానన్నాడు. నేనే వారించాను.

అమ్మ బాధను అంచనా వేయడం అసంభవం - మా చెల్లెళ్లు ఇద్దరు. గత్తర అంటువ్యాధి! ఏ క్షణాన ఎవరికి తగులుతుందో తెలియదు. లక్ష్మిని విడువలేదు.

మమ్ముల్ని పట్టలేదు! అమ్మ తన విషయం ఆలోచించడం మరచి చాలకాలం అయింది. తల్లికి పిల్లలే ప్రాణం!

లక్ష్మిబాధ చూడలేకుండా ఉన్నాం. వరుసగా తెల్లని వాంతులు – విరేచనాలు – ఆయాసం – నీరసం – ప్రాణాలు కళ్లల్లో ఉన్నాయి. దాహం, దాహం అని తపిస్తున్నది. నీరు ఇవ్వరాదు అన్నారు. అది చూడలేక చప్పరించడానికి నీళ్లు పోస్తున్నాం. మా అందరికి దుఃఖాలు పెల్లుబుకుతున్నాయి. కుములుతున్నాం. పెద్దగా ఏడవరాదు. పొరుగువాళ్లకు తెలుస్తుంది.

**ఆ రోజు వంటలు లేవు. తిండ్లు లేవు. ఆకళ్లు లేవు. చావు యొక్క అడుగుల చప్పుళ్లు ఇంట్లోకి చేరాయి. అది ఎప్పుడు ఎవరిని తీసుకుపోతుందో? ఎట్లా తీసుకుపోతుందో? ఎందరిని తీసుకుపోతుందో? ఇంట్లో – వంట్లో – ముఖాల్లో – కళ్ళల్లో భయం భయం భయం!"**

సూర్యాస్తమయం వరకు కొద్దిగా తగ్గాయి. అమ్మ అక్కణ్ణుంచి కదల్లేదు. ఆమె వారిస్తున్నా మేము లక్ష్మి పక్కనే ఉన్నాం. భయం తగ్గుముఖం పట్టింది. ఆశ అంకురించింది. లాంతర్లు ముట్టించుకొని కూర్చున్నాం. ఇద్దరు చిన్న చెల్లెళ్లు. వాళ్లకు ఇవేమీ తెలియదు. కడుపు మాడ్చుకుని మూలలకు ముడుచుకున్నారు.

నాయుడుగారు వచ్చి చూచాడు. రోజంతా లక్ష్మి కోసమే పూజలు చేస్తున్నామన్నారు. విభూతి పెట్టారు. మరో టెంకాయ పాతిపెట్టించారు.

రేయి దొర్లిపోతున్నది. మిత్తి పదాల చప్పుడు దూరం అవుతున్నట్లనిపించింది. అర్ధరాత్రికి నాకు కునుకు పట్టింది. తెల్లవారుజామున అన్నయ్య లేపాడు.

"లక్ష్మి చనిపోయింది" అన్నాడు!

నా ప్రాణాలు పోయినట్లనిపించింది. నోట మాటలేదు. అన్నయ్య కుదిపాడు. మనిషిని అయినాక పెద్దగా ఏడుపు వచ్చింది. అన్నయ్య నోరుమూశాడు. ఏడవరాదు!

నేను ఉరికాను. ప్రాణంలేని లక్ష్మి – తల దగ్గర లాంతరు – అమ్మ లక్ష్మిమీద పడి కుమిలి కుమిలి ఏడుస్తున్నది. ఇద్దరు చెల్లెళ్లు బిక్కు బిక్కుమని చూస్తున్నారు!

అర్ధరాత్రి వరకు ముగ్గురు చెల్లెళ్లు! ఇప్పుడు ఇద్దరు!

అలాంటి దుస్థితి ఎవరికీ రాకూడదు!

ఇంట్లో ఆత్మీయుల కళేబరము దుఃఖపు జాడలు బయటికి తెలియరాదు! పొరుగువారు సాయము చేయరు. "అంగవ్రాతములో చికిత్సకుడు దుష్టాంగంబు ఖండించి, శేషాంగ శ్రేణికి రక్షణ సేయు క్రియ" – లక్ష్మిని వేగమే పంపి మిగిలిన వారిని రక్షించుకోవాలి.

అమ్మ అక్కణ్ణుంచి లేచింది. ఇద్దరు చెల్లెళ్లను కరిచి పట్టుకొని కూర్చున్నది. "కానున్న కార్యము జరిపించాలె. మనం బయటపడాలె. వీండ్లను రక్షించుకోవాలె" అన్నది.

బతకడానికి – బతికించుకోవడానికి బండబారడం అవసరమేమో!

అన్నయ్యా – నేనూ బయటి వచ్చాం. తెల్లవారక ముందు లక్ష్మిని బయట పడెయ్యాలి. అమ్మ తీసికెళ్లలేదు. మనకు చేత కాదు. ఎక్కడికి తీసికెళ్లాలో తెలియదు. ఏం చేయాలో తెలియదు. ఎవరి సాయమూ అడగలేం. ఎవడూ సాయం

చేయడు. ఏం చేయాలి? అర్థంకాదు. ఇద్దరం తడుముకుంటున్నాం. ఇలాంటి ఆపదలు నెత్తిన పడాల్సిన వయసు కాదు. ఆలోచనలు రావు. నాకు అమాంతంగా స్ఫురించింది. అన్నయ్యను ఇంటిదగ్గర ఉండమన్నాను. నేను బయల్దేరాను.

నేను లింగయ్య ఇంటికి వెళ్లాను. తలుపు తట్టాను. లింగయ్య తలుపు తీశాడు. అతనిని చూడగానే నాకు ఏడుపు పొంగి వచ్చింది. బిగ్గరగా ఏడ్చాను. గ్రహించినట్లున్నాడు. నన్ను కాల్వ వడ్డుకు తీసికెళ్లాడు. ఓదార్చాడు. విషయం తెలుసుకున్నాడు. నన్ను అక్కడే ఉండమన్నాడు. వెళ్లాడు. కొంతసేపటికి సుమారు భూతంలా కనిపించే వ్యక్తిని వెంటపెట్టుకొని వచ్చాడు. అతని చేతిలో గోనెసంచి ఉంది.

ముగ్గురం మా ఇంటివైపు బయలుదేరాం. అన్నయ్య ముందునుంచున్నాడు. అందరం మౌనంగా ఉన్నాం. అంతా నిశ్శబ్దం. అన్నయ్య సహితంగా నలుగురం ఇంట్లోకి వెళ్లాం. వచ్చినవాడు లక్ష్మిముందు – శవం అనబుద్ధి కావడంలేదు. క్షణం నుంచున్నాడు. లింగయ్య వాడికి డబ్బిచ్చాడు. వచ్చినవాడు లక్ష్మిని బస్తాలో చుట్టి ఎత్తుకున్నాడు.

అమ్మ భరించలేకపోయింది.

లక్ష్మిని పట్టుకొని గొల్లుమన్నది.

మేము ఆమెనోరు మూశాం.

వచ్చినవాడు లక్ష్మిని తీసుకొని సాగిపోయాడు – లింగయ్య వాణ్ణి అనుసరించి వెళ్లిపోయాడు.

**కన్నీటి కుండలు తలమీద పెట్టుకొని అలా కాలువవైపు వెళ్తున్నవాళ్లను చూస్తున్నాం. అంత కఠినంగా - అంత నిర్దయగా - ఏ లాంఛనమూ లేకుండా లక్ష్మిని సాగనంపాం!**

**సాగిపోతున్న లింగయ్య వెనుకనుంచి శివస్వామిలా కనిపించాడు!**

**దైవం ఇందుకే కూర్చినట్లున్నాడు! లింగయ్య మళ్లీ కనిపించలేదు!!**

పోయినవాళ్లు పోయారు. ఉన్నవాళ్లను రక్షించుకోవాలి. ఇల్లు మృత్యువుకు హారంలా ఉంది. ముందు బయట పడాలి. ఇంటికి తాళం వేశాం. గమ్యం లేకుండా సాగాం. స్టేషను చేరుకున్నాం. అప్పటికి తెల్లవారింది. మా ముఖాలు మాకే అసహ్యంగా ఉన్నాయి! కాలిన కొంపల్లోంచి బయటపడ్డట్లున్నాం.

అక్కడ నిర్ణయించుకున్నాం. అన్నయ్య నాయన దగ్గరకు ఇనుగుర్తి వెళ్తాడు. నేను అమ్మను తీసుకొని గూడూరు వెళ్లాలి. మేము వరంగల్లు బస్సు ఎక్కాం. అందరూ మమ్ములను వింతగా చూస్తున్నారు. గత్తర తగిలి బయటపడ్డట్లున్నాం. బస్సు మమ్ములను 'నాగారం' స్టేజిలో దింపింది. రావి చెట్టుక్రింద కూలబడ్డాం. అక్కణ్ణుంచి ఎద్దుల బండిలో గూడూరు చేరాలి.

నిన్నటినుంచి కనీసం నీళ్లు తాగిన గుర్తులేదు. దాహం అయింది. ఎదురుగా మోట బావి కనిపించింది. మోట కొడ్తున్నాడు. అతడు మమ్ములను చూచాడు. దడుచుకున్నట్లున్నాడు. బావి దగ్గరకు రావద్దన్నాడు. అమ్మ చాల దీనంగా ప్రార్థించింది. తాతయ్య పేరు విని మెత్తపడ్డాడు. నీళ్లు తాగనిచ్చాడు. ముఖాలు కడుక్కొని నీళ్లు – అందరం కడుపునిండా తాగాం. కొంత సత్తువ వచ్చింది. "లక్ష్మి కాలు జారి

బావిలో పడి చనిపోయిం"దని మా కథ సొంతం అతనికి వెళ్లబోసుకున్నాం. గత్తర తగిలి చచ్చిందంటే ఊళ్లోకి రానివ్వరు. అందుకు అబద్ధం. అతను జాలి పడ్డాడు. తన బండి తెచ్చాడు. మమ్ములను ఎక్కించుకున్నాడు. గూడూరు చేర్చాడు.

తాతయ్యను చూచింది అమ్మ. ఆపుకోలేకపోయింది. గొల్లుమన్నది. మేమూ, చెల్లెళ్లూ నిన్నటి నుంచి దుఃఖం దిగమింగాం – వెళ్లకక్కాం. ఊరంతా కూడింది. అదే అబద్ధపు కథ! లక్ష్మి బావిలో పడింది. బంధువులు వచ్చారు. ఓదార్చారు. వైరాగ్యం బోధించారు. తమ అనుభవాలు చెప్పారు. మాకు స్నానాలు చేయించారు. భోజనాలయినాయి. ఒడలు తెలియని నిద్రపోయాం.

సాయంకాలం ఏడుపులు – పెడబొబ్బలు విని లేచాం. సర్వయ్యగారు – భద్రమ్మ కొస ప్రాణాలతో ఉన్నారు. గుండెలు అవిసేట్లు ఏడుస్తున్నారు. అమ్మ వాళ్లమీద పడి ఏడ్చింది. దుఃఖం సొంతం గుమ్మరించింది. **"నా బిడ్డను గుంజుకుపోయి చంపిన్రమ్మా!" అన్న భద్రమ్మ ఏడుపుకు కూడిన వారంతా కన్నీరు పెట్టారు.**

సర్వయ్యగారు, భద్రమ్మ తామే నేరం చేసినట్లు విలవిల్లాడారు. ఆ రాత్రి తినలేదు. తెల్లవారి ఉండలేదు. వెళ్లిపోయారు.

తెల్లవారి అన్నయ్య ఒక్కడే దిగాడు. నాయన ఇల్లు చూసుకోవడానికి ఖమ్మం వెళ్లారట. ఇంట తాళాలు వగైరా భద్రంగా చూసి మూడోనాడు వచ్చారు. తామే తప్పు చేశామని విలపించారు. విధిని నిరోధించడం ఎవరికీ సాధ్యపడదని కథలు చెప్పారు. నాయన తాతయ్య ఇంటికి రాలేదు. మేమే మా ఇంటికి మారాం.

**కాలం ఆగదు కదా! కాలాన్ని ఆపలేరు కదా! కాలం దాని ధర్మం నిర్వర్తిస్తుంది గదా! అది సాగిపోతున్నది.**

అమ్మ కడుపుచిచ్చు చల్లారలేదు. తొర్రూరు నుంచి గుంజుకొని వచ్చి నాయనే లక్ష్మి ప్రాణాలు తీశారంటుంది. అనటం కాదు. అదే అంటుంటుంది. నాయన విధిబలీయం అని మృత్యువే గుంజుకు పోయిందని చెపుతుంటారు.

ఒకనాడు కడుపు చిచ్చు కార్చిచ్చు అయింది. అమ్మకూ నాయనకూ భీషణ యుద్ధం జరిగింది. అమ్మ గట్టిగా కేకలు పెట్టింది. నాయన గొంతు చించుకొని అరిచారు. అమ్మను జుట్టు పట్టుకొని కొట్టారు. అమ్మ పళ్లు ఊడిపోయాయి. నోటి నిండా రక్తం. రక్తం ఉమిస్తున్నది. తల నేలకు వేసుకొని కొట్టుకుంటున్నది. నాయన దుర్వాసుడు అయినారు. అమ్మను జుట్టుపట్టి గుంజుకు పోయి వీధిలోకి నెట్టారు. మొత్తుకుంటున్న ఇద్దరు చెల్లెళ్లను అమ్మమీద వేశారు. తలుపు వేసుకున్నారు.

ఊరిజనం సొంతం గూడారు.

ఒక్కరూ పలకలేదు – నాయనంటే భయం!

తాతయ్యా – అమ్మమ్మా అమ్మనూ, చెల్లెళ్లనూ తీసికెళ్లారు.

సూర్యుడు సిగ్గుపడి క్రుంగిపోయాడు!

ఇంట్లో మేము ముగ్గురమే. నేను వంట చేశాను. భోజనాలు అయినాయి. అన్నయ్యా, నాయనా ఏమనుకున్నారో నాకు తెలియదు. తెల్లవారి ఇంటి ముందు బండి నిలిచింది. సామానులు ఎక్కించారు. నన్ను ఎక్కమన్నారు. ఎక్కడికో తెలియదు. నాకు అమ్మా – చెల్లెళ్ల మీద గుంజుతున్నది. అయినా ఎక్కను

అనలేకపోయాను. ఎక్కాను. వాళ్ళూ ఎక్కారు. బండి వాస్తవంగా తాతయ్య ఇంటిముందునుంచి వెళ్లాలి. దోవ మార్చారు. ఊరు దాటింది. అప్పుడు తెలిసింది మానుకోట వెళ్తున్నామని!

బండిలోనే నాకు కడుపు నొప్పి మొదలయింది. నాయన వేసుకునే సోడా ఉప్పు ఇచ్చారు. కాస్సేపటికి వాంతులయినాయి. తరవాత రెండు అయినాయి. చెరువు దగ్గర బండి ఆపారు. సరిగ్గా లక్ష్మికి అయినట్లే అవుతున్నది. డీలా పడిపోయాను. అమ్మా, చెల్లెళ్లనూ చూడకుండానే చచ్చిపోతానని భయం. వెనక్కు పోవాలనిపిస్తుంది. చెప్పలేను. భయం.

నక్కలు దూరంగా ఉరుకుతున్నాయి!

ధైర్యం తెచ్చుకున్నాను. వెనక్కుపోదాం అన్నాను.

నన్ను బండిలో వేశారు. నాకు దాహం. నీళ్లివ్వరు. బండిముందుకే సాగుతున్నది. మానుకోట చేరింది. ఏవో మందులూ మాకులూ ఇచ్చారు. కాస్త తగ్గాయి.

మేము రైలెక్కాం.

## పదమూడు

హైదరాబాదు నగేనా
అందర్ మట్టి ఊపర్ చున్నా.

హైదరాబాదు సౌందర్యం
లోన మట్టి, పైన సున్నం.

మేము హైదరాబాదు – నాంపల్లి స్టేషనులో దిగాం. రాత ఉర్దూ, భాష ఉర్దూ. వేషాలు షేర్వానీలు – కుచ్చుటోపీలు. ప్లాటుఫారం మీద తమలపు ఉమ్ములు, ఎర్రని మరకలు. బొట్లూ – ధోవతులతో మేం దిగాం. అందరికీ వింత. కొందరు ఇకిలించారు. కొందరు సకిలించారు. కొందరు అపహాస్యం చేశారు.

దేశంకాని దేశానికి వచ్చినట్లున్నది!

ఒకడు తెలుగు వానివలె ఉన్నాడు. 'ఏమ్మిటికి వచ్చిన్రు? ఏడికి పోతరు? సీతరాంబాగ్‌కెనా? ఎంతిస్తరు?' అన్నాడు. సామాను అందుకున్నాడు. టాంగాలో పెట్టాడు. మమ్ములను ఎక్కించుకున్నాడు. ఒక కోటలోనికి తీసికెళ్లాడు. దింపాడు.

అది పూర్ణమల్ తోట – సీతారాంబాగ్ అంతా కొత్త. ఎవరూ తెలియరు. నాయనకు కొత్తంటూ లేదు. వారి వాగ్ధారతో ఎవరినైనా వశపరచుకోగలరు.

నాయన మార్వాడీ ధర్మకర్త దగ్గరకి వెళ్లాడు. అతనికి తెలుగు రాదు. వీరికి హిందీ రాదు. అయినా అతనితో దాసోహం అనిపించారు. అతడు అప్పటికి అప్పుడే ఒక మంచి ఇల్లు ఏర్పాటు చేశాడు. మేము గృహప్రవేశం చేశాం. వంట పాత్రలు – వంట సామగ్రి వచ్చింది. వంట నేనే!

ఇల్లు వసతిగానే ఉంది. కాని కరెంటు లేదు. అది జన సామాన్యానికి అందుబాటులో లేదు. పంపు – నల్లా – ప్రత్యేకంగా లేదు. ఉమ్మడి నల్లాయే. చాలకొద్దిమందికి ఇళ్లల్లో నల్లాలుంటాయి. వంట బొగ్గులమీద. దాన్ని కొల్సా అంటారు. కూరగాయలు అతి చవక. హోలీపైసలో సగాన్ని, "ధేలా" అంటారు.

పైస కూరగాయలు సరిపోతాయి. సరుకులు చవక. మంచివి దొరుకుతవి. ఉప్పు సహితంగా అన్నీ తూకమే. కొలత తక్కువ. ఇక్కడి తూకం శేర్లు. సేరుకు 80 తులాలు. నూట ఇరవై సేర్లు పల్లా.

సీతారాంబాగ్ వాతావరణానికి బయటి వాతావరణానికి పోలిక లేదు. ఇక్కడ దాక్షిణాత్యుల వరదరాజ స్వామి దేవాలయం ఉంది. మార్వాడీల సీతారామస్వామి దేవాలయం ఉంది. ఇది దేవాలయ ప్రాంగణం. పుష్కరిణులు – ఉద్యానాలు – గోశాలలు అన్నీ పెరుమాళ్ళవే. మంచితోటలు – దొడ్లు – వృక్షాలు – ఆశ్రమంలా ఉంటుంది.

బయటివలె ఇక్కడ తురక కనిపించదు. తురకవేషం కనిపించదు. అందరూ శ్రీవైష్ణవులే. ధోవతులు – కండువాలు – శిఖాయజ్ఞోపవీతాలు – ద్వాదశ ఊర్ధ్వపుండ్రాలు – సంస్కృత – ద్రావిడ వేదపరనాలు – సాక్షాత్తు శ్రీరంగంలా ఉంటుంది – కారివే తప్ప.

తురకలు వైష్ణవులను బొట్లు పెట్టుకోనిచ్చేవారు కారట. బయటికిపోతే బొట్లు నాకేసేవాళ్లట. ఒక తెలివైన వైష్ణవుడు తిరుమణిలో వసనాభి కలిపి బొట్లు పెట్టారట. అది నాకిన తురకలు అందరూ చచ్చారట. అప్పణ్నుంచీ నాకడం మానేశారు. కాని 'ఏక్సాగ్యారా' అని హేళన చేస్తారు.

అది మరలకు అంతగా మరగని కాలం. దురాశ ఇంకా మనసుల్లో దూరనికాలం. సమృద్ధికాలం. ఆలయాల్లో మూడు సార్లు అందించే వివిధ ప్రసాదాలతో నాలుక – కడుపు రెంటి ఆకళ్ళు తీర్చుకోవచ్చు. అదికాక సంపన్నులు సుమారు ప్రతిరోజూ తడియారాధనలు – సమారాధనలు – చేయిస్తుంటారు. అక్కడ నేయి, పెరుగు, అనేక తీపి పదార్థాలు లభిస్తాయి. సాపాట్లు ఉంచి, సంభావనలు కూడా ఇచ్చేవారు.

కరువు ఎరుగని కాలం అది!

అక్కడ సంస్కృత పాఠశాల ఉండేది. ఉచిత భోజన వసతి కల్పించి చదువు చెప్పేవారు. యూనివర్సిటీలో సిలబస్ కాదు – సంప్రదాయ విద్య. అక్కడ చదివి అనేకమంది విద్వాంసులు అయినారు.

హైదరాబాదు వాతావరణం అత్యంత అనుకూలం అయింది. సమశీతోష్ణ ప్రదేశం. చలికాలంలో చలి ఎక్కువైనా ఎండ కాలంలో ఎండ ఉండదు. కొద్దిగా ఎండ తీక్ష్ణం అవుతే సాయంత్రానికి ఒక జల్లు. గండిపేటనీళ్లు రుచికరములు – ఆరోగ్యకరములు.

గండిపేట్‌కా పానీ – హైదరాబాద్‌కీ బిర్యానీ ప్రసిద్ధములు.

నాకు సీతారాంబాగ్ బాగా నచ్చింది. కాని, అమ్మ – చెల్లెళ్లను గురించిన బాధ సతాయించేది. మానుకోట మార్గంలో మొదలయిన కడుపునొప్పి తగ్గలేదు. రాత్రిళ్లు చాల బాధపెట్టేది. నొప్పి భరించలేక వీధుల్లో పరిగెత్తేవాణ్ణి.

హైదరాబాదు రావడానికి కారణం నాకు తరువాత తెలిసింది. ఒకటి – నాయన అమ్మకు గుణపాఠం నేర్పదలచుకున్నాడు. రెండు – ఆ సంవత్సరం అన్నయ్య మెట్రిక్ లెక్కల్లో ఫెయిలైనాడు. తాను మళ్లీ ఖమ్మంలో చదవనన్నాడు. నాయన అన్నయ్యను హైదరాబాదులో చదివిస్తానన్నాడు. అన్నయ్య తన సాహిత్య వ్యాసంగానికి పట్నం పనికి వస్తుందనుకున్నాడు. పట్నం రావడానికి ఒప్పుకున్నాడు. అమ్మనూ –

చెల్లెళ్లనూ వదిలి రావడం నాకు బాగనిపించలేదు. అన్నయ్యతో అన్నాను. 'అయితే నువ్వు వెళ్లు' అన్నాడు అన్నయ్య నన్ను.

నాయన అన్నయ్యను నాంపల్లిలో ఒక ట్యూటోరియల్లో చేర్చారు - బహుశః అది ఒక్కటేనేమో అప్పటికి. అక్కడ ఫీజు నెలకుపది రూపాయలు. ఆ పది రూపాయలకు గాను నాయన వారానికి మూడు సార్లు ఆ ట్యూటోరియల్లో తెలుగు పీరియడ్ తీసుకునేవారు. అది వేమన గ్రంథాలయానికి పక్కనే ఉండేది. అది అన్నయ్యకు బాగా ఉపకరించింది.

నాయనా - నేనూ మల్లేపల్లి చెరువు కట్టమీది నుంచి నడిచి ట్యుటోరియల్కు వెళ్లేవాళం. అప్పుడే CIB వాళ్లు మల్లేపల్లిలో క్వార్టర్సు కడ్తున్నారు. వాటినే ఆగాపుర క్వార్టర్సు అన్నారు. అవి తురకల గోషాకు అనుకూలంగా కట్టారు. ఒక్కొక్క బ్లాకు వర్తులంగా ఉంటుంది. అందులో ఉన్న ఇళ్లకు ప్రవేశ ద్వారం ఒక్కటే. ఆ ఇళ్లకు కరెంటు లేదు. సర్కారు వారు ఇంటింటి నల్లాలు ఇవ్వలేదు. అయిదో దశకంలో కమల మేనమామ నారాయణాచార్యులకు ఆగాపురంలో ఇల్లుండేది.

హైదరాబాదులో ఉండగా నాయన అనేకమంది ప్రముఖుల పరిచయాలు సంపాదించాడు. నేనూ వారివెంట వెళ్తుండేవాణ్ణి. అందువల్ల వారితో పరిచయం అవలేదు కాని దర్శన భాగ్యం కలిగింది. వారి సంభాషణల్లో రామాయణ, భారత, భాగవతాది పురాణాలు, వైష్ణవ ప్రబంధాల ప్రస్తావన ఎక్కువ. అవి నాకు రుచించేవి. తరవాత కాలంలో ఉపకరించాయి.

సెక్రటేరియట్ ముందు నాయని వెంకటరంగారావు బహద్దుర్ వారు ఉండేవారు. వారు మునగాల రాజావారు. కృష్ణ దేవరాయ గ్రంథాలయాన్ని స్థాపించినవారు వారే. కొమర్రాజు లక్ష్మణరావుగారు వారి దివాను. అప్పటికి సెక్రటేరియట్ ఊరి బయలు.

వారి ఇంటిముందు ఎల్లవేళలా జవాను కాపలా ఉండేవాడు. నాయనకు ప్రవేశం లభించలేదు. అప్పటికి ఫోనులు అంతగా లేవు. నాయన ఒకరి ఇంటినుంచి పోను చేసి రాజావారితో మాట్లాడారు. తరువాత రాజా వారే గేటు దగ్గరికి వచ్చి నాయనను తీసికెళ్లారు. తరువాత చాల సార్లు వెళ్లాం. వారు ఉదారులు. తరువాత తొమ్మిదవ దశకంలో కోదాటి నారాయణరావుగారి "చిన్ననాటి ముచ్చట్లు" పుస్తకంలో రాజావారు బయటి వారికే ఉదారులు - సంస్థాన ప్రజలకు వారు చేసింది ఏమీ లేదని అర్థం అయింది.

మొ అజ్జం జాహీ మార్కెటు కట్టి అప్పటికి ఎంతో కాలం కాలేదు. దాని దగ్గరలో ఉన్న వనపర్తి బిల్డింగ్స్లో బూరుగుల రామకృష్ణారావుగారు ఉండేవారు. వారు ప్రసిద్ధ అడ్వకేటు. బహు భాషా కోవిదులు. రాజకీయ నాయకులు. వారితో నాయనకు సన్నిహిత సంబంధం. వారు ఎంత పనిలో ఉన్నా నాయన వచ్చారంటే వదిలి వచ్చేవారు. పాదాభివందనం చేసేవారు. నాయన శ్రీసూక్తి సాయించినంతసేపు కదిలేవారు కారు. బూరుగుల వారు తరువాతి కాలంలో హైదరాబాదు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయినారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడటానికి స్వచ్ఛందంగా ముఖ్యమంత్రి పదవిని వదులుకున్నారు. ఉత్తరప్రదేశ్ - కేరళ గవర్నరు పదవులను నిర్వహించి

దివంగతులయినారు. ఇటీవల వారి పుత్రులు రంగనాధరావుగారు, రామకృష్ణారావు వారి రచనలను ఒక్కొక్కటిగా ప్రచురిస్తున్నారు.

తోప్ కా సాంచా - గన్‌ఫౌండ్రీ వద్ద గోలకొండ పత్రిక కార్యాలయం. అందులో విజ్ఞానఖని సురవరం ప్రతాపరెడ్డిగారు. వారు పురాణాదులు విశ్వసించేవారు కారు. దాడి చేసేవారు. వారికీ నాయనకు దగ్గరి పరిచయం. ఉభయులు భిన్న దృక్పథాలవారు. అయినా ఎంతో సామరస్యంగా చర్చించుకునేవారు.

ఒకసారి సురవరంవారు శ్రీవేంకటేశ్వరస్వామి వైష్ణవుడు కాడు, శివుడు అని గోలకొండలో ఒక వ్యాసం వ్రాశారు. ఆ విషయంలో నాయనకూ వారికి ఉద్రేకాలు లేని చర్చ జరిగింది. తరువాత శ్రీనివాసుడు వైష్ణవుడే అని నాయన నిరూపించారు. ఆ వ్యాసాన్ని కూడా సురవరం వారు ప్రకటించారు. ఈ వివరాలు నేను రచించిన "వేంకటేశ్వర మాహాత్మ్యము"లో వివరించాను.

ట్రూపు బజారులోని ఆంధ్రకుటీరంలో ఆంధ్రపితామహులు మాడపాటి హనుమంతరావుగారు ఉండేవారు. నాయనతో నేను తరచుగా వారి దగ్గరికి వెళ్లేవాణ్ణి. వారు సాధు స్వభావులు. ఒకరిని నొప్పించరు. అన్ని వాదాలనూ సాకల్యంగా వింటారు. నాయనకూ వారికీ రామాయణం విషయంలో తరచు చర్చ జరగేది. వాల్మీకి రామాయణం విషయంలో శ్రీవైష్ణవులు ఎంతో కృషి చేశారు. నాయన రామాయణంలో నిష్ణాతులు.

అరవ దశకంలో హనుమంతరావుగారితో నాకు సన్నిహిత సంబంధం ఏర్పడింది. వారు హైదరాబాదు నగర ప్రథమ మేయర్. అప్పుడు కాళేశ్వరరావుగారు స్పీకరు. ఒకసారి అంతటివారు కలుసుకున్నప్పుడు నేను అక్కడ ఉండే అదృష్టం కలిగింది. వారు చమత్కారులు.

కాళేశ్వరరావుగారు "స్పీకరు" అన్నారు హనుమంత రావుగారు. అంటే మాట్లాడరు అని అర్థం. ఇంగ్లీషులో "స్పీకర్" అంటే మాట్లాడేవాడు. కాని స్పీకర్ పదవి వినడానికే - మాట్లాడ్డానికి కాదు. అందుకే దానికి తెలుగు ప్రత్యయం చేర్చి "స్పీక రు" చేశారు.

కాళేశ్వరరావుగారు వెంటనే హనుమంతరావుగారు "మేయరు" అన్నారు. మేయర్‌గా కార్పొరేషను డబ్బు కాజేయలేనివారు అనే అర్థంలో "మేయ రు" అనే పదం ఉపయోగించారు.

ఆ తరువాత హనుమంతరావుగారు శాసన మండలి అధ్యక్షులయినారు. ఉభయ సభలకు కాళేశ్వరరావుగారు, హనుమంతరావుగారు ఎంతో గౌరవ ప్రతిపత్తులను సమకూర్చారు.

వట్టికోట ఆళ్వార్‌స్వామి - వావిలాల గోపాలకృష్ణయ్య, నేను ఒక కమిటీగా ఏర్పడి మాలపల్లి రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ గారికి సన్మానం తలపెట్టాం. ఈలోగా లక్ష్మీనారాయణగారు పరమపదించారు. కాళేశ్వరరావుగారి అధ్యక్షతన మహబూబ్ కాలేజీలో ఉన్నవ వారి సంతాప సభ జరిపాం. ఉన్నవ మాలపల్లిలో మల్లెపొదలు మొలిపించారు అనే గేయం చదివాను.

నీలం సంజీవరెడ్డిగారు నా "రణరంగం" గాంధీభవనంలో ఆవిష్కరించినపుడు ఆంధ్రపితామహులు విచ్చేశారు. ఆనాటి వారి ఫోటో, వారు వ్రాసిన ఉత్తరం నాదగ్గర ఉన్నాయి.

నా "చిల్లరదేవుళ్లు" ఆంధ్రపితామహులకు అంకితం ఇచ్చాను.

వారు పరమపదించినపుడు "ఆంధ్ర పితామహ" అనే వ్యాసం వ్రాశాను. 15.11.1970 విశాలాంధ్రలో వచ్చింది. ఆ వ్యాసం చివరన ఒద్దిరాజు రాఘవ రంగారావుగారి పద్యం ఉటంకించాను.

ఆంధ్రసారస్వతము నిజామాంధ్ర సంఘ
మిటుల నెన్నిటినో గూర్చి ఘటికులందు
నొక్కరుడవయి మించితి వుక్కుమిగుల
రమ్యగుణసాంద్ర హనుమంతరామ చంద్ర!

కొత్వాల్ వెంకట్రామరెడ్డిగారిని నాయన కలుసుకున్న ఉదంతం విచిత్రం. వారి ఇల్లు నారాయణగూడెం వై.యం.సి.ఏ. పక్కన ఉండేది. అప్పటికి అక్కడ జనావాసాలు తక్కువ. రెడ్డిగారి ఇంటి ముందున్న జవాను నాయనను లోనికి వెళ్లనీయలేదు. టెలిఫోను మంత్రం పని చేయలేదు. టెలిఫోను వేరేవాళ్లు తీశారు.

ఒకనాడు జవాను లేనిది చూచి లోనికి దూరాం. హాలులో తురక వేషాల్లో రెడ్డిగారి సహితంగా నలుగురు – గద్దిమీద కూర్చుని, ఉర్దూలో మాట్లాడుకుంటున్నారు. అకస్మికంగా నాయన దూరడం వారిని చకితులను చేసింది. ఇంకా వారు తేరుకోకముందే నాయన ఉపన్యాసం ప్రారంభించారు. ఆ నలుగురూ గంటసేపు నిర్విరామంగా నాయన ఉపన్యాసం విన్నారు. ఎంతో ప్రభావితులు అయినారు. వెంకట్రామారెడ్డిగారు నాయనకు వందరూపాయాలు సమర్పించి, పాదాభివందనం చేశారు!

ఇంకా అరావముదమ్ అయ్యంగార్ – నర్సింగ్‌రావు మున్నగు అనేకమందిని నాయన కలుసుకున్నారు.

అప్పుడు టాంగాలు ఎక్కువ. మనుషులు లాగే రిక్షాలు అప్పుడప్పుడే వస్తున్నాయి. మేము కాలినడకనే వెళ్లేవాళ్లం. మరీ దూరం అవుతే అణా – బేడ ఇచ్చి రిక్షాలో వెళ్లేవాళ్లం. వీధులు విశాలంగా శుభ్రంగా ఉండేవి. రోడ్లమీద కొంత కొంత దూరానికి రేకులు – తట్టలు పట్టుకొని మనుష్యులుండేవారు. గుర్రం లద్ది పెట్టినా, చెత్త పడినా వెంటనే తీసేవారు. ట్రాఫికు ప్రధాన మార్గాల్లో కూడా పల్చగా ఉండేది.

నేను తీరిక సమయాల్లో గ్రంథాలయంలో కూర్చునేవాణ్ణి. గోలకొండ పత్రిక కాక "రహబర్ దక్కన్", "రయ్యత్", "ఇమ్రోజ్" లాంటి ఉర్దూ పత్రికలు వచ్చేవి. యుద్ధ వార్తలు ఎక్కువ. బ్రిటిషిండియాలో స్వాతంత్ర్య ఉద్యమ వార్తలు ఉత్సాహాన్నీ; గాంధీజీ, నెహ్రూ, సుభాస్ ఉపన్యాసాలు ఆవేశాన్నీ కలిగించేవి. ప్రజాపోరాటాల్లో నాయన ఉపన్యాసాల పాత్రను గురించి ఆలోచించేవాణ్ణి. కాని, వ్యతిరేకించేవాణ్ణి కాదు. విరోధించేవాణ్ణి కాను.

'భారతి' ఆరోజుల్లో కనిపించిన ఏకైక సాహిత్య పత్రిక. ఎందరో మహానుభావులు ఎన్నో విషయాలను గురించి అందులో వ్రాసేవారు. మా అన్నయ్య దాశరథి

కృష్ణమాచార్యుల పద్యాలు ఒకటి రెండు సార్లు వచ్చాయి. ఎంతో బాగా వ్రాశాడు. నాయన తప్ప అనేకమంది మెచ్చుకున్నారు.

సీతారాంబాగ్‌లో ఇలా కొంతకాలం గడిచింది. నా కడుపునొప్పి తగ్గలేదు. మందూ మాకూ లేదు. పని తప్పదు. అజీర్ణం. అప్పుడప్పుడూ కుండెడు కుండెడు వాంతి.

ఇలా ఉండగా ఒకనాడు అమ్మా చెల్లెళ్లూ దిగారు. నాకు ఎంతో సంబరం అయింది. అన్నయ్య కూడా ఆనందించాడు. అమ్మ దగ్గరా, చెల్లెళ్లతో కాలక్షేపం చేశాను. నాయన ముభావం వహించారు. అభావం లేదు. విసర్జన లేదు. సర్దుకుపోవడం అమ్మకు పుట్టుకతోనే వచ్చింది. నాకు పని తప్పింది. కాని, జబ్బు హెచ్చింది. రోజూ వాంతులు అవుతున్నాయి. అమ్మ వచ్చిందని తెలిసి కావచ్చు, మామగారు కమలను తీసుకొచ్చారు. రెండు మూడు రోజులున్నది. ఎప్పుడూ అమ్మతోనే ఉండేది. నాతో మాట్లాడినట్లు గుర్తులేదు.

ఈ తడవ పెద్దగా గొడవలున్నట్లు అనిపించలేదు. నాయనకూ అమ్మకూ ఆప్యాయత లేక కలకాలం అయింది. సర్దుకుపోతున్నట్లు అనిపించింది. అన్నయ్య లెక్కల్లో మళ్లీ తప్పాడు.

ఒకనాడు తెల్లారేవరకు అన్నయ్యా - అమ్మా - చెల్లెళ్లు లేరు. రాత్రే వెళ్లిపోయినట్లున్నారు. నన్ను వదిలిపోవడం ఎందుకు? నేను పెద్దగా ఏడ్చాను. నాయన తొలిసారి నన్ను ఓదార్చారు! నాకు జబ్బు - వాంతులు. నాయన నన్ను బన్సీలాల్ ఆస్పత్రిలో చేర్పించారు. వారు గౌలీగూడెంలోని నరసింహాచార్యులవారి హోటల్లో చేరారు.

హోటలంటే ఇవ్వాల్టి హోటలు కాదు. అది పూటకూళ్ల ఇల్లే. వైష్ణవులు - వైష్ణవమతాభిమానులు అక్కడికి వచ్చేవారు. ఒక హాలుండేది. ఉంట పంట అక్కడే. రెండు గదులుండేవి. సంపన్నులు కానీ, అందులో ఉండేవారు కాదు. మాకు ఒక గది ఇచ్చారు. మాకు గది - భోజనం ఉచితం. నాయన తీరిగ్గా ఉన్నప్పుడు శ్రీసూక్తి పాయిస్తారు.

నాయన "దాశరథి" అనే ఒక మాసపత్రిక వెలువరించడం ప్రారంభించారు. వానిలో ద్రావిడ ప్రబంధాల ఆంధ్రానువాదం ఉండేది. అనువాదం కొంత నేను - కొంత నాయన చేసేవారం. అచ్చుపని బాధ్యత సొంతం నాది. పత్రికలు పంపడం నాయనా నేనూ కలిసి చేసేవాళ్లం.

హైదరాబాదులో తెలుగులేదు. ఉర్దూయే. తెలుగు మాట - తెలుగు అచ్చు - తెలుగు సినిమా - తెలుగు నాటకం - తెలుగు సభ అంటే సికిందరాబాదు వెళ్లాల్సిందే. రెండే రూట్లలో బస్సులుండేవి. నాంపల్లి మీదినుంచి 8, బషీర్‌బాగ్‌మీదనుంచి 7 నెంబరు బస్సులు సికిందరాబాదు వెళ్లేవి. నాకు సగం టిక్కెట్టు. అణాకు సికిందరాబాదు చేరేవాణ్ణి.

హుసేన్ సాగర్‌లో తామరపూలు - అల్లిపూలు - కలువ పూలు ఉండేవి. కట్ట కింద "కెవుడాబన్" - మొగిలి వనం పొలాలు ఉండేవి.

కొన్నాళ్లు భారతీ ప్రెస్సులోనూ, కొన్నాళ్లు ప్రీమియర్ ప్రెస్సులోనూ "దాశరథి" అచ్చయింది. యుద్ధం మూలంగా మిల్లు కాగితం లభించేది కాదు. చేతికాగితం డెమ్మీ

సైజు రీము ఎనిమిది హాలీ రూపాయలు. అచ్చుకు ఫారం ఆరు రూపాయలని గుర్తు. నేను నిత్యమూ సికిందరాబాదు వెళ్లేవాణ్ణి. రోజంతా ప్రెస్సులోనే. కూర్పించే పనో, ప్రూఫ్సు చూచే పనో! పనివాళ్లంతా దోస్తులయినారు. అప్పుడప్పుడూ అణాకు ఒక గులాబ్ జాం, షోలాపూర్ మిఠాయి దుకాణంనుంచి తెప్పించుకొని తినేవాళ్ళం.

నాయన ఎప్పుడోగాని వచ్చేవారు కారు. ముఖ్యంగా డబ్బు చెల్లించడానికి. పనంతా నేనే చూచి పుస్తకాల కట్టలు రోజు ఒకటి చొప్పున బస్సులో చేర్చేవాణ్ణి. ఇద్దరం కలిసి అడ్రసులు వ్రాసి పోస్టు చేసేవాళ్ళం. అలా కొన్ని నెలలు గడిచాయి.

అప్పుడు అన్నయ్య వాళ్ల వార్త అందింది. వాళ్లు ఇక్కణ్ణుంచి బయలుదేరి – అన్నయ్య మామగారింటికి – యాదగిరి గుట్ట చేరారు. అక్కడ కొన్నాళ్లున్నారు. అన్నయ్య "కవికొండ" గ్రామంలో చదువు చెప్పడానికి కుదిరారు. ఏడాదికి వందరూపాయలు హాలీలు. అమ్మనూ – చెల్లెళ్లనూ గూడూరుకు పంపించారు. వార్త తెలిసింతరువాత ఉండబుద్ధి కాలేదు. హైదరాబాదు వదిలేముందు రెండు విషయాలు చెప్పాలి.

ఒకసారి నేను సీతారాంబాగ్ నుంచి వెళ్తున్నాను. నా ముఖాన బొట్టుంది. మంగల్‌హాట్ పోలీసు స్టేషను దగ్గర తురక పిల్లలు నన్ను చూచారు. నా వెంటపడ్డారు. ఏక్సొగ్యారా – నూటపదకొండు – అని వెక్కిరించారు. అయినా వీధిలో వెళ్లేవాళ్లుగాని, పోలీసువాళ్లుగాని అదుకోలేదు. అలాసాగింది వాళ్ల పెత్తనం. అంత నిశ్చేతనంగా ఉన్నారు మనవాళ్లు.

గౌలీగూడెంలో "శంకర్‌షేర్" అనే ప్రఖ్యాత హోటలుండేది. అక్కడి చాయ్ అతి ప్రసిద్ధి. ఏకానేకో మలయిదార్ చాయ్! మూడు పైసలకు సింగల్ చాయ్. ఒక పైసకు లవంగం గుచ్చిన పాన్. ఒక పైసకు నాలుగు చార్మినార్ సిగరెట్లు. అణాలో అప్పటికి ఒక పైసా – తరువాత కాల్చడానికి మూడు సిగరెట్లు మిగుల్తాయి!

నేను నాయనకు చెప్పకుండా రైలెక్కాను. మానుకోటలో దిగి, కాలినడకన చిన్నగూడూరు చేరుకున్నాను. అమ్మను చూస్తే ప్రాణం లేచి వచ్చింది. జోడుచింతలు, నర్సిగాడు – సీత – తామరల చెరువు – అమ్మమ్మ ఇల్లు – కొంత కాలం గడిచింది.

అన్నయ్య కవికొండ వదలి వచ్చాడు. అందరం మళ్లీ ఖమ్మం చేరుకున్నాం.

## పధ్నాలుగు

### చిచ్చురగిలింది

మేము ఖమ్మం చేరాం. నాయన మాకు నీడలేకుండా చేశారు. గుంటిమల్లన్న బజారు ఇల్లు అమ్మేశారు. అది ఎవరికీ శాంతులు కలిగించలేదు. పితామహులు – లక్ష్మణాచార్యులవారి – మాట తథ్యం అయింది. మనుషుల్లో వలె – ఇళ్లల్లోనూ మంచివీ చెడ్డవీ ఉంటాయి.

నాయన మామీద పగబట్టినట్లు – నాయకుల గూడెం పొలం అమ్మారు. మాకు అందకుండా సమస్త సామగ్రి భద్రపరచారు. వారు హైదరాబాదులోనే ఉన్నారు.

అన్నయ్య చాకలి బజారులోని బుచ్చయ్య వకీలుపిల్లలకు చదువుచెప్పారు. వారుమాకు ఒక గది ఇచ్చారు. నేనూ ఒకటి రెండు ట్యూషన్లు చెప్పాను. బుచ్చయ్యగారు నాయనకు శిష్యులు. నాయన ఆజ్ఞాపించారు. వారు మమ్మలను వెళ్లగొట్టారు. అర్వపల్లి వారి సత్రానికి మారాం. అక్కడా అదేకథ. ఖిలాబజారులో ఒక ఇల్లు అద్దెకు తీసుకున్నాం. అక్కణ్ణుంచి వెళ్లగొట్టలేదు.

**అక్కడ ఉన్నపుడే విద్యార్థి సంఘం గ్రంథాలయంలో లైబ్రేరియన్‌గా చేరాను. అది సర్కారు ఉద్యోగం కాదు. ఆ ఉద్యోగం ఎవరూ చేసేవారు కాదు. దానికి జీత భత్యాలు లేవు. పైగా, ప్రభుత్వం గ్రంథాలయాలను సహించదు. అవి విప్లవకేంద్రాలని ప్రభుత్వపు అనుమానం!**

ప్రభుత్వపు అనుమానం చాలవరకు నిజమే. అనాటి పుస్తకాలు యువకులలో ఆలోచనను – దేశభక్తిని కలిగించేవి. గ్రంథాలయంలో చర్చలు – సమావేశాలు జరిగేవి. ఉద్యమాలకు రూపు రేఖలు – ప్రణాళికలు సహితం అక్కడే ఏర్పడేవి.

లైబ్రేరియన్ పని దేశభక్తికి సంబంధించింది. గ్రంథాలయానికి గ్రాంట్లు ఉండవు. చందాలమీద ఆధారపడాలి. చందాదారులను చేర్పించాలి. నెలనెలా వాళ్ళ ఇళ్లకు ఒకటికి రెండు సార్లు వెళ్లి ఓపిగ్గా చందాలు వసూలు చేయాలి. దాంతో పత్రికలకు చందాలు కట్టాలి. కట్టకుంటే పత్రికలు రావు. పుస్తకాలు కొనాలి. వీటికే ప్రాధాన్యత. అన్నీ అయిం తరువాత మిగుల్తే వేతనం. సాధారణంగా మిగలదు. మిగిలినా బహుకొద్ది.

తురకపిల్లలకు తొలినుంచీ నేనంటే కుర్రు. అది వందేమాతరంతో నాకు మొదలయింది. కుచ్చుటోపీల సమ్మె నేనే చేయించానని వాళ్ళ నమ్మకం. సమ్మె నేను మాత్రమే చేయించానంటే ఇవ్వాళ్టికీ నాకు నమ్మకం లేదు. నేను కొంత – మరింత – ఆవేశపడి ఉంటాను. పిడుగు నామీద పడింది. అకారణంగా కలిగిన నష్టాన్నే దురదృష్టం అంటాం.

నేను లోపల గడియవేసుకొని లైబ్రరీలో చదువుకుంటున్నాను. తురక పిల్లలే అనుకుంటా బయటినుంచి గొళ్లెం పెట్టారు. నేను రాత్రికి బయటకి రావడానికి తీస్తే తలుపు రాదు. గత్యంతరం లేదు. చీకటి పడింది. అటు జనం రారు. బల్లమీద పడుకున్నాను. చాల రాత్రికి అన్నయ్య నన్ను వెదుక్కుంటూ వచ్చాడు. గొళ్లెం చూచి వెళ్లిపోవాల్సిందే. తాళం లేదని అనుమానం వచ్చింది. తలుపు తట్టాడు. నేను లేచాను. ఇద్దరం ఇంటికి చేరాం. అమ్మ ఎదిరి చూస్తున్నది. కలవరపడుతున్నది. ఎవరూ అన్నాలు తినలేదు. అమ్మకు అడుగడుగునా బుగులే. నన్ను పట్టుకొని ఏడ్చింది. ఇంకా లక్ష్మి చావు గాయం మానలేదు! కెలుకుతున్నది! భోజనాలు చేశాం. పడుకున్నాం. ఆనాడు దేశాన్ని విప్లవోన్ముఖం చేస్తున్నది క్విట్ ఇండియా తీర్మానం. అన్నయ్యా నేనూ దాన్ని గురించి ముచ్చటించుకున్నాం. మహాత్ముడు భారతదేశమే పెద్ద కారాగారం అన్నాడు. అలాంటప్పుడు నిజాం రాజ్యం అండమాన్ దీవి అవుతుంది. ఇక్కడ ఉద్యమ ప్రభావం అంతగా కనిపించలేదు.

1942 ఆగస్టు 15వ తేదీన బొంబాయిలో కాంగ్రెస్ మహాసభ జరిగింది. భారత స్వాతంత్ర్యం కోసం అంతిమ పోరాటం జరపాలని నిర్ణయం అయింది. ఆంగ్లేయులను భారత దేశం వదిలి పోవాలని ఆదేశించడం జరిగింది – "క్విట్ ఇండియా!"

"ఇదిగో మంత్రం. ఇది చిన్నది. మీకు అందిస్తున్నాను. దీన్ని మీ గుండెలకు హత్తుకొండి. మీ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఈ మంత్రమే కావాలి. చేయండి లేక చావండి. ఇదే ఆ మంత్రం. మీరు ఇండియాను విముక్తం చేయాలి. లేదా ఆ ప్రయత్నంలో ప్రాణాలు అర్పించాలి. మన బానిసత్వం స్థిరపడడానికి మనం జీవించం. ప్రతి వాస్తవ కాంగ్రెసువాది ఈ ఉద్యమంలో చేరాలి. మన దేశాన్ని బానిస బంధాల్లో చూడ్డానికి జీవించను అనే సంకల్పంతో ఉద్యమించాలి..... ఈక్షణం నుంచి ప్రతి వ్యక్తి పోరాటానికి అంకితం కావాలి. తినడం - బ్రతకటం అన్నీ స్వాతంత్ర్యం కోసమే అని గుర్తుంచుకోవాలి. లక్ష్యం సాధించడానికి - అవసరం అవుతే - ప్రాణా లర్పించాలి. స్వాతంత్ర్యం సాధించేదాకా విశ్రమించమని - అక్కరపడితే ప్రాణాలు అర్పిస్తామని భగవత్ సాక్షిగా లేక మనస్సాక్షిగా ప్రమాణం చేయండి. ప్రాణాలను త్యాగం చేసినవాడు సాధిస్తాడు - రక్షించుకున్నవాడు వదులుకుంటాడు. పిరికివాళ్లు - సోమరులు స్వాతంత్ర్యం సాధించలేరు. అది వారికోసం కాదు" అని మహాత్ముడు మంటల సందేశం ప్రసారం చేశాడు.

"ప్రతి అహింసా స్వాతంత్ర్య సమరయోధుడు 'చేయండి లేక చావండి' నినాదం గుడ్డ పేలికమీదకాని కాగితం ముక్కమీద గాని వ్రాసి వారి దుస్తులకు అంటించుకోవాలి. ఎందుకంటే, సత్యాగ్రహ సందర్భంగా మరణిస్తే హింసావాదులనుండి వేరుగా వారిని గుర్తించవచ్చు." ఇవి మహాత్ముడు 9 అగస్టు 1942న అరెస్టు అయిన తరువాత అన్నమాటలు.

అహింసను గురించి నెహ్రూ అడిగినప్పుడు గాంధీజీ "అహింసను మీ పద్ధతిలో వ్యాఖ్యానించే స్వేచ్ఛ మీకుంది" అన్నారు.

1942 ఆగస్టు 9న కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మెంబర్లందరినీ ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆ వార్త దేశం నలుమూలలా చిచ్చురేపింది. దేశమంతటా టెలిఫోనువైర్లు తెంపారు. రైలు పట్టాలు ఊడపెరికారు. ప్రభుత్వ భవనాలు తగలపెట్టారు. వేల సంఖ్యలో ప్రజలు అరెస్టు అయినారు.

దేశవ్యాప్తంగా కార్చిచ్చు రగిలింది. ప్రభుత్వం తగలబడిపోతున్నది. దానిని రక్షించే నాథుడు దిక్కులేకుండా పోయాడు.

నిజాం రాజ్యంలో స్వామీజీని అరెస్టు చేశారు. రాజ్యమంతటి నుంచి పన్నెండు మంది ప్రధాన కాంగ్రెసు నేతలను అరెస్టు చేశారు. విద్యార్థులు స్కూళ్లు, కాలేజీలు వదిలారు. ఊరేగింపులు జరిగాయి. జంట నగరాల్లో హర్తాళ్ జరిగింది. లాఠీ ఛార్జీలు జరిగాయి. కొత్తగూడెం రైల్వేలైను పెరకడం జరిగింది.

ఆనాడు మాలో ఆవేశం హద్దులు దాటింది. "చేయాలి లేక చావాలి!" "పిరికిపందలు, సోమరులు స్వాతంత్ర్యానికి అర్హులు కాదు" అనే మహాత్ముని నినాదం మా రక్తంలో మంటలు లేపింది. క్రియా శూన్యులు కావడం కంటే చావడం మేలు! కాని, ఏం చేయాలి? ఎలా చేయాలి? ఏమీ అర్థం కాలేదు. ఆరోజు సొంతం ముళ్ల మీద ఉన్నాం. గ్రంథాలయంలో సమావేశం అయినాం. ఉపన్యాసాలు తప్ప మార్గం

కనిపించలేదు. వ్యక్తిగత సంతృప్తికి నిరశనం పాటించాలనుకున్నాం. గ్రంథాలయంలోనే గడిపాం.

తర్వాత కొంతమందిమి తెనాలి వెళ్ళాం. తగలబడిన రైల్వేస్టేషను చూసివచ్చాం. అంతకు మించి ఏమీ చేయలేకపోయాం.

మహాత్ముని ఆశయాలనుకాని, నిర్ణయాలనుగాని శంకించలేం. సామాన్యునిగా నా సంశయాలు వ్యక్తం చేస్తున్నాను. అందరూ ఆలోచించాలి:

1. అప్పటికి సుభాస్‌చంద్ర బోస్ అజాద్ హింద్ ఫౌజ్ భారతదేశపు ఈశాన్య భాగంలో ప్రవేశించింది. అది భారతదేశాన్ని విముక్తం చేస్తుందనే ఆశ అందరిలో అంకురించింది. దానికి ప్రతిగా క్విట్టిండియా తీర్మానమా?
2. క్విట్టిండియా తీర్మానం మహాత్ముని అహింసా సిద్ధాంతాలకు అనుగుణంగా ఉందా? మహాత్ముడు స్వయంగా ఉద్యమంలో హింస చెలరేగుతుందని ఊహించారు. అహింసకు మీ రీతి వ్యాఖ్య మీరు చెప్పకోండి అన్నారు.
3. మహాత్మునికి లక్ష్యం కంటే మార్గం ప్రశస్తం. ఈ ఉద్యమంలో మార్గం కంటె లక్ష్యం ప్రధానంగా కనిపిస్తుంది.
4. ఉద్యమం విజయవంతం అయితే నిర్ణయం సరియైందని భావించవచ్చా?
5. "ప్రజాపోరాటాల్లో సిద్ధాంతం కన్న కర్తవ్యం మిన్న" అనిపించాను నా "మొదుగుపూలు" నవలలో నాయకుడు రఘుతో. ఇది క్విట్టిండియా తీర్మానానికి వర్తిస్తుందా?

ఒక ఉద్యమం ముగిసింది. కాని, ప్రజా ఉద్యమాలు నిరంతరంగా ఉంటాయి. కాబట్టి, వీటిని గురించి ఆలోచించవలసిన అవసరం ఉంది.

తరువాత సంవత్సరందాకా దేశంలోగాని మా కుటుంబంలోగాని చెప్పకోదగిన సంఘటనలు లేవు.

1943–44లలో అనుకుంటా – నాయన మా ఇంట్లో దిగాడు. అన్నయ్యకూ – నాయనకూ ఏవో మంతనాలు జరిగాయి. అమ్మకూడా అందుకు సుముఖంగా ఉన్నట్లుంది. నన్ను సంప్రదించలేదు. నేను తెలుసుకునే ప్రయత్నం చేయలేదు.

ఆ నిర్ణయం ప్రకారం నాయన మా అందరినీ గార్ల తీసికెళ్లారు.

ఖమ్మం మెట్టు - మునేరు - లింగం మదుగు - ఏటికాలువ - గుంటిమల్లన్న గుడి - ఊదల మర్రి - నరసింహస్వామి గుట్ట - ఖిల్లా - కిల్లా బావి - బడి - గ్రంథాలయం - వీటితో పుష్కరంగా ఉన్న ముడి విడిపోయింది.

ఖమ్మంతో సంబంధాలు తెగలేదు. అనుబంధాలు విడిపోయాయి.

# పదిహేను

## చీలిన కుటుంబం:

నిజాం రాజ్యపు విస్తీర్ణం 82,000 చదరపు మైళ్లు. ఇందులో నిజాం ప్రభుత్వపు పరిపాలన ఉన్న 59,638 చదరపు మైళ్ల ప్రాంతాన్ని ఖాల్సా అంటారు. ఈ ప్రాంతంలో ఒక మాదిరి శాసనబద్ధమయిన ప్రభుత్వం ఉంటుంది.

నిజాం స్వంత వ్యయానికిగాను ఉన్న 8,100 చదరపు మైళ్ళ ప్రాంతాన్ని "సర్ఫేఖాస్" అంటారు. అంటే "స్వంత కర్చులకు" అని అర్థం. ఇందులో వచ్చే ఆదాయం సొంతం నిజాం సొంతం. ప్రజలకు కర్చు పెట్టేది ఉండదు.

నిజాం స్వంత బంధువులకు చెందిన జాగీర్లను పాయెగాలు అంటారు. వాటి విస్తీర్ణం 3,262 చదరపు మైళ్లు. ఇక్కడ ప్రజల మీద పన్నులు తప్ప సౌకర్యాలు సున్న.

నిజాం ఇతరులకు – అనేక సందర్భాల్లో – ఇచ్చిన 1,167 జాగీర్ల విస్తీర్ణం 11,000 చదరపు మైళ్లు. జాగీర్దార్లకు స్వంత విలాసాలు తప్ప ప్రజలు పట్టరు. ఇక్కడి ప్రజలకు 'ఖాల్సా' ప్రాంత ప్రజలకున్న నామమాత్రపు హక్కులు హుళక్కి. భూములకు సెటిల్మెంటుండదు. ప్రజలు 200 రకాల పన్నులు చెల్లించాలి. జాగీర్దారు ఇంట్లో పుట్టినా, చచ్చినా, పెండ్లి అయినా ప్రజలు అదనపు పన్నులు ఇచ్చుకోవాలి. కొన్ని పెద్ద జాగీరులకు పోలీసు, న్యాయాధికారాలు కూడా ఉండేవి.

అలాంటి అధికారాలు ఉన్నదే గార్ల జాగీరు. గార్ల ప్రాంతంకాక పండితాపురం – ఖమ్మం జిల్లా ఈ జాగీరులోనివే. చివరి జాగీర్దారు షౌకత్ యార్ జంగ్ బహద్దుర్.

గార్ల అసలు పేరు గాండ్ల. ఇది గానుగల గ్రామం. కాకతీయుల కాలంలో సామంతుల రాజధాని కావచ్చు. గార్ల, చుట్టు పుట్టుకోట ఉండేది. కూలిపోయింది. గార్ల బయ్యారం చెరువులు చరిత్రాత్మకములు. వాటికింద కరువు రాదు.

గార్లనుంచి బయ్యారం వరకు ఒకే నగరమనీ, ఇక్కడ 108 దేవాలయాలు ఉండేవనీ అంటారు. నిజాం పక్షాన ఖమ్మం జిల్లాను పాలించిన జఫరుద్దౌలా క్రూరుడు. ధ్వంసమే ప్రధానవృత్తిగా గలవాడు. అతని పేరే "ధ్వంస" అని వచ్చింది. అతడు ఆ దేవాలయాలను కూలగొట్టి ఉంటాడు. శిథిలాలు అంతటా కనిపిస్తాయి. కుసిలేక నిలిచిన రాతిస్తంభం కూలిన గోపాల స్వామి ఆలయానికి ధ్వజస్తంభం. ఇప్పుడు ఆ స్తంభం కూడా కూలిపోయింది. ఈ జాగీర్దారులు "ధ్వంస" వంశంవారే అయ్యుంటారు.

జాగీరు సొంతం మహదారణ్యం ప్రాంతంగా ఉండేది. కోయ గిరి జనులదే నివాసం. బ్రిటిషాంధ్రం నుంచి రైతులు వచ్చారు. భూములు కొన్నారు. అడవులు కొట్టారు. పొలాలు చేశారు. వ్యవసాయం వృద్ధి చేశారు. వారు గ్రామాలకు గ్రామాలు ఏర్పరచుకున్నారు.

జాగీరును జాగీర్దారు తరపున నూరొద్దీన్ తాసిల్దారు పాలించాడు. అతడు అందరికీ గర్భనిర్భేద్యం. అతడు పట్నంలో జాగీర్దారు మహలును మించిన మహలు గార్లలో కట్టాడు. మహలును జాగీర్దారు లాక్కుంటాడనే భయంతో నూరుద్దీన్ను అందులోనే పాతిపెట్టారు! అతని పేరు ఎవరికీ తెలియదు. అతడు బొంగ్రతాసిల్దారు.

గార్ల జాగీరులో జరిగిన ప్రజా ఉద్యమాన్ని నేను "మోదుగపూలు" నవలలో చిత్రీకరించాను.

తాసిల్దారు కింది ఉద్యోగి పేష్కార్. వారు వరవర రావుగారు. నాయనకు శిష్యులు. సాహిత్యాభిమాని. వేంకటేశ్వర గ్రంథమాల ద్వారా కొన్ని పుస్తకాలు ప్రచురించారు. వేంకటేశ్వర గ్రంథాలయం నిర్వహించారు. పాలనలో కిరాతుడు. సంపాదనలో దక్షుడు.



గార్ల రైల్వేస్టేషన్



గార్లలో రచయిత చిన్న తనంలో నిర్మించిన ఇల్లు

అ ఊళ్లో వేంకటేశ్వర స్వామి పూజారి ఇంట్లోనే వేంచేసి ఉంటారు. పురాతనం అయిన వీరభద్రాలయం ఉంది. శివాలయం – లక్ష్మీనారాయణ ఆలయం ఉన్నాయి. ఆలయంలేని పాండవులున్నారు. వానలేకుంటే పాండవులకు అభిషేకం చేస్తారు.

మేము వరవరరావుగారి ఇంట్లో విడిశాం. వారి ఇంటినిండా జనం. బంధువులు – మిత్రులు – వచ్చిపోయేవాళ్లు. అది ఆరోజుల్లో అతి సహజం. వారి నిత్య జీవనం విచిత్రంగా ఉంటుంది. పొయ్యిమీద నీళ్లు పెట్టి, టీ పొడి చెక్కరకు ఉరికిస్తారు. ఎసరుపెట్టి బియ్యం దంపిస్తారు. నిప్పు వేసేముందు కట్టెలు కొట్టిస్తారు. లేదా అంటే సమృద్ధి. అనేకమంది పనివాళ్లు! అలవాటును మించింది లేదు. దాన్ని మార్చడం కష్టం.

మాకు అక్కడ బాగానే ఉంది. విశాలం అయిన ఇల్లు. వంటమనుషులు. పనివాళ్లు. నాయనకు కాలక్షేపాలు. ఆలయంలో భోగాలు. తడియారాధనలు!

ఇలా ఉండగా చిలుకూరు శ్రీరాములుగారని అద్వైత పండితుడు. తెనాలినుంచి వచ్చి స్థిరపడ్డారు. ఆనంద రామాయణం రచించారు. వాణిజ్యవర్గాల్లో పలుకుబడి సంపాదించారు. వారు ఊళ్లో రుద్రయాగం చేయించారు.

వారు రుద్రయాగం చేశారని, వైష్ణవ యాగం చేయించడానికి నాయనను పిలిపించారు. నాయనకు శైవం విషతుల్యం. పేష్కారు పలుకుబడి – నాయన పాండిత్యంతో వర్తకులు విరాళాలు ఇచ్చారు. వైష్ణవ యాగం ఘనంగా జరిగింది. చుట్టుపట్ల దాని చర్చలు జరిగాయి.

వాస్తవానికి అద్వైతులు శైవులు కారు. వారు శివ కేశవులను సమానంగా భావిస్తారు. పూజిస్తారు. వారిది జగద్గురు శంకరుని "సర్వంఖల్విదంబ్రహ్మ" సిద్ధాంతం.

శివుని మాత్రం పూజించి "శివాత్పరతరంనాస్తి" అనేవాళ్లు వీరశైవులు. కులపరంగా ఆరాధ్యులు – జంగములు.

ఖమ్మం నుంచి బయలుదేరినపుడే గార్లలో స్థిరపడాలనే నిర్ణయం జరిగినట్లున్నది. పేష్కారు గారు రాతిస్తంభం బజారులో ఊరి చివరన ఒక స్థలం ఇప్పించారు. అందులో మంచినీళ్ల బావి ఉన్నది. దాని ఖరీదు రెండు వందలు. ఆ డబ్బు నాయనే ఇచ్చినట్లు గుర్తు.

ఆ స్థలంలో ఒక గుడిశ వేశారు. దాని వాసాలది ఒక వృత్తాంతం. ఒక కోయతను భూమిశిస్తు కట్టలేక పోయాడు. అతణ్ణి పట్టుకొని వచ్చారు. భూమి నాకు వద్దు మొర్రో అంటాడు. వాపసు తీసుకొమ్మంటాడు. అందుకు దరఖాస్తు కావాలంటారు. దరఖాస్తు కోసం ఇంటి వాసాలు అడవినుంచి తెమ్మన్నారు. వాసాలు కొట్టాడు కోయతను. బండి మీద తెచ్చివేశాడు. ఆ వాసాలతో ఆ గుడిశ కప్పువేశారు.

ఆనాటి భూమి విలువ అంత. రూపాయి పావలా దరఖాస్తుకు వస్తుంది. వదులుకోవాలన్నా రూపాయి పావలా! ఇప్పుడు అడవుల్లేవు. క్షవరం చేశారు. చెట్టు కనిపించదు. లక్షలకు భూమి దొరికేట్లులేదు. భూముల కోసం హత్యలు! దురాశ దుఃఖం చేటు!

మేము మా పర్ణశాలకు మారాం. ముందు చాల స్థలం వదిలారు. వెనుక పాక వేశారు. దానికి ద్వారబంధం ఉంది. ద్వారం లేదు. గోడలు ఇంకా మొండిగానే ఉన్నాయి. నేల కూడా పూర్తిగా చదును కాలేదు. అడవి దగ్గరలో ఉంది. తేళ్లు – దుప్పులు – కుందేళ్లు, ఒక్కొక్కపుడు ఎలుగ్గొడ్లు కనిపిస్తుంటాయి. నక్కలు

కనిపిస్తుంటాయి. ఊళలు వినిపిస్తుంటాయి. పాములు కాళ్లలో మసలుతుంటాయి. తేళ్లు జెర్లు చీమలు దోమల్లా ఉంటాయి. వానపడితే ఇంట్లో ఊటలు వస్తాయి.

ఎంతయినా మన ఇల్లు కదా! బాగు చేసుకున్నాం. ముందరి స్థలంలో మొక్కజొన్న వేశాం. అది ఏపుగా పెరిగింది. ఇంటి చుట్టు బంతి – గోరెంట – రుద్రాక్షమొక్కలు వేశాం. పూశాయి. బావిమీద పందిరికి పొట్లతీగ పారించాం. కాసింది. పొట్ల పిందల చివరన చిన్న చిన్న రాళ్లు కట్టాం. ఇంటి కప్పుకు సొరతీగ పాకించాం. విరగకాసింది. ఉన్నచోట వనం ఏర్పరుచుకున్నాం.

అన్నయ్య మెట్రిక్ పాసయ్యాడు. వారిపేరు పత్రికలో వచ్చింది. అంటే అంత కొద్దిమంది ఉండేవారు. ముందును గురించి ఆలోచనలు జరుగుతున్నాయి. నేను భవభూతి "ఉత్తర రామచరితం" చదువుతున్నాను. "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" – ఉత్తర రామాయణం రచనలో భవభూతిని మించినవాడులేడు. "ఏకోరసః కరుణయేవ" అని కరుణ రసంతో కొండలను కోనలను ఏడిపించిన కరుణ కవి భవభూతి.

ఒకనాడు నేను ఖమ్మం వెళ్లాను. తిరిగి వచ్చేవరకు నాయన లేరు. అన్నయ్య నాయన మీద అగ్గి బుగ్గి అవుతున్నారు. అమ్మా చెల్లెళ్లు ఏడుస్తున్నారు. నాకు "ఏమయింది" అని అడిగే ధైర్యం లేకపోయింది.

"అడవిలో తెచ్చి పెట్టి వెళ్లిపోయాడు, దుర్మార్గుడు, దుష్టుడు, పాపి" అని చదివేస్తున్నాడు అన్నయ్య.

అప్పుడు అర్థం అయింది – పథకం ప్రకారమే నాయన మమ్ములను ఇక్కడ దింపాడని. అసలు అన్నయ్య ఖమ్మంనుంచి ఎందుకు కదిలి వచ్చినట్లు? ఆ మాటనేను అడగలేదు.

అప్పటికి అమ్మ గర్భవతి!

నాయన శాశ్వతంగా విడిపోయినట్లే! ఇహ మళ్లీ రారు..

తరువాత తెలిసిన విషయం ఏమంటే – మామూలు వలెనే ఆనాడూ తగాదా! నాయన అమ్మను కొట్టబోయాడు. అన్నయ్య అడ్డుపడ్డాడు. ఇద్దరికీ ఘర్షణ జరిగింది. అన్నయ్య దుడ్డుకర్రతో నాయన కుడిభుజం మీద కొట్టాడు. నాయన "అమ్మో" అని కూలబడ్డారు. లేచి శాపనార్థాలుపెడ్తూ వెళ్లిపోయారు.

అది విన్నాక దైవిక న్యాయాన్ని మించింది లేదనిపించింది. నాయన తాతయ్యను ఖమ్మంలో సరిగ్గా అదే విధంగా కొట్టారు!

అంతటితో నాయనా మేమూ విడిపోయాం. మళ్లీ కలిసి ఉండలేదు.

వివాహాల్లో దూరపు సంబంధాలు మంచివి. రక్త సంబంధాలు అనర్థాలు తెస్తాయి. శాస్త్ర ప్రకారం ఉభయ పక్షాలు ఏడుతరాలసంబంధాలు కలవరాదు. అందుకోసమే సగోత్రవివాహాలు నిషేధాలు!

మేనరికపు వివాహాల్ని వైద్యశాస్త్రము, సామాజిక శాస్త్రమూ అనుమతింపవు. ఇవి ఆస్తిని కాపాడుకోవడానికి ఏర్పడ్డాయి. అదే ఆచారంగా మారింది.

మేనరికపు పెళ్లిళ్ల వల్ల వ్యాధులు సంక్రమించటం – సంతానానికి నష్టం కలుగుతుందని స్పష్టం అయింది. మనస్తత్వాల విషయం కూడా ఆలోచించాలి.

మేనత్త పోలికలు, మేనమామ చారికలు అని ఒక సామెత ఉంది. పుట్టింటి గుణాలు కూతురుకు వస్తాయని కైక విషయంలో రామాయణంలో చెప్పబడింది.

జీన్స్ శారీరకం మాత్రమేకాదు - మానసికం కూడా. జీనియస్ అనే పదం జీన్స్ నుంచి, అంటే పుట్టుక నుంచి వస్తుంది. గుణగణాలు కూడా వారసత్వంగా వస్తాయని అర్థం. మేనరికాలది ఒకే వారసత్వం. కాబట్టి ఒకే గుణాలు కలిసి ఉండడం అసంభవం కాకున్నా అసాధ్యం - దుస్సాధ్యం.

మా అమ్మా – నాయనలది మేనరికం. వారి ఇరువురి కోపతాపాలు – పట్టుదలలు – ఆలోచనలు – స్వతంత్ర భావాలు సుమారు ఒకలాంటివే! ఇద్దరి పట్టూ ఒకటే. ఎన్నడూ వారికి పడలేదు. కలిసి ఉన్నది విధి లేకనే!

తప్పు నాయనదే ఎక్కువ. అమ్మది తక్కువే కాని, సర్దుకుపోయే స్వభావం లేదు. స్వతంత్రం– ఎదిరించడం ఆమె ప్రధాన లక్షణాలు. అవే మాకూ వచ్చాయి.

ఉభయులూ సంతానం విషయంలో తమ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించలేదు. నాయన బాధ్యత గుర్తించనేలేదు!

పెళ్లి రెండు మనసుల కలయిక. మనసు భౌతిక శాస్త్రానికి అందనిది. అయినా అనుకూల దాంపత్యం కోసం నిరంతరం యత్నించడం మన విధి.

సమాజ సంక్షేమాన్ని దృష్టిలో ఉంచుకొని మేనరికపు ఆచారానికి స్వస్తి చెప్పడం ఉత్తమం.

అన్నయ్య జాగీరు స్కూల్లో పదిహేను రూపాయిల నెలవేతనానికి టీచరుగా చేరాడు. చిలుకూరి శ్రీరాములుగారు కూడా అక్కడే టీచరు. వారి కలయిక సాహిత్య కృషికి – కవితారచనకు ఎంతో ఉపకరించింది. అయిదో దశకంలో శ్రీరాములుగారు అన్నయ్య “రుద్రవీణ” ప్రచురించారు.

నాయన పోవటం పోవడం, వరవరరావుగారి ఇంట్లో మకాం పెట్టారు. అధికారులు అంతా నాయన పక్షం. మమ్ములను ఇల్లు కాళీ చేయించే ప్రయత్నం చేశారు. కాని, అధికారులు అందుకు తోడ్పడినట్లులేదు. మామీద వత్తిడి వచ్చిన మాట నిజం. అది ఊళ్లోంచి వెళ్లగొట్టేవరకు రాలేదు.

నాయన మైసూరు వెళ్లి, మళ్లీ పెళ్లిచేసుకొని దిగారు. ఈ ప్రాంతంలో వారికథ తెలుసు. పిల్లను ఇవ్వరు. మైసూరులో తన భార్య చచ్చిపోయిందనీ, తనకు పిల్లలు లేరనీ బొంకి, నాగరత్నమ్మను పెళ్లి చేసుకొని వచ్చారు. నాగరత్నమ్మ వైష్ణవ నామం కాదు. ఆమెకు “శ్రీదేవి” అని పేరు పెట్టారు. కరణాలు దస్తరం ఎంతగా మార్చారంటే – ఎన్నడూ నాయన పేర ఉన్న దాఖలాలు ఉండకుండా చేశారు. అంటే, మాను మాకు హక్కులేకుండా చేశారు.

నాయన చిన్నమ్మను – చిన్నమ్మేకదా – తీసుకొని ఖమ్మం వెళ్లి కాపురం పెట్టారు.

మేము ఆధారంలేక అడవిలో పడిపోయాం.

# పదహారు

## ఎరుపు కెరటం:

**1917లో ఒక మహత్తర సంఘటన సంభవించింది. అలాంటిది మానవ చరిత్రలో అంతవరకు జరుగలేదు. అది రష్యాలో విజయం సాధించిన శ్రామిక విప్లవం. దానికి నాయకత్వం వహించిన లెనిన్ ప్రపంచ శ్రామిక వర్గానికి ఆశాజ్యోతి.**

రష్యాలో లెనిన్ నాయకత్వాన శ్రామిక ప్రభుత్వం ఏర్పడింది. అది ప్రపంచంలోని దోపిడి వర్గాన్ని – శ్రామిక వర్గాన్ని ఆశ్చర్యచకితులను చేసింది. దోపిడి వర్గం దానిని కూల్చడానికి కుట్ర సాగించింది. శ్రామిక వర్గం దాన్ని రక్షించుకోవడానికి ప్రతిన బూనింది.

మానవ జాతి చరిత్రలో శ్రమను దోచుకోవడాన్ని శాస్త్రీయంగా వివరించినవాడు కారల్ మార్క్స్ ఒక్కడే. ధన స్వామ్య సమాజంలో ధనస్వాములు శ్రామికుల రక్తాన్ని పీల్చడం చూసి, కారల్ మార్క్స్ హృదయం తపించినంతగా మరొకరి హృదయం తపించి ఉండదు. మార్క్స్ మహా మేధావి. మహా మనీషి. అనంత మానవతామూర్తి. అతడు ధనస్వామ్యపు పట్టపగలు దోపిడిని బయట పెట్టాడు. వారి ఎత్తులను, జిత్తులను కనిపెట్టాడు. శ్రామిక వర్గం ధన స్వామ్యపు ఊబినుండి బయటపడడానికి సశాస్త్రీయమైన వెలుగు బాటను కనిపెట్టిన మహర్షి కారల్ మార్క్స్

సమాజంలో లోపాలను అనేకమంది వివరించారు. ఎత్తి చూపారు. మానవ సమాజం ఇలా ఉండాలి అని చెప్పినవాడు మార్క్స్ మహాశయుడు ఒక్కడే. "ప్రపంచ శ్రామికులారా! ఏకం కండి. ఎదురు తిరగండి. మీ దగ్గర ఏమీలేదు పోగొట్టుకోడానికి. పోతే బానిసత్వమే పోతుంది – తెగుతే సంకెలులే తెగుతాయి" అనే నినాదంతో శ్రామిక ఉద్యమాల చిచ్చు రగిల్చినవాడు మార్క్స్మహర్షి.

లెనిన్ – మార్క్స్ వాదానికి తన నిర్వచనం ఇచ్చాడు. మార్క్స్ వాదం – సమాజవాదం – శ్రామిక వాదానికి ఆచరణరూపం – కార్యరూపం – సాఫల్యరూపం ఇచ్చాడు. ఎందుకూ పనికి రారని ధనస్వామ్యం ముద్రవేసిన శ్రామికులలో – మహత్తర శక్తిని మేల్కొలిపి, ధన స్వామ్యానికి సమాధి కట్టించాడు రష్యాలో.

మార్క్స్ వాదంకన్న లెనిన్ పోరాట విజయం – విప్లవ విజయం – ప్రపంచమేధావులను ఆలోచింప చేసింది. అది దేశాల – జాతుల – మతాల హద్దులను చెరిపి, అందరు మేధావులను ప్రభావితం చేసింది. రష్యా విప్లవాన్ని గురించే ఆలోచించేట్లు చేసింది. రవీంద్రుడు – జవాహర్లాల్ వంటివారు అత్యంతప్రభావితులయినారు.

రచయితగా జవహర్లాల్ నెహ్రూ భారత దేశంలో సోషలిస్టు భావాలను ప్రసారం చేశారు. వారు సోషలిజాన్ని గురించి వ్యాసాలు వ్రాశారు. వారు రచించిన ప్రపంచ చరిత్ర, వారి స్వీయ చరిత్ర – సోషలిస్టు భావాలను ఎంతో వ్యాపింప చేశాయి.

1925లో భారతదేశంలో "కమ్యూనిస్టు పార్టీ" అవతరించింది. ఆపార్టీ అవతరణప్రేరణ రష్యా విప్లవమే కాని, మార్క్సిజం మాత్రం కాదని నా అభిప్రాయం.

మార్క్సిజం ప్రేరణ అవుతే, అది రష్యా విప్లవానికి ముందే ఏర్పడాల్సింది. అయితే, మార్క్సిజం లేని రష్యా విప్లవం లేదు. అందువల్ల మార్క్సిజం ప్రేరణ ఉంది అని వాదించవచ్చు. అది వాస్తవం అయినా, ఆ ప్రేరణ పరోక్షం మాత్రమే!

1929లో మీరట్ తిరుగుబాటు జరిగింది. ప్రభుత్వం దాన్ని "కుట్రకేసు" అని ముద్రవేసింది. నాయకులందరిని నిర్బంధించింది. పార్టీని నిషేధించింది.

రెండో ప్రపంచ యుద్ధం భారత కమ్యూనిస్టు పార్టీకి గొప్ప అవకాశాలను కల్పించింది. కాంగ్రెస్ – బ్రిటిష్ వారు చేస్తున్న, యుద్ధాన్ని బలపరచలేదు. అంతేకాదు, సహాయ నిరాకరణ చేశారు. కమ్యూనిస్టులు కొంతకాలం మిన్నకున్నారు. 1941లో జర్మనీ రష్యాపై దాడి చేసింది. అది జరగగానే పార్టీ దాన్ని ప్రజాయుద్ధంగా ప్రకటించింది. తద్వారా ఫాసిస్టు వ్యతిరేక పోరాటం జరుపుతున్న బ్రిటిషు ప్రభుత్వాన్ని బలపరిచింది.

సుభాస్‌చంద్ర బోస్ ఆనాటి భారత యువకుల ఆశాజ్యోతి. బోస్ కాంగ్రెస్‌లో తీవ్రవాది. మహాత్ముని నిర్ణయాన్ని ఎదిరించి కాంగ్రెస్ అధ్యక్షుడు అయినాడు. బోస్‌ను ప్రభుత్వం నిర్బంధించింది. బోస్ ప్రభుత్వ నిర్బంధం నుంచి నాటకీయంగా తప్పుకున్నారు. అఫ్ఘనిస్తాన్ మార్గంగా జర్మనీ చేరుకున్నాడు. ఆ వార్తలు కథలు కథలుగా పత్రికల్లో వచ్చాయి. అవి యువకులను ఎంతో ఉత్తేజపరచాయి. తరువాత బోస్ ఆజాద్ హింద్ ఫౌజ్ కూర్చి, భారతదేశపు అంచులదాకా జయించడం, ప్రజల్లో బోస్ విషయంలో భక్తి భావం ఏర్పడింది. బోస్ నినాదం "జైహింద్" వందేమాతరాన్ని మించిన నినాదం అయింది.

కమ్యూనిస్టుపార్టీ యుద్ధానికి అనుకూల తీర్మానం చేయడం వల్ల ప్రభుత్వం నిషేధం తొలగించింది.

పార్టీ – అంతర్జాతీయ సిద్ధాంతం దృష్ట్యా సుభాస్‌చంద్ర బోస్‌ను దేశద్రోహి అన్నది. బోస్ ఫాసిజాన్ని భారతదేశానికి తెస్తున్నట్లు ప్రచారం చేసింది. వాల్‌పోస్టర్లు వేసింది. పార్టీ అవలంబించిన ఈ విధానం యువకులకు ఆగ్రహం తెప్పించింది. ప్రజలకు దూరం చేసింది.

చరిత్రాత్మకం అయిన 1942 క్విట్టిండియా ఉద్యమాన్ని పార్టీ బలపరచలేదు. దాన్ని ప్రజా ఉద్యమంగా గుర్తించలేదు. వ్యతిరేకించనూలేదు. ఈ తటస్థ విధానం ప్రజలను ఆగ్రహోదగ్రులను చేసింది. ప్రజలు బొంబాయిలోని పార్టీ కార్యాలయం మీద దాడి చేశారు.

ఇన్ని లోపాలు ఉన్నప్పటికీ 1942–51 మధ్యదే భారత కమ్యూనిస్టులకు – ముఖ్యంగా ఉభయాంధ్ర కమ్యూనిస్టులకు స్వర్ణయుగం. పార్టీని ప్రజలు తమ పార్టీగా గుర్తించారు. **వాస్తవం చెప్పాలంటే – తెలుగు ప్రజలను చైతన్యవంతం చేసింది కమ్యూనిస్టు పార్టియే.** ఆనాటి పరిస్థితులను కమ్యూనిస్టులు వ్యూహాత్మకంగా వాడుకుని బలపడ్డారు. తొలి కమ్యూనిస్టు ప్రభుత్వం ఆంధ్రలోనే ఏర్పడుతుందనుకున్నారు. ఇందుకు కారణాలు స్థూలంగా ఇవి:

1. 1942లో ప్రభుత్వం కాంగ్రెసు వాదులందరినీ అరెస్టు చేసింది. అందువల్ల రిక్తిత Void ఏర్పడింది. వాతావరణంలో void ఏర్పడినపుడు చప్పున చొచ్చుకు గాలి

తుఫాను అవుతుంది. కమ్యూనిస్టులు ఆ అవకాశాన్ని అప్పుడు వాడుకున్నంతగా ఏ రాజకీయ పార్టీ ఎన్నడూ వాడుకోలేదు.

2. కాంగ్రెస్ క్రోధాన్ని చవి చూసిన ప్రభుత్వం కమ్యూనిస్టులను దూరం చేసుకోదలచలేదు. ప్రభుత్వం ఉదార విధానం వల్ల కమ్యూనిస్టులు లాభపడినారు. కమ్యూనిస్టుల అంతర్జాతీయ విధానం వల్ల ప్రభుత్వం లాభపడింది.
3. పార్టీ విధానం అంతర్జాతీయం అయినా స్థానిక సమస్యలమీద దృష్టి కేంద్రీకరించింది. పార్టీ కాంగ్రెసుకు వ్యతిరేకం కాదని ప్రజలలో విశ్వాసం కలిగించింది. కాంగ్రెస్ నాయకులను విడుదల చేయాలని నిరంతరం కోరింది.
4. కాంగ్రెసువారు ఎన్నడూ ప్రజా సమస్యలను పట్టించుకోలేదు. బ్రిటిషు ప్రభుత్వాన్ని సాగనంపడం – ఖాదీవడకడం – సత్యాగ్రహం చేయడం – జేళ్లకు పోవడం వరకే పరిమితం అయినారు.
   కమ్యూనిస్టులు సాధారణ ప్రజానీకం – రైతు కూలీలలోనికి చొచ్చుకొనిపోయారు. కార్యకర్తలు కూడా అట్టడుగునుంచి వచ్చారు. వారికి ప్రజల సమస్యలు తెలుసు. పార్టీ వాటికోసం పోరాడటం నేర్పింది.
5. యుద్ధం కమ్యూనిస్టులకు ఎంతో ఉపకరించింది. యుద్ధంవల్ల ఏర్పడిన సరకుల కొరత, ప్రభుత్వం విధానం, బ్లాక్ మార్కెట్టు – వీటి విషయంలో పార్టీ ప్రజల పక్షం వహించి నిరంతరం పోరాడింది. ప్రజలకు నిత్యావసరాలు లభింపచేసి పార్టీ ప్రజలకు మరింత దగ్గరయింది. బియ్యం – చెక్కెర – కిర్సనాయిలు – వంట సరకుల సక్రమ పంపిణీ జరిపించడంతో ప్రజలకు ప్రత్యక్ష ప్రయోజనం చేకూరింది.
6. దోపిడిని గురించి ప్రజలకు తెలియపరిచింది. అంతేకాదు, భూస్వాములకు వ్యతిరేకంగా ప్రజాపోరాటాలు జరిపింది. చల్లపల్లి వంటి జమీందార్లకు వ్యతిరేకంగా చరిత్రాత్మకం అయిన పోరాటాలు జరిపింది.
7. ప్రజాశక్తి పత్రిక – ప్రచురణలు మధ్య తరగతి – మేధావి వర్గంలో తీవ్ర సంచలనం కలిగించాయి. సుమారు మేధావులందరు ప్రత్యక్షంగానో పరోక్షంగానో పార్టీని – పార్టీ కార్యక్రమాలను తమవిగా భావించి బలపరచారు.
8. అన్నింటినీ మించింది పార్టీ నాయకులు - కార్యకర్తల నైతిక స్థాయి. నైతిక స్థాయి విషయంలో అగ్రనాయకులనుంచి సామాన్య కార్యకర్త వరకూ జాగ్రత్త పడ్డారు. కార్యకర్తల కుటుంబ విషయాలు చక్కబరచడానికి కూడా నాయకత్వం శ్రద్ధ తీసుకున్నది. “కమ్యూనిస్టు” అంటే దోషరహితుడు అని ప్రజలు గుర్తించేట్లు చేశారు. ఆడపిల్లను ఇవ్వడానికి సహితం “కమ్యూనిస్టు” ఒక అర్హతగా పరిణమించింది.

ఇన్నింటివల్ల ఆంధ్రదేశంలో ఒక ఎర్ర కెరటం లేచింది. ఎర్ర బావుటా ఎగిరింది. సుత్తీకొడవలి తెలుగు చిహ్నం అయింది. సుత్తీ కొడవలి ముగ్గులు - సుత్తీ కొడవలి ఆభరణాలు - కమ్యూనిస్టు పేర్లు సర్వసాధారణం అయినాయి.

ఇది బ్రిటిషాంధ్రం స్థితి. తెలంగాణంలో నేల – కొండలు – పొలాలు ఎర్రబడ్డాయి.

నిజాం రాజు తన రాజ్యాన్ని ప్రపంచానికి దూరంగా – తన గుప్పెట్లో

ఉంచుకోవడానికి చేసిన నికృష్టకృత్యాలకు అంతులేదు. అయినా అరుణోదయాన్ని, కార్చిచ్చును – సుడిగాలిని – ఉప్పెనను అపగలిగినవా డెవడు?

1930లో హైదరాబాదులో కామ్రేడ్స్ అసోసియేషన్ ఏర్పడింది. దానిని ఏర్పరచిన వారు మఖ్దూం – ఆలంఖుంద్‌మిరి – రాజ్‌బహద్దుర్ గౌడ్, ముర్తుజా హైదర్ – సయ్యద్ ఇబ్రహీం. గమనించవలసిందేమంటే – ఇందులో తెలుగువారు లేరు, ఒక్కరు తప్ప అంతా ముస్లిములే! ఇది నూత్న భావాల పట్ల ముస్లిములకు ఉన్న ఆసక్తికి నిదర్శనం! నిజాం 'అనల్‌మలిక్' దుష్ట విధానానికి గొడ్డలి పెట్టు.

1939–40లలో నిజాం రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ అవతరించింది. ఇది అంతకుముందు రాజకీయరంగంలో ఉన్న అనేక మందిని – మంచినీటికి చేపల వలె ఆకర్షించింది. రావి నారాయణరెడ్డి – బద్దం ఎల్లారెడ్డి – దేవులపల్లి వెంకటేశ్వరరావు – సర్వదేవభట్ల రామనాథం మున్నగువారు కమ్యూనిస్టు పార్టీలో చేరారు. పార్టీ విధానాలు – నాయకత్వం కార్యక్రమాలు మేధావుల సహితంగా ప్రజలను ఎంతో ఆకర్షించాయి.

అయితే, కమ్యూనిస్టులు పార్టీగా కాక ఆంధ్రమహాసభ ద్వారానే కార్యక్రమాలు నిర్వహించారు. 1934లో ఖమ్మంలో జరిగిన ఆంధ్రమహాసభల తరువాత అంతగా ప్రాధాన్యత లేని మూడు సభలు జరిగాయి.

నాలుగవ మహాసభ మాడపాటి హనుమంతరావుగారి అధ్యక్షతన 1935లో సిరిసిల్లలో జరిగింది.

అయిదవ మహాసభ కొండా వెంకటరంగారెడ్డిగారి అధ్యక్షతన 1936లో షాద్‌నగర్‌లో జరిగింది.

ఆరవ మహాసభ నిజామాబాద్‌లో మందుముల నర్సింగరావుగారి అధ్యక్షతన 1937లో జరిగింది.

మల్కాపురంలో జరిగిన ఏడవ ఆంధ్రమహాసభ అంతకుముందువానికన్న భిన్నంగా జరిగింది. ఆ సభలోనే కమ్యూనిస్టులు జనాంతికంగా ప్రవేశించారు. అంతకుముందు సభలు నిర్వహించినవారిని మతవాదులు – మితవాదులు – వృద్ధ నాయకత్వం అని దాడి చేశారు. మార్క్సిజం పేరు చెప్పుకొని చరిత్రను – వారసత్వాన్ని గుర్తించకపోవడం విచారకరం. సామాజిక జీవనంలో సహితం భారతీయ సంస్కృతీ వారసత్వాన్ని వారు నిరసిస్తున్నారు. నిర్లక్ష్యం చేస్తున్నారు.

ఈ సభకు మందుముల రామచంద్రరావుగారు అధ్యక్షత వహించారు.

నిజాం ప్రభుత్వం ప్రవేశపెట్టిన సంస్కరణలను పూర్తిగా బహిష్కరించాలని కమ్యూనిస్టులు, ఇతర ప్రగతివాదులూ వాదించారు. పూర్వనాయకులు దానిని వ్యతిరేకించారు. ఈ సందర్భంలో కొంత ఘర్షణ జరిగింది. అప్పుడు హనుమంతరావుగారు ఇలా అన్నారు:

**"ఈ దేశమునందు విద్యార్థికులలో, ముఖ్యముగా యువజనులందు దేశ సేవాసక్తియు, ఆత్మగౌరవ భావమునూ ప్రబలుచున్నవి. ఇట్టి సమయమున మహోత్కృష్టమగు విజ్ఞాన వ్యాపక కార్యక్రమమున ముందడుగు వేయ ప్రయత్నించు చున్నారు. ఇట్టి సేవాసక్తిని అనుమాన దృష్టితో చూడగూడదు.**

వీరి యుత్సాహమును హెచ్చించి, వారితో పనిగొనుట ఉత్తమ రాజనీతి యగును. వీరియందు ద్రోహబుద్ధి లేదని నేను ఘంటాపథముగా చెప్పగలను."

మల్కాపురం సభలో ప్రగతివాదులకే విజయం లభించింది. అప్పటినుంచే ఆంధ్రమహాసభలో అంతర్గతంగా చీలికలు వచ్చాయి. సభ రెండు వర్గాలుగా అనకూడదు కాని, రెండు గ్రూపులుగా విడిపోయింది.

పాతనాయకత్వం తమను "జాతీయవాదులు"గా పేర్కొన్నారు. ప్రగతివాదులు తమను "అభ్యుదయ శక్తులు"గా పేర్కొన్నారు. ప్రగతివాదులకు "రష్యామానసపుత్రులు" అనే ముద్రవేశారు.

పాత నాయకత్వాన్ని వృద్ధనాయకులు – బూర్జువాలు అని నామకరణం చేశారు.

పాత నాయకులు వాస్తవంగా ప్రజలకు దూరంగానే ఉన్నారు. తీర్మానాలు చేయడంతోనే సరిపెట్టుకున్నారు. కార్యక్రమాలకు పూనుకోలేదు. అసలు నాయకత్వంలోనే భూస్వామ్య లక్షణాలు ఉన్నాయి. నాయకులు గ్రామాలకు వెళ్లడం సంభవించినా కచ్చడాల్లో వెళ్లేవారు. గడీల్లో విడిసేవారు. మంతనాలు జరిపి బయట పడేవారు. దాంతో దొరల దౌర్జన్యాలకు మహాసభ ముద్రపడినట్లు అయ్యేది. అయినా కాకున్నా ప్రజలు అట్లా అనుకోవడానికి అవకాశం కలిగింది. ఆ నాయకత్వపు పరిధి అంత. దొరలు – పటేల్, పట్వారీలు – వకీళ్లు – వర్తకులను దాటి పోలేదు. వారి లక్షణమే అంత. వారు అది దాటిపోలేరు.

ప్రగతి వాదులు అచ్చం కమ్యూనిస్టులే కాదు – కమ్యూనిస్టుల సిద్ధాంతాలు కాదు – వారి కార్యక్రమాలను అనుసరించే కమ్యూనిస్టేతరులు కూడా ఉన్నారు. కొమగిరి నారాయణరావు వంటి జాతీయవాదులు కూడా ఉన్నారు.

కమ్యూనిస్టులది విశాల వేదిక. విప్లవాల చరిత్ర. పోరాటాల పథకం. వారి ప్రజలు సామాన్యులు. రైతులు, కూలీలు. వారు స్థాపించదలచింది సమాజవాదం. కమ్యూనిస్టు నాయకులు యువకులు. ఉత్సాహవంతులు. క్రాంతికారులు. వారికి ఒక విశ్వాసం ఉంది. సిద్ధాంతం ఉంది. అన్నింటినీ మించి వారు ప్రజల్లోనివారు – ప్రజలనుండి వచ్చారు – శ్రామిక సిద్ధాంతాలనుంచి వచ్చారు.

మల్కాపురపు సభ తరువాతనే ఆంధ్రమహాసభ ప్రజల 'సంగం' అయింది. గ్రామాలలో ఒక చైతన్యం వచ్చింది. స్పష్టంగా వర్గాలు చీలిపోయాయి. దోచుకునే దొరలది ఒక వర్గం. దోపిడిని ఎదిరించే ప్రజలది ఒక వర్గం. కమ్యూనిస్టు నాయకత్వం గ్రామాలలోంచి – దోపిడికి గురియైనవారినుంచి వచ్చింది. చరిత్రలో తొలిసారిగా తెలంగాణ ప్రజలు తమను – తమ శక్తిని గుర్తించారు. ప్రజలు ఇంతకాలంగా వేచిన నాయకత్వం లభించింది అనిపించింది. అందువల్లనే కమ్యూనిస్టుల నాయకత్వాన ఆంధ్రమహాసభ తెలంగాణా గ్రామాలలో కొరివి మంటవలె – దవానలంవలె – కార్చిచ్చువలె వ్యాపించింది.

ప్రజా ఉద్యమాల్లో ఇంత ఉరుకులు పరుగుల మీద వ్యాప్తి చెందిన సంస్థ మరొకటి కనిపించదు.

అంతమాత్రాన కమ్యూనిస్టులు తప్పులు చేయలేదని అర్థంకాదు. నిజాం రాజు "రాజకీయ సంస్కరణలు" అనే ఎండమావిని చూపాడు. తాను ప్రతిపాదించిన

శాసన సభలో హిందువులకు – ముసల్మానులకు సమాన ప్రాతినిధ్యం కల్గిస్తానన్నాడు. హిందువులు – ముస్లిములు తనకు రెండు కళ్లు అని ప్రచారం చేయించాడు.

నిజాముది ప్రమాదకర వాదం. నూటికి పన్నెండు మాత్రం ఉన్న ముస్లిములకు సగం సీట్లు ఇవ్వచూపడం ఒక పథకం. ముస్లిములను హిందువులమీదకు ఉసికొల్పడం. దీన్ని మజ్లిస్ తప్ప, అన్ని సంస్థలూ వ్యతిరేకించాయి.

కమ్యూనిస్టులు బ్రిటిషిండియాలో కాంగ్రెసును, ముస్లింలీగును సమానంగా భావించారు. రెండు జండాలమధ్య ఎర్ర జండా పెట్టుకొని ఊరేగారు. అది అసమంజసం – ప్రమాదకరం కాదు.

హైదరాబాదు కమ్యూనిస్టులు – భారత కమ్యూనిస్టులను అనుసరించి – నిజాంలో హిందూ ముస్లింలకు చెరిసగం ప్రాతినిధ్యాన్ని బలపరచారు. తరువాత తమ తప్పు గుర్తించారు!

చీలిన బృందాల నేపథ్యంలో చిలుకూరు మహాసభకు ఎంతో ప్రాధాన్యత – ప్రాముఖ్యత – విశిష్టత ఉన్నాయి.

1941లో 8 వ ఆంధ్ర మహాసభ చిలుకూరులో జరిగింది. దీనికి కమ్యూనిస్టు ఉద్యమనేత రావి నారాయణరెడ్డిగారు అధ్యక్షులయినారు.

చిలుకూరు సభలు విశేషంగా జనాన్ని ఆకర్షించాయి. ప్రజలు – ప్రతినిధులు ఉత్సాహంగా పాల్గొన్నారు. ఉత్తేజం పొందారు. ఈ సభలో నిజాం రాజ్యాన్ని గురించి మాత్రమే కాక, జాతీయ అంతర్జాతీయ విషయాలు చర్చకు వచ్చాయి.

"హైదరాబాదు నందలి కొందరు ముస్లిము సోదరులు వ్యవస్థాపూర్వకముగా వింతవింత స్వప్నములు గని, హైదారాబాదుకు మహమ్మదీయు లెల్లరూ రాజులనియూ, మహమ్మదీయులు లేకున్న రాజు లేడనియూ హద్దూ పద్దూ లేని ఆడంబరములు ప్రదర్శించి ఆందోళనకు కారకులైరి.

స్వాతంత్ర్య పోరాటములు విరివిగా వివిధ సంస్థానములయందు సాగింపబడినవి. ఈ ఉద్యమముల నణచుటకై ఒకదానికంటె ఒకటి కఠినముగా శాసనములు గావించబడినవి. సత్యాగ్రహులు క్రూరముగా కొట్టబడి నానా విధములగు హింసలకు లోబడవలసి వచ్చింది. ఆస్తులు జప్తులు చేయబడినవి. తుపాకులు ప్రేల్చబడినవి. హింసలు సహింపలేక ఎన్నియో సంస్థానములయందలి ప్రజలు తమ ఆస్తులు, ఇండ్లు వదలి వలస పోవలసి వచ్చింది. ఇన్ని హింసా పద్ధతులు అవలంబించినప్పటికీ స్వాతంత్ర్యోద్యమము అణచబడలేదు. ఈ మహాయజ్ఞము యొక్క ఫలితము ఈనాడుగాకున్న రేపైనను సంస్థాన ప్రజలకు లభించక తీరదని ప్రపంచ చరిత్రయే మనకు చాటుచున్నది."

ఇది రావినారాయణ రెడ్డిగారి అధ్యక్ష ఉపన్యాసంలోని భాగం.

అంతకుముందు ఏ సభలోనూ ముస్లిములను ఇంత స్పష్టంగా హెచ్చరించలేదు.

ఇతర సంస్థానాల పోరాటాలను ప్రస్తావించి స్వాతంత్ర్య ఉద్యమాలను అణచలేరనీ – చరిత్రలో ప్రభువులు గెలవలేరనీ – ప్రజలే గెలుస్తారనీ చెప్పడం విశేషం.

ఇక్కడ ఒక విషయం గమనించాలి – దేవరకొండ సభలో గస్తీనిషాన్ తిర్వన్ రద్దు చేయమని తీర్మానించారు. అంతమాత్రానికి ప్రభుత్వం నాలుగేళ్లు సభ జరుపుకో నివ్వలేదు. ఇప్పుడు ఇంత తీవ్రమయిన హెచ్చరికను మింగవలసి వచ్చింది. ఇది ప్రభుత్వ విధానంలో వచ్చిన మార్పు. బ్రిటిషు ప్రభుత్వ విధానాలను తాబేదారు నిజాం అనుసరించక తప్పలేదు.

ఈ సభలో కౌలుదారీ సమస్యలు – వెట్టిచాకిరీ – రైతుల సమస్యలు – పౌరహక్కులు – స్త్రీల సమస్యలు మున్నగు విషయాలమీద చర్చ జరిగింది. నియమావళిలో తీవ్రమయిన మార్పులు జరిగాయి. ప్రతినిధులను ఎన్నుకునే నియమం చేయడం జరిగింది.

అతి ప్రధానమయిన మార్పు సభ్యత్వ రుసుము రూపాయినుండి పావలాకు తగ్గించడం – ఇది మహాసభను ప్రజల దగ్గరకు చేర్చింది. రైతు కూలీలు సభ్యులు కావడానికి అవకాశం కలిగింది.

తొమ్మిదవ ఆంధ్రమహాసభ 1942లో వరంగల్లు జిల్లా ధర్మవరంలో జరిగింది. దీనికి మాదిరాజు రామకోటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

1942 జాతీయంగానూ, అంతర్జాతీయంగాను ప్రాధాన్యత వహించిన సంవత్సరం. అందువలన జాతీయ అంతర్జాతీయ సమస్యలు చర్చకు వచ్చాయి. మహాసభలో కమ్యూనిస్టుల ప్రాబల్యం కూడా అందుకు కారణం.

ఈ సభలో రాజకీయ తీర్మానాన్ని గురించి చర్చ జరిగింది. ఇందులో రెండు స్పష్టమైన వర్గాలు ఏర్పడినాయి. ఒకటి – రావి వర్గం. ఒకటి – బూర్గుల వర్గం. ఉభయులకు తీవ్ర వాదోపవాదాలు జరిగాయి. జాతీయవాదుల్లో కొందరు యువకులు రావి పక్షం వహించారు. బాలెట్ పెట్టక తప్పలేదు. ఓటింగులో రావి వర్గం గెలిచింది. బూర్గుల వర్గం ఓడింది. ఇది మహాసభలో కమ్యూనిస్టు భావాల ప్రాబల్యానికి నిదర్శనం.

ఓటమి ఆగ్రహానికి కారణం అయింది. తమ సంస్థలోకి కమ్యూనిస్టులు చొరబడుతున్నారని అలిగారు. ఒక దశలో రామకోటేశ్వరరావుగారు రాజబహద్దూర్ గౌడ్‌తో "కమ్యూనిస్టు పార్టీమీద నిషేధం తొలగింది కదా – వేరుగా పనిచేసుకోరాదా?" అన్నారు. "మేము ఈ కుటుంబంలోనే ఉంటాం – విడాకులు తీసుకోం" అన్నారు గౌడ్. అతను చమత్కారి.

కమ్యూనిస్టుల ప్రాబల్యాన్ని జాతీయులు సహించలేకపోయారు. ముప్పయి మంది స్థాయీ సంఘంనుంచి రాజీనామా చేశారు. వీరిలో బూర్గుల రామకృష్ణారావు – మందుముల రామచంద్రరావు – పరసా రంగారావువంటి ప్రముఖులున్నారు. వీరు యువకుల విషయంలో వృద్ధులవలె అలిగారేగాని విజ్ఞత ప్రదర్శించలేకపోయారు. వీరి అలక వల్ల కమ్యూనిస్టులు బలపడ్డారు. రామకోటేశ్వరరావుగారు ఇరుకున పడ్డారు. వారు ఆ 30 మందిని బ్రతిమిలాడారు. బామాడారు. రాజీనామాలు ఉపసంహరింపజేశారు.

ఈ సభల్లో కమ్యూనిస్టుల ప్రాబల్యం – జాతీయవాదులు పల్చబడడం స్పష్టం.

పదవ ఆంధ్రమహాసభ 1943లో హైదరాబాదులో జరిగింది. దీనికి జాతీయవాది కొండా వెంకటరంగారెడ్డిగారు అధ్యక్షత వహించారు. కమ్యూనిస్టులు బలపడుతున్న

నేపథ్యంలో భూస్వాములు – దొరలకు ప్రాతినిధ్యం వహించే కొండా రంగారెడ్డి అధ్యక్షులు కావడం విచిత్రం. ఇది కమ్యూనిస్టు విధానానికి ఓటమి – కాని, కమ్యూనిస్టు ప్రాబల్యానికి కాదు.

బ్రిటిషాంధ్రంలోనూ విధానాలను లెక్క చేయక ప్రజలు కమ్యూనిస్టులను బలపర్చారు.

ఈ సభలో రాజకీయ సంస్కరణలు చర్చకు వచ్చాయి. కమ్యూనిస్టులు హిందూ – ముస్లిములకు చెరి సగం ప్రాతినిధ్యాన్ని బలపరిచి, సిద్ధాంతపరంగా అపరాధం చేశారు. ఈ వాదంలో యువకులు కమ్యూనిస్టులకు సహకరించలేదు. ఓడిపోయారు.

**"ప్రతాపరెడ్డి, రామకృష్ణుడు, రంగారాయుడు**
**పులిజాల రంగారాయుడూ - పితామహుడు**
**రంగారెడ్డి, వీరేగాడు - మందుములవారు**
**రావివారు, మాదిరాజువారు - మన మాదిరాజువారూ**
**పదియవ సభకు రంగారెడ్డికి పట్టం కట్టేరు."**

అని కాళోజి నారాయణరావుగారు చదివారు. ఇందులో వ్యంగ్యం ఉంది – అందరూ ఎలా కలిశారా? అని.

"చెరిసగం" సిద్ధాంతానికి విరుగుడుగా కమ్యూనిస్టులు ఆదాయపు పన్ను తీర్మానం ప్రవేశపెట్టారు. ప్రత్యక్షంగా వర్తకులకు – పరోక్షంగా ప్రజలకు భారం అవుతుందని జాతీయవాదులు వ్యతిరేకించారు. ఓటింగు జరిగింది. తీర్మానానికి వ్యతిరేకంగా 17 ఓట్లు ఎక్కువచ్చాయి. కమ్యూనిస్టుల తీర్మానం ఓడిపోయింది.

కమ్యూనిస్టులు తీర్మానం ఓడిపోవడాన్ని తమకు అనుకూలంగా మలుచుకున్నారు. సభ ముగియగానే జాతీయ నాయకులు వర్తకులకు అనుకూలము – ప్రజలకు వ్యతిరేకులు అని నినాదాలు చేశారు కమ్యూనిస్టులు.

'కమ్యూనిస్టులతో పడలేము' అనుకున్న కొందరు జాతీయ పక్షం ఏర్పరచుకున్నారు. వారిలో రాజలింగం – కోదాటి నారాయణరావు – హయగ్రీవాచారి మున్నగువారు ఉన్నారు.

వృద్ధులు హనుమంతరావు – కోటీశ్వరరావుగారు జాతీయ పక్షంలో చేరలేదు. ఉపేక్షించారు.

ఆ విధంగా ఆంధ్రమహాసభ మూడుగా చీలిపోయింది.

1. కమ్యూనిస్టు సభ.
2. జాతీయవాద యువకుల సభ
3. ఉపేక్షించిన వృద్ధవర్గం.

**పదవ ఆంధ్రమహాసభ తరువాత కమ్యూనిస్టులు మరింత బలపడ్డారు. అలా అనడంకంటె తెలంగాణంలో కమ్యూనిస్టు పార్టీ మాత్రమే రాజకీయంగా స్థిరపడింది అనడంలో అతిశయోక్తి లేదు. "సంగం" ఊరూరా వెలిసింది. అపారం అయిన ప్రజల సమీకరణ సాగింది. వేలకొలది కార్యకర్తలు స్వచ్ఛందంగా పార్టీలో చేరి, పూర్తి సమయం పనిచేశారు. "చైతన్యం" అనే పదమే తెలియని గ్రామాల్లో చైతన్య జ్వాలలు రగిలాయి. నిజమైన ప్రజలు రైతులు - కూలీలు**

- వెట్టివారు - మహిళలు - బాలురు చైతన్యవంతులయి, ఎర్రబావుటాలతో కదిలారు. మహాసభ సభ్యత్వపు రశీదు హక్కు పత్రం అయింది. దొరలు - కరణాలు - వర్తకులు - సర్కారీ ఉద్యోగులు ఆ చీటీని చూచి జంకారు.

ఇంతింతై వటుడింతయై మరియు దానింతై నభోవీధిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

అని పోతనామాత్యుడు అన్నట్లు ఆంధ్రమహాసభ పెరిగింది – ఎదిగింది – ఎగిసింది.

ఆంధ్రమహాసభయొక్క ఈ దశను నేను నా "జనపదం"నవలలో ఒక సంఘటనగా చిత్రించాను.

అమృతవాణి ఆడబాప. రాముడు ఆమెకు దొరవలన కలిగిన కొడుకు. చిన్న పిల్లవాడు.

వీరభద్రం ఊరికి "సంగం" తెచ్చిండు. ఊరంత ఉరుకులు పెడుతున్నది. రాముడు చూచిండు. తానూ ఏమన్న చెయ్యాలె ననుకున్నడు. వీరభద్రం దగ్గరికి పోయిండు.

"పోరనివి, నువ్వేం చేస్తువుర" అన్నాడు వీరభద్రం.

"చెప్పిచూడండి చేస్తనోలేదో" అన్నాడు రాముడు. వీరభద్రం మోకాళ్ల కాడికున్నడు.

"అట్లయితే నీకు దొరపేరు ఎరికెనా?"అడిగిండు వీరభద్రం.

"దొరకు పేరుంటాది?" మళ్ల అడిగిండు రాముడు.

"దొర దయ్యమనుకున్నవ! మనిషే. ఆనికి పేరుంటది. బలరామయ్య నువ్వంటవా?"

"ఓ. ఎందుకన – బలరామయ్య. నన్నేంచెయ్యమంటావ్?"

"బలరామయ్య అను."

"ఉస్స ఇంతేన" అని రాముడు ఉరికిండు. ఇంటికి పోయిండు. బలరామయ్య, బలరామయ్య అనబట్టిండు. తల్లి అమృతవాణి విన్నది. రామున్ని చచ్చేటట్టు కొట్టింది "లంజకొడుక, దొరపేరు పలుకుతావుర" అని.

రాముడు ఏడ్చిండు. ఏడ్చిండు. వానికి ఊరుకో బుద్ధిఅవుతలేదు. బలరామయ్య అని అరవాలెననుకున్నాడు, లేచిండు. ఊరిబయటికి పోయిండు. గుట్టలమీదికి పోయిండు. గుహలున్న చోటికి పోయిండు.

"బలరామయ్య" అని అరిచిండు. ఆ ధ్వని గుట్టల్ల – గుహల్ల మారుమోగింది.

"బలరామయ్య – బలరామయ్య." మళ్ల మళ్ల అరిచిండు రాముడు. పెద్దగ అరచిండు. గొంతు చించుకొని అరిచిండు.

కొండలు – గుట్టలు – కోనలు అన్ని మారుమోగినయి.

అప్పుడు రాముడు పట్టలేకపోయిండు. ఎగిరిండు, దునికిండు. ఎందుకనుకున్నరు?
సంగం చెప్పింది చేసినందుకు!

## భువనగిరి మహాసభ:

ఈ నేపథ్యంలో చరిత్రాత్మకం అయిన పదకొండవ మహాసభలు భువనగిరిలో జరిగాయి. ఆ సభలు 1944లో జరిగాయి. మరొకసారి రావి నారాయణరెడ్డి గారు అధ్యక్షత వహించారు.

భువనగిరిలో సభ ఏర్పాటు చేయటమే కమ్యూనిస్టుల ప్రధాన ఎత్తుగడ. రావి వారి గ్రామం బొల్లేపల్లి భువనగిరికి దగ్గరలో ఉంది. నారాయణరెడ్డిగారు తొలినుంచి ప్రజారంగంలో ఉన్నారు. అన్ని ఉద్యమాల్లోనూ వారు పాల్గొన్నారు. నిస్వార్థులు. నిష్కళంకులు. తమ భూములను స్వచ్ఛందంగా ప్రజలకు పంచిపెట్టారు. "అంతా పంచలేదు లెండి. మేమూ తెలివైనవాళ్లమే. కొంత మిగుల్చుకున్నాం మాకోసం" అన్నారు నాతో ఒకసారి నారాయణరెడ్డిగారు. అంత నిష్కపటి. పోరాటాలు నిర్వహించడంలో ధురంధరుడు. నేను వారిని 'తెలంగాణా హోచిమిన్' అనేవాణ్ణి. "అంత గొప్పవాణ్ణి చేయకండి" అనేవారు అతి వినయంగా.

1944 వరకే నారాయణరెడ్డిగారికి భువనగిరి ప్రాంతంలో తిరుగులేని పలుకుబడి ఉండేది. ఇది భువనగిరి సభల సందర్భంలో చెపుతున్నమాట. అప్పటికే తెలంగాణంలో పోరాటం – రావి వారు పర్యాయ పదాలుగా ఉండేవి. జాతీయవాదులకు భువనగిరిలో అడుగుపెట్టే ధైర్యం ఉండదు. అందుకనే భువనగిరిలో సభలు ఏర్పాటు చేసింది!

సరిగ్గా అనుకున్నట్లుగానే జరిగింది. కమ్యూనిస్టుల ప్రజా ఉద్యమం త్రివిక్రముని వలె పెరిగింది. ఆంధ్రమహాసభలో జాతీయవాదుల నిలకడ దుస్తరం అయింది. అది వారు గ్రహించారు. ఓటమి కన్న తప్పుకోవడం మిన్న అనుకున్నారు. మూక ఉమ్మడి రాజీనామాలిచ్చి బయటపడినారు. పైగా, తమదే నిజమైన ఆంధ్రమహాసభ అన్నారు. 1945లో మడికొండలో ఆంధ్రమహాసభలు జరిపారు. దానికి మందుముల నరసింగరావుగారు అధ్యక్షత వహించారు. కొండా వేంకటరంగారెడ్డిగారి ప్రోద్బలంతో ఆ సభలు జరిగినాయి.

పరువు దక్కించుకోవడానికే జాతీయవాదులు వేరు కుంపట్టి పెట్టుకున్నది. ప్రజలు కమ్యూనిస్టు ఆంధ్రమహాసభనే "ఆంధ్రమహాసభ"గా గుర్తించారు.

"పోటీ సంగమెందుకయ్య మందుములయ్యా
ఒక సంగం చాలదానయ్య కొండరంగయ్యా!"

అనే పాట ఆబాలగోపాలం నోట వినిపించింది.

ఆంధ్రమహాసభ విప్లవోన్ముఖం కావడం భువనగిరిసభల విశిష్టత –విప్లవత – చరిత్రాత్మకత.

1944 వేసవిలో గస్తీనిషాన్ తిర్పన్ – 53 కింద భువనగిరిలో సభ జరుపుకోవడానికి సులభంగానే అనుమతి లభించింది. కమ్యూనిస్టుపార్టీ ప్రజాయుద్ధం రోజులవి. ప్రభుత్వం అనుమతి నిరాకరించలేకపోయింది. అయినా, ప్రభుత్వం తన కుటిలనీతిని ప్రదర్శించింది.

ప్రభుత్వం అనుమతి ప్రతి నిర్వాహకులకు ఇవ్వలేదు. కలెక్టరుకు పంపుతానన్నది. పంపలేదు. ప్రజలు వేలకొలది కూడారు. ఊరేగింపు జరపాలి. నల్లగొండ

కలెక్టరు భువనగిరిలో మకాం వేశాడు. ఊరేగింపు జరపనివ్వనంటాడు. జనసాగరం పొంగిపొరలుతున్నది.

రావివారు కలెక్టరుతో మాట్లాడారు. కలెక్టరు ఆర్డరు అందలేదన్నాడు. తాను నిస్సహాయుణ్ణి అన్నారు. రావివారు టెలిఫోనులో హోంసెక్రటరీతో మాట్లాడారు. సెక్రటరీ తాలూక్దారుడు – కలెక్టరుకు టెలిఫోనులో అనుమతి పత్రం వినిపించారు.

ప్రజలు దీనినే ఒక ప్రజా విజయంగా భావించారు. భువనగిరి అరుణగిరి అయింది. భువనగిరి వీధుల్లో ప్రజా ప్రవాహం ఉప్పొంగింది. వేలకొద్ది ఎర్రజండాలు రెపరెపలాడేయి.

రావినారాయణరెడ్డి జిందాబాద్
బద్దం ఎల్లారెడ్డి జిందాబాద్
ఆంధ్రమహాసభ జిందాబాద్
దొరల, పటేల్ – పట్వారీల దౌర్జన్యం నశించాలి.
వెట్టిచాకిరి రద్దుకావాలి.
విప్లవం వర్ధిల్లాలి –
వినాదాలతో భువనగిరి కిల్లా ప్రతిధ్వనించింది.

భువనగిరి సభకు – తెలంగాణంలో మున్నెన్నడు రానంతగా – పదివేల జనం వచ్చింది. వచ్చిన జనం ఉత్సాహంతో ఉర్రూతలూగింది. చైతన్యం వెల్లివిరిసింది. తిరుగుబాటు రవ్వలు అంటుకున్నాయి. ప్రజాద్రోహుల గుండెల్లో ఫిరంగులు పేలాయి.

ఈ మహాసభలో నియమావళిని మార్చడం జరిగింది. సభ్యత్వ రుసుము చిలుకూరు సభలో రూపాయినుండి పావలాకు తగ్గించడం జరిగింది. ఈ సభలో పావలా నుంచి అణాకి తగ్గించి మహాసభను ప్రజాయత్తం చేశారు.

కౌలుదారి సమస్య, వెట్టిచాకిరి, స్త్రీల సమస్యల మీద చర్చలు – తీర్మానాలు జరిగాయి.

**భువనగిరిసభలు ప్రజలలో నూతనోత్సాహం - విప్లవ విస్ఫులింగాలను వెలిగించాయి. ఈ సభల తరువాతనే జనగాం ప్రజల వీరోచిత పోరాటాలు జ్వలించాయి. తెలంగాణా సాయుధ పోరాటానికి పటిష్టమైన పునాదులు వేశాయి. రానున్న విప్లవానికి రక్తపు బాటలు - ఎర్ర తివాచీలు - పరచాయి.**

తెలంగాణంలో చిచ్చురగులుతున్నది. గార్లజాగీరు గాఢ నిద్రలో ఉన్నది. వ్యక్తిగతంగా చందా వీరభద్రంవంటివారు వార్ధాకు వెళ్లి వచ్చారు. ఖద్దరు కట్టారు. ఆంధ్రమహాసభలకు హాజరయినారు. కాని, ఒక సంస్థలేదు. ఒక ఉద్యమం లేదు. ప్రజలు నిశ్చేతనంగా ఉన్నారు.

ఒకసారి ఊళ్లోకి పత్రిక తెచ్చినవాణ్ణి చావచితక కొట్టి పంపించారు. పత్రిక సైతం రాని స్థితి. తాసిల్దారు పేరు చెబితే పిట్టలు నీళ్లు తాగవు. చట్టాలు – శాసనాలు లేవు. తాసిల్దార్ ఫర్మాను మాత్రమే. గార్లలో పోలీసు స్టేషను ఉన్నది. జేలు లేదు. ఎదురు తిరిగినవాడు గోరీల గడ్డకే!

ఒక విచిత్రం అయిన విషయం ఏమంటే – రావి నారాయణరెడ్డిగారి బొల్లేపల్లి

– కొండా వెంకటరంగారెడ్డిగారి మంగళారం అత్రాఫ్‌బల్దా జిల్లాలోనివి. అది సర్ఫెఖాస్ ప్రాంతం. అంటే నాయకత్వం జాగీర్లనుంచే వచ్చింది!

కటిక చీకటినుంచే కాంతిరేఖ ప్రభవిస్తుంది!

అయితే, గార్ల జాగీరు మాత్రం కటిక చీకటిలో ఉంది. కాంతిరేఖ కోసం ఎదిరిచూస్తున్నది.

కొండపల్లి గోపాలరావు రాటుదేరిన కమ్యూనిస్టు. వాళ్లది కొత్తపల్లి. వాళ్ల చెల్లెలును మాపెటి శ్రీనివాసరావు గారికి ఇచ్చారు. మా అన్నయ్య శ్రీనివాసరావు ఇంట్లో ఎక్కువ ఉండేవాడు. గోపాలరావుగారు వచ్చినపుడు మా అన్నయ్యను కలుసుకున్నారు. అన్నయ్యలో నిక్షిప్తమయిన నిప్పును గోపాలరావు కనిపెట్టారు.

అప్పటినుంచి కామ్రేడ్ గోపాలరావు కవి దాశరథిని విడువలేదు. మా ఇంటికి నిరంతరం వచ్చారు. అమ్మ పెట్టిన 'పచ్చిపులి – ప్రసాదం' ఆనందంగా భుజించారు. నేలమీద – చాపమీద పడుకున్నారు. రాత్రింబవళ్లు చర్చించారు. అన్నయ్యను సమాధానపరచారు.

అన్నయ్య కమ్యూనిస్టు పార్టీలో చేరాడు. పార్టీలో సభ్యులయినాడు. మాకు సహజంగా ఆవేశం ఎక్కువ. అందునా దాశరథి కవి. ఉరకలు పెడుతున్న పరువంలో ఉన్నాడు. పార్టీకి అంకితం అయినాడు. గోపాలరావు వెంట వెళ్లిపోయాడు.

కామ్రేడ్ గోపాలరావుగాని - కామ్రేడ్ దాశరథిగాని - కమ్యూనిస్టుపార్టీగాని; ఇద్దరు చెల్లెళ్లు - నేను - అమ్మ - అడవిలో ఇల్లు - వీటిని గురించి ఇసుమంతాలోచించలేదు. వెళ్లిపోయారు.

అన్నయ్య పార్టీలో చేరడం తెలంగాణా సాహిత్య చరిత్రకు ఒక క్రాంతిరేఖ. అంతకుముందు దాశరథి కవి మాత్రమే. విశ్వనాథ 'పిట్ట కొంచెం - కూత ఘనం' అని మెచ్చిన కవి. కాని, కామ్రేడ్ దాశరథి కవితలో "అగ్నిధార" కురిపించాడు. 'రుద్రవీణ' పలికించాడు. కవితలో విప్లవ పలాశాలబాట పరచాడు. "నా గీతావళి ఎంతదూరము ప్రయాణంబౌనొ అందాక ఈ భూగోళమ్మున అగ్గిపెట్టి"నాడు.

*ఓ నిజాము పిశాచమా! కానరాడు*
*నిన్నుబోలిన రాజు మాకెన్నడేని*
*తీగెలను తెంపి, అగ్గిలో దింపినావు*
*నా తెలంగాణ, కోటి రత్నాల వీణ!*

అని నిజాము జేలునుంచి రణన్నినాదము చేసినాడు.

"సారే జహాఁసే అచ్ఛా" అని ఒక్క ఇక్బాలే, 'కోటిరత్నాలవీణ' అని ఒక్క దాశరథి మాత్రమే అనగలిగినారు.

ఆ తరువాత పోలీసు చర్య వరకూ అన్నయ్య పట్టుమని పదిరోజులు ఇంటి పట్టున ఉండలేదు.

నాయన ఆస్తి మూట కట్టుకొని వెళ్లిపోయారు. అన్నయ్య కవితాగ్ని కిరీటం

ధరించి వెళ్ళిపోయాడు. నేను పసివాణ్ణి. పదిహేనేళ్లవాణ్ణి. చదువు లేనివాణ్ణి. రోగిష్టిని. ఆవేశపరుణ్ణి. నామీద సంసారభారం.

గుడిశకు పూర్తి గోడల్లేవు. ద్వారబంధం ఉంది. ద్వారం లేదు. నేల చెమ్మగిల్లుతుంది. వానల్లో ఊటలు వస్తాయి. అడవి దగ్గర. ఊరి బయట. వజవజ వణుకు. తేళ్లు – జెర్లు – పాముల మధ్య కాపురం. తరచుగా అడవి మృగాలు వస్తాయి.

అమ్మా – ఇద్దరు చెల్లెళ్లు. చెల్లెళ్లు పసిపిల్లలు. తేలు కరుస్తే మొత్తుకుంటారు. పాము కనిపిస్తే దడుచుకుంటారు. వంటినిండ బట్టలేదు. కడుపునిండ తిండిలేదు. చలిజ్వరాలు. వణుకు.

అమ్మ కడుపుతో ఉంది. పని చేతకాదు. మనసు వికలం. దుస్థితికి దుఃఖం. అర్థ బలం లేదు. అంగబలం లేదు. ఊళ్లో 'నా' అనేవాడు లేదు. అధికారుల వ్యతిరేకత. పనుల్లో అమ్మకు సాయం చేస్తున్నాను. కానుపు ఎట్లా? కనీసం చాటు లేదు. తడకలు కట్టించాను. ఆడదిక్కు లేదు. కాన్పు ఎవరు చేస్తారు?

ఆలోచన వచ్చింది. గూడూరుకు ఉరికాను. అప్పటికే అమ్మమ్మ పరమపదించింది. తాతయ్య, శేషయ్యమామ తల్లిని రప్పించాడు. ఆమెను తీసుకొని కచ్చడంలో మానుకోట బయల్దేరాను. తోవలో బండి బోల్తాపడింది. అమ్మమ్మ మణికట్టు చర్మం లేచిపోయింది. ఎముక బయటికి వెళ్లింది. రక్తం కారుతున్నది. ఆమె ఏడుస్తున్నది.

స్వార్థంలో మనిషిని మించినవాడు లేడు. నేను ఆమెబాధ గమనించడంలేదు. ఆమె రానంటుందేమోనని భయం తిరిగిపోతుందేమో! అమ్మ వంటిది. కాన్పు ఎలా? అమ్మకు ఏమన్నా అవుతే మాగతి ఏంకాను? ఇవే ఆలోచనలు.

పెద్దవాళ్లకు ఇంకా అనుబంధాలూ – బంధాలూ ఉన్నాయి. అమ్మమ్మ చేయి కడుక్కుంది. తడిబట్ట కట్టుకుంది. సిద్ధం అయింది. బండివాడు బండి లేపాడు. ప్రయాణం సాగింది.

> *బలయుతులకు దుర్బలులకు*
> *బలమెవ్వడు నీకు నాకు బ్రహ్మాదులకున్*
> *బలమెవ్వడు ప్రాణులకును*
> *బలమెవ్వండట్టి విభుడు బలమ సురేంద్రా!*

అని భగవంతుని బలంతో సాగిపోతున్నాను. ఎడారి పయనంలో భగవంతుడు ఒయాసిస్సులు చూపుతున్నాడు.

అమ్మకు కాన్పువచ్చే రోజులు వచ్చాయి. అమ్మ మూడు రోజులు అలమటించింది. వయసు మళ్లింది. బలహీనత. మనోవ్యాధి! అమ్మకు ఏమవుతుందోనని భయం! తిండ్లు లేవు. నిద్రలు లేవు! మిత్రులు వస్తున్నారు. ఊరడిస్తున్నారు.

నాటు మంత్రసాని. అమ్మమ్మ. వైద్యం లేదు. తుపాకి వేయించాలన్నారు. కిషన్‌రావుగారు తుపాకి తెచ్చారు. అది భర్ – మార్. మందు నింపాలి. కొట్టాలి. మూడుసార్లు తుపాకి పేలింది.

అమ్మ భారం దిగింది!

చెల్లె కేర్ మన్నది!!

మాకు అమ్మ దక్కింది.
అమ్మదగ్గర పాలులేవు.
పాలపొడికి డబ్బులేదు. డబ్బున్నా యుద్ధం రోజులు. బ్లాక్ మార్కెట్టు. పొడి సాధించాలి. మిత్రులు ఎంతో సాయపడ్డారు. పాలపొడి అందుతున్నది.
బారసాల శాస్త్రోక్తంగా చేశాను. నాయన కూడా వచ్చారు. చెల్లెలుకు నాయనమ్మపేరు "బుచ్చమ్మ" అని పెట్టారు. మిత్రులకు ఆ పేరు నచ్చలేదు. కామ్రేడ్ నాగేశ్వరరావు "అరుణ" అన్నాడు. అరుణ, ఆ రోజుల విప్లవమూర్తి, చెల్లెలుకు "అరుణ" పేరే స్థిరపడింది.

# పదిహేడు

## "త్వమేవమాతా":

గార్లలో శివాలయం. శివాలయంలో సత్రం. సత్రం పేరుకే. ఎవరూ రావడం లేదు. అందులో ఒక గది నాకు ఇచ్చారు. అక్కడ చదువు చెప్పడం ప్రారంభించాను. సర్కారు బడిలో చదువు చెప్పరు. ఉర్దూ వచ్చిన పంతులు మరొకడు లేడు. నాకూ అంతంతే. ఖమ్మంలో ట్యూషన్లు చెప్పాను. ఆ అనుభవం ఉంది. నేను ఆముదపు చెట్టునే. కాని అక్కడ మహా వృక్షాన్ని!
ఒక్కొక్కరూ రావడం మొదలుపెట్టారు. నెలకు అయిదు. అది అప్పటికి ఎక్కువే. చదువు బాగా చెపుతానని పేరు వచ్చింది. చాలమందే కూడారు. ఒక బడి అయింది. గార్లలో ఆ తరం సొంతం నా దగ్గర చదివినవాళ్లే. పక్క ఊళ్ల నుంచి కూడా వచ్చారు. కొందరు దూర ప్రాంతాల నుంచి వచ్చారు. వాళ్లకు అమ్మ వండి పెట్టేది. అలాంటివాళ్లు ముగ్గురు నలుగురు ఉన్నారు. భద్రాచలం దగ్గరి మాధవరం నుంచి ఒకడు వచ్చాడు. అతనిపేరు సుబ్రహ్మణ్యం.
చదువు చెప్పడం అంటే పాఠాలు మాత్రం చెప్పటం కాదు. నాకు పత్రికలు తెలుసు. కొంత రాజకీయాలు తెలుసు. గ్రంథాలయంలో పని చేశాను. దాంతో కొంత జ్ఞానం అలవడింది. విద్యార్థులకు అన్నీ చెప్పేవాణ్ణి. ప్రపంచయుద్ధం. జాతీయ పోరాటం, నిజాం రాజ్యంలో ఉద్యమం, రష్యా విప్లవం – సోషలిజం – ఇలాంటివి ఎన్నో ఎన్నెన్నో – నాకు తెలిసినన్ని చెప్పేవాణ్ణి.
నాకు వేరే ఆసక్తులు లేవు. విద్య ఇతరులకు అందించడమే ఆసక్తి. అందులోనే ఉత్సాహం – ఆనందం. చదువు దీపం లాంటిది. కరెంటు దీపం కాదు. జ్యోతి దీపం. దాంతో ఎన్ని దీపాలయినా వెలిగించవచ్చు. అసలు దీపానికి తరుగురాదు. విద్య దాన్ని మించింది. అందిస్తుంటే వెలుగు పెరుగుతుంది.
నాకు జబ్బు. ఉదయం కుండెడు వాంతి అవుతుంది. తిండి తినలేను. పిడికెడు తిని బయలుదేరడం. దానికే పులి తేనుపులు. తేనుపు తీస్తే పక్కనున్న వాడికి అసహ్యం. అయినా భరించేవారు. రాత్రిళ్లు కూడా చదివించేవాణ్ణి. పిల్లలు ఆసక్తిగా చదివేవాళ్లు. పిల్లలేమిటి? అంతా సుమారు నా వయసువాళ్లే. ఒకటి రెండేళ్లు తేడా! పంతులుగా నన్ను గ్రామం గుర్తించింది.

శివాలయపు సత్రం బడిమాత్రం కాదు. అది ఒక సంగం. ఒక కూడలి. యువజనులు – వృద్ధులు అందరు కూడేవారు. చరిత్ర – భూగోళం – రాజకీయం అన్నీ చర్చకు వచ్చేవి. అదొక వేదిక. అది అందరినీ ఆకర్షించింది. అలా నాకు మిత్రులు అయిన వారిలో ఇద్దరు ప్రాణమిత్రులు. ఒకడు కొదుమూరి వేంకటేశ్వరరావు. గార్ల జాగీరులో వరదయ్యగారు వ్యవహర్త – వ్యాపారి. సంపన్నులు. వారి కొడుకు వేంకటేశ్వరరావు. అతడు తండ్రి చాటు బిడ్డ. అయినా అవసరం అంటే వందలు – వందలు ఇచ్చాడు. హోలి వంద నోటు నీలం రంగులో ఉండేది. వందంటే చాల ఎక్కువ ఆ రోజుల్లో!

రెండో వాడు నకిరెకంటి కృష్ణమూర్తి. వెంకటేశ్వరరావు అక్కకొడుకే. కృష్ణమూర్తి కిరాణందుకాణంలో కూర్చునేవాడు. అడిగిన డబ్బు లేదనలేదు. సరుకులు ఇంటికొట్టువలెనే తీసికెళ్లేవాణ్ణి. పేపరు చదివినా – బాలసంఘం పెట్టినా – రాజకీయాలు నడిపినా – భయ్యాదుకాణంలో గులాబ్ జామున్ తిన్నా – నాగలింగం హోటల్లో పెసరట్టు తిన్నా ముగ్గురం ఉండేవాళ్లం. అది అపూర్వస్నేహం. పూర్వ జన్మబంధం!

ఒకసారి తెనాలి సభకు పి. సి. జోషీ వస్తున్నాడని తెలిసింది. పి. సి. జోషీ కమ్యూనిస్టు పార్టీ ప్రధాన కార్యదర్శి. పార్టీని ప్రజల్లోకి తీసికెళ్లింది అతనే. ప్రతిష్ఠ పెంచిందీ అతనే. జోషీ అంటే గొప్ప అడ్మిరేషన్. నేనూ – కృష్ణమూర్తి – హనీఫ్ బయలుదేరాం. తెనాలికి జోషీ రాలేదు. మేము మద్రాసు వెళ్లాం. చక్రపాణి గారిని కలిశాం. బాలసంఘం విషయం చెప్పాం. వారు ఎంతో సంతోషించారు. మేము చిన్నపిల్లలం. మమ్ములను మెచ్చుకున్నారు. అప్పుడు వారు ఆంధ్రజ్యోతి నడుపుతున్నారు. అది మాసపత్రిక. మేము బాలల పత్రిక నడుపుతామన్నాం. మారుమూల ప్రాంతంనుంచి అది సాధ్యపడదన్నారు. వారి ఆదరం మాకెంతో ఆవేశం – ఉత్సాహం కలిగించాయి.

మేము రావడం ఆలస్యం అయింది. ఊరు అట్టుడికింది. వీళ్లు ఏమైనట్లు? వస్తారా? రారా? కృష్ణమూర్తి ఒక్కడే కొడుకు. కుటుంబం సాంతం కలవరపడింది. రోజూ స్టేషనుకు వస్తున్నారు. నిరాశచెంది పోతున్నారు. మేము దిగాం. వారి ఆనందానికి అవధులు లేవు. అలా తీసికెళ్లినందుకు నన్ను కోప్పడ్డారు. మేం మద్రాసు వెళ్లివచ్చాం. అదొక అడ్వెంచర్. మిత్రులు కూడారు. వివరాలు అడిగారు. వివరించాను. రెండు మూడు రోజులు పిల్లలకు అవే పాఠాలు!

పత్రిక రావడం కష్టం అని చెప్పాను కదా! నాగేశ్వరరావు మరో మిత్రుడు. అతడు డోర్నకల్లునుంచి తెచ్చేవాడు. డోర్నకల్లు రైల్వే జంక్షన్. అక్కణ్ణుంచి ఇల్లందుకూ, కొత్తగూడానికీ రైలు మార్గాలున్నాయి. అప్పటికి కొత్తగూడెంలో గనులు లేవు. స్టేషను కూడా భద్రాచలం యాత్రికుల కోసం ఏర్పడింది. బొగ్గు ఇల్లందునుండి వచ్చేది. దాన్ని "బొగ్గుట్టి" అంటారు. అన్ని రైళ్లూ డోర్నకల్లులో ఆగాల్సిందే. అక్కడ ఇంజనులో బొగ్గూ, నీళ్లూ నింపుతారు. అప్పుడు విమానాల్లేవు. ఢిల్లీ నుంచి మద్రాసు జి. టి.లో వెళ్లాల్సిందే. అది డోర్నకల్లులో చాలసేపు ఆగుతుంది. ఆ బండిలో వచ్చిన రాజాజీ –రాజేంద్రప్రసాద్ – అజాద్ వంటి జాతీయనాయకులను

డోర్నకల్లు వెళ్లి చూచాం. ఆనాడు వాళ్లను దర్శించడం – ఈనాడు సినిమా హీరోలను చూచినదానికన్నా గొప్ప థ్రిల్! వారు బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడలాడించారు!

డోర్నకల్లు జాగీరు లోనిది కాదు. ఖాల్సా ప్రాంతం. నాగేశ్వరరావు బడికి పత్రిక తెచ్చేవాడు. జనం మూగేవారు. పత్రిక చదివి వినిపించేవాళ్లం. వివరించేవాళ్లం. ముఖ్యంగా జనగాంలో జరుగుతున్న వీరోచిత పోరాటాలు ప్రజలను కదిలించేవి. ఆంధ్రమహాసభను అందరూ ప్రశంసించేవారు. అప్పటి పత్రిక నాలుగు లేక ఆరుపేజీలుండేది. ఖరీదు అణా.

తరువాత పత్రిక పోస్టులో తెప్పించాం. కొన్నాళ్లు తాసిల్దార్, పత్రిక పోస్టులో మాయం చేయించాడు. అది కలకాలం సాగలేదు. పోస్టురాగానే మేం గుంపుగా వెళ్లాం. పోస్టుమాస్టరు దగ్గర కూర్చున్నాం. పత్రిక తెచ్చుకున్నాం. తరువాత పోస్టు మనిషి తెచ్చి ఇచ్చాడు.

పోస్టులో పేపరు తెప్పించడంలో ఒక చిక్కుంది. పోస్టు నిజాం రాజ్యం వరకే పరిమితం. మనియార్డరు అంగ్రేజు ఇలాకాకు పోదు. రెండు మనియార్డరు ఫారాలు వ్రాయాలి. ఒకటి హైదరాబాద్‌లో ఉన్న బ్రిటిషు పోస్టు మాస్టరు పేర – మరొకటి మనం పంపించదలచినవారి పేర. బ్రిటిషు పోస్టుమాస్టరు పంపించేవరకు సమయం పడుతుంది.

కొంతకాలం తరువాత పత్రిక ఏజన్సీ తీసుకున్నాను. దినపత్రిక ఆంధ్రప్రభ– వారపత్రిక ప్రజాశక్తి తెప్పించాను. నేనే స్వయంగా పంచేవాణ్ణి. చందాలు వసూలు చేసేవాణ్ణి. వర్తకులు పత్రిక కొనడం ప్రారంభించారు. పత్రిక ఇవ్వడానికి పోయినప్పుడో – చందాకు పోయినపుడో వర్తకులతో మాట్లాడేవాణ్ణి. వాళ్ళతో సంబంధాలు ఏర్పడ్డాయి. వారికి నా విషయంలోనూ – ఉద్యమ విషయంలోనూ సానుభూతి ఏర్పడింది. వారు చందాలు ఇవ్వడానికిగాని, వ్యక్తిగతంగా నాకు ఇవ్వడానికిగాని ఏమాత్రం వెనుకంజ వేసేవారుకారు.

పార్టీ పత్రిక "ఖేమీజంగ్", "గోలకొండ" పోస్టులో వచ్చేవి. బడి ఒక గ్రంథాలయం అయింది. "ప్రజాశక్తి" దినపత్రిక వచ్చిన్నాడు ఎర్రజండాలు పట్టుకొని గుంపులుగా స్వాగతం పలికాం. ఆంధ్రప్రభ బంద్ చేశాం. ప్రజాశక్తి తెప్పించాం. వాస్తవంగా ప్రజాశక్తి అచ్చు బావుండేది. తెలంగాణ ఉద్యమ వార్తలు ఎక్కువగా ఉండేవి. నేను ప్రజాశక్తికి వ్యాసాలు వ్రాశాను. నిజాం పరిస్థితులు – జాగీర్ల దుస్థితిని గురించి వ్రాసిన నా వ్యాసాలు "ప్రజాశక్తి"లో రావడం నాకు గర్వకారణం. మిత్రులకు ఉత్సాహ హేతువు.

ఆంధ్రమహాసభ అణా సభ్యత్వ ఫారాలు కిషన్‌రావుగారి దగ్గర తీసుకున్నాం. మాకేటి కిషన్‌రావుగారు పేష్కారు వరవరరావుగారి పెద్దకొడుకు, పెంపుడు పోయాడు. కావడానికి కరణమే. కాని, లంకలో విభీషణుడు. ఆంధ్రమహాసభకు అంకితం అయినాడు. ఎచ్చులు చెపుతాడు. ముఖస్తుతికి పొంగిపోతాడు. అందరూ అతన్ని హేళన చేస్తారు. అయినా మంచి కార్యకర్త. ఆంధ్రమహాసభకు అంకితం అయిన పెద్దల్లో దాశరథి – కిషన్‌రావు – చందా భద్రం ముఖ్యులు.

నేనూ – నాగేశ్వరరావు –వేంకటేశ్వరావు – కృష్ణమూర్తి పిల్లలం. సభ్యత్వం ఫారాలు నలుగురం నింపినా సరిపోవడం లేదు. శివాలయం జనంతో నిండుతున్నది.

బడి ఆంధ్రమహాసభ కార్యాలయం అయింది. విద్యార్థులు – కిషన్‌రావు వంటి పెద్దలు నింపినా జనం ఇంకా వస్తూనే ఉన్నారు.

నా బడి గ్రంథాలయం అయింది. ఆంధ్రమహాసభ అనధికార కార్యాలయం అయింది. నేనూ నాగేశ్వరరావు ఫారాలు తీసుకున్నాం. ఊళ్లమీద పడ్డాం. ఇంటింటికీ వెళ్లి చేయించాం. వెళ్లిన చోటనల్లా మజ్జిగ ఇచ్చారు. టీ ఇచ్చారు. భోజనాలు పెట్టారు. ఎంతో ఆదరం చూపారు. ఆత్మీయత కనబరచారు. అదొక అపూర్వ అనుభవం! అనంత అనుభూతి!! అసామాన్య ఆత్మీయత!!

ఇదంతా ఎవరో చెప్పితే చేసింది కాదు. ఒకరు బోధించింది కాదు. ఇది సొంతం ఉద్యమ ప్రభావం! ఉద్యమమే నన్ను ఉరికించింది. ప్రజలు నన్ను తమవాణ్ణిగా చేసుకున్నారు. వారే నాకు పాఠాలు నేర్పారు. నేను వ్యక్తులతో సంబంధం పెట్టుకోలేదు. పదవులకు పాకులాడలేదు. ఉద్యమం నన్ను ఉత్తేజితుణ్ణి చేసింది. నా కర్తవ్యం నిర్వహించాను. నాకు సభ్యుణ్ణి అయ్యే వయసు లేదు. నేను సభ్యుణ్ణి కాలేదు.

ఈనాటి వరకు నేను ఏ పార్టీ సభ్యత్వం తీసుకోలేదు. పత్రికలు - పుస్తకాలు - పరిస్థితులు - ప్రజలు నన్ను మనిషిని చేశాయి. దేశం మనకంటే గొప్పది. దేశంకోసం ఏదయినా చేయాలి. నాకు సాధ్యం అయినంత చేస్తున్నాను. ఇంతవరకు ఫలితం ఆశించలేదు. గుర్తింపుకు పాకులాడలేదు.

కర్మణ్యేవాధికారస్తే మాఫలేషు కదాచన
మాకర్మఫలహేతుర్భూర్మా తే సంగోత్స్వకర్మణి. – భగవద్గీత–2–47.

పని చేయడమే నీ కర్తవ్యం. ఫలమును ఆశించకు. ఫలితానికి కారణభూతుడవు కావద్దు. అట్లని పని చేయకుండరాదు. ఇది వేదాంతం కాదు. మనిషికి నిత్యావసరం. మానవతకు మహిత మార్గం.

పని ఎట్లాగూ చేస్తున్నాం – "బాలసంఘం" ఏర్పరచడం మంచిది అనుకున్నాం. ఆలోచన నాగేశ్వరరావుది అనుకుంటా. వెంకటేశ్వరావు డబ్బు అందించాడు. ఖమ్మం వెళ్ళి సభ్యత్వ ఫారాలు, రశీదు పుస్తకాలు అచ్చువేయించి తెచ్చాం. బోర్డు వ్రాయించాం. అన్నీ సిద్ధం చేశాం. తేదీగూడా నిర్ణయించాం.

బాల సంఘం గప్ చిప్‌గా ప్రారంభించడం ఇష్టం లేదు. ఏదో కాస్త సందడి – అలజడి ఉండాలి. గ్రామంలో మరికొన్ని వీధి బళ్లున్నాయి. ఆ పంతుళ్లను ఒప్పించాం. పిల్లలను సిద్ధం చేశాం. అంతా ఉత్సాహంగా ఉన్నారు. ఊరేగింపు తీయాలనుకున్నాం. దానికి గస్తీతిర్పన్ కింద అనుమతి కావాలి. తాసిల్దారును అడిగే ధైర్యం లేదు. ఇస్తాడని నమ్మకం లేదు.

అనుమతి లేకుండానే ఊరేగింపు తీయడానికి నిర్ణయించాం. కిషన్‌రావు వగైరాలు వారించారు. పోరలం కదా! వినలేదు. ఏమవుతుంది? అరెస్టు చేస్తారు. నాలుగు దెబ్బలు కొడ్తారు. ఇంతేకదా! అది అనాటి తెగింపు. శాసనోల్లంఘనానికి పూనుకున్నాం! అది వెర్రి సాహసమే! కాని, అంతా సాహసం చేశారు.

ఆ రోజు వచ్చింది. ఉదయమే శివాలయం చేరుకున్నాం. క్రమక్రమంగా పిల్లలు చేరుతున్నారు. వింత చూడాలనో – అవాంతరం జరుగుతుందనో – దూరంగా జనం కూడుతున్నారు. వాతావరణంలో జంకు, భయం, సస్పెన్సు కనిపిస్తున్నాయి. అయినా పిల్లలు కూడుతూనే ఉన్నారు. జనం మూగుతున్నారు. గుసగుసలు చెప్పుకుంటున్నారు.

పిల్లలను వరుసలుగా రోడ్డుమీద నిలబెట్టాం. ఎర్రజండాలు ఇచ్చాం. "బాలసంఘ సభ్యులం – భరతమాత పుత్రులం" పాడుతున్నాం. చూడడానికి వచ్చిన జనం ఎక్కువయినారు. అమ్మా, చెల్లెళ్లు కూడా వచ్చారు. ఇది జాగీరు చరిత్రలో తొలి ఊరేగింపు! జనం డాబాలమీద, చెట్లమీద ఎక్కారు.

పోలీసులను వెంటపెట్టుకొని అమీన్‌సాబ్ వచ్చాడు. వాళ్లూ వరుసగా నుంచున్నారు. పోలీసులను జనం చూచారు. పిల్లలు చూచారు. ఒక్కరూ కదల్లేదు!

"బాలసంఘం–గార్ల" అని వ్రాసిన ఎరుపు బ్యానర్ నేనూ, నాగేశ్వరరావు పట్టుకున్నాం. నా చేతిలోని కర్ర నాగేశ్వరరావుకు ఇచ్చాను. నేను అమీన్ సాబ్ – సబిన్‌స్పెక్టరు – దగ్గరకి వెళ్ళాను.

"మార్తే క్యా! – కొడ్తారా?" అని అడిగాను.

అమీను తడబడ్డాడు. ఈ ప్రశ్న వస్తుందనీ – ఇలా అడుగుతారనీ అతను ఊహించలేదు. ఏం చెప్పాలో అర్థం కాలేదు.

"క్యోం మార్తే – ఎందుకు కొడ్తాం?" అన్నాడు.

"ఫిర్‌క్యోం ఆయే? – ఎందుకు వచ్చినట్లు?" అడిగాను.

"సాథ్ చలేంగే – వెంట సాగుతాం" అన్నాడు.

"చలో" అని నేను బ్యానర్ అందుకున్నాను.

'బాలసంఘం జిందాబాద్' అని సాగాం. పిల్లల వరుస కొద్దిగానే ఉంది. జనం తండోపతండాలుగా మావెంట సాగారు. ఊరేగింపు అత్యంత ఉత్సాహంగా సాగింది.

"బాలసంఘం జిందాబాద్
ఆంధ్రమహాసభ జిందాబాద్
రావి నారాయణరెడ్డి జిందాబాద్
ఎర్రబావుటా జిందాబాద్!"

నినాదాలతో ఆవేశంగా ఉత్సాహంగా సాగింది. ఉద్రేకం లేదు. ముర్దాబాదులు లేవు. ఊరేగింపును చూడడానికి జనం ఇళ్లముందు గుంపులుగా కూడారు.

ఊరేగింపు పెద్ద బజారుకు చేరింది. బాజావాళ్లు నాదస్వరం వాయిస్తూ స్వాగతం పలికారు. ఊరేగింపు ముందు నడిచారు. ఆనాటి ఊరి ఉత్సాహం చూడాల్సిందే. వ్రాయరాదు. అన్ని వీధులూ తిరిగి శివాలయం ముందుకు చేరుకున్నాం.

అక్కడ అమీను నన్ను పిలిచాడు. ఏదో అవాంతరం జరుగుతుందని అంతా ఊపిరి బిగపట్టారు. నేను భయపడలేదు. వెళ్లాను.

"మీటింగ్ బాహర్‌నహీం – అందర్ కర్నా. అంజామ్ బురాహోగా – మీటింగు బయటకాదు. లోన చేసుకోండి. పరిణామాలు బాగుండవు" అన్నాడు. అమీను ఆవేశంలో ఉన్నాడు. ఓడినట్లున్నాడు. బింకం ప్రదర్శిస్తున్నాడు.

విషయం వివరించాను. జనాన్ని లోనికి చేరమన్నాను. అందరూ నన్ను ఎత్తుకున్నారు. ఎగరేశారు. శివాలయం జనంతో కిటకిటలాడింది. మంటపం వేదిక అయింది.

"అన్యాయ కాలంబు దాపురించిందిపుడు
అందరము మేలుకోవాలండీ
మాన్యాలు భోగాలు మనుజులందరి కబ్బు
మార్గాలు వెదకాలి రారండి" అనే పాట నాగేశ్వరావు పాడాడు. అధ్యక్షులని ఉన్నట్లు లేదు. కిషన్‌రావు – భద్రం – నేను చాల ఉద్రేకంగా మాట్లాడాం.

సభ ముగిసేవరకు ఒక పెళ్లి ముగిసినట్లయింది. తరువాత చాలారోజులు గ్రామంలో ఆ ముచ్చటలే సాగాయి.

శాసనోల్లంఘనాన్ని తాసిల్దార్ ఎలా సహించాడు అనేది చాల రోజులు చర్చకు వచ్చింది.

1. ఊరేగింపుకు అనుమతి తీసుకోవాలనే విషయం తాసిల్దారుకు తెలిసి ఉండదు.
2. పోలీసులకు ఏం చేయాలో తెలియలేదు. అయోమయంలో పడ్డారు. బెదిరించ చూశారు. కుదర్లేదు. ఏం చేసినా బెడిసి కొడుతుందేమోనని భయపడ్డారు.
3. అంత జనాన్ని అంతకు ముందు చూడలేదు. జాగీరు పోలీసులకు శిక్షణ లేదు. ఏం చేయాలో తెలియలేదు.

ఇవే కారణాలు అయ్యుంటాయి అనుకున్నాం.

అన్నింటినీ మించింది – కమ్యూనిస్టుల ప్రజాయుద్ధపు పాలసీ కావచ్చు.

బాలసంఘానికి పుస్తకాలు కొనాలనుకున్నాం. వేంకటేశ్వరరావు డబ్బుతో రెడీ! అయినా డబ్బు బాలసంఘానికి బాగానే ఉంది. ఇద్దరం బెజవాడ వెళ్లాం.

బెజవాడ నాకు చాల ఇష్టం. ఖమ్మం నుంచి కూడా తరచు వెళ్లేవాణ్ణి. బెజవాడలో తెలుగు బోర్డులు – తెలుగు పత్రికలు – తెలుగుదనం – కృష్ణవేణి– వంతెనమీదినుంచి పోయే రైలు చూడ్డమంటే ఎంతో ఎంతో ఇష్టం. రిక్షావాళ్లు – గుర్రబ్బళ్లవాళ్లు పత్రిక చదువుతారు. రాజకీయాలు మాట్లాడ్తారు. అది నాకు ముచ్చట. ఇలాంటివి తెలంగాణంలో చూడాలని అపేక్ష. దేశానికి స్వాతంత్ర్యం రావాలి. నిజాం నవాబు పోవాలి. తెలుగువాళ్ళంతా ఒకటి కావాలి. అదొక ఆదర్శం. అదొక లక్ష్యం. అదొక గమ్యం.

వెంకటేశ్వరావు – నేను 'మోడరన్ కెఫే'లో గది తీసుకున్నాం. బెజవాడంతా తిరిగాం. ప్రజాశక్తి బుక్‌స్టాల్లో పుస్తకాలు కొన్నాం. 'సరస్వతి'లో 'బసంత్' పిక్చరు చూచినట్లు గుర్తు. అశోక్‌కుమార్, లీలా చిట్నీస్ ఉన్నారు. వారు అప్పటి ఆరాధ్యులు. లీలామహల్లో సినిమా చూశాం.

పుస్తకాల కట్టలతో నిజాం బండి ఎక్కాం. అక్కడ ఒకేరకం పుస్తకాలు అమ్మేవాళ్లు వస్తారు. కొవ్వలి – జంపన నవలలు చాల ప్రఖ్యాతాలు. పుస్తకం మీద అర్ధరూపాయి ధర. కాని రూపాయికి ఆరు – ఎనిమిది ఇచ్చేవారు. అవికూడా కొన్నాం. కాని, వాటి మీద నాకు అంత మంచి అభిప్రాయం లేదు. అయితే 'కొవ్వలి' నవలలు తెలుగువారికి చదివే అలవాటు చేశాయి. అంతవరకు అదీ కొంత సాధించినట్లే!

బడి – రీడింగ్ రూం – బాలసంఘం– ఆంధ్రమహాసభ అయిన శివాలయ సత్రం ఇప్పుడు గ్రంథాలయం అయింది. పుస్తకాలు తీసికెళ్లడం – చదవడం – తెచ్చివ్వడం చాలమంది చేస్తున్నారు. వాటిలో ఉబుసుపోకవి తక్కువ. విజ్ఞానదాయకములు ఎక్కువ. వాటి వలన మంచి ప్రచారం – విజ్ఞానం – చర్చ జరిగాయి.

ఆ రోజుల్లో నేను అనేక పుస్తకాలు చదివాను. నన్ను ప్రభావితుణ్ణి చేసినవి మినూమసానీ 'మన ఇండియా', దేవులపల్లి వేంకటేశ్వరరావుగారి 'జనగాం ప్రజల వీరోచిత పోరాటాలు', 'గదర్ వీరులు', 'అమ్మ'. ఆరోజుల్లో 'అమ్మ' మీద నిషేధం ఉంది నిజాంలో. నాగేశ్వరరావు ఒక ప్రతి 'అమ్మ' సంపాదించాడు. అది ఒక్కొక్కళ్లకు ఒక్క రోజుకు మాత్రం ఇచ్చేవాడు. నావంతు వచ్చింది. అది నాకు అందింది.

రాత్రిపూట – మంచంకోడుమీద కోడిగుడ్డు లాంపు వెలుగులో చదువుతున్నాను. గోర్కీ నవల కేల్షియం ఇంజక్షనులా వేడి ఎక్కిస్తుంది. ఆ రచన – ఆ శైలి – ఆ పాత్రలు – ఆ ఉద్యమంలో మునిగిపోయాను.

ఇంటికి తలుపు లేదని చెప్పాను. దర్వాజకు అడ్డంగా మంచం వేసుకొని చదువుతున్నాను. అమ్మ – పావెల్ – సమ్మె – చిత్రాల్లా మనోఫలకం మీద కదిలిపోతున్నాయి. ఎప్పుడో అర్ధరాత్రికి ముగించాను. దీపం ఆర్పి పడుకున్నాను.

అర్ధరాత్రి దాటిందనుకుంటాను. ఏదో కదిలినట్లయింది. లేవబోయాను. తలకు ఏదో తాకింది. మేలుకొని చూశాను. ఇద్దరు దొంగలు రెండు ట్రంకు పెట్టెలు తీసుకొని పారిపోతున్నారు. "దొంగలు" "దొంగలు" అని కేకలు వేసుకుంటూ వాళ్లవెంట ఉరుకుతున్నాను. ఇరుగు పొరుగువారు లేచారు. పరిగెత్తే నన్ను పట్టుకున్నారు. "దొంగలు రాళ్లు కొడ్తరు పోవద్ద"న్నారు. నన్ను ఇంటికి తెచ్చారు. రాత్రంతా మా ఇంటిముందే మేలికతో గడిపారు. చాయ్ చేయడానికి పాలుకూడా లేవు.

"పెట్టెలు పోనియ్యి. ప్రాణం దక్కింది" అని అమ్మ నన్ను పట్టుకొని ఏడ్చింది. చెల్లెళ్లూ ఏడ్చారు. అందరూ వాళ్లను ఓదార్చారు. మేమున్నాం అని ధైర్యం చెప్పారు.

ఇరుగు పొరుగు మాత్రమే కాదు – చుట్టుపట్ల వాళ్లు కూడా లేచారు. "మేమున్నాం" అని సిద్ధం కావడం ఎంతో ధైర్యం – మనోబలం కలిగించింది. నాయన మమ్మల్ని వదిలివెళ్లారు. మాతామహులకు అమ్మ ఒక్కర్తే. పితామహులకు నాయన ఒక్కరే. మాకు మేనమామలు లేరు. మేనత్తలు లేరు. బంధువుల్లో ఒక్కరు – ఒక్కరంటే ఒక్కరు పలకరించలేదు. నాయన పండితుడు, సర్కారు బలం ఉన్నవాడు. కడుపుతో ఉన్న భార్యను, అయిదుగురు పిల్లలనూ వదిలి వెళ్లిపోతే వేలెత్తి చూపినవాడు లేడు. ఆ వయసులో – పెళ్లాం పిల్లలను వదులుకొని – పెళ్లి కాలేదని అబద్ధం ఆడి – పెళ్లి చేసుకుని – మైసూరునుంచి ఆ ఆడమనిషిని తీసుకొనివస్తే – పేష్కారు వరవరరావు స్వాగతం పలికాడు. వాళ్ల ఇంట్లో ఉంచుకున్నాడు!

పేష్కారుకు ప్రభుత్వ బలం ఉంది. నాయనకు పేష్కారు 'పట్టు' ఉంది. వాళ్లను పల్లెత్తుమాట అనే ధైర్యం జాగీరులో ఏ ఒక్కనికీ లేదు. నాయన మరొక ఆడదాన్ని తెచ్చుకున్నాడు. అది తెలిసి అమ్మ క్రుంగిపోయింది. అగ్గి బుగ్గి అయింది. అడిపోసుకున్నది. నేను ఆవేశపరుణ్ణి. అన్యాయం సహించలేను. అమ్మ ఏడుపు

చూడలేక పోయాను. పేష్కారు ఇంటి మీదికి ఉరికాను. అమ్మ నన్ను పట్టుకున్నది. "నిన్ను వాండ్లు చంపుతరు, పోవద్దు" అన్నది. నేను విడిపించుకున్నాను. ఉరికాను.

సుడిగాలిలా ఉరికాను. బచ్చాగాణ్ణి! ఏమిటా సాహసం! పేష్కారు ఇంటిముందు నుంచున్నాను. 'నీ వంశం నాశనం అవుతుంది. నీ కొంప కూలుతుంది. నువ్వు నాశనం అవుతావు' లాంటి తిట్లు - తిట్టింది తిట్టకుండా గంట తిట్టాను. మన్నులు - దుమ్ములు పోశాను. జనం గుంపులుగా నిలబడి చూస్తున్నారు. కాని పేష్కారు ఇంట్లోంచి ఒక్కడు బయటి రాలేదు. తలుపులు వేసుకున్నారు. కిమ్మనలేదు.

నాయన బంగ్లామీదినుంచి మమ్ములను నానా తిట్లు తిట్టారు. "మీరు ఊళ్లో బిచ్చం ఎత్తుకునేట్లు చేస్తాను" అని శపథం పట్టారు. ఎవరు? కన్నతండ్రి! పండితుడు!! వేదాంతి!!!

ఆనాటి సంఘటనకు గ్రామం ఆశ్చర్యచకితం అయింది! పేష్కారు నన్నేమో చేయిస్తాడు అన్నారు మిత్రులు. అది పేష్కారుకు అంత పెద్ద పనీ కాదు. కాని, ఏమీ చేయలేదు. చేయలేకపోయాడు! ఎందుచేత? ఇదిగో "మేమున్నాం" అని మా వెంట నిలిచే జనం ఉన్నారు. మాకు ప్రజాబలం ఉంది!

అసలు జాగీరులో మా నిలకడయే ప్రజావిజయం. పూర్తి ప్రభుత్వబలం - పశుబలం - రాక్షసబలం వాళ్లదగ్గర ఉంది. మాకు ప్రజలున్నారు. ప్రజాశక్తి ఉంది. ప్రజాబలం ఉంది.

'మావాళ్లు' అనేవాడు తొక్కి చూడలేదు. "మేమున్నాం" అని జనం సొంతం మా ఇంటిముందు నిలిచింది. అది కొండంత బలం కలిగించింది. తెల్లవారింది. వార్త అగ్గిలా పాకింది. వెంటనే ఉరికి వచ్చినవాళ్లు కొదుమూరి వేంకటేశ్వరరావు - నకిరేకంటి కృష్ణమూర్తి - పానుగంటి నాగేశ్వరరావు. "పేష్కారే చేయించిండు" అన్నారు మొదటి ఇద్దరు. "ఊరుకోరాదు - ప్రతీకారం చేయాలె" అన్నాడు నాగేశ్వరరావు పిడికిలి బిగించి - ఆవేశంగా. అతడు నన్ను మించిన ఆవేశపరుడు - "మోదుగుపూలు"లో నాగేశ్!

జనం గుంపులుగా గుంపులు కూడారు. మా ఇల్లు జాతర అయింది. ఇద్దరు మనుషులు రెండు ట్రంకు పెట్టెలు తెచ్చారు. 'పుట్టకోటదగ్గర పారేసి పోయిను' అన్నారు అంతా. వట్టి పెట్టెలు, బట్టలన్నీ పోయినాయి. "మీ ఇల్లే దొరికిందా?" అన్నారు అంతా. పోలీసులకు ఇత్తలా - రిపోర్టు - చేయమన్నారు కొందరు. 'నాకు ఈ సర్కారుమీద నమ్మకం లేదు. పోలీసుల మీద నమ్మకం లేదు' అన్నాను.

పోలీసు అమీను వచ్చాడు.

"క్యాహువా? - ఏమైంది?" అడిగాడు.

"కుచ్ నహీఁ - ఏమీ కాలేదు."

"కహతేహైఁ చోరీ హువా? - దొంగతనం అయింది అంటున్నారు."

"జీవహీఁ! కుచ్ జరూరత్‌మందోనే కప్డేలేగయె - అవసరం ఉన్నవాళ్లు బట్టలు తీసికెళ్లారు."

"అజబ్‌సే బాత్‌హై, చోర్‌కో జరూరత్‌మంద్ కహెతహైఁ - విచిత్రం! దొంగను అవసరపరుడు అంటున్నారు."

"జీహాఁ! హమారీ జుబాన్ హీ అయిసీహై – మా భాషంతా సుమారు ఇలాగే ఉంటుంది."

"ఫిర్‌తో హమ్ చల్తేహైఁ – అయితే మేం వస్తాం."

నాగేశ్వరరావు నన్ను గట్టిగా కావిలించుకొని – ఎత్తి గిరగిరా తిప్పాడు. "బాగా బుద్ధి చెప్పావు దొంగను అవసరపరుడు అనడం రంగన్నకు తప్ప చేతకాదు" అన్నాడు. అందరూ చప్పట్లు కొట్టారు.

ఈ సంతోష సమయంలో – దొంగలు పడ్డది సంతోష సమయమండీ – అందరికీ చాయ్ తాగించాలనిపించింది. కాని, ఇంట్లో చెక్కెర లేదు. టీ పొడి లేదు. పాలు లేవు. అసలు బిందె లేదు కాచడానికి!

అనుకుంటుండగానే బిందెతో చాయ్ తెచ్చింది పొరుగింటి మంగమ్మ. అందరం చాయ్ తాగుతున్నాం.

"ఇంక ఈ ఇంట్లో ఉండడం కష్టం" అన్నాడు కొదుమూరి.

"ఏం చేద్దమంటవు?" నకిరేకంటి ప్రశ్న.

"ఇల్లుకట్టాలె!" నినాదంలా నాగేశ్.

"మనం పిల్లలం భాయీ! మనం ఇల్లేం కడ్తాం? మాకోసం ఇంతమంది వచ్చారు. ఇది చాలు. ఇళ్లూ వాకిళ్లమీద నాకు నమ్మకం లేదు" అన్నాను.

"ఏం కట్టలేమా? కడ్తం" అన్నారు అందరు.

క్రమంగా అందరూ వెళ్లిపోయారు.

నేను వీధిలో పోతుంటే రామానుజంగారు పిలిచారు. వారిది బట్టల కొట్టు. నన్ను ఇంట్లోకి తీసికెళ్ళారు. కుర్చీ వేసి కూర్చొమ్మన్నారు. "దొంగలను చుట్టాలన్నోళ్లణ్ణి నిన్నే చూచిన" – అతని కంఠం రుద్ధం అయింది. 'బట్టలన్ని పోయినయని విన్న' అని కొత్త బట్టలమూట అందించాడు.

అంతటి ఆత్మీయతను తట్టుకోలేకపోయాను. కన్నీరు దానంతట అదే జలజలా రాలింది. అన్నయ్యను మించి దగ్గరికి తీసుకొని రామానుజంగారు నా కన్నీరు తుడిచారు. "ముండ కొడుకులు మంచోళ్లు కారు. నేనిచ్చిన్నని చెప్పకున్రి. ఇల్లు కడ్తనంటున్రు. ఏంకావాలన్ననా తీసుకపోండి" అని మాట ఇచ్చి పంపించారు.

ఇంత అభిమానం, ఇంత ఆత్మీయత ఎందుకు?

ఈ అనుభూతులే నాకు ఆహారం!

నేను డబ్బును - ఆస్తిని - ఆదాయాన్ని నమ్ముకోలేదు.

ఆత్మీయతనే నమ్ముకున్నాను.

ఇప్పుడు అదీ కరువవుతున్నది!!!

వ్రాస్తే – ఈనాడు కల్పన అనిపించవచ్చు – కాని, తెల్లవారి ఇంటికి ముగ్గుపోశారు. పునాదులు తవ్వారు. బండ్లలో రాయి, ఇటుక వస్తూనే ఉన్నవి. గోడలు లేవనే లేచాయి!

వరదయ్యగారిది పెద్ద కలపమండి. వేంకటేశ్వరరావు వారి కొడుకు. తండ్రిచాటు

బిడ్డ. బండ్లమీద కలప పంపుతున్నాడు – తండ్రికి తెలియకుండా. ఒకనాడు బండ్లు సాగుతున్నప్పుడు తండ్రి చూచాడు. కొడుకు బిక్కుబిక్కుమన్నాడు.

"ఎంకటేశా! యాడికిరా బండ్లు పోతున్నయ్?"

"అయ్యగారింటికి" వెంకటేశ్వరరావు నన్ను పేరుపెట్టి పిలవడం వాళ్ల ఇంట్లో వప్పుకోరు. వాడు నన్ను "అరే రంగా," అనడం వింటే వాళ్లమ్మ "అయ్యగారిని అట్లనొద్దుర. కళ్లుపోతయ్. కాళ్లు పట్టుకో" అనేది.

"అరే! ఎంకటేశా! అయ్యగారింటికయితే బండ్ల కిరాయి ఎవరిస్తార్రా?"

"వాడే ఇచ్చుకుంటాడు."

"తప్పురా ఎంకటేశా! పెద్దలను అట్లనొద్దు. కిరాయి కూడ మనమే ఇయ్యాలె. ఇగో పైసలు తీస్క పోయి కిరాయి ఇచ్చి రాపో" అని పంపించారు వరదయ్యగారు – పెద్ద సాహుకారు.

వేంకటేశ్వరరావు తనుచుకుంటూ ఉండి వచ్చాడు. వాళ్ల తండ్రి సాధారణంగా కరగడు. పూచికపుల్ల పోనివ్వడు. వాడు జరిగింది చెప్పాడు. "ఎందుకురా నువ్వంటే ఇట్లపడి చస్తరు?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అరే! గజేంద్రుడు మొర పెట్టుకున్నాడు. భగవంతుడు వచ్చాడు. రక్షించాడు. నేను మొరపెట్టుకోలేదు. అయినా రక్షిస్తున్నాడు" అన్నాను.

"అరే రంగడూ! ఈ మాటలతోనే వశపర్చుకుంటున్నవుర" అన్నాడు వేంకటేశ్వరరావు రుద్ధకంఠంతో.

వాస్తవంగా బండ్లకిరాయలు వాడే ఇస్తున్నాడు. నా దగ్గర కనీసం బూడిద లేదు.

ఎవరెవరు ఎంత ఇచ్చారో తెలియదు కాని, వానలు నెత్తిమీదకు వచ్చేవరకు ఆరు గదుల విశాలమయిన పెంకుటిల్లు తయారయింది. మేము అందులోకి మారాం. ఆ సంవత్సరపు భారీ వర్షాలకు ఇదివరకటి పూరిల్లు కూలిపోయింది!

సరిగ్గా సమయానికి భగవంతుడు నీడ చూపించాడు. అలా అంటున్నానంటే గ్రామ ప్రజలను కించపరచడం కాదు. చేత చిల్లిగవ్వలేని పిల్లవాణ్ణి ఆదరించి – నాకు ఏమాత్రం ఆయాసం కలక్కుండా – చక్కని ఇల్లు సమకూర్చారు. వారి రుణం తీర్చుకోరానిది!

కన్న తండ్రి కావాలని గుడిశలో ఉంచిపోయాడు. 'మాతాత్వమేవ – పితాత్వమేవ' అన్నట్లు ప్రజలు తల్లులయి, తండ్రులయి, అన్నలై, తమ్ములయి ఒక మంచి ఇల్లు కట్టించి ఇచ్చారు!

వాస్తు వగైరా ఏమీ చూడక దడదడా కట్టినిల్లు లక్ష్మీప్రదమైంది. ఆ ఇల్లు కొన్నవాళ్లుకూడా దినదినాభివృద్ధి చెందుతున్నారు. ఇప్పుడు ఇల్లు ధన ధాన్యాలతో కళ కళలాడుతున్నది.

వ్యక్తిగతంగా కొదుమూరి వేంకటేశ్వరరావు రుణం తీరేదికాదు. అడిగి కొన్ని – అడగక కొన్ని అనేకం సమకూర్చాడు. పెద్ద చెల్లెలు శకుంతలను గుంటూరు 'శారదానికేతనం'లో చదివించడానికి డబ్బిచ్చాడు.

శారదానికేతనం ఉన్నవ లక్ష్మీనారాయణగారు స్థాపించి, నిర్వహించింది. ఆ సందర్భంలో వారిని దర్శించుకునే భాగ్యం కలిగింది. వారు రచించిన "మాలపల్లి" నవల నాకు ఆదర్శప్రాయం.

1982లో అనుకుంటా – కుమారి ప్రేమావతి గారు సికిందరాబాదులో మా ఇంటికి వచ్చారు. వారు నా 'జనపదం' నవలమీద – శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో డాక్టరేటు కోసం పరిశోధన చేస్తున్నారు. నన్ను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చారు.

"గార్లలో మీకు ఎలా గడిచింది?" అడిగారు.

"గ్రామం పోషించింది" అన్నాను.

ఆమె బిత్తరపోయింది. పరిహాసం అనుకుంది. ఎంతో వివరించాల్సి వచ్చింది.

**ఈ తరానికి గ్రామాలే తెలియవు.**

**గ్రామం పోషించిందంటే అర్థంకాదు.**

**అది త్యాగాలయుగం – ఇది లాభాలయుగం.**

## పద్దెనిమిది

## 'మూకం కరోతి వాచాలం':

ఆంధ్రమహాసభకు ప్రజలు 'సంగం' అని తమపేరు పెట్టుకున్నారు. చిలుకూరు సభనుంచి భువనగిరి సభ దాకా "సంగం" ప్రభుత్వం ఆదేశాలు అమలు చేయించడం మీదనే కేంద్రీకరించింది. ప్రజలకు హక్కులను తెలియపరచింది. వెట్టిని వ్యతిరేకించింది. రైతు కూలీల హక్కులను రక్షించింది.

భువనగిరి సభ తరువాత ప్రజా పోరాటాలను నిర్వహించింది. ఎన్నో జరిగాయి. వీనిలో ఎక్కువ నల్లగొండ జిల్లాలోనే జరిగాయి. అప్పుడు ఖమ్మం ప్రత్యేక జిల్లాగా లేదు. జనగాం నల్లగొండ జిల్లాలో ఉండేది.

1. జనగామ తాలూకా ధర్మాపురంలో లంబాడీలు తరతరాలుగా 80 ఎకరాల మెట్ట – 25 ఎకరాల మాగాణి సాగు చేసుకుంటున్నారు. జమీందారు పోసుకూరి రాఘవరావుకు భూదాహం అపరిమితం అయింది. లంబాడీలను తొలగించాలనుకున్నాడు. గుండాలను తెచ్చాడు. సంగం లంబాడీలను ఏకం చేసింది. కత్తులు – కొడవళ్లు – కర్రలు – వడిసెలలతో – ఎర్రజండాలు చేతబూని గుండాలను తరిమికొట్టారు. భూమి దక్కించుకున్నారు.
2. జనగామ తాలూకా మొండ్రాయిలో లంబాడీల స్వాధీనంలో ఉన్న భూమిని కఠారి సోదరులు – జమీందార్లు – కాజేయాలనుకున్నారు. ధర్మాపురం పోరాటం బుగులు పుట్టించింది. చుట్టుపక్కల దొరలను కూడకట్టారు. 75 మంది సాయుధ పోలీసులతో బయలుదేరారు.

   ఆరుట్ల రామచంద్రారెడ్డి నాయకత్వాన లంబాడీలు బరిశలు – వడిసెలలు ఎర్రజండాలతో కదిలారు. చుట్టుపట్ల మనుపాడు – గొల్లపల్లి – దేవరుప్పల –

కడివెండి – సీతారామపురం – ముడిపడగ – కఠారు – రామారం గ్రామాలనుంచి సాయుధ ప్రాణులయిన ప్రజావాహిని – ఎర్రజండాలు రెపరెపలాడగా – నినాదాలు దిక్కులు పిక్కటిల్లగా కదలివచ్చింది. అరువేల జనాన్ని చూచి దొరలు, పోలీసులు దడుచుకున్నారు. కామ్రేడ్ అరుట్లను అరెస్టు చేయించారు. తాము గెల్చామని జల్సాలు చేసుకున్నారు.

లంబాడీలు స్త్రీలు – పురుషులు ఇతర గ్రామాల ప్రజలు భూమిని వదల్లేదు. ఎర్రజండా విడువలేదు. పోలీసులు తుపాకులు ఎక్కుపెట్టారు. పేలుస్తామన్నారు. ప్రజలు అదరలేదు. బెదరలేదు.

పోలీసులు బెదిరారు. తోకముడిచారు.

3. సూర్యాపేట తాలూకా ఎర్రపాడు దొర జన్నారెడ్డి ప్రతాపరెడ్డికి లక్షాయాభైవేల ఎకరాల భూమి ఉంది. అయినా, దాహం తీరలేదు. చిల్పకుంట – ఎడవల్లి – నూతనకల్లు ప్రజల భూములు కాజేయాలనుకున్నాడు. మందీ, మార్బలంతో దిగాడు.

సంగం ప్రజలను సమీకరించింది. గుజ్జుల రామచంద్రయ్య నాయకత్వాన దొరను గ్రామ బహిష్కారం చేశారు. పనివాడు ఒక్కడూ గడీ తొక్కలేదు. దొరవారు మండిపడ్డారు. గుండాలను తెచ్చారు. గడీలో పోలీసు క్యాంపు పెట్టించారు. దొరకు కర్చుదక్కింది. పనివాడు రాలేదు. ప్రజలు భూములు వదులుకోలేదు.

4. హుజూర్‌నగర్ తాలూకా బేతవోలు మఖ్తేదారు – ప్రజలనుంచి లెక్కలేనన్ని పన్నులు గుంజుతాడు. భూములు ప్రజల పేరుమీద పట్టా చేయడు. సంగం నాయకత్వాన ప్రజలు హక్కుల కోసం పోరాడారు.

దొర పట్నం నుంచి అరబ్బులను – సిక్కులను రప్పించాడు. ప్రజలను బెదిరించాడు. స్త్రీలు వేల సంఖ్యలో పొరకలు తీసుకుని గుండాల వెంటపడ్డారు. ప్రజలు 600 ఎకరాల దొరభూములమీదకు వందల పశువులను తోలారు.

దొర పారిపోయాడు.

5. మేళ్ల చెరువు బంజర్దారు ప్రజలకు భూమి హక్కు ఇవ్వడు. వాళ్లను పీడించుకు తింటాడు. ప్రజలు సంగం పతాకం కింద ఏకం అయినారు. పట్టుపగలు బంజార్దారును హతమార్చారు. దాంతో మిగతా బంజర్దార్లు లొంగి వచ్చారు. రాజీకి వచ్చారు. ప్రజలకు భూముల మీద హక్కులు ఇచ్చారు.

6. మల్లారెడ్డి గూడెంలో సంగం పటేల్, పట్వారీల దౌర్జన్యానికి వ్యతిరేకంగా ప్రజలను సమీకరించింది. పటేల్, పట్వారీలు తాసిల్దారును తీసుకొని వచ్చారు. రైతులు రఖం కట్టడం లేదన్నాడు. పంటలు జప్తు చేయవలసిందన్నాడు. లంచం తిన్న తాసిల్దారు అందుకు సిద్ధం అయినాడు. పంటమీద చేయిపడితే పానాలు దక్కవని ప్రజలు తాసిల్దారును హెచ్చరించారు. తాసిల్దారు తోకముడిచాడు.

గ్రామాల్లో ప్రజలను పటేల్, పట్వారీలు పెట్టినన్ని బాధలు దొరలు కూడా పెట్టలేదు. పోలీస్‌పటేల్ అంటే గ్రామానికి పోలీసు అధికారి. శాంతిభద్రతల బాధ్యత అతనిది. జగడం జరిగిందనో, దొంగతనం అనో, కంసాల్లదగ్గర దొంగబంగారం ఉందనో సతాయించి లంచాలు గుంజుతాడు. పట్వారీ అంటే కరణం. భూమికి

సంబంధించిన వ్యవహారాలన్నింటికి పట్వారీ బాధ్యత. కరణమంత పేచీకోరు మరొకరు ఉండడు. పొలాల సరిహద్దులు మారుస్తాడు. పేర్లతో పేచీ పెడ్తాడు. అందుకే కరణం పగ కాటికి పోయేదాక ఉంటది అని సామెత.

'పట్వారీకా కుత్తా మరాతో గాఁవ్ సబ్ అయా, పట్వారీ మరాతో ఏక్ భీ నహీ ఆయా' అనేది ఉర్దూ సామెత. పట్వారీ కుక్క చస్తే ఊరంతా వచ్చింది. పట్వారీ చస్తే ఒక్కడూ రాలేదు. కరణం కుక్క చస్తే భయానికి ఊరు సాంతం తరలి వచ్చింది. కరణం చస్తే పీడ విరగడ అయిందని ఒక్కడూ రాలేదు. మాలీ పటేలు శిస్తులు వసూలు చేయడంలో పట్వారీకి సాయపడ్తాడు. వీడు గ్రామానికి ఒక పీడ!

వీరు గ్రామానికి చిల్లరదేవుళ్లు. వీరి దురాగతాలను "చిల్లరదేవుళ్లు" నవలలో వివరించాను.

మల్లారెడ్డిగూడెం ప్రజలు తమ బలంతో తాసిల్దారును సాగనంపారు. కాని, గ్రామాధికారులు ప్రజలను వదల్లేదు. పోలీసులను తీసుకొని వచ్చారు. ఆ ఊళ్లో మూడో వంతుకు పైగా ముస్లిములున్నారు. ముస్లిం మహిళలు ఐక్యంగా నిలిచారు. తాము తెరచాటు వాళ్లమనీ, పోలీసులను తమ ఇళ్లలో అడుగు పెట్టనీయమనీ ఎదిరించారు. మహిళాశక్తి ముందు పోలీసులు నిలవలేకపోయారు. తోకముడిచారు.

గ్రామాల్లో హిందూ – ముస్లిముల సంఘటన 'అనల్‌మలిక్' విధానానికి గోరీ కట్టింది.

మఖ్దూం ఈ విధానాన్ని పరిహసిస్తూ "అరే ఫకీర్ తూతో హూజూర్ హై. భీక్ క్యోఁ మంగ్తా హై" – అరే ఫకీరూ, నువ్వు పాదుషావు. బిచ్చం ఎందుకు అడుగుతావు" అనేవాడు.

ఒకసారి శాసన సభలో ఒక సభ్యుడు ప్రభుత్వం ప్రతిపక్షాల పేరే ప్రస్తావించదు – అన్నాడు. అప్పుడు మఖ్దూం "భారత్‌మేఁ ఔరతేఁ మరద్‌కానామ్ నహైఁ లేతీఁ – భారత స్త్రీలు భర్త పేరు పలుకరు" అన్నాడు. అంటే ప్రతిపక్షం ప్రభుత్వానికి మొగుడు అన్నట్లు!

7. జనగాం తాలూకా విసునూరు దొరకు 40 వేల ఎకరాల భూమి ఉంది. అది 40 గ్రామాలలో ఉంది. దౌర్జన్యానికి విసునూరు దొరలు జగత్ప్రసిద్ధులు. అక్కడ సంగం గట్టిపడింది. ప్రజలు సంగం పాటలు పాడిన్రు. సంగం మాటలు విన్నారు. దొరకు బుగులయింది. గుండాలను దింపిండు. కడివెండి గ్రామంల అడగుండాలను సుతదింపిండు. సంగమోల్లు ఊరుకున్నారా? అడమనుసులతోనే అడగుండాలను చిత్క కొట్టించిన్రు. వాండ్లు అయ్యో – అమ్మో అని పట్నందారి పట్టిన్రు.

దొరకు బుగులెక్కువయింది. పగబట్టిండు. ఎసువంటి పగయ్యా అంటే పాము పగ. మాల్గుజారీ – రెవెన్యూ – మనసులను తెచ్చిండు. లెవీ గింజలు వసూలు చెయ్యుమన్నడు. అప్పుడు సంగపోరన్నరు – మొదలు దొరకాడ పట్టండి అనటంతోని ఊరుకున్నరు? దొరయి అరబస్తాల గింజలు చూపిన్రు. దొర – హోదేదార్లు – ఆఫీసర్లు – ఒకరి మొకాలు ఒకరు చూచుకున్నరు.

సంగపోరు మీ ఇద్దరి అంతు తేలుస్తుమన్నరు. మందిని గింజకు కాప్ల పెట్టిన్రు.

సీధ సర్కారు తానికే పోయిన్రు. అడినుంచి అఫ్సర్లను పట్టుకొచ్చిన్రు. దొరగింజ పట్టిచ్చిన్రు. దొర గిజగిజలాడిండు. గింజుకున్నడు. సర్కారు ఆరువేల బస్తాల గింజ పట్కపోయిన్రు.

ఊళ్ల సంబరం చేసుకున్నరు.

గార్ల జాగీరులో కూడా సంగం ఆధ్వర్యాన రెండు చరిత్రాత్మకం అయిన పోరాటాలు జరిగాయి.

8. డోర్నకల్లు జంక్షన్ను గురించి ప్రస్తావించారు. అది క్రైస్తవ మిషనరీల ప్రధాన స్థానం. హిందూ – ముస్లిం – క్రైస్తవ వాస్తు కళతో నిర్మించిన పెద్ద చర్చి ఉంది. వాళ్లు పాఠశాలలు – వైద్యశాలలు కూడా నిర్వహిస్తారు.

డోర్నకల్లుకు సమీపంలోని గార్ల జాగీరులో "వేదనాయకపురం" అనే హరిజన గ్రామం ఉంది. బహుశః వాళ్లంతా మతం మార్చుకున్న హరిజనులు. వారు కలకాలంగా ఆ గ్రామ భూములను సేద్యం చేసుకుంటున్నారు. తమ అధీనంలో ఉన్నది కాబట్టి తమవే అనుకున్నారు. కిస్తులు కూడా కడ్తున్నారు.

డోర్నకల్లులో బిషప్ ఉంటాడు. వారి పేరు అజరయ్య. విద్వాంసుడు. మతాధిపతి, వేదనాయక పురం భూములను తన పేర చేయించుకున్నారు. అందుకోసం వారు పడిన పాట్లు ప్రభువునకే తెలియవలయు.

అజరయ్య గారు పేద క్రైస్తవ హరిజనులకు బేదఖల్ నోటీసులు ఇచ్చారు. అంటే – భూములను కాళీచేసి తమకు స్వాధీనం చేయవలసిందని నోటీసులు ఇచ్చారు. పేద ప్రజలు అయ్యవారి దగ్గరికి వెళ్లారు. మొర పెట్టుకున్నారు. అయ్యగారు దీవించినారు. కాని, భూములు మాత్రం వదులుకోను వీలుపడదు అన్నారు.

పేద ప్రజలకు దిక్కుతోచలేదు. తాసిల్దారుతో మొర పెట్టుకున్నారు. తాసిల్దారు అయ్యవారి పక్షమే వహించారు. భూములు వదులుకొమ్మని తాకీదు ఇచ్చారు. వదలకుంటే ఖాళీ చేయిస్తామని బెదిరించారు.

సరిగ్గా ఆ సమయంలో గార్లకు సంగం దిగింది. వేదనాయకపురం హరిజనులు 'సంగం'ను ఆశ్రయించారు. కిషన్ రావుగారు దాశరథిని పిలిపించారు. దాశరథి – కిషన్‌రావు కేసు వివరాలు సేకరించారు. అన్నీ అజరయ్యకు అనుకూలంగా ఉన్నాయి. అన్నీ పకడ్బందీగా ఉన్నాయి. అజరయ్యగారిని కలిశారు. చెవిటిముందు శంఖము చందము అయింది.

వేదనాయకపురంలో సభ చేశారు. ఎర్ర జండాలు రెపరెపలాడేయి. చుట్టు పట్ల గ్రామాల ప్రజలు కూడారు. మేమంతా వెళ్లాం. దాశరథి ఉపన్యాసం అగ్గి కురిపించింది. గుండెల్లో అగ్గి రగిల్చింది.

"సంగం జిందాబాద్

భూములు వదిలేదిలేదు" అని నినాదాలు చేశారు.

పోరాటం సాగింది.

అజరయ్య గుండాలను పంపాడు. హరిజనులు సాహసోపేతంగా ఎదిరించారు. హరిజనులు, గుండాలు గాయపడ్డారు. నేల రక్తసిక్తం అయింది. కిషన్‌రావుకు కూడా దెబ్బ తగిలినట్లు గుర్తు.

"పొలాలు దున్ననియ్యం" వాళ్ళ శపథం.

"దున్ని తీరుతాం" సంగం శపథం.

ఆరోజు చుట్టు పట్లగ్రామాల వేల జనం కూడారు. నేల ఈనినట్లు ఎర్ర జండాలతో భూమి మీద నిలిచారు. నినాదాలతో కొండలు – కోనలు ప్రతిధ్వనించాయి. ఎర్రజండాలు కట్టిన వందల నాగళ్లు భూములు దున్నాయి.

అజరయ్య గుండాలూ – ప్రభుత్వ పోలీసులు నివ్వెరపోయి చూచారు. అడుగు ముందుకు వేయలేదు.

"ఇన్షిలాబ్ జిందాబాద్" నినాదం మిన్నంటింది.

గుండాలు పోలీసులు వెన్నుచూపి పారిపోయారు.

తరువాత కోర్టులోకూడా హరిజనులు గెలిచారు.

9. కోటగడ్డ గార్ల జాగీరులో – మారుమూలన – అరణ్యంలో ఉన్న – కోయగూడెం.

కోయలు అడవి బిడ్డలు. అమాయకులు. భూమి ఒకరి పేర ఉంటుందని కూడా తెలియదు. అరకకు రూపాయిపావలా కిస్తు కడ్తారు. చేతనయినంత దున్నుకుంటారు. ఒకేచోట దున్నాలనీ ఎరగరు. వాళ్లు అడవిదొరలు. అడివిమీద వారి జీవనం. వ్యవసాయం నామమాత్రం. నాగరకత వారిని అంటడానికి వెరుస్తుంది.

ఈ అమాయక కోయల భూమికి ఎసరు పెట్టాడు ఒక రాక్షసుడు. వాడి పేరు రంగారెడ్డి. వాడు దేశ్‌ముఖ్. వానికి వేల ఎకరాలుంది. ఇదీ కాజేయాలని పథకం పన్నాడు. భూమి సొంతం తన పేర చేయించుకున్నాడు.

అప్పుడు మొదలయినాయి కోయల కడగళ్లు. రంగారెడ్డి మనుషులు కోటగడ్డలో మకాం పెట్టారు. కోయలకు హక్కులే దన్నారు. అది కోయలకు అర్థం కాలేదు. గిరిజనులను కౌలు అడిగారు. వాళ్లు ఇచ్చారు. అడవి సామగ్రి తెచ్చివ్వమన్నారు. ఇచ్చారు.

కోటగడ్డకు రంగారెడ్డి ప్రత్యక్షం అయినాడు. భూములు వదిలి పొమ్మన్నాడు. కోయ అన్నింటినీ వదలగలడు – భూమిని వదలడు – బిడ్డను వదలడు. "భూమిని వదలం" అని గట్టిగా చెప్పారు. రంగారెడ్డి దౌర్జన్యం సాగింది. కారంముంతలు కళ్లల్లో పోయించి – కోయలను కొట్టించాడు.

ఆనాటినుంచి అతడు "కారంముంతల రంగారెడ్డి" అయినాడు.

కోయలకు సంగం సంగతి తెలిసింది. వారు 'సంగం'ను ఆశ్రయించారు. సంగం 'యోగక్షేమం వహామ్యహం' అని అభయమిచ్చింది. దాశరథి – కిషన్‌రావు – గోపాలరావు కోటగడ్డలో మకాం వేశారు. కోయలతో ఉన్నారు. తిన్నారు. పన్నారు. కోయలలో చైతన్యం కలిగించారు. కోయగూడేలను సంఘటితపరిచారు.

సంగం నాయకత్వాన కోయలు రంగారెడ్డిని – అతని మనుషులను బహిష్కరించారు. కోయ సహకారం లేకుండా అడవిలో ఉండడం అసంభవం. రెడ్డి మనుషులు పారిపోయారు.

రంగారెడ్డి అంతిమ పోరాటానికి అయత్తం అయినాడు. అడవి కోయల రాజ్యం. రంగారెడ్డి ఆటలు సాగడం అసంభవం. అయినా ఊరుకోలేదు. బండ్లలో గుండాలను, పోలీసులను తీసుకొని బయలుదేరారు.

అడవి బాటలు పాపిటలు – బండ్లు సాగడం కష్టం. దోవలు తెలియవు. సంగం నాయకత్వాన కోయలు కట్టుదిట్టమైన వ్యూహం పన్నారు. గుండాల బండ్లను

చుట్టుముట్టారు. బరిశెలు – కత్తులు – రోకళ్లు – కర్రలు – వడిసెలలు – రాళ్లతో ఒక్కుమ్మడి దాడి చేశారు. స్త్రీలు కారంముంతలు రంగారెడ్డి కంట్లో కొట్టారు. వచ్చిన గుండాలు – పోలీసులు – గుడ్డివాళ్లు అయినారు. కోయలు చేత చావుదెబ్బలు తిన్నారు. ఎడ్లు – బండ్లు – తుపాకులు వదిలి ప్రాణాలు దక్కించుకొని పారిపోయారు.

రంగారెడ్డి చాల రోజులు లేవలేదు.

కోయలు నిండు వెన్నెట్లో డప్పులు – పాటలు – ఆటలతో విజయోత్సవం చేసుకున్నారు.

**అన్నయ్య దాశరథికి అడవిలో - ఆ కోయ గూడెంలో - ఆనాడు తగిలిన మలేరియా ప్రభావం అంతిమసమయందాకా వదలలేదు.**

ఈ పోరాటాన్ని నా "మోదుగుపూలు" నవలలో చిత్రించాను.

## కాంతి నిలయం గ్రంథాలయం:

బాల సంఘానికి గ్రంథాలున్నాయి. పత్రికలు వస్తున్నాయి. అందరు చదువు తున్నారు. కాని, గ్రామంలో గ్రంథాలయం లేదు. దాశరథి ఉండగానే గ్రంథాలయం స్థాపించాలనుకున్నాం.

అన్నయ్యకు చలిజ్వరం. గజగజా వణికిపోతాడు. ముడుచుకొని ఎండలో కూచుం టాడు. తగ్గుతుంది. మళ్లీ లేచి తిరుగుతాడు. మందు లేదు. మాకు లేదు. గార్లలో పేరుకు సర్కారీ దవాఖానా ఉంది. కాని, డాక్టరుకు విరేచనాల మందు ఇవ్వడం తప్ప తెలియదు.

ఆ స్థితిలోనే మా ఇంట్లో సమావేశం జరిగింది. ఇప్పుడు మా ఇల్లు బావుంది. గదులున్నాయి. గదులకు తలుపులున్నాయి. మరీ ఇంట్లోకి పాములు రావడం లేదు. పెరట్లోనే పుట్టలున్నాయి. దర్శనం ఇస్తూనే ఉంటాయి. పాము కుబుసాలు కనిపిస్తూనే ఉంటాయి! మాది సర్పాలతో సహజీవనం.

పాములు – తేళ్లు ఊళ్లో కూడా విరివిగా ఉండేవి. శాస్త్రి అని మాకు మిత్రుడు. సీతారామయ్యగారి కొడుకు. కామ్రేడ్ మంగపతి బావమరిది. ఎప్పుడూ మాతోనే ఉండేవాడు. శివాలయం సత్రంలో.

ఒకనాటి రాత్రి అతడు మంచంలో పడుకున్నాడు. నిద్రలో ఉన్నాడు. అతనిమీద కట్లపాము పడ్డది. అది కరుస్తున్నది. శాస్త్రికి తెలియడం లేదు. అతడు పొర్లినప్పుడల్లా దానిమీద పడుతున్నాడు. అది కరుస్తున్నది. తుదకు లేచాడు. దీపం బుడ్డితో చూస్తే పక్కలో పాము! తల్లిదండ్రులను లేపాడు. అందరు కలిసి పామును చంపారు.

శాస్త్రి స్పృహ కోల్పోయాడు. పడిపోయాడు. తెల్లవారింది. వార్త పాకింది. మేమంతా వాళ్ల ఇంట్లోనే ఉండిపోయాం. ఊరి జనం ఇంటి నిండా కూడింది. మందులు లేవు. డాక్టర్లు లేరు. దైవ ప్రార్థన. అంతే. ఇంకేమీలేదు..

డోర్నకల్లు స్టేషన్లో 'అక్బర్' అని రైల్వే ఉద్యోగి. అతనికి పాము మంత్రం వచ్చు. పాము కరిచిందని ఏ స్టేషను నుంచయినా అక్బరుకు తెలియపరచవచ్చు. అతడు మంత్రాలు చదువుతాడు. దిగిపొమ్మని ఫోనులో చెపుతాడు. విషం దిగిపోతుంది.

మనిషి లేచి ఇంటికి వెళ్తాడు. చూసినా కొందరు నమ్మరు. మనిషిమీదనే విశ్వాసం లేనివానికి మంత్రంమీద విశ్వాసం ఏముంటుంది?

శాస్త్రి విషయం డోర్నకల్లు అక్బరుకు తెలియపరచాం. అతడు 'దిగు' అన్నాడు. దిగలేదు. ఊరంతా ఉడికిపోతున్నది. మూడు రోజులయింది. విషం దిగలేదు కాని శరీరం నల్లబడలేదు. ఆశ! ఇంకా బతుకుతాడని!

మూడో నాడు అక్బరు స్వయంగా వచ్చాడు. పాము కరిచినవాడు లేచేదాకా అతడు అన్నం ముట్టడట! మూడు రోజుల ఉపవాసం ఉండి దిగాడు. శాస్త్రి ఇంటికి వచ్చాడు. శాస్త్రి తలమీద పేము బెత్తంతో మూడుసార్లు కొట్టాడు. శాస్త్రి లేవలేదు. అక్బరు మూడుసార్లు తన నొసలు నేలకు కొట్టుకున్నాడు. శాస్త్రి లేవలేదు.

"పామును చంపారా?" అడిగాడు అక్బరు.

"అవును, చంపాం" అన్నాడు తండ్రి.

"అప్పుడే చెప్పొద్దా! పామును చంపుతే నా మంత్రం పారదు. ఇతనికి ప్రాణం లేదు" అని లేచి వెళ్లిపోయాడు.

ఆశ చచ్చింది! శాస్త్రి చచ్చాడు!! అందరం గొల్లుమన్నాం. అతని శవయాత్రకు ఊరంతా కదిలింది.

అన్నయ్య ఎముకల గూడులా ఉన్నాడు. కదుత్తే గలగల మంటున్నాయి. ఆ స్థితిలోనే మా ఇంట్లో సమావేశం జరిగింది. యుద్ధం నుంచి కోటగడ్డ పోరాటం దాకా చర్చ జరిగింది. అప్పుడు స్వార్థపరత్వం లేదు. గ్రూపులు లేవు. లక్ష్యం ఒక్కటి. ఒకే తాటిమీద నడక. గ్రంథాలయం స్థాపించాలి. పేరు ఆంధ్ర గ్రంథాలయం. ముక్తకంఠ నిర్ణయం.

తెల్లవారి బయలుదేరాం అందరం. చేతకాకున్నా అన్నయ్యా వచ్చాడు. అన్నయ్యా, నేను, వేంకటేశ్వరరావు, కృష్ణమూర్తి, నాగేశ్వరరావు, చందా వీరభద్రం మరికొందరం బృందంగా బయలుదేరాం. వర్తకుల ఇళ్లకు, రైతుల ఇళ్లకు వెళ్లాం. అది అక్షరానికి అందని అనుభూతి! అందరికీ అందని అనుభూతి!! ఎన్నటికీ చెరగని అనుభూతి!!!

ప్రతి ఇంటివారు ఆత్మీయంగా ఆహ్వానించారు. సన్నిహిత బంధువుల వలె పలకరించారు. అభిమానంతో ఇంటి వారందరూ ఉరుకులు పరుగులు పెట్టారు. ఒకరింట్లో చాయ్‌లు - ఒక ఇంట్లో మజ్జిగ - ఒక ఇంట్లో మిఠాయిలు! ఏదో పండుగ జరుగుతున్నట్లే! ఎవరూ లేదనలేదు. అందరూ అడిగినంత ఇచ్చారు.

**ఆనాటి మా సంబరం - సంతోషం - ఆనందానికి అవధుల్లేవు. ఎందుకు? ప్రజాకార్యం సాధించామని! తనకోసంకంటే పదిమందికోసం పాటుపడడంలో ఆనందం ఉంది. ఆనందమే బ్రహ్మము.**

పనులన్నీ చకచకా జరిగిపోయాయి. ఒక్కడు కాదుగదా - అందరూ చేశారు. పెద్ద బజారులో ఇల్లు అద్దెకు తీసుకున్నాం. బెజవాడనుంచి పుస్తకాలు తెచ్చాం. పత్రికలకు చందాలు కట్టాం. ప్రారంభ ఉత్సవానికి ఏర్పాట్లు పూర్తి అయినాయి. సభాస్థలం - తేదీ నిర్ణయం అయింది.

తిర్పన్ కింద అనుమతి అధికారులు కొంత పేచీ పెట్టారు. జాగీరు అధికారులు

మానుకోటకు  పొమ్మన్నారు. అప్పుడు గార్ల మానుకోట తాలూకాలో ఉండేది. వాళ్లు వరంగల్లు పొమ్మన్నారు. ప్రజాయుద్ధం రోజులు. అనుమతించక తప్పలేదు.

వేదిక రంగురంగుల కాగితాలతో అలంకరించాం. తోరణాలు కట్టాం. మైకులు పాటలు లేవు. జనం  పొరుగూళ్లనుంచి కూడా పెళ్ళికి తరలినట్లు వచ్చారు. సభకు కొమరగిరి నారాయణరావుగారు – సర్వదేవభట్ల రామనాథంగారు వచ్చినట్లు గుర్తు.

"నల్లగొండలో నాజీశక్తులు
నగ్ననృత్యమింకెన్నాళ్లు?
పోలీసు అండను దౌర్జన్యాలు
పోషణ బొందే దెన్నాళ్ళు?
హింసపాపమని యెంచు దేశమున
హిట్లరత్వమింకెన్నాళ్లు?
పగటి దోపిడులు నాపగలేనీ
ప్రభుత్వముండేదెన్నాళ్ళు?"  అనే కాళోజీ గేయాన్ని మా విద్యార్థులు చదివారు.

ఉపన్యాసకులందరూ చంద్రనిప్పులు చల్లారు. పెట్రోమాక్సుల వెలుగులో కష్టజీవి బుర్రకథ. జనం  సర్వం మరిచారు. ఊగిపోయారు. అర్ధరాత్రికి సభ ముగిసింది. జనం – అప్పుడే అయిపోయిందా? అని ఆశ్చర్యపడ్డారు. ఉద్యమాన్ని ఉరికించాలని ఉవ్విళ్లూరుతూ ఇళ్లకు చేరుకున్నారు.

గార్లలో ఆంధ్రగ్రంథాలయం వెలిసింది. రజాకార్ల రోజులదాకా నేనే గ్రంథాలయాన్ని నిర్వహించాను.

## నల్లబజారు తెలుపు:

ఒకనాడు బడిలో ఉన్నాను. పిల్లలకు పాఠాలు చెపుతున్నాను. ఒక ముసలమ్మ వచ్చింది. చేతిలో సీసా ఉంది. ఏడుస్తున్నది. "గ్యాసునూనే పోస్తలేదు. తిడుతున్నాడు. ఎల్లగొడ్తున్నాడు" అని  ఏడ్చింది.

నాకు ఆవేశం ఎక్కువ.  బడి పిల్లలను వెంటపెట్టుకున్నాను.  ఉరికాను. దుకాణంలో దూకాను.  నేను నిప్పులు కక్కుతున్నాను. దక్షుని మీదకు ఉరికిన వీరభద్రునిలా ఉన్నాను. దుకాణం వాడు  జంకాడు. "కిర్సనాయిలు పోయి" – అదేదో ఆవేశం! గర్జన!! మనకేదో అధికారం ఉన్నట్లు!!

దుకాణందారు పలుకలేదు. కిర్సనాయిలు డబ్బా బయటపెట్టాడు. ముసలమ్మకు సీసానింపి  ఇచ్చాడు. ఆమె నన్ను మనసార దీవించింది. వార్త పాకింది. జనం గుంపులు కూడారు.  కొట్టుకుంటున్నారు.  బడిపిల్లలు వారిని వరుసలో నుంచో పెట్టారు. డబ్బా తరువాత డబ్బా! అందరికీ అందేదాకా అక్కడే నుంచున్నాను. అప్పుడు అక్కణ్ణుంచి కదిలాను.

అవి యుద్ధం రోజులు. కిర్సనాయిలు – చెక్కెర వంటివి దొరకడం దుర్లభంగా ఉండేది. ప్రభుత్వం  కంట్రోలు ధరకు కొంత సరఫరా చేసేది. కాని, సరియైన పంపిణీ విధానం లేదు. అందువల్ల వర్తకులు  సరుకులను దాచిపెట్టేవారు. నల్లబజారులో

అమ్ముకునేవారు. నల్లబజారును అరికట్టి, ప్రజలకు నిత్యావసరాలు అందేటట్లు చూడడం కమ్యూనిస్టుపార్టీ – ఆంధ్రమహాసభల కార్యక్రమాలలో ప్రధాన అంశం. అది ప్రజలలోకి పార్టీని తీసికెళ్లింది. ప్రజలు పార్టీని తమదిగా భావించారు. తెలంగాణంలో అంతకు ముందు రాజకీయ పార్టీయే లేదు. ప్రవేశించడమే ఉప్పెనలా ప్రవేశించారు కమ్యూనిస్టులు. ప్రజలలోనికి చొచ్చుకుని పని చేశారు. ప్రజలు అరుణ పతాకచ్ఛాయన ప్రాణాలు అర్పించడానికి సిద్ధం అయినారు.

అది తెలంగాణాకు చైతన్యయుగం! వెలుగులు చిమ్మిన కాలం!! అలుగులు పారిన కాలం!!! అప్పుడు హైదరాబాదు నగరం నుంచి మూడు తెలుగు దిన పత్రికలు వెలువడినాయి. ద్వైవార పత్రికగా ఉండిన 'గోలకొండ' దినపత్రిక అయింది. సురవరం వారు సంపాదకులు. ఈనాటి వలె పత్రికలు వ్యాపారం కాదు. పత్రికా నిర్వహణ కత్తిమీద సాము. పత్రికలు ఆర్థికంగా బలహీనములు.

గోలకొండ దిన పత్రికను గురించి ఒక చాటువు ఉన్నది. ఆర్థిక స్తోమత లేక రోజూ పత్రిక వెలువడడం దుస్థరం అయ్యేది. ఒకే సంచికను రేపటి పత్రిక అని – ఇవ్వాల్టి పత్రిక అనీ – నిన్నటి పత్రిక అని అమ్మేవారు. పత్రికను బతికించడానికి జనం ఒకే సంచికను మూడురోజులు కొన్నారు!

గోలకొండ ద్వైవారమే! పేరు దినపత్రిక!! అని చెప్పుకునేవాళ్లు!!

రెండవది తెలంగాణా పత్రిక. బుక్కపట్నం రామానుజాచార్యులవారు సంపాదకులు. కొద్దికాలం నడిచింది. బుక్కపట్నం వారు పరమపదించే నాటికి పెళ్లాం పిల్లలకు మట్టి మాత్రం మిగిలింది. వారి పుత్రుడు శేషాద్రి – ఏడవ దశకంలో – మున్సిపల్ కార్పొరేషనులో – నాకింద క్లర్కుగా పనిచేశాడు. చిన్నవయసులోనే పేదరికానికి బలి అయినాడు.

మూడోది హూజూరు. సింధు రాష్ట్రంనుంచి వచ్చిన ఒక ముస్లిం – వ్యాపార దృష్టితో ఇది ప్రారంభించాడు. మీజాన్ అనే పేరుతో ఉర్దూ – తెలుగు– ఇంగ్లీషులో దిన పత్రికలు వచ్చేవి.

మీజాన్ అంటే త్రాసు –తరాజు – న్యాయచిహ్నం.

తెలుగు మీజాన్‌కు అడివి బాపిరాజుగారు సంపాదకులు. తిరుమల రామచంద్ర – రాంభట్ల కృష్ణమూర్తి – కామరాజు వంటి హేమాహేమీలు మీజాన్‌లో పనిచేశారు.

1971లో నా నవల "మోదుగుపూలు"కు సువాసన కూర్చే తొలిపలుకులో తిరుమల రామచంద్రగారు ఆనాటి జ్ఞాపకాలు అక్షర బద్ధం చేశారు:

"ప్రాక్ స్వాతంత్ర్యకాలంలో శ్రీ అడివి బాపిరాజుగారి సంపాదకత్వాన హైదరాబాద్ నగరంనుంచి వెలువడుతున్న 'మీజాన్' పత్రికలో పనిచేసే భాగ్యం కలిగినప్పుడు....బాధిత, తాడిత, సంతప్త, సంభ్రాంత ప్రజలు తండోపతండాలుగా 'మీజాన్' కార్యాలయానికి వచ్చి తమగోడు చెప్పుకొనేవారు - అమీన్ నా కొడుకును చావబాదిండు. గిర్దావరు మా పోరిపై జులుం చేసిండు. తాసిల్దార్ మా కొంపకు చిచ్చుపెట్టిండు - అని. ఈ పైశాచిక కృత్యాలు విని సహృదయులయిన బాపిరాజుగారిగుండె మండిపోయేది. యువకులయిన మా

**రక్తం ఉడుకెత్తేది. ఆ మంటను, ఆ ఉడుకును మీజాన్ పత్రికలో ప్రతిబింబించడానికి మా పరిమితులలో మేము ప్రయత్నించాము."**

1971లో తిరుమల రామచంద్రగారితోబాటు – నా 'చిల్లరదేవుళ్లు' నవలకు – ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు అందుకునే అదృష్టం నాకు కలిగింది.

అడివి బాపిరాజుగారు తమ నవలలు 'తుఫాను', – "హిమబిందు" "గోన గన్నారెడ్డి" మున్నగునవి మీజాన్‌లో సీరియల్‌గా ప్రచురించారు. బాపిరాజుగారు ఎప్పటికప్పుడు వ్రాసి అచ్చుకు ఇచ్చేవారు. గత సంచిక చూచేవారు కారు. ఒకసారి క్రితంసంచిక పాత్రపేరు ఈ సంచికలో మారింది. ఇది రాజుగారి దృష్టికి తేవడం జరిగింది. వారు ప్రతిభావంతులు. తరువాతి సంచికలో పాత్రపేరు మార్పును గురించి ఒక కథ అల్లారు!

**కొందరు ఏకీభవించక పోయినా మీజాన్ తెలంగాణా ప్రజాపోరాటానికి సాయపడిందనే నా సంపూర్ణ విశ్వాసం. ఖమ్మంలో జరిగిన 12 వ ఆంధ్రమహా సందర్భంగా మీజాన్ వెలువరించిన ప్రత్యేక - విశేష - సంచిక ఎంతో విలువయింది.**

బ్లాక్‌మార్కెటును ఎదుర్కొనే ఉద్యమంలో భాగంగా నేను మీజాన్‌కు ఒక లేఖ వ్రాశాను. దానిశీర్షిక 'గార్లలో చెక్కెర కరువు.' నల్లబజారును గురించి – పంచదార భాగోతాన్ని గురించి వివరంగా వ్రాశాను.

నా లేఖ మీజాన్‌లో పడింది. అది నా తొలిరచన. ఇలాంటి వార్త రావడం – అదీ గార్లను గురించి కావడం . ఆ ప్రాంతం సాంతంలో సంచలనం కలిగించింది. జనం పత్రిక కోసం ఎగబడ్డారు. ప్రతులు వ్రాసుకున్నారు. గ్రామ గ్రామాన చదువుకున్నారు.

తమను అద్దంలో చూచుకున్నట్లు తమ వార్తను చూచి మురిసిపోయారు! అంతకు ముందు అలాంటి వార్త రాలేదు. అదే మొదలు. ఎందరో నన్ను అభినందించారు. నా మీద ఏం జరుగుతుందో అని భయపడ్డారు. నేను భయపడలేదు. నాకు ప్రజాబలమే కవచనం.

ఆ వార్త ప్రభుత్వాన్ని కదిలించింది. తాసిల్దారు నన్ను పిలిచాడు. కూర్చుండబెట్టాడు. అతనిముందు అంతా మంచోవాల్సిందే. నాకు నీతులు బోధించాడు.

"బేటా! బద్‌హోనా బద్నాం నహీఁ హోనా – చెడుకావచ్చు, చెడుపేరు తెచ్చుకోవద్దు" అని షికాయతులుంటే తన దగ్గరకి రమ్మన్నాడు. పత్రికలకు మాత్రం వ్రాయవద్దన్నాడు.

ప్రభుత్వం పంచదార డీలరును మార్చింది. పంచదార పంచేందుకు ఒక పద్ధతిని ఏర్పరచింది.

**ఆరోజుల్లో పత్రికలకు అంతటి విలువ ఉండేది. ఒక్క వార్త – వార్తకూడా కాదు లేఖ –అంత సంచలనం కలిగించింది. పత్రికలకు ప్రజాసేవా భావం ఉండేది. అవి ఆర్థిక లాభాలకోసం అవతరించలేదు. లాభాల లోకంలో అవి అంతరించాయి!**

ఇవి ఉదాహరణలు మాత్రమే. సంఘటనలు అన్నీ వ్రాయడం అసాధ్యం.

వర్తకులకు వ్యతిరేకమే చేశాను. కాని, వర్తకులకు నా విషయంలో అభిమానం తగ్గకపోవడం విశేషం! అది వారిలోని గొప్పదనం.!!

**చెక్కెర కోటా కోల్పోయిన వర్తకుడు నన్ను మచ్చిక చేశాడు. నాతో పాన్ దుకాణం పెట్టించాడు. నేను కిళ్లీలు కట్టాను. ఆకులు అమ్మాను. సిగరెట్లు అమ్మాను. అరటిపళ్లు అమ్మాను. అది కొంతకాలం తరువాత వదిలాను. అప్పుడు కూడా ప్రజలు నన్ను చిన్నచూపు చూడలేదు.**

సారాయి దుకాణంలో భువనగిరినుంచి వచ్చిన కేశవులు ఉండేవాడు. అతను కమ్యూనిస్టు ఆంధ్రమహాసభ కార్యకర్త. అతనితో సారాదుకాణంలో గంటలు గడిపేవాణ్ణి. మిత్రులందరూ – జనం ఏమనుకుంటారో – వెళ్లవద్దు అనేవారు. నేను మానలేదు. జనం ఏమీ అనుకోలేదు!

మాన్‌సింగ్ అని పాన్ దుకాణం అతను ఉండేవాడు. అతనికి నేనంటే అపరిమితం అయిన అభిమానం. నేను రోజు సాయంత్రం అతని దుకాణానికి వెళ్లాలి. నాకోసం ఉదయంనుంచీ నీళ్లలో ఉంచిన సోడా కొట్టి ఇచ్చేవాడు. ఈనెలు తీసిన తమలపాకుతో పాన్ కట్టి అదీ, ఒక సిజర్ సిగరెట్టు ఇచ్చేవాడు. ఎన్నడయినా పొరపాటున వెళ్లకుంటే మాన్‌సింగ్ దుకాణం వదిలి వెతుక్కుంటూ వచ్చేవాడు. మాన్‌సింగ్ అలా వచ్చినపుడు నా హృదయం ద్రవించేది! కళ్లు చెమర్చేవి! ఇది ఎక్కడి బంధం! ఈ రుణం ఎలా తీరేను?

పోలీసుచర్య జరిగింది. గార్ల తిరిగి వచ్చాం. మాన్‌సింగ్ కనిపించలేదు. అతని దుకాణపు స్థలానికి చేరుకోగానే కాళ్లు నిలిచిపోయేవి! మాన్‌సింగ్ లేడని నమ్మడానికి మనసుకు కొంత సమయం పట్టింది.

**ఆనాటి గార్ల ప్రజల ఆత్మీయత - అనురాగం - అభిమానం - ప్రేమ -వాత్సల్యం తీర్చడం అసాధ్యం. మరవడమూ అసాధ్యమే!**

## వయోజన విద్య:

నేనూ నాగేశ్వరరావు వయోజనులకు రాత్రి పాఠశాలలు నడిపాం. జీయాజిగూడెం హరిజనవాడలో నాగేశ్వరరావు, పుట్టకోటలో నేనూ నిర్వహించాం. పలకలు – పుస్తకాలు – లాంతర్లు మేమే ఇచ్చాం. హరిసర్వోత్తమరావుగారి వాచకం చెప్పినట్లు గుర్తు. అక్షరమాలిక చెప్పకుండా పదాలతో చదువు చెప్పాం. కొద్ది రోజుల్లో చదవడం – మరికొద్దిరోజుల్లో వ్రాయడం నేర్పాం. వారు తొలిసారి పత్రిక చదివినప్పుడు వారికి కలిగిన ఆత్మవిశ్వాసం – వాళ్లకళ్లలోని వెలుగు చూడడం అద్భుత అనుభవం.

విశేషం ఏమంటే – తాసిల్దారు అనుచర వర్గంలోని మస్తాన్ – సిగ్గుపడుతూ – నా దగ్గరికి చదువుకోవడానికి వచ్చాడు. అతనికి ఉర్దూ నేర్పాను. అతడు నన్ను 'మౌల్వీ'గా అభిమానించాడు.

## పూలదండల పెళ్లిళ్లు:

బ్రిటిషాంధ్రంనుంచి వచ్చి స్థిరపడినవారిలో ఎక్కువమంది కమ్మవారు. త్రిపురనేని రామస్వామి చౌదరి అభిమానులు. వారు కమ్మబ్రాహ్మణున్ని తెచ్చుకున్నారు. అతను వారికి పౌరోహిత్యం నిర్వహించేవాడు.

ఆనాడు నామీద ప్రభావం వేసిన పుస్తకాల్లో రజనీ పామీదత్ 'ఇండియా టుడే' ఒకటి. భారతజాతి దరిద్రానికి ప్రధాన కారణం పెళ్లిళ్లకు, చావులకు పెట్టే కర్చేనని తేల్చి చెప్పాడు. పురోహితుని కులం మారడం చాలదు. ఆడంబరాలు పోవాలి, మంత్రాలు లేని నిరాడంబర వివాహం జరగాలని నచ్చచెప్పాను. కొన్ని గ్రామాలలో పది దాకా పూలదండల పెళ్లిళ్లు జరిపించాను. వారి పేర్లు గుర్తులేవు. వారు కూడా ఇప్పటికి తాతలు అయ్యుంటారు!

## అందాల అడవి:

సన్నిధానం సుబ్రహ్మణ్యం మా ఇంట్లో ఉండి చదువుకునేవాడు. వాళ్లది భద్రాచలం దగ్గర – గోదావరికి ఆవలి వడ్డు గ్రామం. ఎందుకో ఇంటికి వెళ్లాడు. చాలరోజులవరకు రాలేదు. వాళ్ల తండ్రి – పేరు గుర్తులేదు – ఉత్తరం వ్రాశారు. వారికి జబ్బుగా ఉందట – నన్ను వచ్చి సుబ్రహ్మణ్యాన్ని తీసికెళ్లమని. అంత దూరం వెళ్లడం ఏమిటి అనుకోలేదు. సుబ్రహ్మణ్యానికి చదువు రావాలి. అది ఆతురత. అమ్మ వద్దన్నది. అయినా బయలుదేరాను.

భద్రాచలం ప్రమాదకరం అని అమ్మ నమ్మకం. నాయన పుట్టినప్పణ్ణుంచీ – 1898 నుంచీ –మా వాళ్లు ఎవరూ భద్రాచలం తొక్కలేదు. నాకు భయం తక్కువ. సాహసం ఎక్కువ. బయలుదేరాను.

డోర్నకల్లునుంచి రైల్వేలైను కొత్తగూడెం కోసం వేసింది కాదు. భద్రాచలం కోసం వేసింది. కొత్తగూడెం రైల్వేస్టేషను పేరు భద్రాచలం రోడ్డు. నేను రైలు దిగేవరకు చీకటి పడుతున్నది. అప్పుడే కొత్తగూడెం ఏర్పడుతున్నది. అన్నీ పూరిండ్లు.

స్టేషను పక్కనే 'అన్నపూర్ణమ్మగారి' సత్రం ఉంది. అదీ పూరిల్లే. ఆమె భద్రాచలం యాత్రికులకు నిరతాన్నదానం చేస్తుంది. నాకు భోజనం పడదు. ఆ రాత్రి ఆ సత్రంలో పడుకున్నాను. ఉదయం సీకుల బస్సు ఎక్కాను. యుద్ధం రోజులు. పెట్రోలు లేదు. బస్సులు బొగ్గుతో నడుస్తున్నాయి.

కొత్తగూడెం నుంచి భద్రాచలం వరకూ చక్కని – పచ్చని అడవి. దుమ్ముురోడ్డుమీద బస్సు. అడవి జంతువులను బెదిరించడానికి నిరంతరం హార్ను మ్రోగుతున్నది. అయినా జింకలు – దుప్పులు – మనుబోతులు – నక్కలు – కుందేళ్లు రోడ్డుదాటి పరిగెత్తుతున్నాయి. పెద్దపులులు – చిరుతపులులూ – ఎలుగ్గొడ్లు ఉన్నాయట. బయటపడుతుంటాయట. మా బస్సుకు ఎదురుపడలేదు. సుమారు పదింటికి గొమ్ముూరు చేరుకున్నాను.

గోదావరి పరవళ్లు తొక్కుతున్నది. ఎర్రని జలరాశి త్రుళ్లిత్రుళ్లి పడుతున్నది. సుళ్లు తిరుగుతున్నది. అంతటి నదిని నేను అప్పటికి చూడలేదు. ఎంత అందం! ఎంతటి ఆనందం!! అందం నిండుదనంలో ఉంది! అందం సమృద్ధిలో ఉంది!! పడవ వచ్చింది. పదిమంది పడవను ఒడ్డుకు లాగడం – కట్టడం – ప్రయాణీకులను ఎక్కించడం – వాళ్ల అరుపులు – కేకలు – మాటలు – అంతా నాకొక వింత. పడవ ఎక్కాను. భద్రాద్రి చేరాను. లాంచీ నాలుగింటికిగాను లేదన్నారు.

భద్రాచలం మా తాతగారి ఊరు. మా నాయన పుట్టిన ఊరు. మా ఇంటిపేరే దాశరథి. రాముడు ఉన్నాడు అక్కడ. ఎక్కడికీ వెళ్లలేదు. కాస్త కాఫీ తాగి

వచ్చాను. గోదావరి ఒడ్డునే కూర్చున్నాను. గోదావరిలో ఏదో ఆకర్షణ ఉంది - అనుబంధం ఉంది. అది వదలదు. పడవలు రావడం, సరుకులు దించడం, ఎక్కించడం. శ్రామికుల సమష్టి కృషి. వారి మాటలు - నవ్వులాటలు - హాస్యాలు పరాచికాలు - కాలం ఇట్టే గడిచిపోయింది.

పొగలు చిమ్ముతూ లాంచి వచ్చింది. పెనుధ్వనిచేస్తూ ఆగింది. 'లాంచి - రాజమండ్రి లాంచి' - ప్రయాణీకులను పిలుస్తున్నారు. ఎక్కాను. కూర్చున్నాను. లాంచి రొదపెడ్తూ సాగింది. జోరున వాన మొదలయింది. కుండపోత! గోదావరి పెరుగుతున్నది.

జోరున వాన.
వరదలో నావ.
ఒడ్డున చిక్కని - పచ్చని అరణ్యం!
చెట్లమీద ముడుచుకున్న పక్షులు!!
ఏం పయనం! ఎలాంటి పయనం!! ఎంతటి సంబరం! ఎంతటి ఆనందం!!
ఆనందం అంబరం అవుతున్నది!
వాన నీళ్లలో పడే చప్పుడు!
నీటిని చీల్చుకుని నావ పయనం!!

"గోదావరి పొంగుతూంది. లాంచి మాధారంలో ఆగదు. అమరారంలో దిగాలి" అన్నారు. దిగక తప్పలేదు. చిమ్మన చీకటి! పెనువాన! దారి తెలియదు. ఎక్కడికి పోవాలి? ఏమీ అర్థంకాదు. వణుకుతున్నాను. అమరారంలో సుబ్రహ్మణ్యం బంధువులు ఉన్నారు. అది విన్నాను. అడిగాను. వారింటికి చేరాను. ఇద్దరు పూర్వ సువాసినులు. అత్తా - కోడండ్లు. కోడలు పరువంలో ఉంది. ఉరుకులు పెట్టాల్సింది. నిలిచి ఉంది. పరవళ్ల గోదావరి నిలిచినట్లుంది.

వారు సాదరంగా ఆహ్వానించారు. పొడి బట్టలు ఇచ్చారు. తడికట్టెలు - పొగ - ఇంట్లో వంట చేశారు. పీట వేశారు. విస్తట్లో అన్నం ఆవకాయ వడ్డించారు. కమ్మని నేయి వేశారు. చారు. ఎర్రగా కాగిన పాలు. వీటినిమించి ఇద్దరూ ఎదురుగా కూర్చున్నారు. ముచ్చట పెట్టారు. నేను తెలుసును అన్నారు. సుబ్రహ్మణ్యం చెప్పాడు అన్నారు. మెచ్చుకున్నట్లు మాట్లాడారు.

పొగ చిమ్మే దీపం! మనకవెలుగు!! అందులోనూ ఆమె పరువం!!! కటిక చీకట్లో వెలిగిన వెన్నెల్లా ఉంది.

అది పూరిల్లు. వెదురు తడకలకు మట్టి పూసిన గోడలు. నులక మంచం మీద పడుకున్నాను. బయట వాన. ఇల్లు కురుస్తున్నది. ఒక్కొక్క చినుకు నేలకు చిల్లులు చేస్తున్నది.

నిలిచిన ఉరుకుల గోదారి.
కటిక చీకట్లో వెలుగు వెన్నెల.

ఆ రాత్రి నిదురలేదు. అయినా తెల్లారింది. వాన వెలిసింది. మబ్బులు - విరహపు ప్రియుని కోసంలా ఉరుకుతున్నాయి. పక్షులు తడి రెక్కలతో ఎగిరిపోతున్నాయి. అల్లరిమానిన అమ్మాయిలా అంతా శాంతించింది. సూర్యుడు ఉదయించాడు. వెలుగులు పరుస్తున్నాడు.

నాకు వేడి వేడి బెల్లపు చాయ్ ఇచ్చారు. చాల రుచిగా ఉంది. పీట మీద కూర్చున్నాను. చప్పరిస్తున్నాను. అత్త మాట్లాడుతున్నది. కోడలు పెదవులు కదలవు. ఆమె చూపులు పలకరిస్తున్నాయి.

"చిన్నవాడివి. బాటసాంతం అడివి. ఎలా చేర్తావో? మా పాలేరు గండి దాటిస్తాడు" – అత్తగారు అన్నది. నేను బయలుదేరాను. వెంట పాలేరున్నాడు. అతని చేతిలో బల్లెం ఉంది. ఇద్దరూ నన్ను సాగనంపడానికి వాకిట్లోకి వచ్చారు.

"మళ్లీ వస్తారా?" కోడలు అడిగింది.

"తిరిగి వెళ్లేప్పుడు" అన్నాను – సాగిపోతున్నాడు.

నేను వెనుకకు చూడడం సభ్యత కాదు. ఆమె ఇంకా చూస్తున్నది. అది మనసు చెపుతున్నది.

"గండంటే – దట్టపు అడివి – పులులు, చిరుతలు ఉంటాయి." కోయపాలేరు చెపుతున్నాడు. నేను తేరుకుని చూచాను. ఎండదూరని అడివి. బాట కనపడదు చేసుకోవాలి. కోయదొర బల్లెంతో బాట చేస్తున్నాడు.

"అగ్రతస్తే గమిష్యామి మృద్నన్ పాషాణ కంటకాన్" – "నీముందు నడుస్తాను. రాళ్లూ ముళ్లు తీస్తాను. బాట చేస్తాను" అంటాడు లక్ష్మణుడు రామునితో. ఆ అవసరం తెలిసింది.

ఎక్కడో పులి వాసన – దూరాన చిరుత జాడ. అన్నీ కనిపెడ్తున్నాడు దొర. ముందునుంచే జరజర పాము. ఆపుతున్నాడు దొర. జింకలు చాటుకు నక్కుతున్నాయి. కుందేళ్లు ఉరుకుతున్నాయి. గువ్వలు డప్పులు కొడుతున్నాయి. చిలుకలు పలుకుతున్నాయి. గుంపులు గొరవంకలు.

అడవి భయం. నిజమే. మనసును మరిపించే అందం! మనం ఎంత పోగొట్టుకున్నామో!

గండి దాటిందన్నాడు దొర. మారు మాట్లాడలేదు. నా మాట ఆలకించలేదు. దొర బల్లెంతో వెనుతిరిగాడు. అడవిలో కలిసిపోయాడు.

చిక్కటి అడవి అయిపోయింది. అడవి ఇంకా ఉంది. అది పల్చగా ఉంది. వెలుగు పడుతున్నది. తోడులేక నడవడం గగనమే! బుగులుగా ఉంది. భయంగా ఉంది. గుండె దడదడ లాడుతున్నది. వెనక్కుపోలేను. ముందుకే సాగాలి. మనిషి కనిపించడు. ఊరిజాడ లేదు. సాగుతున్నాను. బాగా నడిచినట్లున్నాను. ఆకలి – అడవిలో ఏం దొరుకుతుంది అనుకుంటాం. అసలు అడవిలో దొరకంది ఏమిటి? మన జ్ఞాన-విజ్ఞానాలు సహితం అడవినుంచే వికసించాయి.

బాటలో – ఈ అడవిలో కాలిబాట ఉంది. పిల్ల కాలువ కనిపించింది. విశ్వనాథ కిన్నెరసానిలా ఉరుకుతున్నది. దాని వద్దున నేరేళ్లు – నేరేడు చెట్లు. ఆ చెట్ల కింద నేరెడు పళ్లు. నల్లగా – నీగ్రోయువతి బుగ్గలా – రాలి ఉన్నాయి. పచ్చిక మీద కూర్చున్నాను. నేరేడు పళ్లు ఫలహారం చేశాను. దోసిలితో పిల్లకాలువ నీళ్లు తాగాను. కడుపు నిండింది.

మళ్లీ కాలిబాటమీద సాగాను. పచ్చని చెట్లు – చిలకల పలుకులు – గలగల నీటి సవ్వడి – పరిగెత్తే లేళ్లు – సాగుతున్నాను. బాట చీలింది. ఎటు పోవాలో

తెలియదు. మనిషి అలికిడి లేదు. దుఃఖం పొంగి వచ్చింది. ఏడ్చాను. ఎందుకు వచ్చినట్లు? ఏమి సాధించనున్నట్లు?

దేవుని వలె ప్రత్యక్షం అయింది ఒక కోయల జంట. బుడుతణ్ణి బుజాన వేసుకుని దొర నడుస్తున్నాడు. దొరసాని వెనుక వస్తున్నది. వారిని చూచాను. ప్రాణం లేచి వచ్చింది. బాట అడిగాను. వారు చెప్పారు. నేను సాగాను.

కొంతదూరం వెళ్లాను. గోదారి కనిపించింది. దాని వడ్డునే బాట. చెట్టూ చేమా ఉన్నాయి. అడవి పల్చబడింది. కొంగల బారులు కనిపిస్తున్నాయి.

మాధారం వచ్చింది. ఉత్సాహం కలిగింది. అది ఊరు కాదు. గూడెం. కొన్నే పర్ణశాలలున్నాయి. ఇల్లు దొరికింది. పెద్ద మనిషి మంచంలో ఉన్నాడు. నా బాధలు విన్నాడు. విల విలలాడారు. రమ్మనటం తప్పయింది అన్నారు. అదేం కాదన్నాను. ఒక్కనికి చదువుచెపితే ఎంతో ఆనందం అన్నాను.

సుబ్రహ్మణ్యం ఏర్పాట్లు చేశాడు. వేణ్ణీళ్ల స్నానం చేశాను. వేడి అన్నం తిన్నాను. కాళ్లు సలుపుతున్నాయి. పడుకున్నాను. నిద్రపోయాను. సాయంత్రం లేచాను. మళ్లీ జల్లు. కుండెడు వాంతి చేసుకున్నాను. పులసరం వాసన. ఇంటి వాళ్ల బెదిరిపోయారు. సుబ్రహ్మణ్యానికి తెలుసు. ఇది మామూలే!

తెల్లవారి ప్రయాణం. మూటా ముల్లే సర్దుకున్నాం. గోదావరి వడ్డుకు చేరాం. లాంచి పోతుంటుంది. బట్టలు పతాకాల వలె ఊపి – కేకలు పెట్టి పిలవాలి పిలిచాం. లాంచి ఒడ్డుకు రాలేదు. ఇంటికి చేరుకున్నాం. అలా వారం గడిచింది. అది అనుకున్నది కాదు. అమ్మ ఏడుస్తుంది. భద్రాద్రి భయం! మరో మార్గం లేదు పడవలో గోదావరి దాటాలి. గౌరిదేవి పేట చేరాలి. అక్కణ్ణుంచి భద్రాచలం నడవాలి.

అవతల వడ్డు అంగ్రేజు రాజ్యం. అడవి ఇంత లేదు. రోడ్డున్నది. సుబ్రహ్మణ్యం, నేను గౌరిదేవి పేటనుంచి రోడ్డున పడ్డాం. ఇద్దరం పిల్లలమే – రెండుమూడేండ్లు తేడా! మధ్యమధ్యన బెల్లపు చాయ్ తాగుకుంటూ భద్రాచలం చేరాం. కాళ్లు సలుపుతున్నాయి. పడవమీద గోదావరి దాటాం. బస్సెక్కి కొత్తగూడెంలో దిగాం ఆ రాత్రి అన్నపూర్ణమ్మగారి సత్రం. తెల్లవారి రైల్లో గార్లలో దిగాం.

స్టేషనులో మిత్రబృందం నిరీక్షిస్తున్నది. బతికి వచ్చినందుకు అభినందించారు. ఆలింగనం చేసుకున్నారు. స్టేషను మాస్టర్ డేవిడ్ కూడా సంతోషించాడు. మిత్ర బృందంతో వెళ్తుంటే వీధుల్లో అందరూ అడగడమే!

అందరూ నేను తిరిగి రానని నిశ్చయించుకున్నట్లున్నారు!

అమ్మా, చెల్లెళ్లు వాకిట్లో ఎదిరి చూస్తున్నారు. వార్త అందింది. అమ్మ దూరంగానే చూచింది. ఉరికి వచ్చింది. నన్ను ఆధారాన్ని వలె పట్టుకుంది. ఏడ్చింది. **కన్ను సుఖానికీ నీరు కారుస్తుంది. దుఃఖానికీ నీరు కారుస్తుంది. సుఖదుఃఖాలు ఒకలాంటివే అనే మహత్తర సత్యాన్ని వెల్లడిస్తాయి కన్నీళ్ళు.**

"నవ్వినా – ఏడ్చినా కన్నీళ్లే వస్తాయి" అన్నారు మిత్రులు ఆత్రేయ.

"నసుఖాల్లభతేసుఖం – సుఖం నుంచి సుఖం పుట్టదు" అంటాడు వాల్మీకి.

అందరం ఇంటికి చేరాం. అమ్మ ఇచ్చిన చాయ్ చప్పరిస్తూ ముచ్చట్లన్నీ చెప్పాను.

"చెప్పకపోతివి. మేము రాకపోయినాం?" అన్నారు అందరూ ఏదో ఆనందం జారిపోయినట్లు!

## పందొమ్మిది

### "అచ్చేద్యోఽయ మదాహ్యోఽయం":

1945 ఏప్రిల్ నెలలో 12 వ ఆంధ్రమహాసభలు ఖమ్మంమెట్టులో జరిగాయి. ఇవి ప్రజల ఉద్యమాల చరిత్రలో ప్రగతి బావుటాలు. ఇంతటి ఉత్సాహం – ఆవేశం ప్రజలలో కనిపించిన సభలు మళ్లీ జరుగలేదు. ఇంతటి ప్రజా సమీకరణ మళ్లీ జరిగిన జాడలు కనిపించవు. తమ విముక్తికోసం ప్రజలు స్వచ్ఛందగా – అంత పెద్ద సంఖ్యలో చేరి ఉండరు. ఈ సభలకు 30 వేల పైచిలుకు ప్రజానీకం హాజరయినట్లు అంచనా.

జనం కూడటం కాదు – వెల్లివిరిసిన ఉత్సాహం. అది ఎంత అని ఎలా చెప్పడం? గ్రామాలకు గ్రామాలు తరలి వచ్చాయి. కాలినడకన – బండ్లమీద జనం సాగారు. జాతరకు వలె సాగారు. ముసలీ – ముతక, చిన్నా – పెద్ద, ఆడా – మగ తరలారు. తరలడం ఊరికే కాదు. పదాలు పాడారు. నినాదాలు చేశారు.

జలప్రవాహంలా గర్జిస్తూ జనప్రవాహం సాగింది.

అంతప్రజ రిక్త హస్తాలతో తరలలేదు. కొందరు కూరల తట్టలు – కొందరు పచ్చళ్ల జాడీలు – కొందరు విస్తళ్లకట్టలతో బయలుదేరారు. మేమూ అట్లాగే బయలుదేరాం. మహానదిలో కలిసే ఉపనదుల్లా జనప్రవాహాలు మహాప్రవాహాల్లో కలిశాయి.

ఖమ్మం మెట్టులో జన ప్రవాహాలు జనసాగరం అయినాయి. ఖమ్మంలో నేల ఈనినట్లు ప్రజ. గాలి ఈనినట్లు అరుణ పతాకాలు.

ఖమ్మం ప్రజలతో నిండింది.

ఖమ్మం ఎర్రజండాలతో నిండింది.

సభాస్థలిలో వంటలు! అదొక కర్మాగారం. అందరూ స్వచ్ఛందం. వందలమంది కూరగాయలు తరిగారు. వందలమంది వంటలు చేశారు. వేలమంది వడ్డించారు. పదుల వేలమంది భుజించారు.

ఎవరిని చూచినా 'లాల్‌సలాం' – ఎవరిని చూచినా "ఇన్ఖిలాబ్ జిందాబాద్."

అదొక పబ్బం. అదొక పండుగ. అదొక ఉత్సవం. అదొక జాతర. అదొక తిరునాళ్లు.

అది ఉత్సాహ తరంగం. ఉద్వేగ తరంగం. ఉద్రేక తరంగం. అది క్రాంతి తరంగం. అది విప్లవ తరంగం.

ఎహ్ లహర్ హై ఇన్ఖిలాబ్‌కా – ఇదొక విప్లవతరంగం.

ఆ సాయంత్రం పన్నెండు జతల ఎడ్లు కట్టిన బండి బయలుదేరింది. బండి ముస్తాబయింది. పూల దండలతో ముస్తాబయింది. ఎర్రజండాలతో ముస్తాబయింది. బండి మీద అధ్యక్షులు రావి నారాయణరెడ్డిగారు. వారిసరసన బద్దం ఎల్లారెడ్డిగారు.

బండి పురవీధుల్లో సాగింది. ఉప్పెనలా జనం – ముందూ వెనుకా – బండి కదలడం కష్టం అవుతున్నది.

బండి, జనం పురవీధుల్లో ఊరేగి సభాస్థలం చేరుకున్నది. చీకటిపడింది. అయినా వెలుగు! వందల పెట్రోమాక్సులు – వేల కాగడాలు. వేదికమీద రావి నారాయణరెడ్డిగారు అధ్యక్షులు – బద్దం ఎల్లారెడ్డిగారు – సర్వదేవభట్ల రామనాథంగారు – చిర్రావూరి లక్ష్మీనరసయ్యగారు – రాజబహదూర్‌గౌడ్‌గారు – మఖ్దూం మొహియొద్దీన్ గారు.

పాటలతో కార్యక్రమం ప్రారంభం. దాశరథి పాటలు కూడా పాడాడు. అన్నయ్య ప్రత్యేకం రచించాడు వాటిని.

పాటల తరువాత ఉపన్యాసాలు. అందరూ యువకులు. విప్లవ పథంలో ఉన్నవారు. మాటలతో మంటలు లేపారు. చిచ్చు రగిల్చారు. సభలో చప్పట్లు.

ఆంధ్రమహాసభ జిందాబాద్.

రావి నారాయణరెడ్డి జిందాబాద్

బద్దం ఎల్లారెడ్డి జిందాబాద్.

విప్లవం వర్ధిల్లాలి!

నినాదాలతో దిక్కులు పిక్కటిల్లాయి.

**తరువాత నాజర్ బుర్రకథ. నాజర్ ఆరోజుల్లో మాకు దేవుడు! అతడు గజ్జ కడితే కళామతల్లి ప్రత్యక్షం కావలసిందే! అతడు అడుగు వేస్తే శివస్వామి కదిలినట్లే! అతను కథ చెపితే ప్రజావాహిని పొంగినట్లే!**

నాజర్ 'కష్టజీవి' బుర్రకథ చెప్పాడు. ప్రజ తమ కథ చెప్పినట్లే దుఃఖించారు. **ఆవేశపడినారు. సంతోషించారు. అది మహత్తమ కథనం! అది అనితరసాధ్యం.**

'కష్టజీవి' బుర్రకథవలె కదిలించిన బుర్రకథ మరొకటి ఉండదు.

'కష్టజీవి' కర్త సుంకర సత్యనారాయణగారు. ఏడవ దశకంలో సాహిత్య అకాడమీ వారు కర్నూలులో సభలు చేశారు. అవి కనుల పండువుగా జరిగాయి. అందులో ఇతరులతోపాటు నన్నూ సుంకరనూ సన్మానించారు.

సుంకరవారు వేదికనుంచి ఆ రోజు తమ జన్మదినం అని ప్రకటించారు.

అది విన్నాను. నాకు వేయబోయిన పూలదండను అందుకున్నాను. సుంకరవారి మెడలో వేశాను. ఆదరంగా ఆలింగనం చేశాను.

సభ ఉప్పొంగింది!

కరతాళ ధ్వనులు ప్రతిధ్వనించాయి!

అదొక మధురానుభూతి. ఒక మహా ప్రజా రచయితను ఆదరించిన తృప్తి.

ఆ తరువాత కొద్దిరోజుల్లోనే సుంకర సత్యనారాయణగారు పరమపదించారు.

"మా భూమి" అనే మహత్తరం అయిన నాటకం కూడా వారే రచించారు.

1947 చివర్లో గన్నవరంలో విడిసంలో "మా భూమి" నాటకం ప్రదర్శించారు. వేలమంది ప్రేక్షకులు. నేనూ వెళ్లాను. నాటకంలో ఒక సన్నివేశం ఏమంటే...

తెలంగాణంలో ఒక దొర - విసునూరు రామచంద్రారెడ్డి కావచ్చు. వాళ్ల గడీకి సర్కారీ అప్సర్లు వచ్చారు. వారికి చాయ్ అందించమంటాడు దొర. జీతగాడు పాలు లేవంటాడు. అపుడు దొర -

"అరె, పోయి ఊళ్ల బాలెంతల పాలు పిండుకరా పో" అంటాడు.

ఈ సన్నివేశాన్ని ప్రజానాట్య మండలివాళ్లు ఎంత గొప్పగా ప్రదర్శించారంటే ప్రేక్షకులు దొరను 'బాలింతల పాలు పిండమంటావుర' అని కర్రలతో స్టేజిమీదికి ఉరికారు!

అంతటి గొప్ప నాటకం అది. తెలంగాణ ప్రజా ఉద్యమానికి ఎంతగానో ఉపకరించిన నాటకం, వందల సార్లు ప్రదర్శింపబడిన నాటకం.

ఆ నాటక కర్త సుంకర సత్యనారాయణగారు.

ఖమ్మంమెట్టులో జరిగిన 12 వ ఆంధ్రమహాసభలో అనేక ప్రజా సమస్యలమై తీర్మానాలు చేశారు.

ప్రజలకు ఉపకరించే అనేక తీర్మానాలు చేశారు. వానిలో కొన్ని:-

1. ఆంధ్రమహాసభ - మహారాష్ట్ర పరిషత్తు - మజ్లిసులకు ప్రభుత్వంలో స్థానం కల్పించాలి. (స్టేట్ కాంగ్రెస్ మీద నిషేధం ఉంది. అందువల్ల దాన్ని ప్రస్తావించలేదు.)
2. 2. చిన్నరైతులను విధిగా సర్కారుకు చెల్లించాల్సిన లెవీ ధాన్యం చెల్లింపునుంచి మినహాయించాలి. జొన్నలు రైతుల దగ్గర పల్లా 18 రూపాయిలకు కొంటున్నారు. 25కు అమ్ముతున్నారు. అమ్మేధర తగ్గించాలి. కౌలుదార్లకు రక్షణ కల్పించాలి.
3. జనగాం ప్రజల వీరోచిత పోరాటం సందర్భంగా నిర్బంధించిన ఆరుట్ల రామ చంద్రారెడ్డి - గోపాలరెడ్డి - చింతల నర్సింహారెడ్డిని విడుదల చేయాలి. చట్టవ్యతిరేకంగా ప్రవర్తించి, దౌర్జన్యం జరిపే దొరలమీద కఠినచర్యలు తీసుకోవాలి.
4. సింగరేణి గని కార్మికులకు రోజుకు రూపాయి మాత్రం కూలి చెల్లిస్తున్నారు. వారికీ ఇతర కార్మికులకూ కరువుబత్తెం చెల్లించాలి.

1934లో ఖమ్మంలో జరిగిన మూడవ మహాసభలకు - 1945లో జరిగిన 12 వ ఆంధ్రమహాసభలకు హస్తిమశక వ్యత్యాసం కనిపిస్తుంది.

1. అప్పటి ప్రభుత్వపు, సనాతనుల బలం ఇప్పటికే తగ్గిపోయింది.
2. 11 వ సభకు 10 వేలమంది ప్రజలు వచ్చారు. ఈ సభకు 30 వేల పైగా జనం వచ్చారు.
3. ఆనాడు ప్రజాసమస్యలను అంటుకోలేదు. ఈ సభలో ప్రజా సమస్యలగురించి చర్చించడం - తీర్మానాలు చేయడం జరిగింది.

ఖమ్మంమెట్టు సభలను గురించి మాడపాటి హనుమంతరావుగారు తమ గ్రంథంలో తక్కువ చేసి వ్రాశారని రావి నారాయణరెడ్డిగారు అంటుండేవారు. అయితే, మాడపాటి వారు ఖమ్మం సభలను గురించి ఎలాంటి వ్యాఖ్యానం చేయలేదు.

ఖమ్మంమెట్టులో 12 వ ఆంధ్రమహాసభలు విజయ వంతంగా ముగిశాయి.

కందిగ్రామంలో 1946లో జాతీయువాదుల ఆంధ్రమహాసభ 12 వ సభలు జరిగాయి. జమలాపురం కేశవరావుగారు అధ్యక్షత వహించారు.

ఆ తరువాత ఆంధ్రమహాసభ రద్దయింది. మొదటిసభ కమ్యూనిస్టు పార్టీలోనూ – రెండవది కాంగ్రెస్‌లోనూ లీనం అయ్యాయి.

**1922లో అవతరించిన – నిజాం ఆంధ్రులకోసం ఏర్పడిన సంస్థ ఆంధ్రమహాసభ. అది సుమారు పావు శతాబ్దం నిజామాంధ్రులకు అన్ని రంగాల్లో సేవ చేసింది. తన పని ముంగిచుకొని అంతరించింది అనకూడదు అంతర్ధానం అయింది.**

ఆంధ్రమహాసభ కార్యకర్తలతో కలిసి వరంగల్లు జిల్లాలో పర్యటిస్తున్న రోజులు. ఊరూరికి వెళ్లడం, సభ పెట్టడం, ప్రజల్ను నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాటానికి సిద్ధం చేయడం మా పని.

ఒకరోజు వరంగల్లు జిల్లా, మానుకోట తాలూకా జయ్యవరం గ్రామానికి వెళ్లాం. సాయంకాలం చుట్టుప్రక్కల గ్రామాలనుంచి జనం తండోపతండాలుగా వచ్చారు. నిజాం ముర్దాబాద్. అనే నినాదాలతో సభ ప్రారంభించారు.

“అది సరియైన పనికాదు. మొదట జిందాబాద్ నినాదంతో ప్రారంభించండి” అన్నాను. “మహాత్మాగాంధీ జిందాబాద్.”

“పల్లెటూరి ప్రజలనంత, కొల్లగొట్టె నిజామోడా!

కింగుకోటీమీద రేపే, రంగుజండా యెగురు లేరా” అని పాట పాడింది ఒక బాలిక. కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి. “రజాకార్లను గ్రామంలో అడుగు పెట్టనివ్వం” అని శపథం చేశారు జనం. “కలిసికట్టుగా పనిచేస్తాం” అని వాగ్దానం చేశారు. “నిజాం తొత్తులైన జమీందార్లను ఎదిరిస్తాం” అని నినాదం చేశారు.

యాదవులు మాకు భోజనం పెట్టారు. రాత్రి పొద్దుపోయేదాకా పాటలు, పద్యాలు, బుర్రకథలు, ఆటలు. అక్కడికి నా జన్మ స్థలం గూడూరు రెండు మైళ్లే. అక్కడ మా తాతగారు, అమ్మమ్మ వుంటున్నారు. చూచి వెళ్లాలని, ఒక్కణ్ణే తెల్లవారి అక్కడికి చేరుకున్నాను. అప్పటికే మావూరి దొరవారికి (జమీందారుకి) మేం పక్క ఊళ్లో సభ పెట్టామనీ, నేను గూడూరు వస్తున్నాననీ వేగులవాళ్లతో వర్తమానం అందింది. మా తాతగారి ఇంట్లో నేను భోజనం చేస్తుండగా పోలీసులు తలుపు తట్టారు. “గిరఫ్తార్” (అరెస్టు) అన్నారు. “సరే, పదండి” అన్నాను.

మా అమ్మమ్మ గొల్లుమని ఏడ్చింది. మా తాతయ్య నిర్ఘాంతపోయాడు.

పోలీసు స్టేషనుకు తీసుకువెళ్లారు. అది చిన్న గ్రామం కావడం వల్ల అక్కడ అమీన్ (సబిన్‌స్పెక్టర్) లేడు. ఆ రాత్రి స్థానిక పోలీసుస్టేషన్‌లోనే కటకటాల వెనుక గడిపాను. తన గడీ (బంగళా)కి నన్ను తీసుకురమ్మని దొరవారు పోలీసులను కోరారు. నన్ను గడీలోనే చడీచప్పుడూ లేకుండా ఖతం చేయాలని అతని కుట్ర. పోలీసులు అందుకు అంగీకరించలేదు. తెల్లవారి అక్కడికి పది మైళ్లలో వున్న నెల్లికుదురు హెడ్‌పోలీసుస్టేషనుకు నన్ను నడిపిస్తూ తీసుకువెళ్లారు. చేతులకు బేడీలు, నడుముకు తాడు. తుపాకులతో ఇద్దరు పోలీసులు వెంటనడిచారు. నెల్లి కుదురు పోలీసు అమీన్ చాల క్రూరుడు. నా జేబులో ఎర్రసిరాతో వ్రాసి ఉన్న పద్యం లాక్కున్నాడు. “విప్లవగీతం వ్రాస్తున్నావా?” అని అడిగాడు.

"ఇది విప్లవగీతమే కాని, సర్ మహ్మద్ ఇక్బాల్ ఉర్దూ గీతానికి అనువాదం – నా స్వంతరచన కాదు" అన్నాను. ఒరిజనల్ చదవమన్నాడు. చదివాను. "ఇంత విప్లవం ఇక్బాల్ కవిత్వంలో ఉందా?" అన్నాడు. "ఉంది. అది 'బాల్–ఏ–జిబ్రాల్' అనే ఇక్బాల్ కావ్యంలోది" అన్నాను. చేతుల బేడీలు తొలగించమనీ, నడుము తాడు విప్పేయమని పోలీసులకు ఆజ్ఞాపించాడు. అంతవరకు బాగానే ఉంది.

"నన్ను త్వరగా వరంగల్లు సెంట్రల్ జైలుకు పంపండి" అని అడిగాను.

"జైలుకు నీ శవం పోతుంది. మొదట దేహశుద్ధి" అన్నాడు. హడలిపోయాను. చిత్రహింసలకు అతడు ప్రసిద్ధుడు. ఇంతలో దైవికంగా అతని కూతురు, అల్లుడు దిగారు. ఆ గొడవలో పడి నన్ను మరిచిపోయాడు. నన్ను కాపలా కాస్తున్న పోలీసులు అలసిపోయి ఉన్నారు. బావర్చీ (వంటవాణ్ణి)ని మచ్చిక చేసుకొన్నాను ఖానాకోసం. ఇదే సమయమని ఉడాయించాను. పొలాల్లో, నదుల్లో, అరణ్యాల్లో పరిగెత్తుతున్నాను."

(దాశరధి కృష్ణమాచార్య యాత్రాస్మృతినుండి)

అన్నయ్య దాశరధి అలా పోలీసుల బారినుండి తప్పించుకున్నాడు. అప్పటికి మానుకోట తాలూకాలో ఉండిన పిండిపోలు చేరుకున్నాడు. అక్కడ కవిరాజ మూర్తి ఇంట్లో అజ్ఞాతంగా ఉండిపోయాడు. కవిరాజ మూర్తి కాంగ్రెసు. పిండిపోలులో కమ్యూనిస్టు పార్టీ బలంగా ఉంది. నాకు జ్ఞాపకం ఉన్నంత వరకు కవిరాజమూర్తి ఒక కమ్యూనిస్టు కార్యకర్తను హత్య చేశాడు.

దాశరధి కమ్యూనిస్టు పార్టీకి రాజీనామా చేశాడు. వారితోపాటు పెండ్యాల సత్యనారాయణ, పెరవెల్లి వెంకట రమణయ్య, పర్సా దుర్గాప్రసాదరావు మున్నగువారు పార్టీకి రాజీనామాలు చేశారు. కాంగ్రెసులో చేరారు.

హిట్లరు రష్యామీదికి దండెత్తాడు. అప్పుడు భారత కమ్యూనిస్టు పార్టీ దానిని ప్రజాయుద్ధం అన్నది. "రష్యాలో వానపడితే కమ్యూనిస్టులు భారతదేశంలో గొడుగు పట్టుకుంటారు" అనేవాళ్లు కమ్యూనిస్టు వ్యతిరేకులు. ఆ కారణంగానే మేము రాజీనామా చేశామన్నారు దాశరధి మున్నగువారు. కాని, అది సరియయిన కారణం అనిపించదు. ఎందుకంటే, హిట్లరు రష్యామీద 1941 జూన్‌లో దాడి చేశాడు – ఈ రాజీనామాలు 1946లో జరిగాయి.

ఈ మధ్య ఒక సీనియర్ కమ్యూనిస్టు నాయకుణ్ణి అడిగాను. వ్యక్తిగత విభేదాలు తప్ప – సిద్ధాంతపరం అయిన విభేదాలు కావన్నారు. తరం అంతరిస్తున్నది. ప్రత్యేకంగా ఈ సంఘటన గుర్తున్నవాళ్లూ కనిపించరు.

దాశరధి కొంతకాలం పిండిపోలులో ఉన్నాడు. తరువాత కారేపల్లిలో పర్సా దుర్గా ప్రసాద్‌రావుగారింట్లో ఉన్నాడు. అసందర్భంగా నేను కొన్నిసార్లు కారేపల్లి వెళ్లివచ్చాను.

ఒకనాడు అన్నయ్య – రహస్యంగానే – ఇంటికి వచ్చాడు. పోలీసులు కనిపెట్టారు. దాశరధిని అరెస్టు చేశారు. రాత్రికి రాత్రి రైలెక్కించి వరంగల్లు జేలుకు పంపారు. అప్పటికి ఇంకా భారతదేశం స్వతంత్రం కాలేదు. రజాకారు రాక్షస మూకలు మరింత చెలరేగలేదు.

దాశరధిని వరంగల్లునుంచి నిజామాబాదు జేలుకు – హైదరాబాదు చంచల్‌గూడా జేలుకు మార్చారు. జేలు జీవితాన్ని గురించి వారు "యాత్రాస్మృతి"లో వివరంగా వ్రాశారు.

## దుర్లభదర్శనం:

"మహాత్ముడు ఖమ్మం వస్తున్నారు." ఇది వార్త. మహాత్ముడు మహిమాన్వితుడు. వారు భారత ప్రజలను ఉద్యమింపజేశారు. తెల్లవాని గుండెలో నల్లపిడుగులు కురిపించారు. మహాత్ముని అనేకమంది అవతారంగా భావించారు. దేవునిగా పూజించారు. వారికి అనేక మహిమలు ఆపాదించారు. నాకు మాత్రం మహాత్ముడు దైవత్వం అధికంగా ఉన్న మహా ఉన్నత మానవుడుగా కనిపిస్తారు.

**దైవత్వం - రాక్షసత్వం రెంటి కూడిక మానవుడు. ఏది అధికంగా ఉంటే వాడవుతాడు. నరుడు దేవుడు కావచ్చు. రాక్షసుడు కావచ్చు. మానవుడు కావడం కష్టం. మానవునిలో దైవత్వ రాక్షసత్వాలు సమానంగా ఉంటాయి.**

"మహాత్ముడు" – ఆ పేరు వినగానే ఒక జ్యోతిర్మూర్తి ప్రత్యక్షం అవుతారు. మస్తకం అవనతం అవుతుంది. గుండెలో గౌరవం, భక్తిభావం పొర్లుతాయి.

**మహాత్ముడు రామునివంటి వీరుడు కాడు. శ్రీకృష్ణునిలాంటి యుగ కర్త కాదు. బుద్ధునివంటి ప్రబోధకుడు కాడు. క్రీస్తు, మహమ్మదుల వంటి ప్రవక్త కాదు.**

**మహాత్ముడు సామాన్య మానవునివలె జీవించారు. సాధారణునివలె తప్పులు చేశారు. ఒప్పులు మరిన్ని చేశారు. వారి జీవితమే ఒక మహాగ్రంథం. చెప్పినవారు అనేకులున్నారు. చేసి చూపినవారు గాంధీజీ!**

మహాత్మునిది ఒక సమ్మోహన శక్తి. నలుబది కోట్లమంది భారతీయులు వారి కను సన్నలలో నడిచారు. మానవ జాతి సాంతం వారిని ఆదరించింది. అభినందించింది. వారి అనుయాయులలో వారితో ఏకీభవించేవారు తక్కువ. వ్యతిరేకించేవారు ఎక్కువ. అయినా అందరూ వారినే అనుసరించారు.

**మహాత్ముడు - ముమ్మూర్తులా మహాత్ముడు. సూర్యుడు క్రుంగని బ్రిటిషు సామ్రాజ్యాన్ని గడగడలాడించారు. సింహాన్ని ఖద్దరు నూలుతో కట్టిపడేశారు. మహాయంత్రాల చక్రాలను రాట్నం తిప్పి నిలిపారు.**

**శత్రువును మిత్రునిగా ప్రేమించడం మహాత్మునికే సాధ్యం. అతడు అజాత శత్రువు. శత్రువులు సహితం మహాత్ముని అభినందించకుండా ఉండలేకపోయారు.**

మహాత్ముడు ఖమ్మం వస్తున్నారు. వారిని మనం దర్శించగలం! మహాత్ముని దర్శించామని సగర్వంగా చెప్పకోగలం!! మహాత్ముని దర్శించడమే ఒక మహాభాగ్యం!!!

అది చలికాలం. ఆరోజుల్లో చలి ఎక్కువ. వంటినిండా బట్టల్లేవు. రాత్రి బండికే ఖమ్మం చేరుకున్నాం. తెల్లవారేవరకు చేరుకోలేమని భయం. అందరం బయలుదేరాం. రాత్రి వజవజ వణుకుతూ ఖమ్మం స్టేషన్లో గడిపాం. తెల్లవారి ముఖాలు కూడా కడగలేదు. మహాత్ముని దర్శనం లభించదని భయం! మసక చీకట్లోనే సభాస్థలికి చేరుకున్నాం.

నేల ఈనినట్లు జనం. అంతా క్రమశిక్షణగా కూర్చున్నారు. మంత్రం వేసినట్లే

నిశ్శబ్దంగా ఉన్నారు. తోసుకోవడం – అరవడంలాంటివి మచ్చుకు లేవు. మేమూ ఒక చివరన కూర్చున్నాం.

వేదిక చాల ఎత్తున కట్టారు. అందరికీ దర్శనం అవుతుంది. అది నిరంతర నిరీక్షణ. క్షణక్షణం ఉద్వేగం. అందరి చూపులూ రైలు కట్టవైపు.

రైలు వచ్చింది. ఆవిరి ఇంజను – మూడు పెట్టెలు. వంటి రెక్కదాటి సభాస్థలిన ఆగింది. సభాస్థలంలో బండి ఆగడం అంతవరకు ఎరగం.

మహాత్ముడు రైలు దిగారు. ఇంత రాక్షసత్వం లేని రోజులు. పోలీసు బలగం అంతగా కనిపించలేదు. జనంలో ఒక్కడూ కదలలేదు. "గాంధీజీకి జై" నినాదాలు చేశారు.

**మహాత్ముడు దిగారు. తలమీద గుడ్డ - ముఖాన ఇసుమంత తిలకం - బోసినోటి నవ్వు - కోరాకద్దరువంటి స్వచ్ఛవర్ణం - పైపంచె లేని వక్షం - మోకాళ్లవరకు బట్ట - పాదాలకు ఊరి చెప్పులు - కళ్లకు జోడు -ఒక జ్యోతివలె - ఒక వెలుగువలె - ఒక వెన్నెలవలె - ఒక నీరెండవలె సభవైపు సాగారు.**

**మహాత్మునితో కాలినడకలోనూ - కర్మనడకలోను అందుకోవడం అసాధ్యం. వారు మెరుపులా సాగారు. అనాయాసంగా వేదిక ఎక్కారు.**

"గాంధీజీకి జై" దిక్కులు పిక్కటిల్లుతున్నాయి.

మహాత్ముడు రెండు చేతులు ఎత్తి వారించారు. అంతే. అంతా నిశ్శబ్దం.

"వైసానహీఁ. అయిసా" అలాకాదు ఇలా:–

"భారత్ మాతాకీ" – మహాత్ములు అన్నారు.

జయనాదం దిక్కులు పిక్కటిల్లింది.

అలా మూడుసార్లు అనిపించారు.

"భాయియో ఔర్ బహనో! మైనే వచన్ దియాహైకే యహాఁ సియాసత్ నహీఁ బోలూఁగా. మైఁ వచన్‌కా పక్కాహూఁ. అబ్ హమ్ భజన్ కర్తే హైఁ" – సోదర సోదరీమయిలారా! ఇక్కడ రాజకీయం మాట్లాడనని మాట ఇచ్చాను. నేను మాట తప్పను. ఇప్పుడు మనం భజన చేద్దాం. "మైఁ జైసా కరూఁగా అవుర్ కహూఁగా ఆప్‌వైసా కహీయె అవుర్ కరియే" – నేను చేసినట్లు చేయండి. చెప్పినట్లు అనండి." మహాత్ముడు చేయి ఎత్తినారు. జనం ఎత్తినారు. మహాత్ముడు రెండో చేతితో తాళం వేసినారు. "రఘుపతి రాఘవ" భజన చేయించారు. మహాత్ముడు వేలుచూపి "నిశ్శబ్దం" అన్నారు. అంతా నిశ్శబ్దం. మహాత్ముడు మాట్లాడారు.

"ఆప్‌సబ్ ఖద్దర్ పెహనీయే అవుర్ హిందీ సీఖియే. యహ్ సియాసత్‌నహీఁ" – మీరు ఖద్దరు కట్టండి. హిందీ నేర్వండి.ఇది రాజకీయం కాదు.

మహాత్ముడు చేతులు జోడించి నమస్కరించారు.

వేలమంది ముకుళితహస్తాలతో నమస్కరించారు.

మహాత్ములు వేదిక దిగారు. సాగారు. రైలు ఎక్కారు. రైలు సాగిపోయింది.

"మహాత్మాగాంధీకీ జై
భారత్ మాతాకీ జై
హమ్ హిందీ సీఖేంగే
హమ్ ఖాదీ పహనేంగే" అనే నినాదాలు రైలు చప్పుడును మించాయి.
అదొక మహోత్తమ అనుభూతి!
అదొక చెరగని అనుభూతి!!
అదొక నిత్యనూతన అనుభూతి!!!

అనుభూతికి అక్షరాలు చాలవు. నాటినుంచి ఖద్దరు కట్టాను. ఖద్దరు వెక్కిరింత పాలయ్యేవరకు విధిగా ధరించాను. నా "మోదుగుపూలు" నవలలో చివరి వాక్యాలు–

"స్టేషనులో రైలు కూసింది. మిలిటరీ స్టేషన్‌లో ఆగింది. సిక్కు మిలిటరీ దిగింది. వారిముందు కులశేఖరరావు – రంగారెడ్డి ఖద్దరుధారులయి దిగారు."

# ఇరవయి

## "అగ్నిమీళే పురోహితమ్"

**తెలంగాణకు ఏనాడూ రాజకీయ ప్రతిపత్తి లేదు. తెలంగాణకు పోరాట ప్రతిపత్తి ఉంది. ఉద్యమ ప్రతిపత్తి ఉంది. విప్లవ ప్రతిపత్తి ఉంది. ప్రజాపోరాటాల మూలంగానే తెలంగాణ అంతర్జాతీయంగా విదితం అయింది. 1946-51 మధ్యకాలపు వార్తాపత్రికలు పరికిస్తే తెలంగాణా పోరాటం ఎంతటి ప్రాధాన్యత సంతరించుకుందో వ్యక్తం అవుతుంది.**

భారత స్వాతంత్ర్య సంగ్రామం అరవయి ఏండ్లు జరిగింది. అయినా అయిదేళ్ల తెలంగాణా సాయుధ పోరాటమంతటి విప్లవాత్మకంగా కనిపించదు.

భారత స్వాతంత్ర్య సమరం భావావేశంతో జరిగింది. అంగ్రేజు రాజ్యాన్ని తొలగించడమే దాని ప్రధాన లక్ష్యం.

తెలంగాణ పోరాటానికి నిర్దిష్టమైన ఆర్థిక రాజకీయ లక్ష్యాలు ఉన్నాయి. 1. నిజాం రాజ్యం పోవాలి, 2 భూస్వామ్య విధానం నశించాలి, దున్నేవానికి భూమి దక్కాలి, 3. తెలుగు భూమి ఒకటి కావాలి, విశాలాంధ్రం ఏర్పడాలి.

భారత స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న అధిక సంఖ్యాకులు ఉన్నత వర్గాలవారు. మధ్యతరగతుల వారు. సాధారణ ప్రజానీకం స్పందించిన మాట వాస్తవం. కాని, పాల్గొనలేదు.

తెలంగాణా పోరాటంలో మధ్యతరగతివారు, రైతు కూలీలు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ముఖ్యంగా మహిళలు ఈ పోరాటంలో పాల్గొన్నంతమంది ఏపోరాటం లోనూ పాల్గొనలేదు. వారు పురుషులతో సమానంగా – కాశెగట్టి వడిశెల పట్టి పోరాటంలో దూకారు.

భారత స్వాతంత్ర్య సమరానికి కవుల – రచయితల – కళాకారుల స్పందన అంతగా కనిపించదు. ఉద్యమస్ఫూర్తితో సాహిత్యం రాలేదనడం పొరపాటు. కాని,

అరవయి సంవత్సరాల సుదీర్ఘ పోరాటానికి రావలసినంత సాహిత్యం రాలేదు.

అయిదేళ్ల తెలంగాణా పోరాటంలో అరవయి ఏండ్ల స్వాతంత్ర్య పోరాటంలో వచ్చిందానికన్న - వాసిలోనూ, రాసిలోనూ అనంతం అయిన సాహిత్యం ప్రభవించింది.

పోరాటకాలంలో అజ్ఞాత కవులు ఆవిర్భవించారు. జానపద కళారూపాలు - బుర్రకథ, జముకులకథ, గొల్ల సుద్దులు, కోలాటం, ఉయ్యాల పాట, భాగోతం, ధూల, ఫకీరుపాట మున్నగువానిలో సాహిత్యం అవతరించింది. సుద్దాల హనుమంతు - యాదగిరి - తిరునగరి ఆంజనేయులు - నాజర్ వంటి కళాకారులు రచనలు చేశారు, ప్రదర్శనలు ఇచ్చారు.

దాశరథి "అగ్నిధార", "రుద్రవీణ"; కాళోజీ "నా గొడవ", సోమసుందర్ "వజ్రా యుద్ధం," గంగినేని "ఉదయిని", కుందుర్తి "తెలంగాణ", ఆరుద్ర "త్వమేవాఽహమ్" పోరాట స్ఫూర్తితో వచ్చిన కావ్యాలు. గమనించదగిన విషయం - శ్రీరంగం శ్రీనివాసరావు - శ్రీశ్రీ - కావ్యం **లేకపోవడం! అతను స్పందించక పోవడం!!**

గంగినేని వెంకటేశ్వరరావు మూడు సంపుటాల ఎర్రజండాలు - వట్టి కోట ఆళ్వార్‌స్వామి - పొట్లపల్లి రామారావు- కాళోజీ-సి. వి. కృష్ణారావు మున్నగువారు కథానికలు రచించారు.

బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు' - ఆళ్వార్ స్వామి 'ప్రజల మనిషి', 'గంగు', లక్ష్మీకాంతమోహన్ 'సింహగర్జనలు', మహీధర రామమోహన్‌రావు 'ఓనమాలు', 'మృత్యువు నీడలో', గొల్లపూడి నారాయణరావు 'తెలుగు గడ్డ', నేను 'చిల్లరదేవుళ్లు', "మోదుగుపూలు", 'మాయజలతారు', 'జనపదం' నవలలు రచించాం.

**భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రాణాలను బలిదానం చేసిన భగత్‌సింగ్ వంటివారి సంఖ్య తక్కువ. సంఖ్యమాత్రమే తక్కువ, ప్రభావం తక్కువకాదు.**

**తెలంగాణా పోరాటపు అయిదు సంవత్సరాల కాలంలో నాలుగువేలకు పైగా వీరులు తమ ప్రాణాలను అర్పించారు.**

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో సాధించిన స్వాతంత్ర్య ఫలం దక్కింది. భారతజాతి స్వతంత్రం అయింది. రాజ్యాంగాన్ని ఏర్పరచుకుంది. ప్రజాస్వామ్య ప్రభుత్వం కొనసాగుతున్నది.

తెలంగాణ పోరాటపు ఫలితం ప్రజలకు దక్కలేదు. మూడు వేల గ్రామాలలో పంచిన పది లక్షల ఎకరాల భూమిని భూస్వాములు తిరిగి ఆక్రమించుకున్నారు. అయితే తెలంగాణ పోరాటపు వారసత్వం, పోరాటస్ఫూర్తి నిలిచి ఉంది. భూసంస్కరణలు - జాగీరుల రద్దువంటివానికి ప్రజాపోరాటమే ప్రధాన కారణం. పోరాట స్ఫూర్తితో తెలంగాణ కాంగ్రెసులో సహితం కొంతకాలం 'ప్రగతి వర్గం' కొనసాగింది.

ఇంతటి మహత్తర విప్లవానికి నిజాం నిరంకుశత్వం - దొరల దౌర్జన్యమే కారణమగునా?

1940 ప్రాంతంలో అత్యధిక భూమిగల భూస్వాములు వీరు:-

1. విసునూరు దొర 40,000 ఎకరాలు
2. సూర్యాపేట దొర 20,000 ఎకరాలు

3. బాబాసాబ్ పేట దొర 10,000 ఎకరాలు
4. కాళ్లూరి వారు లక్ష ఎకరాలు
5. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి లక్షన్నర ఎకరాలు

ఆ కాలపు సంయుక్త పరగణాలు – బీహార్ – మధ్యపరగణాలు – ఒరిస్సా మున్నగు ప్రాంతాల్లో ఇంతకు మించి భూమి ఉన్న జమీందారులు ఉన్నారు. బీహారు మున్నగు రాష్ట్రాల్లో జమీందార్ల ఈనాటి దారుణాలు ఆనాటి తెలంగాణా ప్రాంతాన్ని తలతన్నినవి.

దేశీయ సంస్థానాధీశుల్లో నిరంకుశత్వంలో నిజామును తలదన్నినవారు ఉన్నారు.

కమ్యూనిస్టు పార్టీ భారతదేశంలోని ఇతర ప్రాంతాల్లో – తెలంగాణాకన్న అధ్వాన్న పరిస్థితులు ఉన్నచోట విప్లవం సృష్టించలేకపోయింది.

**సాయుధ పోరాటాలు తెలంగాణా ప్రాంతంలోనే ఉద్భవించడం - నక్సలయిట్ల పోరాటంగా ఇంకా కొనసాగడానికిగల మూలసూత్రాన్ని రాజకీయ - సాంఘిక - సామాజిక శాస్త్రవేత్తలు పరిశోధించి నిర్ణయించాల్సి ఉంది.**

**నాది తెలంగాణం అని గర్వించేవాళ్లలో నేను ఒకణ్ణి. నేను తెలంగాణా గడ్డన పుట్టాను. తెలంగాణ మట్టిలో పెరిగాను. తెలంగాణ ప్రజకోసం - నాకు సాధ్యమయినంతలో - పోరాటపరంగా - సామాజికపరంగా - సాహిత్య పరంగా సేవ చేస్తున్నాను. నాకు అర్థం అయింది ఏమంటే -**

**తెలంగాణా విప్లవపథాల సీమ**

**తెలంగాణ ప్రజానీకంలో తిరుగుబాటు రక్తం ఉంది. వీరు తలలు తెంపగలరు. తడిబట్టలతో కోయులేరు.**

తెలంగాణ ప్రజ సింహం వంటిది. అది నిద్రిస్తూనే ఉంటుంది. లేచిందా పంజాతో కొడ్తుంది.

**తెలంగాణంలో - ఉద్యమం పుట్టని రోజుల్లోకూడా - ప్రజలు దొరలను పట్టపగలు - నడిబజారులో చిత్రవధ చేసిన సంఘటనలు కోకొల్లలు. ఈ స్థితిని నేను "చిల్లరదేవుళ్లు" నవలలో వివరించాను.**

**ఇలాంటి సంఘటనలను గుదిగుచ్చి వ్రాయవలసిన బాధ్యత చరిత్రకారులకు - వ్రాయించవలసి బాధ్యత ప్రజాసంస్థలకు ఉన్నది.**

అంతమాత్రాన కమ్యూనిస్టు పార్టీ విప్లవోన్ముఖతనుకాని – ఆ పార్టీ విప్లవ నాయకత్వాన్ని – దాని నిజాయితీనికాని కొంచెం చేయాలనికాని – కించపరచాలని కాని నా ఉద్దేశం కాదు.

కమ్యూనిస్టు పార్టీ 'ప్రజాయుద్ధ' విధానం కారణంగానే నిజాం ప్రభుత్వపు నిరంకుశ విధానం సడలింది.

కమ్యూనిస్టు పార్టీ ఈ సడలింపును ఉద్యమపరంగా వినియోగించుకున్నది.

కమ్యూనిస్టు పార్టీ తెలంగాణ ప్రజను సమైక్యం చేసింది. సంఘటితపరచింది. పోరాటానికి నాయకత్వం వహించింది. అయితే, ఈనాడు అనేకంగా చీలిపోయిన

కమ్యూనిస్టు పార్టీలు - అనాడు పార్టీ నిర్వహించిన విప్లవానికి వారసులు కావడానికి అర్హులు కారు. అనాటి పార్టీ వెలుగు కిరణం - ఒక్కటి కూడా వీటిలో లేదు.

ఒక్క విషయం - ఆనాటి పార్టీ - మితవాదులుగా ముద్రవేసిన వారి పాత్రను విస్మరించరాదు. వారు నిర్మించిన ఆంధ్రమహాసభలోనే వీరు మొలిచి మహావృక్షం అయినారు. మితవాదుల భుజాలమీద ఎక్కి అతివాదులు అయినారు. మితవాదం మనం ఎక్కిన నిచ్చెన!

## అమరజీవి కొమరయ్య:

భువనగిరి ఆంధ్రమహాసభల పోరాట స్ఫూర్తి ఖమ్మం సభలతో విప్లవస్ఫూర్తిగా జ్వలించింది.

కమ్యూనిస్టు పార్టీ - ఆంధ్రమహాసభ - అఖిల హైదరాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ల తరపున కామ్రేడ్స్ మఖ్దూం మొహియొద్దీన్, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి గారలు సాయుధ ప్రతిఘటనకై పిలుపునిచ్చారు. హైదారాబాద్ విద్యార్థి యూనియన్ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ ఓంకార్ ప్రసాద్, సహాయ కార్యదర్శి కామ్రేడ్ రఫీ అహమద్ పిలుపునిచ్చారు.

ఈ పిలుపు హైదరాబాద్ కమ్యూనిస్టులు - తమంతతాముగా - ఇచ్చింది మాత్రం కాదు. దీనికి కమ్యూనిస్టు పార్టీ పొలిట్ బ్యూరో, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఆమోదముద్ర ఉంది. ఈ నిర్ణయం ఎంతవరకు సరియైంది అని ఈనాటి పరిస్థితుల దృష్టితో పరిశీలించడం సమంజసం కాదు. అనాడు తెలంగాణంలో ఉండిన నాజీ నియంతృత్వాన్ని ఎదుర్కోవడానికి అది అవసరం - తప్పనిసరి. 'నైజాం సర్కారోడా! నాజీల మించినోడా!' అని ప్రజలు పాడుకున్న రోజులవి!

ఇంతటి మహావిప్లవానికి ఎక్కడో నిప్పురవ్వ రాలాలి కదా! అది జనగాం తాలూకా పాలకుర్తిలో రాలింది. యాదృచ్ఛికమే అయినా 'పాలకుర్తి' శివకవి - ప్రజాకవి - తెలుగుకవి పాల్కురికి సోమనాధుని పుట్టిల్లు!

పాలకుర్తిలో అయిలమ్మ రజక మహిళ - చాకలి అడది. అమెకు చారెడు నేల చెక్క ఉంది. అమె అందులో పంట పండించుకుంటోంది. అంతవరకు బాగానే ఉంది. ఆమె 'సంగం' కార్యకర్త. అది విసునూరి రామచంద్రారెడ్డి కళ్లల్లో నిప్పులు పోసింది. దొర కోప్పడ్డడు. అయిలమ్మ పొలం పంట కాజెయ్యాలెననుకున్నడు. నూరుగురు పైల్వాన్లను అయిలమ్మ పొలం మీదికి తోలిండు.

అయిలమ్మ ఎన్క సంగమున్నది. ప్రజలున్నరు. ప్రజలు గుత్పలు పట్టిన్రు. గుండాలమీదికి ఉరికిన్రు. గుండాలు మందిని చూచిన్రు. వారి మార్బలం చూచిన్రు. ఉచ్చ పోసుకున్నరు. విసునూర్ల పడేదన్క ఉరికిన్రు!

అయితే దొర ఊరుకున్నడనుకున్రా! అర్గురు కార్యకర్తల్ను పోలీసులకు పట్టిచ్చిండు. పోలీసోల్లు కార్యకర్తలను చచ్చెటట్లు కొట్టిన్రు. నోళ్లల్ల ఉచ్చ పోసిన్రు. ముడ్ల కారం ముద్దలు నూకిన్రు.

**ఎట్లయితే ఏమి? అయిలమ్మకు గింజ దక్కింది. దొర ఓడిండు! ఎవరు ఓడిండు? దొర ఓడిండు! దొరోడు ఓడిపోయిండు. దొరోడు ఓడినందుకు మంది పొంగిపోయిన్రు. సంబరం చేసుకున్నరు. బడితెలు - వడిసెల్లు - బరిశలు తీసుకున్నరు. పెద్ద ఊరేగింపు తీసిన్రు. దొరల దౌర్జన్యాలను తిట్టిపోసిన్రు.**

**ఊరేగింపు గడీముంగలికెల్లి పోతాంది. దొర చెప్పిండు. గుండాలు బందూకులు కాల్చిన్రు. ఊరేగింపు ముంగల నడిచిన దొడ్డి కొమరయ్య పొట్టలకెల్లి తూట దూస్క పోయింది.**

దొడ్డి కొమరయ్య ఒరిగిండు. కూలిండు.

కొమరయ్య బలి అయినాడు. ప్రజలు బెదరలేదు. పారిపోలేదు. కోటవంటి గడీని చుట్టుముట్టారు. వార్త కార్చిచ్చువలె పాకింది. పొరుగు గ్రామాల ప్రజలు వందలు వేలు వచ్చారు. రెండు వేలకుపైగా జనం కూడారు.

"ప్రాణానికి ప్రాణం - దొర ప్రాణం తీస్తాం" అని చేసిన నినాదాలే దొర గుండెల్లో తూటాలయినవి.

ప్రజలు నాయకులు లేనివారు కారు. 'సంగం' నాయకత్వం ఉంది. 'సంగం' పథకం ఉంది. 'సంగం' ఎత్తుగడ ఉంది. రెగ్యులర్ ముట్టడి ప్రారంభం అయిది. కొందరు గడీని చుట్టుముట్టారు. కొందరు ఊరిబయట కాపలా కాశారు. కొన్ని జట్లు వీధుల్లో 'పహరా' చేశాయి.

దొర కొడుకు విసునూరు నుంచి రెండువందల మంది గుండాలను వెంటపెట్టుకున్నాడు. తండ్రిని రక్షించడానికి - బండ్లమీద - కడివెండికి బయలుదేరాడు. ఊరి పొలిమేరలో కాపున్న ప్రజలు వారిని చూచారు. ఆకాశం చిల్లులు పడేటట్లు నినాదాలు చేశారు. వడిసెలలతో వందల వేల రాళ్లు రువ్వారు. దొర కొడుకు బెదిరిండు. అడుగుముందుకు వేయలేకపోయిండు.

ప్రజలు 'పాలో'మని వారి వెంట పడ్డారు. దొరకొడుకు, దుండగులు - ప్రాణాలు దక్కించుకోవడానికి - పలాయన మంత్రం పఠించారు. ప్రజలు కేకలు - పెడబొబ్బలు - వడిసెలలతో వారిని తరిమారు. పారిపోతూ -ప్రాణభయంతో - మాధారం తండాలో దాక్కున్నారు. లంబాడీలు పొరకలతో -రోకళ్లతో తరిమికొట్టారు. అనుముల రామిరెడ్డి అనే దుండగుని ప్రజలు పట్టుకున్నారు. వాడే కార్యకర్తల నోళ్లలో మూత్రించింది. వాణ్ణి చావగొట్టి - కొన ఊపిరితో వదిలిపెట్టారు. గుండాలు వచ్చిన బండ్లను చెక్కపేళ్లకింద విరక్కొట్టారు. దొర మామిడి తోటమీద పడ్డారు. ఒక్క చెట్టు లేకుండా నరికి కుప్పపెట్టారు. తగలపెట్టారు.

సరిగ్గా ఆ సమయానికి పోలీసులు దిగారు. ప్రజాబలం చూచారు. వారూ బెదిరారు. ప్రజలతో మంతనాలు సాగించారు. గుండాలను పట్టుకుంటామన్నారు. వారిమీద చర్య తీసుకుంటామన్నారు. ప్రజలు - సంగం - పోలీసులను నమ్మింది. ప్రజలు విడిపోయారు. ఎవరి ఊళ్లకు వారు వెళ్లిపోయారు.

**ఏకాలపు పోలీసులయినా 'ద్రోహం' చేయడం వారి ప్రధాన బాధ్యత. వారుతమ బాధ్యత నిర్వహించారు. నాయకులు, కార్యకర్తలమీద కేసులు పెట్టారు. గూండాలను విచ్చల విడిగా వదిలారు.**

పోస్టుమార్టం తరువాత దొడ్డి కొమరయ్య శవాన్ని ప్రజలకు అప్పగించారు. వేల సంఖ్యలో అన్ని గ్రామాల ప్రజలు – బ్రహ్మాండం అయిన ఊరేగింపు తీశారు.

"దొడ్డి కొమరయ్య అమరహై"
"జోహార్ జోహార్ దొడ్డి కొమరయ్య"
"ప్రాణాలిస్తాం – దొరలకు లొంగం"
"దొరల దౌర్జన్యం నశించాలి"
"పోలీసుజులుం నశించాలి."

నినాదాలతో దిక్కులు పిక్కటిల్లగా జన ప్రవాహం సాగింది. ప్రజల వెల్లువ పొర్లింది – పొంగింది.

"అమరజీవి నీవు కొమరయ్యా
అందుకో జోహార్లు కొమరయ్యా
నిన్ను బలిగొన్నట్టి నీచులను దునిమాడి
నిన్ను గన్నట్టి ఈ తెలుగుగడ్డను మేము
స్వాతంత్ర్యముగజేసి శాంతించెదమెగాని
నీ పేరు నిలుపకె కొమరయ్యా
నిదురైనబోమోయి కొమరయ్యా"

అని ప్రతిజ్ఞ చేశారు.

దొడ్డి కొమరయ్య దేహాన్ని అగ్నికి ఆహుతి చేశారు.

కొమరయ్య అమరుడు అయినాడు. అతని ఆహుతి జ్వాలలు చైతన్యజ్వాలలు అయినాయి. కార్చిచ్చువలె గ్రామగ్రామాలకు పాకింది. తాలూకాలకు – జిల్లా అంతటా అలముకొంది. ప్రజలు ఆత్మవిశ్వాసంతో కదిలారు. ఒక నూతన ఉద్యమం కొత్త రీతిలో ప్రారంభం అయింది.

ఒక ఊరి ప్రజలు గుత్పలు – దుడ్డుకర్రలు తీసుకుంటారు. పాటలు పాడుతూ – నినాదాలు చేస్తూ పక్క ఊరు చేరుకుంటారు. ఉభయ గ్రామాలవారు గడీ దగ్గర సభ పెడ్తారు. పాటలు– పద్యాలు – నినాదాలు – ఉపన్యాసాలు సాగుతాయి. తరవాత గడీగేటు ముందుకు వచ్చి గుత్పలను అరచేతుల్లో కొట్టి 'దొరలను అంతం చేస్తాం' అని అరుస్తారు. అందువల్ల దానికి "గుత్పల సంగం" అని పేరు వచ్చింది.

'గుత్పల సంగం' వచ్చిందంటే దొరలు గడీల్లో దాక్కుని తలుపులు బంధించుకున్నారు. మూడు నెలలవరకూ విసునూరు దొర పొలాల్లో పని సాగనివ్వలేదు.

బయటి ఊరునుంచి వచ్చినవారికి ఆ ఊరువారు భోజనాలు పెట్టేవారు. ఈ ఉద్యమంతో కుల మతాల గోడలు కూలిపోయాయి. ఇదొక పెద్ద సంఘ సంస్కరణ అయింది. మళ్లీ ఈ ఊరువారు పొరుగూరు వెళ్లేవారు. ఒక ప్రధాన విశేషం – మహిళలు సహితం పురుషుల సహితంగా బుజం బుజం కలిపి సాగడం. స్త్రీలు సాగడం ఒక మహత్తరం అయిన సాంఘిక ప్రగతి. యూరోపులో ఓటుహక్కు కోసం స్త్రీలు కలకాలం పోరాడారు. 'సంగం' పోరాటంలో స్త్రీలకు సమాన స్థానం కల్పించింది.

ఈ ఉద్యమ ఫలితంగా అనాదిగా సాగుతున్న 'వెట్టి' అంతం అయింది. దొరలు రైతులను భూములనుంచి 'బేదఖల్' – తొలగించడం నిలిచిపోయింది. బలవంతంగా 'లెవీ' వసూళ్లు ఆగిపోయాయి.

ఈ ఉద్యమం ఇన్ని సాధించింది. అన్నింటినీ మించి ప్రజాభిమానం సాధించింది. ప్రజలను అయిక్యం చేసింది. ప్రజల్లో ఆత్మవిశ్వాసం కలిగించి, విశేషంగా దొరల్లో దడ పుట్టించిది. వారు ఊరికి వేరయి వంటరి జీవితం గడపాల్సి వచ్చింది.

**ప్రభుత్వాలు – ఎల్లవేళలా – ఉన్నవాని పక్షమే. ప్రభుత్వాల ప్రధాన బాధ్యత ఆస్తులను రక్షించడం. ప్రభుత్వం దొరలను రక్షించడానికి కదిలింది. విచక్షణారహితంగా 'సంగం' కార్యకర్తలను అరెస్టులు చేసింది. కేసులు పెట్టింది. కోర్టులకు తిప్పింది.**

కమ్యూనిస్టు పార్టీ ఎత్తుగడ మార్చింది. కార్యకర్తలను అరెస్టు కావద్దని ఆదేశించింది. అజ్ఞాతానికి వెళ్లిపొమ్మన్నది. గ్రామాలలో ఉంటే పోలీసులు వచ్చినప్పుడు తప్పుకొమ్మన్నది. ఉద్యమానికి తిరుగులేని – ప్రజల సహకారం అందింది. ప్రజలు తమ నాయకులను కంటికి రెప్పవలె కాపాడుకున్నారు.

ప్రజల చైతన్యం ప్రభుత్వాన్ని హడలగొట్టింది. అది తన పశుబలాన్ని ప్రయోగించింది. సైన్యాన్ని రంగంలోకి దింపింది. ప్రజలు సైన్యంతో సహితం హోరాహోరీ పోరారు. అలాంటి కొన్ని పోరాటాలను పేర్కొనడం అత్యవసరం.

## బాలెమ్ల:

కామ్రేడ్ మట్టారెడ్డి బాలెమ్లలో ఉన్నాడని పోలీసులకు తెలిసింది. పోలీసులు రాత్రిపూట – మట్టారెడ్డి ఇంటిని చుట్టుముట్టారు. ఆ సందడికి మట్టారెడ్డి లేచాడు. గుత్ప పట్టుకొని బయటికి వచ్చాడు. పొలికేక పెట్టాడు. గ్రామం సాంతం మేలుకొన్నది. చేతికి అందిన గుత్ప – రోకలి – వడిసెల – పారక అందుకొని స్త్రీ పురుషులు పోలీసుల మీద దూకారు. ఒక సబిన్స్పెక్టరు చేయి విరిచారు. ఒక కానిస్టేబుల్ తల పగిలింది. సర్కిల్ ఇన్స్పెక్టర్ మట్టారెడ్డి తలకు తుపాకి పెట్టి కాల్చాడు.

'ఆంధ్రమహాసభకూ జై – సంగానికి జై' అంటూ మట్టారెడ్డి ఒరిగాడు. పోలీసులు తృటిలో మట్టారెడ్డి దేహాన్ని వ్యానులో వేసుకొని పారిపోయారు. ప్రజలు వెంబడించారు. కాని, వ్యానును అందుకోలేకపోయారు.

తెల్లవారి సూర్యాపేట జనసాగరం అయింది. ప్రజలు మట్టారెడ్డి దేహాన్ని తీసుకున్నారు. వేల సంఖ్యలో సాగారు. వారి దుఃఖానికి, ఆవేశానికి హద్దులు కనిపించలేదు. మట్టారెడ్డికి జోహార్ పలికే నినాదాలు అందని ఆకాశాన్ని అంటేయి. మట్టారెడ్డి చితి ముందు మట్టారెడ్డి భార్య 'పగ తీర్చుకుంటా'నని ప్రతిన బూనింది.

మట్టారెడ్డి భార్య ప్రతిన చూచారు జనం. వారిలో ఆవేశం పొంగింది. ఉద్రేకంలో ఉర్రూతలూగారు. నిజామును హతమారుస్తామన్నారు.

"బండిమీదబండికట్టి – పదహారుబండ్లుకట్టి
ఏబండ్లనున్నవుకొడుకో – నైజామునర్కారోడ!

నైజాముసర్కారోడా – నాజీలమింటివోడ!
నీ అంతుచూస్తంకొడుకో – నైజాంసర్కారోడా" అని
పిడుగులు కురిపించారు.

## పాత సూర్యాపేట:

బాలమ్మ పోరాటం కొన్ని అనుభవాలను అందించింది. ప్రజలు – తమ నాయకులను – రక్షించుకోవడానికి కృతనిశ్చయులు అయినారు. ప్రతి గ్రామంలో రాత్రి కాపలాలు ఏర్పరచారు. ఊరి మధ్యన ఒక దండోరా ఏర్పరచారు.

దొరలు – వారి తాబేదార్లు –గ్రామాలు విడిచారు. బస్తీలకు చేరారు. గ్రామాలన్నీ 'సంగం' కోటలే. ప్రజాద్రోహి ఒక్కడుకూడా లేడు. గ్రామాలు పెట్టని కోటలు అయినాయి.

ఒకనాటి తెల్లవారు జామున పాతసూర్యాపేట గ్రామం వెలుపల మిలిటరీ దిగింది. ఊరికి దూరంగా దిగింది. ప్రజలు తెలుసుకోకుండా దిగింది. గ్రామంలోనికి వచ్చేవాళ్లను – గ్రామంనుంచి బయటికి వెళ్లేవాళ్లను పట్టుకున్నది. తెల్లవారేవరకు గ్రామాన్ని మిలిటరీ చుట్టుముట్టింది.

అప్పుడు గ్రామానికి అది తెలిసింది. దండోరా మ్రోగింది. ఆడ – మగ – పిల్ల – పెద్ద అందరు వడిసెలలు తీసుకొని ఊరిబయటికి చేరుకున్నారు. ఆడవాళ్లు రాళ్లు అందించారు. మగవాళ్లు వడిసెలలు విసిరారు. రాళ్లు మిలిటరీ వాళ్లను తాకాయి. ఒక ఎత్తుగడగా మిలిటరీ – రాళ్లకు అందని దూరానికి వెనుకకు తగ్గింది.

ప్రజలు అది తమ విజయంగా భావించారు. వారు ముందుకు సాగారు. ఈలోగా చుట్టుపట్ల గ్రామాలనుంచి వేల సంఖ్యలో జనం కూడారు. మిలిటరీవాళ్లు జనాన్ని బయటనే నిలిపివుంచారు.

ప్రజలు ప్రత్యక్ష యుద్ధానికి దిగారు. అది సైనికులను సైతం చకితులను చేసింది. అధికారులు ప్రజలను లొంగిపొమ్మని హెచ్చరించారు. ఆయుధాలను, నాయకులను అప్పగించమని ఆదేశించారు.

"దొరలు – సర్కారు మమ్ములను సర్వనాశనం చేశారు. వారి మాటలు నమ్మం. మా చేతిలో వడిసెల ఉన్నంతకాలం మమ్ములను రుద్రుడు సహితం ఎదిరించలేరు" అన్నారు ప్రజలు. భర్మార్ తుపాకులు పేల్చారు. వడిసెలలు ఇంకా వేగంగా విసిరారు.

మిలిటరీ ముందుకు సాగింది. బ్రెన్‌గన్ పేల్చింది. పాత సూర్యాపేట నరసయ్య – పాతర్లపాటికి చెందిన బిక్షమయ్య నేలకు ఒరిగారు.

అప్పటికి ప్రజలకు మిలిటరీ ఆయుధాలు తెలియవు. వాటిని చూచారు. ఒరిగిన కామ్రేడ్స్‌ను చూచారు. చెదిరిపోయారు. పారిపోయారు. సైనికులు వారిని వెంబడించారు. ఆడ, మగ పిల్లాపాపను పట్టుకున్నారు. విచక్షణారహితంగా హింసించారు.

అదే రోజు బాలెమ్లపై దాడి చేసింది సైన్యం. 200 మందిని పట్టుకొని హింసించింది.

దేవరుప్పలలో సరిగ్గా పాతసూర్యాపేటవలె దాడి – ప్రతిదాడి జరిగాయి. మిలిటరీ కాల్పుల్లో కడివెండికి చెందిన మందడి సోమిరెడ్డి అమరుడయినాడు.

## మల్లారెడ్డి గూడెం

బాలెమ్ల – పాతసూర్యాపేట – దేవరుప్పల అనుభవాలను దృష్టిలో ఉంచుకొని – పార్టీ పోరాట పద్ధతిని మార్చింది. సైనికులు దాడి చేసినప్పుడు ఎదిరించవద్దనీ – జారుకొమ్మనీ ఆదేశాలు ఇచ్చింది. కాని, ఆ ఆదేశం సకాలంలో ప్రజలకు అందలేదు. మల్లారెడ్డి గూడెంలో అప్పిరెడ్డి అమరుడు కావలసి వచ్చింది.

గ్రామ నాయకులు రాత్రిళ్లు అజ్ఞాతంలో ఉంటారు. 29 డిసెంబర్ 1946న మిలిటరీ మల్లారెడ్డి గూడేన్ని ముట్టడించింది. ప్రజలు మామూలు పద్ధతిలో దండోరా మ్రోగించారు. జనం మిద్దెలమీద, ఊరిబయట చేరారు. వడిసెలలు విసిరారు. ఊరు చుట్టూ మొక్కజొన్న పొలాలున్నాయి. మిలిటరీ ఎంత ఉన్నదో కనిపించడం లేదు. ఉభయసేనల మధ్యయుద్ధం జరిగింది. పొద్దు ఎక్కింది. ఉభయ పక్షాలూ స్థిరంగా ఉన్నాయి.

మిలిటరీ అధికారులు – కలెక్టరు లొంగిపొమ్మని ప్రజలను హెచ్చరించారు. ప్రజలు ఖాతరు చేయలేరు. ప్రజల తరఫున ఒకరిని మధ్యవర్తిగా పంపవలసిందని కోరారు. ప్రజలు సంప్రదించుకున్నారు. అప్పిరెడ్డి – మరో నలుగురిని పంపారు.

అప్పిరెడ్డి అలా సాగాడో లేదో మిలిటరీ కాల్పులు జరిపింది. అప్పిరెడ్డి అక్కడికి అక్కడే నేలకు ఒరిగాడు. ఎదురుగా ఉన్న మరొక వ్యక్తి – భర్త వడిసెలకు రాళ్లు అందిస్తుండిన మహిళ – హతులు అయినారు. అనేకమంది గాయపడ్డారు. మిలిటరీ గ్రామంమీద పడింది. ఇష్టాజ్యంగా చిన్నా – పెద్ద, స్త్రీ – పురుష భేదం లేకుండా అందరినీ నానా హింసలు పెట్టింది.

మిలిటరీవారు ప్రజలందరినీ ఒకచోట చేర్చారు. వారిని లారీలు ఎక్కించారు. తీరా లారీలు బయలుదేరేముందు ముస్లిముల్ను దింపారు. ముస్లిములు తాము దిగం అన్నారు. తామూ పోరాటం జరిపాం అన్నారు. అయినా వినలేదు. ముస్లిములను బలవంతంగా దింపారు. సుమారు 400 మందిని తీసికెళ్లారు.

గ్రామం నిరామయం అయింది. ఎడారి అయింది. పాడుబడినట్లయింది. మిగిలిన వారిని ఓదార్చేవారు లేరు. ఆ ఉండిపోయిన తురకలు ఓదార్చారు. కాని, తురకలే దాడికి కారణం అని దుర్మార్గులు పుకారు పుట్టించారు. కాని, తదుపరి అది 'పుకారు'అని తెలిసిపోయింది.

మతకలహాలు చెలరేగలేదు.

ప్రజాపోరాటాల్లో మతకలహాలకు స్థానం ఉండదని నిరూపించబడింది.

భారతదేశంలో మతకలహాలు జరగలేదని నా నమ్మకం. జరిగినవన్నీ మతం పేర జరిగిన రాజకీయ కల్లోలాలే. పాకిస్తాన్ కావాలని జిన్నా జరిపిన మారణ హోమాలు - నర సంహారాలు - మూగ హత్యలు సైతం మతకలహాలు కావు. రాజకీయ అధిపత్యంకోసం మతపు మసిపులిమిన క్షుద్ర రాజకీయాలు

మాత్రమే. నిజాం నవాబు "అనల్ మలిక్" నినాదం కూడా తన పెత్తనం నిలుపుకోవడానికే తప్ప ఇస్లాంను ఉద్ధరించడానికి కాదు.

మతం నరుని - మానవుని చేసి - అతని అంతస్తును దైవత్వానికి దగ్గరకు చేర్చడానికి ఉపకరిస్తుంది. మతానికి ఈర్ష్య లేదు. ద్వేషం లేదు. శత్రుత్వం లేదు. మతానికి సత్యం - సహనం - ప్రేమ - క్షమ ఉన్నాయి.

నరుడు స్వప్రయోజనం కోసం తాను రాక్షసుడు అవుతున్నాడు. మతానికి రాక్షసపురంగు పులుముతున్నాడు. మతాన్ని రాక్షసం చేసి, తాను రాక్షస రాజ్యం ఏలుతున్నాడు!

"మైఖద్ ముసహాఫ్ బసోజ్ అతిష్ అందర్ కా బజన్
సాకిన్ బుత్ ఖానాబాష్ వ మర్దుమ్ ఆ జారీమకున్." ఇది ఫార్సీకవి ఖాజా హోఫిజ్ కవిత.

"త్రాగు మధువు, కాల్చు ఖురాను
కూల్చు మక్కాను, పూజించు ప్రతిమల
హింసించకు మనిషిని మాత్రం!"

ఇది హోఫిజ్ ఫార్సీకవితకు తెనిగింపు.

## పశుబలం - ప్రజాబలం:

నిజాం ప్రభుత్వం – దొరలు అంతటితో ఆగలేదు. నల్లగొండ వరంగల్లు జిల్లాలలో మార్షల్ లా ప్రకటించారు – సైన్యానికి వప్పగించారు. నిజాం నవాబుకు ఉన్న మొత్తం సైన్యం 50,000. అందులో 20,000 సైన్యాన్ని ఈ జిల్లాలలో దింపింది.

గ్రామాలనుంచి పిల్లులవలె పారిపోయారు దొరలు – పటేల్ పట్వారీలు – గుండాలు – వారి తాబేదార్లు. వారందరూ మళ్లీ పులులు అయినారు. గ్రామాలకు తిరిగి వచ్చారు. కక్ష సాధించసాగారు.

వారు యువకులను పట్టుకున్నారు. నాయకులను చూపవలసిందని, వారి జాడ తెలుప వలసిందని నానాయాతనలు పెట్టారు.

గోళ్లలో సూదులు గుచ్చారు

స్తంభానికి వారిని జనపనారతో కట్టి, పైనుంచి నీళ్లు గుమ్మరించారు. నీళ్లు పడుతుంటే నార బిగుసుకుంటుంది. యాతన పెడ్తుంది.

అరిచేతులమీద మంచం కోళ్లు పెట్టారు. మంచంమీద ఎగిరారు.

కారం పూసిన కర్రలు ఆసనాల్లో దూర్చారు.

నోళ్లలో మూత్రించారు

మంచుగడ్డలమీద పడుకోబెట్టి పైనుంచి నీళ్లు పోశారు.

కళ్లలో కారం కొట్టారు. అరికాళ్లను కత్తులతో చీరారు.

ఇలాంటివి ఇంకా అనేక హింసలు పెట్టారు. అయినా, చాల సందర్భాలలో నాయకుల జాడలు వెల్లడించలేదు.

దొరలు – పటేల్ పట్వారీలు గుండాలను వెంటపెట్టుకుని ఇళ్లు దోచారు. ఇళ్లు తగలబెట్టారు. పంటలు కాల్చారు. హింస పురివిప్పి నాట్యం చేసింది.

స్త్రీలను హింసించారు. వారిని దిగంబరంగా తిప్పారు. మానభంగాలు చేశారు. భర్తముందు భార్యను – బావముందు మరదలును అమానుషంగా చెరిచారు. ఆ గ్రామాలను పర్యటించిన కుమారి పద్మజనాయుడు ఇలా అన్నారు:–

**"స్త్రీలను మానభంగం చేయడంలో నాజీలను తలతన్నారు. ఒక పదహారేళ్ల పసిదాన్ని మానభంగం చేయబోయారు. భర్త అడ్డు తగిలాడు. అతని తలకు తుపాకి పెట్టి నిలిపి పెట్టారు. భర్తముందే భార్యను అమానుషంగా అత్యాచారం చేశారు.**

**ఆ గ్రామాల్లో దోచుకోని ఇల్లులేదు. అవమానం లజ్జల బరువుతో క్రుంగని స్త్రీ లేదు. బావను స్తంభానికి కట్టారు. బావముందు మరదలును రాక్షసంగా చెరిచారు. గర్భిణీ స్త్రీలు - బాలెంతలు కూడా అవమానం పాలయ్యారు. ఇంతకన్న ఘోరాలు జరిగాయి. కాని, నేను స్త్రీని. ఇంతకన్న చెప్పడం కష్టం."**

హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానంద తీర్థ నవంబర్ 28, 1946న చేసిన పత్రికా ప్రకటన సంగ్రహం:–

**"సూర్యాపేట మిలిటరీ కాంపువలె ఉన్నది. మిలిటరీ లారీలు జోరుగా తిరుగుతున్నాయి. ఉదయం గ్రామాలకు వెళ్తున్నాయి. లారీలలో జనాన్ని ఎక్కించుకొని తిరిగి వస్తున్నాయి.**

**"నేను బాలెమ్ల వెళ్లాను. ఒక చిన్నపోలీసు అధికారి ఇద్దరు రైతులను కాల్చి చంపాడు. ఇది దారుణం. ఈ కాల్పులపై బహిరంగ విచారణ జరిపించాలి.**

**"మేము పాత సూర్యాపేట వెళ్లాం. మాకు ఒక స్త్రీ - గుండెలు పగిలిన - ఏడ్పులు వినిపించాయి. మేము లోనికి వెళ్లి చూచాం. ఆమె - అంతకు ముందు పోలీసు కాల్పులలో కూలిన వ్యక్తి - భార్య! ఆ గ్రామంనుంచి 170 మందిని - మిలిటరీవాళ్లు - తీసికెళ్లారు. అనేక మంది స్త్రీ పురుషుల శరీరాలపై గాయాలున్నాయి.**

**"గత కొర్ది కాలంగా కమ్యూనిస్టులు ప్రజలతో కలిసి జీవిస్తున్నారు. ప్రజల సమస్యల పరిష్కారానికి కృషి చేస్తున్నారు. వారు ప్రజల్లో చైతన్యం ఆత్మవిశ్వాసం కలిగించారు.**

**"ప్రభుత్వం ఈ మిలిటరీ చర్యలను వెంటనే నిలుపుచేయాలి. అది జరక్కుంటే పరిస్థితులు విషమిస్తాయి."**

ఇలాంటి దారుణ పరిస్థితుల్లో ఒక ప్రహసనం:

1. స్టేట్ కాంగ్రెస్‌మీద నిషేధం తొలగించారు.
2. జాతీయ భావాలు గలవాడనిపించుకొన్న మిర్జా ఇస్మాయిల్ ప్రధాని అయినాడు.
3. నిజాం పుత్రుడు ముకర్రం జాహ్ కల్లోలిత ప్రాంతాలను దర్శించాడు. 'ప్రజలు నా బిడ్డలు. వారి బాధలు నా బాధలు' అని బట్టలు పంచి పెట్టాడు!
4. ప్రధాని మిర్జా ఇస్మాయిల్ కూడా ఆడంబరంగా పర్యటించాడు.

ఈ అమానుష హింసాకాండ 1947 మే వరకు కొనసాగింది. అయినా, ప్రజలు బలపడ్డారు. ప్రజా శత్రువులను ఎదిరించారు.

1. పాత సూర్యాపేటలో దొరను, పోలీసు పటేలును చితకబాదారు. కాళ్లూ చేతులు విరిచేశారు.
2. చందుపట్లలో దొరను బండిలోంచి గుంజి బాదారు.
3. కడివెండిలో దోచుకోవడానికి వచ్చిన గుండాలను ఎదిరించారు. దేహశుద్ధి చేశారు.
4. సీతారాంపురంలో పోలీసు పటేలును హతమార్చారు.
5. రామన్నపేటలో దొరను కొట్టి చంపారు.
6. బక్కగుంతుల గూడెంలో దొరను, దొరతమ్ముణ్ణి పోరాటంలో హతమార్చారు.

ఈ చైతన్యజ్వాల దొరల – పటేల్ పట్వారీల – ప్రజాద్రోహుల – గుండాల గుండెల్లో మంటలు రేపింది. వారు ప్రాణభయంతో గ్రామాలు వదిలారు. బస్తీలు పట్టారు.

గ్రామాలు మళ్లీ ప్రజలపరం అయినాయి.

గ్రామాల్లో ప్రజాద్రోహుల ఆస్తులకు రక్షణ కరువయింది. సాయుధ సైనికులు దొరల ధన – మాన –ప్రాణాలను రక్షించలేకపోయారు.

**గ్రామాలలో ప్రజలకు అరుణోదయం అయింది.**

**బస్తీలలో దొరలకు తిమిరోదయం అయింది.**

## ఇరవయి ఒక్కటి

### అర్ధరాత్రి అరుణోదయం:

అరవయ్యేండ్ల అనంత సంగ్రామం తరువాత భారతజాతి విముక్తిని సాధించింది.

15 ఆగష్టు 1947 భారతజాతికి వెలుగుల దినం. ఉత్సవ దినం. ఉత్సాహ దినం, పర్వదినం, పరువాల దినం.

భారతజాతికి రెండు శతాబ్దాల అంగ్రేజుల దాస్యం నుంచి విముక్తి గలిగింది. ఇది స్థూల దృష్టి. భారతజాతి ఎన్నో శతాబ్దాలుగా "స్వరాజ్యం" కోల్పోయింది. సురాజ్యమూ నష్టపోయింది.

మనం "స్వరాజ్యం" సాధించుకున్నాం. ఇక మనను పైవాడు పాలించడు. మనమే పాలించుకుంటాం. ఇది మన దేశం. దీన్ని మనమే చక్కబరచుకుంటాం.

15 ఆగష్టు 1947 అర్ధరాత్రి బ్రిటిష్ పతాకం – 'యూనియన్ జాక్' దిగిపోయింది. భారత జాతీయ పతాకం – త్రివర్ణకేతనం – సగర్వంగా ఎగిరింది. అప్పుడు నెహ్రూ అన్నారు:–

'Long ago, we made a tryst with destiny and now the time comes when we shall redeem our pledge, not wholly or in full measure but very substantially. At the stroke of midnight hour, when the world sleeps, India will awake to life and freedom.'

1947, 15 ఆగస్టునాటి నా ఆనందం – సంతోషం – ఆవేశం – ఆతురత పదాలకు అందనివి. ఈ ఉత్సవాలు దర్శించడానికి బెజవాడ వెళ్లాలని ఆతురత. కాని, ఇక్కడి పరిస్థితులు భయంకరంగా ఉన్నాయి. అమ్మను, పిల్లలను వదిలి వెళ్లడం అసాధ్యం. గార్లలో కనీసం రేడియో లేదు. అప్పటికే అనేక పత్రికలను నిజాం ప్రభుత్వం నిషేధించింది. రాజ్యంలో రజాకార్లు విలయతాండవం చేస్తున్నారు.

గార్ల గ్రంథాలయంలో రహస్యంగా పదిమంది మిత్రులం కలిశాం. పేర్లు గుర్తులేవు. కాని, కొడుమూరి వేంకటేశ్వరరావు – నకిరెకంటి కృష్ణమూర్తి – చందా వీరభద్రం – మాటేటి కిషన్‌రావు ఉన్నారు. పానుగంటి నాగేశ్వరరావు లేడు. అతను పార్టీ ఆదేశం మీద అజ్ఞాతంలోకి వెళ్లిపోయాడు.

మేము సరిగ్గా అర్ధరాత్రి – తలుపులు మూసిన గ్రంథాలయంలో దీపాలు వెలిగించాం. మిఠాయీలు పంచుకున్నాం. అప్పుడు అక్కడ ఉన్న అగ్ని గుండాన్ని మరిచాం. భారతదేశం స్వాతంత్ర్యం సముపార్జించటం గురించి ఉపన్యాసాలు ఇచ్చుకున్నాం.

"లోకం నిద్రిస్తున్నప్పుడు భారతదేశం మేల్కొన్నది" అన్నారు జవాహర్‌లాల్ నెహ్రూ.

భారతదేశంలో అంతర్భాగం అయిన నిజాం రాజ్యంలో మేము చీకట్ల చిందుల్లో రహస్యంగా స్వాతంత్ర్యదినం జరుపుకోవలసి వచ్చింది! భారత స్వాతంత్ర్యదినోత్సవం నాడు మేము కరకు తురక పాలనలో – ఆజాద్ హైదరాబాద్ సంస్థానంలో – అసఫ్జాహీ కామెర్ల పతాకం కింద నలుగుతున్నాం!!

సామ్రాజ్యవాదులు సాధారణంగా అధికారం వదులుకోరు. అసలు అధికారమే అలాంటిది. దాన్ని ఎవడూ వదలడు. స్వచ్ఛందంగా అధికారం వదలుకున్నవారు చరిత్రలో అరుదు. అర్థం – అధికారం ఈ రెంటినీ వదిలించాలి తప్ప వదులుకోరు. ఈ సూత్రం చిన్న కుటుంబ యజమానినుంచి సామ్రాజ్యవాదుల వరకు వర్తిస్తుంది. అమెరికా ప్రజలు యుద్ధం చేసి, బ్రిటిషు ప్రభుత్వాన్ని తరిమివేశారు.

బ్రిటిషువారు భారతదేశాన్ని విధిలేక విడిచిపోయారు.

1. 1939లో ప్రారంభం అయిన రెండో ప్రపంచ సంగ్రామం నాజీ నియంత హిట్లర్ ఓటమితో 1945లో ముగిసింది. రష్యాలోని సమాజవాద ప్రభుత్వం చావు దెబ్బ కొట్టడంవల్లనే హిట్లరు – అతని నాజీయిజం – అంతం అయినాయి. ఈ యుద్ధం ఆరుకోట్ల నిండు ప్రాణాలను బలిగొన్నది.

అమెరికా అటంబాంబు జర్మనీమీద వేయవచ్చుకదా! వేయలేదు. తమజాతి యూరోపియన్లను రక్షించుకోవాలి. ఇది "కృణ్వంతో విశ్వమార్యం" అని హిట్లర్ జాత్యహంకారంకన్న ఏమాత్రం తక్కువకాదు!

అమెరికా – ఆసియాప్రజల మీద – అటంబాంబులు ప్రయోగించింది. జపానులోని హిరోషిమా – నాగసాకి నగరాలమీద – విచక్షణారహితంగా బాంబులు వేసింది. ఈ అణుబాంబుల వల్ల లక్షా ఇరవైవేలమంది హతులయారు. లక్షలమంది

క్షతగాత్రులయినారు. అర్ధ శతాబ్దం గడిచినా అణుబాంబు బాధితులు ఇంకా కోలుకోలేదు.

**నేను ఇది వ్రాస్తున్న 5-8-94న హిరోషిమా నాగసాకీలలో నాటి దురంతాన్ని గుర్తుచేసుకుని వేల కొలది మంది ప్రార్థనలు చేస్తున్నారు. మానవలోకం నుంచి అణుబాంబు అంతం కావాలని జపాను ప్రభుత్వం ప్రకటించింది.**

రెండవ ప్రపంచ సంగ్రామ విజయం – సుమారుగా – ప్రజావిజయం. ఇది సోషలిస్టు విజయం. యుద్ధం ముగిసిన తరువాత వెలువడిన 'ఖేమీజింగ్' వారపత్రికలో సుత్తీ కొడవలి అరుణ పతాకం కింద సజ్జాద్ జహీర్ కవిత అచ్చయింది. 'సుర్ఖ్ పర్చమ్ ఉడ్‌ర్‌హామైసీన్ ఏ బర్లిన్ పె ఆజ్' – నాకు ఇంకా గుర్తుంది. బెర్లిన్ గుండెమీద ఎర్రజండా ఎగురుతున్నది అని దాని అర్థం.

ప్రపంచ ప్రజల ప్రజాపోరాటాలకు బలం చేకూరింది. సామ్రాజ్యవాదులు ప్రజలను పాలించ కలిగే స్థితిలో లేరు. ఎనిమిదవ దశకంలో – రానున్న శతాబ్ది గురించి నావ్యాసం ఆకాశవాణిలో ప్రసారం అయింది. "ఇది బానిసల జాతులకు విముక్తి కలిగించిన శతాబ్దం. ఆసియా – ఆఫ్రికా ఖండాలనుంచి సామ్రాజ్యవాదాన్ని తరిమి కొట్టిన యుగం. శ్వేతజాతి అహంకారం చివరి ఊపిరితో ఉన్న రాక్షస ప్రభుత్వం మీద నల్లజాతి మాత్రమే కాదు – నాగరక ప్రపంచం యావత్తూ తిరుగులేని ఉద్యమం సాగిస్తున్నది. ఈ శతాబ్దం ముగియకముందే దక్షిణాఫ్రికా – నమీబియాలలో స్వాతంత్ర్య భానూదయం అవుతుందని ఆశిద్దాం" అని రాశాను.

నా ఆశయం ఫలించింది. దక్షిణాఫ్రికా స్వాతంత్ర్యదిన వేడుకలు T.V.లో చూచాను. నా ఒడలు పులకరించింది. నాకే స్వాతంత్ర్యం వచ్చినంత పొంగిపోయాను.

2. భారతదేశంలో కాంగ్రెస్, కమ్యూనిస్టు, సోషలిస్టుల ఉద్యమాలతో ప్రజలలో అనంతమైన చైతన్యం వచ్చింది. వారు పరాయి ప్రభుత్వాన్ని సహించే స్థితిలో లేరు. సైన్యం సహితం వారి మాట వినేటట్లు లేదు. నావికుల తిరుగుబాటు ఇందుకు నిదర్శనం. అమెరికాలో వలె కాక – గౌరవంగా బయటపడడం మంచిదని సామ్రాజ్యవాదం భావించింది.

3. బ్రిటన్‌లో జరిగిన ఎన్నికల్లో చర్చిల్ నాయకత్వంలోని కన్సర్వేటివ్ పార్టీ ఓడిపోయింది. ప్రజలు విచిత్రులు. రెండో ప్రపంచ యుద్ధంలో అత్యంత సమర్థవంతంగా దేశాన్ని రక్షించిన చర్చిల్‌ను ఓడించారు. ఇందుకు ప్రపంచంలో వస్తున్న ప్రగతివాదం కారణం. ప్రజలు లేబర్ పార్టీని గెలిపించారు.

సామ్రాజ్యవాదులు విధిలేక భారతదేశం వదిలారు అనడానికి ఇవి కొన్ని నిదర్శనాలు మాత్రమే. చరిత్ర తెలియని – తెలుసుకోలేని నేటి యువత – బ్రిటిష్‌వాడు. దయాధర్మంతో వదిలిపోయాడనే తప్పుడు అభిప్రాయంతో ఉంది.

సామ్రాజ్యవాద విధానం – విభజించడం. వాళ్లు వెళ్లిపోయేపుడు దేశాలను విభజిస్తారు. ఒక ముక్క అయినా – కొంతకాలం అయినా తమ చెప్పుచేతల్లో ఉంటుందని వారి అభిప్రాయం. వారు వియట్‌నామ్‌ను – కొరియాను విభజించారు. వియత్నాం ప్రజాపోరాట విజయం వియత్నాంను ఏకం చేసింది. ఉత్తర – దక్షిణ కొరియాలు, పాకిస్తాన్– భారత్ స్థితిలోనే ఉన్నాయి!

సామ్రాజ్యవాదుల కుట్ర ఫలితంగా భారతదేశం చీలింది. పాకిస్తాన్ ఏర్పడింది. మౌంట్ బాటన్ అసమర్థతవల్ల చీలినదేశంలో రక్తం నదులయి ప్రవహించింది.

సామ్రాజ్యవాదుల మరో కుట్ర ఫలించి ఉంటే దేశం మూడు కాదు – వందల ముక్కలు కావలసింది. భారతదేశంలో తమ ఉనికిని కాపాడుకోవడానికి సుమారు 500పై సంఖ్యగల సంస్థానాలను అర – పావు స్వతంత్రంగా ఉంచారు. ఇంగ్లీషు వారు వెళ్లిపోతూ ఆ సంస్థానాధీశులందరికీ స్వాతంత్ర్యం ఇచ్చారు. వారు భారత్‌లో కాని – పాక్‌లోగాని చేరవచ్చు. లేదా స్వతంత్రంగా ఉండవచ్చు.

**ఇది ముఖ్యంగా నిజాం రాజ్యాన్ని దృష్టిలో ఉంచుకొని పన్నిన పన్నాగం. అటు పాకిస్తాను – ఇటు నడిబొడ్డు హైదరాబాదు రాజ్యం తమ స్థావరం చేసుకోవాలని పథకం. స్థావరాలు కాకున్నా భారత ప్రభుత్వానికి బెడద కావచ్చు- సమస్య కావచ్చు - తలనొప్పి కావచ్చు. భారతదేశాన్ని ఇరకాటంలో పెట్టడానికి చేసిన కుట్ర ఇది.**

'జన్మజన్మాల బూజు' నిజాంరాజు ఈ అవకాశం కోసరమే ఎదిరి చూస్తున్నాడు. గద్దెకు ఎక్కిన 1911 నుంచి కలలు కంటున్నాడు. ఒంటె పెదవులకోసం నక్కవలె ఎదిరిచూస్తున్నాడు. బ్రిటిషు ప్రభుత్వమూ – మహమ్మదలీ జిన్నా అందుకు ఆ 'ముసలినక్క'ను ఉసికొల్పారు.

**12 జూన్ 1947న నిజాం తన సర్వతంత్ర స్వతంత్రం ప్రకటిస్తూ, ఆజాద్ హైదరాబాదు అవతరణ గురించి ఫర్మాను జారీచేశాడు. ఆజాద్ హైదరాబాద్ - ఆలా హజ్రత్ పాయిందాబాద్ అనే రజాకార్ల నినాదాల మధ్య చార్‌మినార్ మీద ఆసఫ్జాహీ పతాకాన్ని ఎగురవేశాడు.**

ఇదివరకే మనవి చేసినట్లు అర్థానికి – అధికారానికి మతాలు – కులాలు – ప్రాంతాలు – దేశాలూ ఉండవు. అర్థాన్ని – అధికారాన్నీ ఎవడూ వప్పగించడు. గుంజుకోవలసిందే. బలం శక్తి స్తోమతలు ఉంటే 500 మంది సంస్థానాధీశులూ నిజాంవలె విర్రవీగేవారే. భారత ఉపప్రధాని సర్దార్ వల్లభాయ్ పటేల్ చతురత – రాజకీయజ్ఞత –బలప్రదర్శన వల్ల మిగతా సంస్థానాలు భారతదేశంలో లీనం అయినాయి. పాకిస్తాన్‌లో ఉరితీయబడిన ప్రధాని జుల్ఫికార్ అలీ భుట్టో జన్మస్థానం 'జునాగఢ్' సంస్థానంకోసం బలప్రయోగం చేయాల్సి వచ్చింది.

**అధికారానికి మతంలేదు అనటానికి కాశ్మీర్ మహారాజా 'హరిసింగ్' చక్కని ఉదాహరణ: కాశ్మీర్‌లోని ప్రధాన ప్రాంతంలో ముస్లిములు అధిక సంఖ్యాకులు. రాజు హిందువు. భారతదేశం స్వతంత్రం అయింది కదా! అతనూ నిజాంవలె స్వాతంత్ర్యం ప్రకటించుకున్నాడు. ఆచంద్రార్కం పాలిస్తాననుకున్నాడు!**

పాకిస్తాన్ మత ప్రాతిపదిక మీద ఏర్పడిందని జిన్నా ముస్లిములను నమ్మించాడు. కాశ్మీర్‌లోని ముస్లిము సోదరులను విముక్తం చేయడానికి పాకిస్తాన్ కాశ్మీర్ మీద దండెత్తింది. అప్పటికీ హరిసింగ్ భారతదేశంలో చేరలేదు. భారత్ సైన్యాలు కాశ్మీరంలో దిగాయి. పాకిస్తాన్ సైనికులను తరిమాయి – ఇప్పటి అధీన రేఖ

వరకు. అప్పుడుగాని హరిసింగ్ భారతదేశంలో చేరలేదు. ఆ చేరడం కూడా అనేక షరతులు పెట్టి చేరాడు. అందుకే కాశ్మీరానికి ప్రత్యేక ప్రతిపత్తి!

మహారాజా హరిసింగ్ తన అధికారాన్ని స్వచ్ఛందంగా వదులుకోలేదు. అటు పాకిస్తాన్ - ఇటు భారత్ వత్తిడివల్ల వదులుకున్నాడు!

నేను ఇదివరకే మనవి చేసినట్లు కాంగ్రెస్ సంస్థానాల్లో ప్రజా ఉద్యమాలు నిర్వహించి ఉంటే ఈ రోజు కాశ్మీర్ సమస్య ఇంత జటిలం అయ్యేదికాదు. అయితే, ఆనాటి స్థితిగతులను ఈనాటి కళ్ళద్దాలతో చూడడం అర్థం లేనిది! అప్పటి కాంగ్రెస్‌కు రెండు పోరాటాలు సాధ్యం కాలేదేమో! లేదా 500 మంది సంస్థానాధీశులను శత్రువులను చేసికొనదలచలేదేమో! బ్రిటిషు ప్రభుత్వం సంస్థానాధీశులకు స్వాతంత్ర్యం ఇస్తారని ఊహించలేదేమో!

అది కాంగ్రెస్ బలహీనత మాత్రం అగును.

నిజాం నవాబు తన గద్దెను కాపాడుకోదలచాడు. ఒక రాజ్యం సాధించడానికి జిన్నా మతాన్ని ఆశ్రయించాడు. ఉన్న రాజ్యాన్ని రక్షించుకోవడానికి నిజాం నవాబ్ మతాన్ని ఆశ్రయించాడు. అతడు ఇదివరకే అవలంబించిన "అనల్‌మలిక్" సిద్ధాంతానికి మరిన్ని మెరుగులు దిద్దాడు.

భారతదేశం వత్తిడి తెస్తే పాకిస్తాన్‌లో చేర్తానని బెదిరించాడు. భారతదేశపు నడిబొడ్డున దక్షిణ పాకిస్తాన్ ఏర్పరుస్తానని బుకాయించాడు. ఇవన్నీ వట్టి బెదిరింపులే! అతడు పాకిస్తాన్ పెత్తనం కూడా సహించడు!

నిజాం నవాబు – బహదూర్‌ఖాన్ నాయకత్వంలో – పచ్చి ముస్లిం 'మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్' స్థాపించాడు. బహదూర్ ఖాన్ అల్లాను చేరుకున్నాడు. నిజాం – ఖాసిం రజ్వీని పట్టాడు. ఖాసిం రజ్వీకి బహదూర్ ఖానులోని హుందాతనం లేదు. రజ్వీ క్రూరుడు. నీచుడు. మతదురహంకారి. బహదుర్‌ఖాన్‌ను మించిన వక్త. అతని ఉపన్యాస ధోరణి – తీవ్రత – భాషాప్రయోగం అత్యంత ఆకర్షణీయంగా ఉంటాయి. అతని సభలకు వేలమంది వచ్చి గంటల తరబడి వినేవారు. 'అయిసా సన్నాటా ఛాజాయెకె మేరీ ఆవాజ్ చార్మినార్‌సే కింగ్ కోఠీ పహుఁచే' – నా ధ్వని చార్‌మినార్ నుంచి కింగ్‌కోఠీ చేరేంత నిశ్శబ్దం ఆవరించాలి అనేవాడు. "సన్నాటా"కు నిశ్శబ్దంకన్న పదంలేదు. "లాల్‌ఖిలేపర్ అసఫ్‌జాహీజండా లహెరాయ్‌గా ఔర్ హమారీ తల్వారేఁ మఛీబందర్‌కే ఖలీజె బంగాల్‌మెఁ ధోయెంగె" – లాల్ ఖిలామీద ఆసిఫ్జాహీ పతాకం రెపరెపలాడుతుంది. మన కరవాలాలు బందరు బంగాళాఖాతంలో కడుగుతాం!

రజ్వీ ఉపన్యాసాలు సమ్మోహనాలు. అవి నిప్పులు చెరుగుతాయి. రక్తం మండిస్తాయి – పారిస్తాయి. మతాన్ని మసి చేస్తాయి. మనిషిని రక్కసిని చేస్తాయి.

యూనియన్ ప్రాంతానికి వలస పోయినపుడు కూడా రజ్వీ ఉపన్యాసాలు ఉర్దూలో చదవడానికి "రహన్మా–ఏ–దక్కన్" దినపత్రిక తెప్పించుకునేవాణ్ణి!

నిజాం నవాబు –రజ్వీని 'త్వమేవ శరణంమమ' అన్నాడు. "అన్యధా శరణం నాస్తి" అన్నాడు. అనధికారికంగా అధికారం రజ్వీ హస్తగతం చేశాడు.

అసలే మతపిచ్చి. అందునా అధికారం తాగాడు. పైగా ఆయుధం చేతిక వచ్చింది. రజ్వీ సుమారు లక్షమంది – రక్తపిపాసువులు – మతదురహంకారులూ – అన్యమతద్వేషులూ అయిన 'రజాకార్' సేనను సిద్ధం చేశాడు. వారు పురాణాల్లో రాక్షసుల్లా స్వైర విహారం చేశారు. మిర్జాఇస్మాయిల్ తరువాత ప్రధాని అయిన చిత్తారే నవాబ్ మీసాలు పట్టుకొని నోట్లో ఉమ్మేసటంతటి సాహసం చేశారు. నిజాం ప్రధానిని మార్చుకున్నాడు. కాని, రజ్వీని పల్లెత్తి మాట అనలేదు. లాయకలీని తెచ్చుకున్నాడు.

నిజాం నవాబు రజ్వీని రాజ్యంమీద వదిలి ఊరుకోలేదు. భారతదేశంలో మత కలహ బాధితులను వేనవేలుగా రప్పించాడు. 'పనాహ్‌గజీర్' – శరణార్థులు అని వారికి పేరు పెట్టాడు. వారికి ఆశ్రయం ఇచ్చాడు. తాను ఇస్లాంమత రక్షకుడను అని చాటుకున్నాడు.

పనాహ్‌గజీర్‌కు చెంది ఒక వింత సంఘటన జరిగింది. శరణార్థులు ఫుట్‌పాత్‌లమీద ఉండేవారు. వంటలు సంసారాలు అన్నీ ఒక్కడే. ఫుట్‌పాతుల మీదనే దుకాణాలు పెట్టుకునేవారు. చిన్న చిన్న హోటళ్లు కూడా వెలిశాయి. వాళ్లు కారు చవకగా – అర్ధరూపాయికి అనుకుంటా – ప్లేటు బిర్యానీ అమ్మారు. హైదరాబాదు జనం సొంతం ఎగబడ్డారు. ఇంత చవకగా ఎలా సాధ్యం అని ఎవడూ ఆలోచించలేదు. కొందరు వంటలే చేసుకోలేదు. ఇలా కొంతకాలం సాగింది.

రజకులు – చాకళ్లు – తమ గాడిదలు కనిపించడం లేదని వెతకసాగారు. తుదకు పోలీసువారికి మొరపెట్టుకున్నారు. రక్షక భటులు రంగమున దిగినారు. అన్వేషణము సాగించినారు. వారికి గార్ధభముల ఎముకలు చర్మములు లభించినవి. వానిని చూచినారు. రక్షక భటులే కల్లోలితులు అయినారు. మరింత పరిశోధించినారు. అప్పుడు తేలినదేమనగా – శరణార్థులు గార్ధభములను వధించి కూడు చేసి అమ్ముచున్నారని! తెల్లవారి ఉర్దూ పత్రికలలో వార్త –

"గధేకీ బిర్యానీ – ధోబియోంకీ పరేషానీ" – గాడిదల బిర్యానీ – రజకుల పరేషానీ!

## "తస్మాద్యుధ్యస్వ భారత్":

1947లో స్టేట్ కాంగ్రెస్ ప్రధమ మహాసభలు జరిగాయి. స్వామి రామానంద తీర్థ అధ్యక్షత వహించారు. స్వామీజీ – వారి వర్గము ప్రగతి భావాలు కలది. నిరంతరం చేస్తూ ఉండిన – బాధ్యతాయుత ప్రభుత్వం అనే నినాదం నుంచి ముందడుగు వేసింది. నిజాం రాజ్యం భారతదేశంలో లీనమై పోవాలనే తీర్మానం చేయడం జరిగింది.

తీర్మానాన్ని బూర్గుల రామకృష్ణరావుగారు ప్రతిపాదించారు. తీర్మానంలో వాడిన పదజాలం విషయంలో తీవ్రమైన చర్చ జరిగింది. భాష సౌమ్యంగా ఉండాలని బూర్గుల వర్గం వాదించింది. ఆనాటి పరిస్థితులు, ప్రజల ఆవేశ కావేశములను దృష్టిలో ఉంచుకొని భాష తీవ్రంగా ఉండాలని స్వామీజీ వర్గం అభిప్రాయపడింది. స్వామీజీ వర్గం కోరిన పదజాలంతోనే తీర్మానం ఆమోదించబడింది.

ఒక విషయం గమనించాలి. స్వామీజీ వర్గంలో యువకులు, ప్రగతి వాదులు ఉన్నారు. వారు కమ్యూనిస్టుల సిద్ధాంతంతో కాదు కాని - కార్యక్రమంతో ఏకీభవించారు. బూర్గుల వర్గం కమ్యూనిస్టు వ్యతిరేకత మాత్రం ప్రదర్శించింది.

**కాంగ్రెసులో గ్రూపులు - ముఠాలు - వేరు వేరు సిద్ధాంతాలు మార్గాలు సర్వసాధారణం. కాబట్టి అప్పటికి స్థూలంగా కాంగ్రెసులో రెండు వర్గాలు, వాదాలు ఏర్పడ్డాయి. స్వామీజీ వర్గం - బూర్గుల వర్గం.**

నిజాం నవాబు - హైదరాబాదును ఇండియన్ యూనియన్‌లో చేర్చాలనే ఉద్యమాన్ని కాంగ్రెస్ ప్రారంభించింది. సత్యాగ్రహం చేయాలని పిలుపు నిచ్చింది. బూర్గుల రామకృష్ణారావు - కొండా వెంకట రంగారెడ్డి యుక్తంగా అనేకమందిని ప్రభుత్వం నిర్బంధంలోకి తీసుకున్నది. తరువాత విడుదల చేసింది.

ఈ సందర్భంలో కాంగ్రెసువారు ప్రకటించిన కార్యక్రమాలను కమ్యూనిస్టులు కూడా - వేరుగా, ప్రత్యేకంగా అమలు జరిపారు. కాంగ్రెసువారు ఊరేగింపులు - సభలు - హర్తాళ్లు నిర్వహించారు. కమ్యూనిస్టులు సహితం కాంగ్రెస్, కమ్యూనిస్టు జండాలు పట్టుకొని సభలు సమావేశాలు జరిపారు.

1. కాంగ్రెస్‌వారు విద్యార్థులను విద్యాలయాలను బహిష్కరించమని పిలుపు ఇచ్చారు. వేలకొలది విద్యార్థులు కళాశాలలు వదిలారు. రజాకార్ల దౌర్జన్యాల మూలంగా కాలేజీలు నడవడం కూడా కష్టం అయింది. ఈ కార్యక్రమాన్ని కమ్యూనిస్టులు కూడా బలపరిచారు. వాస్తవానికి విద్యార్థిలోకంలో కమ్యూనిస్టులకే పలుకుబడి ఎక్కువ. వారు కాలేజీలు వదిలిన విద్యార్థులను వలంటీర్లుగా, అనంతరం గెరిల్లాలుగా చేర్చుకున్నారు. ఉద్యమం జయప్రదం అయింది. ఇందుకు కాంగ్రెస్ కార్యక్రమం - రజాకార్ల దౌర్జన్యం - కమ్యూనిస్టు ఆర్గనైజేషను కలిసి ఉపకరించాయి.
2. నిజాం రాజ్యపు సరిహద్దుల్లో కరోడ్గిరి కచేరీలు - కస్టమ్స్ ఆఫీసులు ఉండేవి. అవి నిజాం స్వాతంత్ర్యానికి చిహ్నాలు. కాంగ్రెస్ వాటిని స్తంభింపచేయాలని పిలుపు ఇచ్చింది. కమ్యూనిస్టులు కూడా ఈ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. తెలంగాణంలోని అనేక కరోడ్గిరి చౌకీలను - రికార్డులను ధ్వంసం చేశారు.
3. కాంగ్రెస్ వారు గ్రామోద్యోగులను తమ పదవులు వదల వలసిందని పిలుపు ఇచ్చారు. ఆనాటి గ్రామ పరిస్థితుల్లో పటేల్ పట్వారీలు పని చేసే స్థితిలో లేరు. గ్రామాల్లో ప్రభుత్వం లుప్తం అయిపోయింది. రజాకార్ల దౌర్జన్యాలు అధికం అయినాయి. గ్రామాలను సుమారు కమ్యూనిస్టులు వశపరచుకున్నారు. హిందూ పటేల్ - పట్వారీలు సుమారు అందరూ పదవులు వదలుకున్నారు. బస్తీలకో - యూనియన్ ప్రాంతాలకో - వలస పోయారు.
4. కాంగ్రెస్ వారు తాటిచెట్లు - ఈతచెట్లు నరకి వేయవలసిందని - కల్లు దుకాణాలను నిషేధించవలసిందని తీర్మానించారు. ఇందుకు కొంతవరకు కమ్యూనిస్టులు తోడ్పడ్డారు. కాంగ్రెసువారు తమ తీర్మానం ద్వారా నిజాం రాబడిని నిలుపు చేయడానికి ప్రయత్నించారు. ప్రభుత్వ వ్యతిరేకం అయిన ఏ తీర్మానాన్ని అయినా అమలు చేయడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారు. వేల కొలది ఈత - తాటిచెట్లను - కొట్టివేశారు.

ఈనాడు మనం చెట్లు కొట్టడాన్ని వ్యతిరేకిస్తున్నాం. అదికాక తాటి చెట్టు పల్లెప్రజల కల్పవృక్షం. అది కల్లుకు మాత్రమే కాదు - అనేక వాటికి ఉపకరిస్తుంది. తాటి ఆకులు ఇంటి కప్పులకు పనికి వస్తాయి. వాటితో చాపలు - బుట్టలు అల్లుతారు. తాటి చెట్టు ఇళ్లకు దూలాలుగా - కాలవలు దాటడానికి వంతెనగా, నీరు పారడానికి క్రెయినుగా ఉపకరిస్తుంది. వీటిని కొట్టి వేయడం సమంజసం అనిపించదు. అయితే, నాటి స్థితిగతులను - ఈనాటి దృక్పథంతో చూడడం సరికాదు.

రాజకీయులు – ఇంకా ఆలోచించే ఓపిక ఉంటే – కొన్ని విషయాలు గ్రహించాలి.

1. ప్రజలు ప్రభుత్వాన్ని వ్యతిరేకించడానికి – కూల్చడానికి సిద్ధంగా ఉన్నారు. ఇందుకు రాజకీయ పరిస్థితులే కారణం.
   i) బ్రిటిషిండియాకు స్వాతంత్ర్యం వచ్చింది. దీనిని తెలంగాణ ప్రజల అందరూ – వర్ణవర్గ రాజకీయాలకు అతీతంగా గ్రహించారు. తాము స్వాతంత్ర్యం సముపార్జించుకోవాలని కృతనిశ్చయము అయినారు.
   ii) నిజాం నవాబుల తరతరాల దోపిడిని ప్రజలు సహించారు. కాని, నిజాం సర్వతంత్ర స్వతంత్రం ప్రకటించడాన్ని ప్రజలు సహించలేదు. దానిని సర్వ విధాలా వ్యతిరేకించ సంకల్పించారు.
   iii) నిజాం రాజ్యాన్ని భారతదేశంనుంచి వేరు చేయడాన్ని ప్రజలు ఏమాత్రం సహించలేక పోయారు. భారత రాజ్యాంగం నుంచి నిజాం రాజ్యాన్ని విడదీయడం బిడ్డను తల్లినుంచి విడదీయడంగా - దూడను పశువునుంచి విడదీయడంగా భావించారు. భారత ప్రధాన ప్రవాహంలో కలవడానికి విశ్వనాథ 'కిన్నెరసాని'లా ఉరుకులు పెట్టారు. ఎంతటి త్యాగాల కయినా సిద్ధం అయినారు.
   iv) నిజాం రాజ్యాన్ని పాకిస్తాన్ చేస్తాననే నిజాం పిశాచి నినాదం – తురకలను పెంచడానికి అతడు పడిన ఆతురత – చేసిన కర్చు – పిలిపించిన తురకలు – అవునన్నా – కాదన్నా మతపరంగా అత్యధిక సంఖ్యాకులయిన హిందువులను రెచ్చకొట్టింది. దొంగ పదవులు అధిష్టించిన కొందరు మంత్రులు సహితం నిజాం 'తురకీకరణ'ను మనసా వాచా కర్మణా వ్యతిరేకించారు. నిజాం దక్షిణ పాకిస్తాన్ కాకుండా రక్షించుకోవడానికి తమ ప్రాణాలు పణంగా పెట్టారు.
2. రాజకీయవాదులు – రాజకీయ పార్టీలు – రాజకీయ సిద్ధాంతాలు ఎంత పటిష్టమయినవి అయినా – ఎంత బలవంతములు అయినా ప్రజల మూడ్‌ను అనుసరించి ఉద్యమాలు నిర్వహించవలసిందే. అంతేకాని, స్వంతబలంతో ఉద్యమాలు నిర్మించడం అసాధ్యం మాత్రమే కాదు – అసంభవం.
   i) వర్తక – వాణిజ్య – వ్యాపార సంస్థలు – పారిశ్రామిక వేత్తలు తమకున్న ప్రకటనల సామర్థ్యంతో వారి ఉత్పత్తులకు ప్రజలను బానిసలను చేయగలరు. కాని, రాజకీయ పక్షాలు వాగాడంబరం – ప్రచార స్తోమత – తాత్కాలిక ఆవేశాలతో ఉద్యమాలు నిర్మించలేవు.

ఒక్కొక్కసారి తాత్కాలికంగా – రాజకీయ పక్షాలు – ఇంజెక్టు చేసిన ఆవేశాలు – ఉద్రేకాలు – దొంగకావేషాలు – అలజడులను సృష్టించవచ్చు. వాటికి – అల్ప దృష్టిగల రాజకీయ పార్టీలు – విజయంగా భ్రమపడి విర్రవీగుతాయి. కాని, స్పష్టంగా గుర్తుంచుకోవలసిన విషయం ఏమంటే – అలజడులు ఉద్యమాలు కావు.

ii) **ప్రజలకు తెలివి లేదనుకోవడం రాజకీయ పక్షాల మూర్ఖత్వం - బుద్ధి హీనత - మూఢత్వం.** ఎలాంటి రాజకీయ చైతన్యం లేనివారు – బాంచెను దొరా, గులాపోణ్ణి అని పడివున్న జనం – మధ్యయుగాలనాటి దోపిడీకి అలవాటుపడిన జనం తెగిన తీవల కోటిరతనాలవీణ – తెలంగాణ జనం తమ మంచిని తెలుసుకోగలిగారు.

ప్రజలా సర్వవేళలు తమ మంచిని నిర్ణయించగలరు. తమకు మేలు చేసే పక్షాన్ని గుర్తించగలరు. దుష్టులను ఎదిరించగలరు. దుష్టులను శిక్షించగలరు. ధర్మమును స్థాపించగలరు. వారు జనతా జనార్దనులు.

*"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం*
*ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే."*

అన్న శ్రీమద్భగవద్గీతలోని 'చేతావని'ని రాజకీయ పక్షాలు గుర్తించడం వాటికి క్షేమం కరం!

iii) ఉద్యమాలు విజయవంతం కావడానికి రాజకీయ – సాంఘిక – సామాజిక – ఆర్థిక పరిస్థితులు ప్రధాన కారణాలు. రాజకీయ పక్షాలది పాక్షిక బాధ్యత మాత్రమే.

## అరాచకం:

నిజాంలో పరిస్థితులు అతివేగంగా మారుతున్నాయి. అతి దారుణంగా పరిణమిస్తున్నాయి. ప్రజల ప్రాణ ధన మానాలకు ఏమాత్రం రక్షణ లేకుండా పోయింది. అలాంటి పరిస్థితులలో గార్ల జాగీరులో అనేక దారుణాలు జరిగాయి.

1. చిలుకూరి శ్రీరాములు గారు సౌమ్యులు – విద్వాంసులు – ఆనందరామాయణ కర్త. గార్లలో మంచి పలుకుబడి గలవారు. కొంతకాలం జాగీరు బడిలో ఉపాధ్యాయులుగా పనిచేశారు. వారికి ప్రభుత్వ అధికారులలోనూ – వర్తకులలోనూ మంచి ఆదరాభిమానాలున్నాయి.

శ్రీరాములుగారి శ్రీమతి పెద్ద ముత్తైదువు, ఆదరణీయురాలు – వదాన్య – శీలవతి. ఆమె మీదనే దారుణం జరిగింది. అత్యాచారం జరిగింది. ఆమెను రేప్ చేశారు. చెరిచారు. ఆమె అభిమానవతి – శీలవతి – గుణవతి – తక్షణం బావిలో పడి ఆత్మహత్య చేసుకున్నది.

ఇలాంటి దారుణం గార్ల జాగీరు చరిత్రలో జరగలేదు. **చెరచటాలూ మానభంగాలు ఆనాటి దొరతనానికి - ఈనాటి సభ్యసమాజానికి - అత్యంత సాధారణములు.** కాని, ఇటువంటి మానహాని కనీ – వినీ ఎరుగనిది! ఇది రక్కసి మతదురహం కారంతో జరిగింది.

రషీద్ బొర్రతాసిల్దారు కొడుకు. ప్రస్తుత తాసిల్దార్ తమ్ముడు. వాని కామం. కన్ను కానదు. వాడు అనుకున్నఆడది వాని పక్కన చేరాల్సిందే! కాని, అంతటి రాక్షసుడు కూడా సంస్కారంగల కుటుంబాల జోలికి పోలేదు.

రషీద్ రజాకారుల్లో చేరాడు. వాడు సాలార్ అయినాడు. సాలార్ అంటే కమాండరు. అసలే దుష్టుడు. అధికారపు అండ లభించింది. చిచ్చురేగిపోయాడు.

ఆనాటి సాయంత్రం గేదె శ్రీరాములుగారి ఇంటికి చేరలేదు. శ్రీరాములుగారు గ్రామంలో లేరు – ఒక రజాకార్ వారి ఇంటికి వచ్చాడు. శ్రీమతి ఉన్నారు. వచ్చినవాడు వారి గేదె బందెలో పడ్డదని చెప్పాడు. వచ్చి విడిపించుకొమ్మన్నాడు. పాపం, పెద్ద మనిషి నమ్మింది. కసాయి వెంట గొర్రెవలె వాని వెంటసాగింది.

చీకటిపడింది. శ్రీమతి గుండెలో చీకట్లు లేవు. వాడు ఆమెను రషీదు ముందుకు తీసికెళ్లాడు. ఆమెకు తాసిల్దారు ఎలా ఉంటాడో తెలియదు. వాడే తాసిల్దారు అనుకుంది. **బిడ్డముందు తల్లి నిలిచినంత నమ్మకంతో – విశ్వాసంతో – బెదురులేక నిలిచింది. తన బర్రెను వదలమని ధైర్యంగా అడిగింది.**

రషీద్ దుర్మార్గుడు. తండ్రి 'నికా' చేసుకున్నదాన్ని తాను ఉంచుకున్నాడు. శ్రీమతిలో వాడికి తల్లి కనిపించలేదు. ఆమె వృద్ధ. వానిలో కామ ప్రకోపానికి పనికిరాదు. వానిలో మతపు మహాసర్పాలు బుసకొడుతున్నాయి. అప్పుడు వాడు వాడిన వాక్యాలు ఇప్పుడు వ్రాయడం సమంజసం కాదు.

దుశ్శాసనుడు ద్రౌపదిని వలె – దుష్టుడు శ్రీమతి వలువలు వలచాడు. ఆమెను దిగంబరం చేశాడు. ఇహ తదుపరివి వ్రాయలేము – కాని, ఆమెను సామూహికంగా చెరిచారు. మానం పోగొట్టుకున్న శ్రీమతి బయట చీకట్లు, గుండెలో చీకట్లతో ఇల్లు చేరింది.

శ్రీమతి ఇంటి తలుపు తీయలేదు

పెరట్లో ప్రవేశించింది.

తిరిగి చూడలేదు.

బావిలో దూకింది.

ప్రాణాలు తీసుకుంది.

**కన్యక మానం రక్షించుకున్నది. మంటల పాయింది. శ్రీమతి మానం కోల్పోయింది. నీటిపాలయింది.**

తెల్లవారిగాని వార్త పొక్కలేదు. వార్త తొలుత తెలిసింది నాకే. చెప్పినవాడు మస్తాన్. మస్తాను తాసిల్దారు మార్బలంలో వాడు. నా దగ్గర రాత్రి పాఠశాలలో చదువుకున్నాడు.

మస్తాన్ ఉదయమే మా ఇంటికి వచ్చాడు.

అతడు ప్రాణం ఉన్నట్లు లేదు. శవంలా నుంచున్నాడు. తలవంచుకున్నాడు. కన్నీరు కురిపించనున్నాడు.

కొండకూలబోతున్నట్లనిపించింది నాకు.

"బోలో – క్యాబాత్ హై?" అడిగాను.

"సాబ్ గజబ్ హోగయా! – విలయం జరిగి పోయింది" అన్నాడు. కూలబడి ఏడ్చాడు.

నేను అతణ్ణి ఓదార్చడానికి అతని తల నిమిరాను. "బోలో, కౌన్సీ ఆఫత్ హై – ప్రమాదం ఏమిటో చెప్పు" అన్నాను.

"శ్రీరామ్లూ సాబ్ కే జనానే కో..... శ్రీరాములు గారి భార్యను..."

"బోలో – క్యాహువా?"

"రషీద్ నే –"

"రషీద్ నే క్యాకియా?" నాకు చమటలు పట్టాయి. కాళ్ళూ, చేతులూ వణుకుతున్నాయి. నాలుక ఆరుకుపోతున్నది.

"ఔర్ క్యాబోలూం సాబ్! అస్మత్ దరికీ – ఇంకేం చెప్పమంటారు? చెరిచాడు."

తరువాత అతను నిలువలేదు. శవంలా నడిచి వెళ్లిపోయాడు.

నేను కూలబడ్డాను. అయోమయంలో ఉండిపోయాను. మొద్దుబారి పోయాను. ఏమీ తోచలేదు. ఏమీ అర్థం కాలేదు. ఆకాశం విరిగి నెత్తిన పడినట్లయింది.

అమ్మ ఉరికి వచ్చింది. నన్ను పట్టుకుని ఊపింది. అప్పుడు నాకు తెలివి వచ్చింది. ఎవరికో అప్పగిస్తున్నట్లు అన్నాను –

"శ్రీరాములుగారి భార్యను చెరిచారు!"

అమ్మ అయోమయంగా అడిగింది. ఏదో కథ వింటున్నట్లు అడిగింది:

"ఏ శ్రీరాములు? ఎక్కడి కథ?"

"చిలుకూరి శ్రీరాములుగారి భార్యను రషీద్ చెరిచాడు!"

అమ్మ అది విన్నది. పెద్దగా ఏడ్చింది. కూలబడ్డది. ఆమెను చూచి చెల్లెళ్లు ఏడ్చారు. ఇంట్లో ఎవరో పోయినట్లున్నాయి ఏడ్పులు. చుట్టుపట్లవాళ్లు కూడారు.

"ఏం చెప్పాలెనమ్మా! చిలుకూరి శ్రీరాములగారి భార్యను చెరిచినటనమ్మా!" అమ్మ ఏడుస్తున్నది.

అప్పుడు నాకు పరిస్థితి అర్థం అయింది. నేను అమ్మను వారించలేదు. కూడిన వాళ్లను ఏమీ అనలేదు. ఇంట్లోకి వెళ్లిపోయాను. వార్త సిద్ధం చేశాను – పత్రికలకు పంపడానికి.

ఇంతలో వార్త కార్చిచ్చులా ఊళ్లో పాకింది. మిత్రులంతా ఇంటికి వచ్చేశారు. నేను వారితో కదిలాను. దోవలో వార్త పోస్టు చేశాను. శ్రీరాములుగారింటికి వెళ్లాం. వాళ్లబ్బాయి గోపాలరావు వెర్రిచూపులు చూస్తున్నాడు. అతనిని అడిగి తెలుసుకున్నాం. శ్రీరాములు గారికి కబురు పంపాం.

అప్పటికే ఇల్లు జనంతో నిండిపోయింది. బావిలోకి దిగారు. శవాన్ని బయటికి తీశారు. అమ్మా మరికొందరు ఆమె బట్టలు మార్చారు. తుంగచాపమీద పడుకోపెట్టారు. తలాపున దీపం వెలిగించారు.

మేము వీధుల్లో బయలుదేరాం. ఎక్కువ ప్రయత్నం లేకుండానే దుకాణాలన్నీ మూసేశారు. జనం గుంపులు గుంపులు కూడారు. ఇదే ముచ్చట! ఊరంతా పాడు బడినట్లుంది! వెలవెల పోతున్నట్లున్నది! కళాహీనంగా ఉంది! తుపాను ముందటి ప్రశాంతలా ఉంది!!

అవి ఆంధ్రమహాసభ ఉధృతంగా ఉన్నరోజులవుతే వాస్తవంగా తుపాను వచ్చేది! రషీద్ ప్రాణాలతో బయటపడగలిగేవాడుకాడు. ప్రజా శత్రువులు దక్కేవారు కాదు!

కాలం మారింది. రజాకార్లకు హద్దు లేకుండా పోతుంది. ప్రజలలో ధైర్యం లేదు. బిక్కచచ్చి ఉన్నారు. అయినా తెలియదు. ఏమిటో ఆ సాహసం? అన్యాయాన్ని సహించలేను. ఆపదను గుర్తించలేను.

అందరం మందగా తాసిల్దారు ఇంటికి వెళ్లాం. "మందగా" అని ఎందుకు అన్నానంటే మూగ గొర్రెలవలె వెళ్లాం! శక్తిహీనులంగా వెళ్ళాం!! ఇంత దారుణాన్ని గురించి తాసిల్దారుకు విన్నవించడానికి వెళ్లాం!!! అదీ చేయకుంటే మానవత సహించదని వెళ్లాం!! రానున్న తరాలవాళ్లు మమ్ములను మన్నించరని వెళ్లాం!!!

తాసిల్దారు ఇంటిముందు మౌనంగా నుంచున్నాం. పిట్ట పీచుమంటే వినిపించేట్లుంది. తాసిల్దారు కూడా అంత భారంగా – నిశ్శబ్దాన్ని మోసుకుని వచ్చాడు. తలవంచుకొని నుంచున్నాడు. అపరాధిలా నుంచున్నాడు.

"హైఁ షర్మిందాహూఁ. సారే కాయెనాత్ షర్మిందా హై. మైఁ మజ్బూర్ హూఁ. మదద్ నహీఁ కర్‌సక్తా" – నేను సిగ్గుపడుతున్నాను. సమస్త ప్రకృతి సిగ్గుపడుతున్నది. నేను నిస్సహాయుణ్ణి. ఏమీ చేయలేను అని బోనులో నేరస్థునిలా నుంచున్నాడు.

ప్రధాని "చిత్తారినవాబ్" నోట్లో ఊసిన రజాకార్లను మందలించలేని నిజాం నవాబు గుర్తుకు వచ్చాడు. నిజాం నవాబులో స్వార్థం ఉంది. అతను చేయగలిగీ చేయలేదు. తాసిల్దార్ అట్లా కనిపించలేదు. వాస్తవం అయిన శక్తిహీనుడుగా కనిపించాడు!

నాకొక రోగం. నేను ఊరుకోలేను. "బద్‌హోనా – బద్నాం నహీఁహోనా" పంచదార కథలో అతడు నాకు బోధించిందాన్ని గుర్తు చేశాను. తాసిల్దారు తట్టుకోలేక పోయాడు.

"జీనహీఁ అగర్ ఇన్సానియత్ హైతో బద్‌భీ నహీఁ హోనా – బద్నాం భీ నహీఁ హోనా" – అట్లా కాదు. మానవత్వం (ఇంకా) ఉంటే చెడు చేయవద్దు చెడు పేరు తెచ్చుకోవద్దు" అన్నాడు. గిరక్కున తిరిగి వెళ్లిపోయాడు.

**తాసిల్దారు మీద జాలి చూపే దౌర్భాగ్యదశకు చేరుకున్నారు జనం!**

ఆ రాత్రి మస్తాన్ ఇంటికి వచ్చాడు. తలుపులు వేసుకుని గదిలో కూర్చున్నాం. జరిగిందంతా చెప్పాడు. ఒక రహస్యం బయటపెట్టాడు.

నిజాం నవాబు శరణార్థులను రప్పించాడన్నాను. వారిలో పోలీసు ఉద్యోగం ఊడిన "కాజి" అనే కాందిశీకునికి గార్ల జాగీర్దార్ పోలీసు సూపరింటెండెంటు ఉద్యోగం ఇచ్చాడు. వాడు హిందువులచేత దెబ్బ తిన్నవాడు. బహుశః పంజాబీ. వాడు గార్లలో ప్రతీకారం తలపెట్టాడు. రషీద్‌తో కలిసి ఈ దారుణం తలపెట్టాడు!

"వహ్ ఔర్ బహుత్ బద్మాషీ సోచ్ రహా హై. ఆప్‌కా యహాఁ రహనా అచ్ఛానహీఁ. కుఛ్‌బీ హోసక్తాహై" అని మస్తాన్ కంట తడిపెట్టాడు. "వాడు మరిన్ని

దుర్మార్గాలు ఆలోచిస్తున్నాడు. మీరు ఇక్కడ ఉండడం మంచిది కాదు. ఏదఋునా జరుగవచ్చు."

అమ్మ తలుపు తట్టింది. తీశాను. నాగేశ్వరరావు - దామినేని వెంకటేశ్వరరావు వచ్చారు. వారిని చూచి మస్తాన్ జంకాడు. వారికి సలాం చేశాడు. వెళ్లిపోయాడు.

"ఏమిటీ దురంతం?" నాగేశ్వరరావు నిప్పులు కక్కుతున్నాడు. అతనిని శాంత పరచడానికి నేను బాధలు పడాల్సివచ్చింది. వెంకటేశ్వరరావు అంతటి ఉద్రేకపరుడే! ఎందుకో అప్పుడు అంత ఆవేశ పడలేదు. వీళ్లిద్దరూ అండర్‌గ్రౌండు కామ్రేడులే! గొంగళ్లు కప్పుకొని వచ్చారు.

అమ్మ చాయ్ తెచ్చి పెట్టింది. "నాయనలూ! మమ్ములను పంపించండి. మేము ఉండగా ఏ దురంతం తలపెట్టకండి" అని చెప్పి వెళ్లిపోయింది.

అమ్మ మాటలు వాళ్లిద్దరినీ ఈ లోకంలోకి తెచ్చాయి. "అమ్మ" అంటే వారికి ఎంతో అభిమానం. వాస్తవంగా వారు వచ్చింది రషీద్‌మీద దాడికి పథకం సిద్ధం చేయడానికి! నేను పరిస్థితులు వివరించాను. దాడి జరుగుతే గ్రామం దగ్ధం అవుతుంది - నిర్దోషులు బలి అవుతారు అని వివరించాను.

వెంకటేశ్వరరావు నామీద ఎగబడ్డాడు. 'చేతులు ముడుచుక్కూర్చుంటే విప్లవం ఎలా వస్తుంది? విప్లవం అన్నాక కొందరికి హాని జరుగక తప్పదు' అన్నట్లు ఉపన్యసించాడు.

"మీరు అడివిలో లేరు. ఊళ్ల ఉన్నరు. కాస్త మెల్లగ మాట్లాడండి" అన్నది అమ్మ లోపలికి వచ్చి.

"ఫలితం గొప్పది అయినపుడు త్యాగానికి వెనుకాడరాదు. ఫలితం లేని త్యాగం నిష్ప్రయోజనం అవుతుంది" అని వివరించాను. నా మాటలు వాళ్లకు రుచించలేదు. కాని, అమ్మమాట కాదనలేక పథకం వాయిదా వేసుకున్నారు.

వాళ్లు అమ్మతో చెప్పి 'పచ్చిపులుసు' చేయించుకున్నారు. అమ్మచేసిన "పచ్చిపులుసు" అంటే వాళ్లకు ఎంతో ఇష్టం. ముగ్గురం కలిసి భోజనం చేయడం అదే చివరిసారి. అంతేకాదు. వాళ్లిద్దరినీ మళ్లీ కలుసుకోలేకపోయాను. ఒకరి తరువాత ఒకరు బలి అయినారు!

దామినేని వెంకటేశ్వరరావు - పానుగంటి నాగేశ్వరరావును ఏరు దాటించి వచ్చాను.

అదేవారికి నేను ఇచ్చిన తుది వీడ్కోలు!

తరువాత శ్రీరాములుగారు వచ్చారు. పత్రికలు వార్తను ప్రముఖంగా ప్రకటించాయి. శవయాత్ర బాగా జరిగింది. నది ఒడ్డున దహన సంస్కారం జరిగింది. శ్రీరాములుగారు దరఖాస్తులు ఇచ్చారు. చాలమంది పెద్దలను కలిశారు. పైరవీలు చేశారు. కొందరు గార్ల వచ్చారు. విచారణ జరిపారు. కాని, రషీదును ఏమీ చేయలేకపోయారు.

అయితే దైవిక న్యాయం గొప్పది. రషీద్ ఒక స్త్రీ విషయంలోనే హతుడయినాడు!

2. రజాకార్ల దురంతాలు మితిమీరుతున్నాయి. రజాకార్లు "గొల్లచర్ల" గ్రామం మీద పడ్డారు. ఇళ్లు తగలపెట్టారు. తగలబడుతున్న ఒక ఇంట్లోంచి ఒక తల్లి పసి బిడ్డను బుజానవేసుకొని బయటపడింది. అది ఒక రజాకారు చూచాడు.

పసిపిల్లను – తల్లినుంచి గుంజుకున్నాడు. మంటల్లో విసరి వేశాడు. తల్లి బిడ్డకోసం మంటల్లోకి ఉరికింది. తల్లి – బిడ్డలు మసి అయ్యారు.

గొల్లచర్ల సొంతం దోచుకున్నారు. ఆడవాళ్ల మంగళసూత్రాలు కూడా గుంజుకున్నారు. నగలు – మంగళసూత్రాలూ బిందెలతో పట్టుకుపోయారు.

స్త్రీలను నానాహింసలు పెట్టారు. సామూహికంగా మానభంగాలు చేశారు. ఆడవాళ్ల చన్నులు కోసి ఆనందించారు. ఎంతమందిని హత్యచేశారో లెక్కలేదు. ఊరిని వల్లకాడు చేసి వెళ్లిపోయారు!

3. పెరుమాళ్ల సంకేస కమ్యూనిస్టుల తావరం. ఆ వూరి తుమ్మా శేషయ్య ప్రఖ్యాత కమ్యూనిస్టు. రజాకార్లు ఆ వూరిని ధ్వంసం చేయదలచారు. మిడతల దండులా మీద పడ్డారు.

అల్లాహో అక్బర్
ఆజాద్ హైదరాబాద్ – జిందాబాద్
అలాహజ్రత్ – పాయిందాబాద్

అనే నినాదాలతో ఊరిని ముట్టడించారు. తలుపులకు బయటినుంచి గొళ్లేలు పెట్టారు. ఇళ్లకు నిప్పంటించారు. ఇళ్లు తగలబడడం – ఇళ్లల్లో వారి హాహాకారాలు విన్నారు. దుర్మార్గులు ఆనందంతో నాట్యం చేశారు.

రజాకార్లు ఊరిబయట చితిపేర్చారు. బయట దొరికినవాళ్లను సజీవంగా అందులో పడేశారు. మంటల్లోంచి బయటికివచ్చారు కొందరు. వారిని మళ్లీ మంటల్లోకి నెట్టారు. దారుణాతిదారుణంగా కాల్చి చంపారు.

గ్రామంలోకి ప్రవేశించబోయిన ఒక తురకను పట్టారు. వాడు తాను తురకను అనే ధైర్యంతో వచ్చాడు. రజాకార్లు వాణ్ణి పట్టుకున్నారు. తాను తురకను అని చెప్పినా వినలేదు. మంటల్లోనికి విసిరారు. వాడు మూడుసార్లు మంటల్లోంచి ఉరికి వచ్చాడు. మూడుసార్లు వాణ్ణి మంటల్లోకి నెట్టారు.

జిహద్ జరిగిపోయిందని పట్టలేని ఆనందంతో పరుగులు పెట్టారు. చితిమంటల వెలుగులో తాగారు – తిన్నారు. తందనాలాడారు. ఊరిని బుగ్గి చేశారు. ఊరినుంచి కదిలారు.

4. బయ్యారం గ్రామం మీద రజాకార్లు దాడి చేశారు. ఇళ్లు లూటీ చేయడానికి బయల్దేరారు. మహిళలు కారం నీళ్ల ముంతలతో రజాకార్ల ముఖాలకు కొట్టారు. రోకళ్లు – పొరకలు పట్టుకుని రజాకార్ల వెంట పడ్డారు. గిరిజన మహిళలు కొరకంచులు పట్టుకొని అంటించారు. పురుషులు కర్రలతోనూ – బరిశెలతోనూ ఎదిరించారు.

రజాకార్లు ఇలా జరుగుతుందని ఊహించి ఉండరు. ఖంగు తిన్నారు. చెట్టుకు ఒకడు – గుట్టకు ఒకడు అయి ఉరికారు. అలా పారిపోయేప్పుడు – ఎందరో గుర్తులేదు – ఒకరిద్దరు యువతులను ఎత్తుకుపోయారు. తరువాత వారి మృతదేహాలు కనిపించాయి.

రజాకార్లు వెళ్తూ – వెళ్తూ పంటలకు నిప్పంటించి పారిపోయారు. పంటసొంతం ధ్వంసం అయింది.

5. రంగాపురానికి పోలీసులు గుర్రాలమీద వచ్చారు. వారు దామినేని వేంకటేశ్వరరావు కోసం వచ్చారు. దామినేనిని చూపించమని అనేకమందిని కట్టారు. కొట్టారు. ఆడవాళ్ల జుట్లు కోశారు. వాళ్లను దిగంబరంగా తిప్పారు. మానభంగాలు చేశారు. నానా బీభత్సం సృష్టించారు.

వెంకటేశ్వరరావు ఊళ్లోనే ఉన్నాడు. అయినా ఒక్కరూ అతని జాడ చెప్పలేదు.

దామినేని తప్పించుకోవడానికి ఉరికాడు.
గుర్రంమీది పోలీసు చూచాడు.
గురిపెట్టి కాల్చాడు
దామినేని కూలాడు
రెడ్ శాల్యూట్ దామినేని!
విప్లవజోహార్ దామినేని!!

జీవితంలో తొలిసారి మిత్రుణ్ణి కోల్పోయాను. కనీసం శవాన్ని చూడలేక పోయాను. నేను మనిషిని కావడానికి వారం పట్టింది. కనీసం రంగాపురం వెళ్లలేదు. అది నా బలహీనతో – భయమో చెప్పలేను!

6. అప్పటికి దళాలు స్థిరపడ్డాయి. 'దళం' పోలీసులకు – రజాకార్లకు సింహస్వప్నం అయింది. ఒకనాటి వార్త:

ఒక పోలీసు స్టేషను. రాత్రి పూట. స్టేషనును ఇద్దరు పోలీసులు – సాయుధులయి – కాపలా కాస్తున్నారు. ఒకడు స్టూలుమీద కూర్చున్నాడు. తుపాకిని పట్టుకొని కునికిపాట్లు పడుతున్నాడు. ఒకడు సావధానుడై 'పహరా' ఇస్తున్నాడు.

కునికిపాట్లు పడుతున్న పోలీసుకు దళం దాడి చేసినట్లు కల వచ్చినట్లున్నది. తుపాకి అందుకున్నాడు. తోటివాణ్ణి కాల్చాడు. 'పహరా' వాడు తనను కమ్యూనిస్టులు కాల్చారనుకున్నాడు. వాడు వీణ్ణి కాల్చాడు.

ఇద్దరూ చచ్చారు.

ఇద్దరి తుపాకులూ కమ్యూనిస్టులు గుంజుకుపోయారు!

7. గూడా సూర్యనారాయణ మా మిత్రబృందంలోనివాడే. కాని, రాజకీయాలకు కాస్తదూరం. సర్కారీ కొలువు చేస్తున్నాడు. టీచరు ఉద్యోగం. ఆ విలయకాలంలో రాజకీయాలకు దూరంగా ఉన్నవారు కూడా – ఉద్యమంలో దూకారు. సూర్యనారాయణ దూకలేదు. హైదరాబాదునుంచి త్రివర్ణ పతాకం తెచ్చాడు. కాంగ్రెస్‌వారు జాతీయ పతాకం ఎగురవేసే కార్యక్రమం చేపట్టారు. ఆ కార్యక్రమానికి ప్రభావితుడయి సూర్యనారాయణ పతాకం తెచ్చాడు. అది ఎగురవేసే పథకం కోసం మా ఇంటికి వచ్చాడు.

బీరోలు అమృతరెడ్డి – నేను చదివిన ఆరో తరగతి వరకూ – నాకు క్లాస్‌మేటు. పెద్ద భూస్వామి – గార్ల జాగీరులో దొరలు లేరు – భూస్వామి కొడుకు ఉద్యమంలో భాగంగా కాలేజీ వదిలాడు. విశాఖపట్టణంలో చేరాలని సంకల్పం. అతడూ మా ఇంటికి వచ్చాడు.

పతాక ఆవిష్కరణను గురించి ముగ్గురం చర్చించుకున్నాం. రాజకీయాలూ చర్చకు వచ్చాయి. అమ్మ టీ చేసి ఇచ్చింది. ఆమెకు ఊరు వదిలి వెళ్లాలని ఆతురత

ఎక్కువయింది. పరిస్థితులు క్రూరంగా – ఘోరంగా – దారుణంగా ఉన్నాయి. అమ్మ తన మాట బయటపెట్టింది.

కుంతి కర్ణుని దగ్గరికి వెళ్తుంది. 'నీవూ నా బిడ్డవే! నా బిడ్డలను – అంటే పాండవులను – రక్షించ'మంటుంది. "అమ్మా! నీ కొడుకుల్లో అర్జునుణ్ణి తప్ప మిగతా నలుగురిని చంపను. అర్జునుడో నేనో హతం కావడం నిశ్చయం. ఎట్లయినా నీకు అయిదుగురు పుత్రులు ఉంటారు" అంటాడు కర్ణుడు.

అమ్మ కూడా తల్లికదా! తన బిడ్డను – ముఖ్యంగా పసివాళ్లయిన ముగ్గురు కూతుళ్లను – కాపాడుకోవాలని ఆతురత! ఆమె తల్లి. తల్లికి ఉన్న తొందర ఎవరికి ఉంటుంది? కోడి తన పిల్లలను రెక్కలు కింద దాచుకుంటుంది. అమ్మ – చెల్లెళ్లను అట్లా కాపాడుకుంటున్నది. కాలం అలా ఉంది. కాటేసేటట్లుంది.

"అమ్మా! అన్నయ్య జేల్లో భద్రం. నేను పోయినా నీకు ఒక కొడుకుంటాడు" అన్నాను.

ఆ మాట విన్నది. అమ్మ నన్ను పట్టుకొని పెద్దగా ఏడ్చింది. "అట్లనకు నాయనా! నాకు అయిదుగురు ఉండాలె. అయిదుగురి చేతుల్ల నేను పోవాలె" అన్నది. నేను పరిహాసానికి అన్నమాటే ఆమెను విలవిలలాడించింది.

**అమ్మది అవితథవాక్కు. ఆమె ఆశీస్సులే నన్ను రక్షించినట్లున్నాయి. ఆమె సంకల్పం గట్టిది! 1960లో మా అయిదుగురి చేతుల్లోనే ఆమె పోయింది. అమ్మ కష్టాలకే పుట్టింది! సుఖం ఎరగదు!!**

సూర్యనారాయణ, అమృతరెడ్డి – నేను ఒక పథకం సిద్ధం చేసుకున్నాం. తెల్లవారి – స్టేషనుముందున్న – తాసీల్ కచ్చేరీ మీద జండా ఎగరేయాలి!

ఆ సాహసం ఏమిటో తెలియదు. "పోతే ప్రాణమే కదా!" అనుకునేవాణ్ణి!

వాళ్లిద్దరూ వెళ్లిపోయారు. ఆ రోజు కార్తీక పౌర్ణమి. వెన్నెల విరబూసింది. చెల్లెళ్లు – అమ్మ భోజనాలు చేశారు. నాకు అజీర్ణం – కడుపునొప్పి. అన్నం పడదు. ఇన్ని టీ నీళ్లతో కాలం గడపడం. అట్లయినా కుండెడు వాంతి. ఈమధ్య రక్తం కూడా పడింది! తండ్రి పోషణ లేదు. తల్లి అసమర్థ. అన్న జైల్లో! మందులేదు. మాకులేదు. ఫిర్ భీ జీరహేహైం. అయినా జీవిస్తున్నాం.

బేఖైఫ్ జిందగీహై జియెజారహేహూఁ
శీషాహైఖాలీ – ఫిర్ భీ పియె జారహేహూఁ
జీవితంలో రుచిలేదు. అయినా బ్రతుకుతున్నాను.
సీసా ఖాళీగా ఉంది. అయినా తాగుతున్నాను.

ఆ రోజు కార్తీక పౌర్ణమి – 1948. వెన్నెల పాలు పారపోసినట్లుంది. వెన్నెల పిండి ఆరబోసినట్లుంది. వెన్నెల పుచ్చపూవులాగుంది. వెన్నెల పున్నమి వెన్నెల లాగుంది. పున్నమి పున్నమిని మించింది.

వెన్నెలంటే నాకు ఇష్టం. అందం అంటే ఇష్టం. అది అమ్మాయిలో ఉన్నా – అమనిలో ఉన్నా ఆనందించగలను. అందమే ఆనందం – ఆనందమే జీవిత మకరందం!

కార్తీకపు వెన్నెల. చలిగానే ఉంది. అయినా ఆరుబయట కూర్చున్నాను. చెల్లెళ్లు నిద్రపోయారు. అమ్మ ఇంకా నిద్రపోలేదు.

మీసాల సర్వర్ – జమేదార్ – వచ్చాడు. గొంతు సవరించుకుని దగ్గాడు. వాడు రాక్షసుడు. దగ్గాడంటే ఎవరికో మూడినట్లే! దగ్గు విన్నది. అమ్మ బయటికి వచ్చింది.

"మోజిమీమ్‌సాబ్ బులారైఁ – పోలీసు సూపర్నెంటు పిలుస్తున్నాడు అన్నాడు" సర్వర్.

నాకు అర్థం అయింది. ఇది జీవితాంతం! రేపటి వెలుగు చూడను! నేను తప్పించుకోగలను. సర్వర్ చేతిలో దండా తప్ప ఏదీలేదు. తాగి ఉన్నాడు. తప్పుకోవడం చాల తేలిక! కాని, అమ్మా – చెల్లెళ్లు? తరువాత పరిణామాలు?

అమ్మ వాకిట్లో నుంచొని ఉంది. సరిగ్గా ఇలాగే అన్నయ్యను తీసికెళ్లారు. జేలుకు పంపారు. అప్పుడు అమ్మ పెద్దగా ఏడ్చింది. ఇప్పుడు నన్ను తీసికెళ్లడానికి వచ్చాడు. పరిణామం అమ్మకు తెలుసు. అయినా ఆమె ఏడ్వలేదు. శిలావిగ్రహంలా నుంచుంది.

"ఛలియే" అన్నాను. నేను ఇంట్లోకి కూడా వెళ్లలేదు. నిక్కరు – హాఫ్‌షర్టుతో బయల్దేరాను. సర్వర్ ముందు – వెనుక నేను వెళ్తున్నాం.

పూసాల నారాయణగారు అరుగుమీద నుంచున్నారు. వారు సర్వర్ను గమనించలేదు. "ఎక్కడికి?" అని నన్ను అడిగారు. అది సర్వర్ విన్నాడు.

"అబె సునార్! తూభీ చల్ – అరె కంసాలీ, నువ్వూనడువ్" అన్నాడు సర్వర్.

"నేనేం చేసిన సర్కార్! నన్నెందుకు పట్కపోతరు?" అన్నాడు నారాయణ.

"చల్తా క్యానైఁ – నడుస్తావా లేదా" అని దండా ఎత్తాడు సర్వర్.

నారాయణగారు మెట్లు దిగి వచ్చారు. వారి భార్య సర్వర్ను చూచింది. గొల్లుమని ఏడ్చింది. గుమ్మంలో పడిపోయింది. నారాయణగారిని వెనుతిరుగ నివ్వలేదు సర్వర్.

ఎదురుగా సూర్యనారాయణగారు పులిహోర తెస్తున్నారు మా ఇంటికి – కార్తీక పౌర్ణమికదా!

"అబె బొమ్మన్! తూభీ చల్ – ఒరే బాపడా! నువ్వూ నడువు" అన్నాడు సర్వర్ – దగ్గాడు.

"మైఁ సర్కారీ ములాజమ్‌హూఁ మైఁక్యోఁ, నేను సర్కారీ ఉద్యోగిని. నేనేందుకు?" అడిగారు సూర్యనారాయణ.

"ములాజిమ్‌కే బచ్చె! చల్తా క్యానై" అని సర్వర్ సూర్యనారాయణను తోశాడు. పులిహోర సాంతం నేలమీద పడిపోయింది. పై పంచెతో సూర్యానారాయణ సాగాడు.

కొంతదూరం సాగాం. అమృతారెడ్డి పక్కచుట్ట చంకన పెట్టుకుని మా ఇంటికి వస్తున్నాడు.

"రెడ్డీసాబ్! ఆప్‌భీ చలియే, రెడ్డిగారూ! మీరూ నడవండి" అన్నాడు సర్వర్ – దగ్గలేదు.

"అరే భయి, మైఁ క్యోఁ" అడిగాడు అమృతన్న.

"మోతిమీమ్‌సాబ్! బతాతైఁ – మొహతమీర్ తెలియపరుస్తారు" అన్నాడు సర్వర్.

అమృతారెడ్డిగారు సాగారు.

మా నలుగురినీ – భారత విభజన బాధితుడు – కాజిం అలీ – పోలీస్ మొహతమీమ్ ఇంటికి తీసికెళ్లాడు. కాజిమలీ ఇల్లు తాసిల్దారు బంగళాముందు, విశాలం అయిన విడిస్థలంలో వెన్నెల వళ్లు విరుచుకుంటున్నది. కాజిం సీడలో కుర్చీలో కూర్చున్నాడు. తాగినట్లున్నాడు. పిస్తోలు చేతులో ఉంది! మా కోసమే ఎదిరి చూస్తున్నట్లున్నాడు.

సర్వర్ సలాం కొట్టాడు. మమ్ములను హాజరుపరచిన విషయం విన్నవించాడు.

"అబె! అఖల్ కె కచ్చే! ఇన్‌సబకో క్యాఁ లాయాబె! బేవకూఫ్ అరే! పచ్చి తెలివికాడా! వీళ్లందర్ని ఎందుకు తెచ్చావుర బేవకూఫ్?" అని సర్వర్‌మీద అరచాడు.

అప్పుడు అర్థం అయింది. కాజిం నన్ను ఒక్కణ్ణే తీసుకురమ్మన్నాడు. తాగినమైకంలో సర్వర్‌గాడు అందరిని పట్టుకొచ్చాడు. కాజిం ప్లాను పట్టాలు తప్పింది. నాకింకా **ఆయుర్దాయం ఉంది!**

"అరే! గాంధీ కె బచ్చే. ఇధరా," కాజిం పిలిచాడు. ఎవరిని అంటున్నాడో అర్థం కాలేదు. ఒకరిని ఒకరం చూసుకున్నాం.

"అబె అబే" అని నామీద లంఘించాడు. పిస్తోలు మడమతో తలమీద కొట్టాడు.

"అమ్మా!" అని కూలబడ్డాను. "అమ్మా! క్యాఁబోల్తా బే గాంధీ బోల్ – తేరా బావా గాంధీహైనా – అమ్మా ఎందుకంటావురా గాంధీ అను. మీ అయ్య గాంధీ కద" అని గొరగొర గుంజుకుపోయాడు.

అప్పుడు వాడన్నమాటలు వ్రాయడం అప్రస్తుతం. అనవసర ఆవేశకావేశాలకు కారణం అవుతాయి. ఒక్కటి మాత్రం చెపుతా. "బొమ్మన్ భీక్ మాంగ్యా! సర్కార్ చలాతా! దేఖ్తేరహో! సారాహిందుస్తాన్ పాకిస్తాన్ బన్‌జాయెగా – బాపనోడు (నెహ్రూ) బిచ్చం అడుక్కోవాలి. రాజ్యం ఏలుతాడా? చూస్తుండు హిందుస్తాన్ సొంతం పాకిస్తాన్ అవుతుంది."

కాజిం దండా తీసుకొని నా మీద పడ్డాడు. ఎన్ని కొట్టాడో తెలియదు. మొదటి రెండు మూడు దెబ్బలు బాధ పెట్టాయి. తరువాత దెబ్బలు తగిలినట్లనిపించలేదు. నేను అరవలేదు. కేకలు పెట్టలేదు. ఏడవలేదు. కొట్టినంతసేపు కొట్టాడు. కర్ర అవతల పారేశాడు. కుర్చీలో కూలబడ్డాడు.

"జనాబ్!" సూర్యానారాయణ అన్నాడు "ముఝే పాయెఖానా అతాహై – నాకు దొడ్డికి వస్తున్నది."

"అబె! తూ యహీఁ హగ్నా. నికాత్ కేఫెంక్నా – అరే! నువ్వు ఇక్కడనే ఏరగాలి. ఎత్తివేయాలి" అన్నాడు కాజిం.

"నహీఁ జనాబ్ అబ్ బంద్ హోగయా!" అయ్యా! రావడం లేదు. బంద్దైంది అన్నారు" సూ.నా.

"అబె సర్వర్! లేరా అఖల్ ఘటన్కోఁమెఁహై. ఎహ్ కమీనిస్ మాదర్ చోడోఁ కూ హూలాల్‌మెఁ బందకర్. అయీాసమ్‌ఝమే – అరే సర్వర్! నీ తెలివి మోకాళ్లో ఉంది. (బుర్రలో లేదు) కమ్యూనిస్టు కొడుకుల్ను కస్టడీలో నూకు. అర్థం అయిందా?" ఆర్డరు ఇచ్చాడు కాజిం.

"జీ సర్కార్!" అని సర్వర్ సలాం కొట్టాడు. మమ్ముల్ని తీసుకొని బయల్దేరాడు. నా వళ్లు సొంతం నొప్పులుగా ఉంది. **వాడి దెబ్బల బాధ తక్కువే! వాడి దుర్భాషలు మనసున మంటలు రేపాయి. వాడు నా దేశాన్ని - నా నేతలను - నా పతాకాన్ని అనరాని మాటలు అన్నాడు!**

పోలీస్‌స్టేషను చేరుకున్నాం. రిమాండు గది అప్పటికే నిండి ఉంది. రావూరి గోపయ్య వంటి కాంగ్రెస్ మిత్రులున్నారు. వారూ జండా ఎగురవేసే ప్రయత్నంలోనే అరెస్టయ్యారు. వాళ్లంతా భూస్వాములు. ఉన్నవాళ్లు. ఎవరినీ దెబ్బలు కొట్టలేదు. బాగా రాత్రి అయింది. అయినా వాళ్లు నిద్రించలేదు. నన్ను అరెస్టు చేసిన విషయం వారికి తెలిసింది. నన్ను ఏం చేస్తారోననే భయం పట్టుకుంది. అందువల్ల మేలికతో ఉన్నారు.

రావూరి గోపయ్యగారు – లాంతరువెలుగులో – నన్ను చూచారు. దెబ్బల విషయం వారికి తెలిసింది. ప్రాణాలతో బయటపడ్డాను. అందుకే వారు సంతోషించారు. మమ్ముల్ని ఉంచడం అమీనుకు సమస్య అయింది. స్థలం లేదు. అటూ ఇటూ తిరిగారు. వెనక రికార్డురూమ్ ఉంది. అందులో ఉంచడానికి నిర్ణయించారు.

మమ్ముల్ని వెనుక గదిలో పెట్టారు. బయటినుంచి తాళం వేశారు. ఆ గది ఫైళ్లకోసం – మనుషులకోసం కాదు. ఒక్క కిటికీ సైతం లేదు. గాలి రాదు. వెలుగు లేదు. తాగడానికి నీళ్లు లేవు. అమృతారెడ్డి పక్క బట్టలు తెచ్చాడు. అవి ఉపయోగపడ్డాయి. పరుచుకున్నాం. కూర్చున్నాం. నాకు తగిలిన దెబ్బలను గురించి వాళ్లంతా బాధపడ్డారు. నేను బాదపడలేదు. వంటనిండా దెబ్బల దద్దులు!

దెబ్బలు మరీ అంత బాధపెట్టలేదు. అది వాస్తవం. అన్ని దెబ్బలు! ఎందుకు బాధించవు? **జీవితం ఆశల - నిరాశల - దురాశల మీద ఆధారపడి ఉంది. ఆశ మనిషిని బతికిస్తుంది. నిరాశ నీరసపరుస్తుంది. దురాశ దుఃఖం చేటు అవుతుంది. ఆశించింది ఎక్కువయి, ఫలితం తక్కువ అవుతే నిరాశ కలుగుతుంది. తక్కువ ఆశించి, ఎక్కువ ఫలితం లభిస్తే శ్రమ తెలియదు. ఒక రకంగా సంతోషం కలుగుతుంది.**

నేను రేపటి వెలుగు చూడనని కాజిం ముందుకు వెళ్లాను. వాడు చంపేస్తాడనే వెళ్లాను. దెబ్బలతో బయటపడ్డాను. అంటే, నేను ఆశించిన ప్రమాదంకన్న తక్కువ జరిగింది. అందువలన – బహుశః దెబ్బలు అంతగా బాధించలేదు!

**జీవితాన్ని సుఖమయం చేసుకోవడానికి తక్కువ ఆశించడం మంచిది. అసలే ఆశించకపోవడం కర్మ సన్యాసం. అది ఆనందం ప్రసాదిస్తుంది. ఆనందో బ్రహ్మ. ఆనందం లభిస్తే - జీవితానికి లక్ష్యం అయిన - బ్రహ్మం లభించినట్లే!**

కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచనన్
మా కర్మఫలహేతు ర్భూర్మాతే సంగోస్త్వ కర్మణి. – గీత 2.47

పని చేయడం నీ విధి. పని ఫలితాన్ని ఆశించడం కాదు. పనివల్ల వచ్చే ఫలితానికి నీవు హేతువు కారాదు. అట్లా అని పని చేయకుండరాదు.

ఇది వేదాంతం కాదు. వైరాగ్యం కాదు. పాప పుణ్యాల కథ కాదు. ఇది జీవిత

సత్యం. ఏమీ ఆశించక చేస్తే వచ్చిన ఫలితం ఆనందం కలిగిస్తుంది. ఫలితానికి నీవే హేతువు అనుకుంటే గర్వం కలుగుతుంది. అట్లా అని పని మానరాదు. ఎంచాతంటే – పనియే జీవితం!

చీకటి రికార్డు గదిలో చిరాకుగా వుంది. సూ.నాకు – కాజీం గద్దింపుతో – దొడ్డికి వచ్చేది నిలిచిపోయింది. ఇప్పుడు మూత్రం వస్తున్నది. ఎక్కడ పోయడం! పీత బాధలు పీతవి – అతని బాధ అది. పోలీసును పిలుస్తున్నాం. మేము బంధించిన గదిలో ఉన్నాం. మా పిలుపు రెండు గదులు దాటి వినిపించాలి. వాళ్లు రావాలి. సు.నాకు తొందర.

అమృతరెడ్డి దగ్గర అగ్గిపెట్టె ఉంది. పుల్లగీచి చూచాను. రెండు నాపరాళ్ల మధ్య సిమెంటు లేదు. అగ్గిపుల్లతో మట్టి తీశాను. చిన్న కాలువ తయారయింది. అందులో మూత్రించమన్నాను.

ఇంతలో మరొక మెరుపు ఆలోచన! పోలీసు లొట్ట తుపాకి – లాంతరుతో వస్తాడు. నలుగరం వాణ్ణి పట్టెయ్యాలి. లాంతరులోని కిర్సనాయిలు రికార్డుల మీద పోయాలి. అగ్గిపుల్ల అంటించాలి. వెనకకు మొండిగోడ దాటి పారిపోవాలి. ఇది నా ప్రతిపాదన. అందరూ ముక్త కంఠంతో "చూస్తాం" అన్నారు.

"ప్రాణమే కదా పోయేది!" అన్నాను నేను. నన్ను గురించి వాళ్లకు తెలుసు. తెగిస్తాడని వారు ఎరుగుదురు. నారాయణగారు నా కాళ్లు గట్టిగా పట్టుకున్నాడు. "ఇది మాత్రం చెయ్యకుండి బాంచెను, కాల్మొక్త – పెండ్లాం పిల్లలున్నోణ్ణి" అని ఏడుపు లంకించుకున్నారు. మిగిలిన ఇద్దరు ఏడవలేదు. కాని బ్రతిమిలాడారు.

సూర్యనారాయణగారి మూత్రవేగం పెరిగింది. రెండు బండల సందు కాలువలో మూత్రిస్తున్నారు. అది నిండింది. పడకకిందికి వస్తున్నది. అప్పుడు వినిపించినట్లుంది పోలీసువానికి. లాంతరు పట్టుకొని – కేకవేస్తూ – తలుపు తీయడానికి వచ్చాడు. సూ.నాకు భయం – మూత్రించింది చూస్తాడని. నేను దర్వాజ ముందు నుంచున్నాను.

పోలీసు – లొట్టతుపాకి, లాంతరుతో వచ్చాడు. పాము భయం పాముది. వాని భయం వానిది. ఒక రెక్క తీశాడు. నుంచున్నాడు. ఒకరి తరువాత ఒకరిని వదిలాడు. అందరం మూత్రించి వచ్చాం. అప్పుడు దాహం తెలిసింది. నీళ్లు అడిగారు. బుద్ధిహీనుడు పోలీసువాడు. లాంతరు అక్కడ పెట్టాడు. నీళ్లు తేవడానికి వెళ్లాడు. ఇప్పుడు నా పథకం సులభం. వెనుక మొండిగోడ – చెట్లు – బండలూ ఉన్నాయి! చాల తేలిక. పోలీసులు ఇద్దరే ఉన్నారు! ముగ్గురూ భయం భయంగా నన్ను చూస్తున్నారు!

పోలీసు నీళ్లు తెచ్చాడు. షందులో తురకోడు తెచ్చినవి తాగాల్నా! అనే సందేహం. నేను తాగేశాను. ఆకలికీ, దప్పికీ కులమతాలు లేవు. అందరూ తాగారు. పోలీసు తాళం వేసి వెళ్ళిపోయాడు. గదిలో ఉచ్చకంపు! ముచ్చట్లు – సిగరెట్లతో రాత్రి గడిచిపోయింది.

రాత్రి నేను చూడననుకున్న వెలుగు పరచుకుంది. జవాను తలుపు తీశాడు. అందరం వరండాలోకి వచ్చాం. రిమాండు గదిలోవాళ్లుకూడా చేరారు. నలుగురు

కలుస్తే అదొక తీరు. మాటలు ముచ్చట్లు – నవ్వులు – హాస్యాలు – పరిహాసాలు. సరదాగానే ఉంది. వేపచెట్లకింద ముఖాలు కడుక్కున్నాం.

అఫ్జల్ అనుకుంటా - పేరు సరిగ్గా గుర్తులేదు. నన్ను లోనికి పిలిచాడు. మరొక ప్రమాద సూచిక అనుకున్నాను. ఆశించని ఆశ్చర్యం! అనుకొని ఆత్మీయత!! మరల లభించని ఆతిథ్యం!!! ఒకే టేబుల్ మీద ఇడ్లీ, పెసరట్టు - చాయ్ - సిజర్స్ సిగరెట్టు పాకెట్టు!

"సాబ్! ఆప్‌తో ఇన్సానోఁ మే ఫరిస్తే హైఁ ఆప్‌కో కైసీ తక్లీఫ్! అల్లామియాఁనే ఆప్ కో బచాలియా! యహ్ మేరే తరఫ్‌సే ఆప్ కే లియే. ఖుబూల్ ఫర్మాయియే – అయ్యా! మీరు మానవుల్లో దేవతలు మీకేమిటి కష్టాలు! అల్లా మిమ్మల్ని దక్కించినాడు. ఇది నా తరపు ఉపాహారం స్వీకరించండి" అని భక్తి కలిగినట్లు నుంచున్నాడు.

కన్నీరు కాజిం దెబ్బలు సహించగలిగింది. అఫ్జల్ ఆతిథ్యాన్ని దాచుకోలేక పోయింది. "అఫ్జల్, మేరే భాయ్!" అని గట్టిగా కౌగిలించుకున్నాను. నా హృదయం పొంగింది! గండి కొట్టింది! బాష్పధార అయింది. వెక్కివెక్కి ఏడ్చాను.

బయట వారంతా ఉరికి వచ్చారు.
మా దృశ్యం చూశారు.
చిత్తరువులలా నిలిచిపోయారు!

నా జీవితపు ఎడారిలో ఇవి ఒయాసిస్సులు! ఇవి మనసులో చిరకాలం నిలిచే మల్లెపొదలు!! అర్థం - అధికారం కాదు. ఇలాంటివే నా జీవితానికి ఆధారం!!!

శబరి రాముని కోసం జీవిత పర్యంతం వేచింది. కళ్లల్లో వత్తులు వేసుకొని చూచింది. మేఘశ్యాముడు – రాముడు వచ్చాడు. ఆమె బాష్పాకుల అయింది. బీటలు వారిన హృదయం కన్నీటితో పులకించింది.

శబరి రామునికి ఆతిథ్యం ఇచ్చింది. పుల్లగా ఉంటాయో – చేదుగా ఉంటాయోనని పళ్లు రుచి చూచి తినిపించింది. ఒక చల్లని మాట మాట్లాడింది. రుశ్యమూకానికి బాట చూపింది.

ఒక చల్లని మాట - ఇన్ని చల్లని నీళ్లు - ఇంత చల్లని నీడ మనిషికి కొండంత ధైర్యం కలిగిస్తాయి. ఆ ధైర్యంతోనే రాముడు సీతను తెచ్చుకున్నాడు.

అమ్మ ఇంటినుంచి గుండి చెంబులో చాయ్ పంపించింది. ఇద్దరు చెల్లెళ్లు తీసుకుని వచ్చారు. అందరం టీ తాగాం. ఇంతలో అమృతరెడ్డి తండ్రి లక్ష్మారెడ్డిగారు వచ్చారు. కొడుకును విడిపించుకు పోయారు. సాయంత్రం వరకు పూసాల నారాయణ – గూడా సూర్యనారాయణ కూడా విడుదలయినారు. రావూరి గోపయ్యగారితో వచ్చిన కొందరు కూడా విడుదలయినారు. ఇంటి వార్తలు మస్తాను గాని, అఫ్జల్‌గానీ చెపుతున్నారు. భోజనం తెస్తున్న చెల్లెళ్లవల్ల గూడా తెలుస్తున్నాయి.

గ్రామస్తులు ఇంటిని కనిపెట్టుకొని ఉన్నారు. బియ్యం వగైరా సామగ్రి పుష్కలంగా అందుతున్నది. పోలీసు స్టేషనులో అంతగా నిర్బంధం ఏమీలేదు. గోపయ్యగారు

కూడ విడుదలయినారు. వరదయ్యగారి వంటి గ్రామ పెద్దలు నా విడుదల గురించి ప్రయత్నించారు. విఫలులు అయినారు.

మస్తాన్ ప్రతిరోజూ రాత్రిపూట కాపలా పడుకుంటున్నాడు. నాగేశ్వరరావు అమ్మను చెల్లెళ్లను విజయవాడ పంపించే ఏర్పాటు చేశాడు. వాళ్లు వెళ్లిపోయారు. అఫ్జల్, మస్తాన్ ఇద్దరు నేను తప్పించుకోవడానికి సహకరించారు.

ఒకనాటి రాత్రి నేను మొండి గోడ దూకాను. మస్తాన్ అక్కడ సిద్దంగా ఉన్నాడు. మస్తాన్ సుమారు నన్ను ఎత్తుకున్నాడు. ఉరికాడు. గార్ల దగ్గరి పినరెడ్డి గూడెం చేరాం. పెంట్యాల చలమయ్య గారు నాకు ఆప్తమిత్రులు. మస్తాన్ నన్ను వారికి అప్పగించాడు. వెనక్కు తిరిగి వెళ్లిపోయాడు.

చలమయ్యగారు రాత్రికి రాత్రి బండి కట్టించారు. కచ్చడం బండికి తెరలు కట్టారు. ఆడవారు ప్రయాణం చేస్తున్నట్లు కనిపించాలి. ఎవడయినా అడిగినా పలకాలి. అందుకోసం వారి భార్యను నావెంట పంపారు. 'మంగల గూడెం'లో చలమయ్యగారి తండ్రి ఉంటారు. మేము అక్కడికి చేరాం. అక్కడ నేను గుండు కొట్టించుకున్నాను. అచ్చం పూజారి వేషం వేసుకున్నాను. 'పాపటపల్లి'లో రైలెక్కాను. ఎవరూ గుర్తించలేదు.

ఎర్రుపాలెం ఒక ప్రమాదకరం అయిన స్టేషను. ఆ స్టేషను తరువాత యూనియన్ ప్రాంతం మొదలవుతుంది. ఎర్రుపాలెంలో పోలీసులు – రజాకార్లు బండిని సోదా చేస్తారు. దోపిడీలు – హత్యలు – మానభంగాలు జరిగాయి. మా బండి ఎర్రుపాలెంలో గంట ఆగింది. రజాకార్లు కదలమనేవరకూ బండి కదలదు. నావెంట ఒక పోలీసు పడ్డాడు. నిజరూపం తెలుసుకోవడానికి నానా తంటాలు పడ్డాడు. నాకు ఉర్దూ రాదని మొండికేశాను. ఆడుక్కోవడాని వెళ్తున్నానని చెప్పాను. శ్లోకాలు చదివాను. వాని హస్త రేఖలు చూచాను. సాముద్రికం చెప్పాను. బాగానే నటించాను. బయటపడ్డాను.

ఎర్రుపాలెం స్టేషను మీద సోషలిస్టులు దాడి చేశారు. స్టేషనులో ఉన్న పోలీసు క్యాంపును తగలపెట్టారు. పోలీసులతో హోరాహోరి పోరాడారు. ఇద్దరు పోలీసులు – నలుగురు సోషలిస్టులు హతులయినారు. ఈ విషయం నాకు మిత్రుడు – సోషలిస్టు నాయకుడు S. B. గిరి చెప్పారు. చాల కాలం వరకు ఎర్రుపాలెం స్టేషను గోడలకు తూటాల గుర్తులు ఉండేవి.

మీనవోలు ఎర్రుపాలెం దగ్గరి గ్రామం. రజాకార్లు – ఒక తెల సార్జెంటు సహితంగా మీనవోలు మీద దాడి చేశారు. ప్రజలు సాహసోపేతంగా ఎదిరించారు. పోలీసులు కాల్పులు జరిపారు. ప్రజల్లో ఎనిమిది మంది కూలారు. ప్రజలు లక్ష్యం చేయలేదు. వెంటపడి తరిమారు. సార్జెంటును చంపారు. ఆయుధాలు స్వాధీనపరచుకున్నారు. సరిహద్దుమీద ఉన్న కాంగ్రెస్ క్యాంపులో వప్పగించారు. అక్కడ జమలాపురం కేశవ రావుగారి పలుకుబడి హెచ్చు.

తెల్లవారి పోలీసులు – రజాకార్లు మీనవోలుమీద దాడి చేశారు. నానా ఓీభత్సం సృష్టించారు. దోపిళ్లు – హత్యలు – మానభంగాలు చేశారు. గ్రామం సాంతం తగల పెట్టారు. ఆ పొగలు చాలరోజులవరకు కనిపించాయి.

నేను క్షేమంగా బెజవాడ చేరుకున్నాను. రావూరి గోపయ్యగారు నాకోసం ఎదిరి

చూస్తున్నారు. ప్లాట్‌ఫారం మీద నన్ను వారు గుర్తించలేదు. ఏదయినా అవాంతరం జరిగిందేమోనని భయపడిపోతున్నారు.

"బ్రాహ్మణ బాలుణ్ణి. ఆశ్రయం కోరి వచ్చాను. దక్షిణ ఇప్పించండి" అని వారి వెంటపడ్డాను.

"నేనేమో పరేషాన్ల ఉన్న, నువ్వేమో ఎంట పడ్డవు" అంఎ చిరాకుపడుతున్నారు.

"ప్రశ్న అడగండి. సరిగ్గ చెప్పత" అన్నాను.

"అట్లనా?" అని లాల్చీ జేబులోంచి పైసలు తీసి నా చేతిలో పెట్టారు.

అప్పుడు గుర్తించారు. "ఓర్నీయవ్వ! ఎంత పని చేసినవయ్యా. పరేషానయిన. పానం తీసినవ్" అని పెద్దగా నవ్వారు. నన్ను గట్టిగా కౌగిలించుకున్నారు. గిరగిరా తిప్పారు. అప్పటి వారి ఆనందం అనంతం. వర్ణనాతీతం!

**నేను బతికి బయట పడితే వారికెందుకు ఆనందం!**

**అదిగో, అక్కడే ఉంది మానవత్వం! అదే ఆత్మీయత. అదే అనురాగం. అదే ప్రేమ. అదే వాత్సల్యం. అదే అనుబంధం. అదే జీవితం.**

గోపయ్యగారు – నేను "కేసరిపల్లి" వెళ్లాం. అక్కడ వారి కుటుంబం ఉంది. అమ్మ – చెల్లెళ్లు అక్కడికి చేరారు. "బతికి వచ్చినవా నాయ్నా!" అమ్మ నన్ను పట్టుకుని బిగ్గరగా ఏడ్చింది. "ఇంకెన్నాళ్లురా మనకీ కష్టాలు" అని ఎక్కెక్కి ఏడ్చింది. అమ్మను ఓదార్చడం చాల కష్టం అయింది. ఆమె కష్టాలకే పుట్టింది! సుఖాలు ఎండమావులుగా కూడా కనిపించలేదు!

అమ్మా – చెల్లెళ్లు క్షేమంగా చేరిన వార్త గార్లలోనే తెలిసింది. అయినా, వారిని చూచేదాకా నా ప్రాణంలో ప్రాణం లేదు. వారిని చూచిం తరువాత మనసు కుదుటపడింది. అమ్మను – చెల్లెళ్లను కూర్చుండబెట్టుకున్నాను. నా కథ సాంతం చెప్పాను. వారి కథ సాంతం విన్నాను. కలిసి భోజనాలు చేశాం. నేను మానసికంగా ఎంతో ఎంతో అలసిపోయాను. నిర్భయంగా నిద్రపోయాను!

కేసరిపల్లెలో మేము – గోపయ్యగారి కుటుంబం – చలమయ్యగారి కుటుంబం ఉన్నాం. సీతంరాజు కమ్యూనిస్టు. అండర్ గ్రౌండులో పని చేస్తున్నాడు. వాడి భార్య సరస్వతి. వర్ణాంతర విధవా వివాహం. ఆమెను నాకు వప్పగించి వెళ్లాడు. అంత నమ్మకం!

సరస్వతి అందం అయింది. వయసులో ఉంది. నేను గార్లలో సారాయి కొట్లో కూర్చున్నంత నిర్భయంగా కలిసి ఉన్నాం. కలిసి తిన్నాం. కలిసి తిరిగాం. కొందరు అనుమానించారు. కాని, నిష్కళంకంగా తిరిగాం – సీతను వలె – సరస్వతిని – సీతంరాజుకు అప్పగించాను.

తెలంగాణం నుంచి యూనియన్ ప్రాంతానికి లక్షల మంది వలస వచ్చారు. అప్పుడు 'ఆంధ్ర', 'తెలంగాణం' అనే విషపదాలు లేవు. తెలంగాణం నిజాం రాజ్యంలో ఉంది. అది నైజాం. "ఆంధ్ర" ఇండియన్ యూనియన్‌లో ఉంది. అందువల్ల అది యూనియన్ ప్రాంతం.

స్వాతంత్ర్యం వచ్చిన మరుక్షణంలోనే "బ్రిటిషిండియా" అనే పదం మాయం అయింది. ఇందువల్ల స్వరాజ్యం కోసం జనం ఎంత తపిస్తున్నారో అర్థం

అవుతుంది. ఇది ప్రభుత్వాలకు గుణపాఠం కావాలి. అయితే ప్రభుత్వ నిఘంటువునుంచి 'ప్రజలు', 'గుణపాఠం' అనే పదాలు మాయం అయి చాలా కాలం అయింది. మంచి మాట ఏ ప్రభుత్వమూ వినదు. అయినా చెప్పడం మన విధి.

## ప్రజలు సహకరించనిది ఏదీ ప్రభుత్వం చేయలేదు:

బెజవాడ తెలంగాణా నగరం అనిపించేంత మంది అక్కడ చేరారు. ఆకాలంలో కొత్త సినీమాహాళ్లు – కొత్త హోటళ్లు వెలిశాయి. పత్రికల అమ్మకాలు – అప్పటికి ఎన్నడూ లేనంతగా పెరిగాయి. అన్ని పత్రికల్లో నిజాం వార్తలే ప్రధానంగా వచ్చేవి.

నిజాం నుంచి వచ్చిన వాళ్లంతా యూనియన్ వాళ్లు తమను దోచుకుంటున్నారు అనుకునేవారు. ఎంచాతంటే, ఇళ్ల అద్దెలు, సరుకుల ధరలూ పెరిగాయి. కాని, అది సరికాదు. ధరలు అందుబాటు – అవసరం – DEMAND AND SUPPLY మీద ఆధారపడ్డాయి. వర్షంలో రిక్షావాడు ఎక్కువ డబ్బు అడుగుతాడు. అది అతని దోపిడీకాదు. మన అవసరం.

నిజాం ప్రజలు అప్పటికి ఉన్న పరిస్థితుల్లో కావలసింది ఆశ్రయం. అది లభించింది. అందుకు సంతోషించాలి. మిత్రులు వెంకటేశ్వరరావు – కృష్ణమూర్తి బెజవాడ గవర్నరు పేటలో ఉండేవారు. నేను వాళ్లల్లో స్వతంత్రుణ్ణి. అందువల్ల నా ఉనికి విజయవాడ అనవచ్చు. చందా భద్రంగారిని పోలీసులు అరెస్టు చేసి జేలుకు పంపారు. భద్రంగారి భార్య ధనలక్ష్మి గర్భవతి. ఆమె పుట్టింటి వారితో బెజవాడ వచ్చింది. ఆమె కాన్పు బెజవాడ ఆస్పత్రిలో జరిగింది. ఆమెను అదుకోవడానికి నేను, వెంకటేశ్వరరావు – కృష్ణమూర్తి ఆస్పత్రిలోనే ఉండిపోయాం. భద్రం లేడు కాబట్టి అది మా విధి అవుతుంది.

శ్రీమతి ధనలక్ష్మిగారికి కాన్పు కష్టం అయింది. ఆడపిల్లను కన్నది. బిడ్డ కళావతికి ఇప్పుడు మనుమలు, మనుమరాళ్లు ఉన్నారు.

బెజవాడ – గుంటూరు – తెనాలి – ఏలూరు – నూజవీడు – గుడివాడ – వాటి పరిసరాల పల్లెలనిండా నిజాం వాళ్లే. నేను అంతటికీ తిరిగాను. తెనాలి దగ్గరి నాజర్‌పేట అనుకుంటా – నాగేశ్వరరావు సోదరి అత్తవారు. ఆ పేట వీధి హోటల్లో పొగలు కక్కుతున్న ఇడ్లీ వంటి రుచికరం అయింది మళ్లీ దొరకలేదు!

కేసరిపల్లి మంచి మున్యాశ్రమంలా ఉండేది. అక్కడి ప్రజలు మమ్ములను ఎంతో ఆదరించారు. ప్రకాశరావుగారి కిళ్లీ బడ్డీమీద కూర్చునేవాళ్లం. గోపయ్యగారి ఉర్దూ కలిసిన తెలుగు అక్కడి వారికి ఎంతో బాగనిపించేది. గోపయ్య గారివి ఇసుమంత ఎచ్చులు. తానే తెలంగాణంలో కాంగ్రెసును నిర్వహిస్తున్నానన్నట్లు మాట్లాడేవారు. సరదాగా ఉండేది. జలగం వెంగళరావుగారు అక్కడే ఉన్నట్లు గుర్తు.

సాయంత్రం పంచాయతీవాళ్ల రేడియోలో వార్తలు వినడానికి కూడేవాళ్లం. కొంగర జగ్గయ్యగారు – పన్యాల రంగనాధరావుగారు వార్తలు చదివేవారు. మంచి స్వరం – స్పష్టమైన ఉచ్చారణ. వార్తలు – పాటలవలె – ఉండేవి.

మా చిన్న చెల్లెలు అరుణకు ఉక్కపట్టే జబ్బు ఉండేది. ఎప్పటికప్పుడు పోయే

ప్రాణం, వచ్చే ప్రాణంలా ఉండేది. ఆమెను డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ దగ్గరికి తీసికెళ్లాం. ఆమె పార్టీ వ్యక్తి. శ్రద్ధగా చూచారు. మందులు ఇచ్చారు. జబ్బు తగ్గింది.

మా పెద్ద చెల్లెలు శకుంతల కేసరపల్లిలోనే రజస్వల అయింది.

మేము గార్ల తిరిగి వెళ్లినపుడు ప్రకాశరావు – శ్రీరాములు మున్నగువారు మాతో వచ్చారు. పరిసర గ్రామాలలో స్థిరపడ్డారు. ఇప్పుడు వాళ్లు లేరనుకుంటా. వాళ్ల కుటుంబాలున్నాయి. ఆ విధంగా మేము వారికి కృతజ్ఞత చెల్లించాం.

ఒక చిన్నరామాయణ వృత్తాంతం!

రాముడు సుగ్రీవునితో స్నేహం చేశాడు. అధర్మమే అయినా – వాలిని వధించాడు. సుగ్రీవునకు పట్టం కట్టాడు. అది వర్షకాలం. 'శరత్తు మన సంకేతం. వర్షాలు నిలువగనే సీతాన్వేషణ జరగాలి' అని సుగ్రీవునితో చెప్పాడు. రాముడు రుశ్యమూకం మీద ఉండిపోయాడు.

వర్షకాలం పోయింది. శరత్తు వచ్చింది. సుగ్రీవుని జాడ లేదు. రాముడు లక్ష్మణుని సుగ్రీవుని దగ్గరికి పంపాడు. అప్పుడు అన్నమాట ఇది:

**కృతార్థాహ్యా కృతార్థానాం మిత్రాణాం నభవంతియే**
**తాన్మృతానపి క్రవ్యాదాః కృతఘ్నాన్నోప భుంజతే. (4–30–73)**

మిత్రులవుతారు. తమపని నెగ్గించుకుంటారు. మిత్రులను మరుస్తారు. వారి పని చేయరు. అలాంటివారు కృతఘ్నులు. వారి శవాలను కాకులు – గద్దలు కూడా ముట్టవు.

'కృతఘ్నుని మాంసం కుక్కలు తినవు' అనే సామెతకు మహా భారతంలో ఒక చక్కని కథ ఉంది.

కృతజ్ఞత మానవ లక్షణం. కృతఘ్నత రాక్షస లక్షణం.

## త్వమేవాహమ్:

ఆరుద్ర రచించిన త్వమేవాహం కావ్యాన్ని గురించి దాశరధి కృష్ణమాచార్య "యాత్రాస్మృతి" నుంచి:–

"ఆరుద్ర 1949లో నాకో లేఖ వ్రాశాడు.

నా 'త్వమేవాహమ్' అచ్చయ్యాక వచ్చిన ఉత్సాహ పరిచే ఉత్తరము నీ వొక్కడి దగ్గర నుంచే వచ్చింది.

'త్వమేవాఽహమ్' రాయడానికి ఏది ప్రోద్బలమిచ్చిందో ఎవరికీ ఇంకా తెలియదు.

1948 జూలై 10 వ తారీఖు 'కృష్ణాపత్రిక'లో 'నాకా సిగ్గు? నా స్త్రీత్వం ఎప్పుడో పోయింది' అనే పతాకతో ఒక 'రజాకార్లచే చెరచబడ్డ స్త్రీ కథనం' పడ్డది. దాని వివరాలు ఇవి:–

'సుమారు పన్నెండు రోజుల క్రితం విషయం. రైలు గుడివాడ దాటి వెళుతూంది. 'ఇందుపల్లి' సమీపంలోకి వచ్చింది. రైలు పెట్టెలో ఉన్న ప్రయాణీకులు హైదరాబాదు విషయాలు చెప్పుకుంటున్నారు. రజ్వీ దురంతాలు, కాందిశీకుల కష్టాలు వర్ణించి, విషాద భరితులు అవుతున్నారు.

ఇంతలో ఆ పెట్టెలోనే ఉన్న ఒక వనిత నిలబడింది. వలువలు తీసివేసింది. నగ్నముగా నిలబడింది. ఏమిటీ ఘోరమని అంతా తలలు వంచుకున్నారు. ఆమె అలాగే నిలబడింది. ఆ పెట్టెలో ఉన్న ఒక వృద్ధుడు ధైర్యం చేసి 'అదేమిటమ్మా! ఆడ పిల్లవు, అలా నగ్నంగా ఉన్నావు, తప్పు కదూ!' అన్నాడు.

ఆమాటతో ఆమె తోకతొక్కిన రీతిగా లేచిందట. 'తప్పా! నాకు తప్పా! ఏ నోటితో చెపుతున్నారామాట? నేను ఆడదాన్నా? నైజాం కిరాతులు నన్ను వారం రోజులు ఇలా నగ్నంగా చెట్టుకు కట్టివేసి అట్టే పెట్టారు. నా స్త్రీత్వాన్ని ఆనాడే దొంగిలించారు. నా ఆడతనం ఆనాడే పోయింది. ఇంకా ఆడదాని నంటారేమిటి? చూడండి, నావంటి నిండా గాయాలు. స్త్రీత్వం ఒకసారి పోయింతరువాత మళ్లీ వస్తుందా? అలా ఉన్నది మా స్థితి. మీరిలా కూర్చుని కబుర్లు వింటున్నారు. నేనేం సిగ్గుపడవలసింది లేదిక. మీరు పడవలసింది అని ఒక్కొక్క ప్రయాణీకుని దగ్గరకు వచ్చి తన వొంటిని ఉన్న గాయాలు చూపింది. పెట్టెలో వాళ్లంతా సిగ్గుతో తల వంచుకున్నారు. ఆమె విషాద గాథ విని కన్నీరు కార్చారు. తరువాత ఆమె వలువలు ధరించి వెళ్లి ఒకచోట కూర్చుంది. ఆమె అలా అప్పుడప్పుడు అన్ని తరగతుల రైలు పెట్టెలలోకి వెళ్లి ప్రచారం చేస్తుందని తెలిసింది.'

ఆ దృశ్యం కళ్లారాచూచి, ఆమె వాక్కులు విని కన్నీరు కార్చిన ఒక ప్రయాణీకుడు పంపిన ఒక రిపోర్టు అది.

ఈ వార్త చదివాక త్వమేవాహమ్ మొదలెట్టా.
ఆలోచనలు ట్రెయిన్లో ట్రైయిన్లో
పురుషుల మూడవ తరగతి బోగీలో చెట్లనుగురించి
చిట్టెలుకలగురించి చెదపురుగులగురించి
చిన్నచిన్న చీమలగురించి సంభాషణ రెయిన్లో.

ఆరుద్రగారు ఇంత చెప్పినా నాకు "త్వమేవాహమ్" అర్థం కాలేదు. మనం ఎవరికోసం వ్రాస్తున్నామో వాళ్లకు అర్థం కానిది సాహిత్యం - అందునా ప్రగతి శీల సాహిత్యం కాదని నా అభిప్రాయం. ఆరుద్ర రచనలకు వారే వ్యాఖ్యానం చెప్పాలి. మరొకరు చెప్పలేదు.

ఇంతకూ ఇది ఉటంకించింది. కవిత్వ తత్త్వవిచారానికి కాదు. వార్త కోసం. ఆనాటి దౌర్జన్యాలు – ప్రజల యాతనలు – పత్రికల స్పందనా తెలియపరచడానికి మాత్రమే.

"ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు" – ఇది అవంత్స సోమసుందర్ స్పందన!

## ఇరవయి రెండు

### "నిస్సీమాశ్చరిత్ర విభూతయః"
### "చరిత్ర సృష్టించిన వారికి హద్దుల్లేవు":

చరిత్ర గత సంఘటనల కూర్పు. చరిత్ర గత సంఘటనల విశ్లేషణ.

చరిత్ర గత సంఘటనల వాస్తవ చిత్రణ. కాని ఎప్పుడూ విజేతలే చరిత్ర వ్రాశారు. గెలిచినవాడు వ్రాసింది చరిత్ర అయింది. రావణుడు గెలిచి ఉంటే రామాయణం - దుర్యోధనుడు గెలిచి ఉంటే భారతం ఎలా ఉండేవో తెలియదు. అయితే కాలగతి, దైవిక న్యాయం అపరిహార్యములు. మనకు తెలిసిన మానవ చరిత్రలో దుష్టులు - దుర్మార్గులు - నియంతలు గెలవలేదు. న్యాయం గెలిచింది. ధర్మం గెలిచింది. సత్యం గెలిచింది. మానవత గెలిచింది.

హైదరాబాదు స్వాతంత్ర్య సమర చరిత్రలో అసాధారణములయిన విషయాలు వున్నాయి. కొన్ని ఇంతకు ముందు వివరించాను. అహింసయే తమ విధానంగా ప్రకటించిన కాంగ్రెసువారు సాయుధ పోరాటం జరిపారు.

సిద్ధాంతాలకన్న కర్తవ్యం మిన్న. నియమ నిబంధనలకన్న మానవుడు మిన్న. అక్షరాలకన్న విద్య - విజ్ఞానం మిన్న.

ఉద్యమాల్లో - పోరాటాల్లో సాధించాల్సింది - లక్ష్యాలను. లక్ష్యసాధనకు సూత్రాలు మార్చడం దోషం కాదు. తన లక్ష్యసాధనకు రాముడు వాలిని వధించాడు. దుర్యోధనుణ్ణి ఓడించడానికి పాండవులు అధర్మాలు చేశారు. కృష్ణుడు చేయించాడు. కాంగ్రెసువారు ఆయుధాలు ధరించడానికి కారణాలున్నాయి.

1. నిజాం నవాబు నిరంకుశుడు. అతడు అహింసకు లొంగడం అసంభవం.
2. నిజాం నవాబు రజాకార్ల దండును పురికొల్పి ప్రజల మీదికి తోలాడు. వాళ్లు విలయం — వినాశం సృష్టిస్తున్నారు. వారి ముందు సాధువచనాలు చెవిటి ముందు శంఖాలు.
3. కాంగ్రెస్ అనైక్యతల పుట్ట! అది ఎన్నడూ ఏకంగా లేదు. ఎన్నడూ విచ్ఛిన్నం కాలేదు. బహుశః అనైక్యతయే దాని ప్రజాస్వామ్య బలం. కాంగ్రెసులో ఒక గ్రూపు మాత్రమే సాయుధం అయింది. మరొక గ్రూపు నిజాం మంత్రిమండలిలో చేరారు.
4. కమ్యూనిస్టులు సాయుధ పోరాటంతో విజయాలు సాధిస్తున్నారు. ప్రజాయత్తం అవుతున్నారు. వారు గ్రామాలను విముక్తం చేస్తున్నారు.
5. అఖిల భారత కాంగ్రెసు, సంస్థానాల్లో పోరాటాలు నడుపలేదు. స్వాతంత్ర్యం వచ్చాక వాళ్లను లొంగదీయాలనే సంకల్పం కావచ్చు. 'పిల్లలకు బలవంతంగా ఆముదం తాగించినట్లు సంస్థానాధీశులను బలవంతంగా లొంగదీయాలి' అన్నారు మహాత్ములు.
6. పోరాటం సందర్భం కావడానికి వీల్లేదు. 'వజ్రం వజ్రేన భిద్యతే' వజ్రాన్ని వజ్రంతోనే కోయాలి.
7. కాంగ్రెసువారు ఆయుధాలను ధరించడాన్ని మహాత్ముడు అంగీకరించారు అంటారు.

ఇక్కడ ఒక విషయం వివరించాలి. పోలీసు చర్య తరువాత ప్రభుత్వానికి వచ్చిన కాంగ్రెసువారు - సాయుధ కాంగ్రెస్‌వారు కారు. అందువలన చరిత్రలోని ఈ రక్తాక్షరాలను కరెన్సీనోట్లతో చెరిపేశారు.

కాంగ్రెసువారు పొరుగు రాష్ట్రాలయిన మద్రాసులో 21, బొంబాయిలో 23, మధ్యరాష్ట్ర సరిహద్దుల్లో 4 క్యాంపులు పెట్టి పోరాటం నడిపించారు.

మరొక విషయం. నిజాం నిరంకుశత్వాన్ని ఎదిరించడానికి అన్ని పార్టీలు – హిందూ మహాసభ – ఆర్యసమాజం యుక్తంగా ఆయుధాలు ధరించారు. సోషలిస్టులు సరిహద్దు క్యాంపులు నిర్వహించారు.

కమ్యూనిస్టుల యుక్తంగా అన్ని పార్టీలు 1943 సెప్టెంబరు వరకు కలిసి కాకున్నా – ఒకే విధమైన హైదరాబాదు విముక్తికిగాను జాతీయ పోరాటం నిర్వహించారు.

బెజవాడలో గవర్నర్ పేటలో ఒక బంగళాలో కాంగ్రెస్ ఆఫీసు ఉండేది. అది గందరగోళాల ఆఫీసు. ఒకరి పెత్తనం కాదు. బహునాయకత్వం! యూనియన్ ప్రభుత్వ మద్దతువల్ల నడిచింది.

నేనూ – రావూరి గోపయ్యగారు కాంగ్రెస్ ఆఫీసుకు వెళ్లాం – హయగ్రీవాచారిగారిని కలిశాం. నేను మా పరిస్థితులను అంతగా వివరించాల్సిన అవసరం లేకపోయింది. అన్నయ్య అయ్యవారికి బాగా తెలుసు. పరిస్థితులు అర్థం చేసుకున్నారు.

"నువ్వు కమ్యూనిస్టుల్ల ఎందుకు పనిచేస్తవయ్య. మీ అన్నయ్య కూడ నొచ్చుకున్నాడు. మాతో ఉండరాదు? మేమేం పనికిరామా!"

"అదేం లేదండీ. నేను కమ్యూనిస్టు వ్యతిరేకిని కాను. గార్లలో కాంగ్రెస్ లేదు. పని చేయడానికే వచ్చాను."

"అరే! మేమూ వ్యతిరేకులం కామయ్యా! వాళ్లు మనకేమన్న శత్రువులా? నువ్వు పట్టుదల గలవాడివి. నీ సంగతులు అన్నీ విన్న పరిటాల పో. అక్కడ తుపాకి నేర్పుతరు. తరువాత క్యాంపుకు పంపుత, ఏమంటవ్?" అని నాకు కొంత డబ్బు – చీటి ఇచ్చారు.

గోపయ్యగారికి పోరాటం మీద విశ్వాసం లేదు. నాకు తోడుగా వచ్చారు. ఇద్దరం కేసరిపల్లి వెళ్లాం. అమ్మకు డబ్బు ఇచ్చాను. నన్ను తప్పించడానికి ఎంత సాయం చేశారో పెంట్యాల చలమయ్యగారు – కేసరపల్లిలో మా కుటుంబ పోషణకు అంతసాయం చేశారు. తరువాత కాలంలో వారి రుణం మరో తీరుగా తీర్చుకున్నాను.

మా కుటుంబాన్ని చలమయ్యగారు – గోపయ్యగారికి అప్పగించాను. నేను పరిటాల చేరాను. పరిటాలకు ఒక కథ ఉన్నది. వజ్రాల క్వారీలున్నాయి. కోహినూర్ వజ్రం ఇక్కడే దొరికింది అంటారు. అప్పుడు అది గోలకొండ రాజ్యంలోనిది. కాబట్టి కోహినూరు గోలకొండలో దొరికిందంటారు.

పరిటాల నిజాం రాజ్యంలోని జాగీరు. ఆజాగీరు చుట్టూ కృష్ణా జిల్లా ఉభయ ప్రభుత్వాలకు సఖ్యత ఉన్నంత కాలం బావుంది. స్వాతంత్ర్యం రాగానే నవాబు పారిపోయాడు. నిజాంతో సంబంధం లేనందున కాంగ్రెస్ వారు పరిటాలను 'రిపబ్లిక్' గా ప్రకటించారు. ఇందుకు యూనియన్ ప్రభుత్వ ప్రోత్సాహం ఉంది. ఇందుకు విషయం వేరే చెప్పనవసరం లేదు.

నిజాం రాజ్యం నుంచి తొలుత విముక్తం అయిన ప్రాంతం పరిటాల.

పరిటాలను యూనియన్ ప్రభుత్వం ఆక్రమించలేదు. కాబట్టి అక్కడి ప్రభుత్వం ఇండియన్ యూనియనుది కాదు.

పరిటాలలో – ఒక రాజకీయ పార్టీ – కాంగ్రెస్ పరిపాలన సాగించింది.

**సుదీర్ఘ భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో ఒక భూభాగాన్ని - ఒక రాజకీయ పార్టీ పాలించడం - హైదరాబాదు స్వాతంత్ర్య సమర చరిత్రలోనే సాధ్యం అయింది.**

ఒక నిర్దిష్ట ప్రభుత్వం విధానం లేదు. నామ మాత్రంగా ప్రభుత్వం సాగింది. రోడ్డు పక్కనున్న "ముసాఫర్ బంగ్లా" ఆఫీసుగా ఉండేది. బెజవాడ నుంచి నైజాం పోవడానికి "పరిటాల" దాటాలి. వాహనాల్లో ఆయుధాలు రవాణా కాకుండా చూడడం కార్యకర్తల ప్రధాన కర్తవ్యం. కార్యకర్తలే వలంటీర్లు – పోలీసులు. వారు వాహనాలను సోదా చేసి పంపేవారు. ఆ కార్యక్రమంలో నేను కూడా పాల్గొన్నాను.

పరిటాల క్యాంపు ముఖ్య కార్యక్రమం తుపాకి నేర్పడం. పర్సా కిషన్ రావుగా రనుకుంటా నేర్పేవారు. గురి చూడడం – కొట్టడం నేర్పేవారు. నాకూ నేర్పారు. నాకు గురి చూడడం – కొట్టడం చాల తొందరగా వచ్చింది. నేను అందరికంటే సూటిగా కొట్టాను. ఫస్టు కూడా వచ్చాను. పర్సావారు నన్ను మెచ్చుకున్నారు.

**తుపాకి నేర్చుకోవడమే - ప్రయోగం తక్కువ. ఆయుధం బెదిరించడానికే - వాడకం తక్కువ. ప్రపంచంలో ఆయుధాలు - అటం - హైడ్రోజను బాంబుల సహితంగా - కోట్ల కోట్ల డాలర్లవి తయారవుతున్నాయి! వీటిలో ఎన్నింటిని వాడుతున్నారు! ఎన్నటికయినా వాడడం సాధ్యమా? ఇంత వృధా కర్చు ఎందుకు జరుగుతున్నది? ఒక దేశం తమ పెత్తనం నిలుపుకోవడానికి - ఇతర దేశాలు ఆ దేశంనుంచి రక్షణకు!**

**ఈ దుష్టవ్యయం నిలిపివేస్తే లోకంలో ఆకలి - దరిద్రం దూరం అవుతాయి.**

**ఒక జాతిగా మానవునికి - ఒక వ్యక్తిగా మానవునికి శాంతి ఎల్లవేళలా ఎండమావులే. అందుకే వేదం 'శాంతిరేవ శాంతిః' అంటుంది. శాంతికి సహితం శాంతి కావాలట!**

## "తాత్కాలికం:"

నిజాం రాజు – జన్మజన్మల బూజు – స్వతంత్ర భారత ప్రభుత్వానికి ఒక బెడదగా తయారయ్యాడు. వాడి మాటలు – చేతలు వెర్రివాని చేష్టలు అయినాయి. ఏనుగును దోమ సతాయించగలదు. వెర్రివాడు అందరిని ఏడిపించగలడు!

భారతదేశం అనధికార దిగ్బంధం విధించింది. భారత భూభాగం నుంచి మందులు, ఉప్పలాంటి వస్తువులు నిలిచిపోయాయి. రజ్వీ – నిజాము చిందులు తొక్కారు. కాని, బాధపడింది ప్రజలు! ఫ్యాక్టరీలు మూతపడ్డాయి. పెట్రోలు లేదు. రవాణా బంద్!

నిజాం దుష్టత్వానికి దిగాడు. పాకిస్తానులో చేర్తానంటాడు. పాకిస్తానుకు ఇరవై కోట్లు ఇస్తాడు. సిడ్నీకాటన్‌తో దొంగ ఆయుధాలు తెప్పిస్తాడు. యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్స్ – U.N.O.కు ప్రతినిధులను పంపుతాడు.

ఈ బెడదను నిలుపు చేయడానికి 1947 నవంబరు ప్రాంతంలో ఉభయ ప్రభుత్వాలకు ఒక ఒడంబడిక కుదిరింది. అది యధాతథపు ఒడంబడిక – STAND STILL AGREEMENT. అది ఒక సంవత్సరం అమల్లో ఉంటుంది. అందులో పెద్దగా చెప్పుకోదగింది ఏమీలేదు. అంతకు ముందున్న పద్ధతి కొనసాగుతుంది. ప్రధాన విషయం – నిజాం పాకిస్తాన్‌లో చేరడు! ఉభయ ప్రభుత్వాలు ఏజంట్స్ – జనరల్‌ను నియమించుకోవచ్చు.

ఈ ఒడంబడికను పార్టీలు – ప్రజలు – పత్రికలు హర్షించలేదు. ఉభయ ప్రభుత్వాలూ మెచ్చుకోలేదు. ఇది BREATHING TIME – అన్నాడు సర్దార్ పటేల్ ఉభయులకూ కొంత విరామానికి సమయం దొరికింది.

భారతప్రభుత్వం కన్హయ్యాలాల్ మానిక్‌లాల్ మున్షీ – K.M. మున్షీని ఏజెంట్ జనరల్‌గా నియమించింది. నిజాం ప్రభుత్వం "జయిన్ యార్ జంగ్"ను నియమించింది.

మున్షీ విద్వాంసుడు. రచయిత. భారత సంస్కృతి విషయంలో ఎనలేని అభిమానం గలవాడు. వారు భారతీయ విద్యాభవన్ వ్యవస్థాపకులు. "జై సోమనాథ్" అనే ప్రఖ్యాతమైన నవల వ్రాశారు. "కృష్ణావతారం" వారు రచించిన విశిష్ట గ్రంథం.

మున్షీ వ్యవసాయశాఖ మంత్రిగా ఉన్నప్పుడే అడవుల అవసరాన్ని గుర్తించారు. వన మహోత్సవ సంప్రదాయం వారే ప్రారంభించినట్లు గుర్తు.

1948 జనవరి 5 న మున్షీ హైదరాబాదు చేరుకున్నారు. నిజాం – వారి నివాసానికి రెసిడెన్సీ కోటీ – ఇవ్వలేదు. నిరాకరించారు. అతనికి భయం – మున్షీకీ బ్రిటిష్ రెసిడెంట్ హోదా వస్తుందని! మున్షీ సికిందరాబాదులోని సైనిక నివాసంలో విడిశారు.

K.M. మున్షీ 'నందిగామ' వస్తున్నారని తెలిసింది. నందిగామ పరిటాలకు కాలి నడక దూరం.

నందిగామ కమ్యూనిస్టులకు పెట్టిన కోట. అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఒకే కమ్యూనిస్టు సభ్యుడు పిల్లమర్రి వేంకటేశ్వరరావు నందిగామనుండి ఎన్నిక అయినారు.

మున్షి నందిగామ వస్తున్నారు అనే విషయం తెలిసింది. నేను, పరిటాల మిత్రులు – కాలినడకన – నందిగామ చేరుకున్నాం. అప్పటికే గూడా సూర్యనారాయణగారు పరిటాల చేరుకున్నారు. మున్షీగారు రోడ్డు పక్కనున్న డాక్ బంగళాకు వస్తారు. జనం ఎక్కువగా లేరు. కాని వచ్చినవాళ్లు రోడ్డుమీద – బంగళా ఆవరణలో – ముచ్చట్లు – పెట్టుకుంటూ నుంచున్నారు.

కమ్యూనిస్టు బృందం అరుణ పతాకాలతో వచ్చింది. మున్షీ వ్యతిరేక నినాదాలు ప్రారంభించింది. వారు తాత్కాలిక ఒప్పందాన్ని నిరసిస్తున్నారు. తాత్కాలిక ఒప్పందం వల్ల నిజాముకు ప్రజా ఉద్యమాలను అణచే అవకాశం లభించిందని పార్టీ అభిప్రాయం. వాస్తవంగా తాత్కాలిక వప్పందం భారత ప్రభుత్వం సహితంగా ఎవరికీ నచ్చలేదు.

మున్షీ వచ్చారు. అరుగుమీద కుర్చీలో కూర్చున్నారు. సభకు వచ్చినవారు విడిస్థలంలో కూర్చున్నారు. మున్షీ మాట్లాడటానికి ఉపక్రమించారు. కామ్రేడులు నినాదాలు చేశారు. వారిని వెనక్కు వెళ్లిపొమ్మన్నారు. వారిని మాట్లాడనివ్వలేదు.

మున్షీ నచ్చ చెప్పారు. వారి హిందీ వీరికి అర్థం కాలేదు. కొన్ని వాదోపవాదాలు జరిగాయి. కమ్యూనిస్టులు మున్షీ మీద పడ్డారు. పోలీసులు వారిని రక్షించారు. మున్షీని ఒక గదిలో ఉంచారు. దానికి కాపలా కాశారు. అయినా కమ్యూనిస్టులు కదల్లేదు. మున్షీకారులో వెళ్లిపోయింతరువాత వాళ్లు వెళ్లిపోయారు!

మేము మున్షీగారి ఉపన్యాసం విందామని వెళ్లాం. నిరాశతో తిరిగి వచ్చాం. పార్టీ నిర్ణయం సరియైంది కావచ్చు. నందిగామలో వారి చర్య నాకు ఏమాత్రం నచ్చలేదు. ఎదుటివానిమాట వినడం ప్రజాస్వామ్యం అవుతుంది. మాట్లాడనీయకపోవడం నియంతృత్వం అవుతుంది. నియంతృత్వం ఏరూపంలో ఉన్నా - ఛాందసం ఏరూపంలో ఉన్నా - ఇవ్వాల్టికీ - నాకు నచ్చదు!

## "పాపీచిరాయుః"

ఇది ఇలా ఉండగా 1947 డిసంబరు 4 న నిజాం నవాబుమీద బాంబు విసిరారు.

నిజాం నవాబు రోజా నమాజుకు – కింగ్ కోటీనుంచి మక్కామసీదుకు వెళ్తాడు. అతని వాహనం చేరుకునే దానికి కొంతముందు – పోలీసులు ఒక పక్క ట్రాఫిక్ కాళీ చేయిస్తారు. ప్రభువుల దురహంకారం ఏమంటే – తమ శాసనాలను పాటించరు. నిజాంకారు. ఎడమ భాగంకాదు – రోడ్డుకు కుడి భాగంనుంచి సాగుతుంది.

ఆనాటి సాయంకాలం ముగ్గురు యువకులు – నారాయణరావు పవార్ – గండయ్య – జగదీశ్ నైజాం నవాబును హతమార్చడానికి వ్యూహం ఏర్పరచుకున్నారు. ముగ్గురూ మూడు బాంబులు తీసుకున్నారు. 1. నారాయణరావు పవార్ ఆల్ సెయింట్స్ దగ్గర బాంబు విసురుతాడు. అది తప్పితే 2. మరికొంత దూరంలో గండయ్య బాంబు వేస్తాడు. అదీ తప్పితే 3. మరికొంత దూరంలో జగదీశ్ బాంబు విసురుతాడు. ఇదీ వ్యూహం. ఆ సాయంకాలం నిజామును ఖతం చేయాలని పథకం.

నిజాం వాహనాల బిడారు కింగ్ కోటీనుంచి సాగింది. పోలీస్ విజిల్స్ – జనాన్ని పక్కకు నెట్టడం – హడావుడి ప్రారంభం. బిడారు సాగిపోయింది.

నిజాంకారు ఆల్ సెయింట్స్ ముందుకు వచ్చింది.

పవార్ నిజాం కారుమీద బాంబు విసిరాడు.

బాంబు గురి తప్పింది! కారు తలుపుకు తగిలింది. తుస్సుమన్నది.

డ్రైవరు కారును నిలిపాడు. వెనక్కు తిప్పాడు. నవాబు క్షేమంగా కింగ్‌కోటీ చేరాడు. పాపీచిరాయుః.

నారాయణరావును వెంటనే అరెస్టు చేశారు. గండయ్యను మూడు రోజుల తరువాత పాలమాకులలో అరెస్టు చేశారు. అప్పటికే జగదీశ్ నిజాం పొలిమేరలు దాటాడు.

నారాయణరావునూ – గండయ్యనూ సెషన్స్ జడ్జి ముర్తుజాఖాను విచారించాడు. నారాయణరావుకు ఉరిశిక్ష – గండయ్యకు యావజ్జీవ కారాగార శిక్ష విధించాడు.

ఈ ఉదంతం విని అన్నయ్య దాశరథి జేల్లో రచించిన "అగ్నిరసం" –

"ఒక కప్పు అగ్నిరసం త్రాగిన
నారాయణరావ్!

నీ హస్తం విసిరిన రవిగోళం
నరకాసుర మర్దనానికి
నడచిన యాదవ యోధుని
కోదండ వినిర్గత బాణం."

నారాయణరావు – గండయ్యలు శిక్షలు ధృవీకరించకముందే పోలీసు చర్య జరిగింది. వారిని విడుదల చేశారు.

నేను మున్సిపల్ కార్పోరేషనులో పని చేస్తున్నపుడు జగదీశ్ నా అధీనంలో పనిచేసే 'కామటి' అంటే కూలి. అది ఆరవ దశకం. తెల్లని కద్దరు బట్టల్తో చిరునవ్వుతూ – చేతులు కట్టుకొని నుంచునేవాడు. జగదీశ్‌ను నాతో సమంగా కూర్చోబెట్టుకున్నాను. ఇద్దరం కలిసి చాయ్ తాగాం. అతనికి కూలిపని తప్పించగలిగాను.

**బ్యూరోక్రసీని ఉర్దూలో "నౌకర్ షాహీ" అంటారు. అంటే నౌకర్ల రాజ్యం. ఆఫీసరు, గుమాస్తా అందరూ నౌకర్లే! ప్రజా ప్రభుత్వంలో 'ప్రజ' పేరుకే. ప్రభుత్వం కనిపించదు. కనిపించేది నవుకర్ల సర్కారే!**

**జగదీశ్ సమర యోధుల పెన్షనుకు అప్లైచేశాడు.**

**జేలు సర్టిఫికేటు సమర్పించమన్నారు!**

**భగత్‌సింగ్ తల్లిని కూడా జేలు సర్టిఫికేటు అడిగారట!**

**మన అధికారులు అంతటి దేశభక్తులు!**

నేను రాజ్యంలో ఎక్కడున్నా అరెస్టు చేయమని నిజాం ప్రభుత్వపు హోం సెక్రటరీ వారంటు జారీ చేశారు. నేను అది సమర్పించుకున్నాను. "చెల్లదు" అని జవాబు వచ్చింది!

అనంతరం పెద్దలు గ్రహించారు. జగదీశ్‌కు, నాకూ పెన్షను వచ్చింది.

## సూర్యబింబం రాలింది:

తుపాకి శిక్షణ పూర్తి చేసుకుని బెజవాడ చేరుకున్నాను. కార్యక్రమం చేపట్టే ముందు కేసరిపల్లి వచ్చాను. అమ్మా – చెల్లెళ్లు బావున్నారు. అమ్మకు – ఏదో బరువు దింపుకున్నట్లనిపించింది. ఉభయ మిత్రులూ వారికి ఎలాంటి లోపం రానివ్వడం లేదు. అన్నయ్య దగ్గరినుంచి అప్పుడప్పుడూ ఉత్తరాలు వస్తున్నాయి.

నిజాం నుంచి బయట పడ్డే ఏదో జేలునుంచి – నిర్బంధం నుంచి – యమకూపం నుంచి బయటపడినట్లుంది. స్వతంత్ర దేశంలో – విశాల ప్రపంచంలో – వెలుగులోకి వచ్చినట్లుంది. ఏదో ఒక రకంగా పోరాటంలో పాల్గొంటున్నామని తృప్తి ఉంది.

**ఆర్జించడంలో ఆనందం లేదు.**

**త్యాగంలో ఆనందం ఉంది.**

**అది ఇంకెందులోనూ లేదు.**

1948 జనవరి 30 శుక్రవారం. మేమంతా ప్రకాశరావు కిల్లీ బడ్డీమీద కూర్చున్నాం. సాయంత్రపు సోడాలు తాగాం. సిగరెట్లు కాల్చాం. సరదా కబుర్లలో ఉన్నాం.

బస్సు బెజవాడనుంచి గన్నవరం పోతున్నది.

"మహాత్ముని హత్య చేశారు!" బస్సులోంచి కేక వేసి చెప్పారు.

అమాంతంగా నిశ్శబ్దం.

అంధకారం అలముకుంది.

నేను తల బాదుకున్నాను. ఎలుగెత్తి ఏడ్చాను. అందరూ దుఃఖంలోనే ఉన్నారు. ఏడ్చింది మాత్రం నేనే. తల బాదుకొని ఏడ్చాను. నా ఏడుపే ఊరికి ఎరుకపరచింది. అమ్మ పరిగెత్తుకొని వచ్చింది. నన్ను పట్టుకున్నది. తల నిమిరింది. ఓదార్చింది. అప్పుడన్నాను:–

వెలుగులేని లోకంలో

బ్రతికేదెట్లా భాయీ!

ఊరంతా పంచాయితీ రేడియో దగ్గర కూడింది. వార్త అదే. జగ్గయ్య వార్తలు చదివినట్లు గుర్తు. ఖంగుమనే గొంతులో విషాదం!

ఊరు సాంతం మూగపోయింది.

"The light has gone out of our lives" అని – సరిగ్గా నేను తెలుగులో అన్నమాటలే జవహర్‌లాల్ నెహ్రూ భారత ప్రధాని – ఇంగ్లీషులో అన్నారు.

ఆ దురంతం చూడలేకపోయాడు. సూర్యుడు అస్తమించాడు. లోకంలో చీకట్లు కమ్ముకున్నాయి! వివరాలు:––

1948 జనవరి 30 శుక్రవారం సాయంత్రం 4.00 గంటలు. సర్దార్ పటేల్ మహాత్ముని దర్శించారు. ఇద్దరూ మాట్లాడుతున్నారు. అయిదు అయింది. ప్రార్థన సమయం. మహాత్ముడు సర్దార్‌ను పంపించారు.

మహాత్ముడు గడియారం తీశారు. చూచారు. 5.10 అయింది. ప్రార్థనకు బయలుదేరారు. మనుమరాళ్లు మను, అభ పక్కన ఉన్నారు. వారు ప్రార్థనాస్థలానికి సాగారు. ఇద్దరు పిల్లలమీద రెండు చేతులు వేశారు. నడిచారు.

మహాత్ముడు కొంతదూరం నడిచారు. ప్రార్థనకు వచ్చిన జనం కనిపించారు. వారంతా నమస్కరించారు. గాంధీజీ పిల్లల బుజాలమీదినుంచి చేతులు తీశారు. చేతులు జోడించారు. ఎల్లరకూ నమస్కరించారు.

అలా సాగుతున్నారు జాతిపిత. అప్పుడు నాథూరామ్ గోడ్సే గుంపును నెట్టుకుంటూ దూసుకు వచ్చాడు. 'మను' గోడ్సేను చూచింది. అతడు బాపూజీకి పాదాభివందనం చేయడానికి వస్తున్నాడనుకుంది. అతని బుజం పట్టుకుంది.

గాడ్సే 'మనూ'ను విదిలించాడు. విడిపించుకున్నాడు.

బాపూజీ ముందుకు వంగారు

గాడ్సే పిస్తోలుతో బాపూరొమ్ముకు పేల్చాడు.

నమస్కరించడానికి లేచిన బాపూ చేతులు మెల్లగా వాలేయి. గుండు రొమ్ముకు కుడిపక్కన తాకింది!

గాడ్సే వెంటనే మరో రెండు బుల్లెట్లు పేల్చాడు.

మహాత్ముడు కుప్పకూలారు!

"హే రామ్" అన్నారు. అది వారి చివరి వాక్కు.
మహాత్ముని మత రక్కసి పొట్టన పెట్టుకుంది.

ప్రధాని నెహ్రూ తాను అన్న మాటలకు మరిన్ని జోడించారు. అవి నిత్య సత్యాలు!

"The light has gone out of our lives....yet I am wrong, or the light that shone in this country was no ordinary light .... and a thousand years later that light will still be seen in this country and the world will see it. For that light represented the living truth."

**"మన జీవితాల వెలుగు మలిగింది కాదు. అది సరికాదు. ఈ దేశంలో వెలిగిన ఆ అనంత ప్రకాశం సాధారణం కాదు. వేల సంవత్సరాల అనంతరం సహితం ఆ కాంతి ఈ దేశంలో ప్రకాశిస్తుంటుంది. సమస్తలోకం ఆ కాంతిని కాంచగలుగుతుంది.**

**కారణం అది నిత్య సత్యకాంతి"**

ప్రపంచమంతటా సంతాపం ప్రకటించబడింది. లోకం దుఃఖసాగరంలో మునిగింది. దేశాధినేతలు – ప్రముఖులు – విద్వాంసులు – విజ్ఞాన ఖనులూ సంతాప సందేశాలు పంపించారు.

భారతదేశంలో దుఃఖం భరించలేక కొందరు ప్రాణాలు వదిలారు. కొందరు ఆత్మహత్యలకు పాల్పడ్డారు.

తెల్లవారి జనసాగరం దుఃఖసాగరంలో మునుగగా రాజ్ ఘాట్ లో అంత్యక్రియలు జరిగాయి.

అన్ని నదుల్లోనూ అస్తి నిమజ్జనం జరిగింది.

బెజవాడలో కృష్ణానదిలో జరిగిన అస్తి నిమజ్జనాన్ని నేను సైతం దర్శించుకున్నాను.

## కర్మభూమి:

మహాత్ముని అంత్యక్రియలు అయిపోయాయి. నేను బెజవాడ కాంగ్రెసు ఆఫీసుకు వెళ్లాను. 'నువ్వు మంచిగ తుపాకి నేర్చినవని చెప్పిన్రు. సిరిపురం పోతవా?' అడిగారు హయగ్రీవాచారిగారు. వెళ్తానన్నాను. 'అయితెపో' అని ఒక కాగితం వ్రాసి ఇచ్చారు. నేను మెట్లు దిగాను. మళ్లీ పిలిచారు. "మొదలు వీళ్లవెంట పోయిరా" అని నాకు ఒకర్ని చూపారు. వారితో వెళ్లాను. గంగినేని దగ్గర పట్టాలు పీకాం. ఒక గూడ్సు పడింది. గుండ్రాతిమడుగు దగ్గర ఒక ట్రాలీమీద దాడి చేశాం. నేను ఆ బృందం వెంట ఉన్నాను. నా భాగస్వామ్యం అంతగా ఉన్నట్లు గుర్తులేదు.

అయ్యగారు సిరిపురం పొమ్మన్నడు. ఎట్ల పోవాల్నో చెప్పలే. యాడున్నదో చెప్పలే. మిత్రులు గండి మల్లికార్జునరావుగారు కనిపించారు. వారిది డోర్నకల్లు. వారు సిరిపురం కాంగ్రెస్ క్యాంపులో ప్రధాన బాధ్యత నిర్వహిస్తున్నారు. వారికి మా విషయం సాంతం తెలుసు. వారు నాకు డబ్బు ఇచ్చారు. ఇంట్లో ఇచ్చి సిరిపురం రమ్మన్నారు. మార్గం క్రమం చెప్పారు.

నేను కేసరిపల్లి వెళ్లాను. అమ్మకు డబ్బు ఇచ్చాను. వెంటనే బయల్దేరాను. సిరిపురపు కథా క్రమం బెట్టిదనగా:-

పరిటాల చుట్టూ కృష్ణా జిల్లా ఉందని చెప్పాను. అలాగే మునగాల పరగణా చుట్టు నల్లగొండ జిల్లా. అంటే నిజాం. మునగాల పరగణా కృష్ణా జిల్లాలోనిది. యూనియన్ ప్రాంతం. మునగాల రాజావారు నాయిని వెంకటరంగారావుగారు. కృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయ స్థాపన సందర్భంగా వీరిని గురించి ప్రస్తావించాను.

నిజాం ప్రాంతాల మీద దాడికి మునగాల అనువుగా ఉంటుంది. అందువల్ల అక్కడ క్యాంపులు ఏర్పాటు చేశారు. అలాంటి క్యాంపులలో సిరిపురం ఒకటి. అయితే బెజవాడ నుంచి సిరిపురం చేరడానికి నిజాం ప్రాంతం కోదాడు దాటాలి. కార్యకర్తలు బస్సులమీద వెళ్లరు. ఎంచాతంటే - కోదాడులో నిజాం పోలీసులు గట్టి నిఘా ఏర్పాటు చేశారు. పరిటాలలో కార్యకర్తలవలె - కోదాడులో పోలీసులు ప్రతి వాహనాన్ని నిశితంగా పరిశీలిస్తారు. ఈ విషయం నాకు తెలియపరచలేదు.

నేను బస్సులో మునగాలకు బయలుదేరాను. కోదాడులో బస్సు ఆగింది. పోలీసులు చుట్టుముట్టారు. వాళ్లలో గార్ల పోలీసుకూడా ఉన్నాడు. వాణ్ణి చూశాను. నాకు కాలం మూడింది. అనుకున్నాను. గార్ల పోలీసు దృష్టినుంచి తప్పుకోవాలి. నేను బచ్చాగాణ్ణి. నన్ను వేరే వాళ్లు గుర్తించరు. నేను చప్పున బస్సు దిగాను. పోలీసులు నా జేబులు - సంచి చూశారు. పంపించారు. నేను మూత్రపు మిషన చెట్టుచాటుకు వెళ్లాను. తప్పుకొని చాటుకు వెళ్లిపోయాను. అలా జారుకున్నాను. బస్సు నాకోసం వేచింది. నేను తిరిగి రాలేదు. అప్పుడు అనుమానించారు పోలీసులు. అది గతజల సేతు బంధనం!

ఎన్నిసార్లు ఇలా పోయే ప్రాణం - వచ్చే ప్రాణం! నాకు డొక్క జబ్బు. తిండి లేక జీవిస్తున్నాను. ఈ మధ్య వాంతిలో రక్తం పడింది. దరిద్రం. చికిత్సలేదు. కుటుంబ భారం. గార్లలో చచ్చి బతికాను. ఇప్పుడు మళ్లీ ఈ దశ. వారంటు ఉన్న విషయం విన్నవించాను.

అసలు విచిత్రం ఇంతకాలం ఎలా బ్రతికాను అని.

**ప్రాణం పోవడం ఆశ్చర్యం కాదు. గాలియే కదా! గాలి నిలవడమే ఆశ్చర్యం అంటాడు ఒక ఉర్దూ కవి.**

**ప్రపంచంలో అన్నింటిని మించిన వైచిత్రి జీవితం!**

**జీవితం కన్న విచిత్రమయింది మరొకటి లేదు!!**

**జీవితం ఎందుకు వచ్చింది? ఎటు పోతుంది? కస్త్వం? కుత ఆయాతః? ఇంతవరకు అంతు పట్టలేదు!**

కొంతసేపు అలా దుబ్బుల్లో - తుప్పలో దాక్కున్నాను. బస్సు వెళ్లింది చూచాను. నాకోసం ఎవరూ రావడం లేదని ధ్రువపరచుకున్నాను. బయలుదేరాను. కాలి నడకన సాగాను. గ్రామాల్లోకి ప్రవేశించలేదు. ఎవరెవర్నో అడుక్కుంటు పోగాను. తోవలో నీళ్లు కూడా త్రాగలేదు. నడిచీ నడిచీ మునగాల చేరాను. ఎందుకో ఇది మన రాజ్యం - మన ఇల్లు అన్నంత విశ్వాసం - భద్రత!

మునగాల నుంచి నడవలేకపోయాను. ఈ మనస్సుందే అది బడే బద్మాషుది! అంతదూరం నడవనిచ్చింది. స్థిరత్వం ఏర్పడింది - మొరాయించింది.

ఒక తల్లి వాకిట్లో కూర్చొని ఉంది. ఆమె నా స్థితిని గమనించింది. ఆడదానిది తల్లి మనసు. "నాయనా! నీళ్లు తాగుతవా?" దాంతో సేద దీరింది. అరుగుమీద కూలబడ్డాను. మాటసైతం రావడం లేదు. సీతమ్మ కంచుచెంబుతో నీళ్లు తెచ్చి ఇచ్చింది. నీళ్లు ఆశగా తాగాను. ముఖంమీద పోసుకున్నాను. కాళ్లు చేతులు కడుక్కున్నాను. తుడుచుకోలేదు. సీతమ్మ తల్లి చూస్తేనే ప్రాణం నిలిచింది. నీళ్లు తాగాను. ప్రాణం ఎదలో చేరింది.

"సద్యోబలకరం త్రీణి. వారి, వారిచరః, పయః" అన్నాడు.

వెంటనే బలం ఇచ్చేవి మూడు. నీరు, చేపలు, పాలు.

భగవంతుడు, దయామయుడు - కరుణాసముద్రుడు. ఇలా ఎవరినో చూపుతూనే ఉంటాడు. ఆకాశంలో పక్షికే ఆధారం కల్పించాడు. నేలమీద మనకు కల్పించడా? అంటారు ఆదిశంకరులు.

సీతమ్మతల్లి ముచ్చట పెట్టింది. అన్నం పెట్టింది. 'ఇప్పుడు పోకు బిడ్డా! చీకటి పడ్డది. పొద్దున్నే లేచిపో' అని చాప ఇచ్చింది. సీతమ్మ నీడలో కన్ను మలిగింది. తెల్లవారి లేచాను. సీతమ్మ ఆశీస్సులు పొందాను. బయలుదేరాను.

ఇది అన్నపూర్ణల దేశం - కాని ఇప్పుడు మృగ్యం అయినారు.

"అన్నపూర్ణా ఇంటిలోనా అన్నమే కరువాయెగా" - దశకు చేరుకున్నాం.

సిరిపురం చేరుకున్నాను. మల్లికార్జునరావుగారు కనిపించారు. ఇంకొందరు తెలిసినవాళ్లున్నారు! మాటేటి కిషన్‌రావుగారు గార్లవారు 2. నరసింహారెడ్డిగారిది పెరుమాళ్ల సంకీస. నేను చదివిన ఆరవ క్లాసువరకు సహాధ్యాయి. 3. బొగ్గారపు సీతారామయ్యది గార్ల జాగీరు పండితాపురం. తొలినుంచీ కాంగ్రెసు వాది. కమ్యూనిస్టు ద్వేషి. గార్ల జాగీరులో తొలి కాంగ్రెస్ సత్యాగ్రహి. జేలుకు వెళ్లి శిక్షపూర్తి చేసుకొని వచ్చారు.

సిరిపురం కాంగ్రెసులో స్థూలంగా రెండు ధోరణుల వారున్నారు.

1. కమ్యూనిస్టు ద్వేషులు. దాడుల్లో వారి మొదటి గురి కమ్యూనిస్టులు. తరువాతనే రజాకార్లు. వస్తుతః వీరు భూస్వాములు. నరసింహారెడ్డి – సీతారామయ్య అలాంటివారు.
2. మాజీ కమ్యూనిస్టులు – లేదా కమ్యూనిస్టు అభిమానులు. వీరు కమ్యూనిస్టులను ద్వేషించరు. ప్రగతి పథంలో సాగాలని ప్రయత్నిస్తారు. భూసంస్కరణలు మున్నగువాటిని విశ్వసిస్తారు. గండి మల్లికార్జునరావుగారు – మాటేటి కిషన్‌రావుగారు అలాంటివారు.

ఈ వర్గీకరణ 'సిరిపురం' మాత్రమునకే కాదు. కాంగ్రెసు క్యాంపులకు – మొత్తం కాంగ్రెసుకు వర్తిస్తుంది.

సిరిపురం వంటి మరి కొన్ని క్యాంపులకు "నేలమర్రి" ప్రధానకార్యాలయం. నేలమర్రి ప్రముఖ గాంధేయులు కోదాటి నారాయణరావురుగారి స్వస్థలం. నేలమర్రి

సాయుధ కార్యాలయ బాధ్యత కోదాటివారు నిర్వహించారు. అక్కడ కార్యకర్తలకోసం ఒక చిన్న ఆస్పత్రి కూడా నిర్వహించారు. సింహాద్రి డాక్టర్‌గా ఉండేవారు. కొన్నాళ్ళు నేను అక్కడ ఉన్నాను. చికిత్స చేయించుకున్నాను.

సిరిపురంలో నేను వార్తలు రాయటం – గేయాలు – వ్యాసాలు వ్రాయడం, నిజాం ప్రాంతంలో నిజాం వ్యతిరేక ప్రచారం చేశాను. ప్రజల్లో నిజాం వ్యతిరేకత ఎంతకాలంగానో నిద్రాణం అయి ఉన్నది. రజాకార్ల దుశ్చర్యలు. కమ్యూనిస్టు పార్టీ విప్లవ కార్యక్రమాలు, ఇతర రాజకీయ పార్టీల కార్యక్రమాలు ప్రజలను జాగృతం చేశాయి. నిజాం వ్యతిరేక ప్రచారం ఏదయినా గుంపులుగా వచ్చేవారు. గొంతు కలిపి పాడేవారు.

"ఎందుకయ్యా నీవింక
రాజ్యమేలుతావు?
ఇంకనన్న గద్దెదిగు
ప్రజల కప్పగించు
అట్లచేయకుంటే
మేము ఇంకఊరుకోము
జనులు చుట్టుముట్టి
నిన్ను గద్దెదింపుతారు."

ఇలాంటి పాటలు ముక్త కంఠంగా చదివినపుడు ఎంతో ఉద్రేకం – ఉత్సాహం – ఆవేశం పొంగి పొరలేవి. దుష్టుడు, దుర్మార్గుడు – హీనుడు – నీచుడు – అలా కాకుండా చివరి దశలోనయినా ప్రజలకు రాజ్యం అప్పగించి ఉంటే! **కాని అది రాజ్యం! హింసలేకుండా – గుంజుకోకుండా స్వచ్ఛందంగా – ఒక్క శ్రీరామచంద్రుడు తప్ప – ఎవరూ వదల్లేదు.**

ఒక్క సత్యవాస్తవం ఏమంటే – నిజాం ప్రాంతంలో – తెలంగాణంలో – కమ్యూనిస్టులకు ఉన్న పట్టు – పలుకుబడి – ప్రభుత్వం మరెవ్వరికీ లేదు. వారు గ్రామాల్లో సోషలిజం స్థాపించి చూపించారు. భూస్వామ్యంనుంచి నేరుగా సోషలిజానికి వెళ్లారు. మధ్యనున్న కేపటలిజాన్ని మట్టుపెట్టారు! ఇది అంతటా అందరికీ సాధ్యం అయ్యేదికాదు. అయితే అది కలకాలం నిలువలేదు. కలకాలం నిలువలేదని బాధపడాల్సిన పనిలేదు. కొంతకాలం నిలిచినందుకు సంతోషించాలి. ఆ వ్యవస్థను సాధ్యం చేసినందుకు కమ్యూనిస్టులను అభినందించాలి.

"తెలుగు తల్లి బిడ్డలం
తెలంగాణ వీరులం
మాతృదేశ ముక్తికొరకు
పోరుసలుప కదిలినాం"

అని కదం తొక్కి పాడటం తెలంగాణంలో సర్వసాధారణం అయింది.

"బాలవీరులెవ్వరురా
బాలచంద్రుడెక్కడరా?

సవాలన్న నైజాముకు
సమాధానమెవ్వడురా?"

అని ఎర్రజండాలు పట్టుకొని బాలలు పాడుతుంటే అందరూ బాలచంద్రులవలె కనిపించారు.

"ప్రజాశక్తులు కదలండోయ్
పౌరుషంబుగ పోరండోయ్
విజయము మనదే రారండోయ్
ఉరికి శత్రువుల తరమండోయ్
శత్రుల చంపిన ప్రతిచోటా
శత్రు ఆయుధాల్ మనవేనోయ్
తుపాకి, రైఫిల్, తూటాల్, బాంబులు
దొరుకును విరివిగ మనకండోయ్!"

ఇలాంటి పదాలు భజన కార్యక్రమాలంతటి ప్రాచుర్యం పొందాయి.

"గోలకొండ ఖిల్లకిందా
నీ గోరి కడ్తం కొడుకో
నైజాం సర్కారోడా!"

ప్రతి పౌరుని నాలుక మీద నాట్యం ఆడింది. ప్రజాసాహిత్యానికి ఇది సాధారణ మయిన లబ్ధికాదు! ఇది అసాధారణం.

గ్రామాలలోనుంచి దొరలు, పటేల్ పట్వారీలు మాయం అయినారు. ప్రభుత్వం మృగ్యం అయింది. రజాకార్లను ఎదురుకునే సామర్థ్యం ప్రజలకు వచ్చింది.

**భూస్వామ్య చిహ్నాలయిన గడీలను కూల్చారు. అవి మొండిగోడలతో శిథిల వ్యవస్థకు సాక్ష్యులుగా మిగిలాయి. ఒకనాడు గ్రామంలో మంచివి అన్నీ గడీకి చేరాయి. ఇప్పుడు గడీలనుంచి పేదల ఇళ్లకు చేరాయి. గుడిసెల్లో నిలువుటద్దాలు - పందిరి మంచాలు! ఎంత మార్పు! ఎంత ప్రగతి!! ఎంత విప్లవం!!!**

కమ్యూనిస్టు దళాలు సుమారు మూడువేల గ్రామాలను విముక్తం చేశాయి. విముక్తం అయిన గ్రామాలకు "రాజ్యకమిటీలు" ఏర్పడ్డాయి. ఇది ఎన్నికల ద్వారా ఏర్పడిన కమిటీలు. ప్రతి కమిటీలో అయిదు నుంచి పదివరకు సభ్యులు ఉండేవారు. వారు ప్రజాసమస్యలను పరిష్కరించారు. భూ సంస్కరణలు అమలు జరిపారు. పది ఎకరాల మాగాణి లేక 100 ఎకరాల మెట్ట సీలింగుగా నిర్ణయం అయింది. ఈ సీలింగు ఉద్యమానికి వ్యతిరేకులు కానివారికి మాత్రమే వర్తిస్తుంది. ప్రజాద్రోహుల భూములు సంపూర్ణంగా స్వాధీనపరచుకున్నారు. ఇలాంటి మిగులు భూములను భూములు లేనివారికి పంచారు. ఆ విధంగా విసునూరు రామచంద్రారెడ్డికి చెందిన 40 వేల ఎకరాలు ప్రజలకు పంచారు. అంటే - విముక్తం అయిన మూడువేల గ్రామాలలో పది లక్షల ఎకరాల భూమి పేదలకు పంచడం జరిగింది. ఇది ఆమహో ఉద్యమపు చరిత్రాత్మకతకూ - పోరాట ఫలితాలకు నిదర్శనం.

భారతదేశంలో అనేక పోరాటాలు జరిగాయి. జరుగుతున్నాయి. వాటన్నింటిలో ఇంత విజయవంతం అయిన పోరాటం ఇదే! ప్రజానీకానికి ఇంత పెద్ద ప్రయోజనం సమకూర్చిన పోరాటమూ తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం మాత్రమే!

ఇది గాంధీజీ కలలుగన్న రామరాజ్యం!

రైతులు - కూలీలు - పేదలు - బాలలు - మహిళలు వీరోచితంగా పోరాటం జరిపి సాధించుకున్న గ్రామ స్వరాజ్యం! ప్రాణాలు అర్పించి ఆర్జించుకున్న గ్రామ స్వరాజ్యం! రక్తం ధారపోసి సాధించుకున్న గ్రామ స్వరాజ్యం! ప్రజలు తమ కంటి రెప్పలా కాపాడుకున్న గ్రామ స్వరాజ్యం!

ఇది ఈనాడు కలగా కల్పనగా కనిపించవచ్చు.

కాని, ఈవ్యవస్థ చూడగలిగిన అదృష్టం మాది!

ఇందుకు గురించి వ్రాయగల భాగ్యం నాది!

సిరిపురంలో కొంత ఆరోగ్యం కుదుటపడింది. అంతకుముందు ఎన్నడూ లేని చికిత్స లభించింది. నేను చాల చురుకుగా - ఉత్సాహంగా - ఆవేశంగా - ఉద్రేకంగా పని చేశాను. అలా చేయటం నా సహజ స్వభావం.

ఒకసారి బెజవాడ వెళ్లాల్సి వచ్చింది. ఏదో పనిమీద క్యాంపువారు పంపారు. మేము నలుగురం. మాకు లీడర్ మాటేటి కిషన్‌రావు. అతనికి మాత్రం పిస్తోలు ఇచ్చారు. అతను మమ్ములను రక్షించాలి. రక్షించలేకుంటే పోవాల్సిందే. ప్రాణాలను లెక్కచేయని కాలం అని ముందే చెప్పాను.

ఈనాడు ప్రపంచమంతటా తీవ్రవాద సంస్థలకు ఆత్మహత్యాదళాలు – Suicide squads ఉన్నాయి. లక్ష్యం ఏదయినా విశ్వాసం కలుగుతే – మానవుడు ప్రాణాలర్పించడానికి వెనుదీయడు. పేర్లు – ధ్యేయాలు – లక్ష్యాలు – విశ్వాసాలు వేరుకావచ్చు. కాని, తలపండు ఇచ్చుకోవడంవంటి త్యాగాలు కలకాలంగా ఉన్నాయి.

ఆత్మహత్యదళం అనేపేరు లేకున్నా అందరూ ప్రాణాలు అర్పించడానికి సిద్ధం అయినవాళ్లే. ఇవ్వాళ చిన్న పదవి - చేతిలో డబ్బు వదలడానికి గిజగిజలాడుతున్నారు. ఆనాడు ప్రాణాలర్పించడానికి సిద్ధం అయినాం. సమాజం ఎంత దుష్టంగా మారిందంటే - అలాంటివారినే వెక్కిరిస్తూంది. పరిహసిస్తూంది. అపహాస్యం చేస్తున్నది!!!

ఇంతకన్న నైతిక పతనం ఉండదు!

కిషన్‌రావు నాయకత్వాన మేము నలుగురం బయలుదేరాం. రాత్రికి రాత్రి పరగణా తరువాత ఉన్న నిజాం ఇలాకా దాటాలి. తెల్లవారే వరకు యూనియన్ ప్రాంతం చేరుకోవాలి. ఊరిలోనుంచి పోరాదు. రజాకారు – పోలీసు జాడతెలుస్తే బాట వదలాలి. లేని మార్గం చూచుకోవాలి. బ్యాటరీ వెలిగించరాదు. సిగరెట్టు కాల్చరాదు. ఉనికి తెలిసేటట్లు మాట్లాడరాదు. ప్రమాద స్థితిలో కాగితాలు శత్రువుకు అందనీయరాదు.

నడక, నడక, నడక. రాత్రి. చూపుల వెలుగు. ఆరుబయలు బాగానే ఉంది. ఎక్కడ ఏది పొంచి ఉందో తెలియదు. భయం లేదు.

**ప్రజాపోరాటాల్లో మొట్టమొదట వదులుకోవలసింది ప్రాణభయం.**

భయంలేదుకాని అప్రమత్తం!

పాము భయం పాముది. శత్రువూ జాగ్రత్త పడ్డాడు! వాడికి మాకన్న ప్రాణం భయం మిన్న. వాడు బతకడానికి చేరాడు! రోడ్డుకు ఇరువైపులా కొన్నిమైళ్లు చెట్లులేకుండా కొట్టేశారు. సుమారు అడవిని క్షవరం చేశారు. అంటే – చాటు దాడి సాధ్యం కాకుండా చేశారు.

మేము 'క్షవరంప్రాంతం సగంలోకి వచ్చాం. ఒక రోడ్డు పక్క పూర్తి మలుపు ఉంది. ఏదయినా మరీ దగ్గరకు వస్తేగాని కనిపించదు. అమాంతంగా వస్తున్న మిలిటరీ ట్రక్కు కనిపించింది.' అది ట్రక్కు. దూసుకుని వస్తోంది. మాది కాలినడక. ఏంచేయాలో తెలియదు. సందిగ్ధం. వెనకా ముందూ ఒకే దూరం ఉంది. అడకత్తెరలో చిక్కుకున్నాం.

"ముందుకే" అన్నాడు కిషన్‌రావు. ఒకరి జాడ ఒకరికి తెలియకుండా పరుగు లంకించుకున్నాం. పరిగెత్తడం అంటే అతి వేగంగా ఉరుకుతున్నాం. అపరిధి దాటాం. అప్పటికి ట్రక్కులు చేరుకున్నాయి. ఒక్కటి కాదు – వరుస!

మేము దాటుకున్నాం. జిల్లేగు పొదల్లో పడిపోయాను. రోడ్డువైపు చూస్తున్నాను. ట్రక్కులు సాగిపోలేదు. ఆగిపోయాయి! వాళ్ళు మమ్మలను చూసినట్లున్నారు. ఆత్మరక్షణకోసం ఆగారో – దాడికోసం నిలిచారో తెలియదు. కొందరు ట్రక్కు దిగారు. మిలిటరీ వాళ్లు! ఏదో మాట్లాడుకున్నారు. తుపాకులతో మేము ఉన్న వైపు సాగుతున్నారు. నాకు జిల్లేగు పొదనుంచి స్పష్టంగా కనిపిస్తున్నారు. నేనుమాత్రం వారికి కనిపించడం లేదు.

మిలిటరీ వాళ్లు కొంతదూరం వచ్చారు. ఏమనుకున్నారో వెనక్కు తిరిగారు. మళ్లీ రోడ్డుమీదికి చేరుకున్నారు. మళ్లీ ఏదో మాట్లాడుకున్నారు.

**"బాహర్ ఆవో, నహీంతో గోలీ చలెగే"** అని కేకలు పెట్టారు. "బయటకి రండి. రాకుంటే తుపాకిగుళ్లు సాగుతాయి."

నేను జిల్లేగు చాటున ఉన్నాను. కదలను. ప్రాణం అక్కడే పోవాలి. అది నాకు తెలుసు. మిగతా ముగ్గురి సంగతి తెలియదు. వాళ్లలో ఎవడన్నా నిక్కుతాడో భయపడ్తాడో – బయటపడ్తాడో అని అనుమానం.

**ఆ క్షణంలో ఆలోచనలు. నా దగ్గర ఆయుధం ఉంటే ఎంత బావుండును? బాంబులుంటే ఇంకా బావుండేది. విసిరేవాణ్ణి. చచ్చేముందు నలుగురిని చంపేవాణ్ణి!**

మిలిటరీ వాళ్లు అలా ఘూడు సార్లు అరిచారు. అరిచి వెళ్లిపోతారనుకున్నా. వాళ్లను భయం వెంటాడుతున్నది. వాస్తవంగానే తుపాకులు తీశారు. మావైపు గురి పెట్టారు. మేము 'గురి' దూరంలోనే ఉన్నాం. టపాకులవలె బుల్లెట్లు పేల్చారు. పేలుస్తూనే ఉన్నారు. బుల్లెట్లు నన్ను దాటిపోతున్నాయి. ఎన్నో తెలియదు. మిగతా వాళ్లు ఏమయింది తెలియదు!

అలా కొంతసేపు సాగింది. ఎవరు చచ్చారో – ఎవరు బతికారో తెలియదు. మిలిటరీవాళ్లు కాల్చడం మానారు. మేము చచ్చాం అనుకొని ఉంటారు. అన్ని

తూటాలు కాల్చాం. తగలలేదా అనుకొని ఉంటారు. లేదా తూటాల కర్చు లెక్క చూచుకొని ఉంటారు. ట్రక్కులు ఎక్కారు. వెళ్లిపోయారు.

నేను లేవలేదు. రేగుపొదలో ఉన్నాను. ముళ్ల బాధ ఇప్పుడు అర్థం అవుతున్నది. ట్రక్కుల చప్పుడు సమసిపోయేవరకు పడుకున్నాం. అప్పుడు లేచాం. వంటినిండా ముళ్లు. లేవడం చాతకావడం లేదు. భగవదనుగ్రహం. నలుగురం క్షేమం.

నిజాం మిలిటరీ గురికి నవ్వుకున్నాం.

అవి మాదగ్గరుంటే మసిచేసేవాళ్లం అనుకున్నాం.

మనసూ శరీరం రెండూ అలసిపోయాయి. కదలడం చేతకాదు. కాని విధిలేదు. ఇంకా చాలనడక ఉంది. మనం పరిగెత్తకుండా ఉండాల్సింది... అయితే పట్టుపడేవాళ్ళమేమో! వాళ్లకెందుకు అంత భయం? ఇలా మాట్లాడుకుంటూ, కాళ్లీడ్చుకుంటూ సాగాం.

తెల్లవారుతుండగా ఏరు వచ్చింది. ఏరు సరిహద్దు. ఏరుదాటితే 'మనరాజ్యం' యూనియన్! ఏరు దాటాం. ఏటి ఇసుకలో పడిపోయాం. ఎంత నిద్ర! ఎంత నిద్ర! పొద్దు పొడిచింది. ఎండ వచ్చింది తెలియలేదు. నీళ్లకు వచ్చిన ఆడవాళ్లు నీళ్లు చల్లారు – మేము బ్రతికి ఉన్నామని ధ్రువపరచుకోవడానికి!

అప్పుడు లేచాం. కొంత సిగ్గుపడ్డాం. ఏటిలో ముఖాలు కడుక్కున్నాం. అది 'తక్కెళ్లపాడు.' ఊళ్లోకి వెళ్లాం. చాయ్ తాగాం. బస్సెక్కాం. బెజవాడ చేరుకున్నాం.

విరమ విరమాయాసా దస్మాద్దురధ్యవసాయతో
విపది మహతాం ధైర్యధ్వంసం యదీక్షితు మీహసే
అయి జడవిధే కల్పాపాయేఽ స్యపేత నిజక్రమాః
కువ శిఖరిణః క్షుద్రానైతే నవాజల రాశయః.

విధీ! మహాత్ములకు ఆపదలు కలిగిస్తావు. వారి ధైర్యం ధ్వంసం చేయాలనుకుంటావు. అది నీకు అసాధ్యం. మానుకో.

కల్పాంతం అవుతుంది. ప్రళయం వస్తుంది. సముద్రాలు పొంగుతాయి. అవి అంత క్షుద్రములు కావు. కులగిరులను కదిలించవు!

బెజవాడ చేరాను. Pleasant surprise! విచిత్ర సంతోషం! అన్నయ్య విడుదలయి – క్షేమంగా బెజవాడ చేరుకున్నాడు. ఆఫీసులో కనిపించాడు.

ఎదురుగా అన్నయ్య! నమ్మరాని నిజం!
"తమ్ముడూ"! అనే పిలుపు.
పున్నమినాటి సంద్రంలా మనసు పొంగింది.
"అన్నయ్యా!" అది గుండె చీల్చుకొని వచ్చింది.
ఇద్దరం గట్టిగా కావిలించుకున్నాం.
మళ్ళీ విడిపోతామేమో అన్నట్లు అలాగే ఉండిపోయాం.

ఇద్దరి బుజాలూ తడిసిపోయాయి – నవ్వినా – ఏడ్చినా – కన్నీళ్లే వస్తాయి! అవి ఆనంద బాష్పాలు!

అయ్యవారు –హయగ్రీవాచారిగారి – కళ్లు చెమ్మగిలాయి. వారు కండువాతో కళ్లు తుడుచుకున్నారు. మా ఉభయుల వెన్నులు తట్టారు! మమ్ములను తమముందు

కూర్చుండ పెట్టుకున్నారు. చాయ్ తాగుతూ మనసులు తోడుకున్నాం. ముచ్చట్లు పెట్టుకున్నాం.

**తులసీదాసు రామాయణంలో 'భరత్ మిలాప్'కు ఎంతో ప్రాధాన్యత ఉంది! అన్నదమ్ములు కలుసుకోవడాన్ని ఎంతో హృద్యంగా చిత్రించాడు ఆ మహానుభావుడు!**

**మేము ఇద్దరమూ దాశరథులమే! రాముడూ - భరతుడూ దాశరథులే!**

అన్నయ్యా – నేనూ ఇద్దరం కలిసి కేసరిపల్లె వెళ్లాం.

"అమ్మా! అన్నయ్యను తీసుకొని వచ్చాను" అన్నాను.

అమ్మ చేతిలో గంటెతో ఉరికి వచ్చింది. ఒక లిప్త నమ్మలేనట్లు చూచింది. గరిట నేలక్కొట్టింది.

"నాయనా! నిజంగ వచ్చినవా!" అని అన్నయ్యను తీవచుట్టుకున్నట్లు చుట్టుకుంది. చెల్లెళ్లు నివ్వెరపోయి చూచారు.

అమ్మ ఏడుపుకు చలమయ్య – గోపయ్యగారలు కుటుంబాల సహితంగా బయటికి వచ్చారు. అది వారికి సచిత్ర సంతోషం.

సరస్వతి వచ్చింది. నన్ను పట్టుకుని నిలిచింది. 'కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ బాష్పబిందువులు రాల్చింది.

"రంగడూ! నాకు ఒక్కడే మిగుల్తడు అన్నవుగద – నా కొడుకులు ఇద్దరు నాకు దక్కిన్రు!" మా ఇద్దరినీ చెరొకవైపు పట్టుకొని – అనంత విశ్వాసమూర్తివలె నుంచుంది అమ్మ.

అమ్మ – లవకుశులను పట్టుకున్న – సీతమ్మ అనిపించింది.

అందరూ ఆనందం బాష్పాలు రాల్చారు.

**ఒక జీవిత కాలం బ్రతకడానికి ఆ దృశ్యం చాలు!**

**అది ఆనందాల రోజు. సంతోషాల రోజు. సంబరాల రోజు.**

కులాలను కూలదోసి అందరం ఒకేచోట వండుకున్నాం, తిన్నాం. మా కుటుంబం – చలమయ్యగారి కుటుంబం – గోపయ్యగారి కుటుంబం – సీతం రాజురాని సరస్వతి.

**కలిసి ఉంటే ఎంత ఆనందమండీ!**

**అయినా అదీ చేత కావాలి!!**

**రాళ్లది - బోళ్లది - ఏళ్లది - లేళ్లది ఏ కులం?**

మళ్లీ సిరిపురం వెళ్లాల్సిన అవసరం పడలేదు. మేము ఇక్కడ ఉండగానే పోలీసు చర్య జరిగింది.

ఒక్క విషయం మనవి చేసి పోలీసు – పోలో – చర్యకు సాగుతాను.

గాంధీజీ అస్తమయం తరువాత స్వతంత్ర భారత రక్షక భటులు కృష్ణా జిల్లాలో రజాకార్లను మించిన కిరాతకాలు చేశారు.

కమ్యూనిస్టులను అణచడం పేరుతో ప్రజాస్వామ్యాన్నీ – పౌరహక్కులను పాతిపెట్టారు.

కాటూరు – ఎలమర్రులలో మలబారు పోలీసులు చేయని ఘాతుకం లేదు. ప్రజలను దిగంబరులను చేసి ఊరేగించారు.

ప్రజలను గాంధీ విగ్రహం ముందు దిగంబరంగా నిలిపారు!

అది నిరంకుశత్వం కరాళ నృత్యం చేసిన వేళ!

అహింసారాజ్యంలో హింస పురివిప్పి ఆడిన వేళ!!

ఓ మహాత్మా! ఓ మహర్షీ!

"I see a day when gandhians will be hanged in India" అన్నాడు బర్రెండ్ రస్సెల్.

"భారత దేశంలో గాంధీ వాదులను ఉరితీసేరోజు వస్తుంది."

ఈ సంఘటనను నేను 'జనపదం' నవలలో చేర్చాను.

## ఇరవయి మూడు

### సమరశంఖం:

మార్పు వ్యక్తి జీవితంలోనూ,జన జీవితంలోనూ, సమాజ జీవితంలోనూ సమస్యలు సృష్టిస్తుంది. 'మార్పు' మంచిదయినా సమస్యలుంటాయి. మంచిదికాకున్నా సమస్యలు ఉంటాయి.

భారతదేశ చరిత్రలో మనకు వచ్చిన స్వాతంత్ర్య చరిత్రలో ఇలాంటి పరిణామాలు చాలా, చాలా అరుదుగా వస్తాయి.

అంగ్లేయులు భారతదేశాన్ని బలవంతంగా వదిలారు. వెళ్లేప్పుడు అనేక సమస్యలు సృష్టించిపోయారు. భారత జాతికి ఎన్నడూ ఎరగని మతకలహాలు అంగ్లేయుల సృష్టి. వారు పాకిస్తాన్ సృష్టించారు. సంస్థానాధీశులకు స్వాతంత్ర్యం ఇచ్చారు. అదొక సమస్య.

హైదరాబాదు సంస్థానం ఒక సమస్య. నిజాం రాజు పెద్ద బెడద. అతడు కొంప కాలేప్పుడు వాసం పీక్కోవాలనుకున్నాడు. మరిన్ని సమస్యలు సృష్టించాడు. భారత ప్రభుత్వం మత్తమాతంగం. అది నిజం. నిజాము మశకం. దోమ ఏనుగు చెవిలో దూరి బాధించింది.

ఒకటిన్నర శతాబ్దంగా భారత్ సైన్యాలు సికిందరాబాదులో ఉంటున్నాయి. స్వాతంత్ర్యం వచ్చిం తరువాత ఉన్నాయి. అప్పటికి సుమారు 1400 సైన్యం ఉంది. వీటిని మించి మందుగుండు గిడ్డంగులున్నాయి. వాటిమీద దాడికి రజ్వీ అనేకసార్లు ప్రయత్నించి విఫలుడయినాడు. యథాతథ ఒప్పందం ప్రకారం సేనలను ఉపసంహరించడానికి భారత ప్రభుత్వం అంగీకరించింది. 1948 జనవరినుంచి ఏప్రెల్ వరకు ఉపసంహరించింది.

నిజాం నవాబు సైన్యాలు పెరుగుతున్నాయని – బలం పెంచుకుంటున్నాయని పుకార్లు బయలుదేరాయి. పాకిస్తాన్‌లో అయిదు లక్షల మందిని నిజాం రిక్రూట్ చేశాడని మద్రాసు ప్రధాని రెడ్డియార్ ప్రకటించాడు. నిజాంసేన దాడి చేస్తే తన రాష్ట్రానికే ప్రమాదం వాటిల్లవచ్చునని భయపడ్డాడు.

దొంగచాటుగా సిడ్నీ కాటన్ అయుధాలు చేరవేస్తున్నాడు. విదేశాల్లో అయుధాలు కొనడానికి నిజాం ప్రయత్నిస్తున్నాడు.

వీటన్నింటితో దేశంలో భీతావహ వాతావరణం ఏర్పడింది. వీటిని అన్నింటిని దృష్టిలో ఉంచుకొని భారత ప్రభుత్వం 1948 జనవరిలో సైన్యాన్ని హెచ్చరించింది. 1948 జనవరి 20 వ తేదీన సైనిక ప్రధాన కార్యాలయం "హైదారాబాదు సైన్యాలు భారతదేశం మీద దండెత్తే వీలులేకుండా చూడాల్సిందని" అందుకు ప్రణాళిక సిద్ధం చేయాలని సదరన్ కమాండును ఆదేశించింది.

1948 ఫిబ్రవరిలో ఈ ప్రణాళికకు POLO అని నామకరణం చేశారు. సైనికులు తమ వ్యూహాలకు పేర్లు పెడ్తారు. హైదరాబాదు "పోలో" అనే ఒక క్రీడకు ప్రసిద్ధం. అందువల్ల దానికి "పోలో" అని పేరు పెట్టారు. "పోలో" ఆటలా సైనిక చర్య జరుపుతామని ఆ పేరు పెట్టారు.

సదరన్ కమాండువారు "హైదరాబాదు సైన్యానికి దాడి చేస్తే శక్తి లేదని" నివేదిక అందించారు. ఆనాటి నుంచి భారతదేశంలో అనుకూలంగానూ హైదాబాదులో వ్యతిరేకంగానూ పరిణామాలు సంభవించాయి.

భారతదేశానికి అనుకూల పరిణామాలు:

1. విభజన వల్ల కలిగిన రక్తపాతం అంతం అయింది. పరిస్థితులు అదుపులోకి వచ్చాయి.
2. కాశ్మీర్ పరిస్థితి కూడా అల్లకల్లోలంగా లేదు. పాకిస్తాన్ ప్రణాళికలను భగ్నం చేయడం జరిగింది.
3. సుమారుగా సంస్థానాలన్నీ భారతదేశంలో లీనం అయిపోయాయి.
4. జునాగఢ్ పాకిస్తాన్ సరిహద్దు సంస్థానం. జుల్ఫిఖార్ అలీ భుట్టో జన్మస్థానం. అక్కడ భారతదేశంలో విలీనాన్ని గురించి రెఫరండం జరిగింది. భారతదేశంలో విలీనానికి అనుకూలంగా 2,22,304 ఓట్లురాగా, వ్యతిరేకంగా 150 మాత్రం వచ్చాయి.
5. స్వాతంత్ర్యం లభించిన ఆరు నెలలకు ప్రభుత్వం స్థిరపడింది. అంతర్జాతీయ సముదాయం భారత స్థిరతను గుర్తించింది.
6. మిగిలిన ఒక్క హైదారాబాదు సమస్యను పరిష్కరించగలిగే శక్తిస్తోమతలను సమకూర్చుకుంది.

నిజాం రాజ్యానికి ప్రతికూల పరిస్థితులు:–

1. నిజాం బడ్జెటు 2.25 కోట్లకు చేరుకుంది. ఇది బడ్జెటులో కనబరచిన సంఖ్య. పరిస్థితి ఇంతకంటె అధ్వాన్నంగా ఉంది. ఇది భారత ప్రభుత్వం విధించిన దిగ్బంధ ఫలితం.
   i) గ్రామాధికారులు గ్రామాలు వదిలారు. ఇందుకు కారణం ప్రజా ఉద్యమం. కొందరు అభిమానంతో వదిలారు. ఇందుకు కారణం ప్రజా ఉద్యమం. కొందరు గ్రామాల్లో నిలువలేక వదిలారు. ఫలితంగా రెవెన్యూ వసూళ్లు నిలిచిపోయాయి..
   ii) వర్తకులు రజాకార్ల భయానికి రాజ్యం వదిలి వెళ్లారు. వ్యాపారం సుమారు

నిలిచిపోయింది. వ్యాపారం నిలిచిపోవడంవల్ల ప్రభుత్వానికి రాబడి తగ్గింది. ప్రజలకు బాధలు హెచ్చినాయి. అందువల్ల మరింత వలసపోయారు.

iii) దిగ్బంధం వల్ల సరుకుల రాకడ తగ్గింది. అందువల్ల కరోడ్గిరీ – కస్టమ్స్ ఆదాయం తగ్గింది.

iv) పనాహ్‌గజీర్ – శరణార్థులను స్వాగతం పలికి తీసుకొని వచ్చారు. వారికిగాను కర్చు పెరిగింది.

v) సుమారు లక్షమంది రజాకార్లను పోషించాల్సి వచ్చింది.

vi) ప్రజా ఉద్యమాలను అణచడానికి పోలీసు – మిలిటరీ కర్చు ఎక్కువయింది.

2. ఇది ఆర్థికం. శాంతి భద్రతలు మృగ్యం అయినాయి. ధన, మాన, ప్రాణాలకు రక్షణ లేకుండాపోయింది.

i) ప్రభుత్వం నిజాం నవాబుదో – కాసిం రజ్వీదో అర్థం కాని దశ వచ్చింది. కీలక నిర్ణయాలలో సహితం రజ్వీ పెత్తనం కనిపించింది. ప్రధాని లాయకలీ గవర్నర్ జనరల్ మౌంట్‌బాటన్‌తో ఒక అంగీకారానికి వచ్చాడు. ధ్రువీకరణకు మాత్రం హైదరాబాదు వచ్చారు. రజ్వీ కాదన్నాడు. నిజాం మిన్నకున్నాడు.

ii) అధికారులకు తమ విధులు నిర్వర్తించడం అసాధ్యమైంది. ప్రభుత్వ యంత్రాంగం సాంతం నిలిచిపోయింది. ప్రభుత్వం లేకుండా అయింది.

iii) తెలంగాణా గ్రామాలను కమ్యూనిస్టుల అధ్వర్యంలో ప్రజలు వశపరచుకున్నారు. పాలించుకున్నారు. ప్రజలను దోచుకోవడానికి అప్పుడప్పుడు వచ్చిన రజాకార్ల మురాలే ప్రభుత్వం అనిపించింది.

iv) కాంగ్రెసువారు సరిహద్దులలో సాయుధ క్యాంపులు నెలకొల్పారు. హైదరాబాదు శాసన సభలో పోలీసు మంత్రి ప్రకటనను అనుసరించి బొంబాయి సరిహద్దులలో 23 కేంద్రాలు – మద్రాసులో 21 – మధ్య పరగణాల్లో 4 ఉన్నాయి. వారు సుమారు 400 దాడులు చేశారు.

v) 1948 ఫిబ్రవరిలో ఉమ్రీ పట్టంలోని హైదరాబాదు స్టేట్ బ్యాంక్ లూటీ జరిగింది. 22 లక్షల 60 వేల రూపాయిల దోపిడీ జరిగింది. ఈ చర్యలో 17 మంది ప్రాణాలు పోయాయి.

ఈ చర్య సోషలిస్టు పార్టీ అభిమానంగల కాంగ్రెసువారు చేశారని చెప్పుకుంటారు. ఈనాటి వృద్ధ కాంగ్రెసు నాయకుడు గోవింద్ దాస్ ష్రాఫ్ అందుకు కారణం అని ప్రవాదు. అందులో చాల వరకు ప్రజాపోరాటానికి కర్చు చేశారు. మిగతా ధనంతో గాంధీ భవనం నిర్మించారని చెప్పుకున్నారు.

vi) 1948 మే 23వ తేదీన 'గంగాపూర్' రైల్వే స్టేషను దగ్గర మద్రాసు – బొంబాయి మెయిలు ట్రెయిన్ మీద రజాకార్లు దాడి చేశారు. దోచుకున్నారు. ఇద్దరిని హత్య చేశారు. అనేకమందిని గాయపరచారు. పోలీసులు ఏమీ చేయలేకపోయారు.

vii) కాంగ్రెసులో వ్యక్తులు మాత్రమే ఉంటారు. వారిది ఇష్టారాజ్యం. వారు దేనికీ కట్టుబడరు.

నిజాం ప్రవేశపెట్టిన పాలనా సంస్కరణలను – మజ్లీస్ తప్ప – కాంగ్రెస్ సహితంగా అన్ని పార్టీలు త్రోసిపుచ్చాయి. వాటికి వ్యతిరేకంగా ఉద్యమాలు కూడా నడిపించాయి.

కాంగ్రెస్‌వాది రామాచార్‌కు ఇవేవీ పట్టలేదు. అతనికి మంత్రిపదవి ఆశ పుట్టింది. లాయకలీ మంత్రిమండలిలో చేరారు. అప్పటికి వారికి అర్థం అయింది – ఈ రాజ్యం నిలువదని. రానున్న మహా ఫలితం చేయి జారిపోతున్నట్లనిపించింది. రాజీనామా ఇచ్చారు. రాజ్యంలో అరాచక కారణం చూపి రాజీనామా చేశారు.

రామాచార్‌వల్ల నిజాం ప్రభుత్వానికి మేలు కొంచెం – కీడు అపరిమితం అయింది. భారతదేశపు పత్రికలు దీనికి అత్యంత ప్రాధాన్యత ఇచ్చి ప్రకటించాయి.

నిజాం ప్రతిష్ట ఎలాగూ నేలకూలింది. ఇప్పుడది పాతాళానికి క్రుంగిపోయింది.

3. "అహలె గరజ్‌కో అఖల్‌నహీఁ" అనేది ఉర్దూ సామెత. కార్యం గలవానికి బుద్ధి ఉండదు అనేది వాక్యానువాదం. కాని, ఒక ధోణిలో ఉన్నవాడు మరొకటి ఆలోచించలేడు అనేది భావార్థం. నిజామూ – అతని తాబేదారు రజ్వీ రాజ్యం రక్షించుకోవాలనే పిచ్చిలో పడిపోయారు. వారికి ఆర్థిక – రాజకీయ మున్నగు కారణాలు తోచనేలేదు. అర్థం కావడం – ఆచరించడం తరువాత.

గవర్నర్ జనరల్ మౌంట్ బాటన్ నిజాముకు శ్రేయోభిలాషి. అతడు 1948 జూన్ 25 న పదవి విరమిస్తారు. ఈలోగా ఉభయులకు ఆమోదయోగ్యం అయిన పరిష్కారం కనుగొనాలని వారి తాపత్రయం!

గవర్నర్ జనరల్ లాయకలీకి అయిదు గంటల ఇంటర్వ్యూ ఇచ్చారు. వారు భారతదేశంలో ఉండగా ఇన్ని గంటలు ఏ ఇతరులతో ఇంత సుదీర్ఘంగా మాట్లాడలేదు. హైదరాబాదు క్షేమం భారతదేశంలో కలిసి ఉండటమేనని వారు స్పష్టం చేశారు. నిజాం మొండిపట్టు వదలాలన్నారు. బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పరచాలని చెప్పారు. లాయకలీ అర్థం చేసుకున్నాడు!

1948 మే 26న మౌంట్ బాటన్ – జవాహర్‌లాల్ నెహ్రూ – మెనన్ – లాయకలీ సమావేశం అయినారు. ఒక ముసాయిదా సిద్ధం అయింది. లాయకలీకి ఆమోదయోగ్యం అయింది. ఆమోదముద్రకోసం హైద్రాబాదు చేరుకున్నాడు. లాయకలీ ప్రథమంగా రజ్వీని కలిశాడు. అతడు ఆమోదించలేదు.

నిజాం తొలుత తన ఆంగ్ల సలహాదారు మాంక్‌టన్ను సంప్రదించాలన్నాడు. మాంక్‌టన్ అంగీకరించాడు. మంత్రిమండలిని సంప్రదించాలన్నాడు. శాసనసభను సంప్రదించాలన్నాడు.

తుదకు తిరస్కరించాడు.

తనను తానే కూల్చుకున్నాడు.

పరిస్థితి ఇలా ఉండగా 'యథాతథపు ఒడంబడిక'ను నిజాం ప్రభుత్వం ఉల్లంఘిస్తున్నదనీ – ఉల్లంఘనలు నిలుపకుంటే గట్టి చర్య తీసుకోవలసి వస్తుందనీ భారత ప్రభుత్వం గట్టిగా హెచ్చరించింది.

నిజాం ప్రభుత్వం అదిరింది. కాని, మేకపోతుగాంభీర్యం ప్రదర్శించింది.

'హైదరాబాదు రాజ్యం రక్తసిక్తం అవుతుంది. భారతదేశాన్ని చెరిపేస్తాం. చివరి రక్తపు బొట్టు చిందిస్తాం. ఎర్రకోటమీద అసఫ్జాహీ పతాకం రెపరెపలాడుతుంది. మా కరవాలాలు బంగాళాఖాతంలోగాని కడగం' వంటి రజ్వీబ్రాండు బెదరింపుల శతఘ్నులు పేలాయి. కేవలం వాగాడంబరంతో ఎర్రకోటమీద జండా ఎత్తదలచాడు ఖాసింరజ్వీ. వాగాడంబరం తనను, తన రాజ్యాన్ని రక్షిస్తుందనుకున్న మూర్ఖుడు మీర్ ఉస్మాన్ అలీఖాన్ – అసఫ్జాహీ వంశంలో చివరి ప్రభువు. మూర్ఖులను గురించి మహాకవి ఇక్బాల్ ఒక అందమయిన కవిత చెప్పారు:

ఫూల్ కి పత్తీసె కట్ సక్తాహై హీరేకా జిగర్
మర్దెనాదాఁపర్ కలామె - నర్మ్ - నాజూక్ బే అసర్

ఇక్బాల్ ఉర్దూకవితకు భర్తృహరి సంస్కృత మాతృక:

ఛేత్తుం వజ్రమణీం శిరీషకుసుమ ప్రాన్తేన సన్నహ్యతి
మూర్ఖాస్యః ప్రతినేతుమిచ్ఛతి బలాత్సూక్తైః సుధాస్యదిభిః

వజ్రమును దిరిశన పూవుయొక్క రేకుతో చేధించవచ్చు. కాని, మూర్ఖుని మంచిమాటలతో మార్చడం అసాధ్యం.

అక్కడ భారతదేశంలో ఆపరేషన్ పోలో సన్నాహాలు పూర్తి అయినాయి. 1948 ఏప్రిల్ 6 న జనరల్ అటల్ అంచనా ప్రకారం సైన్యం రోజుకు 30 మైళ్లు పురోగమించడం సాధ్యం. హైదరాబాద్ పక్షం నుంచి గట్టి ఎదిరింపు ఉన్నా, ఆ పురోగత సాధ్యమవుతుంది. ఆ లెక్కన షోలాపూర్ – హైదరాబాదు మధ్యదూరం 186 మైళ్లు చొచ్చుకు పోవడానికి 15 రోజులు పడుతుంది.

మౌంట్ బాటన్ హైదరాబాదుకు మిత్రుడు. అట్లా అనలేం. హైదరాబాదు సమస్యను సామరస్య పూర్వకంగా పరిష్కరించదలచారు. పోలో వ్యూహం గవర్నర్ జనరల్ కు సహితం తెలియనంత రహస్యంగా ఉంచారు. అయితే, మవుంట్ బాటన్ కు 'పోలో' విషయం చూచాయగా తెలిసింది. తన పదవీ కాలంలో హైదరాబాదు మీద సాయుధ చర్య తీసుకోబోమని నెహ్రూ గవర్నర్ జనరల్ కు మాట ఇచ్చారు.

కాబట్టి మవుంట్ బాటన్ ఉండగా సైనికి చర్య సాధ్యపడదు.

జూలై చివరి వరకు ఆపరేషన్ పోలో ఏర్పాట్లు – ప్రణాళిక సర్వం సిద్ధం అయింది. 22,000 సైన్యానికి 22 రోజులకు సరిపడ పదార్థాలు సిద్ధం అయినాయి. మేజర్ జనరల్ జయంత్ నాథ్ చౌదరి సైనిక చర్య నిర్వహించడానికి నియమితులు అయినారు.

భారత సైన్యానికి సహితం ఒక చిన్న చిక్కు వచ్చింది. గూఢచర్యాదళం పటిష్టంగా లేదు. నిజాం సైనిక దళాలను గురించి సరియైన అంచనా వేయలేకపోయారు. ఈ పనిని ఏజంట్ జనరల్ K.M. మున్షీ సుగమం చేశారు. వారు హైదరాబాదు సైన్యంలో ఒక అధికారిని లోబరుచుకున్నారు. అతను హైదరాబాదు సైన్యపు వివరాలను స్పష్టంగానూ కచ్చితంగానూ తెలియపరచాడు. ఇది భారతసైన్యానికి ఎంతో ఉకరించింది. అంతేకాదు. J.N. చౌదరికి హైదరాబాదు సునాయాసంగా జయించగలం అన్న సంపూర్ణ విశ్వాసం ఏర్పడింది.

భారత సైన్యం దూకడానికి సిద్ధంగా ఉంది. అయిదువైపులనుంచి ముట్టడి చేయడానికి సిద్ధంగా ఉంది. నిరీక్షణ ఆదేశాల కోసమే!

## రణభేరి:

భారత ప్రభుత్వ ఆదేశాలు అందాయి. 1948 సెప్టెంబరు 12 అర్ధరాత్రి దాడి ప్రారంభం అయింది. పశ్చిమ వ్యూహపు సిక్కు-సేన 13 సెప్టెంబరు తెల్లవారే వరకు 'జల్కోట'గ్రామం పట్టుకున్నారు. ఈ మొత్తం దారిలో ఎదిరించేవాడే లేకపోయాడు.

గ్రామం బయటకు ఒక ఫిరంగి కనిపించింది. అది పేలనే లేదు. అది పేల్చేవారు భయపడి పారిపోయారు.

'బోరి' నదిమీద 'నతదుర్గ్' వంతెన కీలకమైంది. దానికొరకు భీషణ సంగ్రామం జరుగుతుంది అనుకున్నారు. అంతేకాదు, దాన్ని పేల్చివేస్తే పురోగమనం మందగిస్తుంది. ఆశ్చర్యము –అదృష్టమూ ఏమంటే, ఆ వంతెనకు రక్షణ లేనేలేదు. భారతసైన్యాలు అవలీలగా దాన్ని వశపర్చుకున్నాయి.

భారత సిక్కు దళానికి పురోగమనం అనాయాసం అయిపోయింది. 13 సాయంకాలానికి 61 మైళ్ళు లోపలికి చొచ్చుకు వచ్చింది. 'ఉమర్గా'ను పట్టుకుంది. మరోవైపు నుంచి గూర్ఖాదళం ఔరంగాబాదు – జాల్నామార్గం సుగమం చేసుకుంది.

2. **తూర్పువ్యూహం:** గూర్ఖాసైనికులు 13 ఉదయం దాడి ప్రారంభించారు. ఈ ప్రాంతంలో గట్టి రక్షణ ఉంటుంది అనుకున్నారు. ఇక్కడి నిజాం సైన్యపు మోహరింపును గురించి అంతకుముందు – మద్రాసు ప్రధాని రెడ్డియార్ బెదిరారు. కాని, తొలి మూడు గంటల్లో నామమాత్రపు ఎదిరింపు కూడా లేదు. మరింత ముందుకు సాగింది. మునగాల ఆక్రమించింది.

3. **దక్షిణ వ్యూహం:-** రాయ్చూర్ ప్రాంతంలో ఒక తుంగభద్ర వంతెనను వశపర్చుకుంది. అలంపురం – కొప్పల్ రైల్వేస్టేషన్లను అందుకుని, 'జింగెరా' చేరుకున్నారు.

4. **ఉత్తర వ్యూహం:** ఈ ప్రాంతంలో నిజాం సైన్యం కనిపించనేలేదు. రజాకార్లు అల్లాహో అక్బర్ అని మిడుతల దండులా ఎదిరించారు. అంతవేగంగానే వెనుదిరిగారు. మధ్యాహ్నానికి జాల్నా – సాయంకాలానికి హింగోలీ చేరుకున్నారు.

5. **వాయువ్యూహం:** హైదరాబాదు వాయుదళం పటిష్టమైంది అనుకున్నారు. కాని, ఏనుగు పిత్తినట్లయింది. పగటివేషగాని పగిదిగా మారింది. భారత విమానాలకు ఎక్కడా ఆటంకం కలగలేదు. నిరాటంకంగా – అనాయాసంగా – స్వేచ్ఛగా విహరించాయి. తొలి కొన్ని గంటల్లోనే 'గగనతలం' వశపర్చుకున్నారు.

నిజాం – రజ్వీ తమ వాయుదళాన్ని గురించి గుప్పించింది పదజాలం మాత్రం అని అర్థం అయింది. ఇంతకూ ఈ మహా వాయుదళంలో వరంగల్లులో ఒక్కటి – బిదర్లో రెండు విమానాలున్నాయి. సిడ్నీ కాటన్ తెచ్చిన విమాన విధ్వంసకం మూట విప్పలేదు.

భారత వైమానికదళం వరంగల్లు విమానాన్ని తొలిదెబ్బకు – బిదర్ విమానాలను మలిదెబ్బకు ధ్వంసం చేశాయి హైదరాబాదు వైమానికదళం నిద్రలేవకముందే అంతా

అయిపోయింది. నిద్రలేచి వారు 'పరేడు'కు బయల్దేరారు. అది కూడా అవసరం లేకపోయింది.

అలా సాగుతూనే పోయినాయి సైన్యాలు. రెండోరోజు రజ్వీ జన్మస్థలం 'లాతూరు' ఆత్మసమర్పణ చేసింది.

మేజర్ 'ఫ్రెడ్డీఫ్రీ మాంటల్' జాల్నా– ఔంగాబాదు సెక్టార్‌లో నిరాటంకంగా – ఠీవిగా – దర్జాగా గూర్ఖాసేనతో సాగిపోతున్నాడు. తోవలో ఒక గ్రామం దర్శనం ఇచ్చింది. రక్షణ లేదు. దళాలు పలాయనం అయినాయి. కాని, పూరిండ్లు – మట్టి మిద్దెలు – ఆకలితోవున్న జనం– ముక్కుకారుతున్న పిల్లలూ కనిపించారు అతనికి జాలి కలిగింది. తుపాకి పక్కన పెట్టాడు. దానితో అంత పని లేకుండా పోయింది. ఫ్రెడ్డీ గ్రామ సేవ, సమాజ సేవ ప్రారంభించాడు. అప్పటినుంచి ఆ గ్రామానికి 'ఫ్రెడ్డీనగర్' మారుపేరైంది.

ఇక్కడ 'విమాన విధ్వంస'ని గురించి జనం చెప్పుకున్న ఒక కథ చెప్పాలి:

భారత విమానాలు హైదరాబాదు విమానాశ్రయం వైపు వస్తున్నాయి. వాటికి దూరం నుంచే విధ్వంసకి కనిపించింది. వారు కాస్త జాగ్రత్త పడ్డారు. గమనం తగ్గించారు. విధ్వంసకి ధ్వంస పరిధిలోకి విమానాలు వచ్చాయి. ధ్వంసకి కదల్లేదు. విమానాలు ధ్వంస పరిధి బయట తిరిగాయి. ధ్వంసకిలో కదలిక కనిపించలేదు. పరిధిలోకి వచ్చాయి. అయినా కదల్లేదు. అప్పుడు భారత విమానాలు దిగాయి. తీరా చూస్తే ధ్వంసకిలో మనిషి లేడు! విమానాశ్రయం నిర్మానుష్యం!!

ఇది జనం చెప్పుకునే కథ! అయితే ఇందులో కీలకం అయిన సత్యం ఉంది.

మర ఎంత గొప్పదయినా నడిపే మనిషి ముఖ్యం.

పరికరాలు సాధించడంకన్న వాడడం ముఖ్యం.

పోలీసు చర్యనుగురించి జానపదులు విచిత్రంగా చెప్పుకుంటారు.

సన్నాసాయన ఢిల్లీకి ఉరికిండు. సన్నాసాయన ఎవరయా అంటే రామానంద తీర్థ. మల్లగాయన ఢిల్లికెందుకు ఉరికె? అరె ఎరకయితలేదా? నైజమోడు మందిని నరకబట్టె – ఆడోల్లను చెరచబట్టె – కొంపలు దోచబట్టె, తగలపెట్టబట్టె – అవు ఎరకయితాంది! ఢిల్లీల యాడికి పోయిండా మల్ల! యాడికి పోతడే – పటేల్ తానికి పోయిండు. ఓర్యవ్వ ఊళ్లల్ల పటేల్ పట్వారీలందరు ఢిల్లి చేరినారు! ధన్నియక్క – నీ తెల్వి దొంగల్తోల మన పటేళ్లు కారే – సర్దార్ వల్లభాయ్ పటేల్! ఈ కొత్త పటేల్ యాడికెల్లొచ్చె?

నీయవ్వ నీ దిమాక్ సరిగ్గలేదే! వల్లభాయ్‌గారే కద భారతసైనికులను నడిపిచ్చేటిమంత్రి. అట్లు చెప్పరాదుమల్ల – పటేలంటే నాకు ఎర్కలేదు. సర్లే సన్నాసాయన పటేల్ కాడికి పోయిండు. అటెన్క కథ చెప్పు.

సన్నాసాయిన పోయెటాల్కల్ల పటేల్ పండి ఉన్నడు. ఏమన్న బీమారేమో పాపం! ఎహే పటేలంటే ఉక్కుమనిషి బీమార్‌గీమారేం లేదు. ఆరాం చేస్తాండు. పెద్ద పెద్దోండ్లు ఆరామ్ చేయక పని చేస్తారె?

చెప్పనిస్తనా అడ్డపుల్ల లేస్తుంటవా? ఎర్కలేక అడుగుతాన్న – కోపమెందుకయితవు.

జర సమ్జాయించి చెప్ప్ర. సన్నాసాయన పటేల్ కాడికి పోయిండు. పటేల్ పన్నడు. అటెన్క కత చెప్ప్ర.

సన్నాసాయన పన్న పటేల్ను చూసిండు. మండిపడ్డడు. సన్నాసోడికి సతకోపం వస్తదా? మల్ల లగాయించినవ్! నోర్మూస్తవా! అట్లెందుకంటవే ఎర్కలేక అడిగిన ఇడమర్చి చెప్పరాదు. ఇక అడగన్లే సన్నాసాయనకు కోపం వచ్చింది. అటెన్క కథ చెప్ప్ర.

సన్నాసాయన పటేల్ను దులిపి పెట్టిండు. పటే లూరుకున్నాడా? మల్ల అడ్డమొస్తున్నవు. ఊరుకోక ఏం చేస్తడు? ఈడ రాజ్జం తగల బడ్తాంది. ఆడనేమో ఆయన నిద్రపోతాండు. వచ్చినాయన సన్నాసాయన. శాపం పెడ్తాడేమోనని బుగులు పడ్డడు.

గది సర్లేవే! ఏమని దులిపిండో చెప్పకపోతివి. చెప్పమంటావా? ఇను. ఆడ నైజామోడు రక్కసుడయిండు. ఆడోల్లను చెరుస్తాండు. మునులను బందిస్తాండు యాగగుండాలల్ల పారపోస్తాండు. కల్లు పోస్తాండు. నువ్వేమో ఆ సామి పామీ్మద పన్నట్టు పన్నవ్. ఏమనుకుంటాన్నవ్ అన్నడు. దోసిల్ల నీళ్లు పట్టిండు శపించెటందుక్క.

ఎర్కలేక అడుగుత. ఇంక శపించెటోల్లున్నారె కలిగ్రుంల! మల్ల అడ్డమొస్తాన్నవ్. చెపుతే ఇంటలేవు. అరే ఆయన తాన అన్ని శక్తులుండబట్కే పటేల్ను గన్నిమాటలన్నడు? ఇంకొకలకు అంత తడాక ఉంటదా? సరె సన్నాసాయన దులిపిండయా – పటేలాయన ఏం చేసిండు?

పటేలాయన దిగ్గున లేచి కూచున్నడు. కాల్మొక్త కోప్పడకుండి అన్నడు. సన్నాసాయన్ను కూకుండ పెట్టిండు. ఇంతకు నన్నేం చెయ్యమంటరు అనిడిగిండు. అంత గమ్మతుగున్నది. సన్నాసాయన దులుపుడు – పటేల్ కాల్పట్టుకొనుడు. కోప్పడకే అన్న అటెన్క చెప్ప్ర.

సన్నాసాయన అన్నడు: పటేల! ఇంక నన్నే అడుగుతవ్. జల్ది చౌదరిని పిలిపిచ్చు. పట్నం పంపిచ్చు. నిజామును పట్టి తెప్పిచ్చు. సన్నాసి హుకుం జారీ చేసిండు. నోర్మసుకుంట ముంగలి కత చెప్ప్ర.

"గట్లనే బాంచెను" అన్నడు పటేల్. చవుదరిని పిలిపించిండు. చవుదరి బీడి తాగుతున్నడు. పారేసిండు. వచ్చిండు. చవుదరీ! నీ డ్రసు యాడున్నది అంట అడిగిండు పటేల్. చిలుకొయ్యకు తగిలించి వచ్చిన అంటన్నడు చౌదరి. జల్ది దిరస్సేసుక రమ్మంట చవుదరిని పటేల్ పంపిండు. ఒక్కమాటడుగుత ఏమనుకోకన్న! అంత పటేలు ముంగలికి చౌదరి దిరస్స లేకుండా ఎట్ల వచ్చె? బీడి తాక్కుంట ఎట్ల కూకునే?

అన్న! నీ భేజల పెండ ఉన్నదే! పటేల్ పండిండుగద! గందుకే చవుదరి దిరస్సు ఇడిచిండు – బీడి తాగుతున్నడు. ఇంకేమన్న అడిగెడిదుంటే గిప్పుడే అడుగు. అటెన్క చెప్ప. ఇప్పుడు ఎట్ల అడుగుతలేగని చవుదరి ముచ్చట చెప్ప్ర.

చవుదురి దిరస్సు ఏసుకొని వచ్చిండు. పటేలుకు సలాం పెట్టిండు. నిక్కి నిలబడ్డడు. పటేల్ చవుదరితోని అన్నడు:– చెప్పేడిది బాగ ఇను. దిమాగ్ల ఎక్కించుకో. తీర అడ్కిపోయి గప్లత్ల ఇంకొకన్ని పట్టుకొచ్చేవు! ఫీరన్ హైద్రాబాద్ పో. గా నైజామ్ను ఈడికి గుంజ్కరా. ఈడ ఉన్నట్లు రావాలె. మేము చాయ్

తాగుతుంటం. నీయవ్వగా చవుదరి నా సొంటోడున్నట్లున్నడు. ఇంతకు వానికి దిమాగ్‌కు ఎక్కిందథటవ్?

అరె నీఅఖల్లమన్నువడ! చవుదురి సామాన్నుడనుకున్నవ? పట్నం వచ్చిండు. నిజాంగల్ల పట్టిండు. వాడు ఉచ్చపోసుకున్నడు. చెప్పినట్లు ఇంటనన్నడు. అట్లయితే ముంగల పోయి పైజామ బద్లాయించ్క రమ్మన్నడు చవుదరి – వాసన పట్టలేకపోయిండు.

నైజామోడేమన్నడు ఇన్నవ? చెప్పకనే పోతివి. ఎట్లంట! నైజామన్నడంటే – నాకు ఒక్కటే పైజామున్నది. ఇట్లనే వస్తనన్నడు! ఒర్యవ్వ వీన్ని ఇట్లెట్ల పట్కపోదును అంట పాత పైజామ తెప్పిచ్చిచ్చిండు చవుదరి.

చవుదరి పదహోరు బండ్లు కట్టిండు. ఎనక బండిల నిజామును కూకుండ పెట్టిండు. చవుదరి ముంగలిబండ్ల కూకున్నడు. అంతదూరంగంటె నిజామోడు పారిపోకుండుంటడా అని. మల్ల ఏం చేస్తడయ్యా గా నిజామోని షేర్వానీ వాసన పట్టలేకపోయింది. గదేంటే గమ్మతు గంటవు. గంతవాసనుంటాదే! నీయవ్వ నీకేమెర్క. వాడు గద్దెకెక్కిన్నాడు తొడిగిండు. ఇడ్వలేదు. ఉత్కలేదు. సరెగని ఇంతకు నిజామోడు ఢిల్లీ చేరెనే.

చవుదరి చెవ్వుపట్టి గుంజ్కపోయి పటేలు ముంగల నిలబెట్టాడు. నిజామోడు పటేల్ను చూచిండు. రొండు మూసుకున్నడు. చలి జరం వచ్చినట్లు వణికిండు. నిలబడ్డడు.

"ఏమ్రా! ఏమో శాన నఖ్రాలు చేస్తున్నవట!" అన్నడు పటేలు. అట్లనంగనే నిజాం పటేల్ కాల్లమీద పడ్డడు. "బాంచెను, కాల్మొక్త – గులాపొన్నయిత మానం పోయింది. పానం దక్కించు" అని బతిమలాడిండు.

"అరె భడివె! మేం కూరగాయలు తినెటోల్లం. నిన్ను చంపి ఏం చేస్తం బే. గీ చవుదరి చెప్పినట్లు ఇనుకో. నువ్వు ఢిల్లీల వద్దు. లత్తుకోడ్తది. పట్నం పొ"మ్మన్నడు. చవుదరి 'తిరంగ' అందించిండు. చార్మినార్‌మీద ఎగిరెయ్యమన్నడు పంపించిండు.

ఇంతకు నిజామోన్ని ఏం చేసెనో చెప్పకపోతివి. గది ఎర్కలేకనే చవుదరి మల్ల పటేల్ తానికి వచ్చిండు. సలాం పెట్టిండు. అడిగిండు.

"భాడ్‌ఖావు, గాన్ని గద్దెమీద కూకుండపెట్టు. మెసుల్తే నాతోని చెప్ప" అన్నడు.

పటేలు సన్నాసాయన ఇరగబడినవ్విండనుకో!

అన్న! కత బలె బాగ చెప్పినవ్. కల్లీలు తాగుదం పా. అట్లనే నైజామోడు దిగిపాయె. మల్ల మనం కల్లన్న తాగొద్దా?...

17 వ తేదీవరకు ఉత్తర వ్యూహపు సైన్యం హింగోలి ఆసిఫాబాదు చేరుకుంది. సైన్యం ఇంకా నగరానికి చాల దూరంలో ఉంది.

నిజాం దాసోహం అన్నాడు.
అంతకుముందే సేనలు లొంగాయి.
లొంగిపోవలసిందని నిజాం ఫర్మాను జారీ చేశాడు.
అది అతని చరమ ఫర్మాను.

దక్షిణ సదన్‌లో సంచలనం ఎక్కువయింది. నిజాం లొంగుబాటుకు సంబంధించిన పత్రం సిద్ధం అయింది. అది J.N. చౌదరి తీసికెళ్లాల్సింది. కాని, మున్షీ రాజకీయజ్ఞుడు.

నిజాం సైన్యాల ప్రధానాధికారి మేజర్ జనరల్ అలీ అహమద్ ఎల్ – ఎడ్రోసును ముష్షీ పిలిపించారు. లొంగుబాటుకు సంబంధించిన పత్రం అతనికి అందించారు. దాన్ని నిజాముతో దక్కన్ రేడియోమీద చదివించే బాధ్యత ఎడ్రోసుకు అప్పగించారు.

మేజర్ జనరల్ ఎడ్రూస్ కింగ్‌కోటీ చేరుకున్నాడు. చదవాల్సిన పత్రం నిజాముకు సమర్పించాడు. నిజాం అందులోని ఒక్క అక్షరం మార్చలేదు. సోమాజీ గూడెంలోని దక్కన్ రేడియోకు చేరుకున్నాడు.

నిజాం – బుద్ధిమంతుడయిన పిల్లవానివలె – చదవమన్నట్లు చదివాడు

నిజాం – తన పదవీచ్యుతి శాసనాన్ని – తానే చదివాడు!

ఈలోగా మరొక ప్రహసనం జరిగింది:

నవాబ్ మెయిన్ నవాజ్‌జంగ్ – హైదరాబాదును గురించి విన్నవించడానికి యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ U.N.O.కు బయలుదేరాడు. మెయిన్ నవాజ్ జంగ్ లండన్ చేరేవరకు హైదరాబాదు మీద పోలీసు చర్య ప్రారంభం అయింది. లండన్ చేరి, చివరి రక్తపు బొట్టు వగైరా డైలాగులు – హైదరాబాదు నుంచి లండన్ చేరవేశాడు!

లండను చేరాడు జంగ్. హబీబ్ రహమతుల్లా – పాకిస్తాన్ హైకమీషనరు దగ్గరకి వెళ్లాడు. పదిలక్షల పౌనులు ఇస్తానన్నాడు. అంతమొత్తం విన్నాడు హైకమీషనర్. నాలుక ఎండిపోయింది. మంచినీళ్లు త్రాగాడు. పాకిస్తాన్ ప్రభుత్వ అనుమతి లేందే స్వీకరించలేను అన్నాడు.

జంగ్ పాకిస్తాన్ విదేశాంగమంత్రి జఫ్రుల్లాఖానుతో మాట్లాడాడు. అతడు అనుమతించాడు. రహమ్‌తుల్లా స్వీకరించాడు.

మొయిన్ నవాజ్ జంగ్ పది లక్షల పౌనులు పాకిస్తానుకు సమర్పించుకున్నాడు. హైదరాబాదు స్వతంత్ర రాజ్యపు కేసు వాదించడానికి ఐక్యరాజ్య సమితికి వెళ్లాడు. సెప్టెంబర్ పదహారున భద్రతామండలికి అభ్యర్థన అందజేశాడు. అప్పుడు సర్ అలగ్జాండర్ కేడోగాన్ బ్రిటెయిన్ పక్షాన అధ్యక్షుడు. ఎనిమిది దేశాలు హైదరాబాదును బలపరచాయి. ఎవరూ వ్యతిరేకించలేదు. చైనా – రష్యా – యుక్రెయిన్ తటస్థంగా ఉండిపోయాయి.

ఈలోగా పోలీసు చర్య జరిగింది. నిజాం నవాబు స్వచ్ఛందంగా లొంగిపోయాడు. అయినా జంగ్ అభ్యర్థనను ఉపసంహరించడానికి నిరాకరించాడు. ఆ తరువాత నిజాం స్వయంగా అభ్యర్థనను ఉపసంహరించుకున్నాడు!

నాలుగు రోజుల్లో ఇంత వ్యవహారం జరిగిపోయింది. ఆజాద్ హైదరాబాదు పేరునుంచి ఆజాద్ విడాకులిచ్చింది. వట్టి హైదరాబాదు మిగిలిపోయింది.

నాకు గుర్తున్నంత వరకు పదమూడు ఉదయం ఆకాశవాణి వార్తల్లో "సైనిక చర్య" అన్నారు. మధ్యాహ్నం వరకు 'పోలీసు చర్య' అన్నారు.

హైదరాబాదు మీద చర్య అతి సున్నితం అయిన వ్యవహారం. సర్దార్ పటేల్ స్థిర సంకల్పం – రాజనీతిజ్ఞత – వ్యవహార కుశలత – కుశాగ్ర బుద్ధి ఈ వ్యవహారంలో భారత ప్రభుత్వానికి, ప్రజకు – హైదరాబాదు ప్రజకు విజయ పరంపరలు చేకూర్చాయి.

అయితే, ఇందులో మొత్తంగా భారత ప్రభుత్వం, ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ హైదరాబాదు ప్రజా ఉద్యమ పాత్రను తక్కువ అంచనా వేయరాదు.

భారత సైన్యానికి - అన్ని రంగాలలోనూ - హైదరాబాదు ప్రజ సహకరించింది. సైన్యానికి పూలదండలతోను - మంగళ హారతులతోనూ స్వాగతం పలికింది. హైదరాబాదు ప్రజా ఉద్యమం పోలీసు చర్య విజయానికి ఎంతో తోడ్పడింది. **ప్రజా ఉద్యమం బలపడి ఉండకపోతే హైదరాబాదు మరొక కాశ్మీరం అయికూర్చునేది!**

ఇది అత్యంత సున్నితమయిన సమస్య. దీనిని పరిష్కరించిన తీరు చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోతుంది.

1. ఇది ఒక రాజ్యంమీద యుద్ధంకాదు.
2. నిజాం ఒప్పందాన్ని భగ్నం చేశాడు. దాన్ని సరిచేయడానికి పోలీసు చర్య జరిగింది.
3. హైదరాబాదును భారతసైన్యాలు ఆక్రమించనే లేదు.
4. నిజాం నవాబు - తన ఇష్టపూర్తిగా లొంగిపోయాడు.
5. ఇది నిజాం లొంగుబాటు అగును. భారత సేన విజయం కాదు!
6. ఇది యుద్ధంకాదు - సరిచేయడం మాత్రమే!

**ఈ అనంత చర్యకు బాధ్యులయి, నిజాం రాజ్య ప్రజను విముక్తం చేసి - ఒక దురంత నియంత లొంగుబాటుకు కృషి చేసిన వారందరికి శతసహస్ర నమో వాకములు. నమో వాకములు. నమో వాకములు.**

మరుసటి రోజు మేజర్ జనరల్ జయంత్ నాథ్ చౌదరి హైదరాబాదు ప్రభుత్వ బాధ్యతలు స్వీకరించారు.

రెండున్నర శతాబ్దాల ఆసిఫ్జాహీ పాలన అంతం అయింది.

చార్మినార్ మీద త్రివర్ణ పతాకం సగర్వంగా రెపరెపలాడింది.

ప్రాణములొడ్డి ఘోరగహ
నాటవులన్ బడగొట్టి, మంచి మా
గాణములన్ సృజించి, ఎము
కల్ నుసిజేసి పొలాలు దున్ని, భో
షాణములన్ నవాబునకు
స్వర్ణము నింపిన రైతుదే, తెలం
గాణము రైతుదే; ముసలి
నక్కకు రాచరికంబు దక్కునే?

ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
**తీగెలను తెంపి అగ్నిలో దింపినావు**
**నా తెలంగాణ కోటి రత్నాలవీణ!**

- దాశరథి "అగ్నిధార"నుంచి.

అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

# ఇరవయి నాలుగు

## ధనమూలం:

ఒక తిమిరగోళం పగిలింది.
ఒక జ్యోతిర్గోళం వెలిసింది.
ఒక ప్రజాశక్తి విజృంభించింది.
ఒక ముసలి నక్క మూలిగింది.
ఒక చైతన్య స్రవంతి ఉప్పొంగింది.
ఒక ప్రజా కంటకుడు అంతరించాడు.
ఒక ఇంద్ర ధనువు వెలిసింది.
ఒక రంగుల వాన కురిసింది.

భారత స్వాతంత్ర్య సమరం వందేళ్ళు సాగింది. అంగ్రేజులు దేశం వదిలి వెళ్లారు. నయంగా వెళ్లారు. ఎక్కువ హింసాప్రయోగం లేకుండా వెళ్లారు.

నిజాం నవాబు జన్మ జన్మాల బూజు; వాడు వదలడు. వేళ్లాడ్తాడు. కదలడు. ఏమీ లేకున్నా బూకరిస్తాడు. గ్రామ సింహం భారత సింహాన్ని బెదిరిస్తుంది. భారత సింహం గర్జించింది. అంతే. అంతే. నిజాం గద్దె దిగాడు. కూలబడ్డాడు. చేతులు జోడించాడు. బేల అయినాడు. ప్రాణభిక్ష కోరాడు. సర్దార్ పటేల్ ఉదారంగా వ్యవహరించాడు. శరణాగతునికి ప్రాణదానం చేశాడు!

నిజాం, మతాన్ని ఆయుధంగా చేసుకున్నాడు. మతం రక్షిస్తుంది అనుకున్నాడు. తన మనుగడ సాగుతుంది అనుకున్నాడు. మతం ఎదురు తిరిగింది! మతాన్ని వదిలాడు! పాదాలు ఆశ్రయించాడు!

నిజాం ప్రజ ఉదారులూ, సహనశీలురు, ఉత్తములు. మతరక్కసి కలకాలం రాజ్యం చేసింది. అయినా ప్రజ ప్రతీకారం తీసుకోలేదు. చెదురు మదురు సంఘటనలు జరగక పోలేదు. అవి స్వప్రయోజనపరుల ఆగడం. తురకలు సంపన్నులు తప్ప గ్రామాలు వదల్లేదు. హిందువులు మహమ్మదీయ సోదరులకు తమ ఇళ్లల్లో తావరం కల్పించారు. ఇక్కడిది నిజమైన ప్రజా ఉద్యమం.

అందువల్లనే అది సాధ్యం అయింది.

హిందువులు తురకల మీద ప్రతీకారం తీర్చుకోలేదు. అక్కడక్కడా జరిగిన మాట నిజం. కాదనను. కాని రజాకార్లు చేసినట్లు ఒక ఉద్యమంగా హింస చెలరేగలేదు.

ఇది భారతదేశంలోనే సాధ్యం!

అదీ ఒక్క హిందూ సమాజానికే సాధ్యం!!

అభినవ పోతన వానమామలై వరదాచార్యులవారు ఈ సందర్భాన్ని వస్తువుగా గ్రహించారు. "విప్రలబ్ధ" అనే కావ్యం రచించారు. పోలీసుచర్య కల్లోలాల్లో ఒక తురక పసిపిల్ల ఒక విప్రునికి లభిస్తుంది. విప్రునికి లభించింది – అందువలన "విప్రలబ్ధ." ఆమె విప్రలబ్ధ నాయిక కూడ! శ్లేషలో వరదన్న మిన్న. విప్రుడు ఆమెను పెంచి పెద్దచేస్తాడు. తరువాత వలపు కధ. ఆ కావ్యానికి వరదన్న నాతో పీఠిక వ్రాయించుకున్నాడు.

ఒక విచిత్ర విషయం. అదేమంటే - కవులు కదల్లేదు. స్పందించలేదు. ప్రజాపోరాటంలో సాహిత్యం మిన్నంటింది. ప్రజా విజయ కవిత వచ్చినట్లు కనిపించదు! కవిత రాలేదని కాదు. నిలిచి ఉండే కవిత రాలేదు. కారణం కమ్యూనిస్టులు దీన్ని విజయంగా గుర్తించలేదు. వారు విచిత్రులు. కొంతకాలం భారత స్వాతంత్ర్యాన్నే గుర్తించలేదు!

మరొక ముఖ్యం అయిన విషయం. ఇది దొరలకు వచ్చిన స్వాతంత్ర్యం. పంచుకున్న భూములు ఉండవు. పోతాయి. వెలసిన సోషలిజం అంతరిస్తుంది.

ఈ విషయాన్ని వస్తువుగా తీసుకొన్నాను. 'జనపదం' అనే పెద్ద నవల వ్రాశాను. ఇది 740 పేజీల నవల. దొరలు మరల పెత్తనం సాగించాలనుకుంటారు. సాయుధ పోలీసు బలగంతో దిగుతారు. కథ మళ్లీ మొదలు! దొరల దౌర్జన్యాలు, పెత్తనం, హింస.

జనపదం పోలీసు చర్యనుంచి మరొక సాయుధ పోరాటం ఆరంభం వరకూ రెండు దశాబ్దాల కాలపు ప్రజా జీవితాన్ని చిత్రిస్తుంది. రెండు దశాబ్దాలలో వచ్చిన పరిణామాలను వివరిస్తుంది. చిత్రిస్తుంది.

మరొక నగ్నసత్యం ఏమంటే - కమ్యూనిస్టులను అణచడానికి పోలీసుచర్య త్వరితంగా జరిగింది! వ్యక్తులను నిందించరాదు. భారత ప్రభుత్వమే ఇందుకు పూనుకుంది. ఇందుకు అచ్చం ప్రభుత్వాన్ని నిందించలేం. కమ్యూనిస్టులు అనేక తప్పులు చేశారు. తమ బలాన్ని అతిగా అంచనా వేశారు!

నేను అమ్మా - చెల్లెళ్లను తీసుకున్నాను. కాస్త ఆలస్యంగా గార్ల చేరాను. అన్నయ్య అప్పటికి అక్కడ లేడు. నాయకులతో పట్నం చేరుకున్నారు.

గార్ల మా ఇంట్లో ద్వార బంధాలు - ద్వారాలు మాత్రం మిగిలాయి. రజాకార్లు మొత్తం దోచుకున్నారు. గ్రామ ప్రజలు అడ్డుకున్నారు. అందువలన అదయినా మిగిలింది. కాకుంటే నీడ కూడా లేకుండా పోయేది. ఇంట్లో వంటకు పాత్ర లేదు. పంటకు మంచం లేదు. అదంతా పోయినందుకు అమ్మ దుఃఖించింది. ఏడ్చింది. ఇల్లు మిగిలినందుకు సంతోషించమన్నాను. అది నిజమే కాని దరిద్రం! చేతిలో పైసలేదు. చేయడానికి కొలువు లేదు. సామాజిక స్థితిగతులు మునుపు ఉన్నట్లు లేవు. ఇంతలో ఎంతమార్పు! మనిషికి విలువ చచ్చింది. డబ్బుకు విలువ హెచ్చింది.

ఇంతకు ముందు భూమి బలం
ఇప్పుడు ధన బలం
ఇంతకు ముందు అధికారంలోంచి ధనం పుట్టేంది.
ఇప్పుడు ధనంలోంచి అధికారం పుడ్తున్నది.
భూస్వామ్యం పోతున్నది. ధనస్వామ్యం వస్తున్నది.

"యస్యాస్తి విత్తం సనరః కులీనః స పండిత స్సశ్రుతవాన్ గుణజ్ఞః
సఏవవక్తా స చ దర్శనీయః సర్వేగుణాః కాంచన మాశ్రయంతి -"

అన్నాడు భర్తృహరి.

డబ్బున్నవాడే కులవంతుడు. గుణవంతుడు. పండితుడు. వినదగినవాడు. వక్త. దర్శనీయుడు. సర్వగుణాలూ బంగారాన్నే ఆశ్రయిస్తాయి!

గార్లలో ఒక కాంగ్రెసు ఆఫీసు వెలిసింది. ఒక తురక పారిపోయాడు. వాడి ఇంటిని ఆక్రమించుకున్నారు!

మేము కార్యాలయం లేకుండానే కార్యక్రమాలు నిర్వహించాం. ఇప్పుడు కార్యాలయం పెట్టి పెత్తనం చేస్తున్నారు!

**భవనాలు లేనినాడే పార్టీలు పని చేశాయి. భవనాలు కట్టుకున్నారు. అంతే, పార్టీలు భవనాల్లోనే ఉండిపోయాయి!**

పోలీసు చర్య తరువాత ప్రభుత్వం లేకుండా పోయింది. తాసిల్దారు వగైరా అందరూ పారిపోయారు. పేష్కారు వంటి హిందువులు ఉన్నారు. కాని భయపడుతున్నారు.

ఇప్పటి ప్రభుత్వం కాంగ్రెసు ఆఫీసుది. కాంగ్రెసు వారే తగువులు తీరుస్తున్నారు. శిక్షలు విధిస్తున్నారు. కాంగ్రెసు ఆఫీసులో ఉన్నవాళ్లు ఎవరు? నిన్నటి వరకు కుచ్చు టోపీ పెట్టుకున్న హిందువులు! ఇప్పుడు టోపీ మార్చారు. గాంధీ(కి) టోపీ పెడ్తున్నారు. తెల్లని కద్దరు తప్ప అన్యం ధరించడం లేదు. నిన్నటి ప్రజాద్రోహులు ఇవ్వాళ దొరలు! నిన్నటి ధనపతులూ ఈనాటి దొరలు!! నిన్నటి దొరలే ఈనాటి దొరలు!!! వేషాలు మారాయి. అంతే!

గార్లలో ఉద్యమం నిర్మించింది మేము. త్యాగాలు అవసరం అవుతే చేసింది మేము. ప్రజలు మా పక్షాన ఉన్నారు. అలా అనుకుని కాంగ్రెసు ఆఫీసుకు వెళ్లాను. ధనపతులూ – భూపతులూ ఉన్నారు. నన్ను అనాదరణ చేయలేదు. చేయలేరు. అసహనంగా చూచారు. రాకూడని అతిథి వచ్చినట్లు చూచారు. తమ పెత్తనం హరించడానికి వచ్చినట్లుగా చూశారు. నేను అక్కడ పనికి రాను అన్నట్లు పలకరించారు.!

నాకు ముళ్లమీద ఉన్నట్లున్నది. ఇక్కడ నా అవసరం లేదు. మనం 'వీళ్ల'కు పనికివచ్చేవాళ్ళం కాదు అనిపించింది. బయటపడ్డాను.

ఇంట్లో కుండలో వండుకున్నాం. నేలమీద పడుకున్నాం. అందుతున్న వార్తలు మరింత బాధిస్తున్నాయి. కాంగ్రెసు వాళ్లు లంచాలు తింటున్నారు. అయిన వాణ్ణి, కానివాణ్ణి రజాకారుగా ముద్ర వేస్తున్నారు. పట్టుకుంటున్నారు. లంచాలు గుంజుతున్నారు. విడుస్తున్నారు. తగాదాల్లో ఉభయ పక్షాలనుంచి ఇద్దరు నాయకులు పుడుతున్నారు.

నిన్నటి దాకా మేము ఉద్యమమే తప్ప "డబ్బు" అనే విషయం కనీసం ఆలోచనలోకి రానీయలేదు. ఇంతలో ఎంత మార్పు! 'డబ్బు' తప్ప అన్య ఆలోచన లేనేలేదు!

ఎంత పతనం!

ఇంతలో!!

ఒక పేద బూబమ్మ ఇంటికి వచ్చింది. లబలబా మొత్తుకుంటూ వచ్చింది. గుండె బాదుకుంటూ వచ్చింది. కన్నీరు కారుస్తూ వచ్చింది. నా కాళ్లమీద పడింది. ఆమె భర్తను పట్టుకున్నారట! బంధించారట! రజాకారు అంటారట! డబ్బు అడుగుతున్నారట!

నేను ఆవేశపరుణ్ణి. ఆవేదన భరించలేను. కాంగ్రెసాఫీసుకు ఉరికాను. నేను ఉద్రేకంగా ఉండవచ్చు. రుద్రునిలా ఉండవచ్చు. నన్ను చూశారు. అక్కడ ఉన్నవాళ్లు

లేచారు. బొమ్మల్లా చూచారు. అంతా నిశ్శబ్దం. ఒక్కడూ కిక్కురు మనలేదు. వెనుకకు చూచాను. బూబమ్మ ఉరికి వస్తున్నది. వచ్చింది. గది చూపింది. తలుపులు తెరిచాను.

నా కళ్లను నమ్మలేకపోయాను!

ఎవరు అక్కడున్నది?

మస్తాన్! మన మస్తాన్!!

"మస్తాన్ మేరా భాయీ!" అన్నాను.

"సాబ్!" అని మౌనంగా నుంచున్నాడు మస్తాన్. నా భుజం మస్తాన్ కన్నీటితో తడిసింది. ఇతడే నన్ను పోలీసు స్టేషన్నుంచి తప్పించింది!

మస్తాన్ భార్య ఆనందం పట్టలేకపోయింది. కూలబడ్డది. ఏడ్చింది.

అందరూ నివ్వెరబోయి చూస్తున్నారు.

"సాబ్! ఆప్ ఖైరియత్ సే ఆయే. హమేం బహుత్ ఖుషీ హై" (మీరు క్షేమంగా తిరిగి వచ్చారు. మాకు ఆనందంగా ఉంది) అని మస్తాన్ నా పాదాలను కన్నీటితో కడిగాడు. బూబమ్మ కాళ్లమీదపడి ఏడ్చింది.

నా గుండె నిండిపోయింది. గండి కొట్టింది. కన్నీరు రాలింది! ఆ అనుభూతి విలువ ఎంతో! ఎందరికి ఇలాంటివి లభిస్తాయి? నేను ఈ విషయంలో సంపన్నుణ్ణి!

నేను వాళ్లిద్దరినీ తీసుకొని బయటికి వచ్చాను. ఒక్కడు మాట్లాడలేదు. మెసల్లేదు, కదల్లేదు!

**మంచికి చెడు జంకుతుంది!**

**వెలుగుకు చీకటి బెదురుతుంది!!**

మరొకసారి ఇంకో బూబమ్మ వచ్చింది. డబ్బు తీసుకుని వచ్చింది. నాతో బేరం పెట్టింది. జీవితంలో బేరాలు తెలియనివాణ్ణి! నాకేం అర్థం అవుతుంది? డబ్బు ఇవ్వడానికి నా దగ్గరికే ఎందుకు వచ్చావు? అడిగాను. వాళ్లు ఎక్కువ డబ్బు అడుగుతున్నారట! ఇదంతా విచిత్రంగా ఉంది నాకు! ఈ బేరాల రాజ్యం కోసమేనా ఇంత చేసింది?

సరె. ఆమెను వెంట తీసుకుని నడిచాను. ఈ తడవ నాకు ఆవేశం లేదు. ఉద్రేకం లేదు.

**డబ్బు చప్పటిది. అందులో ఏమీలేదు.**

**అనుభూతి గొప్పది. అందులో అన్నీ ఉన్నాయి!**

నన్ను చూచారు. ఎవరూ లేవలేదు. ముచ్చట్లు పెట్టారు. గది తలుపు తీశాను. చూచాను. ఎవడు?

"సర్వర్! జమేదార్!"

వీడే మమ్ముల పట్టుకున్నవాడు! వీడే అందరిని బెదిరించినవాడు. వీడే అందరిని దోచినవాడు. వీడే అసలు "రజాకార్!" 'వీణ్ణి వదలుతారా?' అడిగాను. ఎవరూ మాట్లాడలేదు. నాకు ఈ వ్యవస్థమీదనే అసహ్యం పుట్టింది! కాని నిన్నటి శక్తి ఇవ్వాళ లేదు! నిన్న శక్తివంతుణ్ణి. ఇవ్వాళ శక్తిహీనుణ్ణి.

సత్యం చచ్చింది!

న్యాయం చచ్చింది!

గబాగబా ఇంటికి పరిగెత్తాను. నాలుగు సిగరెట్లు కాల్చాను!

ఒక ఊరి నుంచి జగడం తెంపమని వచ్చారు. రెండు రోజులు విన్నాను. నాకు తోచింది. చెప్పాను. సమంజసంగా ఉందన్నారు. ఉభయులూ సంతోషించారు. డబ్బు తెచ్చి దూరంగా పెట్టారు. తీసుకొమ్మన్నారు.

"ఎ- దుకు?" అడిగాను.

"- సోషంగ ఇస్తున్నం."

"డబ్బుతో సంతోషం వచ్చిందా?"

"కాదు. మీరు చెప్పంగ వచ్చింది."

"మరి నన్ను కొంటరా?"

డబ్బు అందుకుని విచారంగా వెళ్లిపోయారు. ఏమిటో విసుగు, చికాకు. అసహ్యం. "ధనమూల మిదం జగత్" అన్నాడు వాల్మీకి!

పోలీసు చర్య విషయంలో భారత ప్రభుత్వం ఎంతో జాగ్రత్తగా ప్రణాళిక సిద్ధం చేసింది. పరిపాలన భగ్నం అవుతుందని ఊహించారు. నిజాం అధికారుల మీద నమ్మకం ఉంచరాదనీ నిర్ణయించారు. జిల్లాలకు – తాలూకాలకు సివిల్ అధికారులను యూనియన్ కేడర్‌నుంచి నియమించారు.

వరంగల్లు జిల్లాకు పళనియప్పన్ I.C.S. జిల్లా అధికారిగానూ – కృష్ణమూర్తిగారు తాలూకా అధికారిగానూ వచ్చారు. అప్పటికి ఇంకా రైళ్లు సరిగ్గా నడుస్తున్నట్లు లేదు. ఒకే బోగీ బండిలో వారు ఇద్దరూ గార్లలో దిగారు. బండి డోర్నకల్లు వెళ్లింది. బొగ్గూ, నీరు వేసుకొని మళ్లీ వస్తుంది.

పళనియప్పన్ – కృష్ణమూర్తి గార్లలో పాలన ఏర్పరచడానికి వచ్చారు. తాసీల్ కచ్చేరీలో సమావేశం ఏర్పరచారు. కొత్త కద్దరుధారులందరూ చేరారు. పేర్లు చెప్పను. అందరూ అపకీర్తిశేషులయినారు. చచ్చినవాణ్ణి బద్నాం చేయడం సంప్రదాయం కాదు. "మరణాంతాని వైరాణి" అంటాడు వాల్మీకి.

పళనియప్పన్ తెలుగు బాగా మాట్లాడారు. తెలుగులో అధికారి మాట్లాడగా వినడం – తెలుగులో అధికారితో మాట్లాడ్డం ఇదే తొలిసారి!

పళయనిప్పన్ గ్రామ పరిస్థితులను గురించి అడిగారు. 'ఏమీ లేదు మహాప్రభో! మీ అనుగ్రహం వల్ల అంతా సవ్యంగా ఉంది' అన్నట్లు మాట్లాడారు అందరూ.

నేను వెనుక బెంచిలో కూర్చున్నాను. నుంచుంటే కనిపించను. బెంచి ఎక్కాను. 'జనాబ్' అని ప్రారంభించాను. "సార్" అనడం ఇంకా రాలేదు. ఇప్పటికీ రాలేదు. 'వీళ్లందరూ బ్లాక్ మార్కెటుదారులు. బియ్యం నిలువలు దాచారు. పేదలకు గింజ దొరక్కుండా చేశారు' అంటూ ఒక చిన్న ఆవేశపూరిత ఉపన్యాసం ఇచ్చాను.

"ఇది ఏమిటి?" అన్నట్లు పెద్దలను చూచాడు అప్పన్.

"కమ్యూనిస్టు – అట్లనే మాట్లాడ్తడు" అన్నారు అంతా.

"మా ప్రభుత్వంలో కమ్యూనిస్టులకు స్థానం లేదు" అంటూ సమావేశం ముగించారు అప్పన్. రైల్వేస్టేషనులో రైలు రాక కోసం కూర్చున్నారు.



1948లో గార్లలో తాశీల్ కచ్చేరిముందు దాశరథి రంగాచార్య

నేను వెంటనే ఒక మహజరు తయారుచేశాను. పేద ప్రజల సంతకాలు తీసుకున్నాను. జనాన్ని తీసుకొని ఊరేగింపుగా స్టేషనుకు చేరాను. మహజర్ పళని యప్పన్‌కు ఇచ్చాను. వారికి తెలుగు చదువరాదు. కృష్ణమూర్తితో చదివించుకున్నారు. కుర్చీ తెప్పించారు. నన్ను కూర్చోమ్మన్నారు. కూర్చున్నాను.

"మీరు నా మాట నమ్మలేదు. జనం మా వెంట ఉన్నారు" అన్నాను.

అప్పన్ చిరునవ్వాడు. 'పొరపాటే' అని నా వీపు నిమిరారు. "వీరు చెప్పినట్లు చేస్తాం. వెళ్లండి" అని జనాన్ని పంపించారు.

"డియర్ రంగా! మీరు మాకు వాస్తవం చూపించారు. ఎంతో థాంక్స్ మేము ఇక్కడికి కొత్త. ఇలాంటి పొరపాట్లు జరుగుతాయి. ముందు జరగకుండా చూస్తాం. రేపు TCA గారు వస్తారు. మీరు చూపినచోట చవక దుకాణాలు పెట్టిస్తారు మీరు ఏమీ అనుకోవద్దు" అన్నారు. బండి వచ్చింది. వెళ్లిపోయారు.

జనం స్టేషను బయటనే ఉన్నారు. DCA గారి మాటలు విన్నారు. నాకు జయపెట్టారు. నన్ను ఎత్తుకొని ఆడారు.

ICS అంటే ఇండియన్ సివిల్ సర్వీస్. వారికి బ్రిటీషు వాళ్లు శిక్షణ ఇచ్చారు. బ్రిటీషు ప్రజాస్వామ్యపు గొప్పదనం ఏమంటే - వాళ్లు వ్యతిరేకుల మాట విన్నారు. **తమకు వ్యతిరేకంగా పోరాటానికి గాంధీ - నెహ్రూ వంటివారికి శిక్షణ ఇచ్చింది బ్రిటిష్ వ్యవస్థయే! ఆ వ్యవస్థలో ఔదార్యం ఉంది. సహనం ఉంది. సహకారం ఉంది.**

DCA - డిస్ట్రిక్ట్ సివిల్ అడ్మినిస్ట్రేటర్ - పళనిఅప్పన్‌కు ఆ ఔదార్యం అబ్బింది. అతడు వాస్తవాన్ని ధిక్కరించలేదు. గుర్తించాడు. తెల్లవారి TCA కృష్ణమూర్తి గారు వచ్చారు. నన్ను పిలిపించారు. నాతో మాట్లాడారు. నేను చూపిన

చాట్లు స్వయంగా చూశారు. అవి పేదల ప్రాంతాలని గుర్తించారు. తరువాత వారం రోజుల్లో గ్రామంలో మూడు చవుక ధరల దుకాణాలు ఏర్పడ్డాయి.

## స్వతంత్ర వ్యాసం:

ఆ రోజుల్లో "తెలుగు స్వతంత్ర" – అనే వారపత్రిక వచ్చేది. దానికి ప్రఖ్యాత పత్రికా సంపాదకులు ఖాసా సుబ్బారావుగారు సంపాదకులు. పోలీసు చర్య జరిగింది. దాన్ని గురించీ తెలంగాణా విముక్తిని గురించీ ఒక సంపాదకీయం వ్రాశారు.

ఖాసావారి సంపాదకీయంలో తెలంగాణం గురించిన సమాచారం సరిగా లేదు. కాని సుబ్బారావుగారిది తప్పు అనే ధైర్యం లేదు. నేను పిల్లవాణ్ణి. అప్పటికి నాకు 19–20 ఏళ్లుంటాయి. అయితే తెలిసిన తప్పు తెలియపరచడం నా కర్తవ్యం. అలా అనుకున్నాను. వ్యాసం వ్రాశాను. 'స్వతంత్ర'కు – మద్రాసు పంపాను.

ఖాసా వారు పెద్దలు. సహృదయులు. ఆ రోజుల్లో పెద్దలకు ఉదారత ఉండేది. వారు తమ తప్పులను గుర్తించేవారు. ఎదుటి వాదనను గ్రహించేవారు. మరుసటివారం స్వతంత్రలో నా వ్యాసం వచ్చింది. అదీ సరిగ్గా సంపాదకీయం తరువాత. అది ఖాసా వారి విశాల హృదయం!

"స్వతంత్ర"లో నా వ్యాసం రావడం నాకు ఎంతో ఉత్సాహం కలిగించింది. ఆత్మ విశ్వాసం ఏర్పడింది. భయం దూరం అయింది. ధైర్యం కలిగింది. నేను వ్రాయగలను. చక్కగా వ్రాయగలను. మెప్పించగలను అనిపించింది.

"స్వతంత్ర"లో వ్యాసం – అందునా ఖాసావారి సంపాదకీయపు విమర్శ సామాన్య విషయం కాదు. అనేకులు మెచ్చుకున్నారు. అనేక ఉత్తరాలు వచ్చాయి. ఈ పరంపర నిరంతరం నెలవరకు సాగింది.

అసలు విషయం ఏమంటే – తెలంగాణా గురించిన సమాచారం అందడం లేదు. అది ఖాసావారి పొరపాటుకు కారణం. ఆ పరిస్థితి ఇవ్వాల్టికీ మారలేదు. ఈ తరం వారికి పోలీసు చర్య విషయం తెలియదు. 15 ఆగస్టునే స్వాతంత్ర్యం వచ్చింది. అనుకుంటారు. తెలంగాణం గురించి సమాచారం అందని లోటు ఇప్పటికీ ఉంది.

## ధాన్యవితరణ:

ఆ రోజుల్లో ఇప్పటి ధన, ధాన్య సమృద్ధి లేదు. ఆనకట్టలు తక్కువ. వర్షాలు అనిశ్చితం. రసాయనిక ఎరువులు లేవు. క్రిమిసంహారకాలు లేవు. రైతులకు ఇంతటి ప్రోత్సాహం లేదు. ధాన్యం దిగుమతులు అవసరం అయ్యేది. అయినా సరియైన వితరణ ప్రణాళిక లేదు.

గింజ దొరకడం కష్టం. డబ్బు దొరకడం అంతకంటే. సరుకులు చవక. కల్తీలు అంతగా లేవు. అయినా డబ్బు దొరకదు. అందుకు తోడు వ్యాపారుల నల్లబజారు. ధాన్యం వగయిరాలు దాచేస్తారు. దొరకనివ్వరు. ధరలు పెంచి అమ్ముతారు! ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడుతారు. డబ్బండీ డబ్బు – దానికోసం ఏదయినా చేస్తారు!

బ్లాకు మార్కెటును అరికట్టడానికి ప్రభుత్వ యంత్రాంగం లేదు. ప్రభుత్వం వాళ్లదే. చిత్తశుద్ధి లేదు. ప్రజలకు ధైర్యం లేదు. ప్రభుత్వం చర్య తీసుకుంటుందని

నమ్మకం లేదు. ప్రజలు ముందుకు రారు. ప్రభుత్వం పట్టించుకోదు. పరిస్థితిలో ఇవ్వాల్టికీ పెద్ద తేడా లేదు. అయితే దేశం సమృద్ధం అయింది. కొనుగోలు శక్తి పెరిగింది. సరుకులు లభిస్తున్నాయి.

ఒకనాడు ఒక వర్తక మిత్రుడు నాకు రహస్య సమాచారం అందించాడు. గార్లనుంచి 1800 బస్తాల జొన్నలు వ్యాగన్ల ద్వారా దొంగరవాణ అవుతున్నాయి. దాన్ని నిలుపు చేయాలని నా తాపత్రయం. తెలుగులో ఒక దరఖాస్తు వ్రాశాను. వరంగల్లు వెళ్లాను. దరఖాస్తు అనువాదం చేయించాను. టైపు చేయించాను. అది తీసుకొని పళని అప్పన్‌గారి దగ్గరకి వెళ్లాను.

పళని అప్పన్ DCA. కలెక్టరు చదివాడు. పెద్ద అధికారి. వారి దర్శనం సామాన్యం కాదు! నా పేరూ – ఊరు వ్రాసి పంపించాను. వెంటనే కాదుగాని, కొంత ఆలస్యంగా పిలిచారు. వెళ్లాను.

పళని అప్పన్‌గారు నన్ను గుర్తించారు. గార్ల విషయాలు – గింజల దుకాణాల విషయం అడిగారు. అప్పటి నా ధైర్యానికి మెచ్చుకున్నారు. దరఖాస్తు అందించాను. అందుకుని ఏమిటి అని అడగలేదు. మొత్తం చదివారు. వారి ముఖం వికసించింది. దరఖాస్తు పేరు చూచారు. 'డియర్ రంగా! నువ్వు కుర్రాడివి. దేశభక్తునివి. నీలాంటివాళ్లు ఉండాలయ్యా! నీముందే చర్య తీసుకుంటా, కూర్చో' అన్నారు.

నాకు 19–20 ఏళ్లు ఉన్న మాట నిజమే. కాని జబ్బులు – నిక్కరు షర్టు – చిన్నవాడిలా ఉంటాను. కాలేజి కుర్రానిలాగా కూడా కాదు. స్కూలు పిల్లవానిలా ఉంటాను. అందుకే DCA అలా అన్నారు.

అప్పటికి టెలిఫోను వ్యవస్థ లేదు. రైల్వేకు మాత్రమే టెలిఫోను ఉండేది. DCAకు రైల్వే టెలిఫోనుతో సంబంధం ఉంది. వారు డైరెక్టుగా గార్లకు మాట్లాడారు. నేను తెలియపరచింది. నిజం అని తేల్చుకున్నారు. వ్యాగన్లు నిలుపు చేయవలసిందని ఉత్తరువు చేశారు.

"డియర్ రంగా! కంగ్రాచ్యులేషన్స్! గింజ నిలిచిపోయింది – చాలునా?" అడిగారు.

"చాలదు సర్!"

"ఇంకా ఏం చేయమంటావయ్యా?"

"ఆ గింజ గార్ల దాటరాదు సర్. అది గార్లలోనే అమ్మించాలి."

"సరే, ప్రయత్నిస్తాం. నీవు ప్రభుత్వానికి సహకరించావు. నీకు బహుమతి లభిస్తుంది."

"వద్దు సర్! మీరు ఇంత త్వరగా చర్య తీసుకున్నారు. అదే చాలు. కృతజ్ఞతలు" అని వచ్చేశాను. నాకు అప్పటికి ఇంగ్లీషుమాట రాదు.

నేను గార్ల వచ్చాను. చూచాను. వాగిన్లున్నాయి. ఒక మంచి ఆలోచన వచ్చింది. పక్కనే జీవంజిగూడెం ఉంది. అక్కడ కొన్నాళ్లు రాత్రి పాఠశాల నడిపాను. జనాన్ని కూడగట్టుకు రమ్మని పంపించాను. జనం వందలు వేల సంఖ్యలో వచ్చింది.

పేదజనం విపరీతంగా కూడింది. "ఇది నల్ల బజారు ధాన్యం. ఎవరిదీ కాదు. మనది. సర్కారు నిలిపి ఉంచింది. ఇదంతా మీ కోసమే. తీసికెళ్లండి" అన్నాను. ఆవేశంగానే మాట్లాడాను.

పేదలు పాలోమని వ్యాగన్లమీద పడ్డారు. బద్దలు కొట్టారు. బస్తాల్లో – గంపల్లో – బిందెల్లో – మూటల్లో వందలు వేలమంది పచ్చ జొన్నలు తీసికెళ్తున్నారు. వాళ్ల అరుపులు – కేకలు – తొక్కిళ్లు – తొక్కిసలాటలు – కొట్టుకోవటాలు!

ఎంత గొప్ప దృశ్యమండీ అది! ఎంతటి వెలుగండీ వాళ్ల కళ్లల్లో! ఎంతటి ఆరాటమండీ! ఇంత మందికి గింజ అందించ కలిగాను. నా ఆనందం ఎంతండీ! ఎంతండీ! ఎల్లా చెప్పడం? నేను ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయినాను.

**అవునండీ! పుచ్చుకోవడంలో ఆనందం లేదు.**

**ఇచ్చుకోవడంలోనే ఆనందం!**

పోలీసులు వచ్చేవరకు గింజ అయిపోయింది!

వ్యాగన్లు కాళీ అయినాయి. నేలమీది గింజలు ఆడాళ్లు దోసిళ్లతో ఎత్తుకుంటున్నారు.

"నీవేనా ఇదంతా చేసింది?" అమీను అడిగాడు.

"మీ పని నేను చేశాను. నాకు కృతజ్ఞత చెప్పాలి."

"పద స్టేషనుకు?"

"ఎందుకు?"

"దామ్మీ కేసు"

"గింజ ఎవరిదో తేల్చండి. యజమాని తెలిస్తే గదా!"

అమీను స్టేషను మాస్టరు దగ్గరికి వెళ్లాడు. ఇద్దరు చాలసేపు మాట్లాడుకున్నారు. భాగాలు కుదిరినట్లున్నాయి! బయటికి వచ్చాడు. మళ్లీ నన్ను పలకరించలేదు. అమీను వెళ్లిపోయాడు.

కథ కంచికి!

గింజ ఇంటికి!!

## వెసులుబాటు:

ఈలోగా కుటుంబం విషయంలో మంచి పరిణామాలు కలిగాయి.

మాకు గార్లలోను – చినగూడూరులోనూ పొలాలున్నాయి. వ్యవసాయం లేదు. నాయన కవులుకు ఇస్తారు. ఇంతకాలం నాయన మాకు ఒక్క గింజ రానీయలేదు. గార్లలో పేష్కారు బలంతో నిలిపాడు. అప్పుడు ప్రభుత్వం వాళ్లది. యంత్రాంగం సొంతం వాళ్లపక్షం. అయినా ఎదిరించి జాగీరులో నిలువగలిగాం! హతమార్చడం వారి గూటివిద్య! మేమెంత? మా బలం ఎంత? ఇవ్వాళ **ఆశ్చర్యం అనిపిస్తుంది. ప్రజాబలంతో రాతిమనుషులను ఎదిరించి నిలువగలిగాం!**

అన్నింటినీ మించింది దైవకృప – భగవదనుగ్రహం.

ప్రభుత్వం మారింది. పేష్కారు శక్తిహీనుడు అయినాడు. పలుకుబడి కొంత మావైపు మొగ్గింది. గార్ల పొలం గింజలు బలవంతంగా తెచ్చుకొన్నాం. కవులుదారు మా పక్షంవాడే. కాబట్టే నామమాత్ర బలం అవసరం అయింది.

నాయన, పేష్కారు చూస్తూ మిన్నకున్నారు. ఏమీ చేయలేకపోయారు!

"కాలోఽయం దురతిక్రమః" అంటాడు వాల్మీకి. కాలాన్ని అతిక్రమించడం అసాధ్యం.

ఒడలు బండ్లు, బండ్లు ఒడలు అవుతాయని సామెత! నీరు సహితం ఒకచోట ఉండదు. మారుతుంటుంది. నీరు ఉన్నచోటికే ఒడలు చేర్తాయి.

చిన్నగూడూరులో నాయనకు రామరెడ్డి బలం. అతడే అన్నయ్యను పోలీసులకు పట్టిచ్చింది. రామరెడ్డి అతి తెలివి ప్రదర్శించాడు. కమ్యూనిస్టులతో మైత్రిగా ఉన్నాడు. పోలీసులకు సమాచారం అందించాడు. దళం వారికి అది తెలిసింది. దళంవారు – కమ్యూనిస్టులు పట్టపగలు రామరెడ్డిని పట్టుకుపోయారు. తాటి చెట్టుకు కట్టారు. తుపాకితో కాల్చి చంపారు.

ఇది దైవన్యాయం.

రామరెడ్డి చచ్చాడు.

పేష్కారు పెత్తనం ఊడింది.

చినగూడూరు గింజలు కూడా అనాయాసంగా తెచ్చుకున్నాం. నాయన మాకు ఎనలేని అన్యాయం చేశాడు. మేము చేయదలచలేదు. మరుసటి సంవత్సరం నుండి గూడూరు గింజలు నాయనకు వదిలేశాం.

అన్నయ్య జేలు నుంచి వచ్చింతరవాత చెప్పిన విషయం – అన్నయ్య జేలునుంచి నాయనకు ఉత్తరం వ్రాశారట. తాను జేల్లో ఉన్నాడు. తమ్ముడు చిన్నవాడు. కుటుంబాన్ని ఆదుకోవలసిందని వ్రాశారట. ఆ కష్టకాలంలో నాయన కనీసం ముఖం చూపించలేదు. అది అన్నయ్య మనసు విరిచింది!

మరొక విషయం ఏమంటే – నాకు వాంతిలో రక్తం పడడం తగ్గలేదు. బెజవాడలో సుంకవెల్లి సత్యనారాయణ డాక్టరు దగ్గరికి వెళ్లాను. డాక్టరు దగ్గరికి వెళ్లడం అదే తొలిసారి. పది రూపాయిలు తీసుకున్నారు. మందులు వ్రాసి ఇచ్చారు. వాడితే వాంతులు తగ్గేయి. ఉప్పు – అన్నం తింటున్నాను.

## గాంధీజీ - కస్తూరిబా:

గ్రామంలో తాసిల్దారు స్థలం ఆక్రమించుకున్నాం. గాంధీజీ – కస్తూరిబా విగ్రహాలు ప్రతిష్ఠించాం. పార్కు ఏర్పాటు చేశాం.

గాంధీజీ గతించిన తొలిరోజు. పోలీసు చర్య జరిగిన ఉత్సాహం. చాలచోట్ల మహాత్ముని విగ్రహాలు ప్రతిష్ఠించారు. కస్తూరిబా విగ్రహం నేను సూచించాను. ఆ విగ్రహం ముస్లిములు కొని ఇచ్చారు.

విగ్రహ ప్రతిష్ఠాపన అత్యంత ఉత్సాహంగా జరిగింది. కుల మత భేదాలు, ధనిక – పేద భేదాలు మరిచి వేల మంది పంక్తి భోజనం చేశారు. పేదలకు లేదనకుండా అన్నదానం చేశాం.

# ఇరవయి అయిదు

## "సొతంత్రం వచ్చిందంటున్రు:"

నిజాం రాజ్యం మీద పోలీసు చర్య జరిగింది. అందుకు రెండు ప్రధాన కారణాలు:

1. నిరంకుశ నిజాం ప్రభుత్వాన్ని రద్దు చేయడం. అలా చేసి భారత సార్వభౌమ అధికారాన్ని నిరూపించడం. రజాకార్లను అణచడం కాదు – నిర్మూలించడం.

2. పెరుగుతున్న కమ్యూనిస్టు ప్రాబల్యాన్ని అరికట్టడం. హైదరాబాదు రాష్ట్రంలో ఒక్క కమ్యూనిస్టునూ దక్కనీయను అని సర్దార్ పటేల్ ఫతేమైదాన్ బహిరంగ సభలో ప్రకటించారు.

పోలీసు చర్య తరువాత హైదరాబాదు రాజ్యం కాదు – రాష్ట్రంలో సైనిక పాలన ఏర్పడింది. ఇదీ తెలంగాణం ప్రత్యేకతయే. మరెక్కడా సైనిక పాలన ఏర్పడలేదు. మేజర్ జనరల్ J. N. చౌదరి 18–9–48 న మిలిటరీ గవర్నరుగా ప్రమాణం చేశారు. వారి సలహా సంఘంలో P. S. బాక్లే ICS సివిల్ అడ్మినిస్ట్రేటర్‌గాను, నవాబ్ జయిన్‌యార్‌జంగ్, రాజా ధోండేరాజ్, శ్రీ పి. ఏ. ఎస్. రావు, శ్రీ పి. హెచ్. కృష్ణారావు సభ్యులుగా ఉన్నారు.

పోలీసు చర్య ముగిసిన మరునాడే మొదటి లక్ష్యం నెరవేరింది. నిజాం దాసోహం అన్నాడు. రజ్వీని – ఇతర మంత్రులను అరెస్టు చేశారు. రజాకార్లు ఆయుధ సమర్పణ చేశారు. కొందరు తమ ఆయుధాలను కమ్యూనిస్టులకు అప్పగించారనీ, కొన్ని ఆయుధాలను కమ్యూనిస్టులు కరీదు చేశారనీ అనుకున్నారు.

పోలీసు చర్య నాటినుంచి కమ్యూనిస్టులకు – రజాకార్లకు ప్రధాన శత్రువు భారత ప్రభుత్వమే. అందువల్ల రజాకార్లు కమ్యూనిస్టులకు స్వచ్ఛందంగా ఆయుధాలు అందించినా ఆశ్చర్యపడాల్సిన పనిలేదు! రజాకార్లు – తాము సాధించలేని పని కమ్యూనిస్టులు సాధిస్తారని ఆశించి ఉండవచ్చు.

మిలిటరీ పాలన కొన్ని ప్రధాన సంస్కరణలను ప్రవేశపెట్టింది:

i) నిజాం సర్కారులో శుక్రవారం – ముస్లిముల నమాజు దినం – వారాంతపు శలవుగా ఉండేది. దానిని ఆదివారం – క్రైస్తవుల ప్రార్థనాదినాన్ని – వారాంతపు శలవుగా ప్రకటించారు. ఇందువల్ల భారతదేశపు వారాంతపు శలవు హైదరాబాదు రాష్ట్రంలో కూడా అమలు జరిగింది. ఆదివారం శలవు బానిసత్వ చిహ్నమే. ఇంతకాలం అయినా ఆ శలవు మార్చుకోలేకపోయాం!

ii) నిజాం కాలంలో దేశీయ భాషలను రూపుమాపడానికి ప్రయత్నం జరిగింది. విద్యాబోధన సాంతం ఉర్దూలో ఉండేది. మిలిటరీ ప్రభుత్వం ఉర్దూ మీడియం రద్దు చేశారు. తెలంగాణంలో తెలుగు మీడియం ప్రవేశపెట్టారు. అప్పటికీ ఇది హైస్కూలు వరకు – ఆ సంవత్సరంలో 8 వ తరగతి నుంచి అమలు జరిగింది. అమాంతంగా ప్రవేశపెట్టడం వల్ల ఆ బ్యాచ్ వారు ఇబ్బందులు పడ్డారు. తెలుగు చెప్పే ఉపాధ్యాయులు లేరు.

ఈలోగా హిందీఛాందసులకు ఉస్మానియా యూనివర్సిటీని హిందీ యూనివర్సిటీ చేయాలనే ఆలోచన వచ్చింది. హిందీ బ్యూరోక్రాట్స్ దాన్ని బలపరచారు. ఉస్మానియాను హిందీ విశ్వవిద్యాలయంగా మార్చడానికి వ్యతిరేకంగా దేవులపల్లి రామానుజరావుగారు పెద్ద ఉద్యమం నిర్వహించారు. అందువల్ల అది నిలిచిపోయింది.

**ఛాందసుల పిడివాదం వారికే ముప్పు తెస్తుంది. ఛాందసులు మూర్ఖులు, వారు తమ ముప్పును సహితం గుర్తించరు.**

iii) నిజాం సర్వతంత్ర స్వాతంత్ర్యానికి చిహ్నం కరోడ్గిరి. కరోడ్గిరి అంటే కస్టమ్స్. తనది స్వతంత్ర రాజ్యం కాబట్టి రాజ్యంలోకి వచ్చే సరుకులమీద సుంకం విధించేవాడు. మిలిటరీ ప్రభుత్వం కరోడ్గిరిని రద్దుచేసింది.

iv) నిజాంకు ప్రత్యేక తపాల శాఖ ఉండేది. దాన్ని భారత తపాలా శాఖలో లీనం చేశారు. ఇది ఒకేసారి జరుగలేదు. క్రమక్రమంగా జరిగింది.

v) నిజాం సర్వతంత్రతత్వానికి ప్రధాన నిదర్శనం అతని కరెన్సీ! హుసేన్ సాగర్ పక్కన ఉన్న 'మింట్' లో నాణేలు చేసేవారు. నిజాం కరెన్సీ ఏడురూపాయాలు భారత కరెన్సీ అరు రూపాయిాలతో సమానం. నిజాం 116–10–0 భారత నూరు రూపాయిాలకు సమానం.

మిలిటరీ ప్రభుత్వం నిజాం కరెన్సీని ఉపసంహరించడం ప్రారంభించింది. ఇది వర్తకులకు లాభం – ప్రజలకు నష్టంగా పరిణమించింది. వర్తకులు అరు రూపాయిాల సరుకు ఏడు రూపాయిాలకు అమ్మారు. వారికి అరు రూపాయిాలకు ఒక రూపాయి లాభం వచ్చింది. ప్రజలు ఆరు రూపాయిాలకు ఏడు చెల్లించారు. అరింట ఒకటి నష్టపోయారు.

**ప్రభుత్వం ప్రవేశపెట్టే సంస్కారణలు అన్నింటిలోనూ ఎక్కువగా ప్రజలే నష్టపోతుంటారు!**

ఎన్జీవోలు వేతనాలు ఇప్పుడున్నంత భారత కరెన్సీలో చెల్లించాలని డిమాండు చేశారు. అప్పటి ప్రభుత్వం 'మా వద్ద రూపాయిాల చెట్లు లేవు కాయలు కాయించటానికి' అని నిరాకరించింది. ఎన్జీవోల సంఘాలు కూడా అప్పటికి బలపడలేదు. ప్రభుత్వ ఉద్యోగుల వేతనాలు కూడా అరింట ఒకవంతు తగ్గించి నిర్ణయించారు. ఇది సైనిక శాసనంలో కాదు – ప్రజా శాసనంలోనే జరిగింది.

vi) సైనిక శాసనం చేసిన అతిముఖ్య – ప్రగతి చర్య జాగీర్లను రద్దు చేయడం. జాగీర్లను గురించి ఇంతకు ముందు వివరించాను. 1167 జాగీర్లను నష్టపరిహారం చెల్లించి రద్దు చేయడానికి నిర్ణయించారు. ఇది విప్లవాత్మక చర్య అగును. కాని నేను నష్టపరిహారం ఇవ్వడాన్ని వ్యతిరేకించాను. శతాబ్దాలుగా బాధలు పడింది జాగీర్లలోని ప్రజలు. జాగీర్దార్లు ప్రజల రక్తం పీల్చారు. విలాస జీవితం గడిపారు.

ఒక నవాబు, కుక్కల పెళ్లికి లక్షలు కర్చుపెట్టాడు. మహామహులందరిని పిలిచాడు. అట్టహాసంగా పెళ్లి చేశాడు.

మరొక నవాబు సంచులలో ఉన్న రూపాయిాలు ముక్కిపోతాయని – కొలిచి – ఎండపోయించాడు! పనివాళ్ళకు జాగీర్దారు మూర్ఖుడు అని తెలుసు. వారు చెప్పులకు మైనం పెట్టుకున్నారు. చెప్పులకు అంటిన రూపాయిాలు కాజేశారు. తిరిగి కొలిచారు. తక్కువ వచ్చాయి. జాగీర్దారు కారణం అడిగాడు. ఎండినవి కదా సర్కార్, తగ్గవా మరి అని విన్నవించుకున్నారు. నవాబుగారు నిజమే ననుకున్నారు, మిన్నకున్నారు!

ఇంకొక నవాబు కోటమీద శత్రువులు దాడి చేశారు. అంతా పారిపోయారు. నవాబు పట్టుపడ్డాడు. శత్రువు నవాబును ఎందుకు పారిపోలేదని అడిగాడు. దాసి చెప్పులు అందించలేదట! అందుకోసం మంచం దిగలేదు నవాబ్ సాహెబ్!! దాసీది ప్రాణ మానాలు దక్కించుకొనడానికి పారిపోయింది!!!

అంటే అందరూ అలాంటివారని కాదు. సాలార్ జంగ్ వంటివారు – ప్రజలను పీడించినా – మ్యూజియం ఏర్పరచి గొప్ప సేవ చేశారు.

అలాగే వనపర్తి – గద్వాల – జటప్రోలు – పాలవంచ సంస్థానాధీశులు తెలుగు భాషకు కొంత సేవ చేశారు. తిరుపతి వేంకట కవులు గద్వాల సంస్థానం

దర్శించారు. వారి చాటువు ఒకదానికి అర్థం ఇలా ఉన్నట్లు గుర్తు:

గద్వాలలో మంగలి కానీకి ఇద్దరికి గొరుగుతాడు. ఒకడు గొరిగించుకున్నాడు. కాణీ ఇచ్చాడు. మంగలి దగ్గర ఏగాణి – అంటే కాణీలో సగం – లేదు. ఆసామి అది వదలదలచలేదు. తన భార్య బుర్ర గొరిగించాడు!

మొత్తంమీద నవాబులు లుచ్చాలు – దుర్మార్గులు – దుష్టులు – నీచులు – దౌర్జన్యపరులు. అందువల్ల వారికి నష్టపరిహారం చెల్లించరాదని నా వాదన. వారికి చెల్లించే నష్టపరిహారంలో జాగీర్లలో ప్రజలకు ఉపకరించే కార్యక్రమాలు చేపట్టాలని వాదించాను.

'సారధి' అని కాంగ్రెస్ వారు – ఆ రోజుల్లో – ఒక వారపత్రిక నడిపించారు. దానికి తాళ్లూరి రామానుజస్వామి సంపాదకులు. దానిలో ఒక సుదీర్ఘవ్యాసం వ్రాశాను. అందులో జాగీర్ల పుట్టుపూర్వోత్తరాలు వివరించాను. వారికి నష్టపరిహారం ఎందుకు చెల్లించరాదో చెప్పాను. ప్రజలకు నష్టపరిహారం చెల్లించాల్సిన అవసరాన్ని చూపించాను. "జాగృతి"కి కూడా ఒక వ్యాసం వ్రాశాను.

అది కమ్యూనిస్టులను అణచడానికి ప్రభుత్వం అతిక్రూరంగా విజృంభించిన కాలం. అప్పుడు అలా వ్రాయడం సాహసం. అలా వ్రాసినందకు నాకు కమ్యూనిస్టు ముద్ర గుద్దారు. మా ఇల్లు సోదా చేశారు. దమ్ములేక నన్ను అరెస్టు చేయలేకపోయారు.

అప్పటి పరిస్థితులలో ఏ రాజకీయ పార్టీ నా వాదనను బలపరచలేకపోయింది.

జాగీర్దార్లకు నష్టపరిహారం చెల్లించారు.

అయినా జాగీర్ల రద్దు విప్లవాత్మక చర్య!

తెలంగాణంలో కమ్యూనిస్టులను అణచడానికి ప్రభుత్వం అమానుషమూ – అతిక్రూరమూ – పైశాచికమూ అయిన మార్గాలను అవలంబించింది. ఈ విషయంలో అది హిట్లరు భూతం వద్ద పాఠాలు నేర్చుకుంది.

నియమ నిబంధనలు, శాసనం – చట్టం ఉన్నది అనే విషయం పూర్తిగా మరిచిపోయింది. ఒక్క వ్యక్తి – సర్దార్ పటేల్ అభీష్టం మేరకు ప్రజలపై మధ్యయుగాలను మరిపించే దౌర్జన్యాలకు, నీచాతినీచ కృత్యాలకు దిగింది.

ఈ వివరాలు నా "జనపదం" నవలలో ప్రశ్నార్థాత్మకంగా – విశదంగా – వివరించాను. "జనపదం" 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో సీరియల్‌గా వస్తున్నప్పుడు, పోలీసులు నక్సలయిట్లను అణచడానికి – అలాంటి పద్ధతులనే అనుసరిస్తున్నారని – అనేక మంది లేఖలు వ్రాశారు.

ప్రభుత్వం – దౌర్జన్యాలు జరపడంలో – నిజామును, రజాకార్లను – బ్రిటిషు ప్రభుత్వాన్ని – నాజీ హిట్లరును తల తన్నింది.

i) ప్రభుత్వం – పోలీసుల సహితంగా – స్థానికులను ఎవరినీ విశ్వసించలేదు. సర్దార్ పటేల్ కెప్టెన్ నంజప్పను – సర్వాధికార సమన్వితుని చేసి – కమ్యూనిస్టులను రూపుమాపడానికి – హైదరాబాదుకు పంపించారు. నంజప్పకు ఎలాంటి అడ్డు – ఆటంకాలు లేవు. అతడు విశృంఖలంగా ప్రవర్తించాడు.

మద్రాసు – మలబారు – కర్ణాటక – మహారాష్ట్ర సాయుధ పోలీసులను తెలంగాణంలో దింపారు. ప్రతి ఊరిలో పోలీసు క్యాంపులు ఏర్పాటు చేశారు.

పరిపాలన సొంతం సాయుధ పోలీసుల అధీనంలో ఉండేది. వారిది ఎదురులేని అధికారం!

ii) ఆ కాలంలో అడవులు ఎక్కువగా ఉండేవి. నంజప్ప – రోడ్డుకు ఇరువైపుల వందగజాల వరకు – అడవులను నరికి వేయించాడు. ఇది కమ్యూనిస్టుల నుండి పోలీసులను రక్షించడానికి తీసుకున్న చర్య.

iii) నంజప్ప – కమ్యూనిస్టులను ఎదురుకాల్పులపేర హతమార్చడానికి – ఆదేశించిన మొట్టమొదటి ప్రబుద్ధుడు.

vi) పోలీసులు – కమ్యూనిస్టుల మధ్య ప్రజలు నలిగిచచ్చారు. పగలంతా పోలీసులు – ప్రజలను కమ్యూనిస్టుల ఆచూకీ తెలుపమని బాధించేవారు. మా ప్రాంతంలో బాధించేవారిని 'దొర' అంటాం. ప్రజలు పోలీసులకు "పగటి దొరలు" అని పేరు పెట్టారు. రాత్రిపూట కమ్యూనిస్టులు గ్రామాలలోకి వచ్చేవారు. పోలీసులకు సమాచారం అందించారని ప్రజలను బాధించేవారు. ప్రజలు కమ్యూనిస్టులకు "రేయి దొరలు" అని పేరు పెట్టారు.

పగటి దొరలు – రేయిదొరల మధ్య ప్రజలు చస్తున్నారని ఉభయులూ గుర్తించలేదు. పోలీసు చర్య తరువాత అన్ని పార్టీల ఉద్యమాల్లోను "ప్రజలు" ఆవిరి అయిపోయారు! పేరుకు మాత్రం ఉద్యమాలు మిగిలాయి!

v) కమ్యూనిస్టులు ఉద్యమకాలంలో దొరల భూములను పంచిపెట్టారు. దొరలు గ్రామాలు వదిలి పారిపోవడం కామ్రేడ్లకు ఉపకరించింది. దొరలు సాయుధ పోలీసుల వెంట తిరిగి వచ్చారు. భూములను లాక్కున్నారు. గడీలు బాగు చేసుకున్నారు. సాయుధ పోలీసు క్యాంపులను – సాయుధ గుండాలను గడీల్లో పెట్టుకున్నారు. వారు కాంగ్రెస్ తీర్థం పుచ్చుకున్నారు. కద్దరు ధరించారు. వారి తాబేదార్లతో ఊళ్లో కాంగ్రెస్ కార్యాలయాలు ఏర్పరచారు. ఈ కాంగ్రెస్ కార్యకర్తల పని, అందినవరకు కాజేయడం – సాయుధ పోలీసులకు సాయపడడం – మందు, మగువ సహితంగా అన్నీ సాయుధభటులకు సరఫరా చేయడం.

vi) సాయుధ పోలీసులు – కాంగ్రెస్ కార్యకర్తలు లారీలలో తెల్లవారు జామున బయల్దేర్తారు. ఎంచుకున్న అయిదారు ఊళ్లను చుట్టుముడ్తారు. గ్రామప్రజలను - స్త్రీపురుషబాలవృద్ధుల సహితంగా ఒకచోట చేరుస్తారు. వారిని నానా విధాలుగా హింసిస్తారు.

తుపాకి మడమలతో – కర్రలతో – చింత బరికెలతో విచక్షణారహితంగా కొడ్తారు.

మనుషులను – ఒకరు కాళ్లు, ఒకరు చేతులు పట్టుకొని – ఊయల ఊపి విసురుతారు.

ప్రజలను చెట్ల కొమ్మలకు తలక్రిందుగా వ్రేలాడతీసి బెత్తాలతో కొడ్తారు.

ప్రజలను బోర్ల పడుకోబెట్తారు. వారిమీది నుంచి బూట్లకాళ్లతో నడుస్తారు.

ఎర్రటి ఎండలో ఏటి ఇసుకలో పడుకోపెడ్తారు. పైనుంచి ఇష్టం వచ్చినట్లు బాదుతారు.

లారీ నడిపిస్తారు. ముందు జనాన్ని ఉరక మంటారు. ఉరకలేనివారు లారీకింద నలుగుతారు.

కమ్యూనిస్టులు అని అనుమానించినవారి పంట కుప్పలు తగలపెట్టారు. ఇళ్లు దగ్ధం చేస్తారు. ఒకచోట వేరు శనగ గిడ్డంగి తగలపెట్టి – కాలిన వేరుసెనగ కాయలు ఏరుకు తిన్నారు!

అవమానించినవాణ్ణి ముందు పరిగెత్తమని వెనుక కాల్చి చంపుతారు.

ప్రజలను విచక్షణారహితంగా అరెస్టు చేస్తారు. ఆ విధంగా 50,000 మందిని అరెస్టు చేసి కాంపుల్లో పెట్టారు. క్యాంపు అంటే ముళ్లతీగ మధ్య పెట్టడం. వాళ్లకు గిద్దెడు జొన్న గుగ్గిళ్లు – లోటా నీళ్లు ఇస్తారు. అన్నీ క్యాంపులోనే. ఎండకు వానకు తడిసి – కలరా వచ్చి అనేకులు చచ్చారు. వారి లెక్కలు లేవు.

గ్రామాలలో ఒకచోట చేర్చి హింసించిన ప్రజలను ముందు తోలుకుంటూ పోలీసులు – కమ్యూనిస్టుల కోసం – కొండలూ, కోనలూ గాలిస్తారు. వారిలోనే కొందరిని హతమారుస్తారు. కమ్యూనిస్టులను చంపామని చాటుకుంటారు. రజాకార్ల ఆయుధాలు తామే పెట్టి – పట్టుకుంటారు. కమ్యూనిస్టుల ఆయుధాలు పట్టుకున్నట్లు చాటుకుంటారు. పోలీసు అధికారులు ప్రమోషన్లు అర్జించుకుంటారు.

కొన్ని ఊళ్లలో ప్రజలను దిగంబరంగా ఊరేగించారు. వారిని ఇనుపరాడ్లతో కొట్టారు.

స్త్రీల మానభంగాలను గురించి చెప్పుకోవడానికి సభ్యసమాజం తలవంచుకుంటుంది. ఒక్క ద్రౌపది వస్త్రాపహరణానికి కౌరవ సభ సాంతం క్రుంగిపోయింది. కాని ఆనాడు జరిపిన సాముూహిక మానభంగాలకు ప్రజాప్రభుత్వం కనీసం సిగ్గు ప్రకటించలేదు.

ఒక నిరపరాధిని – స్త్రీని – అనేకులు మానభంగం చేశారు!

అనేక మంది – అనేక మంది స్త్రీలను, ఒకేచోట చెరిచారు!!

పసికూనలున్న బాలెంతలను సహితం మానభంగం చేశారు.

పసి – పన్నెండు, పదమూడేళ్ల బాలికలను రాక్షసంగా చెరిచారు. వాళ్ల బతుకులు బుగ్గిచేశారు!!!

వేయి మంది మహిళల మానభంగం జరిగినట్లూ – వంద మంది మరణించినట్లూ అంచనా.

గార్ల ప్రాంతం కమ్యూనిస్టులకు నెలవు. అందుకు ఆనాటి కారణం అక్కడి అరణ్యాలు. కాని ఈనాటికీ అది కమ్యూనిస్టులకు పెట్టని కోటయే ఇంతవరకు అక్కడి నుంచి కమ్యూనిస్టేతరుడు ఎమ్మెల్యేగా ఎన్నిక కాలేదు. కమ్యూనిస్టుపార్టీ ఎమ్.ఎల్.ఎ. గెలిచిన ఏకైక నియోజన వర్గం ఇల్లందు. గార్ల ఇల్లందులో అంతర్భాగం.

తొలినాళ్లలో గార్ల ప్రాంతంలో కమ్యూనిస్టు మర్రి విత్తనాలు నాటింది మేమే అని చెప్పుకోవడానికి గర్విస్తున్నాం! ఆ రోజుల్లో కాంగ్రెసువారు గార్ల స్టేషనులో దిగడానికి జంకారు!! రైలులో వచ్చి – రైలు కదిలింతరవాత కరపత్రాలు చల్లిపోయారు!!!

గార్లలో మలబారు సాయుధ పోలీసు క్యాంపు పెట్టారు. దేవినేని నారాయణ పెద్దభూస్వామి. జాతీయవాదిని అనేవాడు. కద్దరు తప్ప కట్టి ఎరుగడు! అతని స్థలంలో

పోలీసు క్యాంపు పెట్టించాడు. వారు జరిపిన దౌర్జన్యాలకు అంతులేదు. గ్రామాన్ని చిత్రగుప్తుడు లేని యమపురి చేశారు.

అడిగిన సామాను ఇవ్వనందుకు గులాబ్ చంద్ అనే మార్వాడీ వృద్ధుణ్ణి దెబ్బలు కొట్టారు.

మల్లారెడ్డిని కమ్యూనిస్టులు చంపారు. బదులుగా బుచ్చయ్యను చంపి – అతని కొంప తగలబెట్టారు.

గిరిజనులను బాధించిన తీరు వర్ణనాతీతం.

శ్రీనివాసరావు అనే పోలీసు అధికారి ఉండేవాడు. అతనికి – ఎందుకో – నేనంటే అభిమానం! అతను బేతాళునిలా ఉండేవాడు. నన్ను అవలీలగా ఎత్తుకునేవాడు. వాళ్లు కమ్యూనిస్టులమీద దాడికి అనేకసార్లు వెళ్లారు. ఒకసారి నన్ను తీసికెళ్లాడు!

అవి బయ్యారం గుట్టల ప్రాంతం. లారీలు – జీపులు – మందీ మార్బలంతో అక్కడికి చేరాం. భోజనాదుల ఏర్పాట్ల అట్టహాసం జరిగింది. కొందరు గిరిజనులను పట్టితెచ్చారు. కమ్యూనిస్టుల తావరం చూపవలసిందని వారిని నానాయాతనలు పెట్టారు. ఆ హింసలకు తాళజాలక ఒకడు అంగీకరించాడు!

అది తమ ఘన విజయంగా భావించారు పోలీసులు. ఆ రాత్రి పార్టీ చేసుకున్నారు. బాగా రాత్రి అయింది. పోలీసుల వలయం మధ్య అధికారుల గుడారాలున్నాయి. నేను శ్రీనివాసరావు గుడారంలో ఉన్నాను. అందరూ పడుకున్నారు – కాపలా వారు తప్ప!

అర్ధరాత్రి దాటింది. అడవి నిశ్శబ్దంగా ఉంది. పోలీసులు భయం భయంగా ఉన్నారు. గుండె చప్పుళ్లు వినిపిస్తున్నాయి. అలాంటిస్థితిలో తుపాకులు పేలిన శబ్దం. అధికారులు దడుచుకున్నారు. లేచారు. Fire అని ఆదేశించారు. త్రీనాట్ త్రీలు – స్టెన్నులు – బ్రెన్నులు వందల సంఖ్యలో పోలీసులు పేలుస్తున్నారు. పోలీసులు సమావేశం అయినారు. వారికీ బెదురే! ఏ చెట్టుచాటు నుంచి వస్తారో! ఏ పుట్టనుంచి వస్తారో! ఏ కొండమీది నుంచి వస్తారో! ఎంత మంది వస్తారో!

ఫైరింగు ఆపమన్నారు. ఆగింది. అంతా నిశ్శబ్దం. అందరి ప్రాణాలూ బిలబిల మంటున్నాయి. అంతా ఊపిరి బిగపట్టి ఉన్నారు.

మరొక దిశనుంచి కమ్యూనిస్టుల కాల్పులు!

మళ్లీ పోలీసుల తుపాకులు ప్రేలాయి. ఎన్ని? ఎందుకు? ఎటు? ఎంత సేపు? పోలీసుల తుపాకులు నిలిచాయి! అంతా నిశ్శబ్దం. అందరి ప్రాణాలూ బిలబిలమంటున్నాయి. అంతా ఊపిరి బిగపట్టి ఉన్నారు.

మరొక దిశనుంచి కమ్యూనిస్టుల కాల్పులు!

మళ్లీ పోలీసుల కాల్పులు! అలా ఆటలాడించారు కమ్యూనిస్టులు. వారి ఆటలతో తెల్లవారింది. పోలీసులు ఊపిరి పీల్చుకున్నారు. ఇహ పోలీసుల రాజ్యం!

కొండ చుట్టిన పోలీసులు కొందరు గిరిజనులు వెంట కదిలారు. గిరిజనులు అవలీలగా కొండలు ఎక్కుతున్నారు. పోలీసులు అధికారులు కష్టంగా కదులుతున్నారు.

అందరూ ఒక గుహకు చేరారు. చాల జాగ్రత్తగా తుపాకులు కాలుస్తూ గుహలో ప్రవేశించారు. "శ్రీనివాసరావూ! చస్తావు. వెనక్కు మళ్లు" అని గోడలమీద వ్రాసి

ఉంది. భోజనాలు చేసిన పచ్చి విస్తళ్లు – పదార్థాలు మిగిలిన కుండలూ ఉన్నాయి. వాళ్లు రాత్రి అక్కడే ఉన్నారు! పోలీసులు నిర్ధారించుకున్నారు. అప్పుడూ ఈ కొండ మీదే ఉన్నారు. అదీ తేల్చుకున్నారు. అయినా మనం ముందుకు పోలేం. అదీ నిర్ణయించుకున్నారు.

పోలీసులు వెనకడుగు వేశారు! కొండ దిగారు! కొండను తవ్వారు. ఎలుక కూడా దొరకలేదు. ఎలామరి? రిక్తహస్తాల్తో కదలరాదు. నంజప్ప దొరకు సమాధానం చెప్పాలి. అతనికి పీనుగులను అప్పగించాలి!

నిన్న పట్టుకున్న గిరిజనులను వదిలాం అన్నారు. వాళ్ళను పరిగెత్తమన్నారు. పరిగెత్తేవాళ్ళమీద కాల్పులు జరిపారు! ఇద్దరు అమాయక గిరిజనులు కూలారు!

వారినే కమ్యూనిస్టులు అన్నారు. వారు ఎదురు కాల్పుల్లో కూలారు అన్నారు. మానుకోటలో ప్రదర్శన ఏర్పాటు చేశారు!

నేను ఆ దురంతాలను ప్రత్యక్షంగా చూచాను. వారం రోజులు మనిషిని కాలేదు. మళ్ళీ శ్రీనివాసరావు వంక చూడలేదు!

ఇన్ని అకృత్యాలు - దుష్కృత్యాలు - నీచకృత్యాలు - అమానుషాలు - దుర్మార్గాలు - దుష్ప్రహత్యాలు - రాక్షసాలు - పిశాచకృత్యాలు జరుగుతున్నా స్వతంత్ర భారత ప్రజ - స్వతంత్ర భారతనేతలు కిమ్మనలేదు!

స్వాతంత్ర్యం ఇందుకోసమే వచ్చిందా అని తల్లడిల్లాడు ఒక గాంధీవాది. అతని మనసు తుకతుకలాడింది. మిన్నకుండలేకపోయాడు. సుందరరావుగారు ఖమ్మంలో - ఈ హింసాకాండకు వ్యతిరేకంగా - ఆమరణ నిరశన వ్రతం సాగించారు.

మనిషి ఒక్కడే – దుర్బలుడు – నిరాయుధుడు – దండెత్తనూ లేడు – అన్నం మానేశాడు. అంతే!

సుందరరావుగారి నిరశనం ఢిల్లీ దర్బారును కదిలించింది! ఢిల్లీ నుంచి మాటలు – ముచ్చట్లు – సంప్రదింపులు – రాయబారాలు సాగేయి.

సుందరరావుగారు నిరసన వ్రతం ముగించారు.

సుందరరావు గారి నిరశన వ్రతం సాధించిన విజయాలు:

1. ముళ్ల తీగల జేళ్లు – కాన్సంట్రేషన్ క్యాంపులు – ఎత్తివేశారు.
2. జేళ్లలో ఉన్న వేలాది మందిని – వారి కేసులను విచారించడానికి కమిటీలు ఏర్పడ్డాయి. వాటిలో కాంగ్రెస్‌వారు జొరపడ్డారు. అది వేరే కథ! ఎన్ని కథలని వ్రాయడం?!
3. పోలీసుల అత్యాచారాల మీద విచారణ జరపడానికి కమిటీలు ఏర్పడినాయి. ఆ కమిటీలలో పోలీసులకు సారథ్యం వహించిన నిన్నటి దొరలు – నేటి ఖద్దరు ధారులను నియమించారు! అది వేరే కథ!! ఎన్ని కథలని వ్రాయడం?!

ఇంతటి రాక్షసత్వంలో సహితం మానవత మెరుపులు కనిపిస్తాయి!

మలయాళ సాయుధ పోలీసు గార్డులోని ఒక పేదింటి పిల్లను ప్రేమించాడు. అమ్మాయి ఆంధ్రదేశం వదిలి మలయాళ దేశం వెళ్లడానికి సిద్ధం అయింది. వారు పూలదండలు మార్చుకున్నారు. పెళ్లి చేసుకున్నారు!

దాడిలో ఒక జవాను కాలు విరిగింది. పోలీసులు అతన్ని వదిలి వెళ్లిపోయారు. గిరిజనులు అతన్ని కాపాడారు. చికిత్స చేశారు. బాగు చేశారు. జవాను గిరిజనులను విడిచి పోలేదు. వారితోనే ఉండిపోయాడు!

పోలీసులు దాడిలో ఒక ఊరిని ధ్వంసం చేశారు. వారు ఊరు విడిచి సాగుతున్నారు. కూలిన ఇంట్లోంచి పసిపాప కేక వినిపించింది. పోలీసులు నిలిచి పోయారు. పాపను తెచ్చారు. పాప తల్లి దాడిలో అశువులు బాసింది. ఒక పోలీసు ఆ పాపను తెచ్చుకున్నాడు! పోలీసు క్యాంపులో పాప!

కమ్యూనిస్టులు కూడా తప్పులు చేశారు! పోలీసు చర్య తరువాత పోరాటం మానుకొని ఉంటే ఇంత ధ్వంస రచన జరిగేది కాదేమో!

కమ్యూనిస్టులు తప్పులు చేశారు. అది వారికే తెలుసు. కాని వారి తప్పు ఇంత ధన – మాన – ప్రాణ నష్టానికి దారి తీసింది తెలంగాణంలో మాత్రమే! ఇదీ తెలంగాణ ప్రత్యేకతే!

1. వారు అంతర్జాతీయంగా వ్యవహరించారు. అది విహంగ విహారం!
2. వారికి జాతీయ పరిస్థితులు కనిపించలేదు. వారు గుర్తించలేదు. ఇది నేల విడిచిన సాము.
3. భారతదేశానికి స్వతంత్రం రావాలన్నారు. పాకిస్తాన్ ఏర్పడాలన్నారు. తీరా స్వాతంత్ర్యం వచ్చింతరువాత అది 'స్వాతంత్ర్యంకాదు' అన్నారు!
4. పోలీసు చర్య వరకు వారు నిజాముకు వ్యతిరేకంగా పోరారు. అన్ని పార్టీలూ పోరు సలిపాయి. అది తెలంగాణ ప్రజల జాతీయ పోరాటం. పోలీసు చర్య తరువాత మిగత పార్టీలు పోరాటాలు మానుకున్నాయి. కమ్యూనిస్టులు ఎవరికి వ్యతిరేకంగా పోరాటం సాగించినట్లు?
5. వచ్చింది స్వతంత్రం కాదన్న భారత కమ్యూనిస్టుపార్టీ పిడివాదాన్ని – తెలంగాణం పరిస్థితులు అర్థం చేసుకోకుండా – తెలంగాణ ప్రజలమీద రుద్దారు!
6. అంతటి భారత ప్రభుత్వాన్ని – తెలంగాణంలోని రెండు జిల్లాల పోరాటంతో – కూల దోయగలం అనుకోవడం భ్రమమాత్రం అగును. హేతువాదం ? మాత్రం కాదు!
7. పోరాటకాలంలో పేదలకు పంచిన భూములను రక్షించడానికి పోరాటం కొన సాగించాం అనే ఒక సాకు ఉంది. సోషలిస్టు ప్రభుత్వాలు తప్ప – అన్ని ప్రభుత్వాలూ స్వంత ఆస్తి సంరక్షణకే ఉంటాయి. వారు ముద్రవేసిన 'బూర్జువా భారత ప్రభుత్వం' పంచిన భూములను రక్షిస్తుంది అనుకోవడంలో వివేకం ఎంత?
8. పోరాటం జరుగుతున్నది తెలంగాణంలో. తెలంగాణంలో పార్టీ నిర్మాత రావి నారాయణరెడ్డి. పోలీసు చర్య తరువాత పోరాటం కొనసాగించడాన్ని వారు వ్యతిరేకించారు. "ప్రతినిధుల అభిప్రాయాలను తెలుసుకొని, చర్చించి నిర్ణయాలు తీసుకుంటే ఉచితంగా ఉండేది. అలాంటిదేమీ జరుగలేదు. ఎవరో ఇద్దరు ముగ్గురు నాయకులు ఈ నిర్ణయాన్ని తీసుకొని అసంఖ్యాకులైన ప్రజల నెత్తిన రుద్దారు" అన్నారు రావివారు.

9. పార్టీలోని ఆంధ్రనాయకత్వం తెలంగాణ నాయకత్వం మీద పెత్తనం చలాయించిన రీతి గోచరం అవుతుంది. "విశాలాంధ్ర" నినాదం ఇచ్చిన కమ్యూనిస్టు పార్టీలోనే తొలుత ప్రాంతీయ భేదాలు – ప్రాంతీయ పెత్తనం కొనసాగడం కన్న వివేక భ్రష్టసంపాతం ఉండదు.

పార్టీ అంతర్జాతీయం నుండి – జాతీయం నుంచి ప్రాంతీయ సంకుచితత్వంలో కూరుకుపోయింది. అసలు అప్పుడే పార్టీలో అంతర్గతంగా రెండు చీలికలు వచ్చాయి. వేరు కుంపట్లు పెట్టుకోవడానికి సుమారు దశాబ్దిన్నర పట్టింది.

10. ఒక అప్రియం అయిన వాస్తవం ఉంది. ఈనాటి అన్ని పార్టీలకు వలెనే – కమ్యూనిస్టుపార్టీకి ప్రజలు దూరం అయినారు. పార్టీ కార్యాలయాల నిర్మాణాలు జరిగాయి. పార్టీ నిర్మాణం కుంటుపడింది.

భారత కమ్యూనిస్టుపార్టీ తన బలాన్ని కనీసం నిలుపుకొని ఉంటే భారత రాజకీయాలు మరో రకంగా – ప్రగతి పథగామిగా ఉండేవి!

ఇక కాంగ్రెసువారి కథాక్రమం బెట్టిదనిన:–

కాంగ్రెసు చరిత్రయే గ్రూపులు – తగాదాలు – కయ్యములతో కూడింది. సాయుధ పోరాటం జరిపిన కాంగ్రెసువారిని రంగారెడ్డి వర్గంవారు మార్క్సిస్టు కాంగ్రెసు వారివిగా ముద్ర వేశారు. ఈ ప్రగతి కాంగ్రెసుకు రామానంద తీర్థగారు అధ్యక్షులు. వీరికి పార్టీలో బలం ఉంది. రంగారెడ్డి వర్గం వారు అది సహించలేకపోయారు. వారు జనార్దనరావు దేశాయి అధ్యక్షులుగా 'స్వంత కాంగ్రెస్' ఏర్పరచుకున్నారు.

ఇక్కడ గమనించవలసిన విషయం – పోటీ ఆంధ్ర మహాసభ ఏర్పరచినవారే – పోటీ కాంగ్రెసు ఏర్పరచారు.

ప్రజలు ఈ రెండు పార్టీలకు "గోసాయి కాంగ్రెస్" "దేశాయి కాంగ్రెస్" అని పేర్లు పెట్టారు. రామానందతీర్థ అధ్యక్షులుగా గలది గోసాయి కాంగ్రెస్. తీర్థగారు సన్యాసి. అందువల్ల గోసాయి అని పేరు పెట్టారు. జనార్దనరావుదేశాయి అధ్యక్షులుగా గలది "దేశాయి కాంగ్రెస్" అయింది.

గోసాయి కాంగ్రెస్‌వారు సభ్యులను చేర్పించారు. సభ్యత్వం ఆధారంగా ప్రతినిధుల ఎన్నికలు జరిపారు. విచిత్రం ఏమంటే – ప్రతినిధులుగా దేశాయి కాంగ్రెస్‌వారు కూడా పోటీ చేశారు.

గార్లలో మా అన్నయ్య దాశరథి గోసాయి కాంగ్రెస్ పక్షాన – పుల్లఖండం జానకి రామయ్య దేశాయి కాంగ్రెస్ పక్షాన పోటీ చేశారు. అప్పటికే నేను కుళ్లు రాజకీయాలకు దూరం జరిగాను. అయినా దాశరథి అభ్యర్థిత్వాన్ని బలపర్చాను. అందుకు కారణాలున్నాయి:

1. దాశరథి నాకు అన్నయ్యమాత్రమే కాదు – నిజాం నవాబును "ముసలినక్క" అనగలిగిన ధీశాలి – మహాకవి.
2. దేశాయి కాంగ్రెసుకన్న – గోసాయి కాంగ్రెస్ ప్రగతి శీలం అయింది.
3. అవినీతికి – గూండాయిజానికి నాయకత్వం వహించే జానకి రామయ్య గెలువరాదు.

తాళ్లూరి రామానుజస్వామి రిటర్నింగ్ ఆఫీసరుగా వచ్చారు. బాజాప్తా పోలింగు బూతు పెట్టారు. ఎన్నికలు జరిగాయి.

తెలంగాణ ప్రజలు ఓటు వేయడం అదే మొదలు! ఆ సాయంకాలం అందరి ముందు ఓట్లు లెక్కించారు. జానకిరామయ్య లెక్కింపుకు రాలేదు. అతనికి ఒక్క ఓటు వచ్చింది. మా అన్నయ్య దాశరధి కృష్ణమాచార్య కాంగ్రెస్ ప్రతినిధిగా గెలిచారు.

దీనిని నేను కాంగ్రెస్ విజయంగా భావించలేదు. ఇది మేము నిర్వహించిన ఉద్యమాలకు ప్రజల ప్రతిస్పందన మాత్రమే!

కాంగ్రెస్ విషయంలో గమనించదగినది ఒకటి ఉంది. **హైదరాబాదు రాష్ట్రంలో తెలుగువారివి ఎనిమిది జిల్లాలు. అధిక సంఖ్యాకులు తెలుగువారు. అయినా ఉభయ కాంగ్రెసులకు అధ్యక్షులు మహారాష్ట్రులే! ఇది ఆంధ్రుల అనైక్యతకు తార్కాణం.**

కేంద్రప్రభుత్వంలో జవహర్‌లాల్ నెహ్రూగారికి, సర్దార్ వల్లభాయ్ పటేల్ గారికి ఉండిన తీవ్ర అభిప్రాయ భేదాలు జగమెరిగిన రహస్యం. గాంధీజీ హత్య జరగడానికి కొద్దిసేపటి ముందు పటేల్ మహాత్మునితో ఆ విషయాలే ప్రస్తావించారు. నెహ్రూ ఆదర్శవాది. పటేల్ కార్యవాది.

నెహ్రూజీ హైదరాబాదు వచ్చారు. అప్పుడు ఉభయ కాంగ్రెసువారూ ప్రధానిని కలిశారు. వారు దేశాయి కాంగ్రెసువారిమీద చిరుబురులాడారు. బయటపడ్డారు.

సర్దార్‌జీ హైదరాబాదు వచ్చారు. యధారీతిగా ఉభయ కాంగ్రెసులు వారిని కలుసుకున్నాయి. వారు ఇద్దరినీ సమాధానపరిచారు. పోటీ కాంగ్రెస్ రద్దు అయింది. రామానంద తీర్థ అధ్యక్షతన ఒకే కాంగ్రెస్ ఏర్పడింది. అది అఖిల భారత కాంగ్రెసులో అంతర్భాగం అయిపోయింది.

## భూదానం:

తెలంగాణంలో ఉన్న అల్లకల్లోలాల దృష్ట్యా 9.4.1951 నుంచి అయిదు రోజులు – హైదరాబాదులో – సర్వోదయ సమ్మేళనం జరిగింది. అప్పుడు వినోబాజీ తెలంగాణంలో రెండు నెలలు పర్యటించాలని నిర్ణయించారు. 16.4.1951 న వారి యాత్ర ప్రారంభం అయింది. వారు పాదయాత్ర సాగించారు. తొలిరోజు హయాత్‌నగర్‌లో విడిశారు. మలిరోజు బాటసింగారంలో నిలిచారు.

మూడోరోజు పోచంపల్లి వెళ్లాలి. ఆ మార్గం గుట్టలమయం. కమ్యూనిస్టులకు తావరం. ఆ బాటన సాగడానికి అందరూ జంకారు. వినోబాజీ ఏ మాత్రం భయపడలేదు. వారికి ఆత్మవిశ్వాసం ఉంది. వారు గుట్టల్లోంచి నడిచిసాగారు. పోచంపల్లి చేరారు. వినోబాజీ – ఆయుధం కన్న ఆత్మవిశ్వాసం మిన్న అని నిరూపించారు.

వినోబాజీ వద్ద ఒక ఆకర్షణ ఉంది. అది ఏమిటి అంటే చెప్పడం కష్టం. వారిలో విశ్వాసం ఉంది. మనోబలం ఉంది. దైవచింతన ఉంది. వారు ఎవరికీ ఏమీ ఇస్తానని చెప్పలేదు. శాంతంగా జీవించండి అని మాత్రం ఉపదేశించారు. ఆ సందేశం వినడానికే తండోపతండాలుగా జనం కూడారు.

పోచంపల్లిలో సభ జరిగింది. జనం బాగానే వచ్చారు. వినోబాజీ శాంతి సందేశం వినిపించారు. అది విన్నాడు ఒక హరిజనుడు. లేచాడు. "ఆకలి దప్పులతో అలమటించేవారికి శాంతి సందేశం వల్ల ప్రయోజనం ఏమి?" అని అడిగాడు.

"పొలాలకు వెళ్లండి. పని చేయండి" అన్నారు వినోబా.

"మాకు పొలాలు లేవు. పని ఎక్కడ చేయాలి?" ప్రశ్న.

అప్పుడు వినోబాజీకి మెరపువంటి ఆలోచన వచ్చింది. వారు భూమి సమస్యను గ్రహించారు. సమస్య భూమి అని అర్థం అయింది. పరిష్కారం ఏమి? బలవంతం – హింస వీటిమీద వినోబాజీకి నమ్మకం లేదు. తటాలున వారికి "భూదానం" గుర్తుకు వచ్చింది.

ఇచ్చేవాడు స్వచ్ఛందంగా ఇవ్వాలి. గ్రహించేవాడు సంతోషంగా గ్రహించాలి. ఆయుధం – హింసకాక – మానవత పని చేయాలి. అలా అనుకొని భూదానం చేయవలసిందని వినోబాజీ పోచంపల్లి సమావేశంలో కోరారు.

పోచంపల్లిలో వినోబాజీ ఉపదేశం విన్నారు వెదిరె రామచంద్రారెడ్డిగారు వంద ఎకరాల భూమి దానం చేశారు. అలా మొదలయింది భూదానోద్యమం. అప్పటినుంచి ఆ ఊరికి 'భూదాన్ పోచంపల్లి' అని పేరు వచ్చింది.

వినోబాజీ దృఢసంకల్పంతో పాదయాత్ర సాగించారు. నల్లగొండ జిల్లాలో నాలుగువేల ఎకరాల భూదానం ఆర్జించారు. వారు నిస్వార్థంగా – మనో బలంతో – కాలి నడకన – తెలంగాణమంతటా పర్యటించారు.

వినోబాజీని నేను గార్లలో దర్శించుకున్నాను. వారిని చూచినప్పుడు మహాత్ముని చూచినట్లు – బుద్ధుని చూచినట్లూ అనిపించింది. స్వచ్ఛమయిన వారి వదనం – నిష్కళంకం అయిన దరహాసంలో అనంతం అయిన ఆకర్షణ ఉంది. వారికి 'భూదాన' ఆలోచన పరిశోధన వల్ల కలిగింది కాదు. ప్రజలవల్ల – ప్రజలనుంచి ఉద్భవించిన ఆలోచన! బుద్ధునికి సుజాత అనే గొల్లపిల్ల వల్ల జ్ఞానోదయం అయింది. వినోబాజీకి ఒక హరిజనుని వల్ల జ్ఞానోదయం అయింది!

వినోబాజీ సంక్రాంతినాడు గార్ల వచ్చారు. వారు సూర్యుణ్ణి కాలపు గడియారానికి పెండ్యులంగా పోల్చారు. ఆ ఉపమానం నాకు అద్భుతం అనిపించింది. వారి ఉపన్యాసం నిర్మలంగా ఉంది. వారికి మనసు మీద – మనిషిమీద ఉన్న విశ్వాసానికి అబ్బురపడ్డాను

"వేతనంలో కొంత భాగం దానం చేయండి" అని అర్థించారు వినోబాజీ.

"కాగితం వ్రాసి ఇవ్వాలా?" అడిగాన్నేను.

"నాకు వ్రాతమీద నమ్మకం లేదు. మనిషిమీద నమ్మకం ఉంది. మనసుమీద నమ్మకం ఉంది. మనస్సాక్షిగా దానం చేయండి" అన్నారు వినోబాజీ.

అంతే! ఆ మాట నాకు వినోబాజీ మీద ఉన్న దురభిప్రాయాలను పటాపంచలు చేసింది. వినోబాజీ మీద భక్తిభావం ఏర్పడింది!

అంతకుముందు నేనూ వినోబాజీది నాటకం అనుకున్నాను. కమ్యూనిస్టులకు విరుగుడుగా సర్కారు పంపిన సన్యాసి అనుకున్నాను. కాని వినోబాజీని దర్శించింతరువాత వారు "కర్మయోగి" అని గ్రహించాను. భూమి పంచడంలో

**కమ్యూనిస్టులకు అధికార వాంఛ ఉంది. వినోబాజీ వాంఛారహితుడు! అతడు యోగి!**

అయితే వినోబాజీ ప్రారంభించిన భూదానం విజయవంతం అయిందా అంటే కాలేదు. అందుకు వినోబాజీ బాధ్యులు కారు. అది స్వప్రయోజనపరుల చేతుల్లో పడింది. ధ్వంసం అయిపోయింది!

లెనిన్ మహాశయుడు రష్యాలో తెచ్చిన మహా విప్లవం ఏమయింది? స్వప్రయోజనపరుల చేతుల్లో పడింది. ధ్వంసం అయింది.

ప్రపంచాన్ని అచ్చెరువులో ముంచిన మహాత్ముని అహింసా సిద్ధాంతం ఏమయింది? స్వప్రయోజనపరుల చేతుల్లో పడింది. ధ్వంసం అయింది.

**ఈ స్వప్రయోజనపరులవి లెక్కలేనన్ని అవతారాలు. వారు బుద్ధుని నుంచి గాంధీ వరకు అందరినీ మింగారు. వారికి తమ రంగు పులిమారు. వారే వీరని జనాన్ని భ్రమింపచేశారు. తమ పబ్బం గడుపుకున్నారు. వీరిని గుర్తించడం తేలికే. ఎదిరించడం కష్టం!**

వెదిరె రామచంద్రారెడ్డిగారు తొలిభూదానంలోనే ఇసుమంత కాపట్యం ఉందంటారు. వారి తండ్రిగారు పరమపదించేప్పుడు భూదానం చేయవలసిందని ఆదేశించారట. అది వినోబాజీకి ఇచ్చిన భూదానంతో కలిసి వచ్చిందట!

మరొక మెరుపు. రావి నారాయణరెడ్డిగారు కమ్యూనిస్టు. వారి ఊరు బొల్లేపల్లి. పోచంపల్లికి దగ్గర. రామచంద్రారెడ్డిగారు రావివారి బంధువు.

రావి నారాయణరెడ్డిగారు – భూదానోద్యమం పుట్టకముందు – 1942 ప్రాంతంలో– ఎర్రబల్లి – ధనరెడ్డిపల్లి గ్రామాలలోని 500 ఎకరాల భూమి హరిజనులకు పంచిపెట్టారు!

**ఎంతటి ఉద్యమం అయినా వ్యక్తుల శ్రద్ధాసక్తుల మీద ఆధారపడి ఉంటుంది.**

**మానవులలో మానవత - నైతికబలం పెంపొందుతేనే ఏ ఉద్యమం అయినా - ఏ సంస్కరణ అయినా ఫలిస్తుంది.**

**ఉద్యమాలూ సంస్కరణలూ బలప్రయోగంవల్ల సాధ్యపడవు. ఇది చరిత్ర చెప్పిన అతి వాస్తవ సత్యం.**

## ఇరవయి ఆరు

### నీడవంటితోడు:

కమల వచ్చింది. ఆమెను అన్నయ్య తీసుకొని వచ్చారు. కమల 1949 జనవరిలో వచ్చింది. అంతకుముందు ఒకసారి అత్తగారు కమలను తీసుకొని వచ్చారు. స్వాతంత్ర్యం రావాలి; కమల రావాలి అని ఆనాటి ఆవేశంలో వర్ణించాను.

ఇప్పుడు స్వాతంత్ర్యం వచ్చింది. అది మనకోసం కాదని తేలింది. ఆవేశం అడుగంటింది. కమల మా ఇంట్లోనే కాదు – నా జీవితంలో ప్రవేశించింది. 'ప్రాణం పోతేనేం' అని పోరాడామే! ప్రాణం పోయిఉంటే పాపం కమల! ఈ

ఆలోచనయే రాలేదు అనాడు! ఆవేశం ఆలోచనను చంపుతుంది. కమల అదృష్టమో – నా ఆయుష్యమో – భగవదనుగ్రహమో నేను జీవించి ఉన్నాను. కమల వచ్చింది!

1940లో మా పెళ్లి అయింది. అప్పుడు నాకు పన్నెండు – కమలకు ఏడేళ్లు! ఈ తొమ్మిది ఏళ్లలో మేమిద్దరం మాట్లాడుకున్నది సుమారు లేదు. తొమ్మిదేళ్ల తరువాత ఇవ్వాళ వచ్చిన కమల నా జీవితంలో ప్రవేశించింది. కాదు – నా జీవితాన్ని ఆక్రమించుకుంది!

స్త్రీ తన మెత్తని అడుగులతో – చప్పుడు కాకుండా – పురుషుని జీవితంలో ప్రవేశిస్తుంది. అప్పుడు జీవితం చిగురిస్తుంది. అంతకు ముందటి జీవితం మోడు మాత్రం అనిపిస్తుంది. అది బతుకా – జీవితమా అర్థం కాదు.

స్త్రీమాత్రమే జీవితాన్ని సార్థకం చేయగలదు.

కమల ఎంతటి పిల్ల! అలా పరిమళంలా వచ్చింది. జీవితాన్ని సురభిళం చేసింది. ఆమె అతి చాకచక్యంగా కలిసిపోయింది.

కమల నా బట్టలు – ఉన్నవే – సర్దిపెట్టింది. పుస్తకాలు ఒకచోట చేర్చింది. సిగరెట్టు పీకలు లేకుండా శుభ్రం చేసింది. స్నానానికి నీళ్లు తోడింది. వీపు రుద్దింది. తువ్వాలుతో తల తుడిచింది. వళ్లు తుడుచుకోవడానికి తువ్వాలు అందించింది. వేళకు భోజనం – ఉన్నదే – వడ్డించింది. ఎదురుగా కూర్చుంది. విసనకర్రతో విసిరింది. కొసరి కొసరి తినిపించింది. నా రాక కోసం కనులు పరుచుకుని ఎదిరి చూచింది.

మాకు 'శోభనం' ఎవరూ ఏర్పాటు చేయలేదు. ఉన్నంతలో నులక మంచం పరుపు–చిరిగిన దుప్పటి పరచింది కమల. పూలు లేవు. పూల మంచాలు లేవు. ఊదు బత్తీలు లేవు. పాలు లేవు. పండ్లు లేవు. మిఠాయిలు లేవు. అయినా తొలిరేయికి ఇవన్నీ అనవసరం అనిపించింది. మేము మనసులు విప్పుకున్నాం. ముచ్చట్లతో మనసులు నింపుకున్నాం. మా మనసులు రెండు కాదు – ఒకటి అనుకున్నాం. కష్టసుఖాలు కలిసి పంచుకుందాం అనుకున్నాం. ఆ మాట నిలుపుకున్నాం. అర్ధశతాబ్ది పైపై దాంపత్యంలో కలిసి ఏడ్చాం. కలిసి నవ్వాం. సుఖాలు తక్కువ. కలిసి కష్టాలు అనుభవించాం.

కమలా నేను కలిసి ఏటికి వెళ్లాం, స్నానాలు చేశాం. బిందెలతో మంచినీళ్లు తెచ్చాం. నేను కట్టెలు కొట్టాను. కమల వడ్లు దంచింది. పిండి విసిరింది. ఇల్లు అలికింది. ముగ్గులు పెట్టింది. వంట చేసింది. మా ముగ్గురు చెల్లెళ్లను సవరించింది. అమ్మను ఆదరించింది. ఇంటికి ఒక కొత్త శోభ తెచ్చింది.

ఆనందానికి 'అర్థం' అంతగా అవసరం లేదని అర్థం అయింది.

కమలా – నేనూ వెన్నెట్లో రైలు కట్ట పక్కనుంచి నడిచి డోర్నకల్లు వెళ్లాం. లైలా–మజ్నూ, 'దేవదాసు', 'మల్లీశ్వరి' లాంటి సినీమాలు చూచాం. కాలినడకన తిరిగి వచ్చాం.

సంబరం వయసులో ఉంది – డబ్బులో లేదు!

కమల నా జీవితంలో వెన్నెలలా ప్రవేశించింది. అది నిజమే. కాని బాధ్యతలు పెంచింది. బాధ్యతలు ఎరుకపరచింది. జీవితానికి నిలకడ కావాలి. జీవిక కావాలి. అందుకు సంపాదన కావాలి!

'సంపాదన' అంటే ఏమో తెలియకుండా ఇంతకాలం గడిపాం. దేశాన్ని ఉద్ధరిస్తానని ఆరో క్లాసులో చదువు చెడగొట్టుకున్నాను. తోడివాళ్లు ఉద్యోగాలు చేసుకుంటున్నారు. నేను ఆలస్యంగా లోకంలో ప్రవేశించాను.

రాజకీయాల అరాచకం చేతకాదని తేల్చుకున్నాను. కొత్త ఖాదీవారు నన్ను దరికి చేరనివ్వరు అని అర్థం అయింది. పలుకుబడి త్యాగాన్ని త్యజించింది. అది అధికారం వెంటపడింది. కాలం వేషం మార్చింది. నీతి నిజాయితీల బట్ట మార్చింది. అవినీతి, అన్యాయపు వేషం వేసింది.

నేను వేషం మార్చడం చేతకానివాణ్ణి. బతుకునకు ఆర్జన అవసరం, ఉద్యోగం తప్ప ఆ రోజుల్లో అన్యం నాస్తి. ఉద్యోగానికి సర్టిఫికేటు కావాలి. **'దేశభక్తి' ఎందుకూ కొరగానిదని తేలిపోయింది!**

ఆరో తరగతిలో చదివిన చదువు మరిచాను. ఇంతకాలం పనికిరాని చదువు వెంట పడ్డాను! ఇప్పుడు నన్ను ఆరో తరగతిలో చేర్చుకొమ్మన్నా పైరవీ చేయాలి! ఖద్దరు వాళ్లను అర్థించాలి!!

పైరవీ చేయడం - అర్థించడం జీవితంలో చేతకాలేదు! మెట్రిక్ పరీక్ష ఇద్దామనుకున్నాను. ఆనాడు చదువుకు ఈనాటి అవకాశాలు లేవు. అలీఘర్ - ఆంధ్ర విశ్వవిద్యాలయాలు మాత్రమే ప్రైవేటుగా మెట్రిక్ విద్యార్థులను అనుమతిస్తున్నాయి. అలీఘర్ వెళ్లలేను. 'ఆంధ్ర' కు వెళ్లడానికి నిశ్చయించుకున్నాను.

ఈ ఊళ్లో నేనే విద్యావంతుణ్ణి, నాకు ఎవడు చదువు చెపుతాడు? బెజవాడలో ట్యుటోరియల్స్ ఉన్నాయి. డబ్బులేదు. కరస్పాండెన్స్ కాలేజీ ప్రైవేటుది ఉండేది. కొంత డబ్బు కట్టాను. పాఠాలు వచ్చాయి. తరవాత కట్టలేకపోయాను. నిలిచి పోయాయి.

నా వద్ద ఉన్నది కృషి మాత్రమే! పుస్తకాలు తెచ్చుకున్నాను. రాత్రింబవళ్లు చదివాను. రాత్రిళ్లు లాంతరుకు కిర్సనాయిలు కరువయింది. సంపాదన లేని కుటుంబంలో నా స్థాయి తగ్గింది. కమలకు కష్టాలు మొదలయినాయి. ఇద్దరం సహించాం.

ఈలోగా అన్నయ్యకు, చెల్లెళ్లకు పెళ్లిళ్లు! మేనవాళ్లు సహితం మాకేమీ లేదని అన్నయ్యకు పిల్లలను ఇవ్వలేదు. ఒక విధవ సంబంధం చూచాం. వారూ ఇవ్వమన్నారు. రాయచూర్ నుంచి - మా ఇప్పటి బావగారు - ముదుంబ శ్రీనివాసాచార్యులవారు వచ్చారు. వారి చెల్లెలు - ఇప్పటి మా వదినను - అన్నయ్యకు ఇస్తామన్నారు. మా చెల్లెలు శకుంతలను చేసుకోవలసిందని షరతు పెట్టాం. వారు అంగీకరించారు.

అయితే, ఎదురుబదురు చేసుకోవడం అమ్మకు ఇష్టం లేదు. మరొకటి - గోత్రాలు మావీ, వారివీ ఒకటే. అందుకూ అమ్మకు ఇష్టం కాలేదు. అయితే, అప్పుడు మాకు వాటిమీద నమ్మకాలూ లేవు, గత్యంతరమూ లేదు. పెళ్లిళ్లకు అమ్మ రాలేదు. మేమే వెళ్లాం.

పెళ్లిళ్లు రాయచూర్ దగ్గరి 'బిచ్చాల' గ్రామంలో జరిగాయి. అన్నయ్య పెళ్లికి నేనూ - కమలా పీటలమీద కూర్చున్నాం. శకుంతల పెళ్లికి అన్నయ్యా వదినా కూర్చున్నారు. పెళ్లిళ్ల తరువాత గార్లలో ఏమీ ఏర్పాట్లు చేయలేదు - చేయలేము.

పెళ్లి తరువాత అన్నయ్యకు భయంకరమైన జబ్బు చేసింది. ఖమ్మం హీరాలాల్ ఇంట్లో చికిత్స. మిత్రుల దగ్గర డబ్బు తేవడం - మూత్రపురీషాలు ఎత్తిపోయవలసిన అన్నయ్య సేవలో పడిపోయాను. చాల కాలానికి భగవదనుగ్రహం వల్ల అన్నయ్య ఆరోగ్యం బాగుపడింది.

కాలం ఎప్పుడు ఎవరిని కసురుతుందో తెలియదు. నాయన అన్నయ్య గుడిసెలో అమ్మను చెల్లెళ్లను వదిలిపోయారు. ఎలాంటి ఆధారంలేని నేను ఇల్లు కట్టాను. అందరిని పోషించాను. ఇప్పుడు ఇల్లుంది. పొలం గింజ ఉంది. అయినా మాకు మాన్యత తగ్గింది. కాలం కత్తెర అయింది. మేము ఏం చేయగలం? నా చదువు కోసం కమల పుట్టింటికి వెళ్తానంది. కాదనలేకపోయాను. వెళ్లింది.

గండి మల్లికార్జునరావుగారిది డోర్నకల్లు. అంతకుముందే వారు మిత్రులు. సిరిపురం కాంగ్రెసు క్యాంపులో కలిసి పనిచేశాం. వారు గార్ల మా ఇంటికి వచ్చారు. పరిస్థితి గమనించారు. డోర్నకల్లు రమ్మన్నారు. వెళ్లాను. అనంతరామయ్యగారి కొడుకులకు ట్యూషను చెప్పేట్లు - వారింట్లోనే భోజనం - బస ఏర్పాటు చేశారు. అక్కడ లాంతరులో కిర్సనాయిలు కొరత లేదు. రాత్రింబవళ్లు నిద్రాహారాలు మాని - తపస్సు చేసినట్లు చదివాను.

మల్లికార్జునరావుగారి భార్య భద్రమ్మ - అనంతరామయ్యగారి సతీమణి సీతమ్మ నన్ను తమవాడిగా చూచుకున్నారు. వారి ఆప్యాయత లేకుంటే నా చదువు సాగేది కాదు. అనంతరామయ్యగారు - సీతమ్మ ఈ లోకంలో లేరు. **అప్యాయతలు మనుషులతో అంతరించవు.**

నేను ఏం చదివానో ఎంత చదివానో తెలియదు. బెజవాడ వెళ్లి నలుగురితో కలిసి తెలుసుకోవాలనుకున్నాను. ఇంతలో బెజవాడ కాలేజీలో పరీక్షకు సంబంధించిన 2363 నెంబరు హాల్‌టిక్కెటు అందింది. మార్చి 51 లో పరీక్షలు. ఫిబ్రవరిలో వెళ్దామనుకున్నాను. మళ్లీ డబ్బు సమస్యే!

నా సమస్య గార్ల మిత్రుడు చందా వీరభద్రంగారికి తెలియపరిచాను. వారు చందాలు వసూలు చేసి ఇచ్చారు. ఆ డబ్బుతో బెజవాడ చేరుకున్నాను. తెలిసిన వాళ్ల ఇంట్లో విడిశాను. కొద్దిరోజుల్లోనే డబ్బు కరిగిపోయింది. పరీక్ష మానుకుని తిరిగి పోవడం తప్ప గత్యంతరం లేని పరిస్థితి ఏర్పడింది. **డబ్బు సైతం కాలమంతటి బలీయం అయింది అని అర్థం అయింది.** పడిన శ్రమ సాంతం వృధా కానున్నది! కృష్ణ వడ్డున కూర్చొని వంటరిగా ఏడ్చాను. కమల గుర్తుకు వచ్చింది. ఆమె ఉంటే ఓదార్చేది! ఒక మార్గం చూపేది!! అప్పటికి దేవుని మీద నమ్మకం లేదు. భగవంతుని ప్రార్థించడం తెలియదు!

భగవంతుడు కరుణామయుడు. ప్రార్థించకున్నా ప్రత్యక్షం అవుతాడు! అలా ప్రత్యక్షం అయినాడు గవర్నరుపేట చౌరస్తాలో బొగ్గారపు సీతారామయ్య! సీతారామయ్య సిరిపురం క్యాంపులో నాతోపాటు పనిచేసినవాడు. సంపన్నుడు. సంవత్సరంగా - గోష్టి సుబ్బారావుగారి ట్యుటోరియల్‌లో - మెట్రిక్ చదువుతున్నాడు. సీతారామయ్య నన్ను ఆత్మీయంగా పలకరించాడు. నా కథ సాంతం అతని ముందు కక్కాను. అతను ఆత్మబంధువులా ఆదుకున్నాడు. సామాను సహితంగా నన్ను తన గదికి

చేర్చాడు. తనతోపాటు నాకు 'రాఘవ రెస్టారెంటు'లో భోజనం టిక్కెట్లు కొన్నాడు. ఆనాటి నుంచి నేను గార్ల తిరిగి వెళ్లేవరకు ఎలాంటి లోటు రాకుండా చూచాడు.

చదువు పోల్చుకుంటే నేనే వారికన్న మిన్నగా ఉన్నాను. చదువులో అన్యోన్యం సాయపడ్డాం. కలిసి పరీక్షలు వ్రాశాం. లెక్కలు పరీక్షలో నెగ్గలేమనిపించింది. వాస్తవంగా పేపర్ మెట్రిక్ స్థాయిని మించి ఉంది. అదీకాక ప్రశ్నాపత్రాలు ఇంగ్లీషులో ఉండేవి. జవాబులు తెలుగులో వ్రాయాల్సివచ్చేది.

"ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆంగ్లప్రశ్నపత్రా లేమిటి?" అని పత్రికలకు వ్రాశాను. పత్రికలు మంచి ప్రచారం ఇచ్చాయి. గణితంలో ప్రశ్నాపత్రం – వాటిస్థాయి విద్యార్థుల ఇక్కట్లను గురించి కూడా పత్రికలకు వ్రాశాం. అలాంటివి పత్రికల్లో రావడం అప్పటికి కొత్త.

అంతటితో ఊరుకోలేదు. దరఖాస్తులు వ్రాశాం. విద్యార్థులతో సంతకాలు చేయించాం. వైస్‌ఛాన్సలర్‌కు పంపించాం. గోష్ఠి సుబ్బారావుగారు ఆంధ్రవిశ్వవిద్యాలయం సెనెట్ సభ్యులు. వారిని కలిసి వివరించాం. వారికి అర్థం అయింది. మా కోరికలు రెండు:

1. ప్రశ్నాపత్రాలు తెలుగులో ఉండాలి.
2. గణితంలో ఆ సంవత్సరపు విద్యార్థులకు అదనంగా 20 మార్కులు కలపాలి.

సుబ్బారావుగారు విశాఖ వెళ్లారు. అప్పటికే మా వినతి పత్రాలు – పత్రికా ప్రకటనలు కొంత కదలిక తెచ్చాయి. సుబ్బారావుగారు కొంతపని చేశారు; బెజవాడ తిరిగి వచ్చారు. తెలుగు ప్రశ్నాపత్రాలను గురించి విశ్వవిద్యాలయం అంగీకరించిందనీ – అదనపు గణితపు మార్కుల గురించి పరిశీలిస్తామని హామీ లభించిందనీ వారు తెలియపరచారు.

నేనూ సీతారామయ్యా బెజవాడ వదిలాం. నైజాం బండిలో బయల్దేరాం. సీతారామయ్య పాపటపల్లిలో దిగాడు. పండితాపురం వెళ్లాడు. నేను గార్లలో దిగాను. మెట్రిక్ పరీక్ష ఇవ్వడంతో ఒక కార్యం సాధించినట్లు అనిపించింది. సుమారు దశాబ్దం తరువాత మళ్లీ పరీక్ష ఇచ్చాను. భవిష్యత్తు సాంతం ఆ ఫలితం మీద ఆధారపడి ఉంది.

కమల వచ్చింది. నిత్యకృత్యం కష్టంగా గడుస్తున్నది. కష్టాలకు అలవాటుపడ్డ వారికి ఇబ్బందులు ఉండవు. కష్టాలకే కథలన్నియు సుఖాలకు కథలు లేవు. చూస్తుండగానే ఫలితాలు వచ్చాయి. నేను – సీతారామయ్య ఇద్దరం పాసయ్యాం.

పాసయిన నాడు నా ఆనందానికి అవధులు లేవు. ఒక ఘనకార్యం సాధించినట్లూ – ఒక తపస్సు ఫలించినట్లూ అనిపించింది. భద్రం – వేంకటేశ్వరరావు – కృష్ణమూర్తి అంతా ఎంతో సంతోషించారు. భయ్యాదుకాణంలో మిఠాయి కొన్నాను. అది కన్నులకు అందించాను. వార్త వినిపించాను. ఆమె ఆనందానికి అంతు లేదు. ఈ విజయంలో సగం కమలదే. అమ్మా – చెల్లెళ్లూ సంతోషించారు.

ఆ రాత్రి కమలా – నేనూ కలసి కలలుగన్నాం. ఒక ఉద్యోగం వస్తుంది. స్థిరమయిన ఆదాయం ఉంటుంది. వేళకు తినవచ్చు. బట్టలు కొనవచ్చు. రామన్న పిల్లలకు ఇంత పెట్టగలం. కమల గర్భవతి.

నేను రెండు ఉద్యోగాలకు దరఖాస్తులు పెట్టాను. రెవిన్యూ ఇనస్పెక్టర్ పోస్టుకు పళని అప్పన్ ఇంటర్వ్యూ చేశారు. 'దేశ భక్తులకు ఈ స్థితి పడుతుంది అనుకోలేదు' అని సానుతాపం వెల్లడించారు. ఉద్యోగం వస్తుందని వాచ్యంగా చెప్పలేదు.

నేను ఎవరి సిఫారసు – మా అన్నయ్యది సైతం – కోరలేదు. పైరవీ చేయలేదు. ఎవరినీ అర్థించలేదు. అయినా ఒకే పోస్టులో రెండు అపాయంట్ మెంట్స్ వచ్చాయి. ఒకటి రెవిన్యూ ఇనస్పెక్టర్ – లేవీ. రెండవది టీచరు ఉద్యోగం. ఆనాడు ఎంత మురిసిపోయామో! జీవితానికి ఒక ఆలంబనం లభించింది!

మిత్రులంతా రెవిన్యూ ఇనస్పెక్టరు ఉద్యోగానికి వెళ్లమన్నారు. అది ధాన్యం వసూలుకు సంబంధించిన ఉద్యోగం. 'ఇన్నాళ్లు దరిద్రం అనుభవించావు. రెండు చేతులా సంపాదించవచ్చు' అన్నారు. ఎందుకో నాకు నాటికీ – నేటికీ ధనం మీద ఆశలేదు విజ్ఞాన సముపార్జనే ధ్యేయం. టీచరు ఉద్యోగానికి వెళ్లాలని నిర్ణయించాను. ఆ రోజుల్లో టీచర్లు మాత్రమే ప్రైవేటుగా పరీక్షలు ఇచ్చే వీలు ఉండేది. బి.ఏ. డిగ్రీ సాధించాలని ఉద్దేశం. అది టీచరుగానే సాధ్యం. నేలకొండపల్లికి పోస్టింగ్ వచ్చింది.

పోస్టింగ్ వచ్చింది. ఉద్యోగంలో చేరడానికి బట్టలు లేవు. కొనడానికి డబ్బు లేదు. ఎవరిచ్చారో గుర్తులేదు – ముప్పయి రూపాయిలు ఇచ్చారు. డోర్నకల్లు వెళ్లాను. ఈ వార్త చెప్పాను. రెండు జతల 'బిన్నీ' బట్టలు కుట్టించాను. అప్పుడు 'బిన్నీ' మిల్లు బట్టలే ప్రసిద్ధి.

ఇంటి దగ్గర కమల – అమ్మ చెల్లెళ్లు సాగనంపారు. మిత్రులు అంతా స్టేషనుకు వచ్చారు. నన్ను రైలు ఎక్కించి పంపించారు.

గార్లతో నాకు అనుబంధం ఏర్పడింది. గార్ల ప్రజలు నాకు పోరాటం నేర్పారు. నన్ను పోషించారు. మా కుటుంబాన్ని పోషించారు. అంతేకాదు – ఆత్మీయత చూపించారు. ఆప్యాయత కురిపించారు.

ఏరు – ఏటిమీది వంతెన – పొలాలు – రాతిస్తంభం – శివాలయం – లక్ష్మీనారాయణ కోవెల – గాంధీ పార్కు – జండా బజారు – వేంకటేశ్వరస్వామి విడిది – పీరీలకొట్టం – పెద్ద బజారు – భయ్యా మిఠాయి దుకాణం – రామలచ్చయ్య హోటలు – పోస్టాఫీసు – స్టేషను – వీటితో కలకాలపు అనుబంధం.

వీటిని అన్నింటినీ వదిలి వెళ్లిపోతున్నాను. ఆడపిల్ల తల్లిగారింటికివలె అప్పుడప్పుడూ వస్తాను. అయినా గార్ల వదిలినట్లే!

హృదయం భారంగా ఉంది
గుండె బరువుగా ఉంది
గొంతు నిండిపోయింది
కనులు చెమ్మగిల్లాయి.
జీవనం ఒక యానం. ఒక మజిలీ దాటాం.

# ఇరవయి ఏడు

## ఉద్యోగ లక్షణం:

ఖమ్మం నుంచి నేలకొండపల్లికి బస్సు చార్జీ ఒక రూపాయి. మరో రూపాయి జేబులో ఉన్నట్లుంది. బస్సు దిగాను. సాగిపోతున్నాను. ఇంటిముందు అరుగులమీద పెండ్యాల సత్యనారాయణగారు కనిపించారు. వారే పలకరించారు. చెప్పాను.

"నువ్వు ఉద్యోగం చేస్తావా?" ఆశ్చర్యంగా అడిగారు. వారు నేలకొండపల్లి సర్పంచ్.

అంతకన్న గతిలేదు.

"దేశభక్తులంత దీనులైపోయిరి
కొత్త ఖాదివాడు కోట్లకెక్కె" అన్నాను.

"రంగాచార్లూ! ఎంతలో కాలం ఎంత మారిపోయిందయ్యా! నువ్వు చెప్పినట్లు మనకు స్థానం లేదు" వారి గొంతు పూడిపోయింది. 'నేనూ వస్తా ఉండు', అని. వారు నాతో వచ్చారు. హెడ్‌మాస్టరుకు పరిచయం చేశారు. బయలుదేరారు. గేటుదాకా వెళ్లారు. మళ్లీ తిరిగి వచ్చారు.

"భోజనం ఎక్కడ?" అడిగారు.

"జేబులో రూపాయి ఉంది" అన్నాను.

"చింత చస్తుంది. పులుపు చావదు. మేమింకా బతికే ఉన్నాం. మా ఇంటికిరా" అని గిరుక్కున తిరిగి వెళ్లిపోయారు.

నా కనులనుంచి బాష్పబిందువులు రాలాయి. హెడ్‌మాస్టర్ సర్ఫరాజ్ చకితుడయి చూచాడు. అతనికి ఉద్యోగం తెలుసు – మనసు తెలియదు.

మనసు మాత్రం తెలిసిన నేను ఉద్యోగం చేయగలనా?

పగలు సత్యనారాయణగారి ఇంటికి వెళ్లాను. ఒక గది ఖాళీ చేయించి, శుభ్రం చేయించి ఉంచారు. మంచం పడక ఏర్పాటు చేశారు.

1951లో ఉద్యోగంలో చేరినప్పటి దాశరథి రంగాచార్య

"నాయనా! మాకు నువ్వే భారం కావుగాని ఉన్నంతకాలం ఇక్కడే భోంచెయ్యి. ఈ గదిలో ఉండు" అన్నారు పెండ్యాలవారి మాతృమూర్తి. ఆమె అక్షరాల

అన్నపూర్ణ! అక్కడ ఉన్నన్నాళ్లూ విసుగులేకుండా భోజనం పెట్టింది. ఆమె నన్ను పుత్రునిగా – శ్రీమతి సోదరునిగా చూసుకున్నారు.

భగవంతుడు ఆశ్రయం చూపించక మానడు! భద్రాద్రి దేవాలయం నిర్మించిన కంచర్ల గోపన్న – రామదాసు జన్మస్థానం నేలకొండపల్లి. దాన్నే విరాటరాజు పట్నం అంటారు. జమ్మిచెట్లు ఎక్కువ. ఊరి బయట – చెరువు పక్కన వేంకటేశ్వరాలయం ఉంది. అక్కణ్నుంచి మరికొంత దూరంలో "విరాటరాజు గద్దె" అనే దిబ్బ ఉండేది. ఈ మధ్య తవ్వకాల్లో అది బౌద్ధ స్థూపం అని తేలింది. బుద్ధ విగ్రహాలు బయట పడినాయి!

బౌద్ధాన్ని పూడ్చిపెట్టడానికి స్థూపాన్ని దిబ్బ చేసి ఉంటారు! పోలీసు చర్య తరువాత తెలంగాణంలో ఒక విద్యా ఉద్యమం ఉవ్వెత్తున లేచింది. ఇది ప్రజా ఉద్యమం. గ్రామాల్లో పాఠశాలలు స్థాపించుకోవడానికి – ఉన్నవాటిలో క్లాసులు పెంచుకోవడానికి ప్రజలు పూనుకున్నారు. వాళ్ళే పాఠశాలలకు స్థలాలు ఇచ్చారు. భవనాలు కట్టించారు. ప్రభుత్వం అడిగిన డిపాజిట్లు చెల్లించారు. హైదరాబాదు DPI ఆఫీసులో – తరగతుల పెంపుకోసం – డిపాజిట్లు కట్టడానికి జనం బారులు తీరి నిలిచేవారు!

తెలంగాణం శతాబ్దాలుగా విద్యాదాహంతో తల్లడిల్లింది. ఇప్పుడు ఆ దాహం తీర్చుకోవడానికి ఉవ్వెత్తున లేచింది.

తెలంగాణం తెలుగుకోసం ఎంత తపించిందంటే 'అలంపురం'లో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు సభలకు ఇరవయి వేలమంది తరలి వచ్చారు. రాధాకృష్ణ పండితుడు తెలుగులో తుంగభద్రా ప్రవంతి వంటి ఉపన్యాసం ఇచ్చారు.

విద్యాఉద్యమంలో భాగంగానే నేలకొండపల్లిలో 5,6 తరగతులు ప్రారంభించారు. ఉపాధ్యాయుల్లో నేను తప్ప అంతా ఉర్దూ మీడియంవారే! ఉద్యమాన్ని ఉరుకులు పెట్టించాలని నా భావన. ఎక్కువ క్లాసులు నేనే తీసుకునేవాణ్ణి. పిల్లలకు కూడా నా మీద అభిమానం ఏర్పడింది. పెట్రోమాక్సు లైట్లు పెట్టి రాత్రిళ్లు పిల్లలను చదివించాను. పిల్లలూ నేనూ రాత్రిళ్లు అక్కడే పడుకునేవాళ్లం!

నేలకొండపల్లిలో బ్రాహ్మణ కుటుంబాలు ఎక్కువ. వారి పిల్లలకు చక్కగా చదువు చెపుతున్నానని వారికి అభిమానం. అందరూ భోజనాలకు పిలిచేవారు. తమ ఇంట్లో చేయకుంటే సత్యనారాయణగారు చిన్నపుచ్చుకునేవారు!

ఆత్మీయత గట్లు తెంచుకుని ప్రవహించింది. అందరూ ఆత్మీయులే. అయినా గార్ల వెంటాడడం విడువలేదు.

కమల – తల్లిగారింట – ప్రసవించింది. ఆడపిల్ల. ఉత్తరం వచ్చింది. బిడ్డ అంటే మా రూపమే! ఏదో ఉత్సాహం. ఉరకాల్నని ఆతురత! అయినా వెళ్లలేకపోయాను. స్వతంత్ర భారతంలో తొలి ఎన్నికలు. ఎన్నికల డ్యూటీ పడింది. శలవు ఇవ్వమన్నారు. ఏం చేస్తాం? ఉండిపోయాను.

అంతవరకు తెలంగాణకు ఎన్నికలు తెలియవు. సిబ్బందికీ అంతే. శిక్షణలు ఇచ్చారు. అప్పటి ఎన్నికలు పెట్టెల పద్ధతిలో జరిగేవి. అభ్యర్థికి ఒక పెట్టె, దానిమీద అతని గుర్తు. ఎందరు అభ్యర్థులుంటే అన్ని పెట్టెలుండేవి.

తమ ఉద్యమం కొనసాగించడం విషయంలో ఆదేశాలు అందుకోవడానికి కమ్యూనిస్టు నేతలు రష్యా వెళ్లారు! అప్పటి నియంత 'స్టాలిన్'ను కలిశారు, వివరించారు. సముద్రతీరం లేనిచోట విప్లవం సాధ్యపడదు, విరమించండి అన్నాడు స్టాలిన్. కమ్యూనిస్టులు బేషరతుగా ఉద్యమం విరమించారు. అప్పటికి సర్దార్ పటేల్ పరమపదించారు. అయినా పార్టీమీద నిషేధం తొలగించలేదు. పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ – P.D.F. పేర ఎన్నికల్లో పోటీ చేశారు. వారి ఎన్నికల చిహ్నం హస్తం. కాంగ్రెస్ గుర్తు కాడితో రెండెడ్లు.

ఎన్నికల్లో – తెలంగాణంలో – ఎర్ర కెరటం లేచింది. ఎక్కడ చూచినా కమ్యూనిస్టు సానుభూతియే! సిబ్బంది సైతం హస్తం చూపి ఓట్లు వేయించారు. ఒక్కొక్క అభ్యర్థి రెండు, మూడు స్థానాలనుంచి పోటీ చేశారు, నెగ్గారు.

హైదరాబాదు రాష్ట్రంలో తొలి ఎన్నికల ఫలితాల్లో కాంగ్రెసుకు 93 – P.D.F అంటే – కమ్యూనిస్టులకు 42 – సోషలిస్టులకు – స్వతంత్రులకు 29 సీట్లు వచ్చాయి. తెలంగాణ నూరు స్థానాలకు కమ్యూనిస్టులు 40 గెలుచుకున్నారు. నల్లగొండ జిల్లాలో మొత్తం 14 స్థానాలను వారే గెలుచుకున్నారు. రావి నారాయణరెడ్డిగారికి – నెహ్రూగారికన్న ఎక్కువ ఓట్లు వచ్చాయి!

మాడపాటి హనుమంతరావుగారు – జమలాపురం కేశవరావుగారు – సురవరం ప్రతాపరెడ్డివంటి అగ్ర కాంగ్రెస్ నాయకులు ఓడిపోయారు – కాదు, కొత్త కాంగ్రెసు వారు వాళ్లను ఓడించారు! వారు త్యాగధనులు. ఎన్నికల పితలాకం తెలియనివారు. కొత్త ఖద్దరుధారులు వారికి – గెలిచే అవకాశం లేని – నియోజక వర్గాలు కేటాయించారు. దేశభక్తులను దీనులను చేశారు.

ఎన్నికల తరువాత కాంగ్రెసులో మురాల మల్లగుల్లాలు జరిగాయి. పేరుకు రామానంద తీర్థ అధ్యక్షులు అయినా పాత దేశాయి కాంగ్రెసువారే ముఖ్యమంత్రీ – ఉపముఖ్యమంత్రీ అయ్యారు. బూర్గుల రామకృష్ణారావు ముఖ్యమంత్రిగానూ, కొండా వెంకట రంగారెడ్డి ఉపముఖ్యమంత్రిగానూ హైదరాబాదు రాష్ట్రంలో తొలి ప్రజాప్రభుత్వం ఏర్పడింది.

సాయుధ పోరాటం నిర్వహించిన వారికీ – ప్రగతివాదులకు మంత్రివర్గంలో ఒక్క స్థానం కూడా లభించలేదు. మురాలు కట్టడం నేర్చినవారు మంత్రి పదవులు సంపాదించుకున్నారు. పోరాటం జరిపినవారిని – మీ పని అయిపోయింది అని ఇళ్లకు పంపించారు.

అవమానం భరించలేక జమలాపురం కేశవరావుగారు అసువులు బాశారు.

స్థానిక పాలన మంత్రి ఫూల్‌చంద్ గాంధీ దాశరథి, తాళ్లూరి రామానుజస్వామి, నారాయణస్వామి వంటి త్యాగధనులకు జిల్లా పంచాయత్ ఇనస్పెక్టర్ల ఉద్యోగాలు ఇచ్చారు! అంటే, నేను – మా అన్నయ్య – కొద్ది నెలల తేడాతో ఉద్యోగాల్లో చేరాం.

చదువులు లేక – ఆస్తులు ఉద్యమానికి అర్పించుకుని – తిండికి లేక చచ్చిన దేశభక్తులను – కనీసం లెక్కించే శ్రమ ప్రభుత్వం చేయలేదు!

పెండ్యాల సత్యనారాయణగారు 80 ఎకరాల సుక్షేత్రం అయిన మాగాణిలో 70 ఎకరాలు ఉద్యమానికి ధారపోశారు. కమ్యూనిస్టు నాయకుడు సర్వదేవభట్ల రామనాథంగారు కోట్ల ఆస్తిని ఉద్యమానికి హారతి చేశారు!

మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలోని 134 స్థానాలలో కాంగ్రెస్ 34, కమ్యూనిస్టులు 41, కిసాన్ మజ్దూర్ పార్టీ 20, కృషికార్ లోక్‌పార్టీ 15, సోషలిస్టులు 8, మిగతా స్వతంత్రులు గెలిచారు.

మద్రాసు – హైదరాబాదు రాష్ట్రాలలోని తెలుగు ప్రాంతాల సీట్లు 234 కాగా, ఉభయ ప్రాంతాలనుంచి కమ్యూనిస్టులు 53 స్థానాలు గెలుచుకున్నారు. అదీ కాంగ్రెస్‌లోని వారే కిసాన్ మజ్దూర్ – కృషికార్ లోక్‌పార్టీలు స్థాపించి చీలిపోవడం వల్ల. కమ్యూనిస్టు మహానాయకులకు ఈ సామాన్య సూత్రం అర్థం కాలేదు. ఆంధ్రలో తమ ప్రభుత్వం స్థాపించనున్నట్లు తొడగొట్టి సవాలు చేశారు. ఈ సవాలుకు బెదిరిన కాంగ్రెస్‌వారు ఐక్యసంఘటనగా ఏర్పడ్డారు. 1955 లో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో వారు 147 స్థానాలను గెల్చుకోగా, కమ్యూనిస్టులు 15 సీట్లు మాత్రమే గెలిచి చావుదెబ్బ తిన్నారు. అప్పటినుంచి వారు కోలుకోలేదు!

1952 అక్టోబర్ 19 న పొట్టి శ్రీరాములుగారు 58 రోజులు నిరశన వ్రతం అవలంబించి అమరులయినారు. అందువల్ల 1953 అక్టోబరు ఒకటవ తేదీన – కర్నూలు రాజధానిగా – ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. రాజకీయ కీచులాటలు రగులుకున్నాయి!

1948–49 ప్రాంతంలో మద్రాసు నుంచి 'సందేశం' అనే వారపత్రిక వచ్చేది. వారు ఆంధ్రరాష్ట్రాన్ని గురించి వ్యాసాల పోటీ నిర్వహించారు. అందుకు నేను ఒక వ్యాసం పంపాను. అందులో ముఖ్యమంత్రి – మంత్రి పదవులకే రాష్ట్రం కోరుతున్నారు అని వ్రాశాను. నాకు బహుమతి లభించింది.

**రాజకీయ కీచులాటలు నా వాణిని నిజం చేశాయి. ప్రజలను మతం ఏకం చేయలేనట్లే, భాష – కులం వగైరాలు ఏకం చేయలేవని నా అభిప్రాయం.**

ఎన్నికలు ముగియగానే కమలకోసం – మా బిడ్డకోసం – పరుగులు తీశాను. అప్పటికి నాకు జీతం వచ్చినట్లుంది. ఖమ్మం చేరుకున్నాను. పన్నెండు రూపాయిలకు బాటా శాండిల్స్ – ఆరు రూపాయిలకు ఎవరెడీ బ్యాటరీ కొన్నాను. కమలకు చీర – పాపకు గౌను – సవాశేరు జిలేబీ కొన్నాను. నల్లగొండ బస్సు ఎక్కాను. కట్టంగూరులో దిగాను. అప్పటికి మధ్యాహ్నం అయింది. బస్సులు లేవు. రోడ్డు లేదు. కాలినడక సాగించాను. అడ్లూరు మార్గం తెలియదు. అడుక్కుంటూ సాగాను. ఒక మోట బావి దగ్గర కూర్చున్నాను. జిలేబీ తిన్నాను. మోట నీళ్లు తాగాను. సంచీ పట్టుకుని నడక సాగించాను. సాయంత్రానికి అడ్లూరు చేరాను.

అడ్లూరులో నన్ను చూచారు. కమల – మిగతావాళ్లూ సంబరపడిపోయారు. మా వలపు ఫలితం – పసిపాపను చూచుకున్నాం. కమలా నేనూ మురిసిపోయాం. ఏమిటి ఆ సంబరం? మనలోంచి ఊడిపడిన బిడ్డ అనియా? ఆ బిడ్డకోసం సర్వస్వం అర్పించడానికి సిద్ధం అవుతాం. అంతటి ప్రేమా – త్యాగం కల్పించాడు భగవానుడు! ప్రకృతిలో జీవరాసులు అన్నీ అంతే. అలా కాకుంటే పసిబిడ్డలు ఎలా పెరుగుతారు?

పాపకు "ఉదయశ్రీ" అని నామకరణం చేశాను. జంధ్యాల పాపయ్యశాస్త్రి – ఉదయశ్రీ పద్యాలకు ప్రభావితుడనై పెట్టినపేరు. ఒక కావ్యం పేరునే బిడ్డపేరుగా అప్పటికి బహుశా నేనే పెట్టానేమో!

ఖర సంవత్సర మార్గశీర్ష శుక్ల ద్వాదశి సోమవారం – 10–12–51 ఉదయం ఆరు గంటలకు ఉదయశ్రీ జన్మించింది. ఆమె మాకు తొలి సంతానం.

అడ్లూరులో కొన్నాళ్లు ఉన్నాను. అవి ఇంకా బంధుప్రేమ ఉన్న రోజులు. కాలినడకన చుట్టుపట్ల బంధువుల ఇండ్లకు వెళ్లి వచ్చాను. వాళ్లందరూ ఎంతో ఆత్మీయత కనబరచారు.

ఒకరు – చక్కెర వేయలేని తమ అశక్తతకు నొచ్చుకుంటూ – బెల్లం వేసిన పాలు ఇచ్చారు. రుచిగా ఉన్నాయి.

మా అత్తగారి చెల్లెలు కమలమ్మగారింట్లో భోజనం. విస్తట్లో కొంత అన్నం వదిలేశాను. "వదిలేయడానికి మళ్లీ వడ్డిస్తాను. అది కలుపుకో నాయనా!" అన్నారు కమలమ్మగారు. నాకేమీ అర్థం కాలేదు. అత్తవారింట్లో భోజనం చేసేపుడు విస్తట్లో అల్లుడు అన్నం వదిలేయడం ఆచారమట!

అడ్లూరు నుంచి కొండపల్లి మార్గంలో 'బరాకత్ గూడెం'లో ఆగాను. అక్కడ కమల చిన్న అమ్మమ్మగారు – వెంకటమ్మగారు ఉన్నారు. వారు ఎంతో వాత్సల్యం కనబరచారు. ప్రేమాభిమానాలు లభించడం అరుదు. భగవంతుడు సహితం ప్రేమ పిపాసియే! భక్తితో సమర్పించిన పత్రం – పుష్పం – ఫలం – జలం చాలును అన్నాడు. కణ్ణప్ప గండూషాంబు నిషేచనం – పుక్కిటినీటితో లింగానికి అభిషేకం చేశాడు. శివస్వామి కణ్ణప్పను కరుణించాడు!

స్వాతంత్ర్యం వచ్చినంతమాత్రాన బానిసత్వం పోయినట్లుకాదు. బానిసత్వం మనసులో గూడు కట్టుకుంటుంది. వదలదు. టీచర్ల స్థితి అలాగే ఉండేది. నాజర్ – డిప్యూటి ఇనస్పెక్టరు – వచ్చాడంటే చేతులు కట్టుకొని నుంచుంటారు. నాజర్ తాను దొరను అన్నట్లు ప్రవర్తిస్తాడు. టీచర్లు సహితం 'బాంచెను దొరా' అన్నట్లు చేతులు నలుపుకుంటూ సేవలు చేస్తారు.

నాకు అది నచ్చదు. నేను అలా చేయలేదు. ఈ బానిసత్వం వదిలించడానికి ఉపాధ్యాయ సంఘం ఏర్పాటు చేయాలనుకున్నాను. గ్రామాలు పర్యటించాను. కొంత ప్రయత్నం చేశాను. నాజరు నిజామును తల తన్నినవాడు. 'సంఘం' అంటే వాడికి బెదురు. నన్ను "పమ్మి" అనే దూరంగా ఉన్న పల్లెకు హెడ్‌మాస్టరుగా బదిలీ చేశాడు. నేను దేబిరించలేదు, పమ్మికి వెళ్లాను.

స్కూలు విషయంలో కొండపల్లికి – గోఖనిపల్లికి పోటీ. కొండపల్లివారు ఆరో తరగతి తెచ్చుకుంటే గోఖనిపల్లివారు ఏడవ తరగతి తెచ్చుకున్నారు. వారు కోరి 'పమ్మి' నుంచి నన్ను పిలిపించుకున్నారు. కమలా – ఉదయశ్రీ – నేనూ గోఖనిపల్లి చేరుకున్నాం. ప్రజలు మాకు ఉచితంగా ఇల్లు ఇచ్చారు. పాలు, పెరుగు, కూరగాయలు సమకూర్చారు. విద్యార్థులు మా ఇంట్లో కట్టెలు కొట్టారు. విద్యార్థినులు ఇళ్లు అలికారు. ధాన్యం దంచారు. పిండి విసిరారు. మా విషయంలో ఎంతో అభిమానం కనబరచారు. మాకు మిగిలిన కూరగాయలు వగైరా ఇతరులకు అందించేవాళ్లం!

కొండపల్లివారు నా విషయంలో పోటీ పడ్డారు. మళ్లీ కొండపల్లికి రప్పించుకున్నారు. ముగ్గురం తొలుత సత్యనారాయణగారి ఇంట్లో దిగాం. 'ఇద్దరికి అన్నం పెట్టలేమా? వేరే ఇంటికి వెళ్లొద్దు' అంటారు మాతృశ్రీ. మేము అంగీకరించలేదు. వైష్ణవుల ఇంట్లో వాటా చూచి – మమ్మల్ని అక్కడి చేర్చారు. అక్కడ వంట చేసింది తక్కువ. రోజూ ఎవరో ఒకరు భోజనానికి పిలిచేవారు. ఆ ఇంటికి మా అన్నయ్య వచ్చారు. నాయన వచ్చారు.

బెజవాడలో కృష్ణాజిల్లా ఉపాధ్యాయ సంఘ వార్షికోత్సవాలు జరిగాయి. లక్ష్మయ్య గారు నన్ను ఆహ్వానించారు. నేను కాస్త ఆలస్యంగా – భోజన విరామ సమయానికి చేరుకున్నాను. 'తెలంగాణం నుంచి రంగాచార్యులవారు వచ్చారు. వారి ఉపన్యాసం విందామా? భోజనాలకు వెళ్దామా?' అని సభికులను లక్ష్మయ్యగారు అడిగారు. అందరూ ముక్తకంఠంగా ఉపన్యాసం వింటాం అన్నారు. నేను తెలంగాణ రాజకీయ పరిస్థితులు – విద్యావిధానం – టీచర్ల స్థితిని గురించి గంటంబావు మాట్లాడాను. అందరూ హర్షధ్వానాలు చేశారు. సభలు ముగిసేవరకు వాళ్లతోనే ఉన్నాను.

'తెలంగాణ వాణి' అని నా ఉపన్యాసానికి ప్రాముఖ్యతను ఇచ్చి పత్రికలు ప్రకటించాయి. ఇప్పటివలె జిల్లా ఎడిషన్లు అప్పటికి లేవు. ఆ వార్త చూచిన 'నాజరు' తాళలేకపోయాడు. నన్ను మానుకోట తాలూకా "పెరుమాళ్ల సంకీస" అనే మారుమూల గ్రామానికి బదిలీ చేయించాడు.

కొండపల్లి గ్రామప్రజలు – విద్యార్థులు – ఉపాధ్యాయులు పెద్ద సమావేశం – విందు ఏర్పాటుచేసి, మాకు ఘనంగా వీడ్కోలు చెప్పారు. గోఖినిపల్లివారు కూడా అందులో పాల్గొన్నారు. నేను రుద్రకంఠంతో – సజల నయనాలతో వారికి కృతజ్ఞతలు సమర్పించుకున్నాను.

తరువాత సహితం – నేటికీ ఆ గ్రామాలతో నాకు అనుబంధాలున్నాయి. 1970లో నా 'చిల్లరదేవుళ్లు' ప్రచురణ సందర్భంలో గోఖినిపల్లిలో నన్ను సన్మానించారు. 1990లో కమలనూ – నన్నూ ఆ ఊళ్ళోనే ఆత్మీయంగా సన్మానించారు.

కొండపల్లివారు పిలిస్తే వెళ్లలేకపోయాను. కాని సత్యనారాయణగారిని దర్శించుకోవడానికి వెళ్లాను. వారు పరమపదించడానికి వారం ముందు సకుటుంబంగా వెళ్లి – సత్యనారాయణ దంపతులకు పూలు–పండ్లు ఇచ్చి – శాలువలు కప్పి సత్కరించాం.

పెరుమాళ్ల సంకీస అటు గార్లకూ – ఇటు చిన్న గూడూరుకూ పది పదిహేను మైళ్లలో ఉన్న గ్రామం. ఆ ఊరికి బస్సుగాని – రైలుగాని లేదు వర్షకాలంలో నదులు పొంగుతే జలదిగ్బంధంలో ఉండిపోతుంది. నన్ను దిగ్బంధం చేయడానికి ఆ గ్రామం బదిలీ చేశారు.

పెరుమాళ్ల సంకీస ప్రాంతంలో 'తాళ్ల సంకీస' అని మరొక గ్రామం ఉంది. 'కీస' అంటే జేబు. తాటిచెట్టుకు జేబులాంటి సంచీ కట్టి ఉంటుందేమో అనుకునేవాళ్లం అన్నయ్యా, నేనూ మరీ చిన్నవాళ్లంగా ఉన్నపుడు గూడూరులో. అలాంటి ముద్రపడింది మరీ చిన్నతనంలో 'సంకీస' గురించి మనసులో. అలా సంకీసకు చేరుకోవడానికేనేమో ఆ ముద్ర! **మనసును మించిన మహిమ దేనికీ లేదు. మనం గుర్తించాలి – అంతే.**

పెరుమాళ్ల సంకీసలో రామాలయం ఉంది. అందుకే 'పెరుమాళ్ల' విశేషణం. సరిగ్గా భద్రాది రాముని వంటి విగ్రహాలు ఉన్నాయి ఈ ఆలయంలో. అక్కడి రామనవమి నాటి సీతారామ కళ్యాణం చుట్టుపట్ల ప్రఖ్యాతం. ఉత్సవాలు విశేషంగా జరుగుతాయి.

పెరుమాళ్ల సంకీస తెలంగాణ సాయుధ పోరాటం రోజుల్లో కమ్యూనిస్టులకు పెట్టనికోట! దళనాయకుడు తుమ్మా శేషయ్య అంటే ఆ ప్రాంతం దొరలకు – రజాకార్లకు గర్భనిర్భేద్యం. నాతో ఖమ్మంలో చదువుకున్నవాడు – సిరిపురం క్యాంపులో నాతో పని చేసినవాడు నరసింహారెడ్డి ఆ ఊరి దొర. వారి గడీ కూలింది. పొలాలు ప్రజలు పంచుకున్నారు. రజాకార్లు ఆ ఊరు తగలబెట్టారు. ఒకసారి కాదు – పెక్కుమార్లు. స్త్రీలను అతిక్రూరంగా చెరిచారు. మంగళసూత్రాలు 'తవ్వ'లతో కొలుచుకున్నారు. ఇళ్లవాసాలు దూలాలతో 'కాదు' తగలపెట్టారు. ప్రాణాలతో ఉన్నవాళ్లను చేతులూ – కాళ్లూ పట్టుకుని ఊయలవలె ఊపి ఆ మంటలలోనికి విసిరారు. మంటలకు తాళలేక బయటపడినవారిని తుపాకులతో కాల్చారు. మళ్లీ మంటల్లో వేశారు! అలా ఎంతమంది అహూతి అయిందీ లెక్కలు లేవు!

నేను – కమల – మా పసిపిల్ల ఉదయశ్రీ ఎద్దుల బండిలో గార్లనుంచి బయలుదేరాం. మార్గంలో చిలుకోడు అనే గ్రామం ఉంది. ఆ వూరి దొర వెంకటరెడ్డి, అక్కడి బ్రాహ్మణులు మాకు స్వాగతం పలికారు. భోజనాలు, ఏర్పాటు చేశారు. నాటి భోజనాలు – వారి ఆత్మీయతా, అనుబంధం మరువరానివి. జీవితంలో శ్రమించి బహుశా అన్నీ సాధించవచ్చు. ఆత్మీయత, అనుబంధం, అనురాగం లాంటి మనసుకు సంబంధించినవి – లభించాలి, సాధించలేం. గార్లనుంచి వచ్చిన బండిని తిప్పి పంపారు. వాళ్ల బండ్లు కట్టించారు. వాళ్లూ మా వెంట వచ్చారు – మమ్మలను సంకీస ప్రజలకు పరిచయం చేయడానికి.

మా బండ్లు సంకీస చేరాయి. తుమ్మా శేషయ్య మున్నగువారు బంతిపూలు దండలతో మాకు స్వాగతం పలుకడానికి సిద్ధంగా ఉండడం చూసి చిలుకోడు వెంకటరెడ్డిగారు ఆశ్చర్యపోయారు. 'రంగాచారి మాకు కొత్తని పరిచయం చేయటాన్కి వచ్చినారు? ఆయన మాకు పాతోడే. మీకంటే ముంగలినుంచి ఎరుక' అని తుమ్మా శేషయ్య నన్ను కౌగిలించుకుంటే నా కనులు చెమ్మగిల్లాయి. కమ్యూనిస్టులు రాక్షసులు అని నమ్మిన వెంకటరెడ్డి దొర గుండె చెమర్చింది. మా కోసం ఏర్పాటు చేసిన ఇంట్లో మమ్మ దింపారు. సుమారు ఊరంతా కూడింది. చిలుకోడు వారున్నారు. చాయ్‌లు అందాయి. కబుర్లు – ఇకఇకలు – పకపకలు – హాసాలు – అపహాసాలు – పరాచికాలు!

అదొక నిండయిన విందు!

అది అందరికీ అందదు!!

'ఒక బడిపంతులుకు ఇంతటి స్వాగతమా?' నా కంటె ముందు ఉండిన హెడ్‌మాస్టరు పరేషాన్ అయిండు!

పెరుమాళ్ల సంకీసది కేంద్ర పాఠశాల. అంటే – దాని అధీనంలో సుమారు పది పాఠశాలల ఉంటాయి. ఆ పాఠశాలలు ఉపాధ్యాయులకు వేతనాలు తెప్పించి

చెల్లించడం – నెలనెలా ఉపాధ్యాయులకు 'ఆదర్శబోధన' ఏర్పరచడం లాంటివి హెడ్‌మాస్టరుగా నా విధులు. ఆ ఉపాధ్యాయులను నేను నా అధీనులుగా చూడలేదు. సమానులుగా చూచాను. వారు ఆప్యాయత కనబరచారు. అందువల్ల నెలనెల సమావేశాలు 'తద్దినాలు'గా కాక పెళ్లిలుగా జరిగేవి.

పెరుమాళ్ల సంకీస పాఠశాలకు స్వంత భవనం లేదు. కమ్యూనిస్టులను రూపుమాపడానికి అని వచ్చిన సాయుధ పోలీసులు తిరిగిపోగా – వారికోసం వేసిన పాకల్లో స్కూలు ఉంది. హెడ్‌మాస్టరుకు సహితం కుర్చీలేదు. గ్రామవాసుల సహకార సద్భావాలతో గ్రామ మధ్యంలో స్కూలు కోసం ఒక భవనం కొనగలిగాను. ఉపాధ్యాయులకు, పిల్లలకు ఫర్నిచరు ఏర్పాటు చేయగలిగాను. పాఠశాల స్వంత భవనంలో ప్రవేశించే ఉత్సవ సందర్భంగా సభ ఏర్పాటు చేశాను. పిల్లలతో నాటకం వేయించాను. పాటలు పాడించాను.

అలాంటిది ఆ ఊరికి కొత్త. ప్రజలు మురిసిపోయారు. పిల్లలను స్కూలుకు పంపించారు. బడి నిండిపోయింది. నేను ప్రత్యేకంగా హరిజనులను గురించి శ్రద్ధ తీసుకున్నాను. హరిజన విద్యార్థులను చాల మందిని చేర్చగలిగాను. నాకు సనాతనులనుండి ఆటంకాలుగాని హరిజనులనుండి అడ్డంకులుగాని ఎదురుకాలేదు. అందరూ ఎంతో ఆప్యాయతగా సహకరించారు. తరవాత కొంతకాలానికి ఇనస్పెక్షనుకు వచ్చిన నాజర్ 'కలయో వైష్ణవమాయయో' అని పాఠశాల ప్రగతికి అబ్బురపడినాడు. నాకు సర్టిఫికేటు ఇస్తానన్నాడు. గ్రామ ప్రజల ఆత్మీయత నాది – ఆప్యాయతయే నాకు సర్టిఫికేటు అన్నాను.

పిల్లలకోసం ఆటల మైదానం కూడా లభించింది. యువకుల కోసం "బ్యాడ్‌మింటన్ కోర్టు" ఏర్పాటు చేశాను. సాయంకాలాల్లో నేనూ వారితో ఆడాను. యువకులు ఉత్సాహంగా కూడేవారు. వారికి సమాజం – సాహిత్యం – సమానత గురించి చెప్పేవాణ్ణి. కొన్ని పుస్తకాలు చదివించాను. "గోలకొండ పత్రిక" రెండు రోజుల తరువాత వచ్చేది. ప్రయాణ సౌకర్యాలు మృగ్యం.

మా మిత్రుడు కన్వంతరెడ్డి నరసింహారెడ్డి ఆ ఊరికి దొర అని చెప్పాను. సాయుధ పోరాటంలో వారి గడీ కూల్చినారు. ప్రజలు పంచుకున్న భూములు తిరిగి రాబట్టుకోవడం విషయంలో ఇంకా సంఘర్షణలు జరుగుతున్నాయి. తుమ్మా శేషయ్య ఆయుధం త్యజించిన మాట నిజం. అయినా అతని పలుకుబడికి తిరుగులేకుండా ఉంది. మానుకోట – మహబూబాబాదు నియోజక వర్గంనుంచి కన్నెగంటి శ్రీనివాసరావు కమ్యూనిస్టు అభ్యర్థిగా మరింత మెజారిటీతో గెలిచారు. ఆ పరిస్థితుల్లో నేను అక్కడ ఉన్న పదిహేను మాసాల్లో నరసింహారెడ్డి ఒక్కసారి కూడా ఆ ఊరికి రాలేదు.

నేను విద్యాతృష్ణతో – చేతికి అందిన రెవిన్యూ ఇనస్పెక్టరు పదవిని వదులుకున్నాను. ఆ రోజుల్లో ఉపాధ్యాయులు తప్ప ప్రైవేటుగా యూనివర్సిటీ పరీక్ష ఇవ్వడానికి వీలులేదు. అందుకు టీచరుగా రెండు సంవత్సరాల సర్వీసు ఉండాలి. నాకు ఆ యోగ్యత వచ్చింది. ఇంటర్ పుస్తకాలు తెప్పించుకున్నాను. తెలుగు – సంస్కృతం – సివిక్సు ఆప్షనల్స్‌గా అధ్యయనం ప్రారంభించాను.

పోలీసు చర్యకు ముందు ఉస్మానియా యూనివర్సిటీలో ఉర్దూ మీడియం

మాత్రమే ఉండేది. పోలీసు చర్య తరువాత ఇంగ్లీషు – హిందీ మీడియములు చేర్చారు. అంటే, ఉర్దూ – ఇంగ్లీషు – హిందీ ఏ మీడియంలో నయినా పరీక్ష వ్రాయవచ్చు. నిజాం నవాబు జనంమీద రుద్దిన భాషగా ఉర్దూ విషయంలో ఒక గుడ్డి ద్వేషం ఉండేది. తరవాత కాలంలో భాష ప్రజలది, దోచుకున్నవాడు ప్రభువు అని అర్థం చేసుకున్నాం. ఉర్దూ విషయంలో ఎంతో అభిమానం పెంచుకున్నాం. అనేక కవితలు అనువదించాను. ఉర్దూలో ప్రఖ్యాత నవల "ఉమ్రావ్ జాన్ అదా" తెలుగులోనికి అనువదించాను. కేంద్ర సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు. "తెలుగు అఫ్సానే" అని తెలుగు కథలను ఉర్దూలోనికి అనువదించాను. ఉర్దూ కథలను తెలుగు చేశాను. ఈ రెండు కథల సంపుటులు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు.

రామాయణంలో రాముడు లంకను జయిస్తాడు.' సీతను తన వద్దకు తెమ్మని రాముడు హనుమంతుని ఆదేశిస్తాడు. హనుమంతుడు అశోకవనంలో ఉన్న సీత దగ్గరకు వెళ్తాడు. అంతకు ముందు సీతను నానాయాతనలు పెట్టిన రాక్షస స్త్రీలు అతనికి కనిపిస్తారు. హనుమంతునికి కోపం వస్తుంది. వారిని చంపుతానంటాడు. 'నకశ్చిన్నాపరాధ్యతి!' అంటుంది సీత – తప్పు చేయనివాడు ఉంటాడా? అంటుంది. తప్పుచేసిన వారినల్లా చంపుతే లోకంలో మనిషి మిగలడు. అయితే చేసిన తప్పును గ్రహించాలి. మళ్లీ అదే తప్పు చేయకుండటానికి ప్రయత్నించాలి.

నేను ఉర్దూను అనాడు ద్వేషించిన తప్పుకు అనువాదాలు చేసి ప్రాయశ్చిత్తం చేసుకున్నాను. పరిణత వయసులో నేర్చుకున్నదేమంటే - దేనినీ ద్వేషించరాదు. అన్నింటినీ ప్రేమించాలి. ద్వేషంలో మనసు హింస పడుతుంది. ప్రేమలో మనసు వికసిస్తుంది.

ఇంతకూ అనాటి ఉర్దూ మీది ద్వేషంతో ఇంగ్లీషు మీడియం తీసుకున్నాను. మెట్రిక్యులేషను తెలుగు మీడియంలో వ్రాశాను. ఇంగ్లీషుతో అంత పరిచయం లేదు. పెరుమాళ్ల సంకీసలో నేనే పండితుణ్ణి. స్వంతంగానే సాధన ప్రారంభించాను. సంస్కృతమూ – సివిక్సు ఇంగ్లీషులో వ్రాయాలి. 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్న వేమన పద్యం అక్షరసత్యం అని అర్థం అయింది.

నాకు అరు బయలు – నేటికీ – ఇష్టం. టీచరుగా ఉన్నప్పుడు వీలున్నంతవరకు అరుబయట – చెట్టు కింద పాఠాలు చెప్పాను. నేను పుస్తకాలు తీసుకుని ఊరి బయట మర్రి చెట్టు క్రింద చదువుకునేవాణ్ణి. ఒకనాడు అలాగే మర్రి చెట్టు క్రింద చదివి వస్తున్నాను. ఇంటిముందు జనం కూడి ఉన్నారు. తుమ్మా శేషయ్య వారికి ఏదో వివరిస్తున్నాడు. నేను ఇంటి చేరాను. జనం నన్ను చూచి "మర్రికింద మంత్రాలు చదువుతున్నాడు" అన్నారు. నేను అబ్బురపడ్డాను. చకితుణ్ణి అయినాను. నాకు ఏమీ అర్థం కాలేదు.

"అరె! అయన్ని రానిస్తారె లేదా?" అన్న తుమ్మా శేషయ్య నన్ను అరుగు మీద కూర్చోమన్నాడు.

నాకు ఏమీ అర్థం కాలేదు. గుండె దడదడలాడింది. మనసు ఏదో అశుభం శంకించింది. దర్వాజలో కమల కనిపించింది. భీతహరిణేక్షణగా ఉంది.

నేను అరుగు మీద కూర్చున్నాను. మా అమ్మాయి ఉదయ - శేషయ్య వళ్లొంచి నా వడిలోకి వచ్చి కూర్చుంది. ఆమె ఊరంతటికీ ముద్దుబిడ్డ.

"ఏమయ్యా పంతులూ! మర్రి కింద మంత్రాలతోని ఊరికి కీడు చేస్తవా? నీ పళ్లు పీకుతమని వచ్చిన్రు వీళ్లంత" అన్నాడు శేషయ్య.

పరిస్థితి అవగతం అయింది. నేను మర్రి కింద శ్లోకాలు చదవడాన్ని మంత్రాలుగా విన్న బాటసారి ఊళ్లో ఊదాడు. వాళ్లు శేషయ్యను తీసుకొని నామీదికి దండయాత్రకు వచ్చారు. అర్థం అయింతరువాత నాకు నవ్వు వచ్చింది. పెద్దగా నవ్వాను. నా వడిలో ఉన్న ఉదయ నవ్వింది. శేషయ్య నవ్వాడు.

మా నవ్వులకు జనం అబ్బురపడ్డారు. లిప్తపాటు తేరుకోలేదు.

"ఊరికి పీడ ముంచుకొస్తాంటె ఎందు కట్ల నవ్వుతారు?" నలుగురు అన్నారు.

"ఏదేని మంత్రాలు గింత్రాలని భయపడి చస్తాను విసిరి, సారు విడమర్చి చెప్పతరు" అన్నాడు శేషయ్య.

నాకు మంత్రతంత్రాల మీద నమ్మకం లేదనీ, నాకు రావనీ వివరించి - నా చదువు సంగతి చెప్పి, 'అస్త్యుత్తరాస్యాం దిశిదేవతాత్మా' అనే కుమార సంభవంలోని కాళిదాసు శ్లోకం చదివి వినిపించాను.

"ఎరకలేక అన్నం సారూ! ఏమనుకోవద్దు" అని జనం అంతా వెళ్లిపోయారు.

"వదినమ్మా! అన్నగారు గండం నుంచి బయట పడ్డడు. చాయ్ తాగించెడిదాక కదిలెడిదిలేదు" - శేషయ్య డిమాండు.

"తప్పిన గండానికి ఇంత చిన్నకోరిక కోర్తవనుకోలేదన్నా! ఉండు, షక్కర్ చాయ్ తెస్త" అని కమల లోనికి వెళ్లి చాయ్ చేసి తెచ్చింది.

"ఆడబిడ్డ సొమ్మమ్మ, ఇంతకంటె ఎక్కువ అరగది" అని చాయ్ అందుకున్నాడు శేషయ్య.

**నా గుండె చెమర్చింది! ఎక్కడి అన్న? ఎక్కడి చెల్లెలు? ఇంతటి అనుబంధాలు ఏవీ ఈనాడు? ఎలా ఆవిరి అయిపోయాయి!**

చినగూడూరు నుంచి మా మాతామహులు చాకలి వానితో పెండ్లి పత్రిక పంపారు. వారి దత్తపుత్రుని పుత్రిక యాదగిరి లక్ష్మి వివాహం - రావలసిందని. అప్పటికి పెండ్లి పత్రికలు పోస్టులో పంపడం ఎరుగరు. పత్రికలు పంపినవారు చాకలివానికి తవ్వెడు బియ్యం - ఉప్పు - మిరపకాయ - చింతపండు ఇచ్చేవారు. దారి బత్తెం కావచ్చు. పత్రిక అందుకున్నవారు మళ్లీ ఆ విధంగానే ఇవ్వాలి. పంపిన వారికి - అందుకున్నవారికి అనుబంధం అనిపించేది. తెచ్చినవానికి పూట గడిచేది. అప్పుడు అన్నీ ప్రత్యక్షంగా జరిగేవి. ఇప్పుడు పోస్టుద్వారా ఉత్తరాలు అందుతాయి. అనుబంధాలు కనిపించవు. ఇప్పుడు అనుబంధాల పనీ లేదు! మనిషి యంత్రమే కదా?

మాతామహులు గోవర్ధనం భట్టరాచార్యులవారు పెద్దవారయినారు. వారిని చూడాలి. కమలకు మా తాతయ్యనూ - తామరల చెరువునూ చూపాలి. ఎద్దుల బండి తీసుకున్నాం. నిండు పున్నమి - పండు వెన్నెల్లో బయలుదేరాం. వెన్నెలంటే నాకు ఎంతో ఇష్టం. ఇప్పటికీ కృష్ణపక్షపు వేకువ వెన్నెల్లో వాకింగు చేస్తాను.

పరువపు మనసు, పండు వెన్నెల, పాలలో తానమాడుతున్న ప్రకృతి. పక్కన కమల. పసిపిల్ల ఉదయ. బండికి గూడు వద్దన్నాను. చుక్కలకింద పయనం. బండివాని జానపదగీతం. మనసు పురి విప్పింది. ఆనందం ఆటలాడింది.

"పల్లెల అందం చూడాలంటే
పాల వెన్నెలలు పురి విప్పాలి" అనే గేయం గొణిగాను.

ఆనందం ఉర్రూతలూగుతూ సాగిపోతున్నాం. సరిగ్గా మా ఎదుట ఈతచెట్ల పొద నిప్పులు గుమ్మరించింది. నిప్పు రవ్వలు గంపతో గుమ్మరించినట్లు పడుతున్నాయి.

బండి మనిషి బండిని నిలిపాడు. 'కొరివి దయ్యం నిప్పులు కుమ్మరిస్తున్నది. ఎట్ల తిరిగినా మల్ల ఈడికే వస్తం. బండి ఇప్పుత. పొద్దు పొడిచినంక పోదాం' అన్నాడు.

అమృతభాండంలో విసపుచినుకు పడినట్లయింది. నాకు భయం కాలేదు. నిప్పుల గుమ్మరింత అందంగా ఉంది. దయ్యాలు లేవని బండి మనిషికి చెప్పి ప్రయోజనం లేదు. భగవంతుని మీద భారం వేసి నడుద్దామన్నాను. ఒక చిన్న అబద్ధం ఆడాను నాకు మంత్రాలు వచ్చు అన్నాను.

బండి సాగింది. మేము ఈత పొదలోంచి సాగుతున్నాం. ఈతచెట్ల శిఖరాన నిప్పంటుకుంది. ఒక గణుపు వరకు కాలగానే రాలుతున్నది. నిప్పంటుకున్న ఈత పీచు నిప్పులు గుమ్మరిస్తుంది. బండివాడు అది నమ్మలేదు. బాట సాగుతున్నది. నాకు మంత్రాలు వచ్చునని నమ్మాడు.

ప్రశాంతత, వెన్నెల, పిల్లగాలి, మౌనరాగం, బండి – చక్రాల చప్పుడుతో, మెల్లమెల్లగా సాగుతున్నది. ఉదయ నిద్రలోనికి జారుకుంది. కమలకు ప్రకృతి పరవశత్వం వివరిస్తున్నాను. ఎద్దుల మువ్వలు ఒక్కసారి ఘల్లుమన్నాయి, ఎద్దులు నిలిచాయి!

"మెకం నిలపడ్డది. చూడుండి" – బండివాని స్వరంలో భయం బుసలు కొడుతున్నది.

అటు చూచాను. బండికి ఎదురుగా – బాటమీద – చిరుతపులి తిష్ఠ వేసింది. వెన్నెలలో స్పష్టంగా కనిపిస్తుంది. కళ్లు మెరుస్తున్నాయి. నాలుకతో మీసాలు దువ్వుతున్నది. ఠీవిగా కూర్చున్నది. రాజసం వలకబోస్తున్నది.

పులి ఎదుట మేము!

మా ఎదుట పులి!!

మేము బలహీనులం, నిస్సహాయులం, ఏం చేయగలం? కమల బెదిరిపోయింది. ఉదయను ఉదరమున దాచుకుంది. తల్లి! తాను బలి అవుతుంది!! బిడ్డను రక్షిస్తుంది!!!

నా మనసులో భయపు చీకట్లు అలముకున్నాయి. అర్థం కావడం లేదు. చేష్టలు ఉడిగాను.

"మంత్రాలు చదువుండ్రి" – బండి మనిషి మెల్లగా అన్నాడు

కమలలో దుఃఖం పొర్లుతున్నది

నాకు గజేంద్రుడు గుర్తుకు వచ్చాడు. చేతులు జోడించి, కళ్లు మూసుకున్నాను. మెల్లగా చదివాను:

"లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె, బ్రాణంబులున్
రావుల్ దప్పెను, మూర్ఛవచ్చె, దనువున్ డస్సెన్, శ్రమంబయ్యెడిన్

నీవేతప్ప నితఃపరంబెరుగ, మన్నింపన్‌దగున్ దీనుసిన్
రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!"

కమలను గట్టిగా పట్టుకున్నాను. కూర్చున్నాను. పులి కదల్లేదు. కూర్చున్నది. భీతావహం. భయం. బుగులు. మౌనప్రార్థన. కాల బిందువులు క్రమంగా రాలుతున్నాయి.

పులి వళ్లు విరుచుకుంది. వట్టి దౌర్భాగ్యులు అన్నట్లు ఒక చూపు చూచింది. పక్కనున్న 'కోతులగుట్ట' వైపు దర్పంగా సాగిపోయింది. మా ప్రాణాలు మరల ఎదల్లో చేరాయి. ఎద్దులు మువ్వల సవ్వడితో సాగాయి. గూడూరు తాతయ్య ఇంటికి చేరాం. తాతయ్యకు విషయం సాంతం వివరించాను.

'రంగడూ, నీవు ధన్యుడవురా! ఆ పరాత్పరుడు నాస్తికులనే రక్షించుతాడు. వాడు రావణుని – శిశుపాలుని – హిరణ్యాక్ష హిరణ్యకశిపులను రక్షించలేదా?!' అన్నారు.

యాదగిరి లక్ష్మి అందాల రాశి. ఆమెను చూస్తే 'అప్సరసలు ఇలాగే ఉంటారు' అనిపిస్తుంది. ఆమె మాకు మరదలు. మా అన్నయ్యకు ఇమ్మని అడుగుతే "ఏమున్నదని ఇస్తాం" అన్నారు మా మామ – అత్తా. ఇప్పుడు ఆమెను చేసుకోవడానికి వచ్చినవాడు కట్నం కక్కుతేగాని చేసుకోనని అలిగాడు. అందరూ సతమతం అవుతున్నారు.

నాకు ఆవేశం వచ్చింది. అతని దగ్గరికి ఉరికాను. "నా మరదలు దివి నుంచి భువికి వచ్చిన అప్సరభామ. నీవు ఎదురు ఇచ్చి చేసుకోవాలి. నీవు వదులుకో – ఈ ముహూర్తానికే నేను చేసుకుంటా" అన్నాను.

పెళ్లి కొడుకు జంకాడు. కదలి వచ్చాడు. పెళ్లి మామూలుగా జరిగింది. కట్నం తరువాత వసూలు చేశాడు. అది వేరే సంగతి. ఇప్పుడు యాదగిరి లక్ష్మి పిల్లలు – మనుమలతో కళకళ లాడుతున్నది.

పెళ్లి జరిగింతరువాత కమలను – ఉదయను తీసుకొని బయలుదేరాను. అది ఆ ఊరికి – అప్పటికి – అబ్బురం. కమలకు మా ఇల్లు చూపించాను. చిన్నతనంలో ఆడుకున్న జోడు చింతలనీడ – పడివున్న గుడిస్తంభం చూపాను. నాతో ఆడుకున్న నరసింహాను పరిచయం చేశాను. తామరలు చూడడానికి చెరువుకు చేరాం. చెరువు బోసిగా ఉంది. రిక్తంగా ఉంది. వెలవెల పోతున్నది. తామరలు లేవు. చెరువు కట్ట మీద మోదుగులు లేవు. కట్ట క్రింద నాగజముళ్లు లేవు. రాకుంటే బావుండేది. కనీసం మనసులో ఆ దృశ్యం మిగిలేది అనిపించింది.

మళ్లీ రాత్రి వెన్నెల్లో బయల్దేరాం.

తాతయ్యకు పాదాభివందనాలు చేశాం. తాతయ్య నన్ను కౌగిలించుకున్నారు. "వాడు పెద్దవాడయిండు, నువ్వన్న వచ్చినవు. సంతోషం. మళ్లచూస్తనోలేదో" అని బావురుమన్నారు.

అంతటి ధీరుడు క్రుంగిపోయాడు. ఓదార్చడం మా శక్యం కాలేదు. "ఎందుకట్లంటవు తాతయ్యా, మళ్ల వస్తగదా!" అన్నాను.

"రంగడూ! మళ్లరావటం లేదురా! అమ్మమ్మపోతే వచ్చిన్ను గనకనా?" అన్నారు.

ఈ తడవ నా గుండె చెరువయింది. తాతయ్యమీద పడి భోరుమన్నాను. కమలా – ఉదయా ఏడ్చారు.

గ్రామస్తులు ఓదార్చారు. కన్నీటితో కదలరాదన్నారు. కళ్లు కడిగించారు. బండి ఎక్కించారు. తాతయ్య సహితంగా అందరూ ఊరి బయటిదాకా వచ్చారు.

"రంగడూ! ఆ శ్రియఃపతి నీయందున్నాడు. 'సుఖాస్తుతే పంథ్యాః' – మార్గము నీకు సుఖప్రదము అవుతుంది" అని తాతయ్య చెమ్మగిలిన కనులతో నిలచిపోయారు. మా బండి కనుచూపుమేర దాటేంతరువాత కదిలారు.

వారు పెద్దలు. మలినము ఎరుగని మనసున్నవారు. తాతయ్య మాట శతధా సత్యమయింది. తాతయ్య పరమపదించిన విషయం. మాకు తెలియపరచలేదు – మేము అస్తి అడుగుతామని! తండ్రి చావు తెలిసి వెళ్లిన మా అమ్మను అభిమానించలేదు.

## కరువు:

ఆ సంవత్సరం కరువు. త్రాగేనీరు దొరకడం గగనం అయింది. కరువులు మనకు సర్వసాధారణం. పురాణాలలో కరువులు కథలు అనేకం.

ఒకసారి పన్నెండేళ్లు వరుసగా కరువు వచ్చింది. విశ్వామిత్రునికి కాయ, గసరు, మాంసం ఏదీ లభించలేదు. ఒకనాటి రాత్రి ఒక మాలగూడెంలో – చర్మం తీసి అరగట్టిన కుక్క మాంసం కనిపించింది. కుక్కమాంసం దొంగిలిస్తుండగా మాలతను పట్టుకున్నాడు. విశ్వామిత్రుని గుర్తించాడు. 'ఇంతటివాడవు – ఈ పని చేయవచ్చునా?' అని అడిగాడు. "ప్రాణరక్షణకు ఎంతటి నీచ కార్యమైన చేయవచ్చు. ఇప్పుడు దొంగిలించడం – కుక్కమాంసం తినడం అనే రెండు పాపాలూ చేస్తున్నాను. నీవు స్వచ్ఛందంగా నాకు మాంసం ఇవ్వు. ఒక పాపం తప్పుతుంది రెండో పాపం తపస్సు చేసి తీర్చుకుంటాను" అని విశ్వామిత్రుడు కుక్క మాంసం తిని జీవించాడు.

డొక్కల కరువులో బురద తాగి బ్రతికాం అని మా పితామహులు చెప్పారు.

అంగ్రేజులు రైళ్లు మున్నగు రవాణ సౌకర్యాలు కలిగించింతరువాత – ధాన్యం తరలింపు సాధ్యం అయింది.

ఆ సంవత్సరపు కరువులో ధాన్యం పండలేదు. పెసలు – మొక్కజొన్నలు పండాయి. రూపాయికి పదిసేర్లు. మొక్కజొన్న అన్నం, పెసరు గుగ్గిళ్లతో కాలం గడిపాం.

అలాంటి స్థితిలో రష్యావారు ఉచితంగా బియ్యం పంపారు. ఒక బస్తా రష్యా బియ్యం సంకీసకు వచ్చాయి. మాకు రష్యా ఆరాధ్యదేశం. అది భూతల స్వర్గం అని మా విశ్వాసం. రష్యా బియ్యం చూచి రష్యాను చూచినట్లు పొంగిపోయాం. సర్కారువారు బియ్యం మాత్రమే పంపారు. గ్రామంలో చింతపండు – పప్పు – నూనె వసూలు చేసి, జనానికి అన్నం – పప్పుచారు పెట్టాం. వారు తింటుంటే ఎంతో ఆనందం అనిపించింది.

ఇచ్చుకోటంలో ఉన్న సంబరం పుచ్చుకోవడంలో లేదు. కరువు భయానక రూపం చూచాం. కరువు వలచి వచ్చింది. విడిచిపోదు. మనుషులు ఎట్లాగో బ్రతికారు. పశువుల బాధ చూడలేం. బిడ్డలా చూచుకున్న గొడ్డును కసాయికి అమ్ముకున్నారు.

కరువు అనగానే ఏవో నామమాత్రపు పనులు నిజాముల కాలంనుంచి అమలు పరుస్తున్నారు. నేటి సంక్షేమ రాజ్యంలో కరువు వచ్చిన చోట – కనీసం ఓటుకోసం

– అనేక కార్యక్రమాలు అమలుపరుస్తున్నారు. ఆ రోజుల్లో ప్రజలకు ప్రభుత్వపుజాడ రాజధానిలో మాత్రమే కనిపించేది.

వేసవి శలవులు సరిగ్గా ఏప్రెల్ 25న మొదలయ్యేవి. మృగశిర ప్రవేశంనాడు – 7 జూన్‌కు మళ్లీ స్కూళ్లు తెరిచేవారు. ఏప్రెల్ – మే నెలల జీతాలు ముందుగానే ఇచ్చేవారు. నాకు కొంత తక్కువ రెండువందలు వచ్చాయి. అవి తీసుకుని హైదరాబాదు చేరాం. అక్కడ మా అన్నయ్య ఉన్నారు. కమల మేనమామ – అమ్మమ్మ ఉన్నారు. ఆనాటి హైదరాబాదు వాతావరణం ఎంతో అనుకూలంగా – హాయిగా ఉండేది. ఎండలు ఉండేవి కావు. కాస్త ఎండవస్తే సాయంత్రానికి ఒక జల్లు వచ్చేది. వేసవి హైదరాబాదులో గడపడం ఒక అనుభవం! గండిపేట నీళ్లు మధురములు. ఆరోగ్యదాయకములు. అందుకే "గండిపేట్‌కా పానీ – హైదరాబాద్‌కీ బిర్యానీ" అని సామెత.

నేను అన్నయ్య ఇంట్లో ఉన్నా సాహిత్య కార్యక్రమాలకు వెళ్లలేదు. ఇంటర్ – బి.ఏ. పాస్ కావడం నా జీవిత సమస్య. మనిషి తొలి బాధ్యత కుటుంబం అని నా అభిప్రాయం. భార్య – పిల్లలను నిర్లక్ష్యం చేసి – బయట పేరు సంపాదించడం బాధ్యతారాహిత్యం.

"మైఁ ఉన్‌కె మహఫిల్‌గరమ్‌సె కాంప్ జాతాహూఁ
జో ఘర్‌కో ఫూంక్ కర్ దున్యామే నామ్ కర్తేహైఁ" అంటాడు ఇక్బాల్.
(ఇంటిని గాలికి వదిలి లోకంలో పేరుకోసం పాకులాడ్తారు.
అలాంటివారి సావాసం అంటే ఎందుకో నాకు వణుకు.)

శలవులు. వేరే పనులు లేవు. ఇంటర్ చదువులో నిమగ్నుణ్ణే అయినాను. నేను సబ్జక్టులన్నింటినీ పరిపూర్ణంగా అధ్యయనం చేస్తాను. చాన్సుకు ఏదీ వదలను. పైగా చెప్పేవాడు లేడు. ఎక్కువ కృషి చేయాల్సివస్తుంది. అందుకోసం అది బాగా వంట పడ్తుంది. నేను పాఠంలో లీనం అయిపోతాను. మనసుకు ఎక్కింది మరువను.

కమలతో కలిసి ఒకటి రెండు సినిమాలు చూడ్డం. ఉదయను బాగే–ఆమ్ అంటే, పబ్లిక్ గార్డెనుకు తీసికెళ్లడం తప్ప మిగతా సమయం అధ్యయనంలోనే గడిపాను. ఆ రోజుల్లో పబ్లిక్ గార్డెన్‌లోనే జంతు ప్రదర్శనశాల ఉండేది. అది ఒక చిన్న అరణ్యంలా ఉండేది. భవనాలు లేవు. మొదట్లో పారిశ్రామిక ప్రదర్శన అక్కడే జరిగేది.

శలవులు అయిపోనున్నాయి. గార్లకు బయలుదేరాం. కమల అమ్మమ్మ రాగమ్మగారు మా వెంట వచ్చారు. గార్ల ఇంటికి చేరుకున్నాం. సాయంకాలం అయింది. తెల్లవారి సంకీస ప్రయాణానికి బండి మాట్లాడుకున్నాం.

మా ఇంటి బావి – ఎన్నడూ ఎండనిది – ఎండిపోయింది. రాగమ్మగారు స్నానం చేస్తానంటుంది. నీళ్లు తాగడానికే కరువు. ఆమె పెద్ద మనిషి. కొంత చాదస్తం. ఏటికి వెళ్తానంటుంది. ఏరు ఎండిపోయింది. ఆమెది మొండి పట్టు. వదలదు. మా ఇంటిముందు వారింటి బావిలో కొద్దిగా నీరుంది. అక్కడికి వెళ్లింది. తలమీంచి స్నానం చేసింది. తడి బట్టల్తో వచ్చింది. దేవుణ్ణి నానా శాపనార్థాలు పెట్టింది. 'నీ బిడ్డలను నువ్వే చంపుకుంటవా – ముండాకొడక. తెల్లారేవరకు వానపడెయ్యకుంటె ఇక్కడనే ప్రాణాలు విడుస్త' అన్నది. వాకిట్ల కూలబడ్డది.

రాగమ్మగారిని తీసుకొచ్చినందుకు బాధపడ్డాం. చిరాకుపడ్డాం. అమ్మా మేమూ బ్రతిమిలాడాం. చుట్టుపక్కలవాళ్లు వేడుకున్నారు. ఆమె వినలేదు. ఆ రాత్రి మేమూ భోజనాలు చేయలేదు. పడుకున్నాం. కొంత చిరాకు. కొంత మూర్ఖత్వం మీద కోపం. నిద్ర రాలేదు.

రాత్రి గడుస్తున్నది, అమాంతంగా ఆకాశంలో కారు మబ్బులు కమ్ముకున్నాయి. చల్లని గాలి రివ్వున వీచింది. నేను బయటికి వచ్చాను. రాగమ్మగారు ఆరుబయట నిశ్చలంగా – శిలాప్రతిమలా కూర్చుని ఉంది. మెరుపులు – ఉరుములు అట్టహాసంగా ఉన్నాయి. చిటపట చినుకులు మొదలయినాయి. బోరున వాన!వాన!వాన!! ఎంత వానంటే – చెప్పలేనంత కుంభవృష్టి!

రాగమ్మగారు వానలోనే పడి ఉంది. కుంభవృష్టిలో సహితం కదలదు. రాతి బొమ్మలా నిశ్చలంగా కూర్చుంది. తెల్లవారింది. వాన వెలిసింది. నంగనాచిలా పొద్దుపొడిచింది. **'వినడా దేవుడు! ఎందుకు వినడు!! చెప్పటం చాతకావాలె'** అని అప్పుడు లేచింది రాగమ్మగారు. స్నానం చేసి చాయ్ తాగింది.

విచిత్రం ఏమంటే – రాత్రి ఎండిపోయివున్న ఏరు పొంగి ప్రవహించింది. బండి మనిషి బండి ఏరు దాటదు అన్నాడు. నిలిచి పోయాం. తెల్లవారి ప్రయాణం సాగించాం. అప్పటికీ బండి సగం మునిగిసాగింది. నడియేట్లో అమ్మమ్మ ఏటికి పసుపుకుంకుమ అర్పించింది.

**మనోబలం - సంపూర్ణ విశ్వాసం అన్నింటినీ జయించగలవు. అయితే విశ్వాసానికి అంతబలం కావాలి!**

ఆర్. కె. నారాయణ అనే ప్రఖ్యాత ఆంగ్లరచయిత 'గైడ్' అనే నవల వ్రాశారు. అందులో ఈ విషయం స్పృశించారు. దేవానంద్ నాయకుడుగా, ఆ నవల ఆధారంగా సినిమా వచ్చింది. అందులో సన్యాసి ఆవేదనకు వాన కురుస్తుంది.

భారతీయ సంప్రదాయంలో పంచభూతాలకు ప్రాణం ఉంది. అవీ పులకిస్తాయి. రామాయణంలో రోమపాదుని అంగరాజ్యంలో కరువు వస్తుంది. ఋశ్య శృంగుని రాజ్యంలోకి తీసుకొని వస్తారు. వానలు పడ్తాయి. కరువు తీరుతుంది.

మహాభారతంలో అజ్ఞాతవాసంలో ఉన్న పాండవులు ఉన్న ప్రదేశం కనిపెట్టా లనుకుంటాడు దుర్యోధనుడు. ధర్మరాజు ఉన్నచోట వానలు పడి సస్యశ్యామలంగా ఉంటుంది అంటాడు భీష్ముడు.

రాగమ్మగారి వృత్తాంతంతో ప్రభావం అయి, నా నవల "మోదుగుపూలు"లో ఇలాంటి సన్నివేశం చేర్చాను. 'కరువులో జనం చస్తున్నారు. నా గుమ్ములో గింజెందుకు?' అని వీరయ్యగారు గరిసెల్లో గింజ పంచుతుంటారు. అప్పుడు మబ్బులు కమ్ముకొని వాన కురుస్తుంది. 'మంచి మనసుకు ప్రకృతి పులకిస్తుంది' అంటాడు నా ఛాయగల నాస్తిక నాయకుడు రఘు.

సంకీస చేరుకున్నాం. స్కూలు, మామూలు కార్యక్రమం. చెరువు నిండింది. చెరువు కట్టకింద నాగజముళ్లు అందంగా పూచాయి. కమల గర్భం దాల్చింది. సుమారు ప్రసవ దినాలు. కాన్పు ఇక్కడే జరుగుతుందని, అత్తగారిని రమ్మని వ్రాశాను. ఈలోగా కమలకు రక్త విరేచనాలు మొదలయినాయి. రాగమ్మగారు

కమలను తీసుకొని హైదరాబాదు వెళ్లిపోయింది. అప్పుడు తన పిల్లలతో మా అత్తగారు దిగారు. ఆమెకు నలుగురు మగ పిల్లలు. పల్లెలో ఉన్నారు. చదువు సంధ్యలు లేవు. రెండవవాడు రమణను బలవంతంగా నా దగ్గర ఉంచుకున్నాను. మిగతా పిల్లలతో అత్తగారు వెళ్లిపోయారు.

రమణను నేను ఉంచుకొని చదివించడం అతని జీవితంలో ఒక ముఖ్యమైన మలుపు. అతను చదువుకున్నాడు. వృద్ధిలోనికి వచ్చాడు. మిగతా పిల్లలకూ కొంత సాయం చేశాను. అంతా బావున్నారు. తాను నాటిన మొక్క పూస్తుంది, కాస్తుంది. అప్పుడు ఆనందం కలుగుతుంది.

వ్యక్తుల జీవితాల్లో ఇలాంటి మలుపులు ఉంటాయి. పడవ సాగిపోయి ఉంటే ప్రకాశం పంతులు ఆంధ్రకేసరి అయ్యేవారు కారు.

ఒకనాడు వార్త వచ్చింది. కమల కన్నది – ఆడపిల్ల. మళ్లీ ఆడపిల్ల అని నేను బాధ పడలేదు. నాకు ఆడ – మగ సమానమే. మా చెల్లెళ్ల విషయంలోగాని – మా పిల్లల విషయంలోగాని ఇసుమంత వ్యత్యాసం చూపలేదు, చూపడం లేదు, చూపను.

ప్రకృతిని మించిన వింత ఏ లోకంలోనూ లేదు. తనకు బిడ్డ కలిగిందంటే తల్లిదండ్రుల మనసుల్లో సముద్రాలు పొంగిస్తుంది. ఆనంద డోలికల్లో ఊపుతుంది. ఆతురత పెంచుతుంది. పరిగెత్తాలి – నా కూతురును చూడాలి. ఇదీ నా తొందర, ఉరుకు, పరుగు.

ఆ రోజుల్లో వాన పట్టుకుంటే వారాల కొద్ది వదిలేది కాదు. కుంభవృష్టి కురుస్తున్నది. ఏరులు, వాగులు పొంగి పొర్లుతున్నాయి. సంకీస జల దిగ్బంధంలో ఉంది. అయినా ఉరకాలె. పట్నం చేరాలె. కమలనూ – పాపనూ చూడాలె. అందరూ వారించారు. ప్రాణాలతో పట్నం చేరవు అన్నారు. ఎవరూ తోడు రాము అన్నారు.

సాహసం చేశాను. ప్రేమ అలా చేయించింది. ప్రేమ ప్రేయసీ ప్రియుల మధ్య మాత్రమే ఉంటుందనడం వట్టి భ్రమ. లోకం సొంతం ప్రేమ మీద ఆధారపడి ఉన్నది - సర్కారు మీద కాదు. ప్రేమ పర్యవసానం చూడదు. ఫలితం ఆశించదు. ఏ ఫలితం ఆశించి మనం పిల్లలను ప్రేమిస్తున్నాం? త్యాగాలు చేస్తున్నాం?

సాహసంగా ఒక గొడుగుతో వంటరిగా బయలుదేరాను. ఈదురుగాలితో వాన ఎడా–పెడా కొడుతున్నది. కాలిబాటలు కాలువలయినాయి. చెప్పులు తొలిదెబ్బకే కొట్టుకుపోయాయి. గొడుగు గాలికి ఎగిరిపోయింది. వాన ముఖానికి కొడుతున్నది. నిర్మానుష్యం. దుఃఖం ముంచుతున్నది. ఉరుములు, మెరుపులు, ఫెళఫెళారావాలు. ఎక్కడో పిడుగు పడింది.

నేను సాగుతున్నది సూటిబాట కాదు. చుట్టుబాట. ఈ బాటలో కాలవలు తప్ప నదులు లేవు. రామాపురం వద్ద రైలు వంతెనమీంచి గార్ల చేరుకోవాలి.

మబ్బులు చిమ్మచీకట్లు చేశాయి. వానలో పూర్తిగా తడిశాను. జల్లు దంచి కొడుతున్నది. అయినా ఆగలేదు. వంటరిగా సాగుతున్నాను. పిల్ల కాలువ

అడ్డం వచ్చింది. మామూలుగా పిల్ల కాలవే! అప్పుడు వాగులా సుళ్లు తిరుగుతూ పారుతున్నది. నాకు ఈతరాదు. దాని లోతు తెలియదు!

చింతచెట్టు కింద నిలిచాను. వణకుతున్నాను. పిట్టలు కూడా చెట్టు కొమ్మల్లో తల దాచుకున్నాయి. చలి!

కూపోదకం, వటచ్ఛాయా, తాంబూలం, తరుణీకుచం
శీతకాలేతు ఉష్ణంవా ఉష్ణకాలేతు శీతలం!

బావి నీరు – మర్రి నీడ – తాంబూలం – పడుచుపిల్ల చన్నులు చలికాలంలో వెచ్చగాను, ఎండకాలంలో చల్లగానూ ఉంటాయట! అవి దొరకవు సరె, కప్పు వేడి చాయ్ – ఒక్క సిగరెట్టు వున్నా ఎంత బావుండేది? అది ఊహ – వాస్తవం ముందర వాగు!

సాహసం చేశాను. వాగులో దిగాను. మునిగాను. ప్రవాహ వేగానికి కొట్టుకుపోతున్నాను. తలపైకి వచ్చినపుడు ఊపిరి పీల్చుకుంటున్నాను. చివరి గడియలు లెక్కిస్తున్నాను. దైవ కృప. ఒక చెట్టు అందింది. చెట్టు ఎక్కి ప్రాణాలు కాపాడుకున్నాను. మళ్లీ సాగాను. రామాపురం చేరాను. పరవళ్లు తొక్కుతున్న వీటని రైలు వంతెన మీంచి దాటాను. గార్ల చేరుకున్నాను.

అమ్మ నన్ను చూచింది. దడుచుకున్నది. "ఏందిర ఈ సాహసం!" అని తల తుడిచింది. పొడి బట్టలు ఇచ్చింది. వేడి వేడి చాయ్ ఇచ్చింది. రెండు కప్పులు త్రాగాను. సిగరెట్టు దమ్ము వదులుతుంటే Coffee and Cigarett are good combination as lyric and beautiful girl అన్న ఒక ఆంగ్ల రచయిత వచనాలు గుర్తుకు వచ్చాయి!

'ఎంత కన్నబిడ్డ అయితే మాత్రం ఇంత సాహసం చేస్తనా?' అని నన్ను కోప్పడ్డ అమ్మ మనవరాలిని చూడడానికి, పెసరకాయలు – మొక్కజొన్న కంకులు తీసుకొని బయలుదేరింది.

హైదరాబాదులో దిగి – ఆగాపురాలో ఉన్న కమల మేనమామ ఇంటికి పరిగెత్తాం. కమల పాపను పక్కలో పెట్టుకుని మహదానందంగా ఉంది. నన్ను చూడ్డంతో అది ఇనుమడించింది. వాస్తవంగా కమల అందం నెమరువేస్తున్నది. అయినా – ప్రకృతి చిత్రం – పాపమీదికే దృష్టిపోయింది. కాకిపిల్ల కాకికి కాదు కాని, పాప వాస్తవంగా నిండుగా – ముద్దుగా ఉంది. చూస్తూ ఉండిపోయాను.

"రంగడూ! కాలికేమో తొక్కినవు చూసుకో" అన్నది అమ్మ. నేను కాలువైపు చూచుకున్నాను. ఏమీ లేదు. ఇంతలో అమ్మ పాపను ఎత్తుకుంది. "అట్లచూడకు – కన్నవారి దృష్టి చెడ్డది అంటారు" అన్నది.

ఉదయ పక్కనే నుంచుంది. గమనించలేదు. అప్పుడు ఎత్తుకుని ముద్దాడాను.

పాపకు 'కవిత' అని పేరు పెట్టాం.

కమల తల్లిగారింటికి – నేను సంకీస వెళ్లాం.

ఆ వేసవిలో వరంగల్లు కాలేజీలో ఇంటర్ పరీక్ష వ్రాశాను. ద్వితీయ శ్రేణి – సెకండ్ క్లాసులో – పాసయినాను. ఆ రోజుల్లో సెకండ్ క్లాసే గొప్ప. అది 1954.

ఆ వేసవిలో మా రెండవ చెల్లెలు రమాదేవి వివాహం – భద్రాచలానికి చెందిన గొట్టుపుళ్ల శేషాచార్యులవారితో జరిగింది. భద్రాచలంలో 'నేనూ

లక్ష్మణాచార్యులూ కలిసి ఆడుకున్నామురా' అని నన్ను ఆప్యాయతగా దగ్గరకు తీసుకున్న ఆ మహనీయ సన్నివేశం మరువరానిది. ఆ పెద్దమనిషి అమరవాది శేషాచార్యులూ మా పితామహులు కలిసి ఆడుకున్నారట!

దాశరథివారి స్థలం అనేదాన్ని చూచాను.

చిక్కని అడవిలో కాలిబాటన నేనూ – బావగారూ, పర్ణశాల వెళ్లాం. ఆ రమణీయ ప్రదేశంలో నిజంగా సీతారాములు నివసించినట్లనిపించింది. అక్కడ గోదావరి – ప్రవాహం – మార్చుకోదు. ఎల్లకాలాల్లోనూ ఆ దీవికి నీరు ఉంటుంది. సీతమ్మ అక్కడ్నుంచే నీళ్లు ఎత్తుకుపోయిందేమో అనిపిస్తుంది. పక్కనే 'సీతవాగు' ఉంది. అక్కడ ఆ తల్లి స్నానం చేసింది. అక్కడ పసుపు కుంకుమరాళ్లు దొరుకుతాయి. రాళ్లమీద చీరలు ఆరేసిన చారలు కనిపిస్తాయి. గోదావరికి ఆ దరిన "రథంగుట్ట" మీద సీతమ్మను ఎత్తుకుపోతున్న రావణుని రథచక్రాల జాడలు కనిపిస్తాయి. జటాయువుతో యుద్ధం చేసిన చోట ఒక పెద్ద గొయ్యి కనిపిస్తుంది.

నదీతీరాన వంటరి శోకరాముని చిన్న ఆలయం ఉంది. అక్కడే పూజారి భార్యాహీనుడు కావాలట, భార్య ఉంటే చనిపోతుందట!

తరువాత కాలంలో భూకంపంలో ఆ ఆలయం కూలిపోయింది. ఈ మధ్య మళ్లీ వెళ్లాం. అడవిని క్షవరం చేశారు. నేల నున్నగా ఉంది. ఆలయం కొత్తది కట్టారు. జనారణ్యం వెలిసింది. నాటి ఆనవాళ్లు ఏమీలేవు.

ఇక్కడేనా సీతారాములు నివసించింది అనిపించింది!

## ముల్కీ-ఉద్యమం:

ఆ రోజుల్లోనే విద్యార్థులు ముల్కీ ఉద్యమం లేవదీశారు. అప్పటికి ఇంకా హైదరాబాదు రాష్ట్రమే! బూర్గుల రామకృష్ణారావుగారే ముఖ్యమంత్రి!

విద్యార్థులు – ముఖ్యంగా హైదరాబాదు నగరంలో – ముల్కీ అల్లర్లు ప్రారంభించారు. గోడల మీద "ఇడ్లీ సాంబార్ గో బాక్" అని వ్రాశారు. ఊరేగింపులు, సభలు జరిపారు. నిజాం కాలేజీ ముందు విద్యార్థుల మీద పోలీసు కాల్పులు జరిగాయి. అది అంతటితో సర్దుమణిగింది. ఇది విద్యార్థులలో అసంతృప్తి – అసహనం వల్ల వచ్చిన ఉద్యమం – అల్లరి. ఇందుకు కారణాలు లేకపోలేదు:

1. తెలంగాణంలో తొలి ఎన్నికల తరువాతనే – 1952 లో కల్లోలాలు తగ్గాయి. ప్రశాంత పరిస్థితులు నెలకొన్నాయి. విద్యావిషయికంగా అప్పుడే కన్ను తెరుస్తున్నది. H.S.C తెలుగు బాచ్ ఆ సంవత్సరమే వచ్చింది.
2. విద్యాసంస్థలు ప్రారంభించడం – విస్తరించడంలో ఒక ప్రజా ఉద్యమం వచ్చింది. అయితే అది ఇంకా దిగువస్థాయిలో – ఏడు ఏనిమిది తరగతుల వరకే సీమితం అయింది. కాలేజీల సంఖ్య నైజాంనాటికంటే పెరుగలేదు.
3. నిజాం కాలంలో తెలంగాణంలో హిందువులకు ఉద్యోగాలు లభించవు అని ప్రజలు తేల్చుకున్నారు. వారు తమ వృత్తులలోనే స్థిరపడ్డారు. మానసికంగా ఉద్యోగ అన్వేషణ సంసిద్ధత అప్పుడప్పుడే మొదలయింది.

4. నిజాం నవాబు ముస్లిముల సహితంగా తన ప్రజలను నమ్మలేదు. ఈ న్యూనతాభావమే అనాటి ముస్లిముల్లో అలజడి కలుగచేసింది. ఆ ఫలితంగానే ముల్కీ నిబంధనలు వచ్చాయి. స్వాతంత్ర్యం వచ్చింది కాబట్టి యువకులు ఉద్యోగాలు తమ హక్కు అని భావించారు.

అటు మద్రాసు అంధ్రంలోని పరిస్థితులు ఇందుకు భిన్నంగా ఉన్నాయి:

1. అక్కడ తెలుగులో విద్య ప్రారంభం అయి చాలకాలం అయింది. స్వచ్ఛంద విద్యాసంస్థలు అనేకం వెలిశాయి. విద్యావంతులు ఎక్కువయినారు. ప్రభుత్వ ఉద్యోగం ప్రతిష్ఠాకరం అయింది. చదువుకున్నవారు ఉద్యోగాలకు ఎగబడ్డారు. ఉద్యోగాలు కరువయినాయి. ఉద్యోగాలకోసం అర్రులు చాస్తున్నారు.

2. పోలీసు చర్య జరిగింది. భారత ప్రభుత్వం నిజాం అధికారులను నమ్మలేదు. తాసిల్దారు స్థాయినుంచి పై ఉద్యోగాలకు అధికారులను మద్రాసాంధ్రం నుంచి దింపింది. వారు – దొడ్డిదారిన ముల్కీలు సాధించి, తమ వారిని తెలంగాణం ఉద్యోగాల్లో నింపారు.

3. నిరుద్యోగులయిన మద్రాసాంధ్ర యువకులు తెలంగాణం మీద పడ్డారు. వారికి తెలిసినన్ని ఎత్తులు స్థానిక యువకులకు తెలియవు. వారు ముల్కీలు – ఉద్యోగాలు – సులభంగా సాధించగలిగారు. స్థానికులకు ముల్కీ సాధించడమే కష్టం అయిపోయింది.

ఈ పరిస్థితుల్లో అసంతృప్తి – అసహనం – న్యూనతాభావం – అభద్రత – తమకు ఇక ఉద్యోగాలు దొరకవనే అతురత విద్యావంతులయిన – కానున్న విద్యావంతుల్లో అలజడికి కారణం అయింది. అల్లర్లు చెలరేగాయి.

ఇక్కడ ఒక ప్రకృతి సూత్రం గమనించాలి. తమిళులు తమకు ఉద్యోగాలు రానివ్వడం లేదని మద్రాసు ఆంధ్రులు ఆంధ్రరాష్ట్రం సాధించారు. వారు ఉద్యోగాన్వేషణలో తెలంగాణ యువకులమీద తమ తెలివితేటలు చూపారు.

నీరు పల్లానికి ప్రవహిస్తుంది!

జనం ఉద్యోగాలు ఉన్నచోటకి ఉరుకుతారు!!

ఇప్పుడు విదేశాలకు ఉరుకుతున్నారు!!!

విచిత్రం అయిన విషయం. స్వాతంత్ర్యం వచ్చి నలభయిఏడేళ్లయింది. రాజ్యాంగంలో ఎన్నడో సమానతా సూత్రాన్ని పొందుపరచుకున్నాం. ఇప్పుడు సుమారు అన్ని రాష్ట్రాల్లోనూ – బూజుపట్టిన ముల్కీవంటి – స్థానిక నిబంధనలు ఏర్పడినాయి!

మన నడక ముందుకా? వెనక్కా? అలోచించాలి!

## డోర్నకల్లు:

నేను ఇంటర్ పాసయ్యాను. ఆ రోజుల్లో ఇంటర్ పాసయినవారే అరుదు. డోర్నకల్లు స్కూల్లో అదే సంవత్సరం ఎనిమిదవ తరగతి ప్రారంభించారు. డోర్నకల్లుకు నా అవసరం ఉంది అని మిత్రులు గండె మల్లికార్జునరావుగారు భావించారు. నన్ను పెరుమాళ్ల సంకీస నుంచి డోర్నకల్లుకు బదిలీ చేయించారు. చార్జి ఇవ్వడం అనే

లాంఛనానికి కాదు – ఆ ఊరి అనుబంధం – ప్రజల అనురాగం ఆత్మీయతలకు కృతజ్ఞతలు చెప్పడానికి – కాలినడకన – సంకీస చేరుకున్నాను.

సంకీసలో నా బదిలీ వార్త అప్పటికే వ్యాపించింది. స్కూలుకు వెళ్లాను. పిల్లలు నన్ను కదలనివ్వనన్నారు. అప్పటికి "ఘెరావ్" అనే పదం లేదు. అంత పని చేశారు. తుమ్మా శేషయ్య నాయకత్వాన ప్రజలు గుంపులుగా వచ్చారు. 'వాళ్లకే బలం ఉందా? మాకూ ఉంది. బదిలీ రద్దు చేయిస్తా' మన్నారు. వారికి నా అవసరాలు విన్నవించాను.

1. నేను బి.ఏ. చదువుకోవాలి. డోర్నకల్లులో కొంత వీలుంటుంది.
2. నా బావమరిది రమణకు నాలుగవ తరగతి అయిపోయింది. వేరే చోట ఉంచి చదివించే స్తోమత నాకు లేదు.
3. గార్లకు అందుబాటులో ఉంటాను. అమ్మను అడుకోవడానికి వీలుంటుంది.

నా సౌకర్యాలదృష్ట్యా వారు కొంత మెత్తపడ్డారు. కాని మనసును మెలిపెట్టిన సంఘటన పెరుమాళ్లాచార్యుల వారిది. వారు అర్చకులు, పెద్దలు, విద్వత్తు గలవారు.

వారు కర్ర పట్టుకొని – నడవలేక నడవలేక – స్కూలుకు వచ్చారు. వారిని చూచి లేచి నుంచున్నాను. అందరూ నుంచున్నారు. వారు కుర్చీలో కూర్చున్నారు. ఆయాసం తీర్చుకున్నారు – అన్నారు.

"ఆ పెరుమాళ్లు నీకేమి అపకారం చేసిండని ఊరు వదిలిపోతావు నాయనా?"

నా గుండెలోని సంద్రాలు – పున్నమి చంద్రుని చూచినట్లు – పొంగాయి. అంత అభిమానం భరించరానిది అయింది. నేత్రములు సజలములు అయినాయి. పెరుమాళ్లాచార్యులవారి పాదాలమీద పడ్డాను.

"స్వామీ! అట్ల అనొద్దు. పెరుమాళ్లు ఉపకారమే కాని – అపకారం చెయ్యరు. నా స్వార్థం కోసం పోతున్న, ఆశీర్వదించండి."

"నాయనా! పాఠశాల మరికొంత అభివృద్ధి చెందిన తరువాత పోలేవా?"

శేషయ్యవారికి వివరించారు.

"పెరుమాళ్ల సంకీసకు ఇంతే ప్రాప్తం ఉన్నది. వెళ్లిరా నాయనా!" అన్నారు.

వారిని చేయిపట్టుకొని ఇంటిదాకా తీసికెళ్లాను. వారికి పాదాభివందనం చేశాను. ఆశీస్సులు అందుకున్నాను. "వెళ్లేటప్పుడు స్వామివారిని దర్శించుకుని వెళ్లు" అని పంపించారు.

విషయం గ్రహించినట్లున్నారు. మల్లికార్జునరావుగారు వచ్చారు. వారు రాజకీయులు. గ్రామస్థులకు నచ్చచెప్పగలిగారు. గ్రామస్థులు కమలను – ఉదయను – కవితను తీసుకొని వచ్చారు. కోవెలలో మాతో కళ్యాణం చేయించారు. భోగాలు చేయించారు. ఒక ఉత్సవం జరిపారు. బండివెంట ఊరి బయటిదాకా వచ్చి – పెళ్లికూతురును వలె – మమ్ములను సాగనంపారు.

నేను ఒక్కొక్కరినీ కౌగిలించుకుని శలవు తీసుకున్నాను.

మా బండి సాగిపోతున్నది

జనం ఇంకా నిలిచి చూస్తున్నారు!

నాడు నాలో కలిగిన భావోల్బణం చెప్పడానికి నేటికీ నాకు పదాలు దొరకడం లేదు!!

భావాలను సమగ్రంగా వెల్లడించగల భాష పుట్టదు!!!

డోర్నకల్లు – తోరణకల్లు – ఆనాటి దక్షిణాపథ జనజీవితానికి నాడి వంటిది. వంద ఏళ్ళక్రితం ఇల్లందు – బొగ్గుట్టలో తొలి సింగరేణి బొగ్గు గని వెలసింది. ఇల్లందును ప్రధాన రైలుమార్గంతో కలపడానికి గార్ల అనువయింది. గార్ల జంక్షన్ అవుతే జనం తెలివి మీరుతారని జాగీర్దారు అనుమతించలేదు. అందువల్ల గార్లకు కేవలం మూడు మైళ్లలో ఉన్న డోర్నకల్లు నుంచి ఇల్లందుకు రైల్వే లైను వేశారు. అక్కడి నుంచే దక్షిణా పథానికి బొగ్గు సరఫరా అయింది. అప్పుడు రైళ్లన్నీ బొగ్గుతోనే నడిచేవి. బొగ్గు నింపుకోవడానికి – గాంధీజీ బండి సహితంగా – అన్నీ డోర్నకల్లులో ఆగేవి.

జాగీర్దారు పలుకుబడితో – వారు వేటకు రావడానికి అనువుగా – గార్లలో స్టేషను ఏర్పడింది. ఆ రోజుల్లో మూడు మైళ్లలో స్టేషను ఉన్నది గార్ల మాత్రమే. స్టేషను చిన్నది. అయినా ఎప్పుడోగాని రాని జాగీర్దారు కోసం వెయిటింగ్ రూము ఏర్పాటయింది. వారు వచ్చినపుడు దిగడానికి అన్ని సౌకర్యాలు గల "రాహత్ మహల్" విశ్రాంతి గృహం సిద్ధం చేయించుకున్నారు. నవాబు వచ్చినపుడు రైలుపెట్టెనుంచి "రాహత్ మహల్" లోపలివరకు తివాచీలు పరచేవారు. వారు ఉన్నన్నాళ్ళూ – ప్రతి రోజూ – హైదరాబాదు నుంచి మంచి నీళ్లు వచ్చేవి. మరిన్ని వివరాలు "మోదుగుపూలు" నవలలో వ్రాశాను.

డోర్నకల్లులో ప్రధాన చర్చి ఉన్న విషయం మనవి చేశాను. మిషనరీలు ఒక ఆసుపత్రి – ఒక స్కూలు మున్నగు సంస్థలు నిర్వహించారు. డోర్నకల్లు ఊళ్లో పల్లె వాతావరణం – రైల్వే ప్రాంతంలో పారిశ్రామిక వాతావరణం – మిషనరీ ప్రాంతంలో మత వాతావరణం కనిపిస్తాయి.

నేను డోర్నకల్లు స్కూల్లో జాయిన్ అయినాను. ఆ రోజే ఆ స్కూలును పదో తరగతి వరకు పెంచే బాధ్యత మల్లన్న – మల్లికార్జునరావు – నాకు వప్పగించారు. కొన్నాళ్లు గార్లలోనే మకాం పెట్టాను. వచ్చిపోయేవాణ్ణి. తరువాత అది కుదరలేదు.

1. పోస్టింగు ఉన్న ఊళ్లోనే ఉండాలని ఒక నియమం. శలవు తీసుకున్నపుడు 'తర్కెముస్తఖర్' అంటే – హెడ్‌క్వార్టర్ వదిలే అనుమతి తీసుకోవలసి వచ్చేది. ఈ నియమాలు ఇప్పటికీ ఉన్నాయి. ప్రభుత్వం వాటిని మార్చదు. పాటించదు. **నియమాలు స్థావరాలు, జీవితం జంగమం. ప్రభుత్వాలకు ఇది అర్థం కాదు.**

   ఉన్న నియమాలను పాటించాలనేది నా నియమం.

2. బోధనా బాధ్యత – క్లాసులు పెంచే విషయంలో నిమగ్నత నన్ను గార్లలో ఉండనీయలేదు.

నాకు మెట్రిక్ చదువుకోవడానికి వసతి కల్పించిన అనంతరామయ్య – సీతమ్మలు నన్ను వారి ఇంట్లో ఉండమన్నారు. అయితే, మనిషి ఇరుకు కావడం అప్పుడే ఆరంభం అయింది. ఆశ జీవితానికి అవసరం. కాని, దురాశ అంకురించింది. నాకు చదువుకోవడానికి ఇచ్చిన హాలు అద్దెకు ఇచ్చారు. ఇంటికి ఒక పక్కగా ఉన్న 'పక్కా' పశువుల కొట్టంలో ఒక గదికి తడకలు కట్టించి మా నివాసానికి ఇచ్చారు. ఒకవైపు

పశువులు – ఒకవైపు మేము ఉండేవాళ్లం. అలా ఉండడానికి కొంత ఆర్థిక దుస్థితి – కొంత ఆత్మీయుల మధ్య ఉండాలనే ఆతురత కారణాలు.

కమల నాతో కష్టాలే పంచుకుంది. చిరునవ్వుతో పంచుకుంది. చిరుబుర్లాడక పంచుకుంది. వాస్తవంగా కష్టసుఖాలు సాపేక్షితాలు. ఒకరి సుఖం ఒకరికి కష్టం. అందుకు వ్యతిరేకమూ కావచ్చు.

"ఏవం వర్షసహస్రాణాం శతంవాఽహం త్వయా సహ
ప్రతి క్రమం నవేత్స్యామి స్వర్గోపి నహి మేమతః"

"ఇలా అడవిలో నీతో వందల వేలసంవత్సరాలు గడుపగలను. నిన్ను విడిచి ఉండలేను. అలాంటి స్వర్గం సహితం నాకు రుచించదు" అంటుంది సీత రామునితో.

ఆ గొడ్ల కొట్టం మాకు యమ సదనం అయింది. ఒకనాడు త్రాచుపాము కుబుసం కనిపించింది. ఆర్థిక దారిద్ర్యం. పడుకోవడానికి మంచాలు లేవు. తల్లిదండ్రుల బాధ పిల్లల గురించి. ఉదయ, కవిత గురించి విలవిలలాడాం. ఒక మిత్రుడు మంచం తెచ్చి ఇచ్చాడు. గుడ్డి దీపపు వెలుగులో ఒకనాటి రాత్రి పాము కనిపించింది. కమల బావిలో చేద వేసింది. కొట్టం చూరులో పాము కనిపించింది. అది గిలకలేని బావి. భయానికి మొగ్గితే బావిలో పడాల్సిందే! చాద బావిలోకి వదిలింది. పరిగెత్తింది. చాద బావిలో పడిన చప్పుడుకు పాము పారిపోయింది.

కవిత ముద్దుగా ఉండేది. ఆమెను ఎత్తుకుంటే ముసిముసి నవ్వేది. నవ్వినట్లూ, నవ్వనట్లూ ఉండేది. బొద్దుగా పెరుగుతున్నది. ముచ్చటగా ఉండేది. ఉదయకు కవిత అంటే ప్రాణం. చుట్టుపట్లవాళ్లు ఎప్పుడూ ఆమెను ఎత్తుకొని తిరిగేవారు.

ఒకనాడు చాపలు అల్లుకునే బిచ్చపుది – చంకన బిడ్డతో బిచ్చానికి వచ్చింది. కమల కవితను ఎత్తుకుని బిచ్చం వేసింది. "అమ్మా! బిడ్డకు తెల్ల కామెర్లు. కనపడటం లేదా?" అన్నదా బిచ్చగత్తె.

కమల గుండెలో గునపం దిగింది. వెంటనే నాకు కబురంపింది. నేను ఇంట్లో వాలాను. మిషను అస్పత్రికి తీసికెళ్లాం. ఇంజక్షను ఇచ్చాడు. తగ్గుతుందన్నాడు. తెల్లవారి మళ్లీ తీసుకురమ్మన్నాడు. ఆ రాత్రి కవితకు ఆయాసం ఎక్కువయింది. మరో డాక్టరు మిత్రునికి చూపించాం. మందు అక్కర్లేదు, తగ్గుతుంది అని బొంకాడు.

**డాక్టర్లు, వకీళ్లు నిజం చెప్పరు. ఒకడు చచ్చేవరకు బతుకుతావంటాడు మరొకడు ఓడేవరకు గెలుస్తావంటాడు.**

కవిత ముసి నవ్వడం తగ్గింది. ముంచుకుని పడుకుంటూంది. అది మా మనసులకు మసి పట్టించింది. కమలకూ – నాకూ మనసుల్లో తుఫానులు చెలరేగుతున్నాయి. కమల కుమిలిపోతున్నది. నా బాధ వ్యక్తం కానిచ్చి ఆమెను మరింత బాధపెట్టరాదని నేను మేకపోతు గాంభీర్యం ప్రదర్శిస్తున్నాను. ఆమె స్థితీ అలాగే ఉంది.

పరిణామం – సుమారుగా – వ్యక్తం అవుతున్నది. అయినా శక్తిహీనులంగా – నిస్సహాయంగా – నిర్వీర్యులంగా నిలిచి ఉన్నాం. విధి ఎంత బలీయం అయిందో – మనిషి ఎంత బలహీనుడో అవగతం అవుతున్నది.

కవిత ముసినవ్వడం లేదు!

మనసులో చీకట్లు ముసురుతున్నాయి!!

ప్రయత్నం మానలేదు. మందులు ఇస్తున్నాం.

అమ్మలక్కలు వస్తున్నారు. మంత్రాలు వేస్తున్నారు. దిష్టి తీస్తున్నారు. ధైర్యం చెపుతున్నారు.

మేము ఉన్నది పశువుల కొట్టంలో. తడకకు అవతలి పక్క ఒక ఎద్దు మూలుగుతున్నది. ఆ సాయంకాలం కవిత కోలుకుంటున్నట్లనిపించింది. ముసినవ్వింది. కొంతలో కొంత ధైర్యం వచ్చింది.

లాంతరు వెలిగించి ఉంచాం. ఉదయ నిద్రపోయింది. తడక అవతల ఎద్దు గురకపెట్టున్నది. మొరపెడ్తున్నది. కవిత – లాంతరు వెలుగులో – ఆటలాడుతున్నది. అర్ధరాత్రి దాటింది. ముగ్గురం నిద్రపోయాం.

"ఏమండీ! కవిత చల్లగా ఉందండీ!" కమల తెల్లారుజామున లేపింది.

లేచి చూచాను.

కవిత వెళ్లిపోయింది!

లాంతరు ఆరిపోయింది!!

ఎద్దు చచ్చిపోయింది!!!

మా మీద – నిలుస్తాయనుకున్న కొండలు – కూలాయి.

దుఃఖం కట్టలు తెంచుకుంది. గొల్లుమన్నాం. ఇరుగుపొరుగులు వచ్చారు. ఓదార్చారు.

ముసినవ్వుల కవితను నేలమీద – చాపలో – వేశారు.

గార్లనుంచి అమ్మ వచ్చింది!

కవితను తీసుకొని వెళ్లిపోయింది!!

రిక్తహస్తాలతో తిరిగి వచ్చింది!!!

"కవిత ఏది అమ్మా?" అని గుండె పగిలి ఏడుస్తే – జవాబుగా ఆమె మమ్ములను పట్టుకొని ఏడ్చింది.

కూడిన జనం కంట తడి పెట్టారు. ఓదార్చలేకపోయారు.

కాలానికి గాయం మాన్పే శక్తి ఉంది. క్రమంగా మేమూ కోలుకుంటున్నాం. ఒకనాటి ఉదయం ఉదయ కనిపించలేదు. "ఉదయా!" అని పిలుస్తూ పిచ్చివాళ్లలా వెదికాం. వీధి వాళ్లందరు గాలించారు. మా మీద కొండలు కూలాయి!!!

'స్వామీ! ఏ తప్పుకు స్వామీ ఇంత శిక్ష! ఈ పరీక్ష!' అనుకున్నాం. ఆంజనేయస్వామి ఆలయానికి వెళ్లాం. ఉదయ స్వామి ముందు కూర్చుంది. "మా కవితను మాకివ్వు" అని ఏడుస్తున్నది.

"అమ్మా! ఉదయా!" అప్పటి మా దుఃఖానికి రాళ్లు కరిగాయి! భాష కరిగింది! పదాలు విరిగాయి! ఉదయను ఇంటికి తీసుకువచ్చాం.

**అదిగో, అప్పుడు భగవద్గీత అధ్యయనం చేశాను. మానవ జీవితానికి – కృష్ణ పరమాత్ముడు ప్రవచించిన – శ్రీమద్భగవద్గీతను మించిన కరదీపిక లేదని అర్థం చేసుకున్నాను. వ్యాఖ్యాతల్లో – చాలమంది గీతకు అపార్థాలు కల్పించారు. గీత మానవుని కార్యోన్ముఖుని చేస్తుంది. సత్య దర్శనం**

చేయిస్తుంది. జీవితానికి అర్థం తెలియపరుస్తుంది. గీత పరమార్థం గలది. పారమార్థికం మాత్రం కాదు.

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యవ్వనం జరా
తథా దేహాన్తర ప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతే.

'ఈ దేహానికి కౌమారం వస్తుంది. యవ్వనం వస్తుంది. వార్ధక్యం వస్తుంది. అలాంటిదే "దేహాంతరప్రాప్తి" అంటే' మరో దేహాన్ని పొందడం. అది తెలిసినవాడు చలించడు, అని ఉపదేశిస్తున్నాడు భగవానుడు!

భగవానుడు 'మరణం' అనలేదు. 'దేహాంతర ప్రాప్తి' అన్నాడు.

వరునికి బాల్యం నుంచి కౌమార్యం – కౌమార్యం నుంచి యవ్వనం – యవ్వనం నుంచి వార్ధక్యం మార్పులు మాత్రమే. అలాంటిదే మరణం కూడా!

మరణం జీవితానికి అంతం కాదు. అంతమే అవుతే కవిత మాకు దుఃఖం ఎందుకు మిగిలించిపోయింది?

కవిత పోయింది.
కవితతో అనుబంధం పోలేదు
అనుబంధం మృత్యువును మించిన బలం కలది!

ప్రకృతిలో పదార్థానికి మార్పు తప్ప నాశం లేదు. గింజ మొక్క అవుతుంది. మొక్క వృక్షం అవుతుంది. వృక్షం బీజాలకు కారణం అవుతుంది. ఇవి మార్పులు మాత్రమే – ఏదీ అంతం కాదు.

అలాంటిదే జీవితం. జీవితానికి మరణం అంతం కాదు. మార్పు మాత్రమే! అందువల్ల జీవితంలో కలిగే ఏ మార్పుకూ దుఃఖించక, ఈ మార్పుకు ఎందుకు దుఃఖించడం?

మరణం మార్పు మాత్రమే అనే జ్ఞానం కలిగినవాడు దుఃఖించడు అంటాడు భగవానుడు. ఇందులో అవాస్తవం లేదు.

గీతను చర్చించడానికి ఇది సమయం కాదు.
నేను ఈ మధ్య భగవద్గీత రచించాను.

## శరతల్పం:

జీవితం సంఘటనల అనంత తోరణం. అయితే అన్ని సంఘటనలూ ప్రభావం వేయవు. నా మీద ప్రభావం వేసిన ఒక సంఘటన కరిణ గురువయ్యది.

గురువయ్య డోర్నకల్లులో హమాలీ పని చేస్తాడు. అతడు జ్ఞానతృష్ణ గలవాడు. అప్పుడప్పుడూ నా దగ్గరికి వచ్చేవాడు. మంచి విషయాలు చెప్పమనేవాడు. చెప్పింది శ్రద్ధగా వినేవాడు. సంశయాలకు సమాధానాలు అడిగి తెలుసుకునేవాడు. ఆ మధ్య అతడు రావడం మానేశాడు. నేనూ అంతగా గమనించలేదు.

ఒకనాటి సాయంత్రం. నేను స్కూలు నుంచి వచ్చాను. బట్టలు మార్చుకుంటు న్నాను. ఒకతను వచ్చి "గురువయ్యను కింద పెట్టిన్రు, రమ్మంటున్నారు" అన్నాడు. నేను పరిగెత్తాను.

గురువయ్యను భూశయనం చేయించారు. అతను నన్ను చూచాడు. కంట తడిపెట్టాడు. చేతులు జోడించాడు. తాను వెళ్లిపోతున్నట్లు సంజ్ఞచేసి చూపాడు.

"గురువయ్యా! మరో ధ్యాస వద్దు. మనసును భగవంతుని మీద నిలుపు" అన్నాను. అలాగే అన్నట్లు తల ఊపాడు.

ఇంతలో సాయంత్రం పశువులను మళ్లించుకొని వస్తున్న గొల్ల వీరయ్య వచ్చాడు. "గురువన్నా! ఇన్ని సారనీలు తాగుతవ?" అని అడిగాడు. గురవన్న 'ఇయ్యాల తాగిన – రేపు తాగుతలే' అన్నట్లు సైగ చేశాడు.

నేను చకితుణ్ణే అయిపోయా! ఎంత ఆశ? ఇంతకుముందే పోతున్నా నన్నాడు. ఇప్పుడు రేపటిగురించి ఆబగా ఉన్నాడు!!!

నేను కాస్సేపు ఉండి వచ్చేశాను.

తెల్లవారి సాయంకాలం వీరయ్య తెచ్చిన సారాయి తాగి గురువయ్య గతించాడు!!! అప్పుడు నాకు ఆలోచన వచ్చింది.

**అనుబంధాలు మృత్యువును మించి నిలిచి ఉంటాయి!**

**కోరికలు మృత్యువును గెలువగలవు!!**

ఈ అంశం మీద 'శరతల్పం' అని ఒక నవల వ్రాశాను.

శరతల్పంలో హరిజన గురువయ్య నాయకుడు. అతనికి విచిత్రమైన పరిస్థితుల్లో ఒక వైష్ణవ స్వామితో పరిచయం ఏర్పడుతుంది. ఆ పరిచయం అతనిని దుర్మార్గాలనుంచి మరలిస్తుంది. గురువయ్య సన్మార్గగామి అయి స్వామిని 'అన్నగారి'ని చేసుకుంటాడు. శ్రీమద్భాగవతం వింటుండగా గురువయ్యకు క్షయ వ్యాధి వస్తుంది. స్వామి గురువయ్యను పట్నం దవాఖాన్ల చేర్పిస్తాడు. గడియల్లో ఉన్నాడు, తీసికెళ్లమని ఆస్పత్రివారు స్వామికి కబురంపుతారు.

స్వామి గురువయ్యను తన ఇంటికి తెచ్చుకుంటారు. భాగవతం వినిపించడం సాగిస్తారు. 'అన్నగారూ! మీ రుణం ఎన్ని జన్మలకు తీర్చుకుంట?' అని అడుగుతాడు. 'గురువయ్యా! నీకు మరొక జన్మలేదయ్యా!' అంటారు స్వామి.

గురువయ్యకు చెప్పే పురాణం వినడానికి అశేషజనం వస్తుంటారు. భాగవతంలో చివరి పద్యం అయిపోతుంది. స్వామి పాదాలమీద ఉన్న గురువయ్య చేయి చల్లబడుతుంది.

"గురువయ్యగారు పరమ పదించిన్రు" అని ప్రకటిస్తారు స్వామి!

కోరిక బలమయినపుడు మృత్యువు జరిగిపోతుంది. గురువయ్య సారాయికోసం ఒకరోజు బ్రతికాడు. భాగవతం కోసం నేను నెల బ్రతికించాను.

కోరిక తీరడానికి బ్రతికిన వాస్తవ ఉదాహరణలు అనేకం. భాగవతంలో జడ భరతుడు కోరికలతో జన్మలు ఎత్తాడు.

ఆ ఇంట్లో ఉండగానే నాకు తీవ్రమయిన జ్వరం వచ్చింది. అంత్యకాలం సమీపించింది అనుకున్నాను. బాధ్యతలు వదిలిపోవలసి వస్తున్నందుకు బాధపడిన మాట నిజం. మిత్రులు – డాక్టర్లు – బాధ్యతలు నన్ను బ్రతికించాయి. అన్నింటికన్న సావిత్రి వంటి కమల సంకల్ప బలం బ్రతికించింది అనడం వాస్తవం కావచ్చు.

ఆర్థిక దారిద్ర్యంలో నేను ఆ గొడ్ల కొట్టంలో చేరాను. బతికి ఉంటే అప్పులు తీర్చుకోవచ్చు, ఇల్లు మార్చండి అని కమల నిరంతరం వేధించింది.

ఖమ్మం ఇంటిని గురించిన అనుభవం ఉంది. అక్కడ మూడు చావులు – కుటుంబ విచ్ఛిన్నం జరిగింది. ఇక్కడ కవిత దూరం అయింది. నేను దూరం కానుండగా కమల దగ్గరకు తీసుకుంది. మనుషులు – చెట్లు – పశువులు మున్నగు సమస్త పదార్థాలలో మంచివీ చెడ్డవీ ఉంటాయి. అలాగే ఇళ్లల్లోనూ. ముళ్లబాట అని తెలిసినపుడు మంచి బాట చూడడం బుద్ధిమంతుని లక్షణం. నేను స్కూలు దగ్గర నెలకు పదిహేడు రూపాయిల అద్దెకు ఒక ఇల్లు తీసుకున్నాను. ఆ ఇంటికి మారినపుడు కమలా – నేనూ మానసికంగా తేలికపడ్డాం.

## అనుబంధపు ఆనకట్ట:

స్కూల్లో పిల్లలూ – టీచర్లు – హెడ్మాస్టరు నన్ను అభిమానించేవారు. పండితాస్సమ దర్శినః అన్నట్లు నాకు హెచ్చు, తచ్చులు – పెద్దా, పిన్నా – ధనికుడు, దరిద్రుడు అనే భేదాలు నాటికీ నేటికీ లేవు. నాకు బలం – భయం మీద విశ్వాసం లేదు. **ఈ లోకం ప్రేమ, అనుబంధాల మీద నిలుస్తున్నదని నా విశ్వాసం.**

స్కూల్లో నేను అందరినీ అభిమానించాను. అందరు కాకున్నా కొందరు నన్ను అభిమానించారు. పాఠం చెప్పడం నాకు అభిమాన విషయం. తెలుగు పాఠంలో నేను మైమరచేవాణ్ణి. పిల్లలూ అలాగే వినేవారు. పీరియడు అయిపోయేవరకు పాఠం అప్పగించేవారు. ఒక్కొక్క పీరియడు సొంతం లోకవ్యవహారం మీద చర్చించేవాళ్లం. పిల్లలు నిస్సంకోచంగా చర్చలో పాల్గొనేవారు. అనేక ప్రశ్నలు అడిగేవాళ్లు. నాకు తెలియనివీ అడిగేవారు. తెలియదని స్పష్టంగా చెప్పేవాణ్ణి.

ఒకసారి ఒక ఉపాధ్యాయుడు ఒక విద్యార్థిని విపరీతంగా కొట్టాడు. తల్లితండ్రులు టీచరుమీద – స్కూలు మీద దుమ్ములు, మన్నులు పోశారు. అది అంతటితో ఆగలేదు. ఇప్పటివలె విద్యార్థి సంఘాలు లేవు. కాని, విద్యార్థులు సమ్మె సంకల్పించారు. అది అప్పటికి కొత్త. టీచర్లు, హెడ్మాస్టరు గడగడలాడారు.

ఒకనాడు స్కూలు సాగుతుండగానే విద్యార్థులు విడుపుగంట కొట్టారు. పిల్లలందరూ క్లాసులు వదిలారు. బయట పడ్డారు. గేటు మూయలేదు. కాని, నేను ఒంటరిగా గేట్లో నుంచున్నాను. నేను ఎవరినీ ఆపలేదు. కాని, అందరూ అంగణంలో నిలిచిపోయారు. అందరూ అలా నిలిచిపోయారు. రామమూర్తిని పిలిచాను.

"ఎందుకు వెళ్లిపోతున్నారు?"

"టీచర్ కొట్టినందుకు"

"ఒక్క టీచర్‌మీది కోపం స్కూలుమీద చూపుతారా?"

"టీచర్ తప్పుచేసిండు సార్, శిక్షిస్తరా?"

"తప్పు ఎవరు చేసినా శిక్షించాల్సిందే గదా!"

"అని మీరు చెప్పుతరు" – చేయరు అనే ధ్వనితో అన్నాడు.

"మీరు గేటు దాటకండి" అని వాళ్లను నిలిపి, ఉపాధ్యాయుడిని ఒప్పించడానికి సతమతం అయినాను. తుదకు విధిలేక – ఆ టీచరు వచ్చి, బహిరంగంగా విద్యార్థులకు క్షమాపణ చెప్పాడు.

'తప్పులు అందరూ చేస్తారు. వ్యక్తి తప్పుకు సంస్థను కూలదోయ వద్దు' అని చెప్పాను. విద్యార్థులు సమ్మె విరమించారు. అందరం ఊపిరి పీల్చుకున్నాం.

స్కూల్లో క్లాసులు పెంచాలి. గ్రామస్తులకు శ్రద్ధ ఉంది. వారికి నేను కొంత సాయపడ్డాను. డబ్బు వసూలు చేయడం ప్రధాన కార్యం. ఇప్పటివలె జీపులు – కార్లు లేవు. కాలినడకనో సైకిళ్ల మీదనో గ్రామాలకు వెళ్లేవాళ్లం. ఒకరోజు సైకిళ్లమీద "అమ్మపాలెం" వెళ్లాం. కొన్ని వాగ్దానాలు – కొంత డబ్బు వసూలయింది. సైకిళ్లమీద తిరిగి వస్తున్నాం. బండి ఎడ్లు బెదిరాయి. అదుపు తప్పాయి. నా సైకిలూ – నేనూ పడిపోయాం. సైకిలు బండి చక్రం కింద పడిపోయింది. నేను తెలివిగా చక్రాల మధ్య ముడుచుకున్నాను. చిన్న చిన్న దెబ్బలు తగిలాయి. కాని, ప్రాణం దక్కింది.

మరుసటి సంవత్సరం తొమ్మిదవ క్లాసు వచ్చింది. నేను బి.ఏ.కు చదవడం ప్రారంభించాను. తెలుగు మెయిన్ సబ్జక్టు. అంటే, నాలుగు పేపర్లుంటాయి. సంస్కృతం – ఎకనమిక్స్ సబ్సిడియరీ సబ్జక్టులు. రెండు రెండు పేపర్లుంటాయి. ఇంగ్లీషు కాక రెండవ భాష హిందీ తీసుకున్నాను. సంస్కృతంలో కాళిదాసు "శాకుంతలం" నన్ను ముగ్ధుణ్ణి చేసింది. "మేఘసందేశం" పొంగుతున్న ఏటివడ్డున – మేఘచ్ఛన్న వాతావరణంలో పాడుకున్నాను. ఎకనమిక్స్ ఏదో గొడవగా ఉండేది. అయినా అర్థం చేసికోగలిగాను.

చదువుకోవడం – చదువు చెప్పడం – మిగిలిన ఒక్క క్లాసు పెంచడానికి ప్రయత్నించడం సజావుగా సాగుతుండగా ఒకనాడు ఒక విచిత్రం జరిగింది.

తిరుపతయ్య అనే ఒక టీచరు మా ఇంటి ముందు అద్దెకు ఉండేవాడు. అతడు విచిత్రుడు. బహుసంతానం. జీతం రాగానే అత్తరు, పన్నీరు లాంటివి కొనేవాడు. బయటపడేవాడు. భార్య చాల మంచిది. తాను బయటపడకుండా కాలం గడిపేది.

ఒకనాడు భార్య గొల్లుమన్నది. పసిపిల్ల పక్కలు ఎగరేస్తున్నది. పరిస్థితి ప్రమాదకరంగా ఉంది. డాక్టరు మిత్రుడు రాధాకృష్ణను తీసుకువచ్చాను. అతను లాభం లేదన్నాడు. రోజు గడవడం గగనం అని ఇంజక్షను ఇచ్చి వెళ్లాడు. తిరుపతయ్య లేడు. వాళ్ల స్థితి చూచి నాకు పిచ్చి పిచ్చిగా ఉంది.

ఆ రాత్రి ఇంటిముందరి అరుగుల మీద కూర్చుని మాట్లాడుకుంటున్నాం. ఆదినారాయణగారనే నాటు వైద్యుడు ముచ్చటకు వచ్చాడు. తిరుపతయ్య బిడ్డను గురించి ప్రస్తావించాను. టార్చిలైటు ఉందా అని అడిగి తీసుకున్నాడు. నేనూ వెళ్లాను. ఆదినారాయణగారు వెదికీ, వెదికీ గుప్పెడు ఆకులు తీసుకుని వచ్చాడు.

మేము తిరుపతయ్య ఇంటికి వెళ్లాం. ఆకు గంటెలో వేసి నిప్పులమీద పెడ్తే పసరు అవుతుందనీ, అది ఒక్కొక్క చుక్క పాపనోట్లో వేస్తుండమని ఆదినారాయణగారు వెళ్లిపోయాడు. నేనూ ఇంటికివచ్చి పడుకున్నాను. కాని, నిద్ర పట్టలేదు. ఏ రాత్రి గొల్లుమంటుందో అని ఎదురుచూస్తున్నాం. తెల్లవారుతుండగా పాప ఏడుపు వినిపించింది. వెళ్లి చూచాం.

పాప కోలుకుంది!

హాయిగా తల్లిచన్ను కుడుస్తున్నది!

"అన్నగారు నా బిడ్డను బతికించిండు" అని సజల నయనాలతో బిడ్డను నా కాళ్లమీద పడేసిందా తల్లి!

మా బిడ్డను దక్కించుకోలేకపోయామే అని మా గుండెలు నిండిపోయాయి! ఇంటికి వచ్చి ఏడ్చాం.

తాను చూచేదాకా డాక్టర్ రాధాకృష్ణ నమ్మలేదు. చూచి చకితుడు అయినాడు!

దీన్నే 'యోగం' అంటాం. యోగం అంటే కలిసి రావటం. ఇది వేదాంతం కాదు. పరిస్థితుల ప్రభావం. కలిసి రావడం అంటే ఈ సంఘటనకు సంబంధించినంతవరకు ఇలా ఉంటుంది: 1. నేను వెళ్లి చూడ్డం, 2. డాక్టరుకు చూపించడం, 3. సమయానికి ఆదినారాయణగారు రావడం, 4. నేను వారితో ప్రస్తావించడం, 5. వారికి ఆకు తెలియడం, 6. ఆకు లభించడం, 7. ఆకు వాడడం – ఇన్ని కలిసి వచ్చిన యోగంవల్ల బిడ్డ బతికింది. వీటిలో ఏ ఒక్కటి లోపించినా ఫలితం దక్కేది కాదు.

అంతేకాక, బిడ్డకు ఆయుర్దాయం ఉంది. ఆయుర్దాయం సైతం ఆకాశం నుంచి వచ్చింది కాదు. మనం ఒక పదార్థం కావాలనుకుంటాం. అది లేనే లేనప్పుడు మనవద్ద ఎంత సంపద ఉన్నా ప్రయోజనం శూన్యం. ఒక్క ఆయుర్దాయమే కాదు, విద్య – వివేకం – రూపం – గుణం అన్నీ అలాంటివే! వాటి మూలం ఉంటే అభ్యసించి అభివృద్ధి చేయగలం.

ఆకు – అలం మున్నగువానిలో అనంత శక్తులున్నాయి. వాటేని గుర్తించాలి. మనం రోజూ వినియోగించే ఉల్లిగడ్డలు – వెల్లిపాయలు – మెంతులు వంటివాటిలో గొప్ప శక్తులు ఉన్నాయని పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. ఎన్నో పరిశోధనలు చేసింతరువాతే మన పూర్వులు అలాంటి ఓషధులను ఆహారంలో భాగంగా మనకు విధించారు. **అయితే, మనం ఎంత 'పరాయీకరణం' అయినామంటే, ఆ మాట పాశ్చాత్యులు చెప్పితేనే మనం నమ్ముతున్నాం!**

## సారస్వత అపేక్ష:

నిజాం – మీర్ ఉస్మాన్ – తెలంగాణంలోని తెలుగువారి వేష–భాషలను అంతం చేయడానికి పూనుకున్నాడు. తమ భాషాసంస్కృతులను రక్షించుకోవడానికి – తెలంగాణం తెలుగులు – గిజగిజలాడారు. తమ చరిత్రను – సంస్కృతిని కాపాడుకోవడానికి రాతిమీద ఈదవలసి వచ్చింది. శేషాద్రి రమణ కవులు, ఆది రాజు వీరభద్రరావు మున్నగు పరిశోధనాధురంధరులు తెలుగుల చరిత్రను వెలికి తీయడానికి తమ జీవితాలను దీపాలవలె కరిగించుకున్నారు.

నిజాం 'ఉర్దూకరణ'ను అడ్డుకొనడానికి నాలుగవ దశకంలో ఏర్పడింది ఆంధ్ర సారస్వత పరిషత్తు. నిబిడాంధకారంలో తెలుగు దివ్వె వెలిగించిన సంస్థ అది. దానికి నారు–నీరు పోసి పెంచినవారు దేవులపల్లి రామానుజరావుగారు. వారు నిత్యకృషీవలురు. మర్రిగింజ వంటి సంస్థను మహావృక్షం చేసిన యోగి పుంగవులు. వారు నిజాం రక్కసి కల్పించిన నిబిడాంధకారంలో "సారస్వత పరిషత్తు పరీక్షలు" అనే జ్యోతిని వెలిగించారు. పోలీసు చర్య తరువాత 'సారస్వత పరిషత్తు సర్టిఫికేట్లు' అనేకమంది జీవికకు సహితం ఉపయోగపడినాయి.

తెలుగు అభిమానిగా నేను డోర్నకల్లులో "ఆంధ్ర సారస్వత పరిషత్తు పరీక్షా కేంద్రం" ఏర్పాటు చేయించాను. యువకులను – యువతులను ప్రోత్సాహపరిచాను.

వారి కొరకు ఉచిత తరగతులు నిర్వహించాను. నేను అక్కడ ఉన్నంత వరకు పరీక్షలను నిర్వహించాను. వాటిలో అనేకమంది ఉత్తీర్ణులు అయినారు. ప్రయోజనం పొందారు.

నాకు వాటివల్ల ఎలాంటి ప్రయోజనం లేకున్నా - ఆంధ్ర సారస్వత పరిషత్తును గౌరవించడానికి మాత్రమే - పరీక్షలు వ్రాశాను. సగర్వంగా ఆ సర్టిఫికేట్లను భద్రపరచుకున్నాను.

## దైవోపహతులు:

"దైవోపహతుండు పోవు కడకుంబోవుంగదా ఆపదల్" అన్నాడు ఏనుగు లక్ష్మణ కవి - భర్తృహరి ఆంధ్రీకర్త. ఆపదలు నన్ను వెదుక్కుంటూ వస్తాయి. వాటికి నేనంటే వలపు. విడాకుల వ్యవహారం వాటికి తెలియదు.

ఆపదలు అందరి జీవితాల్లోనూ భాగమే! అయితే కొందరికి ఎక్కువ - కొందరికి తక్కువ. ఆపదలు ఎక్కువ మందిని - సంపదలు తక్కువ మందిని వరిస్తాయి! సంపదలను సహితం ఆపదలు వదలవు. అంటే, **జీవితానికి సంపదలను మించిన భాగస్వాములు ఆపదలే అవుతాయి.**

నన్ను ఆపదలు - అతి ఇష్టంగా - వరించిన మాట వాస్తవ సత్యం. అయితే భగవదనుగ్రహం - మిత్రుల సాయం అనే సూర్యుడు ఆపదల అంధకారాన్ని - ఆపదల మంచును కరిగిస్తారు. భగవదనుగ్రహం ఏలనయా అన్న మిత్రులు లభించుటయే భగవదనుగ్రహము. మిత్రలాభమును గురించి విష్ణుశర్మ పంచతంత్రమున వివరించియున్నాడు.

వివరణ వదిలెదను. వాస్తవము వివరింతును.

కమల - మళ్లీ - గర్భవతి. ఆర్థిక దారిద్ర్యం కన్న నరకం మేలు అంటుంది పంచతంత్రం. అది అక్షరాల నిజం. కమలను బస్తీల ఆస్పత్రులకు చేర్చి కాన్పు చేయించే స్తోమత లేదు. అంతేకాక, ఆ రోజుల్లో ఇళ్ల దగ్గరనే కాన్పులు జరిగేవి. అత్తగారిని పిలిపించాను. ఒక నర్సును కాన్పు చేయడానికి ఏర్పాటు చేశారు.

కమలకు నెలలు నిండాయి. ఒకనాటి సాయంత్రం రక్తస్రావం ప్రారంభం అయింది. నర్సు వచ్చింది. ఆమెకు తెలిసినంత చేసింది. తెలిసిన వైద్యులూ సహకరించారు. అయినా తగ్గలేదు.

అది కాళరాత్రి. కరాళరాత్రి. నా ప్రాణాలు విలవిలలాడుతున్నాయి. కవిత అనుభవం ఇంకా మరుగున పడలేదు. కమలకు ప్రాణాలమీదికి వస్తున్నది. కవిత పోయింది! కమల మిగలకుంటే!! ఆ రాత్రి కత్తులమీద - నిప్పులమీద నడిచాను. నిద్రరాదు. ఆపదల కొండలు నెత్తిన కూలుతున్నాయి!!!

అందరి ప్రయత్నాలూ నిష్ప్రయోజనములు అయినాయి. చేతులు జోడించి ఆకాశానికి మొక్కుతూ కూర్చున్నాం. సర్వప్రయత్నాలూ విఫలం అయినాయి. కమల ఆయుర్దాయం అతివేగంగా కరిగిపోతున్నది. అలాంటప్పుడు ప్రార్థన వినా గత్యంతరం లేదు.

మానవుడు ఎంత నిస్సహాయుడో అర్థమైన గడియ అది. నా నొసటి వ్రాతను వెక్కిరిస్తూ సూర్యుడు ఉదయించాడు. సూర్యుడు బయటి చీకట్లను మాత్రమే

విడగొట్టగలడు! ఒక మిత్రుడు పిలపించగా మరొక మిత్రుడు డాక్టర్ లక్ష్మీపతి మానుకోటనుంచి దిగాడు. పరీక్షించాడు, పెదవి విరిచాడు. "మీరు నన్ను ఇంతకు ముందు పిలిపించాల్సింది. రక్తం సొంతం పోయింది. బెజవాడ తీసికెళ్లి రక్తం ఎక్కించాలి. అక్కడిదాకా చేరగలుగుతే దక్కవచ్చు. నా నర్సును వెంటపంపుతా" అన్నాడు.

నా గుండెలో బండపడింది. హృదయచలనం నిలిచినట్లయింది. బెజవాడ వెళ్లాలి. రక్తం కొనాలి. డబ్బులేదు. ఉదయను వదిలివెళ్లాలా? తీసికెళ్లాలా? అసలు నేను వెళ్లగలనా? రైల్లోనే ఏమైనా జరుగుతే? నా మీదినుంచి రైళ్లు నిరంతరం శరవేగంతో పరుగులు తీస్తున్నాయి.

ఒక మిత్రునికి కమల నగలు వలిచి ఇచ్చింది. అతడు తాకట్టుపెట్టి డబ్బు తెచ్చాడు.

ఒక మిత్రుడు బండి కట్టి తెచ్చాడు. రైల్వే మిత్రులు సగం పెట్టె – ఆ రోజుల్లో ఉండేవి – మా కోసం ప్రత్యేకించి, మమ్ములను ఎక్కించారు.

వెంట ముడుంబ శ్రీనివాసాచార్యులు – కాంపౌండర్ వేంకటాచార్యులు – నర్సు పరంజ్యోతి ఆపద్బాంధవుల్లా ఉన్నారు.

ఆ రోజుల్లో బండ్లన్నీ పాసింజర్లే. సింగిల్ ట్రాక్. ప్రతి స్టేషనులో ఆగాలి. క్రాసింగులు. నాకేమో అది పుష్పకం కావాలని! మనసు పరిపరి విధాల పరుగులు పెడ్తున్నది. కన్నీటి పచ్చికుండ నెత్తిమీద ఉంది. కదిలిస్తే విచ్చుకునేట్లుంది. స్థైర్యం కలిగించే మిత్రులుండడం కొండంత అండ.

మార్గమధ్యంలో – బోనకల్లు ప్రాంతంలో – కమల మృతశిశువును ప్రసవించింది. స్పృహ కోల్పోయింది. మగ బిడ్డ. ముద్దుగా ఉన్నాడు. పచ్చికుండ విచ్చుకుంది. బిడ్డను – నా కనుల ముందే సంచీలో – వస్తువులా కట్టారు. ప్రసవించి ప్రయాణం చేయరాదట! రైల్వేవాళ్లు దింపేస్తారట! రూల్సుకు గుండెలుండవు. ప్రయాణించే రైల్వే సిబ్బంది మిత్రులు కాబట్టి సరిపోయింది.

నేను అనుభవించిన యాతనకు భాష చాలదు. బండి బెజవాడ చేరింది. స్పృహలేని కమలను స్ట్రెచరు – తరువాత గుర్రబ్బండిలో గవర్నరుపేటలోని – డాక్టరు లక్ష్మీపతి చెప్పిన – నర్సింగ్ హోంకు చేర్చాం. డాక్టరుకు లేఖ అందించాను.

వృత్తిరీత్యా డాక్టర్లు హృదయం ఇంట్లో పదిలపరచివస్తారు!

"డెలివరీ అయి డెడ్‌బేబీ అయితే మేము అడ్మిట్ చేసుకోం."

ప్రాణం పోయాల్సిన డాక్టరు ప్రాణంలేని యంత్రంలా మాట్లాడుతున్నాడు! సాధించడం తప్ప అర్థించడం నాకు చేతకాదు. నాలో ఉక్రోషం ఉప్పొంగుతున్నది. ఇది సమర సమయం కాదు అనే జ్ఞానంలేక ఆయత్తం అవుతున్నాను. కాంపౌండరు వేంకటాచార్యులు గమనించారు. నన్ను మాట్లాడనివ్వలేదు. డెలివరీ అయినట్లు చెప్పబోమనీ, మృతశిశువును లోనికి తేమనీ చెప్పింతరువాత కమలను అడ్మిట్ చేసుకున్నాడు డాక్టరు.

హోటల్లో రూం అద్దెకు తీసుకుని, మృతశిశువు మూటను అక్కడపెట్టి వచ్చాడు శ్రీనివాసాచార్యులు!

కమలకు స్పృహలేదు. తండ్రిగా నేను విలవిలలాడినతీరు చెప్పరానిది!

"రక్తపు సీసా వంద. వంద ఇవ్వండి" అన్నాడు డాక్టరు. నాకు డాక్టరు మీద అపరిమితం అయిన కోపం వచ్చింది. అప్పుడు కోపంతో కాదు – డబ్బుతో ప్రయోజనం! వంద చెల్లించాను. అయిదో దశకంలో వంద విలువ చాల ఎక్కువ. **ప్రభుత్వం రూపాయి విలువను యాభయిలతో పోల్చలేక ఎనభయిలతో పోల్చుతున్నది.**

ఇంతకూ ఆ డాక్టరు దగ్గర రక్తం నిలువలేదు. అప్పుడు అతను ఒక రిక్షా అతన్ని పిలిపించాడు. అతని రక్తం సీసాలో నింపి – దానిని కమలకు ఎక్కించారు. ఒక సీసా రక్తం ఎక్కింతరువాత కమలకు స్పృహ వచ్చింది. మమ్ములను ఆమెను చూడడానికి అనుమతించారు.

నేను కమలను చూచాను. కమల – అప్పుడప్పుడే – ప్రాణం పోసుకుంటున్నట్లున్నది. కష్టంగా అడిగింది–

"ఏదండీ మన బిడ్డ? వీండ్లు ఏమీ చెప్పరు."

నా గుండె అవిసిపోయింది. దుఃఖం తరంగాలుగా పొంగింది. ఏమని చెప్పటం? చచ్చిన బిడ్డను మూటకట్టి హోటలు గదిలో ఉంచామనా?

"ఉన్నదమ్మా, ఉన్నది. నీకు పూర్తిగ తెలివి రానివ్వు, తీసుకొస్త." పరంజ్యోతి జవాబు చెప్పింది. కాని నా దుఃఖం ఆగలేదు. గది బయటికి వచ్చి పెద్దగా ఏడ్చాను.

మరొక సీసా రక్తం అవసరం అయింది. మరొక వంద ఇచ్చాం. మరొక రిక్షా అతను వచ్చాడు. అయితే మనసును కదిలించిన విషయం ఏమంటే – 'నా రక్తంతో బతికిన అమ్మ ఈమేనా?' అని అడిగి సంతృప్తిగా చూచిపోయిన తొలి రిక్షా అతను. డాక్టరులో లేని 'మానవత' రిక్షా అతని కన్నుల్లో నాకు గూడు కట్టుకుని దర్శనం ఇచ్చింది.

**వ్యాపారం మానవత ప్రాణం తీస్తుంది.**

కమల కోలుకుంటున్నది. హోటలు గదిలోని బిడ్డమూటను ఏం చేయాలి? బిడ్డ పుట్టి చచ్చిందనో, చచ్చి పుట్టిందనో చెప్పకోలేని దుస్థితి. కన్నబిడ్డను కనీసం ఖననం చేసుకోలేని కడుహీనస్థితి.

భగవంతుడు మానవ రూపంలో వచ్చినట్లు – శ్రీనివాసాచార్యులు మూట తీసుకొని రిక్షా ఎక్కాడు. నన్ను ఎక్కించుకున్నాడు. లాకుల దగ్గర రిక్షా దిగాం. రాత్రిపూట. అప్పుడు అక్కడ అంత జనసంచారం ఉండేది కాదు. మూట తీసుకుని కృష్ణవడ్డున చాల దూరం నడిచాం.

"రంగన్నా! నీవు దుఃఖం దిగమింగు. మూట కృష్ణలో వేస్త." గొంతు పెకలకపోయినా శ్రీనివాసాచార్యులు అన్నాడు.

"నేను ఇంకా బ్రతికి ఉన్నాను. దిక్కులేని బిడ్డను చేసి ఏట్లో వేస్తావా?" అని మూటను పట్టుకున్నాను.

"మళ్లీ ఎవరయినా చూస్తారు" అని మూట లాక్కుని శ్రీనివాస్ – నేను చూస్తుండగానే – కృష్ణలో విసిరాడు.

నేను నేలమీద కూలబడ్డాను.

నెత్తికొట్టుకొని ఏడ్చాను.

ఏమీ చేయలేనపుడు మనిషి ఏడుస్తాడు!

మూడో వంద – మూడో తులం బంగారం – మూడో రిక్షా అతని – మూడో సీసారక్తం ఇచ్చింతరవాత – కమల మానసికంగా కృంగిపోయినా – శారీరకంగా కోలుకుంది.

కమలను తీసుకుని డోర్నకల్లు చేరుకున్నాం. మా అత్తగారు ఉదయను పట్టుకొని మా కోసం ఎదురు చూస్తున్నది. మేము గడపలో అడుగుపెట్టాం.

"తమ్ముణ్ణి తెస్తానన్నారు, ఏడీ?" అని అడిగింది ఉదయ.

కమల కూలబడి ఎలుగెత్తి ఏడ్చింది.

నేను దొడ్లో బావిమీద కూర్చొని విలపించాను.

మా ఉభయుల శారీరక మానసిక ఆరోగ్యాలు దెబ్బతిన్నాయి. నాకు పరీక్షలు దగ్గరపడుతున్నాయి. B.A పట్టా పొందాలని పట్టుదల. రాత్రింబవళ్లు – అనారోగ్యంతో – నిద్రాహారాలు మాని చదువుతున్నాను. కడుపులో మంట, వాంతులు. అయినా లెక్క చేయడం లేదు. B.A అనిపించుకోవాలి. అదొక స్థిరసంకల్పం. ఒక తపస్సు. తపస్సుకు నిద్రాహారాలు ఉండవు!

తొలి నుంచీ ఉస్మానియా యూనివర్సిటీ కేంపస్‌లో కొన్నాళ్లుండాలనీ – ఆర్ట్సు కాలేజీలో పరీక్ష వ్రాయాలనీ ఒక ఆకాంక్ష. ఒక సంకల్పం. ఒక స్వప్నం, అలాగే కొన్ని రోజులు ముందు హాస్టలు చేరుకున్నాను. ఒక మిత్రుని గదిలో ఉన్నాను. హాస్టలు తిండి – అనారోగ్యం – నిరంతర స్వాధ్యాయం, సరదాగా లేదు. అయినా హాస్టలు – కొందరు సహాధ్యాయులు – ప్రశాంతం అయి, విశాలం అయిన విడి స్థలం – పార్కు – బాగానే ఉన్నాయి. బాగుండడం కాదు శ్రద్ధకావాలి. "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అంటాడు కృష్ణపరమాత్మ గీతలో.

ఈ లోకంలో – కాలంలో ఏదీ నిలిచేది లేదు. అంతా నిరంతరం సాగేదే. సర్వం గడిచిపోయేదే. కాలానికి కళ్లు లేవు. అయినా అన్నింటినీ పొట్టనపెట్టుకుంటుంది. సాగిపోతూనే ఉంటుంది. ఆగదు.

పరీక్ష తొలిరోజు రానే వచ్చింది. నేను చాల ఉత్సాహంగా – ఆర్ట్సు కాలేజీలో – పరీక్షకోసం ప్రవేశించినాను. ఆ మహోన్నత భవనంలో కూర్చుంటే విద్యాదేవి ఒడిలో కూర్చున్నట్లనిపించింది. వాస్తవంగా ఆ నిర్మాణం – నిజాంరాజు చేసినా – మెచ్చుకోదగింది. ఆ భవనం ఒక దర్జా – ఒక ఠీవి – ఒక ఔన్నత్యం – ఒక గాంభీర్యం సంతరించుకున్నది. అది చదువుల తల్లి నిలయంగా కనిపిస్తుంది. ఆ భవనంలో సగర్వంగా బి.ఏ. పరీక్షలు వ్రాస్తున్నాను.

అనారోగ్యం మరచాను. పరిసరాలు మరచాను. పరిస్థితులు మరచాను. నిరంతర అధ్యయనం పరీక్ష వ్రాయడం. పరీక్షలు అయిపోయాయి. బాగానే వ్రాశాననిపించింది. కేంపస్ వదిలి వెళ్తుంటే – కణ్వాశ్రమం వదులుతున్న శకుంతల వలె అనిపించింది. పరీక్ష ఫలితాల్లో ఇంగ్లీషు పోయింది. సప్లిమెంటరీ – 1956 సెప్టెంబరులో మళ్లీ ఇంగ్లీషు పరీక్ష వ్రాశాను. సెకండ్ క్లాసులో ఉత్తీర్ణుణ్ణి అయిన్నాటి నా ఆనందం వర్ణనాతీతం! తపస్సు చేసినవానికి భగవానుడు ప్రత్యక్షం అయినట్లూ – దుర్గమారణ్య

ప్రయాణంలో మానవుని దర్శనం అయినట్లు - ఎడారి యానంలో ఒయాసిస్సు చేరుకున్నట్లూ అనిపించింది!



1957లో బి.ఎ. డిగ్రీ తీసుకున్న దాశరథి రంగాచార్య

ఆ రోజుల్లో - తెలంగాణంలో - బి.ఎ. సామాన్యం కాదు. నా నిరంతర స్వాధ్యాయం సామాన్యం కాదు! ఏ ఒక్క అధ్యాపకుని సాయం లేక - పుస్తకాలే గురువులుగా - అక్షరాల నుంచి పట్టందాకా - సంసార సాగరాన్ని ఈదుతూ నెట్టుకు రాగలిగాను!

అవును. ఇంత సంతోషం - ఇంత సంబరం - ఇంత ఆనందం అనుభవించడం వ్యక్తం చేయడం ఎలా? కమలా నేనూ కలిసి ఉక్కిరి బిక్కిరి అయినాం. ఆనందం గాని - దుఃఖంగాని - ఏదీగాని ఒంటరిగా అనుభవించలేం.

శ్రీనివాసాచార్యులు - శివలింగం - నేను మూడురూపాయీల పావలాకు ఒక బీరుసీసా తెచ్చాం. ఇంటి పెరట్లో - వెన్నెట్లో కుర్చీలు వేసుకుని కూర్చున్నాం. బీరు మూడు గ్లాసుల్లో పోసుకున్నాం. అది తీయగా ఉంటుందని మా భావన! కేప్స్టన్ సిగరెట్లు వెలిగించాం. చీర్స్ అనడం సహితం తెలియదు.

మనసుల్లో ఆనందం.

వెన్నెల - పాలులా - పరుచుకుంది.

కేప్స్టెన్ సిగరెట్టు పొగమబ్బులు.

బీరు చప్పరించాం. ఛెడ చేదు! అయినా వదల్లేదు. ఒక్కటే గ్లాసు తాగింది. తొలి తడవ కదా! ఊగిపోయాం. నేల ఊగుతున్నట్లనిపించింది. మేము ఊగుతున్నాం. అది ఒక ఆనందం కాదు. కాని, ఒక అందం అయిన అనుభూతి!

పీనా నమనాహై నపిలానాహి మనాహై.
పీనేకే బాద్ హోష్‌మె ఆనాహి మనాహై
(త్రాగడం తప్పుకాదు. త్రాగించడం తప్పుకాదు.
త్రాగి తెలివితప్పకుండడంమాత్రం శుద్ధతప్పు!)

ఆ రేయి కమలా నేనూ కలిసి డిగ్రీ పట్టామీద తాజమహళ్లు – ఎర్రకోటలు నిర్మించుకున్నాం.

నేను ఆర్థికంగా ఆశించింది తక్కువ. అందువల్ల అవి గాలిమేడలు కాలేదు.

నేను దాశరథి రంగాచార్య, బి.ఏ. అయినాను. ఆ వ్రాత కాగితంమీద అనేకసార్లు వ్రాసాను. కొట్టివేయలేదు.

## మహేంద్రోదయం:

తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ
ఎల్ల నృపులుగొలువ ఎరుగవే బాసాడి
దేశభాషలందు తెలుగు లెస్స–

అన్నవాడు – రేడు శ్రీకృష్ణరాయలు ఒక్కడు మాత్రమే. సుదీర్ఘమయిన తెలుగుల చరిత్రలో తెలుగు బాసను పట్టించుకున్న రేడు రాయలు – కవి పాల్కురికి మాత్రమే. తెలుగులకు తొలినుండి భాషాపరంగా అభిమానం లేదు. జాతిపరంగా ఐక్యత లేదు. మనం ఈ రెంటినీ గత తరంలో – రాజకీయ లబ్ధికోసం – తమిళుల నుండి నేర్చుకున్నాం.

తమిళులకు – కన్నడిగులకు భాష ఒక భగవానుడు. జాతీయత ఒక దేవాలయం.

తమిళులు అనాది నుంచి భాషాపరంగా స్వతంత్రులు. భాషను సర్వతంత్ర స్వతంత్రంగా పెంచుకున్నారు. వారు సంస్కృతాన్ని ఆరాధించిన మాట నిజం. కాని ఆమోదించలేదు. తమిళ వైష్ణవులు తమిళంలో నాలాయిరం అనే నాలుగు వేదాలను, అష్టాదశ రహస్యంగళ్ అనే పద్దెనిమిది పురాణాలను, పన్నిద్దరు – పన్నెండు మంది ఆళ్వారులను ఏర్పరచుకున్నారు. అలాగే శైవులు పెరియపురాణాన్నీ నాయనార్లనూ ఏర్పరచుకున్నారు. ఒక వాస్తవం అయిన భక్తి ఉద్యమం తమిళదేశంలో వెల్లివిరిసింది.

అలాగే బిజ్జలుడు మున్నగువారు కన్నడంలో వీరశైవం ఏర్పరచుకున్నారు. కన్నడంలో – పాల్కురికి సహితంగా – అనేక మంది కవులు అనంతం అయిన కన్నడ సాహిత్యం సృష్టించుకున్నారు. వీరశైవులు వీరావేశంలో తలపండ్లు సహితం సమర్పించుకున్నారు. తన బిడ్డను సహితం సమర్పించుకున్న శ్రీయాళుని కథ పతాకప్రాయం!

తెలుగులకు – తమదిగా – ఒక మతం లేదు. తెలుగువాడయిన శ్రీమద్రామానుజాచార్యులు వైష్ణవంలో సంస్కృతం చేర్చి, విశిష్టాద్వైతం స్థాపించి, తెలుగు ప్రాంతానికి తెచ్చినారు. పాల్కురికి సోమనాథుడు మున్నగువారు కన్నడమును తెలుగు చేసి వీరశైవమును తెలుగులకు అందించినారు.

తెలుగులకు నాటికి - నేటికి భాషాభిమానం - జాతీయతాభావం హుళక్కి. ఇద్దరు తమిళులు - ఇద్దరు కన్నడిగులు - ఇద్దరు మహారాష్ట్రులు - ఇద్దరు ఏ ఇతర భాషలవాళ్లు కలిసినా వారి భాషలలోనే మాట్లాడుకుంటారు. ఇద్దరు తెలుగులు కలస్తే తమ భాషతప్ప అన్యభాషలో మాట్లాడుకుంటారు.

ఆంధ్రజాతి అభిశప్తజాతి. వారు తమను తాము గుర్తించరు. పదం కాస్త పరుషం కావచ్చుగాక - పరులకు దాసోహం అంటారు. ఆంధ్రజాతికి రాజకీయం తప్ప అన్యం అర్థం అయినట్లు కనిపించదు. నన్నయ్య - తిక్కనల భారత ఆంధ్రీకరణ సహితము రాజకీయమే!

ఆంధ్రులు కాకతీయుల పాలనలో ఒకే గొడుగు కిందికి చేరడం - కుతుబ్ షాహీ - ఆసఫ్జాహీల పాలనలో ఒకే పాలన క్రిందకు రావడం కేవలం యాదృచ్ఛికములే. ఆ కాలంలో తెలుగు భాషగాని - సంస్కృతిగాని వికసించిన జాడలు కనిపించవు.

ఆంధ్రులు సంస్కృత సాహిత్య వికాసానికి చేసిన కృషి అపారం. చాణక్యుడు ఆంధ్రుడు అనుకుంటే ఆనాడు దేశసమైక్యతకు ఆంధ్రులు చేసిన సేవ అనిర్వచనీయం.

ఆసఫ్జాహీల కాలంలో ఒకే పాలన క్రింద ఉన్న తెలుగువారిని విచ్ఛిన్నం చేయడం ఆంగ్లేయుల విభజించు భేదనీతి రాజకీయం. 1760 ప్రాంతంలో ప్రస్తుతపు ఆంధ్రప్రాంతాన్నీ - 1800లో రాయలసీమ ప్రాంతాన్నీ కబళించిన ఈస్టిండియా కంపెనీ - భారత ప్రథమ స్వాతంత్ర్య సమర ఫలితంగా - అంగ్రేజు దొరలు తెలంగాణం అనే ప్రస్తుత ప్రాంతాన్ని నిజాం నవాబులకు దక్కనిచ్చారు. ఒక ఆసక్తికరం అయిన విషయం ఏమంటే - గుంటూరు ప్రాంతం ఆలస్యంగా ఆంగ్లగతం అయింది. అందుకే ప్రకాశం పంతులు ఉర్దూ నేర్చుకున్నారు. ఉన్నవ వారి "మాలపల్లి" తెలుగులో ఉర్దూ పదాలు కనిపిస్తాయి!

**ఆంగ్లేయులుకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యంకోసం పోరాడడం మనకు నేర్పింది ఆంగ్లేయులే అనడం వాస్తవ సత్యం. అలాగే తమిళులకు వ్యతిరేకంగా తెలుగులను ఏకం చేసింది తమిళులే అనేది సహితం సత్యదూరం కాదు.**

చెన్నపట్నం తెలుగువారి నగరం. అంగ్రేజులు మద్రాసును రాజధాని చేశారు. దానితో ఐక్య తమిళులు మద్రాసు రాష్ట్రం మొత్తాన్ని ఆక్రమించుకున్నారు. వారు బ్రిటిషాంధ్రంలోని ప్రభుత్వోద్యోగాలను ఆక్రమించారు. వారే కళాశాలలు నిర్వహించారు. పెత్తనం చలాయించారు. కన్యాశుల్కంలో Made difficult కుప్పుస్వామి కూడా అరవ్వాడే!

ఆంగ్లేయులు మనను బానిసలను చేశారు. వారు మనను అలా అనడం భావ్యమే! కాని, బానిసలయిన తమిళులు ఆంధ్రులను బానిసలుగా పరిగణించారు. ఆంధ్రులు తమ పేర్లు సహితం తమిళులను అనుకరించి పెట్టుకున్నారు. ఉదాహరణకు రాధాకృష్ణన్.

తమిళుల బంధంనుండి విడివడడానికి ఆంధ్రులను ఏకం చేస్తూ ఆంధ్రమహాసభ ఏర్పడింది. ఈ ఉద్యమ నాయకులు అభివృద్ధి చెందిన ఆంధ్ర జిల్లాలవారు. ఉత్తరాంధ్రులు - రాయలసీమవారు ఆంధ్రమహాసభ నాయకత్వాన్ని విశ్వసించలేదు. తమిళుల పిడికిలి విడిపించుకొని - నాయకత్వం తమ మీద పెత్తనం చేసే రాజకీయం

అని ఆ ప్రాంతాలవారు భయపడ్డారు. ఆంధ్రమహాసభ నాయకత్వం ఉత్తరాంధ్రంలో ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ఏర్పరచి, ఉత్తరాంధ్రులను సంతృప్తిపరచారు.

రాయలసీమీయులు - నెల్లూరు వారు తమకు ఆంధ్రరాష్ట్రం వద్దన్నారు. తమవారి పెత్తనం కన్న తమిళుల పెత్తనమే నయం అనుకున్నారు. నెల్లూరులో జరిగిన ఆంధ్రమహాసభల్లో ఆంధ్రరాష్ట్రం అక్కరలేదని తీర్మానం చేయడానికి అధిక సంఖ్యాక ప్రతినిధులు సన్నద్ధం అయినారు. హరి సర్వోత్తమరావుగారు తమ చాకచక్యంతో ఆ ఆపద నివారించారు.

రాయలసీమీయులను వప్పించడానికి కర్నూలును రాజధాని చేస్తామని - ఆంధ్రమహాసభ నాయకత్వం - శ్రీభాగ్ వప్పందం కుదిరించుకుంది.

ఇదంతా ఎందుకు జరిగిందీ అంటే, తెలుగులు తెలుగువారిని నమ్మలేదు. తెలుగులు తెలుగులమీద రాజకీయం నడిపించారు.

**ఆంధ్రమహాసభవారు ఆంధ్రరాష్ట్రం కోరింది రాజకీయ ప్రతిపత్తికి - తమిళుల దాస్య విముక్తికి తప్ప, ఆంధ్రభాషాభివృద్ధికి - జాతీయభావం కల్పించడానికి మాత్రం కాదని స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ఆంధ్రనాయకుల కీచులాటలు, ఆంధ్రప్రదేశం ఏర్పడిన తరువాతి పరిణామాలు స్పష్టం చేస్తాయి.**

ఆంధ్రులను అందరినీ ఏకం చేయడానికి ఆంధ్రమహాసభ ఉద్యమించలేదు. బ్రిటిషాంధ్ర ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పరచుకోవడం మాత్రమే రాజకీయ ధ్యేయం. విశాలాంధ్ర నినాదం, విశాలాంధ్ర సంకల్పం ఉభయాంధ్ర కమ్యూనిస్టులది. పుచ్చలపల్లి సుందరయ్య, 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అనే గ్రంథం - వేములపల్లి శ్రీకృష్ణ చేయెత్తి జై కొట్టు తెలుగోడా!' అనే కవిత, "తెలుగుతల్లి బిడ్డలం - తెలంగాణ వీరులం" అంటూ కదం తొక్కిన తెలంగాణ సాయుధపోరాటం మాలాంటి యువకుల్లో విశాలాంధ్ర ఉత్సాహం ఉరకలు వేయించింది.

కమ్యూనిస్టులు విశాలాంధ్ర కోరడంలో రాజకీయం లేకపోలేదు. ఆనాటి పరిస్థితుల్లో విశాలాంధ్రలో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడుతుందని దేశం యావత్తు భావించింది. కేంద్రంలోని కాంగ్రెసు సర్కార్ జంకింది కూడా! అయితే, ఆంధ్రరాష్ట్రంలో - రాజకీయ కల్లోల ఫలితంగా - జరిగిన మధ్యంతర ఎన్నికల్లో - స్వయం కృతాపరాధం వల్ల - కమ్యూనిస్టులు అలాంటి అవకాశాన్ని జారవిడుచుకున్నారు.

ఆంధ్రులను అవమానించడానికీ - ఆంధ్రుల హక్కు అయిన మద్రాసును హరించడానికీ - గవర్నర్ జనరల్ పదవి నిర్వహించిన చక్రవర్తి రాజగోపాలాచారి మద్రాసు రాష్ట్రానికి ప్రధాని అయినారు. అయినా కాంగ్రెస్ నాయకులు కీచులాడుకున్నారు తప్ప ఆంధ్రులను ఏకం చేయడానికి ఉద్యమించలేదు - రాష్ట్రం సాధించడానికి ప్రయత్నించలేదు.

నాయకుల పదవుల కొట్లాటకు ప్రజలు సహితం విసిగారు. అలాంటి తరుణంలో గాంధేయుడు స్వామీ సీతారాం ఆంధ్రరాష్ట్రంకోసం నిరశన వ్రతం ప్రారంభించారు. తెలుగు వారిలో కొంత ఉత్సాహం - కొంత చైతన్యం కలిగింది. ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూకు - తన ప్రభుత్వంమీద వత్తిడి తెస్తున్నందుకు స్వామి సీతారాం మీద కోపం వచ్చింది, హుంకరించారు. వినోబాజీ సలహా మేరకు సీతారాం నిరశన విరమించారు.

ఆంధ్రుల బలహీనతలు ఎరిగిన రాజగోపాలాచారి – తమిళులకు ఉపకారం చేయడానికి – కృష్ణ నీటిని తమిళ ప్రాంతానికి మళ్లించే – కృష్ణాపెన్నార్ ప్రాజెక్టు ప్రతిపాదించారు. దాంతో ఆగ్రహించిన గాంధేయవాది పొట్టి శ్రీరాములుగారు అమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు. పొట్టి శ్రీరాములుగారి విషయంలో నెహ్రూ ప్రభుత్వం బ్రిటిషు ప్రభుత్వంకన్న రాక్షసంగా ప్రవర్తించింది. శ్రీరాములుగారు బెదిరింపులకు లొంగలేదు. ఆత్మార్పణం చేశారు.

శ్రీరాములు గారి ఆత్మాహుతితో ఆంధ్రప్రజ రెచ్చిపోయింది. చిచ్చు రగిల్చింది. నెహ్రూ లొంగక తప్పలేదు. జగడాల మధ్య కర్నూలు రాజధానిగా – ప్రకాశం ముఖ్యమంత్రిగా "ఆంధ్రరాష్ట్రం" ఏర్పడింది. అది భారతదేశంలో తొలి భాషా రాష్ట్రం!

భారత చరిత్రలో భాషారాష్ట్రాలు – భాషారాజ్యాలు – కనిపించవు. భారతీయులు భాషాతత్వం ఎరుగరు. త్యాగరాజు తెలుగుపదాలను తమిళులు పాడారు. మలయాళ ప్రాంతపు ఆదిశంకరుని అద్వైతాన్నీ – తెలుగువాడయి తమిళం అవలంబించిన రామానుజని విశిష్టాద్వైతాన్నీ యావద్భారతం ఆమోదించింది. **భాషల పేరిట సంకుచితత్వాన్ని కూడా మనం యూరోపునుంచి కొని తెచ్చుకున్నాం. యూరోపుదేశాలన్నీ సుమారు భాషాదేశాలే!**

కాలగతిని నిలువరించడం ఎంతటివానికీ సాధ్యం కాదు. భాషారాష్ట్రాలు ఏర్పరచడానికి భారత ప్రభుత్వం ఫజల్ అలీ కమీషను నియమించింది. వారు సమర్పించిన నివేదికలో తెలంగాణం వెనుకపడినతనందృష్ట్యా అయిదేళ్ళు ప్రత్యేక రాష్ట్రంగా ఉంచాలని నివేదించారు.

ఈ విషయంలో హైదరాబాదు కాంగ్రెసు రెండుగా చీలిపోయింది. రామానంద తీర్థ నాయకత్వాన ప్రగతి వర్గం విశాలాంధ్రకు అనుకూల ఉద్యమం నిర్వహించింది. కమ్యూనిస్టులు తొలినుంచి అనుకూలురు. నిజాం రాజ్యాన్ని ఆంధ్ర–మహారాష్ట్రం – కన్నడిగ ప్రాంతాలుగా విడగొట్టాలనీ, ఆ ప్రాంతాలను ఆయా భాషారాష్ట్రాల్లో విలీనం చేయాలన్నది కమ్యూనిస్టుల నినాదం. అలా చేయడం వల్ల నిజాం పెత్తనం విరగడ అవుతుందనీ ప్రజాస్వామ్యం వర్ధిల్లుతుందనీ వారి వాదం. బూరుగుల రామకృష్ణారావు ముఖ్యమంత్రి సహితంగా కమ్యూనిస్టుల వాదాన్ని అనుసరించారు.

కన్నడిగులు – మహారాష్ట్రులు తమ నిజాం ప్రాంతాన్ని పొరుగు రాష్ట్రాల్లో విలీనం చేయడానికి అభ్యంతరం చెప్పలేదు. కాని, తెలంగాణంలో కాంగ్రెసులోని ఒక ప్రగతి నిరోధక వర్గం – అచ్చంగా తమ పదవులకోసం తెలంగాణ రాష్ట్రం కావాలని ఒక ఉద్యమం లేవదీశారు. దీనికి నాయకత్వం వహించినవాడు కొండా వేంకటరంగారెడ్డి, ప్రయోజనం పొందినవాడు మర్రి చెన్నారెడ్డి, అయితే వీరికి కావలసింది పదవి – ప్రజా ప్రయోజనం కాదు. పదవికోసం తాత్కాలిక ఒప్పందం పేర ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు సంతకాలు పెట్టారు.

ఆంధ్రరాజకీయాల్లోకి పొడుచుకువచ్చిన నీలం సంజీవరెడ్డి – ఆంధ్రనాయకత్వం రాయలసీమ వాసులకు ఇచ్చిన కర్నూలు రాజధాని వాగ్దానాన్ని తుంగభద్రలో తొక్కి – విశాల రాష్ట్రానికి ముఖ్యమంత్రి కావడానికి – హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడడానికి అంగీకరించారు.

ఇన్ని కుట్రలు, కూహకాల మధ్య – ఆంధ్రుల ఐక్యత అనే నేతిబీరవంటి – లోన లొటారం పైన పటారం అయిన – ఆంధ్రప్రదేశ్ – ఒకటవ నవంబరు 1956న ఏర్పడింది. రాయలసీమ ప్రయోజనాలను పణంగా పెట్టి – రాయలసీమ వాడు సంజీవరెడ్డి ముఖ్యమంత్రి అయినారు. తెలంగాణ ప్రయోజనాలను తాకట్టుపెట్టి కొండా వేంకటరంగారెడ్డి ఉప ముఖ్యమంత్రి అయినారు.

ఆంధ్రప్రదేశ్‌లో మురా రాజకీయాలకు అంకురార్పణ జరిగింది. తన సర్వస్వం **దేశానికి అర్పించి అనంత త్యాగం చేసి - నెహ్రూను సహితం ధిక్కరించగల ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశానికి పదవి ఊడింది. విశాలాంధ్రకోసం నిరంతరం శ్రమించిన బూర్గుల రామకృష్ణరావుకు రాజకీయ సన్యాసం లభించింది.**

ఆంధ్రప్రదేశ్ అవతరణ దినంనాడు అనేక సర్కారీ ఉత్సవాలు జరిగాయి. రేడియో – పత్రికలు, ఆస్థాన పండితులవలె ఏర్పడిన రాష్ట్రాన్నీ – ప్రభుత్వాన్నీ పొగడ్తలతో ముంచెత్తారు. కవులు సరేసరి.

"నా తెలంగాణ కోటిరత్నాలవీణ" అన్న నా అగ్రజుడు మహాకవి దాశరథి "మూడు కోటుల నొక్కటే ముడిబిగించి" అని మహాంధ్రోదయ కావ్యము రచించినారు.

ఒకటి నవంబర్ 1956న వెలువబడిన గోలకొండ పత్రిక విశేష సంచికకు నేను 'తెలంగాణంలో విద్యావికాసం' అనే వ్యాసం రచించాను.

**నేను ఆంధ్రప్రదేశ్ అవతరణ గురించి సంతోషించను లేదు, విచారించను లేదు. ఏలననగా, మనుషులను కూర్చే శక్తి ఏ సంస్థకూ లేకుండా పోయింది.**

మతం ఒక్కటేనన్న రాజకీయ నినాదంతో ఏర్పడిన పాకిస్తాన్ ముక్కలయింది. మతం ఒకటే అయినా ఇరాఖ్, కువైట్లు యుద్ధానికి దిగాయి.

ఒకే భాషా సంస్కృతులుగల వంగదేశం నుంచి బంగ్లాదేశ్ విడిపోయిది.

"ప్రపంచ శ్రామికులారా, ఏకం కండి!" అన్న మార్క్స్ మహర్షి నినాదాన్ని వల్లించే దేశాలు – పార్టీలు రాజకీయ ప్రయోజనం కోసం ప్రజలను విడగొడ్తున్నాయి! రాజకీయ స్వప్రయోజనపరులే రష్యాలోని సోషలిస్టు సామ్రాజ్యాన్ని కూల్చివేశారు.

**మతం - కులం - దేశం - ప్రాంతం - భాషలాంటివి రాజకీయులకు తప్ప - ప్రజలకు ఉపయోగపడవు!**

**రాజకీయ నరకుని అంతం చేసిననాడే సకల ప్రపంచ ప్రజలకు దీపావళి దివ్వెల పండగ!**

## దయ్యమేనేమో!:

జీవితం సకలానికి – సాహిత్యానికివలెనే – ముడిసరుకు. జీవిత సంఘటనలే కాల్పనికములయి సాహిత్యరూపం ధరిస్తాయి. ఒక వాస్తవ విచిత్ర సంఘటన వివరిస్తాను.

వేసవి శలవులకని అన్నయ్య కుటుంబం, మేము గార్ల చేరుకున్నాం. చెల్లెళ్లు కూడా వచ్చారు. ఆనాడు రాత్రిదాకా మాటలు ముచ్చట్లు – హాస్యాలు పరిహాసాలతో గడిచింది.

నేనూ కమలా పిల్లలు ఇంటి ముందరి విడి స్థలంలో పడుకున్నాం. అన్నయ్యా వదినావాళ్లు వెనుక దొడ్లో పడుకున్నారు. కృష్ణపక్షం. తెల్లవారు జామున వెన్నెల వచ్చింది. నన్ను ఒక స్త్రీహస్తం కదిలించింది. నేను కమల అనుకున్నాను. కళ్లు తెరచాను. తెల్లచీర ముసుగువేసుకున్న స్త్రీ! నాకు భయం వేసింది. "దెయ్యం – దెయ్యం" అని కేకలు పెట్టాను. అందరూ లేచారు. నేను దెయ్యాన్ని పట్టుకున్నాను. ఆమె తన పేరు చెపుతుంది. 'దెయ్యం అలాగే చెపుతుంది' అని పాదివి పట్టుకున్నాను. పడుకున్న వాళ్లంతా లేచారు. వాళ్లు ఏమీ చూడలేదు. "దయ్యం – దయ్యం" అని అరిచారు. ఆమె విడిపించుకోవడానికి ప్రయత్నిస్తున్నది. నేను వదలడం లేదు.

అన్నయ్య వెనుకనుంచి కుర్చీ ఎత్తుకొని వచ్చాడు. 'పులి అనుకున్నాను' అని కుర్చీ వేసుకొని కూర్చున్నాడు.

తెల్లవారవస్తున్నది, ఇరుగు పొరుగులు లేచారు. ఇంతకూ నేను పట్టుకున్నది పూర్వసువాసిని లక్ష్మీబాయమ్మను! అందరూ విడువమంటే విడిచాను. ఆమె తలవంచుకుని వెళ్లిపోయింది.

"తమ్ముడూ! ఆ పోయింది నిజంగా లక్ష్మీబాయమ్మేనంటవా? దయ్యం కాదుకదా!" అడిగాడు అన్నయ్య!

"ఏమో!!" అన్నారు అంతా.

"అరె! గిప్పుడే కదా పోయింది. కండ్ల బడ్తలేదు. దయ్యమే కావచ్చు" అన్నది ఒక అవ్వ!

## పట్నం కొలువు:

వేసవి శలవులు అయిపోయాయి. మృగశిర ప్రవేశించిన్నాడు డోర్నకల్లు చేరాను. పదవ తరగతి వచ్చింది. పిల్లలు – తల్లిదండ్రులు – గ్రామస్తులు చాల సంతోషంగా ఉన్నారు. "రంగన్నా! అనుకున్నది నెరవేర్చినవు" – గండి మల్లన్న నాకు అభినందనలు తెలిపాడు.

ఇంకా సంబరాల్లోనే ఉన్నాం. క్లాసులు మొదలు కాలేదు. ప్రతికల్లో ఒక ప్రకటన వచ్చింది. అది సికిందరాబాదు మున్సిపల్ కార్పొరేషనులో తెలుగు అనువాదకుని పదవికి అభ్యర్థులు కావలెననేది. నా విద్యార్హతలు అందుకు సరిపోతాయి. అయితే నగరపు పోటీని నేను తట్టుకోగలననే నమ్మకం లేదు. అయినా దరఖాస్తు పంపించాను. ఆశ్చర్యం! ఇంటర్వ్యూకు రమ్మని జాబు వచ్చింది. హైదరాబాదులో అన్నయ్య ఇంట్లో విడిశాను. అన్నయ్యను అడగలేదు. నేను వారి సాయం కోరలేదు. ఎంచాతంటే, ఆ ఉద్యోగం నాకు వస్తుందని నమ్మకం లేదు.

నేను వెతుక్కుంటూ మారేడు పల్లిలోని మునిసిపల్ ఆఫీసుకు చేరుకున్నాను. ఆఫీసు వాతావరణం నాకు కొత్త. ఆడా, మగా ఎమ్మేలు ఇంటర్వ్యూకు వచ్చారు. ఉద్యోగం రాదని నా నిశ్చయం. అందువల్ల బుగులు పడలేదు!

అందరి తరువాత – చివరకు – నన్ను పిలిచారు. ఇంటర్వ్యూ చేసున్నది ఎనిమిది మంది సభ్యులు గల స్థాయి సంఘం. దానికి గాడేపల్లి జగన్నాథంగారు

ఛైర్మన్ – సాహిత్యంతో పరిచయం గలవారు. వారు సాహిత్యానికి సంబంధించిన కీలకం అయిన ప్రశ్నలు అడిగారు. నాకు తెలిసిన సమాధానాలు చెప్పాను. అప్పటికి పత్రికల్లో వచ్చిన నా వ్యాసాలు చూపించాను.

ఇంటర్వ్యూ ముగిసింది. ఆశపెట్టుకోలేదు. కాబట్టి నిరాశ ప్రసక్తి లేదు. ఇల్లు చేరుకోవడానికి బస్టాపు దగ్గర నుంచున్నాను. ఇంకా బస్సు రాలేదు. ఒక బంట్రోతు – రామస్వామి – రొప్పుకుంటూ నా దగ్గరకు వచ్చాడు.

"అయ్య రమ్మంటుండు" – నన్ను పిలిచాడు.

"నన్నేనా?"

"అవ్! నిన్నే! అయ్య నీ కొరకే కూకున్నాడు."

నేను వెళ్లాను. గాడేపల్లి జగన్నాథంగారు ఒక్కరే ఉన్నారు. నన్ను కూర్చొమ్మన్నారు. కూర్చున్నాను.

"You are selected for the post" అన్నారు.

అది కలయో! వైష్ణవ మాయయో అనిపించి నేను నిశ్చేష్టుణ్ణి అయినాను. కనీసం కృతజ్ఞత చెప్పలేదు.

"When are you going to join?" – అడిగారు.

నా మీద మరొక పిడుగు పడింది. తడబడ్డాను, తబ్బిబ్బయినాను, జవాబు చెప్పలేకపోయాను.

"సోమవారం వచ్చి, ఆర్డరు తీసుకోండి."

నాకేమీ అర్థం కావడం లేదు. అయోమయంలో పడిపోయాను. అది వాస్తవమో, కల్పనయో తెలియడం లేదు.

"Now you can go."

అప్పటికి ఈ లోకంలోకి వస్తున్నాను.

నాకు ముఖస్తుతి తెలియదు. 'మీకు చాల చాల కృతజ్ఞతలు' అని బయటపడ్డాను.

"ఉద్యోగం దొరకడం ఇంత సులభమా?" అనుకున్నాను. ఆనందంలో – అప్పటికి పదవసారి వదిలిన సిగరెట్టు – మళ్లీ కొని కాల్చాను, పీల్చాను. డబుల్‌డెకర్‌లో పైఅంతస్తులో ముందరి సీటులో కూర్చొని ఏవో లోకాల్లోకి వెళ్లిపోయాను.

అన్నయ్యతో చెపితే, "నీకు కాక ఎవరికి వస్తుందిరా?" అన్నారు.

అప్పటికి నేను చేస్తున్న ఉద్యోగంలో గ్రేడు 55–99. నాకు రానున్న ఉద్యోగపు స్కేలు 140–5–190. వెంటనే నా టీచరు ఉద్యోగానికి రాజీనామా పోస్టులో పంపించాను. సోమవారంనాడు మున్సిపల్ ఆఫీసుకు వెళ్లాను. సెక్రటరీ వెంకటపతిరాజుగారు ఆర్డరు చేతికి ఇస్తూ "నీవు చురుకయిన వాడివని – నీలాంటివాడు దొరకడనీ వెంటనే ఆర్డరు ఇమ్మన్నారు ఛైర్మన్‌గారు" అన్నారు. తరువాత స్టాండింగ్ కమిటీ ప్రొసీడింగ్స్‌లో ఆ విషయం వ్యక్తం అయింది.

నేను ఉద్యోగంలో చేరాను. శలవు పెట్టాను. డోర్నకల్లు వెళ్లాను. కమల ముమ్మురిసిపోయింది. గ్రామస్తులు – ఉపాధ్యాయులు – విద్యార్థులు ఆత్మీయం అయిన వీడ్కోలు ఇచ్చారు. స్టేషనుకు గుంపులు గుంపులుగా వచ్చి మమ్మల్ని రైలు ఎక్కించి వీడ్కోలు చెప్పారు. కనులు చెమర్చగా మేము – భౌతికంగా డోర్నకల్లును

విడిచాం. డోర్నకల్లుకు సంబంధించిన మరొక విషయం చెప్పి, డోర్నకల్లుకు దూరం అవుతాను.

గండి మల్లన్న – మల్లికార్జునరావు – సిరిపురం కాంగ్రెస్ క్యాంపులో నాతో పని చేశారు. నేను మెట్రిక్ చదువుకోవడానికి డోర్నకల్లులో తావరం ఏర్పరచారు. అభిమానంతో నన్ను టీచరుగా డోర్నకల్లుకు రప్పించారు.

గండి మల్లన్న ఆ తరువాత MLA అయినారు. MP అయినారు. అయినా నన్ను – మా కుటుంబాన్ని మరువలేదు. నేను భారత రచన పూర్తి చేసిన సందర్భంగా 20 జూన్ 1993 ఆదివారం నాడు – గండి మల్లన్న స్వాతంత్ర్య సమరయోధుల సంఘం పక్షాన – మా దంపతులకు ఆదరంగా – ఆత్మీయంగా – అట్టహాసంగా సన్మానం చేశారు. నన్ను గుర్తుంచుకున్న జనం తండోపతండాలుగా సభకు వచ్చారు. పండుగ చేసినట్లు మల్లన్న తన ఇంట్లో వందలమందికి భోజనాలు పెట్టారు.

"రంగన్నా! నేను చేస్తున్న చివరి ఫంక్షన్ – నా మనుమరాలి నామకరణానికి రావాలి" అని బ్రతిమిలాడాడు. 19 ఆగస్టు 1994న నేనూ కమలా వెళ్లాం.

12–9–1994న మా అమ్మాయి ఉదయ ఇంట్లో ఇల్లందులో ఉండగా డోర్నకల్లునుంచి దుర్వార్త – మల్లన్న వెళ్లిపోయాడు!

మేమంతా డోర్నకల్లు వెళ్లాం.

భద్రక్క నేనే తోడబుట్టినవాణ్ణి అయినట్లు "అన్నయ్యా! నువ్వు పెట్టిన కట్నాలు తీసుకొని పోయిండన్నయ్యా!" అని నన్ను పట్టుకొని వలవల ఏడ్చింది.

"మృత్యోర్మా అమృతం గమయ"

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః

నచైనం క్లేశ యంత్యాపో నశోషయతి మారుతః.

(ఆత్మకు నాశనము లేదు. దానిని ఆయుధములు ఛేదింపలేవు. అగ్ని దహించలేదు. నీరు తడుపలేదు. గాలి ఎండగొట్టలేదు.)

## మార్పులు:

మేము 1957 జూన్‌లో డోర్నకల్లు వదిలాం. స్వాతంత్ర్యం వచ్చిన్నాటినుంచి అప్పటికి భారతదేశంలో అనేక మార్పులు వచ్చాయి. భారతదేశ ముఖచిత్రం మారిపోయింది.

1. భారతదేశంలో ఉండిన 500 పైగా సంస్థానాలు విలీనం అయిపోయాయి. వాటి రూపురేఖలు కనిపించలేదు. రాష్ట్రాల పునర్విభజన జరిగింది. A, B, C రాష్ట్రాలు మాయం అయినాయి. రాజప్రముఖులు అంతరించారు. రాష్ట్రాలన్నింటికి సమాన ప్రతిపత్తి కలిగింది.

   తరువాత కాలంలో ఫ్రెంచి, బుడతకీచుల అధీనంలో ఉండిన ప్రాంతం కూడా విముక్తం అయింది.

   భారతదేశం ఒకే దేశం – దేశానికి ఒకే ప్రభుత్వం – ఒకే పతాకం – ఒకే కరెన్సీ ఏర్పడింది.

ఇందుకు సర్దార్ పటేల్‌గారి అలసట ఎరుగని నిరంతర కృషి – వారి దేశభక్తి – వారి ప్రజ్ఞాపాటవాలు కారణాలు.

2. భారతదేశంలో ఉండిన అనేక రైల్వేలు – N.S.R, M.S.M, G.I.P వంటివి విలీనం అయి, జాతీయం చేయబడిన ఒకే భారత రైల్వే ఏర్పడింది.
3. దేశానికి ఆహారపదార్థాల కొరత విపరీతంగా ఉండేది. ఆ కొరత తీర్చడానికి హరిత విప్లవం ప్రారంభం అయింది. బక్రానంగల్ – నాగార్జునసాగర్ వంటి అనేక ప్రాజెక్టుల పని ప్రారంభం అయింది.
4. పారిశ్రామికంగా స్వయం సమృద్ధం కావడానికి రష్యావంటి దేశాల సహకారంతో పరిశ్రమలు – సాంకేతిక విజ్ఞానాభివృద్ధి కొనసాగింది.
5. అంతకు ముందు ఉండిన అణాలు, పైసలు రద్దయినాయి. దశాంశ పద్ధతిలో నయా పైసలు వచ్చాయి. తూనికల్లో – కొలతల్లో దశాంశ పద్ధతి ప్రారంభం అయింది.

   భారతదేశాన్ని ఆధునిక సైన్సు యుగంలో ప్రవేశపెట్టడానికి మిశ్రమ ఆర్థిక విధానం ప్రవేశపెట్టి, నిరంతరాయంగా శ్రమించిన ఆదర్శవాది – తొలి ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ కృషిని భారతజాతి విస్మరించడం అసాధ్యం – అసంభవం.
6. 1957 నాటికి భారతదేశపు జీవనాడులయిన పల్లెల ఆర్థిక – సామాజిక – సాంకేతిక జీవితంలో ఎలాంటి మార్పు వచ్చిన జాడలు లేవు. విద్యుత్తు, రవాణా సౌకర్యాలు వారి దరిదాపులకు చేరలేదు. యంత్ర నాగరకత చాయలు కనిపించలేదు. సాంఘిక జీవనంలో ఏ మాత్రం మార్పు జరగలేదు. విద్యారంగంలో ఇసుమంత మార్పు వచ్చింది. అతిశయోక్తి కాదనుకుంటే జండా మారడం తప్ప పల్లెప్రజలకు ఏ మార్పూ తెలియదనడం వాస్తవ సత్యం.

## ఇరవయి ఎనిమిది

## విపులాచ పృథ్వీ:

సికిందరాబాదు ప్రణాళికాబద్ధంగా అభివృద్ధి చెందిన నగరం. అంగ్రేజువారు ఈ నగరాన్ని – బెంగళూరు వంటి నగరాలవలె – కంటోన్మెంటు ప్రాంతంగా అభివృద్ధి చేశారు. దీని అభివృద్ధికి తమిళ ముదలియారులు – క్రైస్తవ మిషనరీలు ఎంతో కృషి చేశారు.

సికిందరాబాదుకు పురాతన చరిత్ర ఉంది. హష్మత్‌పేట వద్ద త్రవ్వకాలలో క్రీస్తుపూర్వం మూడువేల సంవత్సరాల క్రితపు 'కెర్నెస్' సమాధులు బయటపడినాయి. అప్పుడే ఇక్కడ జనావాసం ఉందనడానికి ఇది నిదర్శనం.

కుతుబ్‌షాహీల కాలంలో "హుసేన్‌షాపురా" అనే గ్రామం ఉండేది. ఇబ్రాహింకులీ కుతుబ్‌షాకు చేసిన జబ్బు "హుసేన్‌షావలీ" అనే ఫకీరు వల్ల నయం అయింది. అతనికి కృతజ్ఞత తెలియపరచడానికి 1562లో 2,5,4,636 రూపాయిల కర్చుతో నిర్మించిందే హుసేన్ సాగర్. "హుసేన్‌షాపురా" ఆ వలీపేర వెలసిన గ్రామం.

రెండవ ఆసఫ్జా నిజామలీఖానుతో జరిగిన వప్పందం ప్రకారం ఈ ప్రాంతం ఆంగ్లేయులకు అర్పితం అయింది. వారు అక్కడ బ్రిటిషు సైన్యాన్ని ఏర్పాటు చేసుకున్నారు. అప్పటి రెసిడెంట్ సెడన్‌హాం అప్పటి మూడవ ఆసఫ్జా సికిందర్ జాహ్‌పేర 'సికిందరాబాదు' అని నామకరణం చేయాలనుకున్నాడు. నవాబు అనుమతి కోరుతూ 1806లో ఒకలేఖ వ్రాశారు. నవాబు అందుకు అంగీకరిస్తూ ఫారసీలో ఫర్మాను జారీ చేశాడు. దాని తెలుగు సారాంశం :–

"అల్లా అనుగ్రహంవల్ల ఈ ప్రాంతం అంగ్రేజుల
సైనిక తావరం, అయింది. మన ఉభయ ప్రభు
త్వాల నడుమగల సామరస్య చిహ్నంగా ఈ
ప్రాంతానికి 'సికిందరాబాదు' నామము అంగీ
కరించనైనది. భవిష్యత్తులో సహితము ఈ
నగరం ఈ నామముననే ప్రసిద్ధి చెందగలదు."

1946లో రెండిషను ప్రకారం నిజాంకు అప్పగించేవరకు బ్రిటిషువారి పాలనలోనే సికిందరాబాదు ఉండేది. సైనిక స్థావరం కాబట్టి పాటకజనం 'లష్కర్' అంటారు. లష్కర్ అంటే సైన్యం. సాధారణ ప్రజకు హైదరాబాదు పట్నం – సికిందరాబాదు "లష్కర్".

1951 మున్సిపల్ కార్పొరేషను చట్టం ప్రకారం సికిందరాబాదుకు – హైదరాబాదుకు వేరువేరు మున్సిపల్ కార్పొరేషన్లు ఏర్పడినాయి.

సికిందరాబాదు తెలుగుకు – హైదరాబాదు ఉర్దూకు ప్రాతినిధ్యం వహించేవి. సికిందరాబాదు కార్పొరేషను వ్యవహారాలు ఇంగ్లీషులో జరిగేవి. ఆంధ్రభాషాభిమానంగల S.R. వేంకటేశంగారు మేయర్ అయినారు. అప్పుడు వారు కమిటీల ప్రొసీడింగ్స్ తెలుగులో అనువదింపచేయడానికి తీర్మానించారు. అనువాదక పదవి కల్పించారు. నేను ఆ పదవిలో నియమించబడినపుడు వారు మేయరుగా లేరు.

మేము సికిందరాబాదు చేరుకునేవరకు మా మామగారు అత్తగారు వారి పిల్లలు మళ్లీ సికిందరాబాదు చేరుకున్నారు. వారు మా కోసం బట్టల బజారులో నెలకు 30 రూపాయిల అద్దెకు ఒక రెండు గదుల ఇల్లు ఏర్పరచారు. అందులో రెండు కరెంటు బల్బులుండేవి. నల్లా లేదు, బావి ఉండేది, మనుషులు ఎత్తిపోసే పాయికానా ఉండేది. మేము హుసేన్‌సాగర్ వద్దుకు బహిర్భూమికి వెళ్లేవాళ్లం. రాష్ట్రపతి రోడ్డు మీదినుంచి 7B బస్సు ఒకటి మాత్రమే మారేడుపల్లికి వెళ్లేది. ఆ రోజుల్లో నయాపుల్ తరువాత – యూనివర్సిటీ రోడ్డుకు RTD బస్సులు ఉండేవి కావు.

కార్పొరేషనులో నా పని కమిటీల కార్యక్రమాల అనువాదం మాత్రమేకాదు. మేము వచ్చినప్పుడు నగరంలో తీవ్రం అయిన 'ఫ్లూ' వ్యాపించింది. దాని నివారణను గురించిన ఆంగ్ల కరపత్రాన్ని – ఉద్యోగ ధర్మంలో – తొలిసారి అనువదించాను. నగరానికి ప్రముఖులు వచ్చినపుడు స్వాగత పత్రం ఇంగ్లీషులో తయారయ్యేది. వాటిని తెలుగు చేసే బాధ్యతకూడా నాదే.

ప్రముఖులకు పౌరసన్మానాలు జరిగినపుడు హైదరాబాదు మేయరు ఉర్దూలోనూ, సికిందరాబాదు మేయరు తెలుగులోనూ సన్మాన పత్రాలు చదవాలి. అయితే సికిందరాబాదు మేయర్లు అంగ్రేజి చదివేవారు. వారికి తెలుగు చదవడం వచ్చేది కాదు.

మేయర్లలో కొందరికి తెలుగు చదవడం నేర్పాను. నాకు నెహ్రూ – రాధాకృష్ణన్ – రాజేంద్రప్రసాద్ – తొలి మహిళావ్యోమగామి వెలంతినా తెరష్కోవాలకు సమర్పించిన సన్మాన పత్రాలను తెనిగించే అదృష్టం కలిగింది.

ఇవికాక కొందరికి చాటు రచనలు చేయాల్సివచ్చేది. ఒక సందర్భంలో ఒక డిప్యూటీ మేయరుకు ఉపన్యాసం వ్రాసి ఇచ్చాను. వారు 'ఎరుగుదురు' ను 'ఏరుగుదురు' అని చదివారు. సభికులు గొల్లున నవ్వారు. డిప్యూటి మేయరుకు ఏమీ అర్థం కాలేదు.

"అయిన అట్లనే రాసిండు నన్నేం చేయమంటరు?" అని కాగితం చూపించాడు.

ఉపసంఘపు ప్రొసీడింగ్స్ అనువాదంలో 'అత్యవసర' అనే పదం వాడాను. ఒక సభ్యుడు 'ఏందయ్యా, ఈన హత్యలు చేస్తుండు' అని అడిగారు. నన్ను కమిటీకి పిలిపించారు. నేను వివరించాను. ఆనాటి నుంచి తప్పులు ఉన్నా అడగడం మానేశారు. ఇలాంటివి మరి కొన్ని జరిగాయి!

ఆంధ్ర ప్రదేశంలో తెలుగుకు పట్టిన దుర్గతికి బాధపడ్డాను. సికింద్రాబాదు తెలుగుమీద నాకున్న విశ్వాసం విరిగిపోయింది. ఇది ప్రజల తప్పు ఏమాత్రం కాదు. రాజకీయ దుష్టత్వం! నిజాం నవాబు హైదరాబాదును పాకిస్తాన్ చేశాడు. పాకిస్తాన్‌లో ఒక హైదరాబాదు ఉంది. జోష్‌మలీహాబాదీ అనే ఉర్దూకవి హరాబ్‌కే నషేమే పాకిస్తాన్ హైదరాబాదుకు ప్రయాణమై – అవిభక్తభారతంలో – దక్కన్ హైదరాబాదుకు చేరుకున్నాడు. చిరాగలీ గల్లీ – ఆసిఫీ నగర్ – ఆబిడ్ రోడ్ బయటివారికి పాకిస్తాన్ పేర్లలాగే ఉంటాయి. అలాగే ఆంగ్లేయులు సికిందరాబాదును ఇంగ్లండు చేశారు. జేమ్స్ స్ట్రీట్ – ఆక్స్‌ఫర్డ్ స్ట్రీట్ – సెంట్ బార్టన్ రోడ్డు ఇంగ్లండును తలపిస్తాయి.

అంగ్రేజు అభిమానులకు తెలుగు రుచి చూపించాలనుకున్నాను. ఆఫీసులో సాంస్కృతిక కార్యక్రమం ఏర్పాటు చేయాలనుకున్నాను. అప్పటి మేయర్ శిర్నాం సత్యనారాయణగారు – గాడేపల్లి జగన్నాధంగారు – వెంకటపతి రాజుగారు నాకు సాయం చేయడానికి అంగీకరించారు. సిబ్బంది నుంచికూడా మంచి ప్రతిస్పందన వచ్చింది. అయితే కమీష్నర్ అనుమతి కావాలి.

కమీష్నర్ ధర్మరాజ్ మాథుర్ మంచివాడు. నిజాయితీ, పరిపాలనా పాటవం గల కాయస్థు. కాయస్థులు ఉత్తరదేశంనుంచి వలస వచ్చినవారు. ముస్లిం వేషభాషలు గల హిందువులు. వారికి ఉర్దూ తప్ప అన్యభాష రాదు, నేర్వరు. మహారచయిత ప్రేమ్‌చంద్, తొలి రాష్ట్రపతి రాజేందర్ పర్షాద్ కాయస్థులు. ధర్మరాజ్ మాథుర్ కొంత గొణిగారు. గానా బజానాలో పని చెడిపోతుందన్నారు. అయితే మేయర్ మాట కాదనలేకపోయారు.

రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా సికిందరాబాదు మున్సిపల్ కార్పొరేషను ఆవరణలో ఆంధ్ర సాంస్కృతిక ఉత్సవాలు వైభవంగా జరిగాయి. ఒక నాటిక – నేను వ్రాసిన బుర్రకథ – కవితలు – ముషాయిరా అందరిని అలరించాయి, మురిపించాయి. తెలుగు తీయదనం చవి చూపించాయి. పెద్దలు ప్రముఖులు – వట్టికోట అళ్వార్ స్వామి సహితంగా – అందరూ నన్ను అభినందించారు. తరువాత చాలాసార్లు కవి సమ్మేళనాలు – మిగతా కార్యక్రమాలు నిర్వహించాం.

వట్టికోట అళ్వార్ స్వామి తెలంగాణా ప్రజా ఉద్యమానికి - ప్రజా సాహిత్యానికి ఊపిరి వంటివారు. వారు కమల పక్షంగా మాకు బంధువు. మా అత్తవారిది అడ్లూరు. వారిది అక్కడికి దగ్గరలోని మాధారం. రెండు నల్లగొండ జిల్లాలోనివే. అళ్వార్‌స్వామి తెలంగాణంలో ప్రథమ బ్యాచ్‌లోని సత్యాగ్రహి. పోలీసు చర్య జరిగేదాకా జేల్లోనే ఉన్నారు.

అళ్వార్‌స్వామి స్ఫురద్రూపి. 'పుంసాం మోహన రూపాయ' వీరికి వర్తిస్తుంది. అళ్వార్‌స్వామి వలె నిష్కపటంగా నవ్వగల మరొకరు మహాత్ముడు మాత్రమే! అతను కట్టిన శుభ్రమయిన తెల్లని ఖద్దరు బట్టల వంటిదే అతని మనసు. మలినములేని మనసువాడు.

అళ్వార్‌స్వామి కమ్యూనిస్టు పార్టీ మెంబర్. నాకు మాత్రం అతడు గాంధీవాదిగా దర్శనం ఇస్తాడు. వారింట్లోని ఒక పటంలో వినోబాజీ భూదానపు అంగ - స్టాలిన్ అంగకన్న పెద్దగా ఉంటుంది.

అళ్వార్‌స్వామి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు అభిమాని. వారి పేర గ్రంథమాల - గ్రంథాలయం స్థాపించి, నిర్వహించారు. వారు తాము ప్రచురించిన గ్రంథాలు పట్టుకుని తెలంగాణం సాంతం మలయమారుతంలా పయనించారు. సాహితీ సుగంధాలు వ్యాపింపచేశారు. మేము కొండపల్లిలో ఉన్నపుడూ - డోర్నకల్లులో ఉన్నపుడూ వచ్చారు. మా ఇంటనే విడిశారు. వారుంటే ఒక సాహిత్యపు విందు! పసిపిల్లలతోవంటి పసందు!!

అళ్వార్‌స్వామికి నేనంటే ఎనలేని వాత్సల్యం. 'మా తమ్ముని ప్రతిభను నాకన్న ముందు అళ్వార్‌స్వామి గుర్తించారు.' అనేవారు మా అన్నయ్య. నేను సికిందరాబాదు చేరుకున్నాక అళ్వార్‌స్వామి నన్ను వదలి ఎక్కడికీ వెళ్లలేదు. కృష్ణశాస్త్రి - బుచ్చిబాబు - గోపీచంద్ - తాపీ ధర్మారావు వంటివారి దర్శన భాగ్యం నాకు కల్పించారు.

అప్పుడు జేమ్స్‌స్ట్రీట్ క్లాక్‌టవర్ వద్ద 'తెలుగుస్వతంత్ర' కార్యాలయం ఉండేది. అళ్వార్‌స్వామితో వెళ్లినపుడు గోరాశాస్త్రిగారితో పరిచయం ఏర్పడింది. మా ఇంటికి 'స్వతంత్ర' చాల దగ్గర - అనేకసార్లు గోరాశాస్త్రిగారిని కలిశాను. ప్రతిభకు మాగ్నెటులాంటివారు గోరాశాస్త్రి. ఏదన్నా వ్రాయమనేవారు. 'ఏం వ్రాయాలో అర్థం కావడం లేదు' అన్నాను. 'ప్రక్రియ వెదుక్కోవడం రచయితలందరికీ కష్టమే. ఏదో ఒకటి వ్రాయండి' అని ప్రోత్సహించారు.

'ఇండియా ప్రపంచశాంతి కృషి' అని వ్యాసం వ్రాశాను. శాస్త్రిగారు మెచ్చుకున్నారు, ప్రచురించారు.

నేను పట్నం చేరుకుని మూడున్నర దశాబ్దాలు దాటింది. అయినా పట్నం పరాయిగాను - పల్లె స్వంతంగానూ అనిపిస్తుంది. అవి కొత్తగా పల్లెనుంచి వచ్చినరోజులు. పల్లెల బాధలు - పట్నం విలాసాలు - ఈ వ్యత్యాసాలు - వెగటు కొట్టేవి. ఈ విషయంలో ఏదయినా వ్రాయాలని తపన ఉండేది. ఒకనాడు అమాంతంగా ఒక ఊహ - ఒక ఆలోచన వచ్చింది.

స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొన్న ఇద్దరు మిత్రులు - ఒకడు పదవి చేపట్టాడు. అతనికి 'భావదాసు' అని పేరు పెట్టాను. రెండోవాడు స్వచ్ఛందసేవకుడు. అతనిని

'దేహదాసు' అన్నాను. దేహదాసు భావదాసుకు వ్రాసినట్లుగా ఒక ఉత్తరం వ్రాశాను. గోరా శాస్త్రిగారికి చూపించాను. అది చూచి వారు పొంగిపోయారు. పల్లెలను గురించి ఇంత స్పందించడం విశేషం అన్నారు. వారం వారం వ్రాయమన్నారు. పది పన్నెండు వారాలు వ్రాశాను. వాటికి మంచి ప్రతిస్పందన వచ్చింది. నేను భావదాసుకు వ్రాస్తే దేహదాసుకు వ్రాసినట్లు ఉత్తరాలు వచ్చాయి. ఆ తరువాత నేను జబ్బుచేసి దవాఖానాలో పడ్డాను. వ్రాయలేకపోయాను.

గోరాశాస్త్రిగారు 'దేహదాసు ఉత్తరాలు' పుస్తకంగా రావాలనీ – వారు ముందుమాట వ్రాయాలనీ అనుకున్నారు. వారి జీవితకాలంలో వాటి ప్రచురణ జరుగలేదు. 1988లో నా షష్టిపూర్తి సందర్భంగా "దేహదాసు ఉత్తరాలు" ఆవిష్కరణ జరిగింది.

వట్టికోట ఆళ్వార్‌స్వామి తెలంగాణంలోని గ్రంథాలయోద్యమం నుంచి అన్ని ఉద్యమాలలో పాల్గొన్నారు. కమ్యూనిస్టు పార్టీ సభ్యులయి ఆంధ్రమహాసభలో ప్రముఖపాత్ర వహించారు. సికిందరాబాదు ప్రజా ఉద్యమానికి ప్రముఖులు. కొంతకాలం 'పీపుల్స్ బుక్ డిపో' నిర్వహించి కమ్యూనిస్టు సాహిత్య ప్రచారం చేశారు. సికిందరాబాదులో స్నేహితుల సంఘం – గుమాస్తాల సంఘం స్థాపించి నిర్వహించారు. సికిందరాబాదులో వారు పాల్గొనని ఉద్యమం లేదంటే సహజోక్తి మాత్రం అగును.

వట్టికోట ఆళ్వార్‌స్వామి పార్టీకి చెందిన వారయినా వారికి అతి సనాతనులయిన దీపాల పిచ్చయ్య శాస్త్రిగారితో సోదర సంబంధం ఉండేది. ఆళ్వార్‌స్వామి అభ్యుదయ రచయిత అయినా సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి – ఖండవల్లి లక్ష్మీరంజనం – చలమచర్ల రంగాచార్యుల వంటి సంప్రదాయ వాదులతో సన్నిహిత స్నేహసంబంధాలుండేవి. ఆ కాలమే అలాంటిది. సిద్ధాంతాలు, నమ్మకాలు, విశ్వాసాలు వేరు. వ్యక్తిగత సంబంధాలకు అవి అడ్డువచ్చేవి కావు. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి విప్లవ ప్రతీకలు. కొండా వేంకట రంగారెడ్డి, బూర్గుల రామకృష్ణరావు మితవాదులు. అయినా, వారు బంధువుల్లా కలిసి ఉండేవారు. చాయ్‌లు తాగేవారు. భోజన భాజనాలు జరిగేవి. ఈ విషయంలో మఖ్దూంది విశిష్ట వ్యక్తిత్వం. వారు రిక్షా కార్మికులతో ఎంత కులాసాగా గడిపేవారో, నవాబులతో సహితం అంత సరదాగా గడిపేవారు. వారి కవిత్వం కూడా 'సుర్ఖ్‌సవేరా' అరుణోదయం నుంచి 'రఖ్స్' కళలదాకా అసమాన శిల్పంతో సాగుతుంది. ఈ విషయంలో దాశరధికి, మఖ్దూమ్‌కు పోలికలు కనిపిస్తాయి. "అనాదిగా సాగుతోంది – అనంత సంగ్రామం – అనాధుడికీ ఆగర్భ శ్రీమంతుడికీ మధ్య" అన్న కలంగళంతోనే "ప్రతి వికారశిలయు ప్రతిమయ్యై వెలుగొందు – పడతివోలె కులికె వలపు రేపు అని" శిల్పిని కీర్తించారు అగ్రజులు దాశరధి.

ఆళ్వార్‌స్వామి తమ ప్రజా జీవితపు అనుభవాలు రంగరించి 'ప్రజలమనిషి' అనే ఉత్తమ నవల వ్రాశారు. అప్పుడే అది ప్రచురితం అయింది. వారే దానిని దేశోద్ధారక గ్రంథమండలి తరఫున ప్రచురించారు. "చాల భయంతో ఈ నవలను బయటకి తెస్తున్నాను" అన్నారు. ఎందువల్లంటే – వారు స్వయంగా రచయిత"కారు. రచనా కళతో వారికి పరిచయం లేదు. అయితే రచనకు 'ప్రత్యేక విద్య 'అంటూ ఏదీలేదు. తొలి ఆంగ్ల నవలా రచయిత 'డెఫో' వృత్తిరీత్యా వర్తకుడు. తొలి తెలుగు నవలా'రచయిత నరహరి గోపాలకృష్ణమ చెట్టి వృత్తిరీత్యా ప్రభుత్వోద్యోగి. రచయిత

పండితుడుగాని - పండితుడు రచయితగాని కానవసరం లేదు. రచనకు - ముఖ్యంగా నవలా రచనకు - పరిజ్ఞానం - వ్రాయాలనే తపన కావాలి!

రచన ప్రసవ వేదనలాంటిది. వేదన ఉంటే ఉద్భవిస్తుంది. అందుకే 'విద్యానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమా - నవంధ్యా జానాతి ప్రసవవేదనా' అన్నారు. విద్వాంసునికే విద్వాంసుని శ్రమ తెలుస్తుంది అని చెప్పడానికి ఉపమానంగా గొడ్రాలికి ఏం తెలుస్తాయి పురిటి నొప్పులు అన్నారు! ఎంత అందంగా చెప్పారు!!

ఆళ్వార్‌స్వామికి పరిజ్ఞానం ఉంది. తెలంగాణ జనజీవితం తెలియపరచాలనే తపన ఉంది. అందుకే "ప్రజల మనిషి" - ఆళ్వార్‌స్వామి తొలి ప్రయత్నం అయినా - ఉత్తమ నవలగా ప్రశంసలందుకుంది.

'ప్రజల మనిషి' తెలంగాణమును గురించి తెలంగాణంవాడు వ్రాసిన తొలి నవల. భాస్కరభట్ల కృష్ణారావుగారు 'యుగసంధి' వ్రాసిన మాట నిజం. అందులో ప్రజాపోరాటాల చిత్రణ కనిపించదు. అది సాంఘిక నవల. తెలంగాణ ప్రజా పోరాటానికి ప్రభావితులై బొల్లిముంత శివరామకృష్ణ "మృత్యుంజయులు"; మహీధర రామమోహనరావుగారి "ఓనమాలు", "మృత్యువునీడల్లో"; లక్ష్మీకాంతమోహన్ "సింహగర్జన"లు వచ్చాయి. అయితే వాటిలో "తెలంగాణదనం" కొరవడింది. అందువల్ల "తెలంగాణదనం" తో ప్రజాజీవితాన్ని చిత్రించిన తొలి నవల "ప్రజలమనిషి" అవుతుంది.

"ప్రజల మనిషి" నామీద ఎంతో ప్రభావం వేసింది. ఆ కథలో నేను కదలాడుతున్నట్లు అనిపించింది. ఆ నవలను గురించి ఒక సుదీర్ఘం అయిన వ్యాసం వ్రాశాను. 'ఇలాంటి నవలలు రాకుంటే ముసలి నక్క నిజాం రానున్న కాలంలో ధర్మప్రభువు అయ్యే అవకాశం ఉంది' అని వ్రాశాను. ఆ వ్యాసం "అభ్యుదయ" మాసపత్రికలో వచ్చింది. అది మామయ్య - ఆళ్వార్ స్వామికి తెలియకుండా పంపించాను. మామయ్య ఆ వ్యాసం చూచి ఎంతో సంతోషించారు. "రంగన్నా! నేను నిజంగా ఇంత మంచిగ రాసిన్నంటవ?" అని పొంగిపోయారు. వారిది పిల్లల మనస్తత్వం. అది పట్టుకుని గంతు లేసినట్లు గుర్తు!

ఒకనాడు "అమ్మడూ! కూరలు వండు కొచ్చిన, అన్నంతే - అందరం తిందాం" అని కమలతో అన్న మామయ్య మారుమాట్లాడనివ్వకుండా పళ్లాలు - మంచినీళ్లు పెట్టి వడ్డించారు. ఎన్నో కబుర్లతో భోజనాలు చేస్తున్నాం. ప్రసంగ సందర్భంగా సంస్కృతంలోనూ అభ్యుదయ సాహిత్యం ఉందని నేను సోదాహరణంగా వివరించాను. మామయ్య పులకించారు. "మాకంటె రాదాయె. వచ్చినోనివి ఊరుకుంటె ఎట్లా? వ్యాసం రాయి 'అభ్యుదయ'కు పంపింతాం" అన్నారు. నేను వ్యాసం వ్రాసేదాకా వదల్లేదు. వలసిన పుస్తకమల్లా తెచ్చి ఇచ్చారు. "అభ్యుదయోద్యమ సాహిత్య చరిత్ర" అనే వాస్యం 'అభ్యుదయ'లో వచ్చినపుడు మామయ్య దాన్ని అనేక మందికి చూపించారు. 'మా రంగన్నకు సంస్కృతం వచ్చు. తెలుగు వచ్చు. హిందీ వచ్చు. ఉర్దూ వచ్చు. అంగ్రేజి వచ్చు. అన్నిట్లో రాయగలడు. మీరెవరన్న రాస్తరా?" అని, నేను సిగ్గుపడేంత బహుళ ప్రచారం చేశారు. ఆళ్వార్ అనేకమందిని రచయితలను చేశారు.

మరొకనాడు 'తెలుగు రాజ్యం వచ్చిందయా! తెలుగు రచయితల్ను పట్టించుకుంటున్నడా ఎవడన్న?' అని ఆవేదన వ్యక్తం చేశారు. అంతరిస్తున్న తరాన్ని సత్కరించాల్సి

ఉందని నేను సూచించాను. వారికి. అది నచ్చింది. సికిందరాబాదులో మాలపల్లి రచించిన మహారచయిత ఉన్నవ లక్ష్మీనారాయణగారికి సన్మాన కార్యక్రమం ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమంతో వావిలాల గోపాలకృష్ణయ్యగారికి కూడా ప్రమేయం ఉన్నట్లు గుర్తు.

మేము సికిందరాబాదునుంచి ఉన్నవ వారిని సన్మానం ఆమోదించాల్సిందిగా వ్రాసిన లేఖ గుంటూరుకు సరిగ్గా ఉన్నవవారు పరమపదించిననాడు అందింది. ఉన్నవవారి శవం అక్కడ ఉండగానే వారి అబ్బాయి ఆ ఉత్తరం చదివారు!

**తెలుగు సర్కారు ఉన్నవను గుర్తించలేదు!**

**ఎందుకండీ - తెలుగువారికి ఒక రాష్ట్రం!!**

ఉన్నవ సన్మానసభ సంతాపసభగా మహబూబ్ కాలేజీలో నిర్వహించాం. అయ్యదేవర కాళేశ్వరరావుగారు – ఆంధ్రోద్యమ నాయకులు – అప్పటి శాసనసభ స్పీకర్ – అధ్యక్షత వహించారు. 'మాలపల్లెల మల్లెతోటలు మొలిపించినాడు' అనే గేయం నేను రచించి చదివాను.

"మాలపల్లి" భారతదేశపు ఉత్తమ నవలల్లో ఒకటి. హిందీలో మహా నవలాకారుడు ప్రేమ్‌చంద్ 'కర్మభూమి' నవలతో సాటియైంది. విచిత్రం ఏమంటే – కాశి దగ్గర ప్రేమ్‌చంద్' గుంటూరులో ఉన్నవ ఒకే సంవత్సరం పుట్టారు – ఒకే రకంగా ఆలోచించారు – ఒకే రకం రచన చేశారు!

ఇంగ్లండులో షేక్స్పియర్ 'కామిడీ ఆఫ్ ఎరర్స్' వలెనె ఆంధ్రప్రాంతంలో పింగళి సూరన కళాపూర్ణోదయం రచించారు.

**ఆలోచనలకు దూరతీరాలు ఉండవు.**

ఏడవ దశకంలో ఉన్నవ వారి "మాలపల్లి"ని హైదరాబాదు ఆకాశవాణి నుండి సీరియల్‌గా ప్రసారం చేయించడానికి అభ్యుదయ రచయితలం ఉద్యమం నిర్వహించాల్సి వచ్చింది!

మిత్రులు – నాటక కళానిధి – అవసానదశలో పద్మభూషణ అందుకున్న A.R. కృష్ణ జీవ నాటకంగా మాలపల్లికి బహుళ ప్రచారం చేసి, ప్రభుత్వాలను తలదన్నిన సేవ చేశారు.

ఆళ్వార్‌స్వామి నన్ను సభలకు, సమావేశాలకు తీసికెళ్లారు. ఉపన్యాసాలు ఇప్పించారు. పెద్దల పరిచయం చేశారు. నన్ను రచనలకు ప్రోత్సహించారు. నాకు ఒక మార్గం చూపారు. 'ఆళ్వార్‌లేని రంగన్నలేడు' అని అనుకునేంత సన్నిహితులం అయినాం.

ఆళ్వార్‌స్వామి కమ్యూనిస్టు. అందువల్ల అతడు నాస్తికుడని కాదు. నాస్తికులందరూ **కమ్యూనిస్టులుకారు. అలాగే కమ్యూనిస్టులంతా విధిగా నాస్తికులు కానక్కరలేదు.** అతడు ఆస్తికుడనీ చెప్పలేం. అంటే నిత్యసంధ్యలు, వ్రతాలు, పూజలు, భక్తి ప్రకటన చేసేవాడు కాదు. ఆ తరం, సుమారు మాతరం ఒక రకం అయిన హేతుబద్ధ ఆలోచనా విధానంలో పెరిగింది. ఈ నాటివలె ప్రకటన భక్తి – విపరీతంగా దేవాలయాలకు వెళ్లడం – భజనలు – స్వాములు వారి భక్తుల తండోపతండ

బృందాలు అప్పుడు లేవు. ఇప్పుడు పెరిగింది కామ్య భక్తి సమాజంలోని కల్లోలాన్నీ అశాంతతను భరించలేక – కోరికలు తీరక ఆశ్రయించిన భక్తి.

ఆళ్వార్ స్వామికి దేవునిమీదికన్న మనిషిమీద – సమాజంమీద అనంతం అయిన విశ్వాసం ఉండేది. వారు తమ తొలి నవలకు పేరు పెట్టడానికి దారితీసిన ఉదంతం అందుకు నిదర్శనం. వారు 'చిత్ర'– ఇప్పటి 'అంజలి' టాకీస్‌లో త్యాగయ్య – పిక్చర్ చూచారు. నాగయ్య నటించిన గొప్ప చిత్రం అది. నాగయ్య పోతన చిత్రంలో పోతన అవతారం, గౌరీనాధశాస్త్రి శ్రీనాధుని అవతారం దాల్చారు. అలాగే నాగయ్య త్యాగయ్యగా అవతరించారు. ఆ చిత్రం ఆళ్వార్ మీద ఎంతో ప్రభావం వేసింది. భక్తిపరంగా కాదు. దేవుణ్ణే నమ్ముకున్నవాడే బ్రతక కలుగుతే ప్రజలను నమ్ముకున్నవాడు బ్రతకలేడా అని తన నవలకు 'ప్రజల మనిషి' అని పేరు పెట్టారు. ఆళ్వార్ తిరుపతి వెళ్లి వచ్చారు. తన కొడుకుకు శ్రీనివాస్ అని పేరుపెట్టారు.

ఆళ్వార్‌స్వామి తెలంగాణ ప్రజాజీవితాన్ని నవలీకరించడానికి ఒక ప్రణాళిక సిద్ధం చేసుకున్నారు. ప్రజల మనిషి తరువాత 'గంగు' నవలలు ప్రారంభించారు. ఆ నవలను – పాత్రలను – సన్నివేశాలను – ఇతివృత్తాన్ని గురించి నాతో వివరంగా చర్చించారు. అయితే, నేను వారికి సూచనలుగాని సలహాలుగాని ఇచ్చానని చెప్పలేను. నాకు అంతటి స్తోమత లేదు. వారు నాకు వ్రాసినంతవరకు చదివి వినిపించేవారు. నాకు నచ్చని చోట చెప్పేవాణ్ణి. వారికి కూడా అది నచ్చితే మార్చేవారు. వారు చివరిసారి వినిపించినపుడు "కాని, వెంకట్రావు ఇంట్లోంచి కేకలు పెడ్తూనే ఉన్నాడు. "కామ్రేడ్ సుజాత జిందాబాద్" వరకు విని అన్నాను: "మామయ్యా! నవల ఇక్కడికి ముగించడం మంచిది. మరీ పెద్దది కావటం మంచిది కాదు. గంగు ఇంకా చిన్నపిల్ల. నవలకు 'నవనీతం' అని పేరుపెట్టండి." నా సూచన వారికి నచ్చిందో లేదో తెలియదు. కాని దైవికంగా అది అక్కడికే ఆగిపోయింది.

మన ప్రయత్నం సంపూర్ణంగా ఉన్నా జరక్కపోయేది, ప్రయత్నం ఏమాత్రం లేకున్నా జరిగేది దైవికం.

ఆళ్వార్‌స్వామి ఒక రోజు భవానీ భట్టాచార్య రచించిన "He who rides a tiger" అనే నవల నామీద వేశారు. "రంగన్నా! దీన్ని తొందరగ అనువాదం చేయి – అచ్చు కావలె" అన్నారు. "మామయ్యా! నాకు ఇది ....." నా మాట పూర్తి కానివ్వలేదు. "నీ శక్తి నీకు తెలియదు. చేయమంటున్నగద, చేసి ఇయ్యి" అన్నారు. అక్కడ నిలువలేదు, వెళ్లిపోయారు.

మహారచయిత భవానీ భట్టాచార్య, వారు రచించిన ఆంగ్లనవల HE WHO RIDES A TIGER అనువాద బాధ్యత నామీద పడింది. నవల చదివాను. గొప్ప నవల. దాని మీద ఎనలేని అభిమానం ఏర్పడింది. అనువాదం విషయంలో భయమూ ఏర్పడింది. కాని తప్పదు. చేయాల్సిందే, పుస్తకం మొత్తాన్నీ వాక్యాను వాదం చేశాను. తరువాత text వదిలాను. నా అనువాదాన్ని తెలుగు నుడికారపు వాక్యాలుగా వ్రాశాను. అనువాదం పూర్తిచేసి మామయ్యకు అందించాను. వారు కనీసం నా అనువాదం సరిచూడలేదు. అచ్చుకు ఇచ్చారు. దానికి వారు పెట్టిన పేరు "దేవుని పేరిట." అది అచ్చయి 'చిత్తప్రసాద్' ముఖ చిత్రంతో నా చేతికి వచ్చిన్నాటి నా మురిపెం – బిడ్డను కన్న తల్లి మురిపెం లాంటిది! అది నా తొలి నవలా అనువాదం!

"దేవుని పేరిట" 1943లో బెంగాలులో వచ్చిన భయంకర కాటకం ఇతివృత్తంగా వచ్చిన మహత్తర నవల. కరువులో మోసగించబడిన 'కాలూ' దేవుణ్ణే ఆయుధంగా – తనను మోసగించిన వర్గాన్ని – మోసగిస్తాడు. దుర్మార్గాన్ని జయించడానికి దుర్మార్గపు ఆయుధాలే అవసరం అనుకుంటాడు. 'దేవుని పేరిట' అందరి మన్ననలు పొందింది. రచయితగా నాకు ఆత్మవిశ్వాసం కలిగించింది.

ముల్కరాజ్ ఆనంద్ రచన 'THE STORY OF MAN' కూడా మామయ్య నాతో అనువాదం చేయించారు. కాని అది అచ్చుకాకుండానే వెళ్లిపోయారు.

ఆళ్వార్‌స్వామికి అంతకుముందు కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం లేకుండింది. వారు సాహిత్యరంగంలో పని చేస్తున్నారు. అందువల్ల సభ్యత్వం తీసుకోలేదు.

కేరళలో ఏర్పడిన తొలి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నెహ్రూ ప్రభుత్వం కూలదోసింది. అది ప్రగతిశీలు రందరికీ ఆగ్రహకారణం అయింది. ఆ అకార్యంతో నెహ్రూ విషయంలో నాకు ఉండిన అచంచల విశ్వాసం పడిపోయింది.

అదేరోజు మామయ్య తోలుసంచీ పట్టుకొని మా ఇంటికి వచ్చి ధుమధుమలాడుతూ కూలబడ్డారు. "చిన్నాయిన ఇవ్వాళ శాన గరంగున్నడు" అని కమల చాయ్ అందించింది.

"అమ్మడూ! గరంగ ఉన్ననని ఇంకెంత గరం చాయ్ ఇస్తున్నవు, చల్లటి నీళ్లియ్యి" అని తెప్పించుకొని త్రాగారు. వారి ఆక్రోశం సాంతం వెళ్లగక్కారు. నేనూ అగ్నికి ఆజ్యం పోశాను. ఇద్దరమూ కాస్పేపు కాంగ్రెసుమీది అక్కసు సాంతం వెళ్లగక్కాం.

"రంగన్నా! ఇగో, నువ్వు సరియైన సలహా ఇవ్వాలె. నేను పార్టీ సభ్యత్వం తీసుకుందామనుకుంటున్న – ఏమంటవు?" అడిగారు.

"పార్టీ సభ్యత్వంతో నెహ్రూ సర్కారును కూలగొడ్తవా?" అని అడిగాను.

"ఇగో, పరాచికం కాదు. నా వ్యక్తిగత అసమ్మతి! నువ్వు వద్దన్నా చేరేదే!" అని చివాలున లేచివెళ్లిపోయారు.

కమలా – నేనూ నివ్వెరపోయి చూచాం.

తరువాత మామయ్య పార్టీ మెంబరుగా దర్శనం ఇచ్చారు. వారిది సంకల్పబలం. కమ్యూనిస్టుగానే 6–2–1961న కన్నుమూశారు.

పగలంతా తన కొడుకు శ్రీనివాస్‌ను తీసుకొని ఎగ్జిబిషన్‌కు వెళ్లారు. మిత్రులను కలిసి వచ్చారు. రాత్రి అమాంతంగా గొంతుబాధ వచ్చింది. నొప్పించక – తానొవ్వక – ఎవరికీ చెప్పక వెళ్లిపోయారు!

ఆళ్వార్‌స్వామి కోరిక నెరవేరింది.

కమ్యూనిస్టుపార్టీ సభ్యునిగా కాలంచేశారు.

అరుణపతాక చ్ఛాయలో అంత్యక్రియలు జరిగాయి.

ఆళ్వార్‌స్వామి ధర్మపత్ని యశోదమ్మ – కొడుకు శ్రీనివాస్ కంటే నేను ఎక్కువగా కోల్పోయాను.

ద్వారకనుంచి తిరిగివచ్చిన అర్జునుడు ధర్మరాజుకు కృష్ణ నిర్యాణం గురించి తెలియపరచే తొలిపద్యం "మన సారధి, మన సచివుడు, మన వియ్యము, మన సఖుండు మన బాంధవుడున్, మన విభుడు, గురువు, దేవర మనలను దిగనాడి చనియె మనుజాధీశా! వలె ఉంది నా స్థితి. ఇది తీర్చనలవి కాని వేదన!

24.8.1976లో నా నవల "జనపదం" వట్టికోట ఆళ్వార్‌స్వామికి అంకితం ఇచ్చి కొంత తృప్తి చెందాను. శ్రీకృష్ణదేవరాయాంధ్ర గ్రంధాలయంలో - దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించి, మా అన్నయ్య దాశరథి సహితంగా అనేకులు మాట్లాడిన సభలో శ్రీమతి యశోదమ్మగారికి శాలువా కప్పి - సజల నయనాలతో - అంకితం అందించాను.

"ఆళ్వార్' ఏదో ఒక మనిషి పేరు కాదు.
అదో విధానము. విధానమంటే ఏదో ఒక
కార్యవిధానముకాదు. అదొక జీవిత విధానము"
అది కాళోజీ నివాళి.

మా అన్నయ్య డాక్టర్ దాశరథి వారి "అగ్నిధార" కావ్యాన్ని మామయ్యకు అంకితం ఇచ్చారు.

"ఎక్కడ దుఃఖం వున్నా బుద్ధుడిలా
ఏగి, తోచిన సాయం చేస్తాడు.
అతడు 'ప్రజల మనిషి'
అతడంటే దుష్టులకు కసి
అబద్ధాసురుని పాలిటి తల్వార్ ఆళ్వార్
ఆనందరమణికి షల్వార్ ఆళ్వార్" అన్నారు.

## ఇరవయి తొమ్మిది

### ఇయం గేహే లక్ష్మీః

విధి విచిత్రం అయింది. విపరీతం అయింది. విశిష్టం అయింది. అనివార్యం అయింది.

విధి వేదాంతం కాదు. పార లౌకికం కాదు. ఆధ్యాత్మికం కాదు. వైరాగ్యం కాదు. విధి మానవ జీవితంలోనూ - సామాజిక జీవితంలోనూ అనివార్యం అయిన భాగం.

మానవుడు కాని, సమాజం కాని నిరంతర యత్నంలో ఉంటారు. కర్మ - కార్యం - ప్రయత్నం - ఇవి మానవ జీవితంలో ఊపిరి అంతటి ముఖ్యములు. అయితే సకల ప్రయత్నాలు ఫలించవు. మానవ ప్రయత్నం సక్రమంగా ఉన్నప్పటికీ ఫలించకపోవడానికి విధి కారణం. మానవ ప్రయత్నం అంతగా లేకుండా ఫలించడం కూడా విధిమూలంగానే. ప్రతివారి జీవితంలో - వారు ఎంతటి గొప్పవారయినా - ఎంతటి చిన్నవారయినా - విధి తన ప్రభావం చూపుతుంది. ఇందుకు నిదర్శనాలు నిశ్చితంగా అందరి జీవితాల్లోనూ ఉంటాయి.

నేను చినగూడూరులో జన్మించాను. ఆ ఊరు నేటికీ నాకు ప్రియం. నా ప్రమేయం లేకుండానే నేను ఖమ్మంమెట్టు చేరాను. అక్కడ కొంత చైతన్యం కలిగింది. వాస్తవంగా ఖమ్మం నుంచి మారవలసిలేదు. నేను అనుకోకుండానే ఏమాత్రం చైతన్యం ఎరుగని గార్ల జాగీరు చేరాం. అక్కడ జీవితం ఒక మలుపు తిరిగింది. ప్రజా

పోరాటాల్లో పాల్గొనగలిగాం. ఆనాడు ఆ మైకంలో వ్యక్తిగత భవిష్యత్తును గురించి ఆలోచించనేలేదు.

విధివైపరీత్యం ఏమంటే - స్వాతంత్ర్యం వచ్చింతరువాత వ్యక్తిని గురించి ఆలోచించాల్సి వచ్చింది! అప్పటికే కాలం నన్ను అపహాసించి కదిలిపోయింది. మారిన పరిస్థితుల్లో ప్రజా జీవితం నన్ను విసిరికొట్టింది. వ్యక్తి జీవనానికి ఆలంబనం లేదు. అలాంటి పరిస్థితుల్లో అనేకమంది దిక్కుతోచక - దిక్కులేక అణగారిపోయారు. నేటికీ వారి పరిస్థితి దయనీయంగా ఉంది.

విధి నాకు సహకరించింది. చదువుకోగలిగాను. ఉద్యోగం లభించింది. జీవిక ఆర్జించుకోగలిగాను. నాకు ఇష్టం అయిన ఉపాధ్యాయ వృత్తిలోనే ఉంటాననుకున్నాను. అప్రయత్నంగా నా అభిరుచికి తగిన అనువాద ఉద్యోగం సికిందరాబాదులో లభించింది!

జంట నగరాల్లో - తొలినుంచీ - నాకు సికిందరాబాదు అంటే ముచ్చట. బాల్యంలో ఇక్కడ నా పెళ్లి జరిగినపుడే మురిపించింది. వయసులో అది ముగ్ధరాలులా - మనసిచ్చి వెంటపడిన పడతిలా - ఓరచూపులతో తలవంచుకున్న నవ వధువులా వలచింది - వలపించింది - వలపుల ముంచింది.

అయిదవ దశకంలో సికిందరాబాదు ముద్దబంతి చేనులా ఉండేది. రాణీగంజు సాంతం బయలు. కర్బలా మైదానంలో సద్దుల బతకమ్మ ఒక పూల పండుగ - ఒక పూబంతుల పండుగ! అది కనుల పండుగ. ఇప్పుడు అక్కడ అంగుళం స్థలం లేదు. ఊపిరాడదు, ఉక్కిరి బిక్కిరి అవుతాం.

ఇప్పటి రాష్ట్రపతి రోడ్డు - కింగ్స్ వే - ఒకప్పటి జనరల్ బజారులాంటి ఇరుకుగల్లీ. అంగ్రేజులు దాన్ని విశాలం చేయ తలపెట్టారు. మారేడు పల్లిని అభివృద్ధిపరచారు. ఇక్కడి వారిని అక్కడికి తరలించారు. వీధిని ఇప్పుడున్నంతటి విశాలం చేసి, కింగ్స్ వే అని పేరు పెట్టారు. ఆనాడు వేసిన రోడ్డు ఈనాటికీ చెక్కుచెదరలేదు.

అప్పటి కింగ్స్ వే ప్రశాంతంగా ఉండేది. ఒకేఒక బస్సు 7B మారేడుపల్లికి అర్ధగంటకు ఒకటి వెళ్లేది. కార్లు అంతగా లేవు. రిక్షాలకు అనుమతి లేదు. ఆటోలు లేనేలేవు. గుర్రపుబండ్లు అప్పుడప్పుడూ తిరిగేవి. కింగ్స్ వే మీది దుకాణాలు తెరవగానే ఒక బాలుడు - ఇప్పటి పత్రికల్లా - పచ్చిగడ్డి కట్టలు వేసేవాడు. ఆవులు వచ్చి దుకాణాల ముందు నిలిచేవి. యజమానులు స్వయంగా వాటికి గడ్డి తినిపించేవారు. ఇప్పటి ఊపిరి సలపని సందడిలో పచ్చగడ్డి పారిపోయింది.

మోండా మార్కెట్టు ఒక విచిత్రవిపణి. పచ్చని కూరగాయలు - పసందయిన పళ్లేకాక కుండలనుంచి ముత్యాల వరకు సమస్త పదార్థాలూ లభిస్తాయి. యువతుల - గోవుల తోపిడిసహితంగా అక్కడ సరుకులు కొనడం ఒక సంబరం.

అంగ్రేజులు జనరల్ బజారును విశాలం చేసి జేమ్స్‌స్ట్రీట్ - మహాత్మాగాంధీ రోడ్డుతో - కలిపే ప్లాను సిద్ధం చేసారు. మహంకాళి గుడి అడ్డరోడ్డుదాకా చేశారు. అదిగో, సరిగ్గా అక్కణ్ణే మడిపడగ బలరామాచార్యులవారి సాహిత్యవిపణి. అక్కడికి రాని రచయితా - కళాకారుడూ లేడు. అదొక గోష్ఠి. పుస్తకాల దుకాణాలూ అక్కడే ఉండేవి. బలరామాచార్యులవారు ప్రచురణలకు సహకరించేవారు. బలరామాచార్యులు

కవి – కళాకారులు – సహృదయులు. వారు అనేకమంది రచనలకు ముఖచిత్రాలు వేశారు. వారు ప్రచురణ కర్తలకు – రచయితలకు వారిధి. అక్కడికి కొద్ది దూరంలో మంచి సాహిత్యం ముద్రించి ప్రచురించిన అజంతా సోదరుల అజంతా ప్రెస్సు.

మహాకాళి ఈ నగరానికి అధిష్ఠాన దేవత. మహంకాళి జాతరను నా నవల 'మాయ జలతారు'లో వర్ణించాను.

ఆనంద భవన్ – తాజమహల్ హోటళ్లు మాత్రం కావు. అవి మిత్రులు కలుసుకునే ప్రదేశాలు.

జేమ్స్ స్ట్రీట్ – అక్కడి క్లాక్ టవర్ – ఇత్తడి బొమ్మ – గాంధీ విగ్రహం ఆ ప్రాంతం నగరానికి అలంకారాలు.

కింగ్స్‌వేలో పాట్నీ – మహబూబ్ కాలేజి దాటేంతరువాత నిర్మానుష్యం! పరేడు గ్రౌండుకు అటు ఆవల రేస్‌కోర్సు. గుర్రప్పందాలు సికిందరాబాదులోనే జరిగేవి. బహుశా ఆరవ దశకంలో మలక్‌పేటకు మార్చారు.

అటు సీతాఫల్ మండిలో తెలుగుతనం, ఉత్పల సత్యనారాయణాచార్యులువారు అక్కడ ఉండే "ఈ జంటనగరాలు హేమంత శిశిరాలు" అనే కావ్యం వ్రాసి, జంట నగరాలకు కావ్యరూపం ఇచ్చారు.

మారేడుపల్లిలో రాయప్రోలు వారి సహితంగా విద్వాంసులు – సంపన్నులు ఉండేవారు. పందెం గుర్రాల కొట్టాలు – పోలీసుస్టేషను తరువాత నిర్మానుష్యం! ఇప్పుడు జనారణ్యం!!

మున్సిపల్ కార్పొరేషను ఆఫీసు కొబ్బరి చెట్లున్న విశాల ఆవరణలో 150 మారేడు పల్లిలో ఉండేది. అక్కడే నేను అనువాదకునిగా చేరాను. కౌన్సిలర్లు విద్యావంతులు కాకున్నా సభ్యత – సంస్కారం కలిగి ఉండేవారు. కౌన్సిల్ సమావేశాలు హాస్యం – చమత్కారం – చతురత కలిగి, సద్భావంగా జరిగేవి. ఒక్కొక్కసారి కవితలు వినవచ్చేవి.

ఒకసారి మేయరు రాలేదు. డిప్యూటీ మేయర్ అధ్యక్షత వహిస్తున్నారు. అడావుడిగా మేయర్ వచ్చారు.

"దూర్‌సె ఆయె ధేర్‌సె ఆయె

హమ్ ఖిస్మత్‌వాలెహైఁ ఫిర్‌భీ ఆయె" అనే కవిత చదివారు ఒకరు. సభసాంతం "వహ్వా" అన్నది.

"దూరంనుంచి వచ్చావు, ఆలస్యంగా వచ్చావు, మేము అదృష్టవంతులం, రానైతే వచ్చావు" అంటూ ప్రియురాలిని సంబోధించిన కవిత అది.

"వచ్చినవాడు ఫల్గుణుడు..." అనే పద్యం అధికార పక్షపు కౌన్సిలర్ అందుకున్నారు.

ఒకనాడు నన్ను వాసుదేవ ముదలియార్‌గారు పిలిపించారు. వారు సికిందరాబాదుకు తొలి మేయర్. ముదలియార్లు సికిందరాబాదు అభివృద్ధికి కృషి చేశారని మనవి చేశాను. మహబూబ్ కాలేజి – కీస్ బాలికల పాఠశాల – దక్కన్ క్రానికల్ – ప్రుడెన్షియల్ కోఆపరేటివ్ బ్యాంకు మున్నగు సంస్థలు ముదలియార్లు సేవాదృష్టితో – లాభార్జనకు కాదు – స్థాపించారు. ముదలియారుల సేవానిరతికి ఫలితమే ముదలియార్ తొలి మేయర్ కావడం.

నేను వాసుదేవ ముదలియార్‌గారి ఇంటికి వెళ్లాను. వారు 85 సంవత్సరాలు దాటిన కడు వృద్ధులు. అంతగా కనిపించదు. వినిపించదు. ఇంజనీర్ చేసి రిటైరయినారు. సేవాసక్తి గలవారు. వారి దగ్గరికి వచ్చిన వారికి తగురీతిని సాయం చేసేవారు. వారు ఇంట్లో అరవం మాట్లాడుతారు. కాని, ఆంధ్ర సాహిత్యంలో ఆసక్తి ఉంది. ప్రవేశం ఉంది.

"మీవంటి విద్వాంసుడు మున్సిపల్ కార్పొరేషనుకు లభించడం అదృష్టం. మన్నించాలి, పెద్దవాణ్ణి, రాలేక పిలిపించాను, నా స్వార్థంకోసం పిలిపించాను. నాకు ఎంతో కాలంగా పోతనామాత్యుని ఆంధ్రశ్రీ మద్భాగవతం వినాలని ఉంది. ఈనాటికి భగవంతుడు మిమ్ములను చూపినాడు. వినిపించవలె" అని చేతులు జోడించి అడిగారు.

అది విని నాకు ఒడలు జలదరించింది. ఆ వయసులో ఒక తమిళుడు ఆంధ్ర మహాభాగవత శ్రవణానికి ఆసక్తి చూపుతున్నాడు! సిగ్గుకూడా అయింది. అంత పెద్దవాడు నన్ను ప్రార్థించడం! కాదనలేకపోయాను.

ప్రతిరోజూ ఉదయం స్నానాదులు ముగించుకొని వెళ్లేవాణ్ణి. వాసుదేవ ముదలియార్‌గారు శుచిగా – శాంతంగా నా ముందు కూర్చునేవారు. చందా నారాయణ శ్రేష్ఠివారు ప్రచురించిన భాగవతం వారిదగ్గరే ఉంది. "ఎవ్వనిచే జనించు" ప్రార్థనతో ప్రారంభించి కొంత చదివేవాణ్ణి. మధ్యమధ్య ముదలియార్‌గారికి సందేహాలు వచ్చేవి. నాకు తెలిసినంతలో సమాధానాలు చెప్పేవాణ్ణి. అవి వారిని సంతృప్తిపరచేవి. నేను చదవడం ముగించివెళ్లేపుడు ఒక పండో – కాయో చేతిలో పెట్టి, పాదాభివందనం చేసేవారు. నేను చిన్నవాణ్ణి – నాకు ఆయుక్షీణం అవుతుంది అన్నా వినిపించుకునేవారు కారు. వారించడం నాకు అసాధ్యం అయింది!

అలా కొంతకాలం గడిచింది. భాగవతంలో నా ఆసక్తి పెరిగింది. ముదలియార్ గారు భాగవతం వినడం కోసమే ప్రత్యేకంగా మారేడుపల్లిలోని వారి అమ్మాయి యింటికి వచ్చారు. అందరికి వలెనే వారికీ కుటుంబ నిర్బంధాలు వచ్చాయి. పద్మారావు నగర్‌లోని కొడుకు ఇంటికి వెళాల్సి వచ్చింది.

ఆరోజు మామూలుగా వారింటికి వెళ్లాను. ముదలియార్‌గారు కన్నీరు రాలుస్తున్నారు. కల్మషం ఎరుగని వారి కన్నీరు నన్ను కరిగించింది. వారిని వారించాను.

"ఆచార్యులవారూ! భగవంతుడు శ్రీమద్భాగవతము పూర్తిగా వినే అదృష్టం కలిగించలేదు. ఇంతవరకే మీ ఋణం నామీద ఉంది. నేను ఇవ్వాళ వెళ్లిపోతున్నాను – పుత్రుని ఇంటికి ఇక మీరు రావద్దు" అని నిత్యంలా రెండు పళ్లు – కొత్తగా కొంత డబ్బు నా చేతిలో పెట్టారు. నేను డబ్బుతీసుకోను అన్నాను, అక్కడ పెట్టాను.

"అయితే మీ ఋణంలో పడమంటారా?" నిర్వేదం ప్రకటించారు.

"నేనే మీకు ఋణపడి ఉన్నాను. మీవల్ల భాగవతం అర్థం చేసుకునే అదృష్టం కలిగింది" అన్నాను.

మా ఉభయులకు అందును గురించి కొంత చర్చ జరిగింది. డబ్బుమాత్రం అక్కడే వదిలి నేను వచ్చేశాను. ఆఫీసుకు వెళ్తే టేబుల్ మీద ఒక ఎన్వలప్ ఉంది. చించి చూచాను. "నన్ను మన్నించండి – ఇది స్వీకరించండి" అన్న వాసుదేవ

ముదలియార్‌గారి ఆర్ద్రమైన లేఖతో కొంత డబ్బు కూడా ఉంది! గత్యంతరంలేదు. గుండె చెమర్చింది. కడువృద్ధులు ముదలియార్‌గారి ఆర్తి నన్ను కదిలించింది. 'శరతల్పం' వ్రాయడంలో ఈ అనుభవం తోడ్పడింది.

కాలం నిలిచేదికాదు. ఒక దశాబ్దం గడిచిందనుకుంటా. ఈలోగా ముదలియార్‌గారికి ఆక్సిడెంట్ అయింది. ఎముక విరిగింది. దవాఖానాలో చేరారు. ఎముక అతుక్కున్నది.

ఒకనాడు నేనూ రమణాచార్యులూ ముదలియార్‌గారి కూతురు ఇంటిముందునుంచి వెళ్తున్నాం. వాకిట్లో ముదలియార్‌గారు కనిపించారు. దగ్గరి బంధువు ఆకస్మికంగా కనిపించినట్లనిపించింది. వారి దగ్గరికి వెళ్లాను. నన్ను వారికి తెలియపరచుకున్నాను. వారు కన్నీటి బొట్లు రాల్చారు. అమాంతంగా నా ముందు సాష్టాంగపడిపోయారు. ఎవరైనా చూచారేమోనని నాకు సిగ్గయింది. వారిని లేపి కూర్చోపెట్టాం. మేమూ కూలబడ్డాం. వారు కొంతసేపు దుఃఖించారు. తరువాత అడిగారు:

"స్వామీ! ఈ జన్మలో ఎవరికీ అపకారంగాని అపచారంగాని చేయలేదు. శక్తి ఉన్నంతలో మానవ సేవ, మాధవ సేవ చేసినాను. ఈ వయసులో నాకు ఇన్ని బాధలేల? భగవానుడు నన్ను ఏల కరుణించడు? తన దగ్గరికి ఏల పిలిపించుకొనడు?" ఆ పదాలలోని వారి బాధ కఠిన శిలలను కరిగించేట్టుంది!

**ఎంతటి దీనస్థితి! మనిషి బ్రతుకు కోసంకాదు - చావుకోసం దేబిరిస్తున్నాడు!!**

నా మేధస్సు నిశ్చలం అయింది. మౌనం వహించాను. కాని, ఎదుట బాధాపరితప్త నిర్మల హృదయం – ఆ వయోవృద్ధుని ఆరాటాన్ని సడలించాలి. అమాంతంగా మెరుపులా – గురుదేవుడు రవీంద్రుని గీతాంజలి స్ఫురించింది. భగవంతుడూ నియమబద్ధుడే అంటారు గురుదేవులు.

"స్వామీ! మౌనమే సమాధానమా?"

"కాదు ముదలియార్‌గారూ! భగవంతునికి మీమీద నిర్హేతుక జాయమాన కటాక్షం కలిగింది. అయితే భగవంతునికీ తాను ఏర్పరచుకున్న నియమాలున్నాయి. స్వామి వాటిని ఉల్లంఘించలేరు. అందువల్ల మీ పూర్వజన్మ కర్మలు ఈ జన్మలోనే తీర్చదలచాడు. అందుకే ఈ బాధలు! మీకు మరొక జన్మలేదు. లభించునది మోక్షమే!" అన్నాను.

వృద్ధమూర్తి చలించిపోయారు. నా పాదాలమీద పడిపోయారు. "స్వామీ! ఇటువంటి సమాధానం కోసం తపించిపోయాను. భగవంతుడు మోక్షమే ప్రసాదిస్తే మరిన్ని బాధలు పడ్తాను" అని గుండె నింపుకొని అన్నారు. వారి నేత్రద్వయంలో ఆశారేఖ అవతరించింది!

నేను ఇచ్చిన సమాధానం – వాస్తవంగా – నాకే ఆశ్చర్యం కలిగించింది. ముదలియార్‌గారి సాంత్వనం కోసం భగవంతుడే నాతో ఆ మాటలు అనిపించాడు అనిపించింది. ఏమయినా ఒక పూర్ణాయుష్కుని – పరిపూర్ణ మానవతామూర్తిని సాంత్వనపరచిన సంతృప్తి నాకు దక్కడం అదృష్టం.

శ్రీమద్భాగవతం వైరాగ్యం మాత్రమే బోధిస్తుంది అనడం మూర్ఖత్వం. జీవిత

సత్యాలు, జీవిత గుణపాఠాలు అనేకం అందులో ఉన్నాయి. తెలుగు భాగవతపు సాహిత్యపు సొగసు నిరుపమానం.

తెలంగాణ సాయుధ పోరాట నేత రావి నారాయణ రెడ్డిగారికి ప్రియమయింది ఆంధ్రభాగవతం. వారు అందులోని పద్యాలు మాత్రం కాదు – గద్యం అప్పచెప్పేవారు. అవసానదశలో – అపస్మారంలో – 'కారే రాజులు' పలవరించేవారని రావి భారతిగారు చెప్పారు.

## గూడు-నీడ:

కౌన్సిలు – కౌన్సిలర్లు సభ్యత సద్భావన కలవారని చెప్పాను. కార్పొరేషను సిబ్బంది కోసం మారేడుపల్లిలోనూ, గరీబ్ నగర్ – ప్రకాశం నగర్‌లోనూ ఇళ్లు కట్టారు. కేటాయింపుకు దరఖాస్తులు కోరారు. మారేడుపల్లి ఇల్లుకోసం నేనూ అడిగాను. 'మీకు సంవత్సరం సర్వీసు పూర్తిఅయి కన్వరం అవుతే ఆలోచిస్తా' మన్నారు. మేయర్‌గారికి నేనంటే అభిమానం. వారు చెప్పినట్లున్నారు – గరీబ్ నగర్‌లో ఇల్లు ఇస్తామన్నారు. కమలా – నేనూ వెళ్లి చూచాం. నిర్జనారణ్యంలా ఉంది. 'కనీసం ఉప్పు దొరికేటట్లు లేదు. పిల్లలకు స్కూలు లేదు. దవాఖాన లేదు. ఇటువైపు బస్సన్న లేదు. నేను ఇక్కడ ఉండను' అన్నది కమల. అదే ప్రకాశం నగర్ ఇప్పుడు – విమానాశ్రయం వచ్చింతరువాత సందులేకుండా – సామాన్యునికి అందకుండా పోయింది!

మేయర్ శిర్నం సత్యనారాయణగారికి మేము గరీబ్‌నగర్ ఇళ్లు చూచిన విషయం – కమల వ్యక్తపరచిన అభిప్రాయం చెప్పాను. వారు కమల భయం సరియైందే నన్నారు. తల్లికి పిల్లల భద్రత విషయంలో ఉండే వాత్సల్యాన్ని మెచ్చుకున్నారు. వారికి పిల్లలు లేరు! లేనివారే తల్లి విషయం గ్రహించగలరు!! వారికి నా మీద అభిమానం. నాకు ఒక ఇల్లు సమకూర్చాలనే అభిప్రాయంలో ఉన్నారు.

శిర్నాంగారు మరొకసారి చెప్పారు: మారేడుపల్లిలో – ఆఫీసు పక్కనే – ఇళ్లు కడ్తున్నారనీ – అందుకు భూసేకరణ జరిగిందనీ – ఒక సంవత్సరలో ఇళ్లు తయారవుతే నాకు తప్పక లభిస్తుందనీ. ఆ విషయం చెపితే కమల మురిసిపోయింది.

**మనిషి విచిత్రుడు. వచ్చి వళ్లో పడనక్కరలేదు - వస్తుందంటేనే మురిసిపోతాడు!**

మేయరుగారు నాకు సేకరించిన స్థలం చూపించారు. అది జొన్నచేను. డాక్టర్ ఖాద్రీకి చెందింది. ఎకరాల స్థలం లక్షా పాతిక వేలకు సేకరించారు. తరువాత జొన్నచేను పోయింది. ఆ సంవత్సరం ఆరోగ్య దినోత్సవ క్రీడలు ఆ మైదానంలో నిర్వహించారు. మా అమ్మాయి ఉదయశ్రీకి పరుగుపందెంలో ప్రైజు వచ్చింది. డిప్యూటీ మేయరుగారు ఆమెకు బహుమాన ప్రదానం చేశారు.

భూమి సేకరించిన మొత్తం లక్షరూపాయల చెక్కు అందుకున్న ఆనందం భరించలేక డాక్టర్ ఖాద్రీ అమాంతంగా మరణించారు. ఆనాడు లక్ష అంటే అంత! డబ్బు చలామణీ తక్కువ. డబ్బు విలువ హెచ్చు, వస్తువు విలువ తచ్చు. పదార్థాలు లభించడమూ దుర్లభం. ఆహారధాన్యాలు చాలేవి కావు. అమెరికానుంచి PL 480 కింద గోధుమలు వచ్చేవి. అవి అమెరికాలో పందులకు పెడ్తారట! రేషనులో రూపాయికి

రెండు కిలోలు ఇచ్చేవారు. సగం పొట్టుకింద పోయేది. బియ్యం దొరకడం కష్టం! పాలు పల్లెల్లోవలెనే గొల్లలు తలమీద తట్టల్లో తెచ్చి అమ్మేవాళ్లు! పాలు సహితంగా ఏవీ వ్యాపార సరళి ఉత్పత్తి లేదు. అన్నీ కుటీరపరిశ్రమల్లాంటివే!

భూమి లక్షా పాతికవేలకు సేకరించారు. ఆ భూమిలోని కొంత భాగంలో పల్లెలనుంచి వచ్చిన శ్రామికులు గుడిశలు వేసుకుని వున్నారు. అప్పుడు ఈ నేలకు విలువ లేదు. అక్కడ వాడ నిర్మించుకుంటే ఎవరూ పట్టించుకోలేదు. ఇప్పుడు దానికి విలువ వచ్చింది. వారిని వెళ్లగొట్టే బాధ్యత భూస్వామిది. అందువల్ల ఆ నేల మూల్యం తగ్గించి లక్ష ఇచ్చారు! వారిని కాళీ చేయించకుండా నేనూ – SB గిరి ఒక ఉద్యమం నిర్వహించాం. దాన్ని ఇతివృత్తంగా తీసుకుని నేను 'మాయ జలతారు' నవల వ్రాశాను.

సేకరించిన భూమిలో పునాదులు త్రవ్వడం ఆరంభించారు. అప్పటికి సిమెంటు వ్యాప్తి లేదు. స్థలానికి కొదువ లేదు. ఇంకా మనుషులకూ పశువులకూ తీరిక ఉంది. ఉరుకులు పరువులు ప్రారంభం కాలేదు. అందువల్ల సున్నపు 'డంగు' ఏర్పాటు చేశారు. ఎద్దులు లాగుతూ సున్నం రుబ్బుతాయి.

ఆ నిర్మిస్తున్న ఇళ్లు మా కొరకే అన్నట్లు మేము పదేపదే చూచుకునేవాళ్లం. వచ్చిన వాళ్లకు చూపించేవాళ్లం. రెండు గదుల రూఫ్ మాత్రం సిమెంటు కాంక్రీటుతో వేశారు. ఇళ్లు సిబ్బంది కోసమని ఇంజనీరూ శ్రద్ధ తీసుకున్నారు. కంట్రాక్టర్లు సైతం పక్కాగా నిర్మించారు. వెనుకా ముందూ – వసారాలకు అస్బెస్టాస్ రేకులు వేశారు. సాధ్యమైనంత తక్కువలో నిర్మించాలని సంకల్పం! ఎంచాతంటే, అప్పుడు జీతాలు అతి తక్కువ. ఉద్యోగులు భరించాలి. ప్రతి ఇంటి స్థలమూ 166 గజాలు. గజం పది రూపాయాల చొప్పున – కట్టడం సహితంగా ఇంటి కరీదు ఏడువేల అయిదువందలుగా నిర్ణయించారు. సాధారణ ప్రజ 15 శాతం ప్రథమ డిపాజిటు చెల్లించాల్సి ఉంటుంది. ఉద్యోగుల కోసమని అయిదు శాతం నిర్ణయించారు. ప్రభుత్వ ఆదేశాల ప్రకారం ఇళ్లు ఇటుక మట్టితో కట్టాలి. ఈ ఇళ్లు ఇటుకా సున్నంతో కట్టిన అదనపు మూల్యం కలిసి అయిదువందలుగా నిర్ణయించారు.

ఈలోగా మున్సిపల్ ఎన్నికలు జరిగాయి. విలువల దిగజారుడు ప్రారంభించింది. నిజాయితీ తగ్గి – స్వార్థం పెరిగిన వారు కౌన్సిలర్లుగా వచ్చారు. మేయర్లు మళ్లీ పోటీ చేయరు. అందువలన శిర్నం రాలేదు. గాడేపల్లి జగన్నాథం వంటి విద్యావంతులు – సంస్కారంగలవాళ్లూ – ఓడిపోయారు.

వ్యవసాయ నాగరకత క్రమంగా మాయం అవుతున్నది. పారిశ్రామిక వ్యాపార నాగరకత ఆక్రమించుకుంటున్నది. వ్యవసాయంలో ఉదారతా – సంస్కారం క్షీణిస్తున్నాయి. వ్యాపార నాగరకతలో లాభం పడగ విప్పుతున్నది. పారిశ్రామికీకరణం పేర పెరుగుతున్న 'నాగరకత' అనేదాంట్లో స్వప్రయోజనం – స్వార్థం – స్వజన పక్షపాతం – మనిషిని పీడించే లాభం చోటు చేసుకుంటున్నాయి. ఇది కార్పొరేటర్లలో మాత్రం వచ్చిన పతనంకాదు. ఇది సమాజంలోని అన్నిరంగాల్లోనూ ప్రారంభం అయిన పతనం! దీనిని నా నవల 'జనపదం'లో వివరంగా చూపాను.

'ఇల్లు' సంకేతం మాత్రమే. పరిస్థితులను వివరించడం ప్రధాన ఉద్దేశ్యం. ఇళ్ల కేటాయింపుకు దరఖాస్తులు కోరారు. ఆదాయం 150–250 వరకు ఉన్నవారికి

ఇస్తామన్నారు. అప్పటి గుమాస్తాల్లో ఎక్కువ ఆదాయం వచ్చే అతికొద్దిమందిలో నేనూ ఒకణ్ణి. నేను కూడా దరఖాస్తు ఇచ్చుకున్నాను. నాకు న్యాయం మీద నమ్మకం. నాకు ఇల్లు ఖాయం అనుకున్నాను.

దరఖాస్తులు పరిశీలించి కేటాయించవలసింది స్థాయీ సంఘం. వారు కంచే — చేనూ రెండు మేశారు. ఇళ్లన్నీ అర్హతలేని తమ బంధువులకూ అధికార్లకూ పంచారు. బంధువులపేర పరోక్షంగా తామూ కాజేశారు. నాకు ఇల్లు రాలేదు!

పోరాటం నా సహజగుణం. అర్థించడం అస్సలు చేతకాదు. అలా అర్హత కలిగి — ఇళ్లు దొరకని నలుగురిని కలుపుకున్నాను. వారు స్థాయీ సంఘాన్ని ఎదిరించడానికి సంకోచించారు. వారికి ధైర్యం చెప్పాను. నాకు సాహసం మెండు. సూటిగా సాగిపోవడమే! వెనుకా ముందూ ఆలోచన ఉండదు!!

నేను — జరిగిన అన్యాయాన్ని వివరిస్తూ — ఒక అప్లికేషను వ్రాశాను. మిగిలినవారు జంకుతూ సంతకాలు పెట్టారు. నేను కమీష్నరును కలిశాను. జరిగిన అన్యాయం వివరించాను. వారు గుర్తించారు. ఇక్కడ న్యాయం జరక్కుంటే పై అధికారుల దగ్గరికి వెళ్తానన్నాను. అవసరం అవుతే కోర్టుకు వెళ్తాననీ, ఇప్పుడు దొరికిన వారి ఇండ్లు ఊడ్తాయనీ బెదిరించాను.

ధర్మరాజ్ మాథుర్ కమీష్నరు నిజాయితీ గలవాడు. నా వాదనలోని న్యాయం గ్రహించారు. స్థాయీ సంఘం ముందు చాల గట్టిగా వాదించారు. 'ఈ దరఖాస్తుదారులకు ఇళ్లు కేటాయించడం జరక్కుంటే తీర్మానాన్ని అమలుపరచను,' అని బెదిరించారు.

స్థాయీ సంఘంవారు తమ ఇళ్లు పోతాయని బెదిరారు. అధికారులకు చేసిన అలాట్‌మెంట్ రద్దు చేశారు. మా నలుగురికీ కేటాయించారు. అప్పటికి స్థాయీ సంఘాన్ని ఎదిరించి నెగ్గిన సంఘటన ఇది ఒక్కటే! నన్ను — ఇళ్లు కోల్పోయిన అధికార్లు — కొందరు కార్పొరేటర్లు సహితంగా అభినందించారు. ఇళ్లు దొరకని కార్పొరేటర్లు — నా ద్వారా — రాజకీయం జరపాలని ప్రయత్నించారు. నేను లొంగలేదు.

మాకు అలాట్‌మెంట్ ఆర్డర్లు వచ్చాయి. అయిదువందలు డిపాజిటు కట్టాలి. అయిదువందలు ఆ రోజుల్లో చాల పెద్ద మొత్తం. అది లభించడం దుర్లభం అయింది. పట్టుదలతో సాధించిన ఇల్లు వదులుకుంటే అపహాస్యం పాలు అవుతాం. చాల చిక్కు సమస్య వచ్చింది. నాకు అడగడం చేతకాదు!

జీతం ఎక్కువని మాత్రమే ఈ కొలువులో చేరింది. అధికారపు ఆకర్షణ — ఆకాంక్ష నాటికీ నేటికీ లేవు. ఎక్కువ జీతం పట్నంలో ఎందుకూ చాలకుండా అయింది. కమల కాన్పులు — పిల్లలు — జబ్బులు — పెరిగిన అవసరాలు — అప్పులు చేయక తప్పడం లేదు. ఆర్థిక దారిద్ర్యం వదల్లేదు. అది మరింత క్రుంగదీస్తున్నది. కమల సహనం తప్ప నాకు ఆధారం లేదు. కమల తన బాధలు కనిపించనిచ్చేది కాదు. పైగా కష్టాలు 'మనుషులకు కాక మానులకు వస్తాయా?' అని ధైర్యం చెప్పేది.

అయిదువందలు సమస్య అయింది. ఉద్యోగుల సహకారపరపతి సంఘ కార్యనిర్వాహక సంఘంలో నేను సభ్యుణ్ణి. కొంత అప్పు దొరికింది. అన్నయ్యను అప్పు అడిగాను, లేవన్నారు. ఇల్లు వస్తుందంటే అమ్మ సంతోషించింది. గార్ల పొలంలో వచ్చే ధాన్యం

అమ్మి తెచ్చుకొమ్మంది. అన్నయ్య వీల్లేదన్నారు. ఒక మిత్రునికి ఈ విషయం తెలిసింది. 'పట్నంలో ఇల్లు సామాన్యమా?' అని తన పెళ్లాం మెళ్లో గొలుసు తీసి ఇచ్చాడు. నాకు మనస్కరించలేదు. నేను తీసుకోలేదు.

అయిదువందలు దుస్తరం అయింది. పట్టుదలతో ఇల్లు సాధించినందుకు కుమిలిపోయాను. నా వైఫల్యం నన్ను నవ్వుల పాలు చేస్తుంది. అది మరింత క్రుంగదీసింది. కమల మెళ్లో గొలుసు డోర్నకల్లులో అమ్ముకున్నాం. ఏమీ మిగల్లేదు. గడువు దగ్గరపడుతున్నది!

కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటీ వాళ్లు ఇచ్చిన అప్పు మూడువందల ఇరవైరూపాయిలు 12-1-59 న జమ కట్టాను. ఒక మిత్రుడు తాను సైకిల్ లోన్ తీసుకొని నాకిచ్చిన వంద రూపాయాలు 3-2-59న కట్టాను. మరో 80 తెల్లవారి కట్టాలి. ఆళ్వార్‌స్వామిగారు 80 అప్పు ఇచ్చారు. వారికి సమయానికి నేను తిరిగి ఇవ్వలేక పోయాను. అందును గురించి వారు వ్రాసిన ఉత్తరం నా దగ్గర ఉంది.

మొత్తం మీద అయిదువందలు కట్టగలిగాం. ఇల్లు సాధించగలిగాం. ఇదొక విశేషం. ఇంతా చెప్పింది ఆనాటి ఆర్థిక స్థితిని గురించి చెప్పడానికి. నా పరిస్థితి కాదు – నాడు నాలాంటివారి అందరి స్థితీ అలాంటిదే! దశాబ్దంన్నర క్రితం – నా కౌమార్యంలోనే – ప్రజల సహకారంతో – గార్లలో సునాయాసంగా ఇల్లు కట్టాను!

నాకు లాటరీలో 16 వ నెంబరు ఇల్లు అలాట్ అయింది. 1959 అక్టోబరు 11, ఆదివారం విజయదశమినాడు అమ్మ, అన్నయ్య కుటుంబం – ఇతర బంధుమిత్రులు వెంటరాగా – సంప్రదాయబద్ధంగా గృహప్రవేశం చేశాం.

మా ఇల్లు – అలా అనటంలో ఆనందం – శ్రామికుల మురికివాడకు ఎదురుగా ఉంది. అక్కడ రిక్షా కార్మికులు – తాపీ పనివారు – రోజుకూలీ జనం – మున్సిపల్ స్వీపర్లు ఉంటారు. పగలంతా పని చేస్తారు. రాత్రికి తాగి వస్తారు. జగడాలు – కేకలు – అరుపులు – కొట్టుకోవడాలు – కలవటాలు – ఏడుపులు – పాటలు – పదాలు – అదొక లోకం. మేం గృహప్రవేశం అయిన్నాడు శ్రామికులు తుమ్మ చెట్టుక్రింద – తెల్లవార్లూ 'బాగోతులు' ఆడారు.

మేం అడివిలో ఉన్నట్లున్నాం. మేం తప్ప ఎవరూ ఇళ్లల్లోకి రాలేదు. అందరికీ ఊళ్లో ఇళ్లున్నాయి. ఇవి అదనం. ఇంటి ముందు రోడ్డు లేదు. రాళ్లు బోళ్లు. మా ఇళ్ళ పక్కన మామిడి తోట. ఇంకా ఇంటికి కరెంటు రాలేదు. నల్లా ఉంది. పట్నం ఇంట్లో లాంతర్లతోనే ఉన్నాం. కరెంటు ఇంకా సంపన్నుల సౌకర్యమే! రాత్రి అవుతే భయం. తోటలోంచి పాములు – తేళ్లు వస్తుండేవి!

మా నివాసాలకు కొద్ది దూరంలో కల్లు కాంపౌండు. విశాలమయిన స్థలంలో అర్ధరాత్రి దాకా జన సమ్మర్దం!

సామాన్యుల – పేదల – కార్మికుల – శ్రామికుల పట్నపు జీవితం దిసమొలతో ఇక్కడ దర్శనం ఇస్తుంది. ఈ జీవితం 'మాయ జలతారు'లో వర్ణించడానికి అనేక రాత్రులు అక్కడ గడిపాను. ఇది పట్నంలో పల్లె. 'పసిడితో పట్నమ్ము – పసిడిలేక పల్లె' అన్నాను.

మా అమ్మ మమ్మలను పెంచడం గుర్తులేదు. కాని కమల మా పిల్లలను

పెంచడం చూస్తే తల్లి ప్రేమ ఎంత విలువయిందో అర్థం అవుతున్నది. కోడి తన పిల్లలను రెక్కల కింద దాచుకుంటుంది. గద్దవస్తే రౌద్రాకారంతో దండెత్తుతుంది. పిల్లలను కదిలిస్తే పిల్లి పులి అవుతుంది. సకల జీవజాలంలోనూ తల్లులకు పిల్లలను కాపాడుకుని – పెంచి – వదిలేసే గుణం ఉంది. మానవులలో మాత్రమే తండ్రి కొంత బాధ్యత వహిస్తాడు.

**ఈ అనుబంధాలతోనే లోకం నిలుస్తున్నది. పిల్లల కోసం తల్లితండ్రులు ఎంతటి త్యాగాలకయినా సిద్ధం అవుతారు. పెద్దయి పెరిగిన పిల్లలు తల్లితండ్రులను లెక్కచేయరు!**

ఎన్నో లక్షల సంవత్సరాలు మేధావులు నిరంతరం కృషి చేసిన ఫలితంగా వివాహ వ్యవస్థ – కుటుంబం ఏర్పడినాయి. పారిశ్రామికీకరణ సృష్టించిన వ్యక్తివాదం కుటుంబాన్ని కుంచిస్తున్నది. తండ్రి, తాతలతో కూడిన ఉమ్మడి కుటుంబాలు మృగ్యం అయినాయి. అప్పటికి తల్లితండ్రులు పిల్లల కుటుంబాలున్నాయి. ఇప్పుడు అభివృద్ధి చెందినవి అని చెప్పుకునే దేశాల్లో కుటుంబాలు మాయం అయి, వ్యక్తులు మిగిలారు. అక్కడ వివాహ వ్యవస్థ వెక్కిరింతకు గురి అయింది. సగం మంది పెళ్లిలేని తల్లులున్నారు. తండ్రిలేని పిల్లలను గుర్తించే జంతుదశకు సమాజం చేరుకుంది. దీనిని అభివృద్ధి అనడం సిగ్గుచేటు! ఇప్పుడు ఆ సమాజాలు సిగ్గుపడుతున్నాయి. కుటుంబాలను కూర్చే ఉద్యమాలు నిర్వహిస్తూ, చేసిన తప్పును దిద్దుకునే ప్రయత్నంలో ఉన్నాయి.

భారత కుటుంబ వ్యవస్థలో కొన్ని విలువలు ఇంకా నిలిచి ఉన్నాయి. తల్లి కావడానికి ఎన్ని యాతనలు పడినా స్త్రీమూర్తి మురిసిపోతుంది. మాకు 1958లో ఒక బాబు కలిగాడు. నాకు ఆడా, మగా వ్యత్యాసం లేదు. కాని మిగతా వాళ్లు మురిసిపోయారు. విజయకుమార్‌ను అపురూపంగా చూచుకున్నాం. 1959లో నెలలు నిండక ఏడునెలలకే రెండున్నర పౌనుల పాప కలిగింది. ఆమె పేరు సుధ. ఆమెను పెంచడానికి కమల పడిన యాతనలు వర్ణనాతీతం! ఆస్పత్రికి వెళ్లడానికి బస్సుకు ఏడు పైసలు లేక – ఇద్దరు పిల్లలను వేసుకుని నడిచి ఆస్పత్రికి వెళ్లింది. 1961లో విరించి అనే బాబు కలిగింతరువాత – జారిపోతున్న కమల ఆరోగ్యం దృష్ట్యా – నేను డబ్బిచ్చి కుటుంబ నియంత్రణ ఆపరేషను చేయించుకున్నాను! అప్పటికి కుటుంబ నియంత్రణ ప్రాచుర్యం లేదు.

అమ్మ – ఒక్కతే – గార్ల ఇంట్లో ఉండేది. **జీవితంలో 'నాది' అనేదాన్ని మించిన మత్తులేదు. అహంకారం అంటే 'నేను', మమకారం అంటే 'నాది' – ఈ రెంటినీ తగ్గించుకొమ్మని సకల శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అయినా, మానవ నైజం మారడం అంత సులభంకాదు.** అమ్మ 'తన' ఇంట్లోనే తనువు చాలిస్తానంటుంది, కదలదు.

## తల్లిలేని బిడ్డలం:

మా అమ్మ – వేంకటమ్మ – గృహప్రవేశానికి వచ్చింది, ఉండిపోయింది. ఆమెకు ఇల్లు నచ్చింది. మనుమలు కొడుకులను మించిన బంధం! వదల్లేకపోయింది.

నీళ్లు చాదనక్కరలేదు. నల్లా ఎప్పుడూ వచ్చేది. కట్టెల పొగ లేదు. బొగ్గుల పొయ్యి. విజయ్‌ను తీసుకొని సీతాఫలాల బండ్ల దగ్గరికి పోయేది. పళ్లు తెచ్చేది. ఆమెకు అవసరం అయినవి తెచ్చి ఇచ్చేవాణ్ణి. కమల బాగానే చూచుకునేది. అమ్మకోసం మడికట్టుకుని వంట చేసేది. లక్ష్మీనారాయణ, రంగనాథుని కోవెలలకు తీసికెళ్లేది. నెలా, నెలపదిహేను రోజులుంది. అమ్మకు జీవితం అంతా కష్టాలే! ఆమె సుఖంగా ఉన్నందుకు నేను సంతోషించాను.

అన్నయ్యకు సరిగ్గా మా ఇల్లులాంటిదే – నాకన్నముందే – అఫ్జల్ గంజ్ అక్బర్ జా బజారులో – వచ్చింది. ఈ ఇల్లు రాకముందు – కొంతకాలం మేం కలిసి ఉన్నాం. మాకు ఇక్కడ కలిగిన పిల్లలు ముగ్గురూ అన్నయ్య ఇంట్లో ఉండగానే కలిగారు. అన్నయ్య వచ్చి అమ్మను తమ ఇంటికి తీసికెళ్లారు. ధనుర్మాసం రావడంతో – ఎంత వారించినా వినకుండా – అమ్మ గార్ల వెళ్లిపోయింది. మళ్లీ రాలేదు!

1960 ఫిబ్రవరి 20 నాటి రాత్రి మా వదిన వచ్చింది. గార్లనుంచి అమ్మకు సీరియస్‌గా ఉందని టెలిగ్రాం వచ్చిందని చెప్పింది. ఆ వార్త విని నా గుండె జల్లుమంది. వెంటనే వదినతో వెళ్లాను. అన్నయ్యా నేనూ బయలుదేరాం. రాత్రి బయలుదేరే బండి పూరీ పాసింజరు మాత్రం ఉండేది. అప్పటికింకా బెర్త్‌లు, రిజర్వేషన్లు లేవు. థర్డ్ క్లాసు పెట్టెలో బయలుదేరాం. మా మానసిక ఆందోళనకు రైలువేగం చాలడం లేదు. రైలు నత్తనడకతో సుమారు తెల్లవారుతుండగా గార్ల సమీపించింది. మా ఇల్లు కనిపిస్తే బావుండును అనిపించింది, కనిపించలేదు. ఆ బండి గార్లలో ఆగదు. డోర్నకల్లులో దిగాం. క్షణం ఆగకుండా వెనక్కు – గార్లకు నడిచాం. అప్పటికి తెల్లవారుతున్నది. ఇళ్లముందు ఊడ్చి, చల్లుతున్నారు. జనం ఇంకా లేవలేదు. పరిగెత్తి ఇల్లు చేరాం. ఇంటిముందు నిప్పులేదు! అదొక ఊరట!

లోనికి వెళ్లాం. ముగ్గురు చెల్లెళ్లు ఉన్నారు. అమ్మ మగతగా ఉంది. అమ్మ మంచంమీద కూర్చున్నాం. అమ్మ మంచంలో పిచ్చుక పిల్లలా ఉంది. ఎముకల బోను అయింది. అమ్మను చూచి దుఃఖం పొంగింది. అమ్మ కళ్లు తెరిచింది. "ఎవర్రా! కృష్ణుడు – రంగడు వచ్చిన్రా?!" అని చేతులు పట్టుకొని చూచింది.

"అమ్మా! ఇట్లెందుకయినవే!" దుఃఖం ఆగలేదు.

"కావలసినట్లే అయిన. ఇంక భూమ్మీద నాకేం పనున్నది? అరుణ పెళ్లి చూడకుండ పోతున్న, మీరు చేస్తరుగద!"

ఆమె మాటలు సహించలేకపోయాం. అయిదుగురమూ గొల్లుమన్నాం. మరోలా అనుకుని ఇరుగుపొరుగు ఉరికి వచ్చారు. అమ్మ అందరినీ చూచింది. "బాగున్ననమ్మా! నా కొడుకు లొచ్చిన్రు. నా కింకేం కావాలె? అరె కృష్ణుడూ! కోడళ్లను – మనుమలను పిలిపించరా!" అని కన్నీరు రాల్చింది. కనుకొలుకుల్లోంచి సాగిన నీరు పరుపు తడిపింది.

మేం దుఃఖం దిగమింగాం. అమ్మకు ధైర్యం చెప్పినట్లు చేశాం. అమ్మ ముఖం కడిగించాం. చాయ్ త్రాగించాం. బట్టలు మార్పించాం. వేరే మంచం వేసి అమ్మను గదిలోకి మార్చాం. మేము అయిదుగురము – రెండోచెల్లెలు పిల్లలూ

అందరమూ గదిలో కూర్చున్నాం. అమ్మ లేచి కూర్చుంది. ఆమె కనుల్లో కాంతి రేఖలు గోచరించాయి! గతం తవ్విపోసింది.

**మనిషికి డబ్బుకాదు - తనవారుండాలి!**

**తెలిసిన** విషయం ఏమంటే – ధనుర్మాసపు స్నానాలు చేసేది. గుళ్లో పెట్టింది నోట్లో వేసుకునేది. ముడుచుకుని పండుకునేది. సన్నగా జ్వరం వచ్చినా లెక్క చేయలేదు. అమ్మను చూడ్డానికి వచ్చిన చెల్లెళ్లు అమ్మను చూచి దడుచుకున్నారు. టెలిగ్రాం ఇచ్చారు.

డోర్నకల్లులో ఉండిన డాక్టర్ రాధాకృష్ణ, గార్లకు గవర్నమెంటు డాక్టరుగా వచ్చారు. వచ్చి చూచారు. జ్వరం – కామెర్లు, కిడ్నీలు దెబ్బతిన్నాయి. సాధ్యమైనంత ప్రయత్నం చేద్దాం అన్నారు. హైదరాబాదు తీసికెళ్లొద్దన్నారు.

మాకు కొంతధైర్యం వచ్చింది. మందులు – ఇంజక్షన్లు ఇస్తున్నారు. కోలుకుంటున్నట్లు అనిపించింది!

మిత్రులు అనేకమంది నకిరెకంటి కృష్ణమూర్తి – కొదుమూరి వేంకటేశ్వరరావు – భద్రం – మా శ్రీకాక గ్రామపెద్దలు కూడా వస్తున్నారు. అమ్మ అందరినీ పలకరిస్తున్నది. వదినకూ – కమలకూ రమ్మని కబురు చేశాం.

21 ఫిబ్రవరిన అమ్మ కోలుకున్నది. స్నానం చేసింది. ఆరాధన చేసింది. అన్నం సహించలేదు. పళ్లరసం త్రాగించాం. ఆ రాత్రి నిద్రపోయింది.

22 ఫిబ్రవరి పగలు విషమించింది. డాక్టరు వచ్చారు. మందులు – ఇంజక్షన్లు ఇచ్చారు. వైద్యులు వచ్చారు. రెండు గంటల ప్రాంతంలో గురక మొదలయింది. ఎవరినీ గుర్తుపట్టకుండా అయింది. నరంలోకి ఇంజక్షను ఎక్కడం లేదు. డాక్టరు పెదవి విరిచాడు. కాని, ప్రయత్నం సాగిస్తూన్నాడు.

నాలుగు గంటలకు దీపం వెలిగినట్లు అమ్మకు తెలివి వచ్చింది. తీర్థం కావాలని సంజ్ఞ చేసింది. అన్నయ్య తులసి తీర్థం తెచ్చారు. ఉద్ధరణితో మూడుసార్లు పోశారు. మింగింది. ఒక్కసారి అందరినీ కలయచూసింది. అంతే, కన్నుమూసింది.

మేమంతా గొల్లుమన్నాం.

మా ఏడుపులు వినరాని – వినలేని – దూరతీరాలకు వెళ్లిపోయింది!

మమ్ములను తల్లిలేని పిల్లలను చేసి తాను పరలోకాలకు మాతృమూర్తి కావడానికి వెళ్లిపోయింది!!

తలలు పగలగొట్టుకున్నా తిరిగిరాని చోటుకు చేరుకుంది!!!

అమ్మ – గోవర్ధనం వరదాచార్యులవారి మనుమరాలు – భట్టరాచార్యులవారి కూతురు – దాశరథి వేంకటాచార్యులవారి సహధర్మచారిణి – మా అయిదుగురికి తల్లి – దాశరథి వేంకటమ్మగారు వికారి మాఘ బహుళ ఏకాదశి సోమవారం 22–2–1960 సాయంత్రం నాలుగు గంటలకు పరమపదించారు.

కళ్లకుంట వేంకటాచార్యవారి కూతురు ఆండాళమ్మకు రాజుల – కొంగల – కొత్తపల్లిలో పరాభవనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి సోమవారంనాడు మా అమ్మ వేంకటమ్మ జన్మించి, యాభయినాలుగు సంవత్సరాల వయసులో గార్లలో పరమాత్మని సాన్నిధ్యం చేరుకున్నారు.

ఆ రాత్రి శవజాగరణం భరించరానిది అయింది. బహుత్ సంగీన్ రాత్ థీ. అయినా గుంపులుగా ఉన్న మిత్రులు మమ్ము విడవనీయలేదు.

అమ్మ మాకు మాత్రమే అమ్మకాదు. ఆమె ఉద్యమానికి తల్లి. గ్రామానికి మాతృమూర్తి. ఆమె శవయాత్రలో వందలు వేలు సాగినారు. పాలేరు ఏటి ఒడ్డున – రైల్వేవంతెన సమీపంలో అమ్మచితికి నిప్పు అంటిస్తున్నపుడు – తల కొరివి పెడుతున్నప్పుడు – అమ్మ ఇంకా నాలుగు కాలాలు ఉండాల్సింది అనిపించింది. ఆ చితిమంటలు మా గుండెల్లో మండాయి. అప్పుడే వంతెన మీదినుంచి సాగుతున్న రైలులోంచి వదిన – కమల చితిమంటలు చూచారు.

కొందరు కష్టాలకే పుడ్తారు. 1932లో ఖమ్మం చేరినప్పటి నుంచి అమ్మ కష్టాల కడలిని ఈదింది. మేము ఇద్దరం కాస్త బాగున్నాం – అమ్మను సుఖపెడదాం అనుకుంటుండగా వెళ్లిపోయింది!

కబురు నిన్ననే అందినా – అంతా అయిపోయింతరువాత – నాయన తెల్లవారి వచ్చారు. లాంఛనంగా ఉండి వెళ్లిపోయారు.

'మరణాంతాని వైరాని' అంటాడు వాల్మీకి. రావణ వధ జరిగింది. విభీషణుడు తాను పాపిష్టి అన్న శవాన్ని తాకను అంటాడు. అప్పుడు రాముడు విభీషణునితో అంటాడు: 'వైరం మనిషితో. దేహంతో వైరం లేదు. వైరములు మరణంతో అంతరిస్తాయి. కావున రావణునికి తగురీతిన సంస్కారం చేయుము.

అదీ అర్థం చేసుకోలేదు నాయన! **వేదాంతులకు' బైరాగులకు ఉన్నంత మాత్సర్యం సామాన్యులకు ఉండదు!**

మూడోనాడు అస్తి సంచయనం చేశాం. నేను బెడవాడవెళ్లి కృష్ణలో నిమజ్జనం చేసివచ్చాను.

పక్షికి వేసిన్నాడు అనాయాసంగా ముట్టింది. మా చెల్లెలు లక్ష్మి – నా కూతురు కవితకు పక్షికి వేసినపుడు కష్టంగా పక్షి ముట్టింది.

తొమ్మిదవరోజునుంచి పన్నెండో రోజువరకు – శాస్త్రోక్తంగా కర్మలు జరిపాం. బంధుమిత్రులతో ఇల్లు కిటకిటలాడింది. నాయన ముభావంగా ఉన్నారు.

పదమూడవరోజున ద్రావిడ వేద అనుసంధానం – వియ్యాలు నడవడం – స్వర్గపాథేయం ఇవ్వడం – తదీయారాధన చందన గోష్ఠి – మాకు కొత్తబట్టలు పెట్టి ఆశీర్వదించడం జరిగాయి!

అంతటితో కర్మ ముగిసింది. దుఃఖాలు కూడ చాల వరకు దూరం అయినాయి. పన్నెండు రోజుల వ్యవధికి కారణం ఉన్నట్లు కనిపిస్తుంది. వంటికి తగిలిన గాయం మానడానికి వారం పట్టినట్లే – మనసు తగిలిన గాయం ఉపశమించడానికి 12 రోజులు పట్టేటట్లుంది.

కర్మకాండను నమ్మినా నమ్మకున్నా తల్లిదండ్రుల – తీర్చుకోలేని రుణం తీర్చుకున్నాం అనిపించడానికి ఇది ఒక మార్గం. మాసికాలపుడు నెలకొకసారి – తద్దినాలపుడు సంవత్సరానికి ఒకసారి వారిని తలచుకోవచ్చు.

నేను ఒక సభకు వెళ్లాను. నిర్వాహకుడు సభ మొదలవుతున్నపుడు వెళ్లాడు.

సభ ముగుస్తుండగా వచ్చాడు. 'అమ్మ చచ్చిపోయింది. తగలపెట్టి వస్తున్నా' అని ఎవరి చావుకో వెళ్లివచ్చినంత నిర్లిప్తంగా చెప్పాడు.

**అనుబంధాలు మరణాంతాలు కారాదు!**

**అలా అవుతే అది అమానుషం!!**

పద్నాలుగో రోజున మా అమ్మాయి సుధకూ, రమాదేవి కొడుకు శ్రీనివాసులుకూ అన్నప్రాశనలు చేశాం.

పదిహేనో నాడు ఉన్న సామాను పంచుకునే ప్రశంస వచ్చింది. మా తాతగారు లక్ష్మణాచార్యులవారి పేరు చెక్కి ఉన్న 'కొప్పెర' మాత్రం నేను తీసుకున్నాను. మిగతా ఇల్లెడు సామాను వాళ్లే తీసుకున్నారు.

గార్ల వదిలివెళ్లే రోజు! ఆ ఇల్లు – ఆ పరిసరాలు – ఆ ఊరు వదలడానికి మనస్కరించలేదు. జంగమములు అయినా వాటితో అనుబంధాలు పెంచుకున్నాం. ప్రజలు మమ్ములను ఆత్మీయులుగా చూసుకున్నారు. మనసుకన్న అవసరం మిన్న! కదలక తప్పలేదు.

దారి పొడుగునా కొందరు నమస్కరించారు – కొందరు కుశల ప్రశ్నలు వేశారు – కొందరు పాదాభివందనాలు చేశారు. కొందరు 'ఇంకెందు కొస్తరు లేరి' అని ఆత్మీయ నిష్ఠూరం పలికారు. అనేక మంది వెంటరాగా స్టేషను చేరుకున్నాం. స్టేషను మాస్టరు కంట తడిపెట్టుకున్నాడు. ఆ తత్తరపాటులో టిక్కెట్లిచ్చాడు. బండికి గంట కొట్టాడు. జండాలు పట్టుకొని బయటికి వచ్చాడు. మేమంతా సిద్ధం అయినాం.

ఆ వచ్చింది గూడ్సుబండి!

స్టేషను మాస్టరు సిగ్గుపడిపోయాడు!!

తరువాత పాసింజరు వచ్చింది. అంతమంది ప్రేమ – అభిమానం – ఆత్మీయత – అనురాగాల జల్లు గుండెల్లో నింపుకొని రైలెక్కాం.

రైలు సాగింది. అమ్మ చితిస్థలం – వంతెన – పాలేరు – రామాపురం దాటిపోయాయి.

"దేవుడు లేడనే వాడున్నాడు
అమ్మ లేదనేవాడున్నాడా?" – ఇది తరువాత అన్నయ్య దాశరథి వ్రాసిన సినిమా పాట.

# ముప్పది

## వందే వాల్మీకి కోకిలం:

మాది దాశరథి వంశం. దాశరథి అంటే రాముడు. రాముడు అంటే రామాయణం. రామాయణాన్ని గురించి విశిష్టాద్వైతులు – శ్రీవైష్ణవులు – చేసినంత పరిశ్రమ మరొకళ్లు చేయలేదు. వారు రామాయణానికి నాలుగు వ్యాఖ్యలు వ్రాశారు. రాముణ్ణే సాక్షాత్తు శ్రీమన్నారాయణుని చేశారు. రాముని గుణగణాలను కీర్తించారు. రామ కథలో తాము లీనం అయినారు. తమ సిద్ధాంత వ్యాప్తికి రామాయణాన్ని వినియోగించుకున్నారు. భక్తజనులను పరవశం చేశారు.

విశిష్టాద్వైతానికి పన్నెండుగురు ఆళ్వారులు. వారిలో కులశేఖరాళ్వార్ ఒకరు. వారు తిరువాన్కూరు రాజ్యానికి ప్రభువులు. వారు తమ రాజ్యాన్ని అనంతపద్మనాభస్వామికి సమర్పించారు. దేశీయ రాజ్యాలు రద్దయ్యేదాకా తిరువాన్కూరు రాజులు – రాజ్యాన్ని అనంత పద్మనాభస్వామి పక్షానే పాలించారు. ఇటీవల నేను తిరువాన్కూరు వెళ్లినపుడు మాజీ మహారాజు ఉదయానే దేవాలయం ఊడ్చటం చూశాను!

కులశేఖరులకు రామాయణం అంటే అనంతం అయిన శ్రద్ధాభక్తులు. వారు రామాయణంలో లీనం అయ్యేవారు. ఒకనాడు శ్రీమద్రామాయణ కాలక్షేపం వింటున్నారు. కథ చెపుతున్న స్వామి 'వంటరి రాముని మీదకు ముప్పదివేలమంది ఖరదూషణ త్రిశిరాదులు ఎత్తివచ్చినారు' అని సాయించినాడు. 'ఏమీ, వంటరి రాముడు – ముప్పదివేల మంది రాక్షసులా! మనము సాయమునకు తరలవలెను' అని తన సైన్యాన్ని తీసుకొని సాగారు. అంత లీనం అయిపోయారు కులశేఖరులు అందులో.

మంత్రులకు ఏమీ అర్థం కాలేదు. రాజు ఎక్కడికి వెళ్తాడు? సైన్యం ఎక్కడికి పోతుంది? వారు రామ కథ చెపుతున్న స్వామిని ఆశ్రయించారు. స్వామి 'ఒక్కడే ధర్మాత్ముడగు రాముడు ముప్పది వేలమంది రాక్షసులను కూల్చినాడు.

*తతస్తుతం రాక్షస సంఘమర్దనం*
*సభాజ్యమానం ముదితైర్మహర్షిభిః*
*పునః పరిష్వజన శశిప్రభాననా*
*బభూవ హృష్టా జనకాత్మజా తదా*

రాముడు సమస్త రాక్షసులను సంహరించినాడు. మహర్షులు సంతసించినారు. అలాంటి రాముణ్ణి చంద్రముఖి సీత చూచింది. ఆనందపరవశ అయింది. రాముని మరల కౌగలించుకున్నది, అని చెప్పారు.

అది విని కులశేఖరుడు సైన్యాన్ని మరలించాడు. రాముడు గెలిచినందుకు తిరువనంతపురంలో ఉత్సవాలు చేశాడు.

రామాయణంలో అంత బలం ఉంది. అయితే అది గ్రహించగలవారికే తాదాత్మ్యత! మా వంశంలో రామాయణ అధ్యయన పరిశీలనలు ఎంతో జరిగాయి. మా తాతలు భద్రాచలవాసులు. వారు ఆ రామునే ఆశ్రయించినవారు. నా బాల్యంలో మా నాయన – ఖమ్మంలో – రామాయణం కాలక్షేపం సాయించేవారు. రామాయణ గ్రంథం తీసికెళ్లడానికి ఒక భక్తుడు వచ్చేవారు. ఒకనాడు నేనే రామాయణం తెస్తానన్నాను. బరువుంటుంది వద్దన్నారు నాయన. వినలేదు. తలమీద పెట్టుకుని కాలక్షేప స్థలానికి మోసుకుని వెళ్లాను. 'మా రంగడు రామాయణం మోయగలిగినాడు' అన్నారు నాయన ఆనాటి శ్రోతలతో! రామాయణం మోయడం సామాన్యం కాదు. అయితే, రామాయణంలో కొంత కృషి చేయగలిగాను.

అంత చిన్నతనంలోనూ రామాయణ కథ నన్ను ఆకర్షించింది. అంత సులభంగా అంత అందంగా రామాయణం చెప్పారు నాయన. వారి పాండిత్యం మీదా – వారి వివరణ మీదా నాకు ఎంతో విశ్వాసం. అందుకే నాయన మమ్ములను ఎన్ని ఇక్కట్లు పాలు చేసినా నేను వారిని గౌరవించాను. వారు అప్పుడప్పుడూ మా ఇంటికి వచ్చేవారు. కమలా, నేనూ వారిని ఆదరించాం.

అతి చిన్నతనంలోనే రామాయణం నామీద ఎంతో ప్రభావం వేసింది. అయితే ఉద్యమకాలంలో కమ్యూనిస్టు ప్రభావంలోకి వచ్చాను. సంప్రదాయంలోంచే సాహిత్యమూ కళలూ ఆవిర్భవిస్తాయనే మార్క్సమాటలు కమ్యూనిస్టులకు అర్థం కాలేదు. రామాయణాన్ని మత గ్రంథంగా - రాముని పేర దోపిడీ జరుగుతున్నట్లుగా భావించాం. రామాయణం విషయంలో కొంత విముఖత ఏర్పరచుకున్న మాట వాస్తవం.

భారతదేశంమీద దండెత్తి గెలిచినవారు ఆంగ్లేయులు మాత్రం కారు. ముస్లిములకు ముందు వచ్చినవారంతా భారత సంప్రదాయానికి ముగ్ధులు అయినారు. భారతీయులు అయినారు. అలగ్జాండర్ సైతం భారత నాగరకతకు ముగ్ధుడు అయినాడు. కొంత భారత మూల్యాన్ని గ్రీకుకు చేరవేశాడు. కొంత గ్రీకు నాగరకతను భారతదేశానికి చేర్చాడు. గ్రీకును ఫారసీలో యూనాన్ అంటారు. ఈనాటి యూనానీవైద్యవిధానం ఆనాడు వచ్చిందే. గ్రీకు శిల్పశాస్త్రం సైతం మనమీద ఎంతో ప్రభావం వేసింది.

మత కరవాలం చేతబట్టి వచ్చిన ముస్లిం విజేతలు సహితం భారత నాగరకతకు - తాత్త్వికతకు - సంప్రదాయానికి ముగ్ధులు అయినారు. మన సంప్రదాయం నుంచే సూఫీ సిద్ధాంతాన్ని ఏర్పరచుకున్నారు. ముస్లిముల వేషభాషలు భారతీయులను ప్రభావితం చేసింది వాస్తవం. కాని భారతీయుల మౌలిక చింతనలో మార్పు రాలేదు. పైగా మెరుగులు దిద్దుకున్నది. శంకరుని అద్వైతం - రామానుజుని విశిష్టాద్వైతం, చైతన్య ప్రభు మధురభక్తి - బసవేశ్వరుడు, బిజ్జలుని వీరశైవం ముస్లిముల పాలనలోనే వెలిశాయి. తులసీదాస్ రామచరిత్ర మానసం రచించి ఉత్తర భారతాన్ని ప్రభావితం చేసింది ముస్లిముల పాలనలోనే! సూరదాస్ - మీరా - త్యాగరాజు - రామదాసు - వీరందరి భక్తి ప్రవచనాలు ముస్లిముల కాలంలోనే జరిగాయి. అయితే ఔరంగజేబు - మీర్ ఉస్మాన్ వంటివారు - భారత సంప్రదాయానికి అనను కాని - హిందూమతానికి నష్టం కలిగించడానికి ప్రయత్నించిన విషయం చారిత్రక సత్యం.

యూనాన్ మిస్రో రోమా
సబ్ మిట్ గయె జహాఁమే
అబ్ తక్ మగర్ హై బాకీ
నామో నిశాఁ హమారా

(గ్రీకు, ఈజిప్టు, రోము నాగరకతలన్నీ మంట కలిశాయి. కాని నేటివరకూ మన పేరు ప్రఖ్యాతులు నిలిచి ఉన్నాయి) అంటాడు ఇక్బాల్ మహాకవి.

ఆంగ్లేయులు మాత్రం ఈ దేశపు సంస్కృతీ సంప్రదాయాలను ధ్వంసం చేయడానికి వచ్చారు. వారు ఆనాటి మేధావులకు భారత సంప్రదాయం మీద విరక్తిమాత్రం కాదు - ద్వేషం కలిగించారు. వారి సంప్రదాయాలే ఉత్తమములు అని మన నరనరాల్లోకి ఎక్కించారు. బ్రహ్మసమాజం ఆంగ్లప్రభావంతో వచ్చిందే! మనకు విగ్రహారాధన బౌద్ధులనుంచి వచ్చింది. రామాయణ, భారతాల్లో విగ్రహారాధన లేదు. దేవాలయం లేదు. అలాంటప్పుడు పాలకుల సంస్కృతికి లొంగి, విగ్రహారాధన ఏదో పాపం అన్నట్లు బ్రహ్మ సమాజ మదేల? క్రైస్తవులలో రోమన్ కేథలిక్కులు విగ్రహారాధకులే!

చాదస్తులు, అన్నిమతాల్లో - కులాల్లో - సిద్ధాంతాల్లో ఉంటారు. మావో

చాదస్తం చైనాలో ఎంతవరకు పోయిందో మనకు తెలుసు! ప్రొటెస్టెంట్లు వ్యతిరేకించేదాకా క్రైస్తవ మతాచార్యుల క్రూర కృత్యాలు మనకు తెలియనివి కావు. అలాగే వేయేళ్ల పరాయిపాలనలో మతాధిపతులు కొన్ని దురాచారాలు కల్పించిన మాట నిజం. వాటిని పారద్రోలవలసిన ఆవశ్యకత ఉంది. కాని అది చేయాల్సింది పరాయి పాలకులను స్తుతించడానికీ – సంతోషపెట్టడానికీ – మన సంప్రదాయాలను మంట కలపడానికీ కాదు. వీరేశలింగంగారు మృతశిశువును పూడ్చడానికి పాలకుల సంప్రదాయపు శవపేటిక ఉపయోగించారు. గురజాడవారు సంస్కృతం మీద ఎంత ద్వేషం కలిగించారంటే – ప్రమాణం చేయడానికి సహితం ఆంగ్లగ్రంథం కావలసి వచ్చింది!

కందుకూరి – గురజాడలు గొప్ప సంఘసంస్కర్తలు. వారిమీద నాకు ఎంతో గౌరవాభిమానాలున్నాయి. కాని ఆంగ్లేయులు మన సంప్రదాయాన్ని అవమానించడానికి – సంప్రదాయాన్ని రూపుమాపడానికి చేసిన మాయకు వారు ఎంత ప్రభావితులయినారో చెప్పడానికి మాత్రమే పై ఉదాహరణలు.

ఆంగ్లేయులు భారత సంప్రదాయాన్ని రూపుమాపే ప్రయత్నంలో భాగంగానే మన మేధావులు – ముఖ్యంగా ప్రగతిశీలురు అనిపించుకునేవారు రామాయణ మహాభారతాలను వేదాంత గ్రంథాలుగా వెలి వేశారు. విమర్శలు చేశారు. ఆ విధంగా ఆ మహాగ్రంథాలకు కొంతకాలం గ్రహణం పట్టించారు. గ్రహణం సూర్య, చంద్రులను మింగలేదు. కప్పి ఉంచగలదు. అంతే.

మా అమ్మగారు పరమపదించిన తరువాత వాల్మీకి రామాయణం – మరొకసారి – ధ్యానంగా చదివాను. అందువల్ల జ్ఞానోదయం అయింది. రామాయణం వేదాంతం కాదని అర్థం అయింది. రాముడు పరిపూర్ణ మానవతామూర్తి అని అర్థం అయింది. వాల్మీకి అత్యద్భుతకావ్యాన్ని సృష్టించిన కవికులగురువునకు గురువు అని అర్థం అయింది. వాల్మీకికి తెలిసిన ప్రకృతి తత్త్వం – మానవ మనస్తత్వం – సామాజిక స్వరూప స్వభావాలు ఇంతవరకు ఏ రచయితకూ తెలియలేదని అర్థం అయింది. వాల్మీకి సృష్టించిన కావ్యం – అతను సృష్టించిన పాత్రలు – సంబంధాలు – సన్నివేశాలు – నీతులు – సిద్ధాంతాలు – ధర్మాలు మారవలసిన కాలధర్మాలకు ఎదురు తిరిగి నిలిచాయని విదితం అయింది.

*"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చమహీతలే*
*తావ ద్రామాయణ కథాలోకేషు ప్రచరిష్యతి"*

(ఈ లోకంలో కొండలూ, నీళ్లూ ఉన్నంతకాలం రామాయణ కథ వ్యాప్తిలో ఉంటుంది) అన్న మహర్షివాక్యం నిత్యసత్యం అయింది.

వాల్మీకి వల్ల ప్రభావితుడుకాని భారతీయ రచయిత ఉండడు. వ్యతిరేకించిన వారు సహితం రామాయణ ప్రభావితులే! ఆ మహర్షి సృష్టించిన కావ్యం ఉండబట్టికదా విమర్శించింది!

*"మందః కవియశః ప్రార్థీ, గమిష్యామ్యుపహాస్యతామ్*
*ప్రాంశులభ్యే ఫలే లోభా, దుద్బాహుర్వి వామనః"* అంటాడు కాళిదాసు రఘువంశ కావ్యారంభంలో.

(నేను మందుణ్ణి, వాల్మీకి కవివంటి కీర్తికి పాకులాడుతున్నాను. అపహాస్యం పాలవుతున్నాను. ఆ పండు ఆజానుబాహులకు అందేది. పొట్టివాడు ఫలం అందుకోవడానికి చేతులెత్తి ఎగిరినట్లుంది నా స్థితి.)

కాళిదాసు వాల్మీకిని అనుసరించని చోటులేదు. కాళిదాసు కావ్యాల్లో రామాయణ శ్లోకాల ప్రతిరూపాలు అనేకం కనిపిస్తాయి. భాసుడు, భవభూతి మాత్రమే కాక బుద్ధ చరితం రచించిన అశ్వఘోషుడూ వాల్మీకి వల్ల ఎంతో ప్రభావితుడు అయినాడు.

వాల్మీకి రాముణ్ణి మానవమాత్రునిగానే సృష్టించాడు. రామునిలో – మానవులలోని బలములు – బలహీనతలూ అన్నీ కల్పించాడు. ఆదర్శమానవునికి ఉండే లక్షణాలు – ఆత్మవిశ్వాసం – దృఢసంకల్పం – నిరంతరయత్నం – ప్రేమాభిమానాలు కొల్లలుగా కల్పించాడు.

"దైవసంపాదితో దోషామానుషేణ మయాజితః" – దైవం కల్పించిన దోషాన్ని మనిషిగా నేను జయించాను అంటాడు రాముడు. 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం' – నేను మనిషిని – రాముణ్ణి – దశరథుని కొడుకును అంటాడు.

రామాయణం మానవగాధ. ఒక ఆదర్శపురుషుని – ఒక ఆదర్శనారీమణి కధ. రామాయణం 'సీతాయాశ్చరితం మహత్'– అది సీత కధ. వాల్మీకికి సీత అతి ప్రియం అయిన పాత్ర. సీత యోనిజ కావడం సహితం వాల్మీకికి సహించలేదు. ఆమెను అయోనిజను చేశాడు. ఆమెతోనే అనేక ముత్యాల మాటలు అనిపించాడు. రామాయణం సాకల్యంగా అధ్యయనం చేసినవారు సీత విషయంలో ఆదరం – అభిమానం – భక్తి పెంచుకుంటారు. వాల్మీకి స్త్రీ పాత్రలను మలిచిన తీరు అపూర్వం. రామాయణ కధ ఒక మలుపుకు మంథర – మరొక మలుపుకు శూర్పణఖ కారకులు. తార తన చాకచక్యంతోనూ – శబరి తన భక్తిభావంతోనూ మనసు మురిపిస్తారు.

కుటుంబం ఈనాటి వంటి క్లిష్టదశలో ఉన్నపుడే వాల్మీకి రామాయణం రచించాడు. దశరథునకు బహు భార్యలు – ముసలితనంలో వయసుపెళ్లాం. ఆమెకు లొంగి అతడు తెచ్చిన అనర్థాలు చెప్పాడు. వాల్మీకి బహుభార్యత్వానికీ – వార్ధక్యవివాహాలకు వ్యతిరేకి.

**ఏకపతీత్వం - ఏకపత్నీత్వం తొలిసారి ప్రతిపాదించి, కుటుంబ క్షేమానికి, సామాజిక ప్రగతికి ఇది అవసరం అని చెప్పిన సాంఘిక శాస్త్రజ్ఞుడు వాల్మీకి.**

"అనన్యా రాఘవేదాహం – భాస్కరేణ ప్రభాయథా"

రాముడు నేను – సూర్యుడు వెలుగువలె – వేరుకాము అంటుంది సీత. **విచ్ఛిన్నమై - మృగ్యంకానున్న - కుటుంబ వ్యవస్థ ఉన్న నేటి దశలో రామాయణ సందేశం అమృతప్రాయం!**

వాలి సుగ్రీవులు – రావణ విభీషణుల వంటి అన్నదమ్ములున్న నాటి–నేటి–రేపటి సమాజాల్లో రామలక్ష్మణ భరతశత్రుఘ్నులవంటి సోదరభావం ఆదర్శం.

**"అగ్నిసంయోగవద్ధేతు శస్త్రసంయోగ ఉచ్యతే" - అగ్నివంటిది ఆయుధం. అది ఉండడమే అనర్థం అని నిరస్త్రీకరణను ఆనాడు దర్శించినవాడు వాల్మీకి.**

వాల్మీకి రాముడు – మానవ మాత్రుడయినా భారతీయులు అతణ్ణి భగవానుడుగా భావించారు. సత్పురుషులను భగవంతునిగా పూజించడం మానవనైజం. గౌతమబుద్ధుడు – మహావీర వర్ధమానుడు – క్రీస్తు – మహమ్మదు – అందరూ అలాగే భగవంతులు అయినారు.

రాముని భగవానునిచేసే ఆవేశంలో అనేక అవాల్మీకములు వచ్చాయి. అద్భుతాలు ఆశ్చర్యాలు కల్పించాయి. వాల్మీకి అహల్య బండకాదు. శబరి ఎంగిలిపళ్లు పెట్టదు – రావణుడు సీతను నేల పెళ్లగించి తీసుకుపోడు – రాముడు సీతను అగ్నిప్రవేశం చేయించడు. అవాల్మీకముల వ్యాప్తివలన వాల్మీకానికి గ్రహణం పట్టింది!

అయితే తులసీరామాయణం ఔత్తరాహులను సంఘటితపరచడానికి ఎంతో ఉపకరించింది.

శ్రీమద్రామాయణం అధ్యయనం పూర్తిచేశాను. అయితే రామాయణం నన్ను వెన్నంటేంది. వదల్లేదు. రామాయణ పాత్రలు – సంఘటనలు – సన్నివేశాలు – వర్ణనలు – సామాజిక సందేశాలు నాలో ఆవర్తనం అవుతున్నాయి. ఒక ఉత్తమ కావ్యలక్షణం అదే. అది మనసుకు పట్టుకుంటుంది. వేధిస్తుంది. ఆలోచింపచేస్తుంది. రామాయణం నన్ను ఏం చేయమంటూందో అర్థం కాలేదు. అవగతం కాలేదు.

అప్పుడు నాకు అనిపించింది – రామాయణ వాస్తవాలను వివరించాలి. రామాయణం కావ్యం ఇది మానవ గాథ. దేశకాలాలతో నిమిత్తం లేకుండా సకల మానవ కళ్యాణసందేశాలు ఇందులో ఉన్నాయి. ఇవన్నీ ప్రజలకు తెలియపర్చాలి. అందుకు రచయిత చేయగలిగే పని రచన. వాల్మీకిని అనుసరించి ఒక సంక్షిప్త రామాయణం – ఆధునిక పాఠకుడు చదివి పరిశీలించగల రీతిలో – రచించాలనిపించింది.

రామాయణం – సామాన్యం కాదు. అది రచించే శక్తి స్తోమతలు నాకున్నా యనిపించలేదు. కాళిదాసువంటివాళ్లే వెనకా ముందాడారు. అప్పటికి నేనింక చిన్నవాణ్ణి. మూడు పదులు దాటినవాణ్ణి వ్రాయగలనా? ఈ భయంతో కొన్నాళ్లు గడిచాయి.

ఏదో శక్తి నన్ను ప్రోత్సహిస్తున్నది. ప్రేరేపిస్తున్నది. ముందుకు తోస్తున్నది. అది రామాయణ శక్తి కావచ్చు. దైవప్రేరణ కావచ్చు. కలం పట్టక తప్పలేదు. భగవంతుని మీద భారం వేశాను. రచన ప్రారంభించాను.

రచన ప్రారంభించాను కాని భయం, సముద్రంలో పడి ఈదలేకపోతున్నట్లు – మహారణ్యంలో తప్పిపోయి మార్గం కనుగొనలేకపోయినట్లు – జనసందోహంలో ఇరుక్కుపోయి బయటికి రాలేనట్లు అనిపించేది.

రచనకు టేబుల్‌ముందు కూర్చుంటే అవన్నీ విడిపోయి మార్గం కనిపించినట్లు – అంధకారం విడిపోయి, వెలుగు ప్రసరించినట్లూ అనిపించేది. తెల్లవారు జామున వ్రాశాను. వాతావరణం ప్రశాంతంగా ఉండేది. కమల నా మనసెరిగి, చాయ్ అందించేది. చాయ్, సిగరెట్టు ఉత్సాహం కలిగించేవి. రచన నాకు తెలియకుండానే అలా సాగిపోయేది. రచన సాగడానికి ముఖ్యం అయినవి సంకల్పం – స్పందన – ఆర్తి.

కమల పిల్లల సాయంతో ఇంటిపనులు సమస్తం చూచుకునేది. నామీద భారం పడనిచ్చేది కాదు. వచ్చిన డబ్బు సాంతం ఆమెకు ఇచ్చేవాణ్ణి. చాలకుంటే అడిగేది. అప్పోసప్పో చేసేవాణ్ణి. కాని ఇంట్లో ఎవరూ వ్రాస్తున్నందుకు గునిసేవారు కారు.

వాస్తవంగా రచనలమీద నా ఆర్జన అతి కొద్ది. అయినా కమల నాకు అన్నివిధాల సహకరించింది. ఆమె సహకారం లేకుంటే రచన సాధ్యం అయ్యేదికాదు.

టేబుల్ ముందుకు వెళ్లేవరకు భయంభయంగా ఉండేది. ఎవరో ముందుకు నెట్టినట్లు కూర్చునేవాణ్ణి. రామాయణం చూచి రచన ప్రారంభిస్తే ఉత్సాహం వచ్చేది. ఎంత జటిలమయిన సమస్య అయినా వెలుగు చిమ్మినట్లు పరిష్కారం అయ్యేది. ఆఫీసుకు వెళ్తూనే రచన నిరంతరం సాగించాను. ఒక్కొక్క కాండ అయిపోతుంటే ఏదో బరువు దిగినట్లూ - ఒక కార్యం నెరవేరినట్లూ అనిపించేది. సుందరకాండ వాస్తవంగా సుందరమైంది. దానిలో సుందరివంటి ఆకర్షణ ఉంటుంది. మనం సుందరివెంట వెర్రిగా సాగిపోతూనే ఉంటాం.

రచనలో మాత్రమే కాదు - కాండముల విభజన విషయంలోనూ వాల్మీకి తన కళాపటిమను ప్రదర్శించాడు. బాలకాండలో జనక దశరథుల కుటుంబాలు కలుస్తాయి. అయోధ్యలో దశరథుని కుటుంబం మాత్రం ఉంటుంది. అరణ్యంలో సీతారామలక్ష్మణులుంటారు. కిష్కింధలో రామలక్ష్మణులు మాత్రమే ఉంటారు. సుందరలో కేవలం సీత ఉంటుంది. యుద్ధకాండ చివరన అంతా కలుస్తారు.

వాల్మీకి అయోధ్య నుంచి కిష్కింధవరకు స్థలాల పేర్లుపెట్టాడు. సుందరకాండ సాంతం లంకలో జరుగుతుంది. అయినా అది వాల్మీకిని మురిపించింది. అందుకే 'సుందర' అయింది.

రామాయణ రచన పూర్తి చేయడానికి నాకున్న శక్తిస్తోమతలు చాలినాయి అనుకోను. భగవంతుడు రాముడుగా నాకు శక్తిసామర్థ్యాలు ప్రసాదించాడు అనుకుంటాను. మొత్తంమీద రామాయణ రచన పూర్తి అయింది.

ప్రచురణ రచనకు ప్రాణం వంటిది. రచన ప్రచురణ జరిగి ప్రజలకు అంది ప్రశంసలు పొందినపుడే రచయితకు తృప్తి.

ప్రచురణను గురించి తెలుసుకోవడానికి కొంత వెనక్కు వెళ్లాలి. 1960లో నన్ను కదిలించినవాడు వివేకానందుడు. అతడు అందని ఆధ్యాత్మికచింతనను మానవసేవకు జోడించినాడు. సకల మత సామ్యతను గురించి ప్రవచించినాడు వివేకానందుడు వెలుగు పుంజమును వెల్లడించాడు.

రామకృష్ణ పరమహంస పాదంనుంచి నరేంద్రుని మానసంలోనికి ప్రవహించిన శక్తి అద్భుతం - ఆశ్చర్యకరం! ఆ శక్తియే నరేంద్రునకు బలప్రదాత!

శక్తిని ప్రసరింపచేయటానికి పరమహంసలు కావాలి! శంకర భగవత్పాదులవలె - వివేకానందుడు తన స్వల్పకాలపు ఆయుష్యంలో భారతీయులకే కాదు - లోకాలకు వెలుగు చూపాడు.

వివేకానందుని జీవిత సంగ్రహం బాలలకోసం రచించాను. దాన్ని కొండా శంకరయ్యవాళ్లు ప్రచురించారు. నాకు యాభయిరూపాయిలు ఇచ్చారు.

కాళిదాసు నా మీద ఎంతో ప్రభావం చేశాడు. వారి మూడు నాటకాలు శాకుంతలం - మాళవికాగ్నిమిత్రం - ఊర్వశివిక్రమం - పిల్లలకోసం పుస్తకాలు వ్రాశాను. ప్రచురణ కర్త దొరకలేదు. రచనకు మెచ్చి మడిపడగ బలరామాచార్యులవారు బొమ్మలు వేశారు. బొమ్మల సహితంగా శిర్నాం సత్యనారాయణగారికి చూపాను. వారు స్పందించారు. నాకు పబ్బా శంకరయ్యగారిని పరిచయం చేశారు.

పబ్బా శంకరయ్యగారు ఆత్మవిశ్వాసం – పట్టుదల – నిరంతర కృషితో పైకి వస్తున్నవారు. వారు శ్రీరామా బుక్ డిపో స్థాపించి పుస్తక ప్రచురణ చేస్తున్నారు. వారికి సాహిత్యంతో పరిచయం లేకున్నా పండితులు సాహితీమూర్తులతో పరిచయాలు మాత్రమేకాక సంబంధాలున్నాయి. శంకరయ్యగారు స్నేహశీలి. వారు వయసులో పెద్దవారు. అయినా మా మైత్రి కొనసాగుతున్నది.

శ్రీరామా బుక్ డిపోవారు నేను రచించిన కాళిదాసు నాటకత్రయం అందంగా ముద్రించి ప్రచురించారు. వారు మూడు పుస్తకాలకు నూటయాభయి ఇచ్చారు. రచన నేను వ్యాపారంగా సాగించడం లేదు. ఆర్థికంగా ఆలోచించను. నలుగురికి అందడం నా లక్ష్యం.

'జనరంగం' అని నేను వ్రాసిన శతకాన్ని శిర్నాం సత్యనారాయణగారు తమ స్వంత డబ్బుతో ప్రచురింపచేశారు. శిర్నాం వదాన్యులు. మేయర్ పదవి అధిష్ఠించారు. కాని వారికి గుర్రప్పందాల వ్యసనం ఉండేది. అప్పులపాలయి సకుటుంబంగా ఆత్మహత్యలు చేసుకున్నారు!

నేను వ్రాసిన రామాయణం వ్రాత ప్రతిని పబ్బా శంకరయ్యగారికి ఇచ్చాను. వారు ప్రచురిస్తామని మాట ఇవ్వలేదు. కాని చూస్తాం అన్నారు. నా వయసు దృష్ట్యా నేను రామాయణం వ్రాయగలనని వారికి నమ్మకం కలుగలేదు. వారు దానిని పండితులకు చూపారు. వారు ఆమోదించినట్లున్నారు. ప్రచురిస్తామన్నారు. కాని వారు ప్రచురిస్తామన్న తీరుకు నేను వ్రాసింది సరిపోదు అని నా కనిపించింది. నేను క్రౌన్ సైజులో మూడు, నాలుగు వందల పేజీలు వచ్చేట్లు వ్రాశాను. దాన్నే అన్ని పేజీలు వచ్చేట్లు రాయల్ సైజులో ఎడం ఎడంగా వేస్తామన్నారు. నాకు అది ఇష్టం కాలేదు. రాయల్ సైజుకు సరిపోయ్యేట్లు మళ్లీ వ్రాస్తా నన్నాను. శంకరయ్యగారు అయిష్టంగానే వ్రాత ప్రతి నాకు ఇచ్చారు. త్వరగా కావాలి, అచ్చు ప్రారంభిస్తాను అన్నారు శంకరయ్యగారు. ప్రచురణ కర్త లభించడం అదృష్టం – సంతోషకరం అయింది. వ్రాసిందే మళ్లీ వ్రాయడం అంటే విసుగు కాదు – ఉత్సాహం కలిగింది. అది రామాయణం మరి! అభిగీత మిదం గీతం!!

శ్రీమద్రామాయణ రచన 12–1–63న ప్రారంభించాను. తెల్లవారుజామున లేచి – కప్పు వేడి చాయ్ త్రాగి – ఒక సిగరెట్టు ఊది వ్రాయడానికి కూర్చునేవాణ్ణి. ఇదివరకువలె భయం కలిగేది కాదు. టేబుల్ ముందు కూర్చుంటే ఏదో ఆవేశం – ఆనందం – ఉత్సాహం కలిగేవి. రామాయణంలో లీనం అయ్యేవాణ్ణి. ఒక సమాధిస్థ దశ. మరేదీ తెలియదు. సముద్రమివరత్నాఢ్యం అయిన రామాయణమే. రచన నిరాటంకంగా గంగా స్రవంతివలె సాగుతున్నది. ఆయా సన్నివేశాలనుబట్టి ఆవేశం – ఆగ్రహం – దుఃఖం – ఆర్ద్రత! అది అనిర్వచనీయ అనుభూతి!

వాల్మీకి మానవ మనస్తత్వ జ్ఞానం అపూర్వం! అయోధ్య కల్లోలం పాఠకుణ్ణి కల్లోలితం చేస్తుంది. వెంటనే అరణ్యంలో మనసుకు ఉల్లాసం కలిగించే రమణీయం అయిన గంగానది వర్ణన! అద్భుతం!!

రామాయణ రచనలో ఆయా ఘట్టాల్లో వివరణలు – వ్యాఖ్యలు అనను – ఇచ్చాను. సాగర మథనాన్ని చెప్పినపుడు రాక్షసులు శ్రామికులు – దేవతలు యజమానులు – ఉభయుల ప్రయత్నమున పుట్టిన అమృతం రాక్షసులకు దక్కలేదు.

ఫలితం నేటికీ శ్రామికులకు దక్కడం లేదని వివరించాను. ఇలాంటి అనేక వివరణలు ఇచ్చాను.

వ్రాసింది మళ్లీ చూడలేదు. నేను వ్రాసి ఆఫీసుకు వెళ్లేవాణ్ణి. ఆఫీసుకు ఎన్నడూ ఆలస్యంగా వెళ్లలేదు. విధి నిర్వహణలో ప్రమత్తత – అలసత్వం చూపలేదు. నేను వెళ్లింతరువాత శంకరయ్య మనిషి వచ్చి వ్రాసిన కాగితాలు తీసికెళ్లేవాడు. వెనుక వ్రాసింది చూచే వీలులేదు. అయినా రామాయణ రచనా ప్రవంతి అనాయాసంగా – ఆనందభరితంగా సాగుతున్నది.

రామాయణ రచన సాగుతున్నపుడు నాయన వచ్చారు. ఒకనాడు నేను వ్రాసి పెట్టింది – బహుశః సుందరకాండలో సీతను రావణుడు బెదిరించిన ఘట్టం – చదివారు. సాయంత్రం నేను ఇంటికి వచ్చింతరువాత అన్నారు:

"రంగడూ! నీమీద వాల్మీకి ఆవేశించినాడు. అట్లుకాకున్న ఈ రచన అసాధ్యం."

నాయన రామాయణంలో నిష్ణాతులు! వారు అలా అంటే నేను పొంగిపోయాను. ఉప్పొంగిపోయాను. తబ్బిబ్బు అయినాను. అదొక అనిర్వచనీయ అనుభూతి! చాల కొద్దిమందికి అలాంటి క్షణాలు లభ్యం అవుతాయి! 'పలికించెడివాడు రామభద్రుండట' అనే విశ్వాసం దృఢపడింది.

పబ్బా శంకరయ్యగారు శ్రీమద్రామాయణ ముద్రణాకార్యం 4–2–63న ప్రారంభించి, 26–3–63న ముగించారు. వారు శ్రద్ధగలవారు. శ్రద్ధగా అందంగా అచ్చువేశారు. లోనిబొమ్మలు – ముఖపత్రపు పంచవర్ణ పట్టాభిషేక చిత్రం మడిపడగ బలరామాచార్యులవారు వేశారు.

శ్రీమద్రామాయణ గ్రంథం సుందరంగా సిద్ధం అయింది. శ్రీమద్రామాయణాన్ని భద్రాది రామునకు అంకితం ఇచ్చాను.

నీ కథ నీకే అంకితము; నీవు నరావళిలోన ఉత్తమ
శ్లోకుడవై యుగాలయిననున్ వసివాడవు జ్ఞాపకాలలో
లోకము నిన్ను దేవుడని లోతుగ చూడదు; నాదు గుండెకున్
తాకెదు మానవాగ్రణిగ దాశరథీ కరుణాపయోనిధీ!

శంకరయ్యగారు శోభకృత్ ఉగాది 26–3–63 మంగళవారంనాడు, బూరుగు మహాదేవ్ హాలులో, శ్రీమద్రామాయణ ఆవిష్కరణోత్సవం ఏర్పాటుచేశారు. శంకరయ్య వదాన్యులు. వితరణ శీలి. సంప్రదాయ వేది. ప్రతి సంవత్సరం వారి దుకాణంలో ఉగాదినాడు ఉదయం సరస్వతీపూజ జరుగుతుంది. కవులను, పండితులను – సాహితీవేత్తలను పిలిచి, ఫలములు పంచాంగం అందిస్తారు. ఉగాది సాయంత్రం పంచాంగ శ్రవణం, పండిత సత్కార కార్యక్రమం ఏర్పరుస్తారు.

ఆ సంప్రదాయాన్ని అనుసరించే శ్రీమద్రామాయణ ఆవిష్కరణ సభ ఏర్పాటయింది. అది సుసాయంత్రం. సభాస్థలి జనంతో నిండిపోయింది. విద్వాంసులు – స్ఫురద్రూపులు తెన్నేటి విశ్వనాథంగారు అధ్యక్షత వహించి – సభికుల కరతాళధ్వనుల మధ్య – నేను రచించిన శ్రీమద్రామాయణం ఆవిష్కరించారు.

సభలో గొల్లపల్లి అనంతకృష్ణశర్మ – దివాకర్ల వేంకటావధాని – దీపాల పిచ్చయ్యశాస్త్రి – ఉత్పల సత్యనారాయణాచార్యులు – ఇల్లిందల సరస్వతీదేవి –



శ్రీమద్రామాయణం ఆవిష్కరణ సభలో ఉపన్యసిస్తున్న దాశరథి రంగాచార్య పక్కన తెన్నేటి విశ్వనాథంగారు

యశోదారెడ్డిగారల వంటి సాహిత్య దిగ్గజాలు నా రామాయణ రచనను – శైలిని – వివరణను శ్లాఘిస్తే నాకు సిగ్గనిపించింది.

నేను మాట్లాడుతూ – ఇంతటి మహత్కార్యం ముప్ఫయిమూడేళ్ల నాకు అసాధ్యం అన్నాను. ఇది భగవత్ప్రేరణ – భగవదనుగ్రహం వల్లనే జరిగింది. వ్రాయించిన రాముడు కనిపించనందున నాకు సన్మానం జరుగుతున్నది అన్నాను. రాముడు ప్రసాదించిన శ్రీమద్రామాయణ శిశువును శంకరయ్యకు అమ్ముకున్న అపచారం చేశాను. ఈ అంకితసభ భద్రాదిలో జరుగుతే బాగుండేది అనే వ్యథ వ్యక్తపరచాను.

దివాకర్లవారు చమత్కరించి పరిష్కరించారు. 'రంగాచార్యులు ఇంకా చిన్నవాడు. మరింత మంది కావ్యకన్యకలను కనగలవాడు. ఈ బిడ్డను శంకరయ్యకు దత్తత ఇచ్చాననుకోవాలి. ఈ శ్రీమద్రామాయణ అంకిత, ఆవిష్కరణలు జరిగిన చోటనే భద్రాద్రి రాముడు ఉంటాడు.'

దివాకర్ల చమత్కృతిని సభ కరతాళ ధ్వనులతో ఆమోదించింది.

శంకరయ్యగారు నాకు శాలువా కప్పి, ఫలపుష్పాదులు ఇచ్చి సత్కరించారు.

సభ విజయవంతంగా ముగిసింది.

పెద్దలెల్లరు మమ్ము ఆశీర్వదించారు.

సభకు కమలా – పిల్లలూ వచ్చారు. అందరం ఇంటికి తిరిగి వచ్చాం. ఆ రాత్రి పండుగ చేసుకున్నాం. ఆ సంబరం అక్షరాలకు అందనిది.

తెల్లవారి అన్ని పత్రికలూ శ్రీమద్రామాయణ ఆవిష్కరణ వార్త ప్రముఖంగా ప్రచురించాయి.

పబ్బా శంకరయ్యగారు నాకు వేయిరూపాయిల పారితోషికం ఇచ్చారు. అనాటి దాని వెల పన్నెండు రూపాయిలు. ఆ రామాయణానికి వచ్చిన ప్రచారంతో నేను 'రామాయణ రంగాచార్య' అయినాను. శ్రీరామావారు ముప్పది సంవత్సరాలనుంచి

రామాయణాన్ని పునర్ముద్రిస్తు నేటికీ అందుబాటులో ఉంచారు. అది విశేషం!

నవ్యాంధ్ర కళాకేంద్రం – సీతాఫల్ మండివారు నా రామాయణ ఉపన్యాసాల కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. అవి కొన్ని వారాలు సాగేయి. రాయప్రోలు – దివాకర్ల – ఉత్పల – ఉషశ్రీ వంటివారు సభలకు అధ్యక్షత వహించారు. రామాయణ ఉపన్యాసాలు పూర్తి అయినాయి. ఆ కేంద్రనిర్వాహకులు చలపతిరావుగారు నాకు సన్మానం సంకల్పించారు.

28 ఏప్రెల్ 1963 పత్రికలో "దాశరథి రంగాచార్యకు విశ్వనాథ సన్మానం" అనే వార్త చూచి అవాక్కయినాను. విశ్వనాథ పండిత ప్రకాండులు. కవితా కిరీటి. నవలా సామ్రాట్టు. పొగరు శ్రీనాథుని అంతటిది. గర్వం వారికి అలంకారం. అయితే వారు మరొకరిని మెచ్చరు. సభలో సహితం తిట్టడానికి వెనుకంజవేయరు. వారు రామాయణ కల్పవృక్షం రచిస్తున్నారు. వారు మరొక రామాయణం మెచ్చరు. నేను వారి ముందు బచ్చాగాణ్ణి. ఇది సన్మానం కాదు, అవమానం అనుకుని బాధపడ్డాను. ఇంతలో చలపతిరావుగారు ఆహ్వానం పట్టుకొని వచ్చారు. వారికి ఇవ్వన్నీ చెప్పాను. ఆ 'మహానుభావుడు సభకు రాకున్నా తిడ్తాడు. వచ్చీ తిట్లు పడాల్సిందే' అని విసుక్కున్నాను.

చలపతిరావుగారు – పాపం – చిన్నబుచ్చుకున్నారు. 'మీకు మహాకవితో సన్మానం చేయింతామనుకున్నాను. ఇవన్నీ ఆలోచించలేదు. మన్నించండి' అన్నారు.

సాయంత్రం శంకరయ్యగారు కారులో తీసికెళ్లారు. మా అమ్మాయి ఉదయ వెంట వచ్చింది. వైశాఖ సాయంత్రం. వేసవిని గురించి కాళిదాసు 'దివసాంత రమ్యాణి' అన్నాడు. డాబామీద సభ. జనం బాగా వచ్చారు. చంద్రుడు ఉదయించాడు, వెన్నెల విరబోస్తున్నాడు.

నేను సభలో కూర్చున్నాను. భయంగా ఉంది. ఇంకా విశ్వనాథ రాలేదు. వారు వచ్చారు. మెట్లు ఎక్కుతున్నారు. పులి వచ్చినట్లు – పులి పంజాల సవ్వడి వినిపిస్తున్నట్లు అనిపించింది. వారు డాబా మీదికి వచ్చారు. పులిని చూచినట్లనిపించింది. బెదిరినట్లు లేచి నుంచున్నాను. వారికి చూపు మందగించింది. కనిపించదు. నన్ను గురించి అడిగారు. నా దగ్గరికి వచ్చారు. పులి వచ్చినట్లనిపించింది. వారు నా చేయి పట్టుకున్నారు. పులి పట్టుకున్నట్లనిపించింది. నన్ను కూర్చుండపెట్టారు. వారు కూర్చున్నారు.

"చిన్నవాడివే! రామాయణం వ్రాశావూ!" అన్నారు. పులిపంజా కొట్టినట్లయింది!

"అవును గురువుగారూ!" అన్నాను.

"గురువును చేసుకున్నావూ! సరే, పుస్తకం తెచ్చావా?"

మరొక పంజా పడింది. గ్రంథం అందించాను.

"ఏదో చిన్న పుస్తకం అనుకున్నాను. బృహద్గ్రంథమే వ్రాసినావే!"

అది పొగడ్తయో, తెగడ్తయో అర్థం కాలేదు.

"పేజీకి ఎన్ని లైన్లున్నవి – లెక్కపెట్టి చెప్పు"

లెక్కపెట్టి చెప్పాను.

"ఎందుకడిగానూ అంటే కొందరు కొద్దిగ వ్రాసి లైన్లు ఎడం వేసి ఉద్గ్రంథం వ్రాసినామనిపించుకుంటారు. నీవు అట్లు చేయలేదు. ఉద్గ్రంథమునే వ్రాసినావు."

ఆ బాణం ఎటు సంధించింది అర్థం కాలేదు. విశ్వనాథ నశ్యం పీల్చారు. తుపుక్కు, తపుక్కుమన్నారు. అడిగారు – "ఇంతకూ వాడు – ఆ దాశరథి నీకేమౌతాడు?"

"అన్నయ్య అవుతాడు" గురువుగారూ అనబోయి మాట మ్రింగాను.

"ఓహో! వాడు నీకు అన్నయగునా! వాడి వల్ల నువ్వేమన్నా Eclipse అవుతున్నావా?"

"నాకు ప్రతిభమీద విశ్వాసం. ఎవరి ప్రతిభనుబట్టి వారు రాణిస్తారు" అన్నాను.

విశ్వనాథ నా వీపు నిమిరారు. "ఎందుకడిగానూ అంటే మా తమ్ముడున్నాడు వెంకటేశ్వర్లు – నాకంటే ప్రతిభావంతుడు – నావల్ల రాణించలేకపోతున్నాడు. అదిగో, పిలుస్తున్నారు పదవేదిక మీదికి" అని తీసికెళ్లారు.

వేదికమీద మేమిద్దరమే. వెన్నెల విరియబూసింది. లైట్లు లేవు. మైకు కూడా ఉన్నట్లు గుర్తులేదు. వాతావరణం ప్రశాంతంగా ఉంది. గురువుగారు నన్ను మాట్లాడమన్నారు. అదే నన్ను వారికి తెలియపరచుకునే అవకాశం. వారు సనాతనులని నాకు తెలుసు. వారి మార్గం నేను ఎరుగుదును. అయినా నా మార్గం నేను వదల్లేదు. రాముడు నరుడనీ – ఆదర్శ పురుషుడనీ చెప్పాను. వాల్మీకిలేక ఎందరు రాములు కాలగర్భంలో కలిసిపోయారో! వాల్మీకి మహర్షివలన రాముడు నేటికీ నిలిచివున్నాడు అని నిర్భయంగా 90 నిముషాలు రామాయణ ఉపన్యాసం చేశాను.

విశ్వనాథవారు నశ్యం పీలుస్తూ, తుపుక్కుమంటూ నా ఉపన్యాసం శ్రద్ధగా విన్నారు. నేను గురువుగారి తిట్లకు సంసిద్ధుడనై కూర్చున్నాను.

"రంగాచార్యులకు సన్మానం ఎప్పుడు చేయవలెను?" అడిగారు. 'తరవాత' అని చలపతిరావు చెప్పారు. "ఎందుకూ! ఇప్పుడే చేస్తాను, శాలవా తెండి" అన్నారు.

**పూలదండవేసి, శాలువా కప్పి, సభ కరతాళ ధ్వనులమధ్య కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు - నిండు చంద్రుని సాక్షిగా నన్ను సన్మానించారు.**

అది జీవితంలో మరుపురాని – మరువలేని వసంత వేల.

విశ్వనాథవారు గంటన్నర మాట్లాడారు. నన్ను తెగడలేదు. తిట్టలేదు. వారి సిద్ధాంతంతో రామాయణాన్ని విశదీకరించారు.

"రంగాచార్యులు చెప్పిన దానితో దేనితోను నేను ఏకీభవించను. రాముడు పరాత్పరుడని – రాముని కరుణా కటాక్షం వల్లనే వాల్మీకి రామాయణ రచన చేయగలిగినాడని నమ్ముదును. అట్లయినను రామాయణమును గురించి రంగాచార్యులు చేసిన వంటి పరిశ్రమ అవసరమైవున్నది" అన్న విశ్వనాథవాణి విని సభ ఆశ్చర్యమున మునిగి సుదీర్ఘ కరతాళధ్వనులు చేసినది.

సభ విజయవంతంగా ముగిసింది. అనేకమంది నన్ను అభినందించారు. గురువుగారికి పాదాభివందనం చేశాను. సుమారు అంతా వెళ్లిపోయారు.

విశ్వనాథవారు నన్ను ఆలింగనం చేసుకున్నారు. చెవిలో అడిగారు "రంగాచార్లూ! నీకు రామాయణం ఏమయినా అర్థం అయిందా?" అని.

"గురువుగారూ! నాకేమీ అర్థం కాలేదు" అనే వాస్తవాన్ని తెలియపరచాను.

'ముప్పైయ్యేళ్లు చదివిన ముండావాణ్ణే నాకే అర్థం కాలేదు. నీకేమర్థం అవుతుందీ!"

అని బుజంమీద చేయివేసి మెట్లు దింపారు. నా వెంట మా ఇంటికి వచ్చారు. కమలనూ పిల్లలనూ ఆశీర్వదించారు.

అప్పుడు నాకు విశ్వనాథ పులిగా కనిపించలేదు. నిష్కపటి – నిగర్వి – నిజాయితీగల కవిసమ్రాట్టుగా దర్శనం ఇచ్చారు.

"కూజంతం రామరామేతి మధురం మధురాక్షరం
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకి కోకిలం."

"సముద్రమివరత్నాఢ్యం" అన్న రామాయణంలోకి దూకగలుగుతే అనేక రత్నాలు లభిస్తాయి. అయితే సత్తా కావాలి అందుకు. అదిలేక రామాయణం నిండా రాళ్లే అని – ఆ మధ్య ఒక రామాయణం వచ్చింది. అప్పుడు రామాయణాన్ని గూర్చిన లౌకిక వాస్తవాలు తెలియపరచదలచాను. అంతకుముందు నా దగ్గర ఉండిన రామాయణంలో వ్యాఖ్యలు చేర్చాను. దానికి చేర్చిన 64 పేజీల పీఠికలో అనేక కొత్తకోణాలు చూపాను. "భ్రమలకు దూరంగా, వాస్తవానికి దగ్గరగా, రాగద్వేషాలకు అతీతంగా, సందేశానికి అనుగుణంగా వ్యాఖ్యానించడం విమర్శకుని కర్తవ్యం" అని, వివాహ వ్యవస్థమీద విశ్వాసం లేనివారు రామాయణం చదవడంగాని విమర్శించడంగాని చేయరాదు అన్నాను. ఇది 'సీతా చరితం' పేర 1979 లో నవయుగ బుక్ సెంటర్, విజయవాడ వారిచే ప్రచురించబడింది. దీనిని బమ్మెర పోతనామాత్యునికి అంకితం ఇచ్చాను.

ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక హైదరాబాదు తరలి వచ్చింది. అప్పుడు విద్వాన్ విశ్వంగారి ఆదేశం మేరకు నవలల పోటీకి న్యాయనిర్ణేతగా కొన్ని సంవత్సరాలు వ్యవహరించాను. ఆ సందర్భంలో విశ్వం – ఎల్లోరా గారలతో చర్చల సందర్భంగా రామాయణ ప్రసక్తి వచ్చింది. రామాయణంలో స్త్రీ, పురుష పాత్రలమీద – రామాయణంలో అందాలు అని వ్యాసాలు వ్రాయమన్నారు. సీత చరిత్రలో స్త్రీ పాత్రలు పూర్తిగానూ రామాయణ పురుషులపై కొన్ని వ్యాసాలు వ్రాశాను. వాటికి మంచి ఆదరణ లభించింది. అవి కన్నడంలో అనువదించబడి – ప్రచురించబడినాయి.

"సాహిత్యము, సాహిత్య ప్రక్రియలు, వ్యాసుడు, వాల్మీకి, భారవి, కాళిదాసు, శ్రీశ్రీ, గురజాడ... ఆనాటి వేదకాలంనుండి ఈనాటి వచనగేయకాలం వరకూ – ఇలా అనర్గళంగా సాగుతూంది రంగాచార్యుల ఉపన్యాసం. అది నిర్ఝరి. అద్వితీయ వాగ్ఝరి. అయితే అటువంటి అభిప్రాయ వెల్లువలు అందరికీ అంది సాహిత్య జిజ్ఞాసులలో అనుశీలనకు, పరిశోధకులకు దారితీసేట్లు" ముప్పది సంవత్సరాలు వ్రాసిన నా సాహిత్య వ్యాసాలను కూర్చి మిత్రులు పొన్నాల సాందీప్ 'పరిశీలన' పేర 1983లో ఒక గ్రంథం ప్రచురించారు. అందులో రామాయణ పాత్రలను గురించిన వ్యాసాలు చేర్చారు.

1994లో 'Ramayana - The ever fresh human poem' అని ఒక పుస్తకం ఆంగ్లంలో వ్రాశాను. 'సర్వకాల సర్వావస్థల్లో రామాయణం మానవాళిని ఆదుకుంటుంది'. అని నిరూపించాను.

'వందే రామాయణార్ణవం' రామాయణ మహా సాగరానికి నమస్కరించడం తప్ప పారం ఎరగటం దుస్తరం!

నేను రచించిన శ్రీమద్రామాయణం తెలుగువారి ఆదరాభిమానాలు అందుకుంది. అందువల్ల పబ్బా శంకరయ్యగారు నన్ను 'శ్రీమద్భాగవతము' రచించమని కోరారు. అప్పుడు నేను అప్పులలో కూరుకొని ఉన్నాను. పిల్లలు పెరుగుతున్నారు. ఆదాయం చాలడం లేదు. అప్పు చేసి రెండు గదులు కట్టి అద్దెకు ఇచ్చాను.

అలాంటి దశలో భాగవతం రచించాల్సి వచ్చింది. అది మంచిదయింది. రచనలో నేను మునిగిపోతాను. కష్టాలు మరిచిపోతాను.

బమ్మెర పోతన భాగవతాన్ని సంస్కృతాన్ని మించిన మందార మకరందంగా రచించాడు. అతడు రామభక్తుడు, కృష్ణ కథను అత్యంత సుందరంగా మలచాడు. చిన్ని కృష్ణుని లీలలలో అతడు అమృతం నింపాడు.

*పలికెడిది భాగవతమట*
*పలికించు విభుండు రామభద్రుండట నే*
*బలికిన భవహర మగునట*
*పలికెద వేరొండు గాధ బలుకగనేలా?*

అన్నాడు. పోతన భక్తిపారవశ్యంలో భాగవతం రచించాడు. పోతన జీవితగాధను ఒక మహాకావ్యంగా రచించారు అభినవ పోతన వానమామలై వరదాచార్యులవారు.

భాగవతం శాంతి సందేశాన్ని అందిస్తుంది. ప్రథమ ప్రపంచ సంగ్రామం తరువాత లీగ్ ఆఫ్ నేషన్స్, ద్వితీయ సంగ్రామం తరువాత యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ వలె అనంత రక్తపాతం జరిగిన మహా భారత సంగ్రామం తరువాత వ్యాసమహర్షి వెలయించిన శాంతి సందేశం శ్రీమద్భాగవతం.

శ్రీమద్భాగవతం జ్ఞానం కలిగిస్తుంది. శాంతి ప్రసాదిస్తుంది. వెలుగుబాటలు చూపుతుంది. అలసిన మనసుకు విశ్రాంతిని ఇస్తుంది. అనేక జీవిత సత్యాలను బోధిస్తుంది. నరుడు పరిపూర్ణ మానవుడయి, దైవత్వం దగ్గరకు చేరుకోవడానికి ఉపకరిస్తుంది.

నేను సంస్కృత భాగవతాన్ని అనుసరించాను. కాని గజేంద్రమోక్షం – రుక్మిణీ కళ్యాణంలాంటి వాటిలో పోతన తేనియలు చవి చూపించాను.

పెక్కు ఇక్కట్లలో భాగవతం ప్రశాంతత కలుగచేసింది. భక్తి కలిగించింది. రచించిన శ్రీమద్భాగవతాన్ని యాదగిరి శ్రీ లక్ష్మీనరసింహస్వామికి అంకితం సమర్పించాను.

చీర బాలుడు దుష్టుని చీల్చినాడు
తెలుగు దేవర సింగన వెలుగువేల్పు
చిత్తమందలి దుష్టుని చీల్చుమంచు
యాదగిరి సామికిత్తు నే నంకితమ్ము.

1966 జూన్ 11 పరాభవ జ్యేష్ఠ కృష్ణ అష్టమి – శనివారంనాడు భాగవత రచన పూర్తి చేశాను. శ్రీమద్భాగవతం సహితంగా పిల్లల పుస్తకాలు 1. వేంకటేశ్వర మాహాత్మ్యము 2. గౌతమ బుద్ధుడు 3. బాలచంద్రుడు 4. చంద్రగుప్తుడు 5. భారతం 6. రామాయణం శంకరయ్యగారికి ఇచ్చాను. వారు నాకు పద్దెనిమిదివందలు ఇచ్చినట్లు గుర్తు.

1969లో శ్రీమద్భాగవతము ప్రచురించారు. అవిష్కరణ సభ జరుపలేదు. ఆ తరువాత శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యము ప్రచురించినారు. శ్రీమద్భాగవతము సహితం ప్రజాదరణ పొందింది. మూడవ ముద్రణ జరిగి, అందుబాటులో ఉంది.

మిగిలిన పుస్తకాలు వెలుగు చూడలేదు. నేను కొండా శంకరయ్యకు పిల్లలకోసము, వయోజనులకోసము గాంధీ నెహ్రూ జీవితాలు నాలుగు పుస్తకాలు వ్రాసి ఇచ్చాను. వయోజనులకుగాను 'మహాత్ముడు' ప్రచురించారు. మిగతావి పోగొట్టారు. మరొక ప్రచురణకర్తకు పిల్లలకోసం 1. ప్రహ్లాదుడు 2. మార్కండేయుడు 3. ధ్రువుడు 4. జ్ఞాన సంబంధి వ్రాసి ఇచ్చాను. అవి కూడా అచ్చు నోచుకోలేదు. వాటి వ్రాత ప్రతులు లేవు. వెలుగు చూడలేదు. ఇది రచయితకు బాధ కలిగించే విషయం.

"యస్యాం వై శ్రూయమాణాయాం కృష్ణే పరమ పూరుషే
భక్తిరుత్పద్యతే పుంస శ్శోకమోహ భయాపహా"

భాగవత సంహిత చదివితే పరమ పురుషుడయిన శ్రీకృష్ణ భగవానుని మీద భక్తి జనిస్తుంది. మానవుల శోక, మోహ, భయములను పోగొడుతుంది.

## ముప్పయి ఒక్కటి

### రెండు నగరాలు - ఒక కార్పొరేషను:

1959లో ననుకుంటా – ఒకసారి నెహ్రూగారు హైదరాబాదు వచ్చారు. ప్రధానికి పౌరసన్మానం జరిగింది. హైదరాబాదు – సికిందరాబాదుల ఉభయ మేయర్లు రెండు పూలదండలు వేశారు. ఉర్దూ – తెలుగు రెండు భాషల్లో ఇద్దరు సన్మానపత్రాలు చదివారు. నెహ్రూగారికి – ఎందుకో – అది నచ్చలేదు. "ఒక్క నగరానికి ఇద్దరు మేయర్లా?" అన్నారు.

జవహర్‌లాల్ నెహ్రూ భారతప్రధాని మాత్రం కారు – వారు అధునిక భారత నిర్మాత, సోషలిస్టు, మంచి చారిత్రక దృక్పథం కలవారు అనడానికి వారి 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' సాక్ష్యం. అయితే వారికి అతి విశ్వాసం. తాను చెప్పిందే సత్యం అని నమ్మకం. అది కాదంటే పిచ్చికోపం! మైకులు నేలకొట్టారు. పుస్తకాలు – కాగితాలు విసిరికొట్టారు. ధుమధుమ లాడ్తారు. వారిని శాంతపరచడం వారి కూతురు – ఇందిరిగాంధీకి మాత్రం సాధ్యం అయ్యేది. అందుకే నెహ్రూకు ఎవరూ ఎదురు చెప్పరు. అతను అన్నది చెల్లాలి. అందుకే అన్నాను:–

*ఒక్కడేలు కాలముండిరాదన్నారు*
*పెక్కురేలు యుగము వచ్చెననిరి*
*ఎప్పుడయిన రాజ్యమేలువా డొక్కడే*
*విశ్వజనులవాణి వినర రంగ!*

సాంస్కృతికంగా ఉభయ నగరాలకు – చారిత్రక నేపథ్యంలో ఎంతో అంతరం ఉంది. అది చెప్పగలవారు లేరు. నెహ్రూను కాదనలేక ఉభయ నగరాల కార్పొరేషన్లను విలీనం చేసే చట్టం చేశారు. అప్పుడు సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి – సంజీవయ్యగారు స్థానిక పరిపాలనామాత్యులు.

సికిందరాబాదు ప్రజలు విలీనాన్ని వ్యతిరేకించారు. ఆందోళన చేశారు. బందులు నిర్వహించారు. సికింద్రాబాదు ఒక సువ్యవస్థిత నగరం – కార్పొరేషను. దీనికి బ్రిటిషు సంప్రదాయం కారణం. హైదరాబాదు అవ్యవస్థిత నగరం – కార్పొరేషను.

బల్దియా ఖాయా పీయా చల్దియా

కుఛ్ దియాతో కర్దయా వర్నా బల్దియా

కార్పొరేషను తింటుంది. తాగుతుంది. సాగిపోతుంది. లంచం ఇస్తే పనిచేస్తుంది. లేకుంటే ముడి బిగిస్తుంది. అని సామెత. ఇది మొగలాయి సంప్రదాయం.

హైదరాబాదులో కలిసి సికిందరాబాదు కలుషితం అయిపోతుందని ప్రజల భయం. ప్రజాస్వామ్యంలో ప్రజలు నేతిబీరలో నేయి వంటివారు. రాజకీయ నాయకులు రంగప్రవేశం చేశారు. తెలంగాణాకు ఇచ్చినట్లే కొన్ని హామీలు ఇచ్చారు. అంతా పదవుల పంపకం! తొలి మేయర్ సికిందరాబాదునుంచి అవుతాడు. అయిదేళ్లు సికిందరాబాదు బడ్జెటు వేరే ఉంటుంది లాంటి ఉత్తుత్తి వాగ్దానాలతో రెండు కార్పొరేషన్లను లీనం చేసి ఒకే కార్పొరేషను చేశారు.

చిన్న చేపను పెద్ద చేప మింగడం ప్రకృతి సూత్రం! వాగ్దానాలు చిన్న చేపను కాపాడలేవు. సరిగ్గా అలాగే జరిగింది. సికిందరాబాదులో వసూలుయిన కోట్లకు కోట్లు హైదరాబాదు స్వాహా చేసింది. అందుకు వ్యతిరేకంగా నిరశన వ్రతాలూ – సత్యాగ్రహాలూ జరిగాయి! ఇంతే సంగతులు!!

వాస్తవంగా విలీనం జరిగిందా అంటే అదీలేదు. నగరంగా సికిందరాబాదు వేరు. ఇక్కడి మున్సిపల్ నెంబర్లు వేరు. ఇక్కడి ఆఫీసు వేరు. సికిందరాబాదులో ఉన్న ఇంటినెంబరు హైదరాబాదులో ఉంటుంది. అంతేకాదు, హైదరాబాదులోను – సికిందరాబాదు కంటోన్మెంటులోనూ ఒకే నెంబర్లు ఉంటాయి.

హైదరాబాదు అంటేనే హైరానీ – పరేషానీ. ఇతర నగరాల్లో నంబర్లను బట్టి ఇళ్లు దొరుకుతాయి. ఇక్కడ ఇళ్లూ దొరకవు. నంబర్లూ దొరకవు. ఒకణ్ణి పరేషాన్ చేయాలంటే జంటనగరాల్లో అడ్రసు తెలుసుకొమ్మంటే చాలు! దీనికి తోడు ఉపనగర మునిసిపాలిటీల నంబర్లు!

నామమాత్రపు విలీనపు 34 సంవత్సరాల తరువాత ఇంకా వాస్తవంగా నగరం ఒకటి కాలేదు. ఎహ్ మొగలాయ్ దర్బార్ హై, యహాఁ కామ్ నహీ నామ్ హోతా హై.

రాజకీయం స్వార్థానికి దగ్గర – వాస్తవానికి అతిదూరం – అందనంతదూరం. మొత్తానికి 1960లో వేదప్రకాశ్ దుసాజ్ మేయర్‌గా ఒకే కార్పొరేషను ఏర్పడింది. మామూలు ప్రకారం ఉత్సవాలు – జల్సాలు జరిగాయి!

హైదరాబాదు కార్పొరేషను ఆఫీసు మూసీకి ఆవల – పాత పట్నంలో – దారుల్‌షిఫాలో ఉండేది. 'దారుల్‌షిఫా' అంటే సర్కారీ దవాఖానా. ఖులీ ఖుతుబ్‌షా కట్టించిన వైద్యశాలవల్ల ఆ వీధికి ఆ పేరు వచ్చింది. శిథిలం అయిన దారుల్ షిఫాకట్టడం ఇంకా ఉంది! అది దాటితే కూలనున్న దేవిడీలు. అటుతరువాత 'మీర్ ఆలం మండి' ఆ తరువాత చార్ కమాన్ – గుల్జార్ హౌజ్. అటునుంచి చార్‌మినార్ షాహ్ అలీబండనుంచి ఫలక్‌నుమాకు దారి.

హైదరాబాదుకు ఉత్తరదేశంనుంచి వచ్చిన హిందువులు – ఇక్కడి ముసల్మానులకు తెలుగురాదు. ఇప్పటికీ తెలుగు నేర్వరు. ఆంధ్రప్రాంతంనుంచి వచ్చినవారు ఉర్దూ **పాడి పదాలు నేర్చారుతప్ప వారు తెలుగు నేర్వలేదు! తెలుగువారి రాజధానిలో తెలుగుకోసం గాలించవలసిన దుస్థితి!**

హైదరాబాదు కార్పొరేషను అప్పటి అధికారుల్లో తెలుగేతరులు ఎక్కువ. వారిలో చాలమందికి తెలుగు ద్వేషం. అలాంటి వాళ్లల్లో ఒకడు 'బేలేరాం కపూర్.' అతడు పంజాబీ, కార్పొరేషనులో అసిస్టెంట్ సెక్రటరీ, కౌన్సిల్ సమావేశాలు – కమిటీల సమావేశాలు నిర్వహిస్తాడు. ఉర్దూలో సమావేశాల కార్యక్రమాలను – తీర్మానాలను వ్రాస్తాడు.

కపూర్ మస్కా కొట్టడంలో మొనగాడు. కమీష్నర్ నుంచి ఫోనువస్తే లేచినుంచొని – సలాం చేసిగాని మాట్లాడడు! ఎవరినీ నొప్పించడు. తిట్టినా పడ్తాడు. అందరినీ లొంగదీసుకుంటాడు. అతనికి తెలుగంటే అస్సలు పడదు. హైదరాబాదు కార్పొరేషనులో – విలీనానికి ముందే – ఇద్దరు తెలుగు అనువాదకులను నియమించారు. యాడాది దాటినా వారికి పని కల్పించలేదు. స్థానం చూపలేదు. తెలుగు అక్షరం వ్రాయనీయలేదు. ఈ పరిస్థితిలో సికిందరాబాదు హైదరాబాదులో కలిసింది.

విలీనం వల్ల కదలాల్సింది సమావేశాలు నిర్వహించే సెక్రటరీ సెక్షను మాత్రమే. నేను ఆ సెక్షనువాణ్ణే. నేను తెలుగు అభిమానిని అని కపూర్ గ్రహించాడు. నన్ను సాధ్యమైనంత కాలం సికిందరాబాదులో ఉంచడానికి ప్రయత్నించాడు. సికిందరాబాదు కౌన్సిలర్ల వత్తిడి పెరగడంతో – విధిలేక హైదరాబాదు రప్పించాడు. నాకు అనువాదం పనికాక ఆఫీసు పని వప్పచెప్పాడు.

తెలుగు ద్వేషం సహించడం నాకు సాధ్యపడలేదు. కపూర్‌తో ఘర్షణ పడ్డాను. అతడు వ్యతిరేకించడు. లొంగుతాడు. కొడ్తే పడేవాణ్ణి మనం ఏమీ చేయలేం. కపూర్ కాదనడు. కానివ్వడు. గత్యంతరం లేక అన్యమార్గం అవలంబించాల్సి వచ్చింది. హైదరాబాదు అనువాదకులు మాధవరావు – వెంకట కిషన్‌రావుతో కలిసి కౌన్సిలర్లలో తెలుగువారిని కలుసుకున్నాం. పరిస్థితి వివరించాం. తెలుగును కాపాడడానికి కపూర్ మీద వత్తిడి తేవలసిందని కోరాం. తెలుగు కౌన్సిలర్లు సికిందరాబాదువారు ఎక్కువమంది. వారికి మా వాదన నచ్చింది. వారు వాస్తవంగా వత్తిడి తెచ్చారు. తెలుగు అనువాదం లేకుంటే కమిటీలకు హాజరు కామని బెదిరించారు. కపూర్ సికింద్రాబాదు, హైద్రాబాదు భేదాలు తెచ్చాడు.

కపూర్ అవతారం మార్చాడు. హిందీ కౌన్సిలర్లను ఎగదోశాడు. వారు హిందీ అనువాదం కావాలన్నారు. హిందీ అనువాదకులను నియమించి అనువాదం జరిగేవరకు తెలుగు వాయిదా వేయించాడు.

**స్వాతంత్ర్యం వచ్చింతరువాత Protest - అసమ్మతి కరువయింది. దొరతనం వారి దయా** దాక్షిణ్యాలమీద ఆధారపడడం ఎక్కువయింది. తెలుగు కౌన్సిలర్లను సైతం కపూర్ లొంగదీసుకున్నాడు.

అయ్యా! ఇది ఆంధ్రప్రదేశం ఏర్పడింతరువాత రాజధాని నగరపాలికలోని స్థితి!

నేను తెలుగు రాష్ట్రంలో తెలుగుకు జరుగుతున్న అవమానం సహించలేకపోయాను. సచివాలయాన్ని ఆశ్రయించక తప్పలేదు.

"ఎహ్ హై సెక్రటేరియట్
యహా(కాౄరవాయ్యా( లేట్
యహా(వహాతేహార్ అర్మా(ఖేట్"

'ఇది సెక్రటేరియటు – ఇక్కడ కేసులు లేటు – సర్వకోరికల బలివేటు' అనే సత్యం చెప్పినవాడు సర్వర్ డండా!

ఇక్కడ ఎంతటివాడయినా గుమాస్తాకు లోకువే! ఓపిగ్గా నిరంతరం తిరిగాం. తుదకు మంత్రి సంజీవయ్యగారిని కలుసుకుంటేగాని పని కాలేదు.

బేలేరాం కపూర్‌కు నిజామాబాదు బదిలీ అయింది! ట్రాన్స్ఫర్ ఆర్డరు – అనుకోకుండా – చేతికి అందిన్నాడు కపూర్ మా ముందు – నిజంగా కన్నీరు కార్చి ఏడ్చాడు! రక్షించమని బ్రతిమిలాడాడు. తాను తెలుగు వ్యతిరేకిని కానన్నాడు. పదవిని కపాడుకోవడానికి ఉర్దూను ఆశ్రయించా నన్నాడు. నిజామాబాదులో తాను నెగ్గలేనన్నాడు. వాస్తవంగా నాకు జాలి కలిగింది. కాని బాణం సాగిపోయింది!

కపూర్ వెళ్లిపోగానే కార్యక్రమాలు ఇంగ్లీషులో రికార్డు చేయడం ప్రారంభం అయింది. తెలుగుతోపాటు హిందీ అనువాదాలు కూడా అందించడం జరిగింది.

అంగ్రేజువాడు ఏర్పరచిన బ్యూరోక్రసీలో అంగ్రేజు డిసిప్లిన్ అంతరించింది. ఒక్క గుమాస్తా వేసిన ముడిని విప్పడానికి ఏళ్లతరబడి తిరగాల్సివస్తుంది. తెలుగుకోసం ఏర్పడిన రాష్ట్రంలో ఒక చిన్న అధికారి చెరనుండి తెలుగును విడిపించడానికి ఇంతటి మహోయత్నం అవసరం అయింది.

నేను హైదరాబాదు చేరుకోవడంవల్ల వ్యక్తిగతంగా నాకు కొన్ని ప్రయోజనాలు చేకూరాయి:

1. విశాల పరిధిలో ప్రవేశించాను. వివిధ నాగరకతలు – వివిధ భాషలు – వివిధ సంస్కృతులతో పరిచయం – సాన్నిహిత్యం ఏర్పడింది.
2. పాతబస్తీ, కూలుతున్న దేవిడీలు – కన్నుమూస్తున్న నవాబుల జీవితం – పాత నాగరకత జాడ విడువని బస్తీలు – పురాతన పరిమళం వదలని పత్తర్‌ఘట్టీ ముత్యాల దుకాణాలు – మతం 'వాసన' వదల్లేక జరుగుతున్న రాజకీయ కల్లోలాలమధ్య మత సహజీవనం నన్ను ఎంతగానో ఆకర్షించాయి.
3. కార్పొరేషను కార్యాలయంలో మంచి గ్రంథాలయం ఉండేది. ఉర్దూ, తెలుగు, హిందీ పుస్తకాలు అనేకం ఉండేవి. పురాతన 'భారతి' ప్రతులు ఉండేవి. అది నాకు ఒక విందు. ఉర్దూ కవిత్వపు సొగసులు ఇక్కడే అర్థం అయినాయి.
4. అన్ని పార్టీలు – భాషల కౌన్సిలర్లు నన్ను అభిమానించారు. ఒకళ్లిద్దరు కమ్యూనిస్టు కౌన్సిలర్లు ఉండేవారు. పోలీసుచర్య తరువాత పాతబస్తీ ముస్లిములను తొలుత కమ్యూనిస్టు పార్టీ ప్రభావితం చేసింది. కమ్యూనిస్టులు ప్రజలను వదిలి – వాదాలను ఆశ్రయించింతరువాత – ముస్లిములను మత పార్టీలు ఆక్రమించాయి. ఇప్పటికీ హైదరాబాదు ఉర్దూ కవులు, రచయితల్లో ఎక్కువ మంది ప్రగతి శీలురు.

అయితే హైద్రాబాదులో కొన్ని ఉద్యోగుల సమస్యల కోసం పోరాడాల్సి వచ్చింది. నా జీవితమే పోరాటం. నేను దౌర్జన్యాన్ని – అన్యాయాన్ని, అక్రమాన్ని సహించలేను. ఉద్యమించాలి. స్వప్రయోజనం గురించి పట్టించుకోను.

కార్పొరేషను ఉద్యోగులది ఒక ప్రత్యేక స్థితి. ప్రజలు ఎన్నుకున్న ప్రతినిధులకు అతి దగ్గరగా ఉంటారు. ఆ ప్రతినిధులు ఉద్యోగులు తమ అధీనులు అనుకుంటారు. కార్పొరేషను ఉద్యోగుల్లో రెండు కేడర్లు ఉన్నాయి. ఒకటి కార్పొరేషను కేడరు. వీరు – అప్పటికి – సూపర్నెంటు గ్రేడువరకు వారే. ఎంత ప్రతిభావంతుడయినా ఆపైన ప్రమోషను ఉండదు. నా అపాయంట్‌మెంట్ 1957లో సూపర్నెంటు గ్రేడులో జరిగింది. వీరికి నగరంలోపలనే తప్ప బయటికి ట్రాన్స్ఫర్లుండవు. రెండవది స్టేట్ కేడర్. క్రింది గెజెటెడ్ నుంచి అత్యున్నతపదవి గల అధికారులు. వీరు ప్రభుత్వం నుంచి వస్తారు. వీరు కూడా కార్పొరేషను ఉద్యోగులు తమ అధీనులు అనుకుంటారు. ఒకవైపు కౌన్సిలర్లు – ఒకవైపు అధికారుల నడుమ ఉద్యోగులు నలుగుతుంటారు.

హైద్రాబాద్ ఉద్యోగుల బలహీనత ఏమంటే – ఎక్కువ మంది నిజాంకాలంవారు. ఇంగ్లీషు రాదు. వీరిమీద పెత్తనం మరీ ఎక్కువ. ఒక గుర్తింపబడిన ట్రేడ్‌యూనియన్ సహితంగా ఆరు యూనియన్లున్నాయి. ఎవరూ వీరికి సాయపడరు. పైగా పెత్తనం చలాయిస్తారు.

కార్పొరేషను ఉద్యోగులది దయనీయస్థితి. వారిని ఏకం చేయడానికి – ఒక సంఘం స్థాపించడానికి నిరంతరం ప్రయత్నించాను. ఉద్యోగులు భయస్థులు, యూనియన్ అంటే జంకుతారు. నలుగురు ధైర్యంగల మిత్రులు లభించారు. 'మున్సిపల్ కార్పొరేషను సర్వీసెస్ అసోసియేషన్' అని ఒక యూనియన్ రిజిస్టరు చేశాం. యాడాదికి మూడు రూపాయిలు చందాగా నిర్ణయించాం. అది 1963–64.

యూనియన్ ఏర్పడడంతో ఉద్యోగులలో కొంత ధైర్యం వచ్చింది. చాలమంది సభ్యత్వం తీసుకున్నారు. కాని మిగతా వారికి కంటగింపు అయింది. బెదిరింపులు ప్రారంభం అయినాయి. ముఖ్యమైన బెదిరింపు గుర్తింపు పొందిన యూనియన్ పెత్తందారు గోవిందసింగ్ నుంచి వచ్చింది. *"అప్సల్ ఖోరోఁకా అంజుమన్‌కైసా చలేగా దేఖూఁగా"* అని బెదిరించాడు. వాస్తవం ఏమంటే – కార్మికుల మీద పెత్తనం చలాయించి లక్షలు ఆర్జించాడు. బెదిరించి ఉద్యోగులతోనూ – అధికారులతోనూ పనులు తీసుకుంటాడు. ఆ పెత్తనానికి గండిపడుతుందని అతని భయం. గోవిందసింగ్ కౌన్సిలర్ – స్టాండింగ్ కమిటీ మెంబర్ అయినాడు. మరింత బెదిరింపు సాగించాడు.

1964 అనుకుంటా – ప్రభుత్వం ఉద్యోగులకు కరువు బత్తెం పెంచింది. కార్పొరేషను కూడా తమ ఉద్యోగులకు ఇవ్వాలి. ఎప్పటివలెనే జాగుచేశారు. ఉద్యోగులు కుక్కిన పేలు. ఇచ్చినపుడే తీసుకునేవారు. కాని ఈ తడవ Protest day ఏర్పాటు చేశాం. అది సరిగ్గా కార్పొరేషను మీటింగునాడు ఏర్పరచాం. ఉద్యోగులందరూ Protest badges ధరించారు. అంతే, ఆ ధరింపచేయటమే కష్టం అయింది!

కార్పొరేషను మీటింగుకు వచ్చే ప్యూను నుంచి అంతా బాడ్జీలు ధరించారు. దాంతో చర్చ జరిగింది. గోవిందసింగ్ తీవ్రంగా వ్యతిరేకించాడు. కౌన్సిలర్లలో మా

మిత్రులూ ఉన్నారు. వారు బలపరచారు. ఈ చర్చవల్ల మా యూనియనుకు నగరంలో ప్రచారం వచ్చింది. డి.ఏ. తీర్మానం ఆమోదం పొందింది.

ఉద్యోగులు ఇది తమ విజయంగా భావించారు. ఆ సాయంత్రం కార్యాలయ ఆవరణలో ఏర్పాటు చేసిన సభకు అనూహ్యంగా తరలివచ్చారు. 'మనది స్వతంత్ర దేశం – మనం స్వతంత్ర పౌరులం' మనమీద ఎవరూ పెత్తనం చలాయించలేరు. అని ఉర్దూ – ఇంగ్లీషులలో ఆవేశపూరిత ఉపన్యాసం ఇచ్చాను. ఉద్యోగులు జయజయధ్వానాలు చేశారు. ఎత్తుకొని ఎగిరారు.

యూనియన్ విజయం కౌన్సిలర్లలో – అధికారులలో – గోవిందసింగ్‌లో కొంత ఆలోచన రేకెత్తించింది. వారు కొంత తగ్గారు. అంతా నాకు కొంత గౌరవం ఇచ్చారు. ఉద్యోగుల సమస్యలను చర్చించడానికి సిద్ధం అయినారు.

యూనియనుకు కార్యాలయం ఏర్పరచాం. ప్రతి ఇరవయి అయిదుగురు సభ్యులు ఒక ప్రతినిధిని ఎన్నుకుంటారు. ఆ ప్రతినిధులు కార్యవర్గాన్ని ఎన్నుకునే ఏర్పాటు చేశాం. సభ్యుల పేర్ల పట్టికలు ప్రచురించాం. బహిరంగంగా సభ్యుల పేర్లు – సంఖ్య ప్రచురించడం ఇదే మొదలని లేబరు ఆఫీసువారు ఆశ్చర్యం ప్రకటించారు.

యూనియన్ కార్యాలయంలో ఒక కార్యవర్గసభ్యుడు అందుబాటులో ఉంటాడు. ఉద్యోగులు తమ సమస్యలను రికార్డు చేయిస్తారు. వాటిని సాధ్యమైనంతవరకు పరిష్కరించే ప్రయత్నం చేశాం. యూనియన్ కార్యకలాపాల్లో నాకు ఎంతో తోడ్పడినవాడు M. L. ఆచార్య, అతడు పాత సోషలిస్టు. నన్ను మించిన ఆవేశపరుడు. నిజాయితీగల కార్యకర్త. అతను కార్యదర్శి – నేను అధ్యక్షుణ్ణి. ఇంకా అనేకులు పని చేశారు. అందరినీ పేర్కొనడం అసాధ్యం.

ఒకనాడు ముత్తమయ్య గౌడ్ అనే కౌన్సిలరు వెంకోజీ అనే ఉద్యోగిని కొట్టాడు. యూనియన్ లేకముందు ఇది సాధారణమే! ఇప్పుడు ఉద్యోగులు మేల్కొన్నారు. వెంటనే నాకు వార్త అందింది. వీళ్లు సమ్మె చేయలేరని నాకు తెలుసు. Pen down అన్నాను. మాట విద్యుత్తులా పాకింది. కార్పొరేషను స్తంభించింది. టెలిఫోను ఆపరేటర్లు పెన్‌డౌను సమ్మెలో ఉన్నాం అని పెట్టేశారు. ఇది సమ్మె అగునా కాదా? అని అధికారులు మీమాంసలో పడినారు.

ఆసాయంకాలం జరిగిన ఉద్యోగుల సభలో ఆవేశం పొంగింది. కౌన్సిలరు క్షమార్పణ చెప్పేదాకా సమ్మె చేస్తాం అనేదాకా పోయింది. నేను శాంతపరచాల్సి వచ్చింది. తెల్లవారి పెన్–టూల్‌డౌన్ సమ్మె కొనసాగుతుందనీ, తరువాత కార్యవర్గం నిర్ణయిస్తుందనీ చెప్పి ఒప్పించాల్సి వచ్చింది.

తెల్లవారి కౌన్సిలర్ల దౌర్జన్యం గురించీ – మా సమ్మెను గురించీ పత్రికల్లో ప్రచారం వచ్చింది. పత్రికల వారు నన్ను అనేక విషయాలు అడిగి వ్రాశారు. తెల్లవారి కార్పొరేషను పనులు పూర్తిగా నిలిచిపోయాయి. పెట్రోలు ఇవ్వవలసినవాడు – పనివాళ్ల హాజరు తీసుకోవలసినవాడు ఉద్యోగియే. కమీషనర్ – మేయరు డ్రైవర్లు పనికి వచ్చారు. కాని బండ్లు నడపలేదు. చప్రాసీలు నీళ్లు అందించలేదు.

అందరూ తమ విధుల్లో ఉన్నారు. ఎవరూ పని చేయరు!

ఇది సమ్మె అగునా కాదా? అని ఆలోచనలో పడిన అధికారులు దీన్ని నివారించడం కోసం ప్రయత్నాలు సాగించారు. మమ్ములను కమీష్నర్ పిలిచాడు. మేయర్ పిలిచాడు – స్టాండింగ్ కమిటీ ఛైర్మన్ పిలిచాడు.

మాది గుర్తింపు పొందిన యూనియను కాదు కాబట్టి చర్చలు జరుపరాదు అని గోవిందసింగ్ అడ్డు తగిలాడు. పరిస్థితి విషమంగా ఉంది. ఎవరూ అతని మాట వినలేదు. నిరంతర చర్చలు జరిగాయి. అంతిమ సమావేశం మేయర్ దగ్గర జరిగింది. మేము అతి చిన్న ఉద్యోగిని కూడా ప్రతినిధిగా తీసికెళ్లాం. వారు మేయర్ కమీష్నరులముందు సమాన స్థాయిలో కూర్చొని చర్చించారు. అది ఉద్యోగుల్లో ఎంతో ఆత్మగౌరవం కలిగించింది.

ఆ సమావేశంలో కౌన్సిలరును క్షమార్పణ చెప్పించడానికి సిద్ధం చేశారు. మా వాళ్లు కౌన్సిలరు బహిరంగ క్షమార్పణ చెప్పాలని పట్టుపట్టారు. వారు మేయరు ముందు క్షమార్పణ చెపుతామన్నారు. అనిశ్చిత స్థితినుంచి బయటపడడానికి నేను కార్యవర్గాన్ని ఆలోచించి చెపుతానన్నాను.

కార్యవర్గ సమావేశంలో ఆవేశకావేషాలు మిన్నంటాయి. అక్కడ నేను మితవాదిని అయినాను. అందరూ నా మీద విరుచుకుపడ్డారు! అది నాకెంతో సంతోషం కలిగించింది!! నిజమైన ఉద్యమం 'మూకం కరోతివాచాలం!!!' అతి కష్టంమీద మేయర్‌ముందు క్షమార్పణకు వప్పించాను.

మేయర్ ముందు కౌన్సిలరు – ఉద్యోగికి క్షమాపణ చెప్పాడు. అయితే వార్తమాత్రం సమాధానం కుదిరినట్లు ఇవ్వాలన్నారు. వార్త అలాగే వచ్చింది.

ఈ ఉదంతం – ఉద్యమంతో – యూనియన్ ఉద్యోగుల హృదయాల్లో పీఠం వేసుకుంది. అధికారులు – కౌన్సిలర్లు కూడా జాగ్రత్తగా మసలుకున్నారు.

తరువాత అనేక పోరాటాలూ – డిమాండ్ల సాధనా జరిగాయి. అయితే అతిముఖ్యం అయినవి పేర్కొంటాను.

ఈ బ్యూరోక్రసీ అతి విచిత్రం అయింది. ఒక్క కలంపోటుతో కల్లోలాలు సృష్టించగలదు. సచివాలయం నుంచి దిగుమతి అయిన ఒక మహానుభావుడు – మతం పిచ్చిలో – ఉద్యోగుల్లో ఒక మతం వారిని ఊడ్చిపెట్టడానికి సిద్ధం అయినాడు. అన్ని ప్రమోషన్లకు ఇంగ్లీషులో పరీక్షలు జరపాలనీ – సీనియారిటీ కాక – పరీక్షలో పాసయినవారికే ప్రమోషన్లు ఇవ్వాలని రూల్సు సిద్ధం చేశాడు. ప్రభుత్వం గుడ్డిది కదా! గుమాస్తా చెప్పింది ఆమోదించింది!!

ఆ రూల్సుకు వ్యతిరేకంగా జరుపతలపెట్టిన ఉద్యమం విషయంలో చీలిక వచ్చింది. అయితే వారు స్వప్రయోజనపరులు. అల్పసంఖ్యాకులు. కొందరిని వప్పించాం. కొందరు స్వచ్ఛందంగా లొంగారు. ఆ రూల్సుకు వ్యతిరేకంగా అపూర్వం అయిన ఉద్యమం నిర్వహించాం. ఉద్యోగులు బజారున పడ్డారు. అన్ని సర్కిల్ కార్యాలయాలనుంచీ – సికిందరాబాదునుంచీ ఊరేగింపులుగా వచ్చి అబిడ్స్‌లో కలిసిశాం. ఒక్క గోవిందసింగ్ యూనియన్ తప్ప మిగతా యూనియన్లన్నీ కలిసి వచ్చాయి. అది అనంతమైన ఊరేగింపు. ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో వేలమంది శ్రామికులు ఉద్యోగులు సమావేశం అయినారు.

అది ఒక అపూర్వ సమ్మేళనం! బ్లూ - వైట్ కాలర్ వ్యత్యాసం అంతరించింది. స్వీపరు పక్కన క్లార్కు - పాకీవాని పక్క సూపర్వైజరు కూర్చున్నారు. అనంత జనవాహిని! వివిధ పతాకాలు!! వేదిక మీద అన్ని పార్టీలవాళ్లు!!!

"హమ్‌సబ్ మజ్దూర్ హై ఏక్ కలమ్‌కా మజ్దూర్ - ఏక్ కామ్‌కా మజ్దూర్" అని ఆవేశపూరితంగా గంటమాట్లాడిన నేను -

"ఉఠో మేరే దున్యాకె గరీబోంకో జగాదో
ఖాకో ఉమ్రాకె దరో దీవార్ హాలాదో"

అనే ఇఖ్బాల్ నజమ్‌తో ముగించాను. సభ సుదీర్ఘ కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది.

మిగతా వక్తలు కూడా శ్రామిక సమైక్యత గురించీ - లోకంలో శ్రామికులకు అసాధ్యమైంది లేదనీ ఎంతో ఉద్రేకంగా మాట్లాడారు. సభనుంచి తరలిన శ్రామికులు తాము లోకాలను జయించగలమన్న ధీమాతో సాగిపోయారు.

ప్రభుత్వం ప్రజలది. ప్రభుత్వ యంత్రాంగం బూజుపట్టిన సామ్రాజ్యవాదపుది. వారు ఉద్యమాలను గమనించరు. గుర్తించరు. పరీక్షల తేదీ ప్రకటించారు. పరీక్షలను బహిష్కరించాలని పిలుపు ఇచ్చాం. కొందరు ఉద్యోగులు సచివాలయం నుంచి దిగుమతి అయిన అధికారిమీద దౌర్జన్యం జరిపారు. కమీష్నర్ నన్ను అడిగారు. "ఉద్యోగుల ఆగ్రహం అవధులు దాటుతున్నది. అదుపులో ఉంచడం సాధ్యపడేటట్లు లేదు. పరీక్షలు ఉపసంహరించండి" అన్నాను.

"మీరు కమ్యూన్యునిస్టులా?" కమీష్నర్ అడిగారు.

"మీరు అనుకుంటే నాకు అభ్యంతరం లేదు" అని వచ్చేశాను.

పరీక్షలకు ఒకే ఒక దరఖాస్తు వచ్చింది! అతడు కూడా తెల్లవారి ఉపసంహరించుకున్నాడు!!

గోవిందసింగ్ నా సీటుకు వచ్చి నన్ను అభినందించాడు - "తహరీక్ చలానా హైతో ఆప్‌సే సీఖ్నా హై" (ఉద్యమం నిర్వహించడం మీ దగ్గర నేర్చుకోవాలి) అన్నాడు. కమీష్నర్ మా సమైక్యతను గురించి ఆ సంవత్సరపు అడ్మినిస్ట్రేషన్ రిపోర్టులో రికార్డు చేశారు.

పరీక్షలు రద్దయినాయి. సీనియారిటీ ప్రకారం ప్రమోషన్లు వచ్చాయి. నన్ను శిక్షించామనుకుని అనువాద కార్యం నుంచి ఇంజనీరింగ్ సూపర్నెంటుగా బదిలీ చేశారు. అది నాకు కార్మికులకు సాయపడడానికి పనికి వచ్చింది. అక్కడే నిజాం మీద బాంబు వేసిన వాళ్లల్లో ఒకడయిన జగదీశ్, ఒక మంచి ఉర్దూ కవి అమ్జర్ కామాటీ పదవుల్లో కనిపించారు. వారికి సాధ్యం అయినంత సాయం చేశాను. నాకు వాల్యుయేషను ఆఫీసరుగా ప్రమోషను ఇచ్చి, తిరుపతికి పోస్టింగ్ ఇచ్చారు. వెళ్లలేదు.

M.L. ఆచార్య - అఖిల భారత మున్సిపల్ కార్పొరేషను శ్రామిక సంఘాల సమావేశం జరపాలని ప్రతిపాదించారు. అందరం ఆమోదించాం. అందరూ

అత్యంత ఉత్సాహంలో ఉన్నారు. గోవిందసింగ్ సంఘం తప్ప మిగతా కార్మిక సంఘాలు సహకరించాయి.

సుమారు ఒక సంవత్సరం నిరంతరప్రయత్నం చేశాం. అన్ని కార్పొరేషన్ల శ్రామిక సంఘాలతో పత్రవ్యవహారం నడిపారు. సుమారు అన్ని కార్పొరేషన్లవారూ ఆమోదం తెలిపారు.

సరాయ్ నాంపల్లిలో సమావేశం జరిగింది. సుమారు మూడువందలమంది ప్రతినిధులు వచ్చారు. కలిసి మాట్లాడడంతో ఎన్నో విషయాలు తెలిశాయి. చర్చల్లో ఎంతో ఉత్సాహం వెల్లి విరిసింది.

బొంబాయి నుంచి 'గోలే' అనే ఒక కాంగ్రెస్ కార్మిక నాయకుడు వచ్చాడు. ఈ జరుగుతున్నది అతనికి నచ్చలేదు. మిరియాలు నమిలినట్లున్నది. విచ్ఛిన్నం చేయడానికి యత్నించాడు. అడ్డంకులు కల్పించాడు. సాగలేదు. గోవిందసింగ్‌ను ఆశ్రయించాడు. గోవిందసింగ్ – గోలే లోధీవాడి గూండాలతో దాడి చేయించనున్నారని వర్తమానం అందింది. మేము లారీలలో కార్మికులను రప్పించాం. వారు లారీలు పట్టుకుని ఎలాంటి అవకాశాన్నయినా ఎదిరించడానికి సిద్ధపడ్డారు. గోవిందసింగ్ గూండాలు కార్మికశక్తిని చూచారు. జంకారు. పలాయనం చిత్తగించారు!

ఆ సమావేశంలో అఖిల భారత మున్సిపల్ కార్పొరేషన్ కార్మిక సంఘాల సమాఖ్య ఏర్పడింది. నా సాహిత్య కృషి కుంటుపడుతుందని – నేను సెక్రటరీ జనరల్‌గా ఉండడానికి అంగీకరించలేదు. ఈటూరి వెంకటేశ్వర్లు సెక్రటరీ జనరల్ అయినారు. కమీష్నర్ పదవి తప్ప మిగతా అన్ని పదవులూ కార్పొరేషన్ పరిధిలో ఉండాలని సమాఖ్య తీర్మానించింది. దాన్ననుసరించి నిరంతర పోరాటం జరిపింతరువాత – తొలివిడతగా – తొలి గెజిటెడ్ పదవులను – ప్రభుత్వం మున్సిపల్ కార్పొరేషను పరిధిలోనికి తెచ్చింది. అందును అనుసరించి నాకు అసిస్టెంట్ కమిష్నర్ ప్రమోషను వచ్చింది.

1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ప్రళయం సృష్టించింది. తెలంగాణ NGOలు 70 రోజులకు పైగా సమ్మె చేశారు. విద్యార్థులు – విద్యుత్తు కార్మికులు నిరవధిక సమ్మెకు దిగారు. NGO నాయకులు మున్సిపల్ ఉద్యోగులను – కార్మికులను సమ్మెలో దించడానికి అనేక వత్తిళ్లు తెచ్చారు. నేను వారికి రెండు విషయాలు స్పష్టం చేశాను. 1. కార్మికులు రాజకీయ కారణాలకు సమ్మె చేయడం నాకు ఇష్టం లేదు. 2. నిరవధిక సమ్మెలు విజయవంతంకావు. వారు నన్ను "ఆంధ్రవాణ్ణి" అని తిట్టిపోయారు.

కార్పొరేషను కార్మిక సంఘాల స్థితి ఎలా ఉందంటే – మా యూనియన్ సమ్మె చేస్తేనే మిగతావారు సమ్మె చేసేట్లున్నారు! గోవిందసింగ్ ప్రత్యేక తెలంగాణ ఉద్యమం నిర్వహిస్తున్న ప్రజాసమితి నాయకుడు అయినాడు MLC గా ఎన్నిక అయినాడు. అతను తన యూనియన్‌తో సమ్మె చేయించడానికి శతధా ప్రయత్నించాడు. 'రంగాచారయ్య యూనియన్ చేస్తేనే మేం చేస్తం" అన్నారు కార్మికులు.

కార్పొరేషను మేయరు – కౌన్సిలర్లు కూడా ప్రత్యేక తెలంగాణవాదులే. వారు నా మీద వత్తిడి తెచ్చారు. "మున్సిపల్ కార్మికుల సమ్మె NGOల సమ్మె లాంటిది కాదు. నగర పారిశుధ్యం, ఆరోగ్యం దెబ్బ తింటుంది. నగరంలో అంటువ్యాధులు

ప్రబలుతాయి. తెలంగాణ ప్రజలకే హాని జరుగుతుంది." అని వివరించారు. వారు అర్థం చేసుకోలేదు. ఇంతమంది ప్రత్యేక తెలంగాణ వాదులుండి కార్పొరేషనులో సమ్మె జరగడం లేదంటే వారికి తలవంపులుగా ఉంది.

మా ఉద్యోగులు కూడ ఆవేశకావేషాల్లో ఉన్నారు. సమ్మె జరిగి తీరాలన్నారు. నన్ను'ఆంధ్రోడు' అన్నారు. కావాలంటే రాజీనామా చేస్తా – సమ్మె చేసుకోండి అన్నాను.

ప్రజా సమితి నాయకులు S.B. గిరి, బద్రీ విశాల్‌పిట్టీ నా దగ్గరకు వచ్చారు. "తెలంగాణం తగలబడుతున్నది. మీరు సమ్మె చేయమంటే ఎలా?" అన్నారు ఉర్దూలో. నేనూ వారూ చాలసేపు వాదించుకున్నాం. తుదకు కార్మికుల మహాసభ ఏర్పాటు చేయడానికి అంగీకరించాను.

1969 జూలైలో ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో కార్పొరేషను ఉద్యోగుల సదస్సు జరిగింది. మేయర్ కుమార్ నాయక్ అధ్యక్షత వహించారు. సభాస్థలి నిండిపోయింది. జనం రోడ్డుమీద నుంచున్నారు. చాల ఆవేశపూరితం అయిన ఉపన్యాసాలు జరిగాయి. వేదిక నుంచి – జనం నుంచి సమ్మె చేయాలనే నినాదాలు వచ్చాయి. నన్ను మాట్లాడమన్నారు. 'ప్రజల ఆరోగ్యం విషయమయిన బాధతప్ప సమ్మె చేయడానికి నాకు అభ్యంతరం లేదు. రేపు కార్యవర్గ సమావేశంలో నిర్ణయిస్తాం' అన్నాను. సభ ముగిసింది.

తెల్లవారి కార్యవర్గం సమావేశం అయింది. ముందు ఒక వారం మాత్రం సమ్మె చేయాలని నిర్ణయించాం. ప్రభుత్వ దమన నీతి దృష్ట్యా కార్యవర్గ సభ్యులంతా అరెస్టు అవుతారు అనుకున్నాం. అందరి కుటుంబాల పరిస్థితి తెలుసుకొని సాయం చేయడానికి డబ్బిచ్చి, ఒక్కొక్కరిని నియమించాం. ప్రభుత్వం బలప్రయోగం చేస్తే చేయవలసిన దాన్ని గురించి నిర్ణయించాం. సమ్మె నిర్ణయం ప్రకటించాం.

వారం రోజులు సమ్మె సంపూర్ణంగా జరిగింది. కమీష్నరు కారు కూడా ప్రవేశించకుండా గేటుకు రోడ్‌రోలర్ అడ్డం పెట్టారు. కారు బయటపెట్టి కమీష్నరు దుమ్ములోంచి రావలసివచ్చింది. తలుపు తాళం తీసి తానే దుమ్ము దులుపుకున్నాడు.

సమ్మె వలన నగరంలో చెత్తగుట్టలు – ఈగలు – దోమలు పెరిగాయి. నగరంలోని భయంకర పరిస్థితి గురించి పత్రికలు వార్తలు – ఫోటోలు ప్రచురించాయి. నల్లకుంటలో కొందరికి కలరా సోకింది.

ఈ పరిస్థితుల్లో కార్యవర్గం సమావేశం అయింది. తెలంగాణ నాయకులు కూడా హాజరయినారు. సమ్మె పొడిగించవలసిందని వత్తిడి తెచ్చారు. "జీవితాలతో చెలగాటం ఆడదలచుకున్నా – కాటిమీద పేలాలు వేపుకోదలచినా నాకు ప్రమేయం లేదు" అని లేచివెళ్లిపోయాను. అందరూ నావెంట వచ్చారు. బ్రతిమిలాడారు. సమ్మె విరమించడానికి నిర్ణయించారు.

ఈ నిర్ణయం అందరికీ సంతోషం కలిగించలేదు. నామీద చాలమంది ఆడిపోసుకున్నారు! నాకు స్వప్రయోజనం లేదు. అందువల్ల ఎవరికీ లొంగలేదు.

సాహిత్య వ్యాసంగం వదులుకోలేక 1971లో సర్వీసెస్ అసోసియేషన్ అధ్యక్ష పదవిని వదలుకున్నాను.

1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమానికే కాక మరికొన్నింటికి ప్రసిద్ధి.

1969లో ఇందిరాగాంధీ బ్యాంకులను జాతీయం చేశారు.

1969లో అమెరికన్ వ్యోమ నౌక EAGLE చంద్రుని మీద వాలింది. ఇది మానవజాతి ఇతిహాసంలో మరువరాని రోజు. మానవజాతి విజయం సాధించిన రోజు.

మా అన్నయ్య దాశరథి సినీమా పాటలకోసం – 1962లో మకాం హైదరాబాదు నుంచి మద్రాసుకు మార్చారు. "నా కంటిపాపలో నిలిచిపోరా – నీవెంట లోకాల గెలువనీరా" అనే చక్కని పాటతో ప్రారంభించి, సినీమాలకు ఎన్నో – ఎన్నో మంచి పాటలు వ్రాశారు. ముఖ్యంగా వీణపాటలు మధురంగా వ్రాశారు.

అన్నయ్య దాశరథి ఉర్దూలోని గాలిబ్ గీతాలకు సుందరమైన తెలుగు అనువాదం చేశారు. బాపూ బొమ్మల అందాలు సంతరించుకున్న 'గాలిబ్ గీతాలు' 1963లో ఉర్దూ హాలులో రమణీయ గోష్ఠిలో విష్కరించబడింది. ఆ గ్రంథాన్ని అక్కినేని నాగేశ్వరరావుగారికి అంకితం ఇచ్చారు.

*"ప్రతిది సులభమ్ముగా సాధ్యపడదు లెమ్ము*
*నరుడు నరుడగుట దుష్కరము సుమ్ము!"*

## ముప్ఫయి రెండు

### రణభేరి:

*మృత్పిండో జలరేఖయా వలయితస్సర్వోప్యయం నన్వణుః*
*స్వాంశీకృత్య సవివసంయుగ సశైరాజ్ఞాం గణైర్భుజ్యతే*

ఈ భూమండలం పట్టి మట్టిముద్ద. దానిచుట్టూ నీరుంది. సమస్త సృష్టిలో ఇది ఎంత? అణువంత! దానికోసం యుద్ధాలు చేస్తారు రాజులు!! వందలమంది పంచుకుంటారు. పాలిస్తారు!

జీవిత సాగరాన్ని మధించి అందునుంచి వచ్చిన అమృతంతో "సుభాషితము" అందించిన అద్భుతకవి భర్తృహరి రచించిన శ్లోకార్థం అది. భూమిని గురించి తాత్త్వికులు – మేధావులు – కవులు – దార్శనికుల మహర్షుల దృక్పథం అది.

నేల – నీరు – గాలి వంటి ప్రకృతి సంపదలు మానవాళికి – సమస్తప్రాణి జాలానికి – భగవంతుడు ప్రసాదించిన ఎనలేని సంపద. ప్రకృతి తల్లివంటిది. అది వ్యత్యాసం చూపదు. దానికి అందరు సమానమే. ఆమెకు హెచ్చు తచ్చులు, పేదలు ధనికులు – మంచి చెడ్డ వ్యత్యాసాలు లేవు. తల్లి అందరికీ చన్నిస్తుంది.

కొందరు ప్రజలను రక్షించే సాకుతో నేలను ఆక్రమించుకున్నారు. రాజులయినారు. ప్రజలను పీడించినారు. ఈ నేల కోసం యుద్ధాలు చేసినారు. ప్రజలను బలి ఇచ్చినారు. ప్రజలు రాజుల దౌర్జన్యాలను సహించలేకపోయినారు. హాహాకారాలు చెలరేగినవి. రక్షణ పేర ఏర్పడిన రాజులు భక్షణ సాగించినారు.

మానవుని రక్షించడానికి – అతనికి శాంతి ప్రసాదించడానికి – రాజులను అదుపులో ఉంచడానికి మతాలు వెలసినవి. మతాన్ని పాలకులు గుత్తకొన్నారు.

శాంతికోసం ఏర్పడిన మతాలపేర రక్తపు నదులు పారించారు. సామ్రాజ్యాలు ఏర్పరచినారు.

మరల శాంతి కరువు – మానవుని తహతహ – మేధావుల నిరంతర తపన – మతపు పెత్తనాన్ని కూలద్రోసింది. రాజులను అంతమొదించింది. ప్రజలదే అధికారం అనే నినాదంతో ప్రజాస్వామ్యం అవతరించింది. ప్రజాస్వామ్యమే సామ్రాజ్య విస్తరణకు రెండు ప్రపంచ యుద్ధాలు చేసింది. లక్షల అమాయక ప్రజను హతమార్చి, ఓడినవాని నేల చెక్కలను – ప్రజలను – ప్రాణహీన పదార్థాలవలె పంచుకుంది.

మార్క్స్ మహాశయుడు ప్రవచించిన సోషలిస్టు సిద్ధాంతం శ్రామికులకు, శాంతికి పరమధామం కావలసింది. సిద్ధాంతం పేర స్టాలిన్ సామ్రాజ్యాన్ని విస్తరించాడు. నినాదంలో తప్ప – చంగీజ్ ఖానుకు – స్టాలిన్‌కు తేడా కనిపించలేదు.

చైనాదేశం చారిత్రకంగా భారతదేశానికి మిత్రదేశం. భారతదేశం బుద్ధ భగవానునికి జన్మనిచ్చింది. చైనా బౌద్ధాన్ని అవలంబించింది. రెండు దేశాలు శాంతి కాముకములు. చైనాలో జాతీయ పోరాటం సాగించిన సన్యట్‌సేన్ను భారతదేశం బలపరచింది. విదేశీమూకలను ఎదిరించే చైనా సమరంలో భారత డాక్టరు కొట్నీస్ ప్రాణాలర్పించాడు.

చాంగ్ – కై – షేక్‌కు వ్యతిరేకంగా మావో మహాశయుడు సాగించిన మహత్తర సోషలిస్టు పోరాటాన్ని భారతదేశం బలపరచింది. భారతప్రజ గ్రేట్ మార్చ్‌తో కూడిన పోరాటాలను – అద్భుతం అయినవానిగా అవలోకించింది. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. చైనా విముక్తం అయింది. కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది. భారత ప్రభుత్వం – ప్రజ – ఆ ప్రభుత్వానికి నివాళులు అర్పించింది.

అప్పటి భారతప్రధానికి అనంతం అయిన చారిత్రక అవగాహన ఉంది. అతడు బుద్ధుని – బౌద్ధాన్ని – అశోకుని అనంతంగా అభిమానించాడు. అతనికి శాంతి కాముకం అయిన చైనామీద అనేక ఆశలున్నాయి. మరిన్ని ఆశలు పెంచుకున్నాడు. ఉభయదేశాలు అంగీకరించిన 'పంచశీల' ద్వారా ప్రపంచ శాంతి కలలు కన్నాడు జవహర్‌లాల్ నెహ్రూ.

సామ్రాజ్య కాంక్షకు సిద్ధాంతాలతో సంబంధం లేదు. మావో టిబెట్టును ఆక్రమించుకున్నాడు. దేశం సాంతం నెహ్రూను ఎదిరించింది. నెహ్రూ ఆదర్శవాది. అతడు కలల బేహారి. అతడు శాంతికపోతం చేతపట్టినాడు. టిబెట్ ఆక్రమణ సహజపరిణామం అన్నాడు.

భారతదేశం – భారతప్రజ – భారతప్రధాని సహితంగా అందరు చైనాను మిత్రదేశంగా విశ్వసించారు. బౌద్ధంతో కూడిన సోషలిజం దండయాత్ర చేయదు అనుకున్నారు. ప్రమత్తంగా ఉన్నాం. నా వరకు నేను దండయాత్ర చేయగలదని ఊహించలేదు. టిబెట్టు విషయంలో నెహ్రూ విధానం సరియైంది అని నమ్మాను. చైనా – మావో విషయంలో నాకు అనంతం అయిన అడ్మిరేషన్!

చైనా భారతదేశానికి – భారతప్రజకు – చారెడు నేల చెక్కకోసం – మిత్రద్రోహం చేసింది. 1962 అక్టోబర్ 20న 'దేవతాత్మ' అయిన హిమాలయంమీద దాడిచేసి, యుద్ధం ప్రకటించింది! తొలుత భారతదేశం – ప్రజ – ప్రభుత్వం చకితములు అయినవి. ఆశ్చర్యంలో మునిగాయి. కాని మిన్నకుండలేదు.

గిరి మేల్కొన్నది, పురిమేల్కొన్నది
గిరిగుహలో కేసరి మేల్కొన్నది.
గిరిపుర వనముల ధర మేల్కొన్నది.
నరనారీ సంతతి మేల్కొన్నది. (దాశరధి)

భారతదేశం అనిష్టంగా అమెరికా సాయం అర్థించాల్సి వచ్చింది. ఏ యుద్ధం అయినా కలకాలం సాగదు! నిలిచింది.

రాతికాలంనుంచి రాకెటు కాలందాకా – వేషాల మార్పుతో – సామ్రాజ్య కాంక్ష రావణకాష్టంలా – తగలబడుతుండడానికి కారణం ఏమి? ఒకింత ఆలోచించిన మన తాత్త్వికులు నిర్వచించిన అహంకార, మమకారాలే కారణం అనిపిస్తుంది. మన మహర్షులు కలలుగన్న 'వసుధైవ కుటుంబకం' పాలకుల చెవికి ఎక్కకపోవడం కారణం అనిపిస్తుంది. 'మా విద్విషావహై' మేము ద్వేషించుకొనము. 'మాగృధః కశ్యచిద్ధనం' మరొకరి ధనమును దొంగిలించకు అను ఉపనిషద్వాక్యములు చెవిటికి శంఖధ్వని కావడమే మూల కారణం అనిపిస్తుంది.

**ఆదర్శానికి ఆచరణకు నింగికి నేలకు ఉన్నంత అంతరం.**

వాస్తవానికి వస్తే నా దేశంమీద పరదేశ దండయాత్రను – సమస్త ప్రజానీకంతో – నేనూ సహించలేకపోయాను. కమ్యూనిస్టుల మీనమేషాలు కాదు, నా దేశం, నా ప్రభుత్వం చెప్పింది నిజం అని నమ్మాను. కంటికి కనిపించేదానికి సాక్ష్యం అక్కరలేదు.

దేశం సొంతం – వర్ణ, వర్గ, భాష, ప్రాంత, లింగభేదాలు విడిచి – ఎగబడిన వేళ నేను మిన్నకుండలేదు. దేశభక్తిలో ఎన్నడూ వెనుకాడలేదు. ప్రాణాలు అర్పించడానికి సిద్ధం అయినాను. ఆ ప్రాణాలు దక్కినవి. అందువల్లనే ఇది వ్రాయగలుగుతున్నాను.

భారతదేశం సాగించిన ఈ మహా సమరంలో కలం యోధులు కవితాగ్నులు కురిపించారు. వారి కవితలను కూర్చి "రణభేరి"గా ఒక సంకలనం ప్రచురించాలనుకున్నాను. రచనకు ప్రాణం ప్రచురణ. చందా నారాయణ శ్రేష్ఠి యజమాని – మిత్రులు రాజేశ్వరరావుగారు ప్రచురణ భారం వహించడానికి సంసిద్ధులు అయినారు. వారు ఎంతో భారం వహించారు.

కవులు రచించి ప్రచురించిన కవితలు సేకరించడం ప్రారంభించారు. సంకలనం కోసం కొత్తగా వ్రాయించదలచలేదు. ఆగ్రహంలో – ఆవేశంలో కవులు కురిపించిన అగ్నిగోళాలను సేకరించాలనుకున్నాను. పత్రికల్లో – అంతకుముందు – ప్రచురించబడిన వాటిని వెలికి తీశాను. ఇందుకు గ్రంథాలయాలు – కొందరు మిత్రులు ఎంతగానో సాయం చేశారు. ఇదొక యజ్ఞం. ఒక్కరితో సాధ్యం అయ్యే పనికాదు. సుమారు నూరుగురు కవుల కవితలను సేకరించి ఎన్నుకున్నాను.

"అస్త్యుత్తరస్యాం దిశిదేవతాత్మా
హిమాలయోనామ నగాధిరాజః" అనే కాళిదాసు శ్లోకంతో ప్రారంభించి ఒక లేఖ సిద్ధం చేశాను. ఆ లేఖలో – సంకలనంలో కవితలు చేర్చడానికి కవుల అనుమతి అర్థించాను. కొందరిని వ్యక్తిగా కలిశాను. వారు నా ప్రయత్నాన్ని శ్లాఘించారు. అనుమతించారు. మరికొన్ని కవితలు అందించారు. మిగిలినవారు ఉత్తరాలద్వారా అనుమతించారు. మెచ్చారు.

ఆ సందర్భంలో నా దృష్టికి వచ్చిన విషయాలు:

1. ఎక్కువ రచనలు 'ఆంధ్రప్రదేశ్' (ప్రభుత్వ పత్రిక), 'ఆంధ్రప్రభ'లలో వచ్చాయి.
2. మహిళలు వ్రాసినవి 'బహుకొద్ది.'
3. 'భారతి'లో ఒక్క కవితా రాలేదు.

సేకరణ కార్యం పూర్తి అయింది. సుమారు 80 మంది కవులు అనుమతిస్తూ – వారి వివరాలు – ఫోటోలు పంపారు. కవులు అందరిని గురించిన వివరాలు సిద్ధం చేశాం. ఇందుకు సహకరించిన మిత్రులు పేర్లు గుర్తుకు లేవు!

అచ్చు కార్యం ప్రారంభం అయింది. ఉత్తమం అయిన కాగితం మీద అందమైన అచ్చు సమకూర్చారు రాజేశ్వరరావుగారు. కవితల చివరన రచయిత 1. పూర్తిపేరు. 2. చిరునామా. 3. సుపరిచిత భాషలు. 4. రచనలు. 5. వారిని గురించి నేను అనుకున్న పదంతో కవుల పరిచయాలు కూర్చాను.

అనేక విషయాల్లో సాయపడిన మడిపడగ బలరామాచార్యులవారు మంచు కొండమీద నగారా – దాన్ని మ్రోగిస్తున్న యువకుడు గల పలువర్ణ ముఖచిత్రం – ఎంతో సుందరంగా సమకూర్చారు.

ప్రఖ్యాత శిల్పి గులాం జీలానీ – సైనికునికి హారతి ఇచ్చి సాగనంపుతున్న శిల్పం Farewell my heart రాష్ట్రపతి రాధాకృష్ణపండితునికి బహూకరించాడు. దాని ఛాయాచిత్రం 'రణభేరి'లో చేర్చడానికి అనుమతించారు. చేర్చాం.

కేతవరపు రామకోటి శాస్త్రిగారు – కె. ఎస్. సుబ్రహ్మణ్యంగారు – దేవులపల్లి రామానుజరావుగారు తొలిపలుకులు సమకూర్చారు. నేను 'రణభేరి' శీర్షికన సుదీర్ఘ పీఠిక వ్రాశాను. ఆ పరిశీలనాత్మకం అయిన ఈ వ్యాసాన్ని 'పరిశీలన'లో చేర్చడం జరిగింది.

'చరిత్ర పాలకుల చేతి 'మైనపుబొమ్మ' అని నా నమ్మకం. దండయాత్ర అంతం కావచ్చు. రెండు దేశాలు మిత్రులైపోవచ్చు. కాని భారతదేశపు గుండెకు తగిలిన ఈ గాయం భారతదేశం ఉన్నన్నాళ్లూ ఉండేదే. అందుకే తెలుగు కవి జోదులు కురిపించిన కవితా శతఘ్నులను పరిరక్షించడానికి 'రణభేరి'గా కూర్చాను' అన్నాను.

నేను ఆనాడే ఉభయదేశాలు మిత్రులు అవుతాయని అంచనా వేశాను. నా అంచనా వాస్తవం అయింది.

'రణభేరి' అందాల రాశిగా – సాహిత్యపేటికగా – ఆవేశపు అమ్ములపొదిగా సిద్ధం అయింది. పుస్తకం అంతటి గొప్ప ఆవిష్కరణ జరగాలని నేను అనుకున్నాను. ప్రచురణకర్తలు సంసిద్ధత వ్యక్తపరచారు. ఈ విషయంలో మాకు సహకరించినవారు అప్పటి కౌన్సిలరు అల్లాడి పెంటయ్యగారు.

అప్పటి ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారు ఆవిష్కరించాలని సంకల్పం. వారిని ఆహ్వానించడానికి ఎవరు వెళ్లాలి అని మీమాంస. నేను వెళ్తానన్నాను. అప్పటికి సంజీవరెడ్డిగారు 'గ్రీన్‌లాండ్స్'లో ఉంటున్నారు. వారిని సులభంగానే కలుసుకోగలిగాం. వారికి పుస్తకం అందించాను. వచ్చిన పని చెప్పాను. వారు మురిసిపోయారు. 'ఇంత పని చేసినావు. ఎప్పుడు రమ్మంటావో చెప్పు, వస్తాను' అని ప్రోత్సహించారు. 1963 నవంబర్ 7 వ తేదీన ఆవిష్కరణోత్సవం నిర్ణయించాం.

నేను 'రణభేరి'ని మంచుకొండమీద మాతృదేశ రక్షణకు అసువులు బాసిన అమరవీరులకు అంకితంగా సమర్పించాను:-

"తల్లి పయ్యెద నెవ్వడో తాకెనన్న
ఓర్వజాలక రణమున కురికినావు
తుచ్ఛులను కూల్చి ఒరిగిన దొరవు నీవు
అందుకొనుమయ్య 'రణభేరి' అంకితమ్ము" అన్నాను.

అమరవీరుల తరఫున అంకితం అందుకోవలసిందని అప్పటి గవర్నర్ 'జనరల్ నగేశ్'ను కోరాం. అతను తెలుగువాడు. హైదరాబాదు వాసి. అందుకు వారు ఎంతో సంతసించారు. కాని, సాంకేతిక కారణాలవల్ల సాధ్యపడదు అన్నారు. వారు బ్రిగేడియర్ సయీద్‌ను ఆహ్వానించమని సూచించారు. సయీద్ యుద్ధంలో పాల్గొన్నారు. అసువులు బాసినట్లు ప్రకటించారు. సయీద్ భార్య - కవయిత్రి తాహిరా - శోకగీతం వ్రాసి ప్రకటించింది. అల్లా అనుగ్రహంతో అతడు ప్రాణాలతో బయటపడ్డారు. జనరల్ నగేశ్ ఈ విషయాలు చెప్పి, మేము వస్తున్నామనీ, మా ఆహ్వానం మన్నించమనీ ఫోనులో ఆదేశించారు.

మేము సయీద్ కార్యాలయం చేరుకున్నాం. సయీద్ తాను ఎదురు రావడం మాత్రంకాదు సైనిక లాంఛనాలతో స్వాగతం పలికారు. అమరవీరులను గురించి కవులకు ఉన్న శ్రద్ధాసక్తులను తమ అధికారులకు వివరించారు. మమ్మ ఎంతగానో గౌరవించారు. మా ఆహ్వానం మన్నించారు.

అందమైన ఆహ్వానాలు సిద్ధం అయినాయి. కవులకు పెద్దలకు - పిన్నలకు - ప్రజలకు పంపడం జరిగింది.

7 నవంబర్ 1963 రానేవచ్చింది. గాంధీభవన్‌లోని ప్రకాశం హాలు పెళ్లికూతురులా ముస్తాబయింది. అరటి బోదెలు - మామిడి తోరణాలు - దీపపంక్తులతో తేజరిల్లింది. సభావేదిక పుష్పగుచ్ఛాలతో రమణీయంగా అలంకరించబడింది.

అలాంటి సభ బహుశః సాహిత్య చరిత్రలో జరిగి ఉండదు. అది సైనికుల - కవుల - ప్రజల సమ్మేళనం. గాంధీభవన ఆవరణలో సైనిక శకటాల సరసన ప్రజల మంత్రుల వాహనాలు! ప్రకాశం హాలులో ఒకప్రక్క సొంతం యూనిఫాంలో సైనికాధికారులు జవానులు ఆసీనులయినారు. మరొక పక్క ప్రజలు పెద్దలు నిండిపోయారు. జనంతో కారిడర్ సహితం నిండిపోయింది. సభకు ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు విచ్చేశారు.

నీలం సంజీవరెడ్డిగారు కారు దిగగానే నన్ను గురించి అడిగారు. నన్ను వెంటపెట్టుకొని హాలులో ప్రవేశించి ఆసీనులయినారు. నన్ను ఎంతో మెచ్చుకున్నారు.

సభకు కమల - పిల్లలు వచ్చారు.

ప్రచురణకర్త చందా రాజేశ్వరరావుగారు పరిశ్రమల శాఖామాత్యులను అధ్యక్షత వహించవలసిందిగా ఆహ్వానించారు. తరువాత ఆవిష్కర్తగా ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డిగారిని, వక్తలుగా సమాచారశాఖామాత్యులు పి. వి. నరసింహారావుగారిని, రవాణాశాఖామాత్యులు బి. వి. గురుమూర్తిగారిని ఆహ్వానించారు. కృతి అందుకోవడానికి బ్రిగేడియర్ సయీద్‌ను, కృతికర్తను నన్ను, అల్లాడి పెంటయ్యగారిని ఆహ్వానించారు.



దాశరథి రంగాచార్యను సన్మానిస్తున్న నీలం సంజీవరెడ్డిగారు

కరతాళధ్వనుల మధ్య అందరూ వేదికను అలంకరించారు. ప్రచురణకర్తలు అందరికి పూలమాలలు వేసి సత్కరించారు. అధ్యక్షులు తొలి భాషణం తరువాత ఆవిష్కరించవలసిందిగా సంజీవరెడ్డిగారిని కోరారు.

సభ సుదీర్ఘకరతాళ ధ్వనుల మధ్య సంజీవరెడ్డిగారు 'రణభేరి'ని ఆవిష్కరించారు. ప్రచురణకర్తల పక్షాన నాకు పూలదండవేసి, శాలువ కప్పి సన్మానించారు. వారి ఉపన్యాసంలో నన్ను మెచ్చుకుంటూ యువరచయితలు ఇలాంటి దేశభక్తి కార్యాలు చేయాలని ఉద్బోధించారు. 'వంద ఉపన్యాసాలు ఒక కవితకు సరిరావని, వంద రాజకీయులు ఒక కవికి సరిరారనీ' అన్నారు

పి. వి. నరసింహారావుగారు – బి. వి. గురుమూర్తిగారు నన్నూ నా ప్రయత్నాన్నీ ప్రశంసించి, దేశభక్తి కవితలు రావాలని ఆశించారు.

నేను ప్రచురణకర్తకు పూలదండవేసి సత్కరించాను. తరువాత బ్రిగేడియర్ సయీద్ పూలమాల వేయడానికి – వారు పొడవు కాబట్టి – వారు వంగవలసి వచ్చింది. సయీద్‌కు నేను అంకితం అందించినపుడూ, ఆంగ్లంలో అంకిత వాక్యాలు చదివినపుడూ, సైనికులు లేచినుంచుని కరతాళ ధ్వనులు చేసి తమ సంతోషం వ్యక్తపరచారు.

"అమరవీరులను స్మరించే ఇలాంటి ఉత్సవాలు సైనికులు మరిన్ని త్యాగాలు చేయడానికి ఉపకరిస్తాయి" అన్నారు రుద్ధకంఠంలో బ్రిగేడియర్ సయీద్.

నేను ఉపన్యసించాను. జాగృతం చేసేది కవిత – మేల్కొలిపేవాడు కవి అన్నాను. దేశరక్షణ ఒక్క సైనికుల బాధ్యత కాదు – కవుల సహితంగా సకల ప్రజానీకం బాధ్యత అన్నాను. నా అంకితం పద్యాలు అందరిని కదిలించినాయి. అందరితోపాటు సైనికులు కూడా చప్పట్లు కొట్టారు.

సంజీవరెడ్డిగారు లేచి నన్ను దగ్గరికి తీసుకుని ఆశీర్వదించారు. మాడపాటివారు కూడా ఆశీర్వదించారు.

తరువాత సభకు విచ్చేసిన ఒక్కొక్క కవికి రాజేశ్వరరావుగారు సన్మానం చేశారు. వారు తమ కవితాగానం చేశారు.

అనంతరం వాద్యబృందం సహితంగా – గాయకులు రణభేరిలోని కొన్ని కవితలు గానం చేశారు.

అల్లాడి పెంటయ్యగారి కృతజ్ఞతలతో సభ దిగ్విజయంగా ముగిసింది.

తెల్లవారి పత్రికలన్నీ ఈ వార్తను ఫోటోల సహితంగా ప్రముఖంగా ప్రచురించాయి. పత్రికలు 'రణభేరి'ని ప్రశంసిస్తూ సమీక్షలు వ్రాశాయి.

మిత్రులు భీమ్‌సేన్ నిర్మల్ హిందీలో రణభేరిని గురించి వ్యాసం వ్రాస్తూ, ఇంత మంచి గ్రంథం హిందీలో కూడా రాలేదన్నారు.

నా ప్రయత్నం ఫలించినందుకు నేను పొంగిపోయాను. రాజేశ్వరరావుగారు నా కృషికి ఎలాంటి ప్రతిఫలమూ చెల్లించలేదు! ప్రభుత్వం పట్టించుకోదు కదా!!

కాలప్రవాహంలో చందా నారాయణ శ్రేష్ఠిగారి సంపద కరిమింగిన వెలగపండులా కరిగిపోయింది. కడుదీనావస్థలో రాజేశ్వరరావుగారు కన్నుమూశారు. కాలం ఆనాటి వారిని చాలమందిని కబళించింది.

## రణరంగం:

భారతదేశం మహత్తరదేశం! ఇది ఎన్ని దాడులను – దండయాత్రలను – దోపిళ్లను తట్టుకున్నది! ఎన్ని నాగరకతలు, ఎన్ని సంస్కృతులు మారినాయి!! అయినా ఈ దేశం – ఈ ప్రజ – ఈ తాత్త్విక చింతన హిమవదున్నతం అయి నిలిచి ఉంటుంది. ఇక్బాల్ అంటాడు:–

కుఛ్ బాత్ హైకి హస్తీ మిటతీ నహీ c హమారీ
సదియోఁరహా హై దుష్మన్ దౌరే జమాఁహమారా!

(వందల ఏళ్లుగా కాలం మనకు శత్రువై కూచుంది. అయినా ఏదో రహస్యం ఉంది. మన వ్యక్తిత్వం చెరిగిపోవడం అంటూ జరగదు.)

భాష–కులం–మతం–ప్రాంతం లాంటి విషయంలో నిరంతరం పోట్లాడుకుందుము గాక – దేశానికి విపత్తు కలిగినపుడు ఒక్క మనిషిలా ఉద్యమిస్తాం. ఇది విదితం చేయదలచాను. చైనా దండయాత్ర జరిగినపుడు వివిధ భాషలలో వచ్చిన కథలను సేకరించి తెనిగించాలనుకున్నాను. ఆశయం మంచిదే! ఆచరణ? విషయం విన్నవారంతా గొప్పగా ఉందన్నారు. సాయం చేసినవారు లేరు.

ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాస సంత్రస్తులై
యారంభించి పరిత్యజింతు రురు విఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

ఇది భర్తృహరి శ్లోకానికి ఏనుగు లక్ష్మణ కవి తెనిగింపు. వంటరిని – దుర్బలుణ్ణి – ఎలాంటి సహాయ సంపదలేనివాణ్ణి. అయినా ప్రయత్నం మానలేదు. అన్ని

భాషల రచయితలతో విసుగులేకుండా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాను. కథలు సంపాదించగలిగాను. కాని, ఆ భాషలే మనకు తెలియవు.

మనసున్న చోట మార్గానికి కొదువలేదు. హైదరాబాదు విచిత్ర నగరం. ఇక్కడ అన్ని భాషలవాళ్లూ ఉన్నారు. వారికి సంఘాలున్నాయి. వారికి రచయితలున్నారు. వెదికి వెలికి తీశాను. నిరంతర ప్రయత్నంతో వాటికి హిందీ లేక ఇంగ్లీషు అనువాదాలు చేయించాను.

ఈలోగా ఒక పిడుగు పడింది. 27 మే 1964 న భారతప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ పరమపదించారు. నెహ్రూ ప్రధాని మాత్రమేకాదు. మహత్తర మానవతావాది. నవభారత నిర్మాత. ఈనాటి పారిశ్రామిక భారతానికి అతడే ఆవిష్కర్త. అతడు ఆశావాది. శాంతిదూత. అలీనోద్యమ నిర్మాత.

భారతదేశానికి మహాత్ముని అకాల మరణం తరువాత ఇదే మరొక దెబ్బ!

"భారతప్రజలనుంచి నాకు లభించిన ప్రేమాభిమానాలు అపారములు. అంతటి అపార అభిమానంలో అవగింజంత తీర్చడం కూడా అసాధ్యం. అమూల్యములయిన ప్రేమాభిమానాలను తీర్చడం సాధ్యమా? చాలమందిని భారతీయులు గౌరవించారు. కొందరిని పూజించారు. కాని వారు నన్ను ప్రేమాభిమానాలతో ముంచెత్తారు. నన్ను ఉక్కిరిబిక్కిరి చేశారు. నేను చేయకలిగింది భారతప్రజ ఆశలకు ఆశయాలకు అనుగుణంగా – వారి ప్రేమాభిమానాలకు తగినట్లుగా నా శేషజీవితం గడపడమే" అన్నారు నెహ్రూ. అందుకు అనుగుణంగా జీవించారు.

నెహ్రూలేని దేశం వెలుగులేని భారతం అయింది. దేశం సాంతం శోకసాగరంలో మునిగిపోయింది. అప్పుడు నాయన మా ఇంట్లో ఉన్నారు. "ఏమిటీ దుఃఖం? ఎవడు చచ్చాడు?" అని సంస్కృతంలో అడిగారు. వారు లౌకికులు కారు. అర్థం కాలేదు. ఇదొక వెర్రి అనుకున్నారు.

తెల్లవారి నాయన బజారుకని వెళ్లారు. తిరిగి వచ్చారు. "ఒక్క దుకాణం లేదు. ఒక్క రిక్షాలేదు. ఇది నిర్బంధం కాదు. స్వచ్ఛందం. నెహ్రూ నిజంగానే గొప్పవాడు. రంగడూ! భాగవతంలో కృష్ణ నిర్యాణం వలె ఉన్నదిరా! భాగవతంలో పార్థుడు ధర్మరాజుకు కృష్ణనిర్యాణ వార్త చెపుతాడు. ఆ ఘట్టం చదువు" అన్నారు. చదివాను. ఎన్నటిదో వృత్తాంతం! ఈనాడు మమ్ములను కదిలించింది. ఇద్దరమూ కంట తడిపెట్టాం.

క్రితంరోజు సాయంత్రం మా కాలనీలో షామ్యానావేసి నెహ్రూ పటం పెట్టాం. పటానికి పూలదండవేసి దీపం వెలిగించాం. సంతాపవాక్యాలు పలికాం. అదిగో అక్కడ S. B. గిరి అనే కార్మిక నాయకునితో పరిచయం అయింది. వారు మా కాలనీలోనే ఉంటారు. అయినా ఇంతకాలం కలుసుకోలేదు. వారు నెహ్రూ అభిమాని మాత్రమేకాదు – నెహ్రూతో పరిచయం ఉన్నవారు. వారితో గంటలు మాట్లాడాను. నాటినుంచి మేము విడదీయరాని మిత్రులం అయినాం.

నెహ్రూ నిధనం నన్ను ఎంతో క్రుంగదీసింది. నేను భావుకుణ్ణి! భావుకుడు కాకుండా రచయిత – కళాకారుడు కాలేడు! చాలరోజులు కథల అనువాదం అంటుకోలేదు. తరువాత హిందీనుంచి తెలుగు అనువాదాలు కొన్ని నేను చేశాను. కొన్ని చేయించాను. సంకలనానికి "రణరంగం" అని పేరు పెట్టాను. ఇందులోని

రచయితలను – భాషలను పేర్కొంటాను.

1. బెంగాలి – శ్రీమతి ఆశాపూర్ణాదేవి. తరువాత వీరికి జ్ఞానపీఠ్ అవార్డు వచ్చింది.
2. ఇంగ్లీషు – శ్రీమతి తపతీముఖర్జీ.
3. గుజరాతీ – డాక్టర్ శ్రీ రమేశ్ జానీ
4. హిందీ – శ్రీ కిషన్ చందర్
5. కాశ్మీరీ – శ్రీ రాజేష్ గౌహర్
6. మరాఠీ – శ్రీ బి. డి. భావే
7. పంజాబీ – కర్నల్ నరేందర్‌పాల్ సింగ్
8. తమిళం – శ్రీమతి శ్రీప్రియ
9. తెలుగు – దాశరధి రంగాచార్య
10. ఉర్దూ – శ్రీ ఖ్వాజా అహమద్ అబ్బాస్
11. ఒరియా – శ్రీ కాళిందీచరణ పాణిగ్రాహి

ఆవేశంలో – నిరంతర ప్రయత్నంద్వారా – సంకలనం సిద్ధం చేయగలిగాను. కాని ప్రచురణ అతికష్టం అయింది. ఒక దశలో ఇంత పరిశ్రమ వృధా అయిపోతుంది అనిపించింది. అచ్చువేయడానికి నాకు ఆర్థిక స్తోమతలేదు. ప్రభుత్వానికి రాజకీయం తప్ప సాహిత్యం తెలియదు. పైరవీ చాతనవుతే సాహిత్యాన్ని రాజకీయం అనిపించవచ్చు. సాయం సాధించవచ్చు. కాని నాకు అర్థించడం చేతకాదు. పైరవీ జాడ తెలియదు

ఇలాంటి సమయాల్లో దైవం సాయం చేస్తాడు. సత్సంకల్పాన్ని భగవంతుడు మెచ్చుతాడు. తప్పక అనుగ్రహిస్తాడు. విచిత్రంగా సందెపూడి రామచంద్రరావుగారి పరిచయం అయింది. వారు స్వయంగా కవులు! వారు నా పరిశ్రమ – సాహిత్య ప్రాధాన్యత గ్రహించారు. "రణరంగం" ప్రచురణ బాధ్యత స్వీకరించారు.

మిత్రులు S. B. గిరిగారు అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డిగారి 'ప్రశంసావాక్యాలు' తెచ్చారు. వాటిని పుస్తకంలో చేర్చాం.

'రణరంగం' భారత సమైక్యతకు సంకేతం. భారత నాగరకత – సంస్కృతి – ఆలోచనా విధానం ఒక్కటే అని నిరూపించే గ్రంథం.

'రణరంగం' గ్రంథాన్ని జాతినేత – శాంతిదూత పండిత జవహర్‌లాల్ నెహ్రూకు అంకితం ఇచ్చాను.

బహుప్రయాస తరువాత "రణరంగం" 1965లో వెలువడింది. దేశభక్తి ఎంత కఠినం అయిందో అర్థం అయింది.

దీనికి నేను వ్రాసిన 'పొలికేక' అనే పీఠిక 'పరిశీలన'లో చేర్చడం జరిగింది.

'రణరంగం' సంకలన ప్రయత్నంలో వివిధ రాష్ట్రాల – భాషల రచయితలు ఎంతగానో సహకరించారు. వారంతా ఆయా భాషల్లో ప్రముఖులు. అయినా వారికి నేను ఏమీ ఇవ్వలేకపోయాను. వారి కథలను చేర్చుకోవడానికి వారు సంతోషంగా – ఉచితంగా అనుమతించారు.

ఈ గ్రంథ సంకలనంలో శ్రమ – మానసిక వ్యథ తప్ప నాకు ఏమీ లభించలేదు. సందెపూడివారి సాయంవల్ల 'రణరంగం' గ్రంథరూపంలో చూడడమే ఆనందం!

# ముప్పయి మూడు

## చిల్లర దేవుళ్లు:

**ఒక్కొక్కసారి మనకు స్వాతంత్ర్యం శాపంలా పరిణమించిందేమో అనిపిస్తుంది. మనసు కలుక్కుమంటుంది. బాధ కలుగుతుంది. ఎంచాతంటే - ఆనాటినుంచే మన 'విలువల' పతనం ప్రారంభం అయింది.**

స్వాతంత్ర్యం సాధించుకోవడానికి మనం సాగించిన సుమారు ఒక శతాబ్దపు పోరాటం విశిష్టం అయింది. విప్లవాత్మకం అయింది. విస్తృతం అయింది. ప్రపంచ విముక్తి పోరాటాలలో ప్రత్యేక స్థానం సంతరించుకుంది.

మన స్వాతంత్ర్య పోరాటంలో జాతి, మత, కుల, ప్రాంత, భాషా భేదం లేకుండా సమస్త భారతీయులు పాల్గొన్నారు. ఆ పోరాటం అనేకమంది మహామహాలను - మహితాత్ములను సృష్టించింది. ఒక్క రాజకీయం కాదు - జీవితంలోని అన్నిరంగాల్లోనూ అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన మహాపురుషులు జన్మించారు.

మన స్వాతంత్ర్య పోరాట జ్వాలలో జాతి స్వార్థం - స్వప్రయోజనం - అహంకార మమకారాలను దహించి వేసింది. దేశభక్తి - త్యాగం - బలిదానం లాంటి ఉన్నత విలువల వెలుగులు పరచింది. జీవితంలోని అన్ని రంగాల్లో - వ్యవసాయ, వర్తక, వాణిజ్యాల యుక్తంగా అన్నింటిలోనూ దేశభక్తి కనిపించింది!

మన స్వాతంత్ర్య పోరాటంలో ఇంతటి మహోన్నత విలువలు పెంచుకోవడానికి కారణం - మనకు లక్ష్యశుద్ధి ఉంది. గమ్యం మనకు తెలుసు. పయనం కఠినం. అయినా సాగినాం. గమ్యం - లక్ష్యం చేరుకోగలిగాం.

మనకు స్వాతంత్ర్యం సిద్ధించింది. మన గమ్యం అగమ్యం అయింది. లక్ష్యం నిర్లక్ష్యం అయింది. జీవితంలోని అన్ని రంగాలు - దేశభక్తి సహితంగా వ్యక్తి చుట్టు పరిభ్రమించాయి. మనం త్యాగాన్ని త్యాగం చేశాం. స్వార్థం - స్వప్రయోజనం స్వలాభానికి పట్టం కట్టాం. దేశం నా కోసం బతకాలి అనే సిగ్గులేని నినాదాన్ని ఎలుగెత్తి చాటాం. ఇంతటి దుర్భర పరిస్థితుల్లో పూర్వపు మహోన్నత విలువలు ఊపిరాడక ఆవిరి అయిపోయాయి.

అర్థం - స్వార్థం తప్ప అన్యం తెలియని జాతికి వలువలు తప్ప విలువలు తెలియవు! అర్థం - అధికారం అనే ఎండమావుల కోసం ఉరుకుతున్న జాతి కాళ్లు విరుగుతున్నాయి!! మనం ఎంత అంధకారంలో ఉన్నామంటే - ముందున్నవి ఎండమావులని ఎరుగలేకున్నాం!!!

స్వాతంత్ర్యం మనకు సమృద్ధిని సంపదను ప్రసాదించింది. ఆర్థికంగా - పారిశ్రామికంగా - మరెన్నో రంగాల్లో మనం ముందడుగు వేశాం. కాదనలేం. కాని మననూ - మన సంప్రదాయాన్నీ మరిచాం. భాషసహితంగా వెర్రివెలుగు అయిన పాశ్చాత్యుల్లో పరకాయ ప్రవేశం చేస్తున్నాం.

లక్ష్యం - గమ్యం ఎరుగని భారతయువత 'విలువలు' అనేవాణ్ణి వెర్రివాడిగా చూస్తున్నారు. స్వాతంత్ర్యం కోసం సర్వం సమర్పించిన వారిని వెక్కిరించే రాజకీయ

దివాళా కోరుతనం పట్టం కట్టుకున్నది. మహామహులను మతం–కులం–ప్రాంతం–పార్టీల వారిగా విభజించి దూషించడం భూషించడం చేస్తున్నారు. మహాత్ముని హత్యచేయడం మంచిదనీ – దేశపు అనర్థాలన్నింటికీ నెహ్రూయే కారణం అనీ అనడం నాగరకత అయిపోయింది!

ఒక విపరీత పరిణామం కూడా వినిపిస్తున్నది. ఇంగ్లీషువాళ్లే మంచివాళ్లని; అలాగే నిజాం నవాబు ఉత్తమ పాలకుడు అనే దశ వచ్చింది. ముసలినక్క నిజామును నెత్తికి ఎత్తుకోవడానికి హైదరాబాదు చతుశ్శతాబ్ది అనే కుట్ర రచించబడింది. ఉస్మానలీఖాను సెక్యులర్ ప్రభువు అని సెమినార్లు జరిపారు. నిజాంకు వ్యతిరేకంగా పోరాటం జరిపినవాళ్లం ఇంకా జీవించి ఉండగానే ఇది జరుగుతున్నది.

మరొక వింత ధోరణి ఏమంటే – తామే బాగుపడాలనే నేటి తరానికి చరిత్ర తెలియదు. భవిష్యత్తు ఎరుగరు. వర్తమానంలో జీవిస్తారు. ఉస్మానలీఖాన్ 'ఉస్మాన్‌సాగర్' – హిమాయత్‌సాగర్ – ఉస్మానియా దవాఖానా – హైకోర్టులను నిర్మించిన ఉదార ప్రభువు అని ప్రచారం జరుగుతే, నిజం అని నమ్మేస్థితి ఏర్పడింది.

**మన ప్రభుత్వాలు దివాంధములు. వాటికి తమ ఉనికి తప్ప అన్యం తెలియదు. చరిత్ర, సంస్కృతి వారు ఇంకా తెలుసుకోవలసిన విషయాలు. ఆంధ్రభాషకోసం ఏర్పడిన ఆంధ్రప్రదేశంలో 'ఆంధ్రం' లోపించి ప్రదేశం మిగులుతున్నదని కూడా గమనించలేని కుంభకర్ణ దశ ప్రభుత్వానిది.**

తెలంగాణాకు ఉజ్వల పోరాట చరిత్ర ఉన్నది. ఇది రాజకీయాల అంధకారంలో కలిసిపోరాదు. దీనిని నవలకు ఎక్కించి భావితరాల వారికి భద్రపరచాలనే సంకల్పం వట్టికోట ఆళ్వార్‌స్వామికి కలిగింది. వారు 1938కి పూర్వపుప్రజాజీవనం వస్తువుగా 'ప్రజలమనిషి' అనే ఉత్తమ నవల రచించారు. ప్రచురించారు. వారి ప్రణాళికలో తరువాతి నవల "గంగు." గంగు రచన జరుగుతుండగానే 1961 లో ఆళ్వార్‌స్వామిగారు పరమపదించారు. గంగు రచనతో నాకు సన్నిహిత సంబంధం ఉండింది. నవల మధ్యలోనే నిలిచిపోవడం నాకు బాధ అనిపించింది. ఆళ్వార్‌స్వామి వదిలిపోయిన శేషకార్యాన్ని ఎవరయినా పూర్తి చేస్తారు అని ఎదిరి చూచాను.

ఆళ్వార్‌స్వామి మిగిల్చిపోయిన నవల రచన సామాన్యం అయింది కాదు. నిజాం నాటి తెలంగాణ పరిస్థితులు తెలిసి ఉండాలి. తాత్త్విక అవగాహన కావాలి. కళారూపం ఇచ్చే ప్రజ్ఞాపాటవాలు కావాలి. నిజాం కాలంనాటి తెలంగాణ జీవితాన్ని నవలలుగా రచించే కార్యం ఎవరూ చేపట్టినట్లు కనిపించలేదు. నేనుకూడ పూనుకోకుంటే 'జన్మజన్మాలబూజు నిజాంరాజు' ధర్మప్రభువుగా చలామణి అవుతాడని భయం. అందువల్ల తప్పనిసరి పరిస్థితుల్లో నేను నవల వ్రాయడానికి పూనుకొనవలసి వచ్చింది.

ఆళ్వార్‌స్వామి 'ప్రజలమనిషి' నవలను 'భయం భయంగా వెలువరిస్తున్నాను' అన్నారు. నవల గురించి నాకూ అలాంటి భయమే ఉంది. నవల ఒక సామాజిక ప్రక్రియ. ఇది ఒక మహత్తర కళారూపం. మొత్తం సమాజాన్ని తనలో ఇముడ్చుకునే శక్తి నవలకు ఉంది. అలాంటి ప్రక్రియను చేపట్టడం నాకు సాధ్యపడుతుంది అనుకోలేదు. అయితే ఈ బాధ్యత నామీద పడింది. వదులుకునేట్లూ లేదు.

నవలా రచనకు సిద్ధం అయినాను. అనేక నవలలు ఆంగ్లం – హిందీ – ఉర్దూ – తెలుగు చదివాను. నవలా రచనను గురించి ఆంగ్లంలో పుస్తకాలు చదివాను. ఇతివృత్తం – పాత్రలు అధ్యయనం చేశాను. నవలా రచనను గురించి ఒక అవగాహనకు వచ్చాను.

నిజాం కాలంనాటి పరిస్థితులు – నామీద ముద్రవేసినవికాక, మరికొన్నింటిని సేకరించాను. తొలివిడతగా 1938కి పూర్వపు తెలంగాణా జన జీవితాన్ని ఒక నవలగా రచించాలనుకున్నాను.

1938 తెలంగాణ జనజీవిత చరిత్రలో ఒక మైలురాయి. అప్పటివరకు తెలంగాణంలో రాజకీయ పార్టీలేదు. అదే సంవత్సరం హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఏర్పరచే ప్రయత్నం జరిగింది. స్టేట్ కాంగ్రెస్ ఇంకా రూపుదిద్దుకోకముందే నిజాం దాన్ని నిషేధించాడు. ఇంకా అస్తిత్వమే ఏర్పడని సంస్థను నిషేధించిన ఘనత నిజాం నవాబుకే దక్కుతుంది. అతనికి ప్రజలన్నా ప్రజా ఉద్యమం అన్నా హడల్. 'సూర్యుడు ఉదయించకుండా నిలుపగలను' అనుకున్న మూర్ఖశిఖామణి – నిశీధి నిబిడాంధకారాన్ని అరుణోదయం చీల్చి చెండాడగలదని ఎరుగని దివాంధుడు మీర్ ఉస్మానలీఖాన్!

'ప్రజల మనిషి'లో అళ్వార్‌స్వామి చిత్రించిన కాలమూ ఇదే. అళ్వార్‌స్వామి నిలిచిపోయిన దగ్గరినుంచి కొనసాగించదలచలేదు. అది నాకు సాధ్యం కాకపోవచ్చు. వారు తమకు అనువైన పాత్రలను మలచుకున్నారు. ఇతివృత్తం ఒక్కటే అయినా దృక్కోణాలు మారవచ్చు. నేను ఎవరికీ ప్రతిబింబం కాదలచలేదు. నా మార్గం నేను మలచుకోదలచాను.

చాల శ్రమించి పాత్రలను సిద్ధం చేసుకున్నాను. ఆనాటి పరిస్థితులను అర్థం చేసుకున్నాను. అవి వరుసగా నాముందు సాగిపోయాయి. నాటి ఉద్యమం లేని పోరాటాన్ని తలచుకున్నాను. ఒక నేపథ్యం సిద్ధం చేసుకున్నాను.

నవలను ఏ తెలుగు యాసలో రచించాలి? తెలుగుభాష సొంతం ఒకటే. 'మాండలికం' అనేది మనం అరువు తెచ్చుకున్న పదం. భాష ఏ ప్రాంతంలోనూ మారదు – కొన్ని పదాలు తప్ప. యాసమాత్రమే ఒక్కొక్క ప్రాంతానికి భిన్నంగా ఉంటుంది. రాజకీయ హద్దుల్లో యాసను కుదించడం దోసిలితో సముద్రాన్ని పట్టడం వంటిది. ఆంగ్రేజుల పుణ్యమా అని ఆంధ్రదేశం మూడుగా చీలింది. ఆంధ్ర – తెలంగాణ – రాయలసీమలు ఏ విధంగానూ యూనిట్లు కావు. ఆంధ్రలో యాస సొంతం ఒకటి కాదు. ఉత్తరాంధ్రము – గోదావరి – కృష్ణ – పలనాడుల యాస వేరు. అట్లే మహబూబ్‌నగర్ – ఆదిలాబాద్ – కరీంనగరం – వరంగల్లు – ఖమ్మం యాసలు వేరు. రాయలసీమలో కడప – అనంతపురం – చిత్తూరు యాసలు వేరు. అంతేకాదు, కులాలు – వృత్తులు – వర్గాలనుబట్టికూడా యాస మారుతుంది. కాబట్టి యాసకు రాజకీయపు హద్దులు ఏర్పరచడం విజ్ఞతకాదు!

నవలను పూర్తిగా యాసలో – మాండలికంలో నిర్మించడం నాకు ఇష్టం లేదు. తెలంగాణం – తెలంగాణ మాండలికం నా ప్రాణ సమాన అభిమానములు. నాది అభిమానమే కాని దురభిమానం కాదు. రాజకీయ లబ్ధి నా లక్ష్యం కాదు. అసలు

ఏ లబ్ధికోసమూ నేను రచనలు చేయలేదు! ఒక ఉన్నత లక్ష్యసాధనమే నా పరమ లక్ష్యం.

నవలలో నివేదన భాష వేరు – పాత్రల యాస వేరు కావాలనుకున్నాను. యాసలేని పాత్రలు నిర్జీవములు అవుతాయి. పాత్రలు పలికిన యాస సొగసు పాఠకులు గ్రహిస్తారు. అందువల్ల పాత్రోచిత యాస వాడడానికి నిశ్చయించాను. సంస్కృత నాటకాల్లో పాత్రోచిత భాష ఉంది. శూద్రులు – నీచపాత్రలు స్త్రీలు ప్రాకృతం మాట్లాడుతాయి. తెలుగునాటకాల్లో పాత్రోచిత భాషాప్రయోగం ఉంది.

తెలుగు నవలలో నేను ప్రవేశపెట్టేవరకు పాత్రలకు ఒక యాస – నివేదనకు ఒక భాష వాడబడలేదు. ఈ విషయంలో నేనే ఆద్యుణ్ణి! నవల ఒక ప్రాంతానికి మాత్రం సీమితం కావడం నాకు ఇష్టం లేదు. 'నను కని పెంచినట్టి కరుణామయి నా తెలంగాణ'ను గురించి సకలాంధ్రులకు తెలియపరచడం నా ధ్యేయం. కావున సాధారణ వాడుకభాషను విషయ నివేదనకు ఉపయోగించడానికి నిశ్చయించాను.

ఒక భాషకు అనేక పలుకుబడులు ఉన్నపుడు ఒక పలుకుబడి సాధారణం అవుతుంది. మనం చదివే ఇంగ్లీషు – హిందీ ఎక్కడా వాడుకలో ఉండదు. ప్రతి భాష ఓ సాధారణ యాసను స్థిరపరచుకుంటుంది. అది అన్ని యాసలవారికీ ఉపాదేయం అవుతుంది. మనం ప్రస్తుతం రచనలలో వాడుతున్న తెలుగు కృష్ణ – గుంటూరు ప్రాంతంలో విద్యావంతులయిన మధ్యతరగతివారు మాట్లాడే భాష. అయితే దీనికీ 'మాలపల్లి' భాషకూ సంబంధం లేదు.

ఏదీ శాశ్వతం కాదు అనేది జీవిత సత్యం. అలాగే ఎప్పుడూ సాధారణ భాష ఒకేరకంగా ఉండదు. మార్పు జీవిత వాస్తవం. తొలుత ఉత్తరాంధ్రభాష – తదుపరి గోదావరి భాషనుండి ప్రస్తుతపుది వాడుక భాష అయింది.

ఇంతకూ చెప్పవచ్చేదేమంటే – నా నవలకు ఇతివృత్తం అందరికీ అర్థం కావాలని విషయ నివేదనకు సాధారణ భాష వాడడానికి నిర్ణయించాను. తెలంగాణం యాస సొగసులు సకలాంధ్రులు చవిచూడవీలుగా పాత్రలకు తెలంగాణం యాస వాడడానికి నిశ్చయించుకున్నాను.

**నాకు అభిమానం ఉంది. దురభిమానం లేదు.**

**నాకు ఆశ ఉంది. దురాశ లేదు.**

ఈ నవలకు నేను ఎన్నుకున్న పాత్రలుగాని – సంఘటనలుగాని కేవలం కల్పితాలు కావు. ఆ కాలమున ఉన్నవే! వాటిని మలచిన తీరు మాత్రం నా స్వంతం. నా పాత్రలు – సంఘటనలు సజీవములు కావడానికి కారణం నేను వాటిని చూచాను! వాటి మధ్య మసలాను!! స్పందించాను!!!

ఈ నవలలోని పాత్రలు – పరిసరాలు నా జన్మస్థలం చిన్నగూడూరువి. అక్కడి గడీ – దేశ్‌ముఖ్ రామారెడ్డి – పిచ్చి మంగమ్మ – ఏరు – తామర చెరువు అలాగే నవలలోకి నడిచి వచ్చాయి. అయితే, సంఘటనలన్నీ అక్కడివి కావు. ఎక్కడెక్కడినుంచియో తెచ్చి గుదిగుచ్చినాను.

ఈ నవలా రచనలో నేను ఎవరి విషయంలో ద్వేషం ప్రదర్శించలేదు. నాకు వ్యక్తులమీద ద్వేషం లేదు. ఆ వ్యక్తులను మలచిన సామాజిక పరిస్థితులను

ఏవగించుకున్నాను. వ్యక్తి సామాజిక వ్యవస్థకూ - పరిస్థితులకూ బానిస. పూర్తి మంచివాడు కాని, పూర్తి చెడ్డవాడు గాని సృష్టిలో ఉండడు. అందుకే నా పాత్రలకు సమయాన్నిబట్టి లేని మనసు పుట్టుక వస్తుంది - ఉన్న మనసును ఊడ్చుకు పోతుంది!

నా పాత్రలను మలచిన తీరుకు రామాయణ – అధ్యయన రచనలు కారణం అనుకుంటాను. వాల్మీకి తన పాత్రలను మలచలేదు. సృష్టించినాడు. వాటికి వంక లేదు! శబరిని సృష్టించిన వాల్మీకియే మంధరను సృష్టించినాడు.

కాల్పనిక రచయితలందరూ ముందు రామాయణం అధ్యయనం చేస్తే శిల్పనైపుణ్యం అర్థం అవుతుంది.

కథ చెప్పడం మాత్రం కాదు – నాటి వింత పరిస్థితులను తెలియపరచడం నా లక్ష్యం. పాత్రలు – సంఘటనలద్వారా చెప్పలేని వివరాలకు మాడపాటి హనుమంతరావుగారిని ప్రవేశపెట్టాను. నిజమై నిలిచి ఉన్న వ్యక్తులను పాత్రలుగా వాడుకోవడం కూడా బహుశః నేనే చేశానేమో! ఒకే సన్నివేశంలో అన్ని వివరాలు తెలియపరచడానికి వేరే మార్గం లేదు. ఆంధ్రపితామహుని ఇంటర్‌వ్యూ కథాగమనానికి కొంత అడ్డంకి అని తెలిసికూడా చేర్చాను. అందుకు కారణం ఉద్యమచరిత్రను తెలియపరచాలనే నా ఆవేదన – ఆవేశం మాత్రమే. వాస్తవంగా అదే "నిన్నటి యదార్థము – నేటి చరిత్ర"కు ప్రాణప్రదం.

ఆ విధంగా సకల సామగ్రి సమకూర్చుకున్నాను. రచనకు ఉపక్రమించాను. 13–10–1964 న ప్రారంభించిన రచన 10–11–1964 న ముగించాను. వ్రాసింది మరల – మరల చదివాను. నాకెందుకో అసంపూర్ణం – అసంతృప్తి అనిపించింది. కొన్ని సంశయాలు ఏర్పడ్డాయి. లోపాలు అనిపించాయి. వాస్తవంగా లోపం లేనిది ఉండదు. సాధ్యమైనన్ని తక్కువ లోపాలు ఉండాలని ప్రయత్నం.

వ్రాతప్రతి తీసుకొని ట్రూపు బజారులోని 'ఆంధ్రకుటీరం' చేరుకున్నాను. మాడపాటి హనుమంతరావు వారికి నేనంటే వాత్సల్యం. వారు వింటానన్నారు. కాని నవల సాంతం వినిపించడం సమంజసం కాదు. వారు వయోవృద్ధులు. కార్యవ్యగ్రులు. వారికి సారంగపాణి ఇంటర్‌వ్యూ – మతాంతరీకరణం వినిపించాను.

హనుమంతరావుగారు అది వింటూ ఎక్కెక్కి ఏడ్చారు. వారి స్థితిని చూచి నాకు భయం అయింది. నా వలన ఏదో లోపం జరిగింది అనుకున్నాను. చదవడం ఆపేశాను. ఆంధ్రపితామహులు కన్నీరు అరికట్టలేకపోయారు. లోపలికి వెళ్లారు. ముఖం కడుక్కున్నారు. తువ్వాలుతో తుడుచుకుంటూ వచ్చారు.

"రంగాచార్యా! మతాంతరీకరణము కన్నులకు కట్టినట్లుగా వ్రాసినావు. మంగళ సూత్రము తెంపి మతము మార్చిన అనేక దృశ్యములు నా కనుల ముందు కదలాడినవి. ఏడుపు వచ్చినది. మతాంతరీకరణముతో నాకు అంతగా సంబంధము లేదు. నీవు 'నరేందర్‌జీ'ని కలుసుకొనుము. నేనుకూడ చెప్పెదను" అన్నారు.

నరేందర్‌జీ ఆర్యసమాజం వారు. కాచీగూడ చౌరస్తా దగ్గరి ఆర్యసమాజం కార్యాలయంలో ఉంటారు. వారి దగ్గరికి వెళ్లాను. పరిచయం చేసుకున్నాను. హనుమంతరావుగారు నన్ను గురించి ప్రస్తావించారని నరేందర్‌జీ చెప్పారు. ఆర్యసమాజం వారు హిందీనే తమ భాషగా గుర్తించారు. నరేందర్‌జీకి తెలుగురాదు.

నేను వ్రాసింది తెలుగులో చదివి హిందీలో అనువదించి చెప్పాను. వారు శ్రద్ధగా విన్నారు. ఇలాంటి గ్రంధాలు అవసరం అన్నారు. వారు తమ అనుభవాలను పూసగ్రుచ్చినట్లు చెప్పారు. అవి విని నేను ఆశ్చర్యచకితుణ్ణే అయినాను. వారు కొన్ని సవరణలు సూచించారు. వారు సూచించిన సవరణలు చేశాను. అంతేకాదు, హనుమంతరావుగారినివలె నవలలో నరేందర్‌జీనీ ప్రవేశపెట్టాను.

నిజాం నవాబు – మతాంతరీకరణకు ఒక ప్రభుత్వశాఖనే ఏర్పరచాడు. బహద్దుర్ యార్‌జంగ్ ద్వారా మతాంతరీకరణ ఒక ఉద్యమంగా సాగించాడు. ఆ రోజుల్లో 'ఆర్యసమాజం' మతాంతరీకరణను గట్టిగా ఎదిరించింది. ఉత్తరభారతం నుంచి సహితం కార్యకర్తలను దింపింది. నిజాం నవాబు ముస్లిములుగా మతం మార్చినవారిని 'శుద్ధి' చేసి మళ్లీ హిందువులుగా మార్చారు. ఆ ఉద్యమానికి 'నరేందర్‌జీ' నాయకత్వం వహించారు. ఎంతో కృషి చేశారు. నిజాంను ఎదిరించడం సామాన్యం కాదు. అదీ 1938కి పూర్వం!

గ్రామాల్లో నరేందర్‌జీకి దొరలు, పటేల్ పట్వారీలు సహకరించేవారు కాదు. ప్రభుత్వ భయంతో కనీసం వసతి కల్పించేవారు కారు. అందును గురించి నరేందర్‌జీ చెప్పిన సంఘటనలు వింటే ఆవేశ కావేషాలు కలుగుతాయి. కాలం గతించింది. అది కూడా అర్థం కాదు.

ప్రభుత్వాన్ని సంతోషపరచడానికి పేర్లు సహితం తురక పేర్లు పెట్టుకునేవారు. మహబూబ్ రెడ్డిగారు తమ గ్రామంలో దగ్గరుండి హరిజనులను తురకలుగా మార్పించారు. వారి దగ్గరికి నరేందర్‌జీ వెళ్లారు. హిందూమత ఔన్నత్యాన్ని గురించి ఉపన్యసించారు. రెడ్డిగారి బుర్రకు ఎక్కలేదు. మతం మార్చిన హరిజనుడు దొరవారి పక్కకుర్చీలో కూర్చున్నాడు. తానే సర్కారును అన్నాడు.

మహబూబ్ రెడ్డిగారికి అప్పుడు 'హిందూమతం' అర్థం అయింది. తురకలయిన హరిజనులను హిందువులుగా మార్చడానికి అంగీకరించారు. కాని గప్‌చుప్‌గా జరగాలనీ – సర్కారుకు తెలియకుండా జరగాలనీ – తమ ప్రమేయం ఉన్నట్లు తెలియరాదనీ నరేందర్‌జీని హెచ్చరించారు.

వాస్తవంగా 'పావనం' చేసి శుద్ధికార్యక్రమం నిర్వహించాలి. నరేందర్‌జీకి గ్రామంలో ఆ మాత్రం సహకారం లభించలేదు. వారు హరిజన వాడకు చేరుకున్నారు. హరిజనులతోనే ఉన్నారు. తిన్నారు. పన్నారు. వారికి హిందూమతపు గొప్పదనాన్ని గురించి వివరించారు. వారిని మళ్లీ స్వమతంలోకి రావడానికి ఒప్పించారు! హరిజనులు – తమకు లభించిన అవకాశాలను వదులుకునేట్లు చేయడం సామాన్యం కాదు. నరేందర్‌జీ మంత్రాలు చదివారు. వారివద్ద ఉన్న 'గండిపేట' నీటినే 'గంగాజలం' అని వారిమీద చల్లారు. వారిని మాతృమతంలోకి మార్చారు. ఇలాంటివి వారు ఇంకెన్నో చెప్పారు!

హైదరాబాదు రాజ్యంలో తొలి ఉద్యమం ఆర్యసమాజ ఉద్యమమే! ఆ రోజుల్లో ఆర్యసమాజంతో ప్రభావం కానివారు అరుదు. నేను బాలుడిగా ప్రభావితుణ్ణే అయినాను. ఆనాటి వారు – ఈనాడు ఏ పార్టీలో ఉన్నా – ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆర్యసమాజ ప్రభావితులు అయ్యుంటారు.

మతవాదంతో ప్రారంభం అయిన ఉద్యమం కమ్యూనిస్టు సాయుధ మహా విప్లవంగా పరాకాష్ట చెందడం తెలంగాణ ప్రత్యేకత – విశిష్టత – విప్లవత.

నరేందర్‌జీ కథనాలు విన్న తరువాత రెండు మతాంతరీ కరణాలకు రెండు అధ్యాయాలు విడివిడిగా చేర్చాను. మార్చి, చేర్చి, మరల వ్రాసి శుద్ధప్రతి సిద్ధం చేశాను. నవలకు 'రాతి మనుషులు' అని పేరు పెట్టాను. ఒక వారపత్రికకు నవలల పోటీకి పంపాను. ఆర్థికంగా కూడా అవి నాకు అతిక్లిష్టదినాలు. నాకు ఉన్న నమ్మకం వల్ల నవల బహూమతి సాధించగలదు అనుకున్నాను. ఆర్థికంగా అదుకుంటుంది అనుకున్నాను.

'రాతి మనుషులు' టపాలో తిరిగి వచ్చింది. కనీసం సాధారణ ప్రచురణకూ నోచుకోలేదు. నాకు పత్రిక మీద కోపం రాలేదు. నేను మంచి నవల వ్రాయలేక పోయినందుకు బాధపడ్డాను. నవల వ్రాయలేను అని నిర్ణయించుకున్నాను. 'రాతి మనుషులు' కట్టకట్టి మూలకు వేశాను. అప్పటికి మా ఇంట్లో అలమారీ లేదు. అటకమీద వేశాను. మరిచిపోయాను!

అలా ఉండగా నాకు నార్ల చిరంజీవిగారితో పరిచయం అయింది. వారంటే నాకు బాల్యం నుంచి అభిమానం. మేము బాలసంఘంలో వారిపాట 'బాలసంఘ సభ్యులం – భరతమాత బిడ్డలం' పాడాం. వారు మదరాసులో ఉండేవారు. ఆ మధ్యనే హైదరాబాదుకు మారారు. పంజగుట్ట 'హిందీనగర్' లో ఇల్లుకట్టుకుని ఉంటున్నారు.

1966 లో ఆంధ్రప్రభ సచిత్రవార పత్రికలో 'భాగ్యనగరం' అనే నాటకం సీరియల్‌గా వచ్చింది. అది నార్ల చిరంజీవి రచన. అది గొప్ప నాటకం! చిరంజీవి ఎంతో అందంగా శిల్పీకరించారు. అది చదువుతుంటే ఖులీఖుతుబ్‌షాను మురిపించిన భాగమతి నన్ను మురిపించింది. రచయితను కలుసుకోవాలనే ఆతురత ఎక్కువయింది.

"ప్రియురాలు మరణింప
ప్రియుడు కట్టించె
కన్నీటి కలపోతగా
తాజమహలు
జవరాలి ప్రేమకై
యువరాజు నిర్మించె
పన్నీటి కాన్కగా
భాగ్యనగరమ్ము" అన్నారు చిరంజీవి. వారిని భాగ్యనగరం తాజమహలు కన్నమిన్నగా మురిపించింది! అంత మురిపించనిదే అంతటి మహత్కావ్య ఆవిష్కరణ జరగదు!

భాగ్యనగరం – చిరంజీవి నన్ను అయస్కాంతంగా ఆకర్షిస్తున్నారు. 24 జూలై 1966 అదివారంనాడు బయలుదేరాను. తోవలో జోరున వాన, తడిశాను. తిరిగి వెళ్లదలచలేదు. చిరంజీవి ఇంటికి చేరాను. బెల్లునొక్కాను, వచ్చారు, నమస్కరించాను. పేరు చెప్పాను. "అదిగో చూడండి, బయట పంపుంది. బూట్లు బయట విడువండి. కాళ్లు కడుక్కొని లోన అడుగుపెట్టండి." పరిచయమే లేని నా మీద ఈ పదును

కొంత బాధ అనిపించింది. అయితే అడుగుపెట్టింతరువాత అర్థం అయింది - ఆ ఇల్లు చిరంజీవి మనసులా - అద్దంలా ఉంది.

తొలిచూపులో వలపు. అది ప్రేమికుల మధ్యనే అనేది కావ్య భాష. మా ఇరువురికీ అలాంటి మైత్రి ఒకే క్షణంలో కుదిరింది. చిరంజీవి పొడి తువ్వాలు అందించారు. నాగరత్నమ్మ వదినగారు గరంగరం చాయ్ ఇచ్చారు. చిరంజీవి అప్పటికే నా రచనలు 'దేవుని పేరిట', 'రణభేరి', ప్రభలో వచ్చిన ఉర్దూ కవితల తెనిగింపు చదివారు.

ఆనాడు గంటల తరబడి ఉర్దూ కవితల గురించి మాట్లాడుకున్నాం. బయట వాన - ముందు విస్కీ - ఉర్దూ కవితల వేడి! ఓహ్! అదొక అనుభూతి! అదొక అదృష్టం!! అది అందరికీ అందదు!!!

నాటినుంచి మేము భాయీ - భాయీలమైనాం. 'భాయ్‌జాన్!' అనిపిలుచుకునే వాళ్లం. అది నాకు అందాల కాలం. మానవతా మూర్తులు ప్రాణమిత్రులు చిరంజీవి - గిరి - నరసింహన్‌తో గడిపిన కాలం! ఆ మనుషులు - ఆ పార్టీలు - ఆ మనసులు - ఆ కవితలు! ఆ మైత్రి - అ స్నేహం - ఆ దోస్తీ అందరికీ లభించదు! ఎప్పటికీ ఉండదు!! ముగ్గురూ నన్ను విడిచి వెళ్లిపోయారు! నేడు నేను మాత్రమే మిగిలాను!!

*బేఖయిఫ్ జిందగీ హై జియేజారహా హూఁ*
*షీషా హై ఖాలీ ఫిర్ భీ పియే జారహా హూఁ*

(జీవితం రసహీనం అయింది. అయినా జీవిస్తున్నాను. గ్లాసు ఖాళీగా ఉంది. అయినా తాగేస్తున్నాను.)

1966 జూలై 24 తరువాత భాయ్‌జాన్ ఇంటికి వెళ్లని రాత్రిలేదు. ఆఫీసునుంచి అటే వెళ్లేవాణ్ణి. అక్కడ సుమారు రోజూ పార్టీలే! అనేకమంది మిత్రులు. చర్చలు - ముఖ్యంగా నేను చదివే ఉర్దూ కవిత - అదొక మత్తు, అదొక మైకం, వహ్ ఎక్ నషా హై!

అలా సాగిపోతున్నపుడు ఒకనాడు భాయ్‌జాన్‌తో అన్నాను, నేనొక నవల వ్రాశానని - అది చూడాలని. అదీ భయం భయంగానే అన్నాను.

"భాయ్‌జాన్ సామాన్య నవల నహీ లిఖ్తే. అది గొప్ప నవలే అయ్యుంటుంది అంటే ఉర్దూలో ఏమనాలి?" అడిగారు చిరంజీవి.

మరుసటిరోజు 'రాతి మనుషులు' వ్రాత ప్రతి భయంగానే భాయ్‌జాన్‌కు అందించాను. ఏవో పనులవల్ల రెండురోజులు అటు వెళ్లలేకపోయాను. మూడవ సాయంత్రం వెళ్లాను.

"భాయ్‌జాన్! ఎహ్‌తో బహుత్ అచ్ఛీ నవలా హై. నిన్నటినుంచి నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. ఎప్పుడు చెప్పుదామా అని ఎదిరి చూస్తున్నాను. నవలలో మునిగిపోయాననుకో. పాత్రలు - సంఘటనలు నన్ను వదలడం లేదు. వనజ - మంజరి - లంబాడి లక్ష్మి మనసులోనే నిలిచిపోయారు. భాయ్‌జాన్! నాకు చాల గర్వంగా ఉంది. నా తమ్ముడు ఇంత గొప్ప నవల వ్రాశాడు! తెలంగాణాను ఆవిష్కరించాడు" ఇంకేమేమో పొగిడారు. వచ్చిన వాళ్లందరికీ వివరించి చెప్పారు.

అందంగా ఉన్నావంటే అతివకూ - రచన బాగుందంటే రచయితకూ పొంగిపోయే ఆనందం కలుగుతుంది!

తన బిడ్డ బాగుందంటే తల్లి పొంగినట్లు నేనూ పొంగిపోయాను.

"నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన ముయ్యెల మంచమొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకిన గాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే?"

అన్నారు మనుచరిత్రము అను అమృతగుళిక ఆంధ్రులకు అందించిన ఆంధ్రకవి తాపితామహ అల్లసాని పెద్దన.

అలాంటి అవకాశాలు మహారాజులను ఆశ్రయించిన అల్లసాని వంటివారికి సాధ్యం. రసిక శిఖామణి శ్రీకృష్ణదేవరాయలు ఎదురైనచో దనమదకరీంద్రము నిల్పి కేలూత యొసగి ఎక్కించుకొనియె - అటువంటి రాజులు అరుదు.

రచన సాగిస్తున్నప్పుడు అంతకు మించిన భోగాలు చవిచూచిన అన్నగారు ఆత్రేయ! సినీమా రచనలో ఉన్నప్పుడు అన్నగారు మహారాజు. వారికి తెల్ల ఏనుగు కావాలన్నా దిగేది! 'లేఖక పాఠకోత్తముల్' అన్నాడే అల్లసాని - అది అక్కడ చూశాను. ఆత్రేయగారు చెపుతుంటే వ్రాసేవారు మంచివాక్యం పడగానే మురిసిపోయేవారు. అన్నగారు అదొక విశేషంగా నవ్వేవారు. తరువాత మరింత అందమైన సంభాషణ వచ్చేది.

అలాంటివి ప్రజా రచయితలకు లభించవు - వారు ఆశించరు. 'ఉన్నవ' వారు మాలపల్లి నవల జేలులో రచించారు. ప్రేమ్‌చంద్ 'మైఁ కలమ్‌కా మజ్దూర్ హూఁ' - నేను కలం కూలిని అన్నాడు. అన్ని పుటలు వ్రాస్తేగాని అన్నం తినేవాడు కాదు. **ప్రజారచయితలను ప్రజలు ఆదరించరు. ప్రభుత్వం పట్టించుకోదు! అయినావారు రచనలు చేస్తూనే ఉంటారు! వారి స్పందన ఆవేశం అలాంటిది!**

నేను 'నిరుపహతిస్థలంబు' ఆశించలేదు. ఆర్థికంగా అత్యంత క్లిష్టపరిస్థితుల్లో "రాతి మనుషులు" రచించాను. నాలోని ఆవేదన, ఆవేశం, స్పందన నాతో రచన చేయించాయి. **మహాకావ్యాలూ - మహాకార్యాలూ క్లిష్టపరిస్థితుల్లోనే ఉద్భవిస్తాయని నా నమ్మకం.** అయితే కనీసం 'పాఠకోత్తముల్' ఉంటే రచయితకు ప్రోత్సాహం - ఉత్సాహం కలిగిస్తారు. అలాంటి ఉత్సాహం భాయ్‌జాన్ చిరంజీవినుండి నాకు లభించింది. అదీ అదృష్టం. అది లేకుంటే "చిల్లరదేవుళ్లు" వెలుగు చూసేదికాదు. ఆంధ్రజాతికి ఒక మంచి నవల లభించకుండాపోయేది!

"భాయ్‌జాన్! నేను నీ రచనా శిల్పంలో కొట్టుకుపోయాను. నీవు చూపిందే తెలంగాణం అనుకున్నాను. నీ పాత్రలు మాట్లాడిందే తెలంగాణ భాష అనుకున్నాను. వాస్తవంగా తెలంగాణం విషయాల్లో అనుభవం ఉన్నవారు చూడడం మంచిది. దేవులపల్లి రామానుజరావుగారికి ఇచ్చి చదివించు" అని సూచించారు.

భాయ్‌జాన్ సూచన నాకు విసుగనిపించలేదు. వన్నె తెచ్చేదిగా అనిపించింది. సుర్ఖ్‌రూ హోతాహై ఇన్సాఁ ఠోకరే ఖానేకె బాద్ - రంగ్‌లాతీహై సోనా పత్థరపె

ఫిస్నీకెబాద్ – దెబ్బలు తింటేనే నరుడు మొనగాడు అవుతాడు. రాతిమీద రాస్తేనే బంగారం వన్నె పెరుగుతుంది.

దేవులపల్లి రామానుజరావుగారు తెలంగాణంలో తెలుగుకోసం – ఆంధ్ర సారస్వత పరిషత్తు ద్వారా అనంతమైన సేవ చేశారు. వారు అప్పుడు సాహిత్య అకాడమీ కార్యదర్శి. వారికి మా కుటుంబం విషయంలో అభిమానము – అప్యాయతా ఉన్నాయి. వారు నా వ్రాతప్రతి అందుకున్నారు. 'కవిగా స్థిరపడుదువు అనుకున్నాను. నవల వ్రాసినావు. మంచి పనిచేసినావు' అని చదవడానికి తీసుకున్నారు.

తరువాత వారికోసం బొగ్గులకుంటలోని 'ఆంధ్రసారస్వత పరిషత్తు' కార్యాలయానికి వెళ్లాను. అప్పుడు విప్లవమూర్తి దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు వారిముందు కూర్చుని ఉన్నారు. అతి సామాన్యంగా ఉన్నారు. వారిని దర్శించడం నా భాగ్యంగా భావించాను.

రామానుజరావుగారు నన్ను చూచారు. "రావయ్యా రంగాచార్యులూ! నీవు నిస్సందేహముగా గొప్ప నవల వ్రాసినావు. ఇది తెలంగాణమునకే కాదు, ఆంధ్రజాతికే తలమానికము" అని అత్యంత ఉత్సాహం కనబరచారు. వారు అతిరేకంలో కుర్చీలో ఊగారు. బల్లమీద వ్రేళ్లు ఆడించారు. "ఇదిగో, రంగాచార్యులు తెలంగాణమునకు మీ అందరికన్న ఎక్కువ సేవ చేసినాడు" అని వెంకటేశ్వరరావుగారితో అన్నారు.

రామానుజరావుగారి మాటలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. గుండె నిండి పగిలేట్లుంది. అలాగ ఉండగా వెంకటేశ్వరరావుగారు నా వీపు నిమిరారు 'రామానుజుడు తప్పచెప్పడు. నిజంగా గొప్పనవల వ్రాసి ఉంటావు' అన్నారు. అప్పుడు నా కనులు చెమ్మగిల్లాయి. కన్నీరు బయటపడే దశలో నేను బయటపడ్డాను.

పక్కనున్న హోటలుకు వెళ్లాను. చాయ్ – టీ – త్రాగాను. వెంట వెంట రెండు సిగరెట్లు కాల్చాను. ఆఫీసుకు వెళ్లలేదు! పంజగుట్టలో పడ్డాను. భాయ్‌జాన్ జరిగింది విన్నారు. పొంగిపోయారు. నన్ను కౌగిలించుకున్నారు. 'ఇది మనం గర్వించదగిన విషయం – దావత్ హోనా' అని "చూశావా నీ మరిది గొప్ప నవల రాశాడు. ఏం వండిపెడతావో పెట్టు" అని వదినతో అన్నారు.

నాగరత్నమ్మ వదిన 'వండనలయదు వేవురు వచ్చిరేని' అని, ఎప్పుడు వెళ్లినా ఏదో ఒక కొత్త వంటకం!

ఆరోజు మరిన్ని వంటకాలు చేసింది. పట్టపగలే పార్టీ! ముందు విస్కీ వంటకాలు, నవలమీద నిరంతర చర్చ! అదొక ఊపు!! అది మహదానందం!!!

*జహాఁకొ మారా జిగర్ కె గజలోఁనే*
*ఔర్ జిగర్ కొ మారా షరాబ్ నె*

'జిగర్' గజళ్లు లోకాన్ని కొట్టేశాయి. మరి మద్యం జిగర్‌ను కొట్టేసింది! ('జిగర్' గజల్ చక్రవర్తి.)

పీనా న మనాహై న పిలానాహి మనాహై
పీనె కె బాద్ హోష్ మె ఆనాహి మనాహై

(త్రాగడం తప్పకాదు. త్రాగించడం తప్పకాదు. త్రాగింతరువాత తెలివితో ఉండడం మాత్రం తప్ప.)

షీషామస్త్, బాదాయ్ మస్తీ, హుస్నమస్త్, ఇష్కమస్త్
ఆజ్ పీనే కా మజా పీకె బహక్ జానేమైహై

(మధువు మత్తు, మబ్బులు మత్తు, అందపు మత్తు, వలపు మత్తు, ఇవాళ తాగడంలో మజా తాగిపడిపోవడంలో ఉంది.)

అదిగో, అలాంటి మత్తులో భాయ్‌జాన్ "చిల్లర దేవుళ్లు" అన్నారు. అది నా తొలినవలకు నామకరణ మహోత్సవం!

ఆ ఊపులో చిరంజీవి అనేక పేర్లు సూచించారు, వ్రాశారు, కొట్టివేశారు. "చిన్న చిన్న రాళ్లు – చిల్లరదేవుళ్లు" పల్నాటిని గురించిన శ్రీనాథుని పద్యపాదం. "చిల్లరదేవుళ్లు" మా ఉభయులకూ – నవలకు – సార్థకనామం అనిపించింది. స్థిరపరచాం. తరువాత దేవులపల్లి వారి సహితంగా అందరూ "చిల్లరదేవుళ్లు" పేరు ఆమోదించారు.

పేరు పెట్టడాన్ని గురించి ఏ. జి. గార్డనర్ ఆంగ్లంలో ఒక చక్కని వ్యాసం వ్రాశారు. పేరు పెట్టడమూ ఒక కళయే! అది ఆకాశంనుంచి రాలిన తాజా చినుకులా ఉండాలి. "చిల్లర దేవుళ్లు" అలాగే అనిపించింది.

మనం కన్న పిల్లల్లో అందమైన వారుంటే అందుకు మన ప్రత్యేక కృషి ఏమీ ఉండదు. అయితే వారు ముద్దు వస్తారు. "చిల్లర దేవుళ్లు" పాత్రలన్నీ నా సృష్టియే! అయినా వనజ నాకు ముద్దొస్తుంది. ఆమె ఎదిగిన తీరు నన్ను చకితుణ్ణి చేస్తుంది. వహ్ ధూల్‌కా ఫూల్ హై! ఆమె మట్టిలోని పుష్పం.

'చిల్లర దేవుళ్లు' రెండు కాపీలు టైపు చేయించాను. భాయ్‌జాన్ సలహామేరకు విశాలాంధ్ర ప్రచురణలకు – ఎమెస్కో పాకెట్ బుక్స్‌కు పంపించాను.

1969 లో వారి ఇద్దరినుంచీ ఉత్తరాలు వచ్చాయి. విశాలాంధ్ర విజ్ఞాన సమితి పక్షాన్నే అనుకుంటా 'ప్రగతి' అనే ఒక ప్రగతి శీల వారపత్రిక ప్రచురించ తలపెట్టారు. దానికి ప్రఖ్యాత కమ్యూనిస్టు నాయకుడు – దేశభక్తుడు – వయోవృద్ధుడు – సాహితీవేత్త మద్దుకూరి చంద్రశేఖరరావుగారు సంపాదకులు. 'ప్రగతి' తొలి సంచికనుంచి "చిల్లర దేవుళ్లు" సీరియల్‌గా ప్రచురిస్తామని చంద్రంగారు స్వహస్తంతో ఉత్తరం వ్రాశారు. అది నాకు గర్వకారణం! ఎమెస్కో అధిపతి M. N. రావుగారు పుస్తకంగా ప్రచురిస్తామని వ్రాశారు.

అసలు అచ్చు దుస్తరం అయింది. ఇప్పుడు ఇద్దరు ప్రచురిస్తామంటున్నారు. దీన్నే కాలం అనుకూలించడం అంటాం. కాలం అనుకూలించినపుడు అన్నీ కలిసి వస్తాయి! కాలం వ్యతిరేకించినపుడు ఎన్ని చేసినా ఫలితం ఉండదు. 'కాలోయం దురతిక్రమః' అంటాడు వాల్మీకి. కాలం అతిక్రమించరానిది!

భాయ్‌జాన్ సలహామేరకు సీరియల్‌గా ప్రచురించమని చంద్రంగారికి సవినయంగా జాబు వ్రాశాను. సీరియల్ ప్రచురణ తరువాత ప్రచురించవలసిందని రావుగారిని కోరాను. వారు అంగీకరించారు.

"చిల్లర దేవుళ్లు" ప్రగతి వారపత్రికలో 21.3.69 నుంచి 13.6.69 వరకు వరసగా పదమూడు వారాలు సీరియల్‌గా వచ్చింది. Coincidence కు సరియైన తెలుగు పదం తెలియదుగాని సరిగ్గా ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతంగా ఉన్నప్పుడు

'చిల్లర దేవుళ్లు' సీరియల్‌గా వచ్చింది. అయినా, ఎలాంటి ద్వేషకావేషాలు లేకుండా ఇరుప్రాంతాలవారు అభిమానించారు.

మద్దుకూరి చంద్రశేఖరరావుగారు 2.3.1970న వ్రాసినలేఖలో "మేధావులు – ముఖ్యంగా తెలంగాణా మాండలిక పదాలను వ్యవహారికభాషను అవగాహన చేసుకున్నవారంతా గొప్పగా ఉందన్నారు. తరం క్రిందటిరోజుల్లో తెలంగాణా గ్రామీణ జీవితాన్ని ప్రతిభావంతంగా చిత్రించినందుకు రచయితను అభినందించారు" అన్నారు.

డి. రామలింగంగారు ఇలా వ్రాశారు:

"తెలంగాణా ఫ్యూడల్ వ్యవస్థలోని social life ను మీరు చాలా వాస్తవంగా depict చేశారు. నా దృష్టిలో ఇది ప్రజలమనిషికన్న ఉత్తమమైన నవల. ముందెప్పుడైనా మీ నవల social history of Andhra వ్రాసేవారికి ఎంతో బాగా ఉపకరిస్తుందనుకుంటాను."

మహీధర రామమోహనరావుగారు:–

"తెలంగాణా గ్రామజీవితం, అక్కడ-రాజకీయాలు, సామాజిక – సంప్రదాయాలు, అర్థిక పరిస్థితులు, భాష చక్కగా ఉన్నాయి. నవల చదివిస్తూంది. పాఠకుణ్ణి ఆకట్టుకుంటుంది, అభివాదనలు."

ప్రగతిలో సీరియల్ కావడం ప్రారంభం అయిన మరుసటివారం నుంచే పాఠకులనుండి ప్రశంసలు ప్రారంభం అయినాయి.

"చిల్లర దేవుళ్లు నవలా ప్రచురణ సకాలంలో ఎత్తుకోవడం గమనార్హం. తెలంగాణా నాయకత్వం ఎలా ఉందో చూపడానికి, దాని పునాదులు ఇలాంటివని చూపిన రచయిత ధన్యుడు. జాతి చరిత్రకు దర్పణం పట్టిందీ నవల. అయితే, చివరి అధ్యాయంలో సినీమా ధోరణిలో దిగిపోయింది. పాణి జన్మరహస్యం విడతీయకుండా ఉంటే బావుండును." ఉషశ్రీ – విజయవాడ.

"ప్రపంచ సాహిత్యంలో అత్యున్నతస్థాయిని అందుకున్న టాల్‌స్టాయ్ విరచిత నవజీవనం – Ressurection తరువాత మరల అంతటి కళాత్మక శిల్పాన్ని అందుకుంటే అది "చిల్లరదేవుళ్లు" నవలకే దొరుకుతుంది. అత్యున్నతస్థాయిలో వెలువడుతున్న "చిల్లర దేవుళ్లు" తెలుగుభాషకు ప్రపంచ స్థాయిలో సముచితస్థానాన్ని సంపాదించి పెట్టడమేకాకుండా, మున్ముందు పరిఢవిల్లే రచయితలకు ఒక గీటు రాయిగా పనిచేసి అభ్యుదయకర, విప్లవాత్మక మార్పులను సాహిత్యంలో ప్రవేశపెట్టగలదని విశ్వసిస్తున్నాను" – అ. చంద్రయ్య, రూర్కెలా.

ఇలాంటి అనేక ఉత్తరాలు వచ్చాయి. అవికాక వ్యక్తులు వ్యక్తిగతంగా నామీద కురిపించిన అభినందన పరంపర నన్ను ఊపిరి పీల్చనివ్వలేదు.

"చిల్లర దేవుళ్లు" నవలను 'నిజాం నిరంకుశపాలనలో ఊరూ పేరూ మాసిన ఆంధ్రజాతికి ఒక తీరూ తెన్నూ కల్పించిన ఆంధ్రపితామహ' పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి అంకితంగా సమర్పించాను. అప్పటికి వారు జీవించి ఉన్నారు.

నవల సీరియల్‌గా రావడం పూర్తిఅయి వారికి అంకితం ఇచ్చిన వాక్యాలు ప్రగతిలో ప్రచురణ జరిగినపుడు వారు జీవించి ఉన్నారు. 11 నవంబరు 1970 న

వారు పరమపదించారు. వారిని గురించి నేను వ్రాసిన "ఆంధ్రపితామహ" వ్యాసం 15–11–70 నాటి విశాలాంధ్రలో వచ్చింది. దాన్ని "పరిశీలన"లో చేర్చాను.

పూజ్యులు – పెద్దలు దేవులపల్లి రామానుజరావుగారు "నిన్నటి యదార్థము – నేటి చరిత్ర"గా 'చిల్లర దేవుళ్లు'కు ఒక సుదీర్ఘమైన తొలిపలుకు వ్రాస్తూ 'ఈ నవలలో కేవలము అమానుషమైన ప్రవర్తనేకాక హృదయాహ్లాదకరమైన విషయములు కూడ ఎన్నో ఉన్నవి' అన్నారు.

ఇది Coincidence సహపరిణామం కావచ్చు – 1949లో మా అన్నయ్య దాశరధి తొలి కావ్యసంకలనం 'అగ్నిధార'కు రామానుజరావుగారే తొలిపలుకులు సమకూర్చారు. వారు తరచుగా 'దాశరధి సోదరుల తొలి పుస్తకములకు నేనే తొలి పలుకు సమకూర్చినాను' అని చెపుతుండేవారు. నేను నా 'తొలినవలకు' అని సవరించాల్సి వచ్చేది.

ఎమెస్కోవారు బాపూ ముఖచిత్రంతో అందంగా "చిల్లర దేవుళ్లు" నవల పుస్తకరూపంలో 1969 డిసెంబరులో ప్రచురించారు. బాపూగారు లోనవేసిన ఒక కంటి కన్నీటిచుక్క రాలనున్న 'వనజ' బొమ్మ కలచివేస్తుంది. వెల రెండు రూపాయిలు మాత్రమే కావడంవల్ల పుస్తకం బహుజనాదరణ పొందింది. పత్రికల్లో చాల చక్కని సమీక్షలు వచ్చాయి. పుస్తకాన్ని గురించి ప్రత్యేక వ్యాసాలూ వచ్చాయి. వాటిలో 'సరికొత్త అవిష్క్రియ' అన్న ముకురాల రామారెడ్డిగారి వ్యాసం మనసులను కదిలించేట్లుంది.

నవల చదివిన సోదరుడు సి. నారాయణరెడ్డిగారి లేఖ –

"చిల్లరదేవుళ్ళు" ఒక్క బిగిన చదివేశాను. అది నవల కాదు. యదార్థ జీవితాల రసవత్ చిత్రణం. వాస్తవికత పేరుతో బొమ్మలు తీయడంతోనే ఊరుకోక ఒక సమగ్ర జీవితానికే బొమ్మగీసి చూపావు నీవు. ఆ పాత్రలు, ఆ సన్నివేశాలూ, ఆ భిన్న మనస్తత్వాలూ, అన్నిటికీ పూసల్లో దారంలాగా ఉన్న ఆ తెలంగాణా మాండలిక శైలి. తెలుగు నవలారంగంలో నీ రచన మైలురాయి."

అయితే సమీక్షకులు చాలమందికి ముగింపులో సారంగపాణి రామారెడ్డిగారి అల్లుడు కావడం నచ్చలేదు. అది సినీమాటిక్‌గా ఉందని విమర్శించారు. ప్రచురణకు ముందే భాయ్‌జాన్ – చంద్రంగారు – ఎమెస్కో సంపాదకులు వెలిబుచ్చారు. అందుకు నా కారణాలు తెలియపరచాను. అప్పుడు వారు సమాధాన పడ్డారు. మార్పు చేయమని కోరలేదు. ఈ మధ్య కొందరు అసలు నవలను వదిలి, ముగింపును పట్టుకొని – నేను కులాంతర వివాహాలు వ్యతిరేకిని అనుకుంటున్నారు. అందువలన వివరణ:

1. నావి కథానవలలు కావు. ప్రజాజీవన చిత్రణ వాటి ముఖ్య ఉద్దేశం. కథ మాధ్యమం మాత్రమే!
2. 'చిల్లర దేవుళ్లు' 1938కి పూర్వపు తెలంగాణ ప్రజాజీవిత చిత్రణ. అప్పటికి తెలంగాణంలో సంఘసంస్కరణ ఉద్యమం లేదు. కులాంతర వివాహాల ప్రసక్తి లేదు. అలాంటపుడు వాటిని చేర్చడం వాస్తవానికి విరుద్ధం అవుతుంది.
3. నవల మొత్తంలో సారంగపాణి మనసున్న, సంస్కారం గల పాత్ర. అతడు నేటి ఆంధ్రప్రాంతం అయిన బ్రిటిషిండియా నుంచి వస్తాడు. పెరిగిన వాతావరణాన్ని

బట్టి సంస్కారం కలుగుతుంది అని చెప్పడానికి అతను తెలంగాణంవాడు కావడం అవసరం.

4. మంజరి పాణిని మనసున్నవానిగా ప్రేమించింది. ప్రేమకు కుల, మతాల ప్రసక్తి లేదని నిరూపించింది. అతడు ఆమెకు బావకావడం యాదృచ్ఛికం.
5. 'చిల్లర దేవుళ్లు' ప్రేమకథ కాదు. పెళ్లి 'చిల్లర దేవుళ్లు' నవల ప్రధానాంశం కాదు.
6. నేను మానవతా వాదిని. నాకు కుల, మత, ప్రాంత, దేశ సరిహద్దులమీద సహితం నమ్మకం లేదు. ఇది నా రచనల్లో అవగతం అవుతుంది.

"చిల్లర దేవుళ్లు" ఆ రోజుల్లో సాహిత్యవర్గాల్లో చర్చనీయాంశం అయింది. నోరి నరసింహశాస్త్రిగారు మా అన్నయ్యతో 'మీ తమ్ముడు గొప్ప నవల వ్రాశాడు. అకాడమీ అవార్డు దానికి అందకుండా అనేకమంది అడ్డంకులు తెస్తున్నారు. మీ తమ్మునికి అన్యాయం జరుగుతుందని బాధగా ఉంది' అన్నారట. "మా తమ్ముడు అవార్డులు, గివార్డులకు బాధపడేవాడు కాడు. మీరు బాధ మానండి" అన్నారట మా అన్నయ్య. వారు చెపితే నాకు తెలిసింది.

ఒక సాహిత్యసభలో బోయి భీమన్నగారు కనిపించారు. "రంగాచార్యూ! తెలుగువాడవై చెడ్డావయ్యా! 'చిల్లర దేవుళ్లు' నోబెల్ ప్రైజు రావలసిన నవల" అన్నారు. ఇంతలో మా అన్నయ్య వచ్చి 'మా తమ్ముడు' అని పరిచయం చేశారు. అందుకు భీమన్నగారు "దాశరథీ! మీ తమ్ముణ్ణి నీవు పరిచయం చేయాల్సిన అవసరం లేదు. మరి నాలుగు రోజులుపోతే నిన్ను రంగాచార్యుల అన్నగా పరిచయం చేయాల్సి వస్తుంది. అతను అంతగా ఎదుగుతున్నాడు" అన్నారు.

1970 డిసెంబరు 3 వ తేదీన ఆకాశవాణి తెలుగు వార్తల్లో "చిల్లర దేవుళ్లు"కు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతి ప్రకటించినట్లు వచ్చింది. అప్పుడు వానమామలై వరదాచార్యులవారు మా ఇంట్లో ఉన్నారు. మేమందరం ఎంతో సంతోషించాం.

ఆ రోజుల్లో అకాడమీ అవార్డు రావడం సామాన్యం కాదు. ఆకాశవాణి ఢిల్లీ నుంచి వచ్చే ఆంగ్లవార్తల సహితంగా అన్నింటిలో ప్రసారం చేసింది. పత్రికలు ప్రముఖంగా ప్రచురించాయి. అనేకమంది అభినందన సందేశాలు పంపారు.

ఆ సంవత్సరం అనేకమంది పెద్దలతోపాటు నాకు బహుమతి రావడం అదృష్టం – గర్వకారణం. 1970–71 లో కథానికకు మల్లాది రామకృష్ణశాస్త్రిగారికి, 2. సాహిత్య విమర్శకు తిరుమల రామచంద్రగారికి, 3. కవితకు కుందుర్తి ఆంజనేయులుగారికి 4. నాటకంకు మోదుకూరి జాన్సన్‌గారికి లభించాయి.

చిల్లరదేవుళ్లు బహుమతి ప్రత్యేకతలు:

1. రచయిత వయసులో చిన్న.
2. తొలి నవలకే బహుమతి.
3. ప్రచురించిన సంవత్సరమే బహుమతి.

అవార్డు రావడంతో భాయ్‌జాన్ పొంగిపోయారు. ఉప్పొంగిపోయారు. ఆ రాత్రి మంచి పార్టీ ఏర్పాటు చేశారు. మిత్రులు ఎస్. బి. గిరి, నరసింహన్‌తోపాటు అనేకమంది మిత్రులు పాల్గొన్నారు. ఆనందపు గడియలు రెక్కలు వచ్చి ఎగిరేయి. అర్ధరాత్రి అయింది. తేదీ మారిందీ తెలియలేదు.

31 జనవరి 1971 ఆదివారం సాయంత్రం ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో బహూమాన ప్రదాన సభ జరిగింది. వేదికమీద ఆ సంవత్సరపు విశిష్టసభత్వాలు అందుకున్న సాహితీపితామహులు 1. త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి, 2. డాక్టర్ నేలటూరి వెంకటరమణయ్య, 3. దువ్వూరి వెంకటరమణశాస్త్రి, 4. వానమామలై వరదాచార్యులవార్లు బహుమతులు అందుకోవలసిన మేము ఆసీనులం అయినాం. అకాడమీ అధ్యక్షులు – ఉత్తరప్రదేశ్ గవర్నరు బెజవాడ గోపాలరెడ్డిగారు బహూమాన ప్రదానం చేశారు.

నేను కృతజ్ఞలు తెలియపరుస్తూ 'ఈ గౌరవం నాదికాదు తెలంగాణ జనజీవితానిది' అన్నాను. తెలంగాణం సాహిత్యానికి సారవంతం అనీ, రచయితలు ఆ జీవితాన్ని భద్రపరచాలనీ విన్నవించాను.

సభ ముగిసింది. అనేకమంది మిత్రులు కౌగిలించుకున్నారు. అభినందించారు. నాటి ఆత్మీయత అక్షరానికి అందదు.

అవార్డు వచ్చింది. ఆ సందర్భంగా ఇంటర్వ్యూ ఏర్పాటు చేశారు. ఆకాశవాణి వారు. అదే నేను ఆకాశవాణి స్టూడియోలో తొలిసారి అడుగుపెట్టడం. దివి వెంకట్రామయ్యగారు యువకులు. వారు ఇంటర్వ్యూ చేశారు. ఇంకా రికార్డింగ్ మొదలుకాలేదు. వెంకటరామయ్యగారు 'చిల్లర దేవుళ్లు' గురించి నిర్విరామంగా మాట్లాడారు. నా నవల నచ్చినందుకు కృతజ్ఞతలు అన్నాను. వారికి చురుకు కోపం వచ్చింది. "ఇది మీ నవలేమిటి? మా అందరి నవల" అన్నారు. నా నవల మీద అంతటి అభిమానాన్ని తట్టుకోలేకపోయాను. గొంతు పూడింది! కనులు చెమ్మగిలాయి!! తరవాత సర్దుకున్నాను. సుదీర్ఘ ఇంటర్వ్యూ రికార్డయింది. తెలంగాణాను గురించి – నవలను గురించి ఆసక్తి కలిగించే అనేక ప్రశ్నలు అడిగారు. వనజ పాత్రను మలచడం గురించి అడిగారు.

నా చిన్నతనంలో చినగూడురులో – మా ఇంటి ప్రక్కన అమృతపాణి ఉండేది. ఆమె కూతురు నాతో ఆడుకునేది. ఆమె ఆటకు రావడం చప్పున మానేసింది. కారణం రజస్వల కావడం. తరవాత ఒకనాడు గడీనుంచి మనుషులు వచ్చారు – ఆమెను తీసికెళ్లడానికి. ఆమె నిరాకరించింది, ఏడ్చింది, మొత్తుకున్నది, దాగింది. అయినా సాగలేదు. గడీ మనుషులు – ఆమెను, గింజుకుంటుండగా పట్టుకుపోయారు. అంత బాల్యంలోనూ నాకు అదెందుకో అమానుషం అనిపించింది. ఆమె నా మనసులో నిలిచిపోయింది. నా మనసునుంచి వనజగా అవతరించింది! ఆమెమీద నాకు ఉండిన అపార సానుభూతి వనజను అంతటి అంతస్తుకు పెంచేటట్లు చేసింది.

తెలంగాణ పరిస్థితులు వివరించిన ఆ రేడియో ఇంటర్వ్యూకు ఎంతో స్పందన వచ్చింది. అనేక మనసులు కరిగాయి! అనేక ఉత్తరాలు వచ్చాయి!! కలకాలపు పరిచయం ఉన్నా భాయ్‌జాన్ కంట తడిపెట్టారు!!!

ఆకాశవాణి వారు 'చిల్లర దేవుళ్లు' నాటకంగా ప్రసారం చేస్తామన్నారు. తెలంగాణ మాండలికపు తొలినాటకం అది! నవలను నాటకీకరించి ఇచ్చాను. ఈ విషయంలో 'హరి' నాకు కొంత సహకరించారు. శారదా శ్రీనివాసన్ నాటకం నిర్వహిస్తున్నారు. వారికి మాండలికం కొత్త. నేను పూర్తి సహకారం అందించాను.

తెలంగాణం పలుకు పలుకగల కళాకారులను పిలిపించారు. తెలంగాణంలో పుట్టి పెరిగినవారే యాస పలుక లేకపోయారు! రేడియో–పత్రికలు అంత ప్రభావం వేశాయన్న మాట! స్త్రీపాత్రలకు సంబంధించినంతవరకు రావి భారతి **వాణి,** L.K. రెడ్డి తప్ప యాస చెప్పగలవారు దొరకలేదు. ఆ ఇద్దరి స్వరాలూ వనజ వయసుకు సరిపోయేట్లు లేవు! వనజ ప్రశ్నార్థకంగా మిగిలిపోయింది.

నేను శారదను వనజ పాత్ర ధరించమన్నాను. 'నవల చదివినపుడు వనజ పాత్ర నన్ను అనేకసార్లు ఏడిపించింది. అది నాకు ఇష్టం అయిన పాత్ర. అయితే నాకు పలుకుబడి రాదు. పైగా 'తెలంగాణంవాళ్ళు దొరకలేదా!' అని ప్రత్యేక తెలంగాణీయులు గొడవచేస్తారు' అన్నారు. నేను శారదగారిని వప్పించాను. వారికి నుడికారం నేర్పాను. కళ శారద గొంతులో కాపురం పెట్టింది. ఆమె అద్భుతంగా చెప్పింది.

భానుప్రకాశ్ దొరగానూ – సురమౌళి కరణంగానూ – రావి భారతి దొరసానిగానూ – వాణి L.K. రెడ్డి తాయారుగానూ – శారదా శ్రీనివాసన్ వనజగానూ నటించారు. మిగతా పాత్రలు ముఖ్యంగా పాణి – మంజరి వేసినవాళ్ళ పేర్లు గుర్తులేవు.

'చిల్లరదేవుళ్లు' రేడియో నాటకం నా సమక్షంలో రికార్డయింది. అనేకసార్లు మార్పులు చేర్పులు చేయాల్సివచ్చింది. మూడు రోజులు వరుసగా శ్రమ పడిం తరువాత 'చిల్లరదేవుళ్లు' ఒక రూపం దాల్చారు! వాళ్లు మొండివాళ్లండీ! వాళ్ళను దారికి తేవడం కష్టం!!

నాటక ప్రసారానికి తేదీ నిర్ణయం అయింది. కార్యక్రమం అకాశవాణిలోనూ 'వాణి'లో ప్రకటించబడింది. ఆనాడు అందరం రేడియోల ముందు కూర్చున్నాం. 'ప్రకటించిన కార్యక్రమానికి బదులు' అని వేరే కార్యక్రమం వచ్చింది. ఆశకు అది అశనిపాతం! ఫోనుకు అకాశవాణిలో ఎవరూ అందుబాటులో లేరు. అప్పటికి మిగతా వారికి ఫోనులు లేవు. ఫోను Luxury అయిన రోజులవి!

తెల్లవారి రేడియో స్టేషనుకు వెళ్లాను. డెరెక్టరు చెప్పింది విన్నాను. చకితుణ్ణి అయినాను. 'నాటకం మొత్తంలో మనసున్న పాత్ర సారంగపాణిది మాత్రమే! అతడు అంధ్రప్రాంతంవాడు. తెలంగాణంలో మనసున్నవాడే లేడా అని ప్రత్యేక తెలంగాణవాదులు అల్లరిచేసే అవకాశం ఉంది. అందువల్ల ఢిల్లీవారు నాటకం ఆపివేయవలసిందని ఆదేశాలు పంపారు' అన్నారు.

డైరెక్టర్‌కు అర్థం చేయించడానికి నా తలప్రాణం తోకకు వచ్చింది. సారంగపాణి తెలంగాణంలో పుట్టాడు. బెజవాడలో బాలుడుగా తప్పిపోయాడు. విద్యాబుద్ధులు అక్కడ నేర్చుకున్నాడు. మళ్ళీ తెలంగాణానికే వచ్చాడు. సంస్కారం పెరిగిన వాతావరణం మీద ఆధారపడుతుందని నిరూపించడానికి అలా చేశానని చెప్పాను. ఈ విషయం నవలలోనూ – నాటకంలోనూ స్పష్టంగా ఉందని చూపాను. వారికి కొంత అర్థం అయింది. రికార్డు విన్నారు. డైరెక్టర్ కదా! ఆ సన్నివేశాన్ని మరికాస్త విపులీకరించ మన్నారు. విపులీకరించారు. ఢిల్లీ నుంచి అనుమతి అందింది.

"చిల్లర దేవుళ్ళు" నాటకం 19 జూలై 1971 సోమవారం రాత్రి తొలిసారి ప్రసారం అయింది. నేను – హరి – రమణరావు 'ద్వారక' హోటల్ గదిలో నషాలో

విన్నాం. నాటకం మొదలు కావడమే సరికొత్తగా డప్పుల వాద్యాలతో మొదలయింది. విరామ వాద్యం సహితం డప్పులదే! కళాకారులు పాత్రలకు – పలుకుబడికీ ప్రాణం పోశారు. శారద–వనజగా నవలలోంచి నడిచి వచ్చినట్లుంది. చివరి సీనులో "దొరసానీ! దొర చచ్చిండు" అన్న శారద స్వరం ఇప్పటికీ నా మనసులో కదలాడుతుంది!

"చిల్లరదేవుళ్ళు" రేడియో నాటకం బహుప్రశంస లందింది. వందల ఉత్తరాలు వచ్చాయి! తెలంగాణ ప్రజాజీవితము – ప్రజల భాష శ్రోతలకు అవగతం అయింది. అవి వారిని కదిలించాయి. నన్ను కదిలించిన ఒక సంఘటన వివరిస్తాను:

'సాహితీమిత్రబృందం' వార్షికోత్సవ సందర్భంగా నన్ను సన్మానించడానికి వేములవాడకు ఆహ్వానించారు. 14 ఆగస్టు 1971 శనివారం వేములవాడ చేరుకున్నాను. వేములవాడ శిధిలమవుతున్న నాగరకతకు సాక్షీభూతంగా నిలిచింది. మట్టిగోడల రెండతస్థుల ఇళ్ళు – కూలుతున్న గోడల విశాల అవరణలు గతకాలపు సంస్కృతికి కూలుతున్న సాక్ష్యాలు. భీమేశ్వరాలయము – భీమ కవి ఎంతో ప్రసిద్ధులు. రాజేశ్వరాలయంలో ఒక దర్గా సహితంగా వైష్ణవాలయాలు ఉండడం విశేషం. ఇది ఒకనాటి చోళుల రాజధాని అని చెప్పుకుంటారు. కన్నడంలో భారతం రచించిన పంప–రన్న వేములవాడవారట!

వేములవాడలో చొప్పకట్ల చంద్రమౌళిగారి ఇంట్లో నాకు వసతి ఏర్పాటు చేశారు. లాంతర్ల – కందిళ్ళ – వెలుగులో చాయ్ తాగుతూ మిత్రులం సాహిత్యచర్చ జరుపుకున్నాం.

"ఆ అయ్య వచ్చిండట – ఏడి?"

అని ఇద్దరు శ్రామికులు – అంటే జీతగాళ్లు – దర్వాజాలో నిలబడి అడిగారు.

"ఏ అయ్య?" చొప్పకట్లవారు అడిగారు

"అదేనండి, రేడియాల నాటకం రాసిండు చూడుండి – గాయిన."

నాలో ఒక విద్యుత్తరంగం వ్యాపించింట. ఇంత సామాన్యులు నా నాటకం విన్నారు!

చొప్పకట్లవారు నన్ను చూపారు. వాళ్లిద్దరూ వచ్చి నా కాళ్లమీద పడ్డారు.

"ఏం రాసిన వుండి! ఏం రాసిన వుండి! దొరల బండారం ఎల్లబెట్టినవ్! కళ్లకు కళ్లబడెటట్లు రాసిన వుండి! ఆ దొరలు పోయిన్రనుకుంటున్రా! ఉన్నారండి. ఇంకా గట్లనే తరముతాండ్రుండి. మీ కాల్మొక్తం, బాంచెనయితం – ఇంకా రాయున్రి, ఇంకా రాయున్రి" అన్నారు. వారి స్వరంలో అవేదన – ఆతురత – ఆప్యాయత ఏరులై పారేయి!

వారి మాటలు నన్ను అచేతనుణ్ణి చేశాయి! లిప్తపాటు హృదయస్పందన నిలిచినట్లయింది, వాస్తవంగా నోబెల్ బహుమతి వచ్చినా ఇంతటి పరమానందం – పరమానుభూతి – పరమచేతన కలిగి ఉండకపోవును! అనుభూతి పదాలకు అందడం లేదు!

మనది కుసంస్కారం! వాళ్ల పేర్లు మరచాను. కాని, మూర్తులు మనసులో మసలుతున్నారు. వారు అంతరాత్రి బావికాడ దొరపాలానికి కాపుండి విన్నారట! ఒక రచన ఆ స్థాయికి అందిందంటే రచయితకు ఇంకా కావలసిందేముంటుందండీ?

భాయ్‌జాన్ చిరంజీవి మల్లెల మనసులో – తమ జీవితానికి సంబంధించిన – ఒక ఆరని మంట చేరింది. రోగగ్రస్తు లయినారు. చికిత్సకని గుంటూరు వెళ్తూ – 'భాగ్యనగరం' నాకు అప్పగించి వెళ్లారు. మళ్లీ రాలేదు! 16-10-71 న వారు పరమపదించారని వార్త అందింది. నేను జబ్బున పడ్డాను.

"మనసు మనసు కలిసినట్టి
మధుర్‌క్షణ మొకటెచాలు!
ఆ నిమిషం దొరకడమే
అరుదుకదా జీవితాన!!
జీవితాన తెరలు దించి
ఎటకో నేనేగు వేళ
అందని పిలుపేదో విని
చిందిన కన్నీరొక్కటి చాలు!!!"

అన్నారు భాయ్‌జాన్. నేను వ్రాసిన 'చిందిన కన్నీరు' అనే వ్యాసం వారి సంతాప సభలో అందరి కన్నీరు చిందింపచేసింది.

భాయ్‌జాన్ నాకు వప్పగించిన 'భాగ్యనగరం' అచ్చు వేయించి ప్రచురించాను. అందులో "చిరంజీవి! చిరంజీవీ!! చిరంజీవ!!!" అనే వ్యాసం చేర్చాను.

బాధ ఏమీ అంటే "చిల్లర దేవుళ్లు" నాటకం విషయం చెప్పకోవడానికి భాయ్‌జాన్ – నార్ల చిరంజీవి అందుబాటులో లేరు!

ఒకనాడు ఆత్రేయగారితో గోష్ఠి. "చిల్లర దేవుళ్లు" చర్చ. అన్నగారు పగలబడి నవ్వుతారు. ఆత్రేయ నవ్వితే వళ్లంతా నవ్వుతుంది. ఆనాటి గోష్ఠిలో హరి – చిరంజీవి కూడా ఉన్నట్లు గుర్తు. అన్నగారు నవ్వారు. 'రంగన్నా! అందరూ బాగుందంటే అసూయగా ఉందోయ్! బాగు లేదందామంటే పాయింట్లు లేవు' అన్నారు. "అన్నగారూ! చిల్లర దేవుళ్ల లోపాలు నేను చెపుతా వ్రాయండి" అన్నాను.

"నలుగురూ తంతారు" అని మళ్లీ నవ్వి "సినిమా హక్కులు ఇవ్వరాదూ! సినీమా తీస్తా" అని మళ్లీ నవ్వి, "రంగన్నా! అన్నను మించిన తమ్ముడివి అనిపించుకున్నావు. సరే, ఒక ఉర్దూ కవిత విసురు" అన్నారు సిగరెట్టు వెలిగిస్తూ.

షేర్ భీ ఎక్ షరాబ్ హై అయ్‌దిల్
హుష్యారి ఉన్‌కీ మస్తీహై అయ్‌దిల్
(పద్యమ్ము కూడ ఒక మద్యమ్ముసుమ్ము
చురుకుదనమ్ము దాని మైకమ్ము నమ్ము)

తెలుగు అనువాదం సహితంగా వినిపించాను.

## సంచలన చిత్రం:

అవి నాకు అకాడమీ అవార్డు వచ్చిన రోజులు. అభిమానులు అనడం నాకు ఇష్టం ఉండదు – మిత్రులు ఎందరో ఎన్నో విధాల సత్కరించారు. సన్మానించారు. పార్టీలు ఇచ్చారు. విరామం లేకుండా చేశారు.

అలాంటి రోజుల్లో ఒక సాయంకాలం. ఆఫీసునుంచి ఇంటికి వచ్చాను. మా చిన్న పిల్లవాడికి జ్వరం. చూద్దామని వచ్చాను. మళ్లీ పార్టీకి వెళ్లాలి. మిత్రులు గిరిగారి జీపు వాకిట్లో నిలిచింది.

అప్పుడు ఇద్దరు అపరిచిత వ్యక్తులు ఇంటికి వచ్చారు. వాస్తవంగా నాకు చిరాకు కల్గింది. కాని, సభ్యత గుర్తుకు వచ్చింది. వారికి టీ అందించాను. ప్రసన్నంగానే పలకరించాను.

ఆ వచ్చిన వారిలో ఒకరు మూరుపుడి ప్రభాకరరావుగారు. వారిది విశాఖ. వృత్తికి కంట్రాక్టరు. రెండోవారు కేశవరావుగారు – ఫిలిం డిస్ట్రిబ్యూటరు.

"చిల్లర దేవుళ్లు" సినీమా హక్కులు ఎవరికన్నా ఇచ్చారా?" ప్రభాకరరావుగారు అడిగారు.

"ఆత్రేయగారు అడిగారు – ఇప్పటికి ఎవరికీ ఇవ్వలేదు" అన్నాను.

"బతికించారు. మేము ఎంతో ఆశపెట్టుకొని వచ్చాం. మీరు తొందరలో ఉన్నట్లున్నారు. రేపు వస్తాం" అని సమయస్ఫూర్తిగా వెళ్లిపోయారు.

ఇంతలో గిరిగారు వచ్చారు. వారికి వివరించాను. "సినీమావాళ్లు వస్తే ఎందుకు పోనిచ్చినవయా!" అని తలబాదుకున్నారు. 'మిత్రులు ఎదురి చూస్తుంటారు, పద' అని ఇద్దరం పార్టీకి వెళ్లిపోయాం.

మరుసటిరోజు ప్రభాకరరావుగారు వచ్చారు. "చిల్లర దేవుళ్లు" అభిమానిననీ – పదిహేనుసార్లు చదివాననీ – "I will spend a laks to see Telengana on the screen – మీరు అడిగినంత ఇస్తాను. నాకు హక్కులు ఇవ్వండి" అని ఎలాంటి దాపరికం లేకుండా అడిగారు. అది నాకు నచ్చింది. అయితే, భాయ్‌జాన్ ముందు పరిష్కరించుకుందాం అన్నాను. ఏదో సంకోచించినట్లు అంగీకరించారు.

తరువాత చిరంజీవి చెప్పారు. వారిద్దరూ కృష్ణాజిల్లా వారేనట! ఉభయులూ బంధువులట!! వారికి మనస్పర్ధలున్నాయట – మాటల్లేవట – అయినా తమ ఇంటికి వస్తాననడం భాయ్‌జాన్‌కు విస్మయం కలిగించింది!

"భాయ్‌జాన్! చూశావా చిల్లర దేవుళ్లు ప్రభావం?" అన్నారు చిరంజీవి.

ఆ సాయంకాలం నిరభ్యంతరంగా ప్రభాకరరావుగారు – పెద్దలు అంజయ్యగారిని తీసుకొని చిరంజీవి ఇంటికి వచ్చారు! అతిథి సత్కారంలో భాయ్‌జాన్ నిష్ణాతులు.

చిరంజీవికి సినీమాలతో సంబంధం ఉంది. వారు చాల సినీమాలకు వ్రాశారు. ప్రభాకరరావుకు విడమర్చి చెప్పారు. పదివేలు ఇమ్మన్నారు. ప్రభాకరరావుగారు వెంటనే అంగీకరించారు. అడ్వాన్సుగా కొంత డబ్బు – పూలూ పండ్లూ ప్రభాకరరావుగారు నాకు అందించారు. నమస్కరించారు. త్వరలో పిక్చర్ ప్రారంభిస్తాం అన్నారు, వెళ్లారు.

ఆంధ్రప్రభవాళ్లు పనికిరాదని తిప్పిపంపిన నవల ఇది. భాయ్‌జాన్ దాన్ని చూడకుంటే వెలికి వచ్చేది కాదు! అలాంటి దానికి సినీమా యోగం పడుతున్నదంటే ఏమనాలి? 'కాలోయం బ్రహ్మ' అంటుంది ఉపనిషత్తు. కాలం కలిసి వస్తే అన్నీ సక్రమంగా జరుగుతాయి! కాలం వ్యతిరేకించినపుడు అన్నీ ఎదురు తిరుగుతాయి!! కాలమే భగవంతుడన్నారు. కాబట్టి ఇది భగవదనుగ్రహమే!!!

ఇది ఎవరూ అనుకున్న పరిణామం కాదు. అందువల్ల భాయ్‌జాన్ పొంగిపోయారు.

'పార్టీహోనా భాయ్‌జాన్!' అన్నారు. నేను కాదనలేదు. ఫోనుమీదనే గిరి—డాక్టర్ నరసింహం - ఇతర మిత్రులను పిలిచారు. వదినగారు నాగరత్నమ్మగారు వంటల్లో మునిగిపోయారు.

అది మరుపురాని రేయి! సాధారణంగా రాత్రులే మరుపురానివి అవుతాయి! 'షరాబ్ హో అవుర్ షేర్ నహో యహ్ అనూఖీబాత్ హై' మద్యం ఉండి పద్యం లేకుంట వింత విషయం :—

వస్లేకీలాత్ హై బుర్ఖూదో ఇన్ చిరాగోంకో
ఖుషీకె బజ్మ్‌మె క్యాకామ్ హై జల్నెవాలోంకా.

(ఇది వలపులరేయి. దివ్వెలను ఆర్పివేయండి. ఇది ఆనంద హేల. మండేవారితో పని ఏల?)

"కవిత గొప్పగా ఉంది — ఆర్పండి లైట్లను" అన్నారు భాయ్‌జాన్. కరెంటు లైట్లు ఆరినవి. కొవ్వొత్తులు వెలిగినవి. గోష్ఠికి ఊపు వచ్చింది. రంగులు ఎగచిమ్మినవి.

జిందగీ మానిందె ముర్గె ఖుష్నుమా
కోయిడాలీ పర్ ఛైరా చహచహోయా ఉడ్‌గయా!

(జీవితం మురిపెముల మునిగిన పక్షిలాంటిది. కొమ్మమీద వాలుతుంది, కిచకిచమంటుంది, తుర్రుమంటుంది.)

'గొప్పగా చెప్పాడు భాయ్‌జాన్! జీవితం కిచకిచమనడం 'తుర్రునమడం! బహుత్ ఖూబ్! బహుత్ ఖూబ్!'
అన్నారు భాయ్‌జాన్. కావిలించుకున్నారు! అలా గడిచింది రేయి! అత్తరు పరిమళంలా ఎగిరిపోయింది!

ఇక్కడ మైత్రి — స్నేహం — దోస్తీని గురించి ఒక ఉదాహరణ వెల్లడించాలి:

అవి ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఉధృతంగా ఉన్న రోజులు. S. B. గిరి తెలంగాణ ప్రజాసమితి స్థాపకుల్లో ఒకరు. చిరంజీవి త్రికరణముల విశాలాంధ్రవాది. అయినా వారి స్నేహంలో ఇసుమంత భేదం రాలేదు.

ఒకనాటి రాత్రి నేను గిరి ఇంట్లో ఉన్నాను. చిరంజీవి ఇంటినుంచి ఫోను వచ్చింది. తెలంగాణవాదులు వారి ఇంటిమీద రాళ్లు వేస్తున్నారట. 'గురూ! భాయ్‌జాన్ ఇంటిమీద రాళ్లేస్తున్నరట, మనం బైలెల్లాలె' అన్నాడు గిరి.

నేను మర్మం తెలుసుకోడానికి అన్నాను — "ఆంధ్రోడే గద. ఎయ్యనీ రాళ్ళు" అని.

"అగో! అట్లవొద్దు. మన భాయ్‌జాన్ ఇంటిమీద రాళ్లు పడితే మనింటిమీద పడినట్లే" అన్నాడు.

ఇద్దరం జీపుమీద పంజగుట్టకు పరిగెత్తాం. వాతావరణం బీభత్సంగా ఉంది. గిరిని చూచారు. రాళ్లు వేసేవాళ్లు పారిపోయారు.

గిరి భారీగా ఉంటాడు, గట్టిగా అరిచాడు:

"మల్ల ఈ ఇండ్లమీద ఒక్క రాయిపడ్తే పానాల్తీస్త. పంజగుట్ట బొందల గడ్డల పాతిపెడ్తా!" అంతే — మల్ల వాల్లు అటుదిక్కు వచ్చిన్రనుకున్రా?

ఆ రాత్రి అక్కడే గడిపాం. తెల్లవారి ఇల్లు చేరుకున్నాం.

ఆ ఉద్యమం సందర్భంలోనే S. B. గిరిని అరెస్టు చేశారు. రాజమండ్రి జేలుకు పంపించారు.

"భాయ్‌జాన్! గిరిని అరెస్టు చేయకుండాల్సింది" అన్నారు చిరంజీవి.

"తెలంగాణవాడు అరెస్టయినాడు. మీకెందుకు దిగులు?" అన్నాను.

"అలా అనొద్దు బాయిజాన్! గిరిని అరెస్టు చేసినా మనను అరెస్టు చేసినా ఒకటే" అని ఎంతో బాధపడ్డారు చిరంజీవి.

గిరి విడుదలయివచ్చాడు. వారికి స్వాగతం పలుకడానికి అశేష ప్రజానీకం సికిందరాబాదు స్టేషనువద్ద కూడింది. ఆ గుంపులోంచి దూసుకుపోయి తొలిగా గిరిని ఆలింగనం చేసుకున్నవాడు నార్ల చిరంజీవి!

**ఇదండీ అనుబంధం! ఇదండీ మానవత్వం! మానవుడు ఈనాడు వదులుకోవలసినవి ఇరుకు గోడల సంకుచితత్వాలు! అవలంబించాల్సింది గోడలు కూలిన విశాల మానవత్వం! మానవ జాతికి ప్రేమను మించిన సందేశం లేదు!**

ప్రభాకరరావుగారు మళ్లీ కనిపించారు. నేను ఇల్లు కట్టుంటే కొంత డబ్బిచ్చారు. నేను విశాఖ వెళ్లి వచ్చాను. కాని మళ్లీ పిక్చర్ విషయం మాట్లాడలేదు.

వారు అక్కినేని నాగేశ్వరరావుగారితో పిక్చర్ తీయసంకల్పించారు. నాగేశ్వరరావు గారు చెంపదెబ్బతినే హీరోగా నటించనన్నారట. అందువల్ల ప్రభాకరరావుగారు విరమించినట్లున్నారు.

ఈలోగా T. కృష్ణగారు పిక్చర్ తీస్తానని ముందుకు వచ్చారు. ఉత్తరప్రత్యుత్తరాలు జరిగాయి.

1974 జూలై ఆరవతేదీ శనివారంనాడు నాకు అల్సర్ తీసివేయడానికి కడుపు ఆపరేషను చేశారు. నేను థియేటర్లో ఉన్నాను. అన్నయ్య, కమల సహితంగా పిల్లలంతా ఏడ్చారట. 14 ఆదివారంనాడు డిశ్చార్జి చేశారు. నన్ను కుర్చీమీద కూర్చోబెట్టి సాంబశివరావు వగైరా మిత్రులు పైఅంతస్థుకు ఎత్తుకొని వచ్చారు.

నేను మంచంలో ఉండగా T. మాధవరావుగారు వచ్చారు. అప్పటికి వారు దర్శకత్వం వహించిన పిక్చర్లు ఏవో వచ్చాయి. వారు డబ్బు పట్టుకొని "చిల్లర దేవుళ్లు" హక్కులకోసం వచ్చారు. 'ఖైదీ బాబాయి తీసిన T. కృష్ణ మాకు బంధువు. వారికి తప్ప మీకు ఇవ్వను' అని కచ్చితంగా చెప్పాను. మాధవరావుగారు నన్ను వదల్లేదు. కృష్ణనుంచి ఉత్తరం తెస్తామన్నారు. నేను ఒప్పుకోలేదు.

మాధవరావుగారు కొంతడబ్బు నా పడకమీద పెట్టారు. 'ఆలోచించుకోండి. టీ తాగి వస్తా' అని వెళ్లారు. కమల ఇదంతా కనిపెట్టున్నది, వచ్చింది. పక్కన కూర్చుంది. 'ఇంట్లో ఇప్పుడు రూపాయి లేదు. పిల్ల పెండ్లి చేసినం, ఇల్లు కట్టినం, ఇంటిచుట్టు అప్పులే ఉన్నాయి. మీరు ఎవరినీ అడగరు. ఇంటికి వచ్చినోణ్ణి వెళ్లగొట్టడం ఏం న్యాయం? కృష్ణ దగ్గరినుంచి ఉత్తరం తెస్తనంటున్నాడు గదా, ఒప్పుకొండి' అని డబ్బు తీసుకుంది.

ఆడవాళ్లు వాస్తవికంగా ఆలోచిస్తారు! మనం ఒక్కోసారి వాస్తవాలు కనిపిస్తున్నా చూడలేం. కమల సలహాను కాదనలేకపోయాను. మాధవరావు తెలివైనవాడు, అనుకున్నది సాధించాడు, సంతోషంగా సాగిపోయాడు.

తరవాత T. కృష్ణనుంచి ఉత్తరం తెచ్చాడు. బెలిదె కామేశ్వరరావు అధిపతిగా కాకతీయ పిక్చర్స్ సంస్థను వరంగల్లులో స్థాపించాడు. చిత్ర నిర్మాణ కార్యక్రమంలో నిమగ్నులయినారు.

ప్రభాకరరావుగారు డబ్బిచ్చారు. నానుండి రసీదు తీసుకోలేదు. హక్కులను గురించి పత్రం వ్రాయించకోలేదు. అయినా, వారికి పరిణామాలన్నీ తెలియపరచాను. వారు నాకు ఇచ్చిన డబ్బు తిరిగి ఇచ్చాను.

మాధవరావుగారు చిత్రాన్ని వాస్తవ గడీ పరిసరాల్లో తీయాలనుకున్నారు. వరంగల్లు జిల్లాలోని దొరలు అందరినీ అడిగారు. "చిల్లర దేవుళ్లు" అంటే అందరూ వ్యతిరేకించారు. ఒక్కరూ అనుమతించలేదు. ఆ విషయం వారు నాకు చెప్పారు. **ఇది నాకు విజయకేతనం అన్నాను. 'అదెట్లా?' అడిగారు మాధవరావుగారు. 'నేను సంధించిన బాణం గురి తప్పలేదు. సూటిగా లక్ష్యాన్ని ఛేదించింది' అన్నాను. అర్థం చేసుకున్నారు. "చిల్లర దేవుళ్లు" దొరలమీద పోరాటం అన్నారు.**

తుదకు మాధవరావుగారు సాధించారు. ఒక చితికిన దొరనుండి శిధిలం అయిన గడీని 'ఆత్మకూరు'లో సాధించారు. నాకు చూపించారు. "చిల్లర దేవుళ్లు" కు అతికినట్లుగా ఉంది 'ఆత్మకూరు' – అక్కడి గడీ!

ఆత్మకూరు గడీని అవసరం అయినంతమేరకు ముస్తాబు చేశారు. వంటలు – వార్పులు – వసతులు అన్నీ అక్కడే ఏర్పాటు చేశారు. మాధవరావు – హరి – చంద్ర – మురళీమోహన్ – భానుప్రకాశ్ – నేను – మరికొందరు – మద్రాసునుంచి వచ్చిన టెక్నీషియన్లు అక్కడే మకాం. కలిసి భోజనాలు – కలిసి పని – కలిసి మాట – కలిసి ఆట – రోజూ పండుగలా ఉండేది. కొన్నాళ్లు సావిత్రి – కాంచనకూడా కలిసి ఉన్నారు. వారు ఎంతో శ్రద్ధగా తెలంగాణం యాసను మెచ్చి, నేర్చారు. పని ఉన్నప్పుడు మాత్రం ప్రభాకరరెడ్డి – త్యాగరాజు వచ్చి వెళ్లారు.

రంగవిభజన – సంభాషణలు నేనే వ్రాశాను. హరి కొంత సాయం చేశాను. హరి అసోసియేట్‌గా పనిచేశారు మాధవరావువారికి.

పల్లెలో ప్రతిరోజూ షూటింగు. అవి చూడడానికి జాతరవలె జనం! అంతా ఒక సందడి!! సంరంభం!!!

బహుశా సావిత్రిగారిది అది చివరి చిత్రం. ఒక్క త్రాగుడు తప్ప ఆమెతో మాట విజ్ఞానం. ఆమె చిత్ర రంగంలో అన్నిటా ప్రతిభావంతురాలు. ఆమె నటన సొంతం ఆమె కనుల కదలికలే! ఆ నాలుగురోజులు సావిత్రిగారు నన్ను ఎంతో అభిమానించారు. దొరసానిగా ఆమె హుందాతనం చూపించారు.

దొర పేరిగాణ్ణి చంపుతాడు. పాణిని వెళ్లగొడ్తాడు. జబ్బున పడ్తాడు. వైద్యుడు పట్నం తీసికెళ్లమంటాడు. దొర్సాని మేనాలు సిద్ధం చేయమని మదార్సాబ్‌ను పంపుతుంది. "ఊరు ఉడుకుతాంది. చాకలోళ్లు రామంటున్రు. బండ్లు కట్టింతునా దొర్సానీ!" అని అడిగాడు.

అప్పుడు సావిత్రికోసం వ్రాసిన మాటలివి :–

"ఈ దొరతనమే ఇంత. సాగినన్నాళ్లు సాగుతది. మంది తిరగబడ్తే మనగతేమైతది?"

దీనిని ఆమె ఎంతగా అర్థం చేసుకున్నదంటే "కవిగారూ! మీరొక యూనివర్సల్ ట్రూత్ చెప్పారు" అని అంత గొప్పగా పలికారు.

కాంచన 'వనజ'గా పాత్రలో జీవించింది. పలుకుబడి చక్కగా పలికింది. మెప్పించింది. సానుభూతి సమార్జించుకుంది. సారంగపాణి సహవాసంతో వనజ ఆకాశమంత ఎదుగుతుంది. పాణిని అన్నను చేసుకుంటుంది.

"నువ్వు దేవునివి. బండసువంటి నన్ను మనిషిని చేసినవు. మనసు చూపినవు. నువ్వు నాకు దేవుడివి, తండ్రివి, అన్నవు" అన్న పలుకుల్లోనూ – నటనలోనూ వనజయై నిలిచింది.

ఒక్క ప్రభాకరరెడ్డి తప్ప మిగతవారు గొప్పగా నటించారు. భానుప్రకాశ్ కరణంగా జీవించారు.

పాటలు అన్నగారు ఆత్రేయ – అద్భుతంగా – వ్రాశారు. జానపదగీతాలు నేను ఎన్నుకున్నాను. తొలిసారిగా 'ఏటికేతం పట్టి' గీతం నరసింహమూర్తి – సినీమాకు పాడారు. మహదేవన్ సంగీతం.

చిత్రనిర్మాణం త్వరలోనే పూర్తి అయింది. అనుభవం లేని నిర్మాతల తగాదాలతో "చిల్లర దేవుళ్లు" చలనచిత్రం 11–3–1977 న నగరంలో నాలుగు థియేటర్లలోను, రాష్ట్రమంతటా విడుదల అయింది. ఈ చిత్రానికి కొన్ని విశిష్టతలు – ప్రత్యేకతలు ఉన్నాయి:

1. తెలంగాణ మాండలికంలో వచ్చిన తొలిచిత్రం. ఇప్పటికి చివరి చిత్రం.
2. నవలారచయితయే సంభాషణల రచయిత కావడం.
3. నవలకు అనుగుణంగా – ఎక్కువ మార్పులు లేకుండా – తీసిన చిత్రం.
4. ఒక ప్రాంతపు నిన్నటి యదార్థము – నేటి చరిత్రను – ప్రజాజీవితంగా చిత్రించడం.
5. గిరిజనులను – వారి పోరాటాన్ని – తొలిసారిగా చిత్రించిన బొమ్మ.
6. వ్యాపార దృష్టితో మరీ లాభాలు ఆర్జించడంకాక మేధావులను కదిలించిన చిత్రం.
7. ఒక నూతన మార్గనిర్దేశం చేసిన చిత్రం.

చిల్లరదేవుళ్లు సినిమా రంగంలో సంచలనం సృష్టించింది. దీని ప్రభావంతోనే విశాఖ మాండలికంలో 'నాకూ స్వతంత్రం వచ్చింది' అనే పిక్చరు వచ్చింది.

'ఓ మనిషీ, తిరిగి చూడు' లాంటి ప్రగతిశీల కథా చిత్రాలు వచ్చాయి.

పేర్లు చెప్పకుండా అనేక చిత్రాల్లో "చిల్లరదేవుళ్లు" పాత్రలు – సంఘటనలు – సంభాషణలు వచ్చాయి.

శ్యామ్ బెనగల్ 'అంకుర్' "చిల్లరదేవుళ్లు" నిర్మాణం పూర్తిఅయింతరువాత – విడుదలకు – ముందు వచ్చింది.

ఈ మధ్యవచ్చిన 'దాసి' మీద చిల్లరదేవుళ్లు ప్రభావం స్పష్టం. 'అడబాప'కు కళారూపం ఇచ్చిన తొలి రచయితను నేను. తొలిరచన "చిల్లరదేవుళ్లు."

తెలుగు ప్రజలు "చిల్లరదేవుళ్లు" చిత్రాన్ని ఎంతో ఆదరించారు. అనేక ప్రాంతాల్లో

ప్రత్యేక ప్రదర్శనలు ఏర్పాటు చేశారు. ముంబాయి, కలకత్తా, నాగపూర్ ప్రవాసాంధ్రులు ప్రత్యేకంగా ఫిలిం వేయించుకున్నారు, నన్ను ఆహ్వానించారు, సత్కరించారు.

పత్రికలు "చిల్లరదేవుళ్లు"ను బహుధా ప్రశంసించాయి. 'నిశాంత్'లో లేని సాంఘిక దృష్టి, చిత్తశుద్ధి "చిల్లరదేవుళ్లు"లో ఉంది – జమీన్‌రైతు, 25–3–77.

చిత్రరంగాన్ని కొత్తదారికి మళ్లించిన "చిల్లరదేవుళ్లు" – సితార, 17–4–1977.

అపురూపమైన చిత్రం "చిల్లరదేవుళ్లు" – ప్రజాతంత్ర, 3–4–1977.

"తెలుగు తెరమీద వాస్తవికతకు చోటులేదని పెదవి విరిచేవారికి గట్టి జవాబు "చిల్లరదేవుళ్లు." రే. మృణాళ్‌సేన్ లాంటివాళ్లు తెలుగుదేశాన మరో ఏడుతరాలకైనా పుట్టేచావరని విచారించేవారికి ఇదొక గొప్ప ఆశ" – విశాలాంధ్ర, 18–3–1977.

చిత్రరంగాన్ని ప్రగతిపథానికి మళ్లించిన "చిల్లరదేవుళ్లు" – సినీహెరాల్డ్, 11–3–1977.

"SLICE OF LIFE" - Indian express, 19-3-1977.

"The gripping story from the pen of Dasarathi Rangacharya clothed in the innocent unsophiscated Telengana dialect holds the viewer glued to the seat" - The Skyline, 6-8-1977.

"Chillara Devullu" - a trend - setter - Deccan Chronicle, 17-3-1977.

కొసమెరపు–

జంటనగరాల ఫిలిం సొసైటీవారు – 4–4–1977న – రవీంద్రభారతిలో – చిల్లరదేవుళ్లు యూనిట్‌ను సన్మానించారు. చిల్లరదేవుళ్లు చిత్రానికి ఆ సంవత్సరం బహుమతి రావలసింది. ఆ కమిటీకి బడాదొర జన్నారెడ్డి జగన్మోహనరెడ్డి అధ్యక్షులు. "దొరలు ఇంత దుర్మార్గం చెయ్యలే. అన్ని కల్పించి రాసిన్రు. బహుమతి ఇయ్యం" అని దొరతనం చూపించిండని ఎరికైంది.

"ఇది నాకు బహుమతిని మించిన కితాబు. నా బాణం లక్ష్యాన్ని ఛేదించింది" అన్నాను. ఏమంటారు? నన్ను విజయం వరించలేదూ?

## అనువాదాలు:

"చిల్లరదేవుళ్లు" "ఘాట్‌కే దేవతా" పేర హిందీలో అనువదించారు మిత్రులు ప్రొఫెసర్ భీమసేన్ నిర్మల్‌గారు. "లోక్‌రాజ్" హిందీ పక్షపత్రిక దాన్ని సీరియల్‌గా ప్రచురించింది. అప్పుడు నేను ఢిల్లీ వెళ్లాను. 'లోక్‌రాజ్' కార్యాలయానికి వెళ్లాను. సీరియల్‌కు మంచి స్పందన లభిస్తున్నదన్నారు సంపాదకులు. అనేక లేఖలను నాకు చూపారు.

"చిల్లరదేవుళ్లు" హిందీ అనువాదానికి నిర్మల్‌జీకి దక్షిణభారత హిందీ ప్రచారసభవారి బహుమానం లభించింది.

"ఘాట్‌కే దేవతా" చిల్లరదేవుళ్లు హిందీ అనువాదం గీతాప్రకాశన్, హైదరాబాదువారు పుస్తకంగా ప్రచురించారు. ఆ గ్రంథపు ఆవిష్కరణ ఆంధ్రసారస్వత పరిషత్తు హాలులో 21–5–90 సోమవారంనాడు జరిగింది. దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించారు.

మేము కమలసహితంగా సకుటుంబంగా సమావేశంలో పాల్గొన్నాం.

పి. నారాయణరెడ్డిగారు "ఘాట్‌కే దేవతా" అవిష్కరించారు. "రంగన్న చిల్లరదేవుళ్లే తెలంగాణపు తొలి నవల. అంకుర్ – నిశాంత్ – మా భూమి అన్నీ "చిల్లరదేవుళ్లు"కు కాపీలే" అన్నారు.

సభలో గోపాలరావు ఎక్బొటె -- రాధేశ్యాంశర్మ – కుట్టి మున్నగువారు అనువాదాన్ని ప్రశంసిస్తూ మాట్లాడారు.

దేవులపల్లి రామానుజరావుగారు భీమసేననిర్మల్‌గారినీ – నన్నూ సన్మానించారు.

హైద్రాబాదు విశ్వవిద్యాలయం హిందీశాఖనుంచి యూసుఫ్ పాషాగారు చిల్లర దేవుళ్లు – మైలాఅంచల్ – తులనాత్మక పరిశీలనచేసి M.Phil పొందారు.

చక్రవర్తి శేషాచార్యులవారు ఇంగ్లీషులో చిల్లరదేవుళ్లు కథాంశాన్ని "Lesser Deities" గా 'దక్కన్‌క్రానికల్'లో పరిచయం చేశారు.

యువభారతి సాహితీసంస్థ ప్రముఖ తెలుగు నవలలను ఇంగ్లీషులో పరిచయం చేయపూనుకుంది. Telugu Novel పేర గ్రంథం ప్రచురించారు. అందులో "చిల్లరదేవుళ్లు" గురించిన వ్యాసం చక్రవర్తి శేషాచార్యులవారు రచించారు.

చక్రవర్తి శేషాచార్యులవారు – ఎంతో అభిమానంతో – "చిల్లరదేవుళ్లు" ఆంగ్లానువాదం చేశారు. మిత్రులు S. B. గిరిగారు పార్లమెంటు మెంబరుగా ఉన్నప్పుడు ఆంగ్లానువాదం ప్రచురణకు ఎంతో ప్రయత్నించారు. వారి ప్రయత్నం ఫలించలేదు.

తెలుగు విశ్వవిద్యాలయంవారు "చిల్లరదేవుళ్లు" ఇంగ్లీషు అనువాదం "Lesser Deities" ప్రచురించారు.

శ్రీ వెంకటేశ్వర – కాకతీయ – ఉస్మానియా విశ్వవిద్యాలయాల్లో "చిల్లరదేవుళ్లు"పై పరిశోధనలు జరిగాయి. డిగ్రీలు లభించాయి.

కాకతీయ విశ్వవిద్యాలయం M.A. కు, బెంగళూరు విశ్వవిద్యాలయం B.A. కు, కొంతకాలం "చిల్లరదేవుళ్లు" పాఠ్యాంశంగా ఉండింది. ఉస్మానియా విద్యార్థులు ఉద్యమం నిర్వహించి, "చిల్లరదేవుళ్లు" M.A. కు పాఠ్యాంశంగా పెట్టించుకున్నారు.

Even Gods must die
But sovereign poetry
Remains
Stronger than death – *"Guitar"*

## ముప్ఫయి నాలుగు

### కుటుంబగోళం:

మానవునికి వ్యష్టిగా బ్రతకడం ఇష్టం. వ్యక్తిగా జీవించడం ఇష్టం. అతడు స్వేచ్ఛగా జీవించాలనుకుంటాడు. సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలనుకుంటాడు. దేనికీ లొంగరాదనుకుంటాడు. నియమనిబంధనలు అతనికి నచ్చవు.

మానవ చరిత్ర అనంతం. "చరిత్ర" అనే పదానికే నాలుగువందలకు మించి వయసులేదు! అనంతకాలాన్ని ఈ చరిత్రతో కొలిచింది అవగింజంత! ఇది సొంతం కాదు. అంతంకాదు. అందాజా మాత్రమే!

తెలిసిన ఇసుమంత చరిత్రలో ఆదిమానవునికి హక్కులు లేవు, బాధ్యతలు లేవు, నియమాలు లేవు, నిబంధనలు లేవు. అతనికి, ఆమెకు ఆహార – నిద్ర – భయ – మైధునాలున్నాయి. వాటిని పశువులా తీర్చుకున్నారు.

ఆమె – స్త్రీ శరీర నిర్మాణంలోనే భగవంతుడు పక్షపాతం చూపించాడు. భగవంతుడు మగవాడని కాదు. సృష్టి సాగవలసి ఉంది. అతడు – ఆమెలో ఒకరు పిల్లలను కనాలి. తప్పదు, అందువల్ల ఆ పని ఆమెకు అప్పగించాడు.

ఈ మహాకాలంలో 'తండ్రి' అనే పదంలేని కాలం ఉంది. మగవాడు తన లైంగిక అవసరం తీర్చుకున్నాడు. బయట పడ్డాడు, తల్లిగా ఆమె సకల బాధలు పడింది. సంతానాన్ని పెంచింది. అందుకే కథలన్నీ స్త్రీలవే!

సామాజికశాస్త్రం అనే పదం తెలియకపోవచ్చు – మానవ మేధస్సు ఈ పక్షపాతం – అన్యాయాన్ని సహించలేదు. మగవానికి ముక్కుతాడు వేసింది, లాగింది. తండ్రిని గుర్తించడానికి 'వివాహం' ఏదో రూపంలో ఏర్పరచింది. ఇది సులభంగా ఏర్పడి ఉండదు. ఎందరో నిరంతరం వేల సంవత్సరాలు కృషి చేసి ఉంటారు!

**మానవజాతి పురోగతి తొలివ్యవస్థ వివాహం! ఆయుధం కాదు!! పశువును నరుని చేసింది పెళ్లి. తండ్రికి తల్లితో సమానం అయిన బాధ్యతలు అప్పగించింది వివాహం. అతనిని లొంగదీసి ఆమెకు తోడుగా ఏర్పరచింది.** వివాహవ్యవస్థ! దానికి పవిత్రత ఏర్పరచి – స్వచ్ఛంద స్వీకరణకుగాను లాంఛనాలు – ఆచారాలు – మంత్రాలు ఏర్పడినాయి. ధర్మేచ – అర్థేచ – కామేచ నాతి చరామి – ధర్మార్థకామాల్లో నిన్ను వదలను అని మగవానితో అనిపించడం, ఆచరింపచేయడం సామాన్యం కాదు!

సామాజిక శాస్త్రంలో భారతదేశంలో జరిగినంత పరిశ్రమ - కృషి **మరెక్కడా జరిగి ఉండదు. ఒక మేనక - ఒక అహల్య - ఒక శకుంతల తరువాతగాని వెలుగు - సూర్యుని వంటి అవినాభావం గల సీతారాములు ఆవిర్భవించలేదు!**

ఆడవారు – తాము పిల్లలను కనం అని ఎదురు తిరిగిన కాలం లేకపోలేదు. పురాణాల్లో యువనాశ్వుడు బిడ్డను కన్నాడు! అనంతకాలంలో ఇలాంటి తిరుగుబాట్లు ఎన్ని ఉన్నవో! సామాజిక శాస్త్రజ్ఞులు భార్యాభర్తలను కలిపి ఉంచడానికి ఎన్ని ప్రయోగాలు చేశారో! ఎంత కృషి సలిపారో! పలుకలేని ఆ కాలానికి ఎరుక!!!

ఈ కథ సాంతము పెళ్లిని గురించింది మాత్రమే! ఒక కుటుంబం ఏర్పరచడానికి ఎన్ని తపస్సులు అవసరం అయినవో! తొలి కుటుంబం భార్య – భర్త – పిల్లలు మాత్రమే! వృద్ధుల పోషణ బాధ్యత కుటుంబానికి అప్పగించడం జరిగింది. అన్ని తరాల బాధ్యతా కుటుంబానికి వప్పగించారు. అందరికీ పెద్దవాడు వృద్ధుడు. వృద్ధుడు శారీరకంగా బలహీనుడు. అందువల్ల అతనిని కర్తను – యజమానిని చేసినారు. సకల హక్కులు కర్తవి. కార్యములన్ని కర్తపేర జరగాలి.

ఇలాంటి స్వయం పోషకం అయిన కుటుంబ వ్యవస్థను ఏర్పరచి – వేల సంవత్సరాలు కొనసాగడానికి దోహదం చేసిన ఆ వ్యవస్థకు నమస్సులు. 'ఉమ్మడి

కుటుంబం' అనేది పాశ్చాత్యనామం. కుటుంబం విడిపోయింతరువాత వచ్చిన పేరు. **కుటుంబం అంటే సంపూర్ణ కుటుంబం మాత్రమే!**

కుటుంబమే ప్రపంచం. సకల శిక్షలు ఇక్కడనే లభిస్తాయి. ప్రేమ – అభిమానం – ఆత్మీయత – త్యాగం – ఈర్ష్య – ద్వేషం – అసూయ – తగాదా – అన్నింటి శిక్షణా ఇక్కడే లభిస్తుంది. ఇక్కడ నరుడు మానవుడూ కావచ్చు, రాక్షసుడూ కావచ్చు. భారతీయ తాత్త్వికతలో వృత్తుల శిక్షణకూడా కుటుంబంలో జరిగింది. అందువలననే గుణ కర్మములనుబట్టి కులాలు ఏర్పడినాయి! **భారత కుటుంబం ఒక స్వయం సంపూర్ణ రాష్ట్రం!**

**సకల శాస్త్రాలు - సకల కళలూ కుటుంబం అనే ఈ సూర్యుని చుట్టే పరిభ్రమిస్తుంటాయి.**

ఇలాంటి కుటుంబాల సమూహం గ్రామం. నా బాల్యంలో కూడా మన గ్రామాలు స్వయం సమృద్ధాలు. న్యాయంకోసం కోర్టులకు ఉరకాల్సిన పనిపడలేదు. పెద్దలు – పంచాయతులు పరిష్కరించాయి. అంతమాత్రంతో అక్కడ అంతా సవ్యంగా ఉందనలేం. ఉన్నదానిలో అది ఉత్తమం. ప్రకృతికి పరిపూర్ణత్వం లేదు. **అంతా మంచిగల వ్యవస్థ కలలోకూడా కనిపించదు.**

పారిశ్రామిక విప్లవం మానవాళికి సుఖసంపదలు ప్రసాదించడానికి ఆవిర్భవించింది. నేడు నరుని పాలిటి శాపం అయికూర్చున్నది. ఇది భస్మాసుర (హస్తం) వరంలాంటిది. ఎప్పుడో తన తలమీద పెట్టుకొనకమానదు.

మహాభారతం మానవ ఇతిహాసం. అందున లేనిది ఎందున లేదు. అందులో కుటుంబాన్ని గురించి ఒక చక్కని కథ ఉంది:

పాండవులు లక్క ఇంటినుంచి బయటపడ్డారు. ఏకచక్రపురం చేరారు. ఏకచక్రపురం అగ్రహారం. అగ్రహారంమీద రాజుల శాసనం లేదు. గ్రామస్తులు పాలించుకునే గణతంత్ర గ్రామం అది. దానికి బకాసురుని బాధ తగిలింది. గ్రామస్తులు బకాసురునితో ఒక వప్పందానికి వచ్చారు. గ్రామరక్షణకుగాను ప్రతిరోజూ ఒక్కొక కుటుంబంనుంచి – బకాసుర భక్షణకు – ఒకరిని పంపుతామని వప్పందం చేసుకున్నారు. ఆ గ్రామప్రజల అయిక్యత – క్రమశిక్షణను అభినందించాలి. **రాజకీయం లేకుండా ప్రజల స్వచ్ఛంద కృషి ఈనాటికీ ఆదర్శప్రాయం.**

**అంతర్జాతీయరంగంలో ఈనాడూ ఒక బకాసురుడు ఉన్నాడు! భీముడు రావలసి ఉన్నాడు!!**

పాండవులు ఉన్నవారి ఇంటివంతు వచ్చింది. ఆనాడు ఆ కుటుంబంనుంచి ఒక వ్యక్తి బకాసురునికి బలి కావలసి ఉంది! ఎవరు వెళ్లాలి అనేదాన్ని గురించి మహాభారతంలో సవివరమయిన చర్చ ఉంది. సంక్షిప్తంగా మనవి చేస్తాను:

అది చిన్నకుటుంబం – చింతలు లేని కుటుంబం. భార్య – భర్త – కొడుకు – కూతురు ఉన్నారు. మహాభారతంలో కుటుంబ నియంత్రణ ఉంది. అది మనకు అక్కరలేదు. పొరుగింటి పుల్లకూరే రుచి!

భర్త తాను వెళ్తానంటాడు. పిల్లలపోషణకు తల్లి అవసరం అంటాడు.

భార్య తాను వెళ్తానంటుంది. పిల్లలకు తల్లికన్న తండ్రి అవసరం మిన్న అంటుంది.

కూతురు తాను వెళ్తానంటుంది. తల్లిదండ్రులు ఉంటే మరొక పిల్లను కనగలరు అంటుంది.

బాలుడు కర్రపట్టుకు వస్తాడు ఎవడా రాక్షసుడు – నేను చంపుతానంటాడు.

తరవాత భీముడు వెళ్లడం – బకాసురుని చంపడం ఎల్లరు ఎరిగిన కథ.

గమనించాల్సిందేమంటే – కుటుంబాన్ని రక్షించడానికి ప్రాణత్యాగానికయినా సిద్ధం కావడం. ఇది త్యాగం నేర్పిన కథ!

పారిశ్రామిక విప్లవం మనిషికి వ్యాపారం మాత్రం నేర్పింది. మనిషిని, మనసును అమ్మకానికి పెట్టింది. పారిశ్రామిక రక్కసికి సామాజిక శాస్త్రం గిట్టదు. ఆ రక్కసి మనిషిని వెనక్కు నడిపించింది. త్యాగాన్ని త్యాగం చేయించింది. వ్యక్తిత్వం అనే వెధవపేరిట మనిషిని రాతికాలపు వంటరిని చేసింది. పాశ్చాత్యదేశాల్లో రాక్షస నాగరకత – మానవతా చిహ్నాలయిన వివాహం, కుటుంబాలను – విచ్ఛిన్నం చేసింది. ఇప్పుడు తల బాదుకుంటున్నది. దినవారాలు సంవత్సరీకాలూ జరుపుతున్నది.

**పాశ్చాత్యదేశాల సామాజిక స్థితి భయంకరంగా ఉంది. ఆదికాలం నాటివలె తండ్రిలేని బిడ్డలు తయారయినారు. సగానికి పైగా పెళ్లికాని తల్లులున్నారు. స్త్రీ స్వేచ్ఛపేర పురుషుని 'జన్నె' కు వదులుతున్నారు. బాధ్యతారహితుని చేస్తున్నారు. నాగరకతపేర ఏ.సి. ఇళ్లల్లో ఆదిమ నరుడు నివసిస్తున్నాడు. ఇది మానవునకు ప్రమాద సంకేతం! మానవతకు సమాధి సంకేతం! తస్మాత్ జాగ్రత – జాగ్రత!!!**

మనం అనాదికాలంగా – మనకు ఉన్న సంప్రదాయాల ఆధారంగా వివాహ – కుటుంబ వ్యవస్థలను పదిలంగా కాపాడుకుంటూ వస్తున్నాం.

నాకు పన్నెండేళ్లు – కమలకు ఏడేళ్లు ఉన్నపుడు మాకు 1939–40లో పెళ్లి జరిగింది. దేశభక్తి ఆవేశంలో ఎనిమిదేళ్లు కమలను నిర్లక్ష్యం చేసిన మాట వాస్తవం.. అదృష్టం కమలదే కావచ్చు అనేకసార్లు మృత్యుముఖంలోంచి బయటపడ్డాను. అనాదిగా వస్తున్న సంప్రదాయ కారణంగానే కమలను పరిగ్రహించాను. కాకుంటే ఆనాడు ఆడపిల్లలు కరువుకారు. అవకాశాలూ రాకపోలేదు. సంప్రదాయం నిగ్రహాన్ని ప్రసాదించింది. కమలా నేనూ 'వాగర్థావివ' జీవిస్తున్నాం.

నాకు అతి చిన్నవయసులోనే కుటుంబ భారం నెత్తిన పడింది. అమ్మనూ – ముగ్గురు చెల్లెళ్లనూ పోషించాల్సి వచ్చింది. అనాటినుంచీ స్త్రీ–పురుష వ్యత్యాసం కనబరచలేదు. స్త్రీ కష్టాలకే పుట్టిందనిపించింది. మా అమ్మ బ్రతుకు అలాంటిది. మా చెల్లెళ్లను మగపిల్లలవలెనే పెంచాను. పెద్ద చెల్లెలు శకుంతలను గుంటూరు శారదానికేతనంలో చదివించాను. రెండో చెల్లెలు రమాదేవిని డోర్నకల్లులో చదివించాను. మూడో చెల్లెలు అరుణను మా అన్నయ్య చదివించాడు.

డబ్బు విషయంలో మొదటినుంచీ నాకు అంత ఆసక్తి లేదు. వచ్చింది అప్పుడు అమ్మకు ఇచ్చాను. ఇప్పుడు కమలకు ఇస్తాను. నాకు దాపరికాలు లేవు. డబ్బు లేకుంటే బ్రతకలేం. అది నాకు తెలుసు కాని, డబ్బే సర్వస్వం అనేదానిమీద నమ్మకం లేదు.

'ధనమూలమిదం జగత్' అన్నాడు వాల్మీకి. అంటే – అన్నింటికీ ధనమే మూలం అని అర్థం కాదు. ఈ జగత్తు నిలువడానికి ఆధారభూతం అయింది సంపద అని అర్థం. సమాజ వికాసానికి సంపద అవసరమే కాదు – అత్యంత అవసరం. వ్యక్తి విషయంలో ధనం అగ్నిలాంటిది. వంటకు – చలి కాచుకోవడానికి పరవాలేదు. అంటుకుంటే మాత్రం తగలబెడ్తుంది.

1957 లో సికిందరాబాదు చేరేవరకు మాకు ఒక్కతే పాప – ఉదయశ్రీ. అప్పటికి ఆమెకు డబ్బు సంగతి తెలియదు. పదార్థాలు కొనాలనీ తెలియదు. అన్నీ ఉచితంగా ఇస్తారనుకునేది. 'ఓ అయ్యా! అది ఇస్తావా? ఇది ఇస్తావా?' అని అడిగేది. అంతటి అమాయకురాలు. ఆమెను కాన్వెంటులో చేర్చాం. అప్పటికి ఇంకా పుట్టబోయే బిడ్డకు సీటు రిజర్వు చేసుకోవడానికి తల్లులు క్యూలో నుంచునే దుస్థితి రాలేదు. పదిరూపాయిలనుకుంటా – ఫీజు కట్టాం, చేర్చాం. యూనిఫాం, బూట్లు వేసుకొని స్కూలుకు వెళ్తుంటే ముచ్చటగా ఉండేది. అయితే ఇంకా మమ్మీ – డాడీ కల్చర్ అడుగుపెట్టలేదు. ఆమె అమ్మా – బాబూ అంటుంది.

ఉదయ కాన్వెంటుకు బొట్టు పెట్టుకుని వెళ్లేది. బొట్టు లేకుండా తిరిగివచ్చేది. చెమటకు చెరుగుతుంది అనుకున్నాం. కాదట – కాన్వెంటు వాళ్లు చెరుపుతున్నారట! బొట్టుమీద అభిమానం కాదు. బలవంతంమీద మంట! కాన్వెంటు వాళ్లతో పోట్లాడాను. ఉదయను సర్కారు బడిలో చేర్చాను. ఉదయ సర్కారు చదువుతోనే పదిహేనేళ్ల వయసులో పన్నెండో తరగతి పాసయింది.

మగపిల్లలని నాకు ప్రత్యేకమయిన అపేక్ష లేదు. కమలకు ఉంది. 1958లో పిల్లవాడు పుట్టాడు. మా అన్నయ్య పిల్లవానికి "భట్టర్" అని మా మాతామహుని పేరుపెట్టారు.

నేను కుటుంబంలోనూ – దేశంలోనూ బానిసత్వం అనుభవించాను. స్వాతంత్ర్యం కోసం తపించాను. పోరాడాను. నాకు స్వాతంత్ర్యం విలువ తెలుసు. అందువల్ల కుటుంబంలో స్వేచ్ఛ ఇచ్చాను. అంటే – పూర్తి స్వేచ్ఛకాదు. క్రమశిక్షణకు లోబడిన స్వేచ్ఛ మాత్రమే!

భట్టర్‌ను స్కూల్లో చేర్పించడానికి తీసికెళ్లాను. కాన్వెంటు స్కూలే – ఇంగ్లీషు మీడియమే! మమ్మీడాడీ కల్చరే! నా ఇష్టానిష్టాలు పిల్లలమీద రుద్దడం ఇష్టం లేదు. కాలాన్ని ఎదిరించడం అసాధ్యం. స్కూలువాళ్లు భట్టర్‌ను పేరు చెప్పమన్నారు. "విజయకుమార్" అన్నాడు. అతనికి భట్టర్ ఇష్టంలేదని గమనించాను, విజయకుమార్ స్థిరపరచాను.

1959లో రెండున్నర పౌనుల అమ్మాయి – నెలలు నిండకముందే పుట్టింది. ఆమెను పెంచడం మాకు ఎంతో కష్టం అయింది. ఆమెకు పేరు పెట్టలేదు, చిట్టి అన్నాం. ఆమెను తరచు ఆస్పత్రికి తీసికెళ్లాల్సి వచ్చేది. ఒకనాడు అర్ధరాత్రి వెళ్లాం. చీటీ వ్రాయించాలి. 'నామ్ బోలో' అడిగాడు క్లార్కు. "చిట్టి" అన్నాను. "చిట్టీ లిఖ్తేభయి, నామ్ బోలో" అన్నాడు. చిట్టి అనే పేరుంటుందని ఆ తురకకు తెలియదు. "నామ్‌హి చిట్టిహై" 'అజబ్ నామ్‌హై అజబ్ లోగ్ హైఁ' అని తెలుగువాళ్లపై వ్యాఖ్యవిసిరి చీటీ రాసిచ్చాడు.

1961లో మరొక పుత్రకిశోరం జన్మించాడు. కమల ఆరునెలలు ఆస్పత్రిలో ఉండాల్సి వచ్చింది. నానా బాధలు పడ్డది. ఇంకా ఆమెను బాధపెట్టడం ఇష్టంలేక నేనే ఆపరేషను చేయించుకున్నాను. పిల్లవాడి పేరు 'విరించి' అని పెట్టాం. స్కూలులో చేరేపుడు అతడు ఆ పేరే చెప్పాడు. పేరు అనిష్టం కాదని అర్థం చేసుకున్నాం. కాన్వెంటులో అయిదో తరగతిదాకా తెలుగులేదు. ఆరవ తరగతిలో తెలుగు, డ్రాయింగు ఆప్షన్ అడిగారు. విరించి డ్రాయింగ్ ఆప్షను ఇచ్చాడు. అదిమాత్రం నేను అంగీకరించలేదు, బలవంతంగా తెలుగు చదివించాను.

రెండో అమ్మాయికి 'సుధ' అని మా నాయన నామకరణం చేశారు. ఆమె కాన్వెంటు చదువు చదవలేకపోయింది. సర్కారు బడిలోనే పదివరకు చదివింది.

మేము ఆడ, మగపిల్లల విషయంలో ఎలాంటి వివక్షత చూపదలచలేదు. అయినా ఆడపిల్లలు సర్కారు స్కూళ్లు కాలేజీల్లోనే చదవాల్సివచ్చింది. మగపిల్లలు ఉత్తమ స్కూళ్లు, కాలేజీల్లో చదివారు! ఇది యాదృచ్ఛికం!!

కుటుంబ నిర్వహణ – సంసారం ఈదడం – సామాన్యం కాదు. ఏ సమాజం అయినా కుటుంబంమీదనే ఆధారపడుతుంది. రానున్న తరాలను తయారుచేసే బాధ్యత కుటుంబానిదే. కాబట్టే ఆశ్రమాలలో గృహస్థాశ్రమం శ్రేష్ఠమైంది.

పిల్లలవిషయంలో తల్లి తల్లడిల్లిపోతుంది. ఇది ప్రకృతి సిద్ధం. సకల జంతుజాలంలోనూ తల్లికి అంతటి అనుబంధం! ఇది ఒకరు విధించింది కాదు. ప్రకృతి సిద్ధంగా వచ్చింది. సంతానం పెరగడానికి, సృష్టి కొనసాగడానికి 'తల్లి తపన' అత్యవసరం.

మానవ సమాజం ఏర్పరచిన బంధంతో తండ్రికీ బాధ్యత సంక్రమించింది. అయినా తల్లి స్వచ్ఛందంగా వహించినంత బాధ్యత తండ్రి వహించలేదు.

మా పిల్లల పోషణబాధ్యతకూడా చాలవరకు కమల వహించింది అనేది వాస్తవ సత్యం. పిల్లలను పిల్లిలా కరిచిపెట్టుకుని పెంచింది. తీరిక ఉన్నప్పుడు – ఇంట్లో ఉన్నప్పుడూ నేను పిల్లలతో గడిపేవాణ్ణి. వారి చదువు విషయంలో తప్ప ఏ విషయంలోనూ కఠినంగా ప్రవర్తించలేదు. నా భావాలు, అభిప్రాయాలు, నమ్మకాలు వారిమీద రుద్దే ప్రయత్నం చేయలేదు. వారు అడిగిందానికి – నాకు తెలిసినంతవరకు – వివరంగా చెప్పాను.

మేము భయపెట్టడానికి వ్యతిరేకులం. ముద్దు ముచ్చటతో – ప్రేమాభిమానాలతో పెంచాం. రామాయణం ప్రేమాధారం. ప్రేమాధార కుటుంబాలే పరిఢవిల్లుతాయని వాల్మీకి బోధించాడు, నిరూపించాడు.

పిల్లలు స్కూలునుంచి రావడం ఆలస్యం అవుతే – వెళ్లినవాళ్లు సమయానికి రాకుంటే – తల్లడిల్లిపోయాం. కాలుకాలిన పిల్లిలా తిరిగాం. వారి కాలికి ముల్లుగుచ్చుకుంటే మా కంట్లో ముల్లు గుచ్చుకున్నట్లు విలవిలలాడాం.

మేం పడిన బాధలు పిల్లలు పడరాదు అనుకున్నాం. మా శక్తికిమించి వారికి సమకూర్చాం. వారికి ఏ లోటూ రాకుండా ప్రయత్నించాం. మా ఆర్థికస్థితి అంతమంచిదేంకాదు. అయినా అది వారికి తెలియనీయలేదు.

ఒకప్పుడు నాకు విదేశం వెళ్లే అవకాశం వచ్చింది. "మీరు లక్షలు తెస్తరు. ఒక బిడ్డ దారి తప్పితే ఆ లక్షలు దారికి తెస్తవా? మీరు వెళ్లొద్దు, లక్షలు

తేవొద్దు, ఉన్నాదానితోనే కలో గంజో కలిసే తాగుదాం" అన్నది కమల. పిల్లలను గురించి అంతటి తపన ఆమెది! నేను ఆమె మాట కాదనలేదు!! **పిల్లలతోటిలోకం లక్షల్నుమించిందే మరి!!!**

కమల నలుగురు పిల్లలతో నలిగిపోయింది. 1965 సంక్రాంతి రాత్రి గుండెనొప్పి వచ్చింది. నా ప్రాణాలు పైపైనే పోయాయి! అర్ధరాత్రి! ఆధారం లేదు!! రిక్షా సహితం దొరకదు. ఏం చేయాలో తెలియదు. గిరిని పిలిచాను. పండుగ పార్టీలోంచి వచ్చాడు, గిరికి మిత్రుడు డాక్టర్ నరసింహన్. గిరి డాక్టరును లేపారు. ఇంటికి చేరుకున్నాం. డాక్టరు ఇంజక్షన్ ఇచ్చాడు. కమలను నిద్రపుచ్చాడు. కాని బయటికి వచ్చి నన్ను నానా చీవాట్లు పెట్టాడు. "నీకు బుద్ధి లేదు. ఆమెకు తిండి పెడ్తున్నావా అని! ఆమె అలిసిపోయింది. పూర్తి విశ్రాంతి అవసరం."

అది డాక్టరుకు పేషెంటు విషయంలో ఉన్న ఆవేదన అని అర్థం చేసుకున్నాను. కాని నాకు గుండెదడ హెచ్చింది. గిరి పార్టీకి లాక్కెళ్లే ప్రయత్నం చేశాడు. తెల్లవార్లూ కమల పక్కనే కూర్చున్నాను. రెప్ప వాలలేదు. లోకం సాంతం అంధకారంగా కనిపించింది! కనీసం మిణుగురు లేదు. పిల్లలు నా పక్కనే పడుకున్నారు.

అయినా తెల్లవారింది. డాక్టర్ వచ్చారు. రాత్రి అన్నదానికి సారీ చెప్పారు. నాటినుంచి అతడు మా కుటుంబ సభ్యుడు అయిపోయారు. నన్ను అన్నను చేసుకున్నారు. గిరి జీపు ఇంటిముందు పెట్టాడు. తాను మా ఇంటినుంచి కదల్లేదు. పబ్బాశంకరయ్యగారు కొంత డబ్బుతెచ్చి ఇచ్చారు. వెదుక్కుంటూ వంటమనిషి లక్ష్మమ్మగారు వచ్చింది. ఇదంతా దైవికమే! "యోగక్షేమం వహామ్యహం" అన్నాడు కృష్ణభగవానుడు!

కమల సరిగ్గా నెలకు కోలుకుంది. నెల నేను ఆఫీసుకు వెళ్లలేదు. కమల కదలడం ప్రారంభిస్తే నేను పూర్తి మనిషిని అయినాను. పిల్లల కళ్లలో వెలుగు కనిపించింది. సంసారం మళ్లీ దారిన పడింది.

వంటమనిషి లక్ష్మమ్మగారు వస్తువులు సంగ్రహించి ఉడాయించింది. అయితే ఉన్నన్నాళ్లు కమలకూ – పిల్లలకూ పరిచర్యలు చేసింది. ఆమె వస్తు సంగ్రహానికి బాధపడలేదు! చెప్పి తీసికెళ్తే సంతోషించేవాళ్లం!

నరసింహన్ – గిరి – చిరంజీవి – నేను మిత్ర చతుష్టయంగా కలిసిమెలిసి కాలం గడిపాం. జీవితంలో సకలం సాధించవచ్చు – మిత్రులు సమకూరాలి. 'నరుని కన్నుకంటే నారాయణుని కన్ను భ్రష్టుది' అనేది మా అమ్మ. దైవం ఓర్వలేదు. 1971లో చిరంజీవి – 1973లో నరసింహన్ వెళ్లిపోయారు!

తల్లికి సీరియస్‌గా ఉందని టెలిఫోనులో విన్నారు నరసింహన్! అంతే. రిసీవర్‌తో విరుచుకుపడ్డారు! గతించారు! అంతటి మెత్తని మనసు వారిది!

మా తొలిబిడ్డ ఉదయశ్రీ డిగ్రీకి వచ్చింది. వరాన్వేషణలో పడ్డాం. అభినవ పోతన – మా బంధువు – వానమామలై వరదాచార్యులవారు సంబంధం కుదిరించారు. చెన్నూరు వారయిన కొదుమగుళ్ల వీర రాఘవాచార్యులవారి ప్రథమ పుత్రుడు వీరమోహనాచార్యులు – ఇంజనీరింగ్ ఫైనల్లో ఉన్నారు.

ఉదయ – మోహన్ చూసుకున్నారు. మాట్లాడుకున్నారు. తరవాత వాళ్లు పలకలేదు. తరవాత నచ్చలేదని కబురు వచ్చింది! అమ్మాయిపెళ్లిగదా – పదిచోట్ల

తిరగంది కాదు అనుకున్నాం. ఇంకా అన్వేషణకు ఉపక్రమించలేదు. వాళ్లవాళ్లు మా కుటుంబపు సంస్కారం – సంప్రదాయాన్ని గురించి మోహనుకు నచ్చచెప్పారు. మోహను వప్పుకున్నాడు. ఉదయ భీష్మించింది. 'మొదట నచ్చనిదాన్ని ఇప్పుడెట్లా నచ్చాను?' అన్నది. మేము నచ్చచెప్పే ప్రయత్నం చేశాం, ఫలించలేదు. మోహను స్వయంగా వచ్చాడు. వాళ్లిద్దరూ మాట్లాడుకున్నారు. ఉభయులూ అంగీకరించారు! ఇంత తేలిగ్గా సంబంధం కుదురుతుంది అనుకోలేదు!! అదీ దైవనిర్ణయమే!!

ఉదయ మోహనుల వివాహం 1971 మే 8 తెల్లవారు జామున జరిగింది. ఆ సాయంత్రం విందు ఏర్పాటు చేశాం. మహాకవులు దాశరథి – వానమామలై – శశాంక – కప్పగంతుల – చిరంజీవి – పోతుకూచి – భీమన్న వీనులవిందుగా కవితాశీర్వాదం మహోత్సవంగా జరిగింది.

అప్పగింతలే మమ్ముల్ని ఏడిపించాయి! శాకుంతలంలో కణ్వుడు శకుంతలను సాగనంపిన ఘట్టం చదివినపుడల్లా ఉదయను పంపాల్సివస్తుందని గుండె కలుక్కుమనేది. సినిమాల్లో అలాంటి దృశ్యం వస్తే కళ్లు మూసుకునేవాణ్ణి!

ప్రత్యక్షంగా ఉదయను అప్పగించడం! కమలా – నేను భోరున ఏడ్చాం. గిరి, మా అన్నయ్య సహితంగా ఎవరూ ఊరడించలేకపోయారు. వధువు – మా ఉదయ – కన్నతల్లి కమల కడుపుకు చల్ల మజ్జిగ రాస్తుంది. గడపలకు మజ్జిగ చల్లుతుంది. మాతో బంధం తెంచుకుని వెళ్లిపోతుంది. ఉదయ మమ్ముల్ని పట్టుకుని ఏడుస్తుంది! మేము ఓదార్చగలమా?

అలా అత్తవారింటిది అయింది ఉదయ. ఇప్పుడు ఆ ఇంటినే 'మా ఇల్లు' అంటుంది! మేము వేరయిపోయాం!! అయినా మోహను – ఉదయ – ఉజ్వల్‌కు మేమంటే అభిమానం, అనుబంధం.

1976లో విజయకుమార్ – మా పెద్దబ్బాయి – ఇంటర్‌కు వచ్చాడు. అతడు అఖండ తెలివిమంతుడు అయినా చదువుమీద కేంద్రీకరించడు. కొన్నాళ్లు ఇంగ్లీషులో పిల్లలకథలు వ్రాశాడు. పత్రికల్లో వచ్చాయి. ఇతర కార్యక్రమాలు ఎక్కువ. మాటల్లో మొనగాడు అతడు డాక్టరో – ఇంజనీరో కావాలని – అందరివలెనే – మేమూ కోరుకున్నాం.

ఒకనాటి రాత్రి విజయకుమార్ రోడ్డుమీద పడిపోయాడని ఒక వార్త. వార్త విన్నాం. మా గుండెలు పగిలాయి. కమలా – నేనూ కాళ్లకు చెప్పుల్లేకుండా – ఇంటికి బెడెం వేయకుండా పరిగెత్తాం. అతడు కనిపించలేదు. అస్పత్రిలో ఉన్నాడు అన్నారు. అట్లాగే ఉరికాం. విషం తాగాట్ట! డొక్క శుభ్రం చేస్తున్నారు. మమ్ముల్ని చూచాడు, ఏడ్చాడు. డాక్టర్ తెలిసినవాడే! ప్రమాదం లేదన్నాడు, వార్డుకు మార్చారు, ఏ విషయమూ చెప్పడు. ఏడుస్తాడు! గండం గడిచింది! అదృష్టం అనుకున్నాం.

ఇంటికి వచ్చాం, అప్పుడు తెలిసింది అసలు విషయం. ఒక పెళ్లయిన పిల్లతో రొమాన్స్! పిల్లమొగుడు చూచాడు. ఏం జరుగుతుందో విదితమే కదా! వాళ్లను బెదిరించడానికి విషం తాగుతానన్నాడు.

మరునాడు ఇంటికి తీసుకొనివచ్చాం. బెదిరిపోయాడు! తెలుగు మహాసభలకు అన్నయ్య వచ్చాడు. గిరిగారు ధైర్యం చెప్పారు. కొన్నాళ్లకు మళ్లీ మామూలు అయినాడు.

రాజకీయాలు రొచ్చు. అది ధనబలం, కండబలం ఉన్నవారి విలాసం. దేశభక్తితో మేం అన్నాతమ్ముళ్లం గుల్ల అయిపోయాం. అది మాకు తిండి పెట్టలేదు. కాబట్టి రాజకీయాల జోలికి మాత్రం పోవద్దని పిల్లలకు తొలినుంచీ చెపుతున్నాం. మగపిల్లలు మాతో చర్చించారు. వినలేదు.

డిగ్రీలో ఉండగా విజయకుమార్ యూనియన్ వైస్ ప్రెసిడెంటుగా ఎన్నిక అయినాడు. కాలేజి ఫంక్షనుకు ఆహ్వానం వచ్చింది. అది మాకు ఏమాత్రం ఇష్టం లేదు. అయినా అతణ్ణి చిన్నపుచ్చ తలచలేదు. అందరం సమావేశానికి వెళ్లాం.

మళ్లీ ఒక ఉపన్యాసం ఇచ్చాను, మేము పడినపాట్లు వివరించాను. **దేశభక్తి కాదు – కనీసం దేశం తెలియనివారు అధికారం హస్తగతం చేసుకున్నారు. ఇప్పుడు రాజకీయం వ్యాపారం అయిపోయింది.** మనం డబ్బున్నవాళ్లంకాము అని బోధించాను, వివరించాను.

"ప్రాప్తే శోషేవర్షే పుత్రం మిత్రవదా చరేత్" పదహారేళ్లు వచ్చిన కొడుకును మిత్రునిగా భావించాలి అన్నారు. మిత్రునివలెనే సలహా ఇచ్చాను.

కమల ఒకనాడు కన్నీరు రాలగా అన్నది – "ఏమండీ! మనం వాణ్ణి చూచి ఓర్వలేకపోతున్నామటండీ!" నా బుజం మీద తలపెట్టి ఏడ్చింది! ఆమెను ఓదార్చడం కాదు. నా గుండె కకావికలయిపోయింది! "కన్నందుకు అనుభవించాలె" అని ఇద్దరం ఒకరిని ఒకరం ఓదార్చుకున్నాం!

మా చిన్నమ్మాయి సుధకు చదువు అబ్బలేదు. పదితో ఆగిపోయింది. చదువు అచ్చం సాధన వలన రాదు. సాధనకు అతీతం అయింది ఏదో కావాలి. సుధను ముందుకు నెట్టడం లాభంలేదు. ఆమెకు పెళ్లి చేయాలని నిర్ణయించాం.

సుధ కాస్త నలుపు, లావు, చదువు లేదు. మేము మరింత కట్నం ఇచ్చుకోలేం. చాల తిరగాల్సి వచ్చింది. చాల సంబంధాలు చూచాం. కొన్ని వాళ్లకు నచ్చలేదు. కొన్ని మాకు నచ్చలేదు. కాలం ఆగదు కదా! గడిచిపోతున్నది. కమలకు దిగులు! గుండెజబ్బు వచ్చింది, నానా తంటాలు పడ్డాం. భగవదనుగ్రహం – ఆమెకు తగ్గింది.

మోహను – ఉదయ సుధకోసం ఒక సంబంధం చూశారు. వాళ్లూ కొదుమగుళ్లవాళ్లే. గోపాలాచార్యులవారు పండితులు సిద్ధాంతి. వారి రెండో కొడుకు సురోత్తమాచార్యులు డిగ్రీ చేశాడు. చిరు ఉద్యోగంలో ఉన్నారు. సుధను చూడ్డానికి వచ్చారు.

సుధ మొండికేసింది. 'నేనేం బొమ్మనా' వచ్చినవాడి ముందుకల్లా రావడానికి! రాను పొమ్మ'నేసింది. ఆమె అనేది నిజమే! కాని ఇది కుదురుతుందేమో! కమల–ఉదయ–నేను ఒప్పించాం.

సురోత్తమాచార్యులు సుధను చూశారు. 'లక్ష్మిలా ఉంది' అని ఒప్పుకున్నారు! కమల పరమానంద పడిపోయింది!

సురోత్తం వాళ్లది కరీంనగరం జిల్లా జమ్మికుంట దగ్గరి శ్రీరాములపేట – చిన్నగ్రామం – నేను వెళ్లాను. కుటుంబం మంచిది. అయితే ఉన్నవాళ్లు కారు. సంబంధం స్థిరపరచేముందు 'మా పిల్ల ఈ పల్లెలో ఉండలేదు' అని స్పష్టం చేశాను, వారు అంగీకరించారు.

అంతకు ముందు మా అన్నయ్య్య కూతురు పెళ్లి మద్రాసులో ఒకటి మే 1977న నిశ్చయం అయింది. అందువల్ల మా అమ్మాయి పెళ్లి 13 మే 1977 ఉదయంగా నిశ్చయించాం.

S. B. గిరి రెండోసారి వరంగల్లు M.P. అయినాడు. ఇందిరాగాంధీకి దగ్గరివా డయినాడు. మంత్రి అవుతాడనుకున్నాం. కాంగ్రెస్ తుడుచుకుపోయింది. వారికి ఒక కూతురువల్ల మనోవ్యథ పట్టుకుంది. గుండె నొప్పి వచ్చింది. గాంధీ ఆస్పత్రిలో చేరాడు. ఏప్రిల్ 21 న చూచి వచ్చాను. ఏప్రెల్ 22 న మద్రాసుకు బయల్దేరాం. 23 న మద్రాసు చేరుకున్నాం. గిరి పరమపదించాడనే వార్త పత్రికల్లో – రేడియోలో – అన్నయ్య ఇంటికి ఫోనులో విన్నాను. అంతే – భూకంపం వచ్చినట్లూ – భూమి పాతాళంలోకి పడిపోతున్నట్లూ అనిపించింది, పడిపోయాను. అన్నయ్య డాక్టరును తీసికొని వచ్చాడు. డాక్టరు నాకు B.P. తగ్గిందన్నాడు, మందులు ఇచ్చాడు. తరవాత జ్వరం వచ్చింది దుఃఖం – ఎవరిని చూచినా ఏడవడమే!

మా అన్నయ్య కూతురు ఇందిర పెళ్లిలో కూర్చోలేకపోయాను. జ్వరంతో మందుమాత్రలు మింగుతూనే రైల్లో సికిందరాబాదు చేరుకున్నాను. లేస్తే వళ్లు తూలుతున్నది. కమల – పిల్లలు – కొందరు మిత్రులే పెళ్లి ఏర్పాట్లు చేశారు. పెళ్లినాటి ఏర్పాట్లు అన్నీ – సుమారు – అన్నయ్యే చూసుకున్నారు.

సుధ – సురోత్తముల వివాహం వైభవంగా జరిగింది. విశాలతమం అయిన కస్తూర్బా కాలేజి ఉద్యానప్రాంగణం వివాహభూమి. రావి వేప చెట్లున్న ఉన్నతము, విశాలమయిన వేదిక. విశాల వృక్షాలకిందనే అతిథులు ఆశీనులు, నేను అతికష్టంగా పీటలమీద కూర్చుని కాళ్లు కడుగ గలిగినాను!

రచయితలు – రచయిత్రులు – కవులు – పెద్దలు – పెద్ద సంఖ్యలో వచ్చారు. భోజనాలు సాయంకాలం వరకూ జరుగుతునే ఉన్నాయి! వాతావరణం ఎంత బావుందంటే – వచ్చిన సహృదయులు చెట్లకింద చాపలు పరచుకొని కూర్చున్నారు. వాళ్లకు టీలు కాఫీల సరఫరా!

పెళ్లి ఉదయం పదింటికి, అందువల్ల అనేకమంది సహృదయులు – పెద్దలు వచ్చారు. నేను సుస్తీగానే ఉన్నాను. అయితే అంత మిత్ర సంపద! అలాగే అందరిలో తిరిగాను పలుకరించాను, ముచ్చట్లు విన్నాను.

రాత్రికి మళ్లీ అప్పగింతల సీను పునరావృతం. తల్లి కడుపునకు చల్ల – ఇంటి గడపలకు చల్ల రాయడం ఒక సత్సంప్రదాయం. "అమ్మా! నాన్నా! నేను వెళ్లిపోతున్నానని మీరు దుఃఖిస్తారు! మీరు దుఃఖ విముక్తులయి, మీరు చల్లగా – ఇల్లు చల్లగా ఉండండి" అనడం!

ఈ తడవ మాతోపాటు మగపిల్లలూ విలపించారు! ఇది ఒక విచిత్రం అయిన ఎడబాటు! పున్నమినాడు అస్తమించే సూర్యుడు పడమట – ఉదయించే చంద్రుడు తూర్పున శోభాయమానంగా ఉంటారు. సూర్యుడు క్రుంగుతున్నందుకు బాధయా? చంద్రుడు ఉదయిస్తున్నందుకు ఆనందమా?

ఆడపిల్ల మనకు దూరం అవుతుంది. అనుబంధాలకూ అనురాగాలకూ ఆత్మీయతలకూ దూరం కాదు!

ఎళ్ల ముగసంది. సుధ అత్తవారింటికి వెళ్లింది. మిగిలింది మేమిద్దరం – మగపిల్లలు ఇద్దరు! సందడి తగ్గినట్లు చిన్నబోయాం! "ఏమండీ! మనం వెళ్లిపోయినంక – ఆడపిల్లలను పిలిచి – విస్తరేసి అన్నం ఎవరు పెడ్తారండీ?" అని బళ్లుమంది కమల! నాకు దుఃఖం ఆగలేదు!

"మేం లేమా? ఎందుకు ఏడుస్తారు!" అని ఓదార్చారు విజయ – విరించి.

మళ్లీ విజయ్ రొమాన్సులో పడ్డాడు. ఆ పిల్లపేరు నాగమ్మ అని పెట్టుకుందాం. మాకు దగ్గరి చుట్టం. సికిందరాబాదు అత్తిల్లు. అత్త సతాయిస్తూందంటే ఆశ్రయం ఇచ్చాం. భర్త సహితంగా మా ఇంట్లోనే మకాం. పాముకు పాలు పోస్తున్నామని గ్రహించలేదు. భర్తలో కొంత బలహీనత ఉన్నట్లుంది – విజయ్‌ను పట్టింది. విచిత్రం ఏమంటే – భర్త సహకరించాడు! ఇంట్లోనే సరసాలు! నేను ఎప్పుడూ ఇంట్లో ఉండను కదా! కమల వారించింది. ఆమె మీదకు ఎగబడ్డాడు విజయ్. అప్పటిదాకా కమల నాకు తెలియనీయలేదు. నేను భార్యాభర్తలను ఇంట్లోంచి వెళ్లగొట్టాను. వారు తమ ఇంటికి పోలేదు. వేరే కాపురం పెట్టారు. విజయ్ మకాం సుమారు అక్కడే!

ఈ పరిస్థితుల్లో విజయ్ B.Sc పాసయ్యాడు. అతణ్ణి ఇక్కడనుంచి తప్పించాలనుకున్నాను. నానా తంటాలుపడి ఆంధ్రవిశ్వవిద్యాలయంలో M.Sc సీటు సంపాదించాను. విజయ్‌ను విశాఖలో ఉంచాం. అక్కడికీ చేరుకున్నారు నాగమ్మా – దాని మొగుడూ!



తండ్రిగారి తీర్థ తిరువధ్యయనాలలో దాశరథి సోదరులు

అది 1979. నేను విశాఖనుంచి వచ్చాను. నన్ను చూచి కమల నివ్వెరపోయింది! నేను చిక్కి శల్యం అయిపోయానట! డాక్టర్ బుచ్చిలింగం చూచారు. "మనసు పాడు చేసుకున్నావు. డయాబెటిక్స్ తెచ్చుకున్నావు" అన్నారు. **వాటినుంచి మధుమేహం నన్ను వరించింది. దానికి విడాకుల చట్టం వర్తించదు.**

1979 జూన్ 30 న మా నాయనగారు ఉభయ వేదాంత ప్రవర్తక విద్వాన్ దాశరథి వేంకటాచార్యులవారు ఖమ్మంలో పరమపదించారు. మా చిన్నమ్మ ఇటు మాకు తెలియపరచి, అటు దహనం చేయించింది. మేము వెళ్లి బూడిద దర్శించుకున్నాం.

1898 – విళంబి ఆశ్వీజ శుక్ల సప్తమి గురువారంనాడు భద్రాచలంలో జన్మించిన మా నాయనగారు 30–6–1979 సిద్దార్థి ఆషాఢ శుక్ల షష్ఠి శనివారం ఖమ్మంలో పరమపదించారు. మా తాతగారినీ, నాయనమ్మనూ దహనం చేసిన మున్నేటి వద్దనే మా నాయనగారూ దహనం అయినారు.

అన్నయ్య నేనూ సికిందరాబాదులో వైభవంగా – మా నాయనగారికి తీర్థ తిరువధ్యయనాలు చేశాం. మా చిన్నమ్మ కొడుకులు లక్ష్మణ – విష్ణు ఖమ్మంలో వేరుగా చేసుకున్నారు.

1979 సెప్టెంబరు పదిన మా చిన్నమ్మాయి ప్రసవించి – ఆడపిల్లను కన్నది. ఆమె సహజ. ఆమెయే మాకు మనవరాలు. 1981లో ఉదయకు ఉజ్వల్ – 1987లో సుధకు సమీర్ కలిగారు.

అదే సంవత్సరం ఒకనాటి రాత్రి విరించి బాల్కనీలో చదువుకుంటున్నాడు. తరవాత చూస్తే పుస్తకాలున్నాయి. విరించి లేడు! వస్తాడేమోనని చాలసేపు చూచాం, రాలేదు. వీధిలోకి పరిగెత్తాం. పిల్లలు చెప్పారు – విరించిని ఎవరో కార్లో పట్టుకుపోయారట! కమల తల బాదుకొని ఏడ్చింది. ఆమెను ఇంటికి చేర్చాను. నాకు గుండెదడ మొదలయింది.

రాత్రి చాల అయింది. రాలేదు. తెలిసినచోటుకల్లా టెలిఫోను తిప్పాం. ప్రయోజనం లేదు. ఇద్దరం బాల్కనీలో భగవంతుని ప్రార్థిస్తూ కూలబడ్డాం. అర్ధరాత్రి దాటింది. రక్తసిక్తం అయివచ్చాడు విరించి. కమల అతనిని చూచింది. విరుచుకు పడిపోయింది. నేను ఇద్దరిని చూచాను, శిలనైనాను. నేను తేరుకునేవరకు విరించి కమలను లేపుతున్నాడు. నేను డాక్టరును పిలుచుకు వచ్చాను. వారు విరించికి కట్టు కట్టారు, కమలకు తెలివి వచ్చింది.

తెలిసిందేమంటే – స్టూడెంట్స్ యూనియన్ కక్షలు. ఆ తరువాత విరించి కూడా స్టూడెంట్స్ యూనియన్ వైస్ ప్రెసిడెంటు అయినాడు!

# ముప్ఫయి అయిదు

## వెలుగుల దారి:

1968 లో కమల పిల్లలను తీసుకుని తల్లిగారి సహితంగా వాళ్ల గ్రామం – అడ్లూరు – వెళ్లింది. భాయిజాన్ నన్ను వాళ్ల ఇంట్లోనే ఉండమన్నారు, మకాం అక్కడే పెట్టాను.

మారేడుపల్లిలో మా ఇంటిముందు గుడిసెల గూడెం ఉంది. కొంతదూరంలో కల్లు కాంపౌండు. ఆ పేదల జీవితాలు దాపరికాలు ఎరుగనివి. విచిత్రములు, విశేషములు, నన్ను ఎంతగానో ఆకట్టుకున్నాయి.

అక్కడి స్థలానికి విలువ లేనపుడు – అక్కడ వాళ్లు నివాసాలు ఏర్పరచుకున్నారు. ఇప్పుడు వాటికి విలువ వచ్చింది. వాళ్లను తొలగించడానికి భూస్వామి ప్రయత్నం. వారికి అన్యాయం జరగరాదని నా సంకల్పం. గిరి – నేనూ గుడిసెవాసులకోసం పోరాటం జరిపాం. బెదిరింపులు సహించాం. పోలీస్టేషన్లో గడిపాం. మొత్తానికి భూస్వామి ఆటలు సాగనీయలేదు. అతను తోక ముడిచాడు.

గొర్రె గొల్లను నమ్మదు. కసాయిని నమ్ముతుంది. గుడిసె వాసులు భూస్వామిని నమ్మారు. వాడు డబ్బు పాచిక విసిరాడు, వీరు లొంగిపోయారు. అంతే, హక్కులు వదులుకున్నారు. కనీసం మాకు ముఖాలు చూపలేదు!

ప్రజా పోరాటంలో ఎదురు దెబ్బతినడం ఇప్పుడే! **దోపిడి వేషం మార్చుకుని వస్తున్నది! రంగుల వెనక రూపాన్ని శ్రామికులు చూడలేకపోతున్నారు! కొత్త వేషపు కేపిటలిజం పేదలను మభ్యపెట్టడం నేర్చింది!**

దీనిని ఇతివృత్తంగా తీసుకొని ఒక నవల ప్లాను చేశాను. రచన భాయిజాన్ ఇంట్లోనే ప్రారంభించాను. ఒక అధ్యాయంలో కపటం ఎరుగని పేదల జీవితం – మరొక దాంట్లో కుట్రలు తప్ప ఎరుగని విలాస జీవితం. ఇలా నవల సాంతం సాగించాలని ప్రణాళిక.

నా అలవాటు ప్రకారం తెల్లవారు జామున లేచి వ్రాసేవాణ్ణి. నిత్యకృత్యాలు ముగించుకుని, భోజనంచేసి ఆఫీసుకు వెళ్లేవాణ్ణి. సాయంకాలం తిరిగి వచ్చేవరకు చిరంజీవి అది చదివేవారు.

తొలినాటి సాయంత్రం వచ్చాను. "భాయిజాన్! సహజ కవిత్వం – సహజ రచన – దీన్నే అంటారేమో! ఒక్క తుడుపులేదు. ఒక్క తప్పులేదు. గంగా ప్రవాహంలా సాగిపోతున్నది.. ఎలా సాధ్యం భాయిజాన్?" అని అడిగారు.

చిరంజీవి మాటలు నాకు ఆశ్చర్యం కలిగించాయి. నేను అలా వ్రాస్తానని ఎన్నడూ అనుకోలేదు. మన విషయం కూడా మరొకరు చెపితేగాని అర్థం కాదు!

భాయిజాన్‌కు తన రచన ఎంతకూ నచ్చదు. అనేకసార్లు కొట్టేయ్యాలి. అప్పుడుగాని సాపు ప్రతి సిద్ధంకాదు. అందువల్ల నా రచన చూచి ఆశ్చర్యపడ్డారు.

నేనూ కొంత ఆలోచించిగాని సమాధానం చెప్పలేకపోయాను. "భాయిజాన్! మీరు అడిగేదాకా నేనూ ఆలోచించలేదు. రెండు కారణాలు కావచ్చును అనుకుంటా.

1. ప్రణాళిక చాల ముందుగా సిద్ధం చేసుకుంటాను.
2. వ్రాసేపుడు సమాధిలోకి వెళ్లిపోతాను. మరే ధ్యాసా ఉండదు. ఏ పదం – వాక్యం – పాత్ర – సంఘటనలలో ఉంటానో అందులో లీనం అయిపోతాను."

భాయిజాన్ దీర్ఘంగా ఆలోచించారు. వారు ఎటో విహరించివచ్చారు. "కావచ్చు, భాయిజాన్! ఈ తొలి వాక్యం బాగులేదని కాదు. నాకు ఎలాగో ఉంది. మార్చడం మంచిది అనిపిస్తున్నది" అన్నారు.

ఆ వాక్యం ఏమిటో చిత్తగించండి.

"నీగ్రోయువతి బుగ్గలా తారురోడ్డు మెరుస్తుంది." ఆ రోడ్డుమీద – అర్ధరాత్రి – తాగిన నలుగురూ తందనాలాడుతుంటారు – అదీ కథాక్రమం.

ఏ పరిస్థితిలోనూ తారురోడ్డు నీగ్రోయువతి బుగ్గ కావడానికి వీల్లేదంటారు. అంతటి మెత్తనిది ఆ మనసు! మార్చక తప్పలేదు. సీను మొత్తం మార్చాను. కల్లు దుకాణం నుంచి ప్రారంభించాను.

'తాగినన్క ఊరుకుంటె మజ ఏమున్నది? పాడవే పోచన్నా!" పిచ్చయ్య ప్రోత్సహించాడు. పోచయ్య అందుకున్నాడు.

*"చమేలీకె మండ్వే తలె*
*దోబదన్ ప్యార్‌కీ ఆగ్ మెఁ జల్ గయీఁ"*

అది మఖ్దూం పదం. అది కల్లుదుకాణందాకా పోదు – మార్చమంటాడు బాయిజాన్!

ఆ సాయంత్రం ఒక వింత జరిగింది. నేను టాక్సీలో వస్తున్నాను. డ్రైవరు ముస్లిం వృద్ధుడు. ట్రాఫిక్ రెడ్‌లైట్ వచ్చింది, టాక్సీ ఆగింది నేను డ్రైవరుతో 'సుర్ఖ్ సవేరా గయా' అన్నాను. డ్రైవరు ఆవేశభరితుడు అయినాడు. "సుర్ఖ్‌సవేరా" అనే మఖ్దూం కవిత చదవడంలో పచ్చలైటు వచ్చిందీ గమనించలేదు. నేను చెపితే నడిపించాడు. మఖ్దూం గురించి చెపుతూనే ఉన్నాడు. "లీడర్ దో తరహకె **హోతేహైఁ సాబ్! ఏక్ అప్నాఘర్ ఉజాడ్తాహై అవుర్ దున్యా బసాతాహై, దూస్రా దున్యా ఉజాడ్తాహై అవుర్ అప్నాఘర్ బసాతాహై మఖ్దూం పహలే దర్జేకా లీడర్‌థా సాబ్!** హౌజింగ్ బోర్డ్ కా మెంబర్ రహ్ బినా మకాన్‌కె మరా" (నాయకులు రెండు రకాలవాళ్లుంటారండీ! ఒకరకం తన ఇల్లు కూల్చుకుంటాడు – లోకాన్ని నిర్మిస్తాడు. రెండోరకం లోకాన్ని నాశనం చేస్తాడు – తన ఇల్లు నిర్మించుకుంటాడు. మఖ్దూం మొదటిరకం నాయకుడు. హౌజింగ్ బోర్డు మెంబర్ అయ్యీన్నీ ఇల్లులేక గతించాడు.)

డ్రైవరు చిరంజీవి ఇల్లు చేరేవరకూ చెపుతూనే ఉన్నాడు. ఇల్లు వచ్చింది. భాయిజాన్ను పిలిచాను. మఖ్దూమ్‌ను గురించి డ్రైవరు చెప్పిన నిరంతర ఉపన్యాసంతో చిరంజీవి ఉక్కిరి బిక్కిరి అయినారు. డ్రైవరుకు చాయ్ తాగించి పంపించారు. కల్లు దుకాణంలో మఖ్దూం కవితను గురించి పెదవి విప్పలేదు.

నవలకు భాయిజాన్ "మాయజలతారు" అని పేరుపెట్టారు.

లక్ష్మి – పోచయ్య భార్యాభర్తలు పోరాట సందర్భంలో దుర్మార్గుల వలలో చిక్కుకుంటారు. పోచయ్య స్మగ్లర్ల బంధంలో చిక్కుకుంటాడు. ముంబాయిలో పట్టుబడ్తాడు. జేలుకు వెళ్తాడు. లక్ష్మి దుర్మార్గులచేత చిక్కుతుంది. బోగం కొంపకు చేరుతుంది, సర్వనాశనం అవుతుంది.

నవల చివరలో లక్ష్మి – పోచయ్య గూడెం చేరుకుంటారు, పోచయ్య లక్ష్మిని చూస్తాడు. "లచ్చీ!" అని పరిగెత్తుతాడు.

"ఆగు, నన్ను తాకకు. నేను చెడినదాన్ని" అంటుంది లక్ష్మి.

"నా లచ్చి అగ్గి. దానికి చెదలు అంటదు, నవ్వు నా లచ్చివి. అప్పుడూ నా లచ్చివే, ఇప్పుడూ నా లచ్చివే" అని పోచయ్య ఆమెను కౌగిలించుకుంటాడు.

ఇది కథకు నా ప్లాను. 'లచ్చి ముద్దుబిడ్డ – ఆమె చెరచబడరాదు భాయిజాన్! ఆ పిల్లను చెరిస్తే నేను సహించలేను. ఏమయినా చేయి. ఆమె శీలం చెడరాదు" అంటారు భాయిజాన్.

"లక్ష్మి నవలలో పాత్రమాత్రమే! ఆమె చెడితేనే పోచయ్య పవిత్ర ప్రేమ వ్యక్తం అవుతుంది" అని భాయిజాన్‌కు నచ్చచెప్పడానికి, నా శక్తివంచిన లేకుండా, ప్రయత్నించాను. భాయిజాన్ వప్పుకోలేదు మార్చక తప్పలేదు.

లక్ష్మి కూలి పనిచేస్తూ నాలుగో అంతస్సునుంచి పడిపోతుంది. ఆమె పూర్వస్మృతులు కోల్పోతుంది. ఆమెను ఎవరు తాకినా 'టచ్‌మీనాట్' లా ముడుచుకుపోతుంది. అలా లక్ష్మి శీలాన్ని కృత్రిమంగా పరిరక్షించాల్సివచ్చింది. అందుకుగాను అసహజ సన్నివేశాలు కల్పించాల్సివచ్చింది. నవలలో అసహజాలు ఉండవచ్చు – అప్రాకృతాలూ – అవాస్తవాలూ ఉండరాదంటాడు 'రాల్ఫ్‌పాక్స్.'

**అసహజమునకు – అవాస్తవమునకూ భేదం ఏమి? అసహజం జరగడానికి అవకాశం ఉన్న సంఘటన. యాదృచ్ఛికంగా పాత్రలు కలుసుకోవడం – విడిపోవడం లాంటివి. స్మృతి కోల్పోవడం లాంటివి. అప్రాకృతం – అవాస్తవం మానవజీవితంలో జరగడానికి వీలులేని సంఘటనలు. చనిపోయినవాడు లేచి రావడం – యువకుడు బాలుడు అయిపోవడం లాంటివి.**

అసహజాలకు నవలలో అవకాశం ఉంటే ఉండవచ్చు. కాని సామాజిక నవలలో అలాంటివి ఉండరాదని నా అభిప్రాయం. ఏదో ఒక రకంగా నావి అన్నీ సామాజిక నవలలే. ఒక్క 'మాయజలతారు'లో లక్ష్మిపాత్ర విషయంలో తప్ప అసహజత ఎందులోనూ చేర్చలేదు. 'లక్ష్మి' విషయంలో భాయిజాన్ భావుకతకు వారి జీవితంతో సంబంధం ఉందని అటుతరువాత అర్థం అయింది.

**రచయిత భావుకుడు కావాలి. కాకుంటే బహుశః రచనలు చేయలేడు. అయితే అతనికి – ఆమెకు ఉండాల్సిన లక్షణాల్లో అది ఒకటి మాత్రమే! భావుకత మాత్రమే రచయితను చేయలేదు. భాయిజాన్ ఇప్పటిదశలో భావుకతలో కొట్టుకుపోతున్నాడు. వ్యక్తి ఎల్లప్పుడూ ఒకే దిశలో – దశలో ఉండడు! మార్పు ప్రకృతి లక్షణం! వారు అప్పుడు అలా ఉన్నారు. అంతే!**

ప్రగతి వారపత్రికలో "చిల్లరదేవుళ్లు" ముగియవచ్చింది. ప్రగతి సంపాదకులు చంద్రంగారు అచంచల దేశభక్తులు. నిజాయితీకి నిజరూపం. వయోవృద్ధులు. వారికి నా రచనల మీద వాత్సల్యం. 'మాయజలతారు' ప్రచురించే అవకాశం తమకు కల్పించాల్సింది అని జాబు వ్రాశారు. జాబు భాయిజాన్‌కు చూపించాను. 'ఆంధ్రప్రభ నవలల పోటీకి పంపుతాం. ఆర్థికంగా అవసరాలలో ఉన్నావు. అక్కరకు వస్తుంది' అన్నారు.

నా మనసు 'ప్రగతి – చంద్రం' గారి వైపే గుంజుతున్నది. కాని ఎందుకో చిరంజీవి భాయిజాన్ ముందు నీరసపడిపోతాను, 'ఆంధ్రప్రభ'కే పంపడం జరిగింది.

భాయిజాన్ నిరంతర ప్రయత్నం తరువాత కూడా 'మాయజలతారు'కు బహుమతి రాలేదు. కామరాజుగారు అప్పుడు ప్రభలో పనిచేశారు. వారి ప్రయత్నంవల్ల

'మాయజలతారు' సాధారణ ప్రచురణకు అంగీకరించబడిందని భాయిజాన్ నాకు వివరించారు! నేను వారి మాట నమ్మకుండా ఉండలేదు.

ఆ తరవాత పోటీలకు పంపడం మానేశాను. పోటీల విషయంలో నా అనుభవం మనవి చేస్తాను.

ప్రభ సచిత్ర వారపత్రిక హైదరాబాదు వచ్చిన కొత్త రోజులు. విద్వాన్ విశ్వం సంపాదకులు. నవలల పోటీకి నన్ను ఒక న్యాయ నిర్ణేతగా నియమించారు. నాకు అందిన పది నవలల్లో ఒకటి–రెండు–మూడు బహుమతులకు నిర్ణయించాలి. మిగతావి సాధారణ ప్రచురణలు అవుతాయి.

నేను ఒక 'విలువైన' నవలను ప్రథమ బహుమతికి సూచించాను. రెండవ నిర్ణేతలు అడపా రామకృష్ణరావుగారు వారూ అదే సూచించారు. మూడవ నిర్ణేత పేరు గుర్తులేదు. వారూ అదే సూచించారు.

విశ్వంగారు నవల విలువ విషయంలో ఏకీభవించారు. పత్రిక పాలసీ విషయం – వ్యాపార విషయం వివరించారు. మరొక నవల సూచించారు. మేము ససేమిరా అంగీకరించలేదు. మేము సూచించిన నవలకే ప్రథమ బహుమతి ఇచ్చారు. కాని దానికి పాఠకులనుంచి 'స్పందన' లేదు. మరుసటి సంవత్సరంనుంచి సమాధానపడ్డాం. విశ్వంగారు ఉన్నన్నాళ్లు నేను న్యాయ నిర్ణేతగా ఉన్నాను.

చంద్రంగారినుంచి ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. నాకు సిగ్గు అనిపించింది. మరొక నవల వ్రాసి ప్రగతికి ఇవ్వాలని సంకల్పించారు. గార్లలో మేము జరిపిన పోరాటం ఇతివృత్తంగా ఒక నవల ప్లాను చేశాను. అందులో నవాబుల విశృంఖల జీవితం – మైదానప్రజల జీవితం, ఉద్యమం – ఆటవికుల ప్రాకృతిక జీవనం, వారి పోరాటం చిత్రించాలనుకున్నాను. ఇది నేను రచించిన తెలంగాణ సామాజిక జీవిత చిత్రణలో రెండవ నవల అవుతుంది. దానికి 'మోదుగుపూలు' అని నామకరణం చేశాను. గత రెండు దశాబ్దాల్లో అడవులు అంతరించాయి. మోదుగులు – మోదుగుపూలు లుప్తం అయినాయి. అందువలన కొంత వివరణ అవసరం అయింది.

1. పాలాశం సంస్కృత సాహిత్యంలో ప్రశస్తం అయింది. తెలుగు సాహిత్యంలో మోదుగుపూలకు సముచిత స్థానం ఉంది. 'పూచిన మోదుగుంబువుల పుక్కిటనుండి వసంత రాజు రక్తాచమనంబు సేయు సమయంబిది' అన్నాడు దాశరధి "రుధిరసంధ్యా" గీతంలో. అందులోనే –

   'అగ్నిజ్వాలిక వోలిక
   నగ్నముగా నాట్యమాడు నవవాసంతో
   ద్విగ్న పలాస ప్రసవా
   లగ్న జపాలక్త రక్తరమ కనుపించెన్' అన్నారు దాశరథి.

2. మోదుగు వసంతంలో వళ్లుదాచుకోకుండా పూస్తుంది. ఆకులుండవు – అగ్నికణికల్లాంటి పూలు తప్ప. మోదుగు వనం పూసినప్పుడు రక్తాంబరం నేలకు వాలినట్లుంటుంది. మోదుగు ఎరుపు. క్రాంతికి – విప్లవానికి సంకేతం.
3. మోదుగులు అడవిలోనే ఉంటాయి. ఆటవికులు – గిరిజనులు అడవుల్లోనే ఉంటారు. వారు కోపిస్తే నిప్పులు కురిపిస్తారు!

4. హోళికలో – వసంతోత్సవంలో – మోదుగుపూల రంగు చల్లుకుంటారు. అది అంటిందంటే బట్ట ఎరుపు వదలదు చిరగాల్సిందే! విప్లవవాది సహితం అంతే!

అందుకు నా నవల "మోదుగుపూలు" అయింది. చిల్లరదేవుళ్లు కొన్ని గుణపాఠాలు నేర్పింది. అందులో కులాలు సూచించే పేర్లు పెట్టాను. రామారెడ్డి – రామచంద్రరావు వంటివి. నేను తెలంగాణం పర్యటించిన సందర్భంగా 'అ పేరుకు రావు తగిలిస్తే సరిగ్గ మా దొరవుతడు' అనటం విన్నాను.

అంతేకాక – ఒక కులం మొత్తానికి దోపిడిముద్ర వేయడం సరికాదు అనిపించింది. అందువల్ల తరువాత వ్రాసిన నవలల్లో పేర్లచివర కులాలను తొలగించాను.

"చిల్లరదేవుళ్లు" యాసలో ఎక్కువ ఉర్దూకలిసి పాఠకులకు కొంత క్లిష్టత ఏర్పడింది. అందువల్ల యాస మాత్రం ఉంచి – ఉర్దూను పలచబడేశాను.

'మోదుగుపూలు'లో ఒక అధ్యాయం మైదాన ప్రజా జీవితం, తరువాతది కోయదొరల జీవితం వివరించాలని నిర్ణయించాను. కోయ దొరల జీవితంతో – పోరాట కాలంలో – నాకు పరిచయం ఉంది. కాని ఒక నవలలో వివరించాల్సినంత అవగాహన లేదు. అందువల్ల వారి జీవితం అధ్యయనం చేయడానికి కోయగూడేలకు వెళ్లాను. దశాబ్దాల్లో గిరిజనుల జీవితాల్లో ఎన్నో మార్పులు వచ్చాయి, నేనూ మారాను. వారు నన్ను గుర్తించలేదు. నన్ను 'సర్కారుమనిషి' అనుకున్నారు. వారిని గురించి నాకు వివరించలేదు. నేను నిరుత్సాహపడింది వాస్తవం. ప్రయత్నం మాత్రం విరమించలేదు.

అడవుల మధ్య ఉంది 'పినిరెడ్డిగూడెం' అనే పల్లె. ఆ పల్లెలో ఉంటారు మా మిత్రులు పెంట్యాల చలమయ్యగారు. వారి ఇంట్లో మకాం వేశాను. అది మా ఇల్లే! నేను అతిథినీ కాను! చలమయ్యగారికి నా అవసరం విన్నవించాను. నిలువెల్లా నవ్వారు, పరిహాసం చేశారు. 'వాళ్ల బతుకుల్ల ఏమున్నదయా నువ్వు రాయటానికి? గుమ్మతుగ మాట్లాడుతున్నావు' అన్నారు. అయినా వారిని విడువలేదు. నా వెంట గూడేలకు రావడానికి వప్పించాను.

ఇద్దరం వెళ్లాం, చెట్లకిందగ మంచాలమీద మేము – నేలమీద కోయదొరలు. నేను అడిగేవి దొరలకే వింతగా తోచాయి. పెద్దలను పిలుచుకు వచ్చారు. పెద్దలంటే వయసుకు పెద్దలు. వారికి వయసు తెలియదు, గుర్తులు చెపుతారు. నూరేళ్లు దాటినవారు ఉన్నారు. వారికి వివరాలు తెలుసు, చెప్పడం రాదు. అలా అనేక రోజులు అనేక గూడేలకు తిరిగాం. వారితో ఉన్నాం, తిన్నాం, పన్నాం, అలా అవుతేగాని వారు నమ్మరు. అట్ల కూసింత కూసింత కూర్చినం. మంకిడి సమ్మయ్య – సిద్దిబోయిన రామయ్య – సిద్దిబోయిన లక్ష్మయ్య వివరాలు అందిచ్చిన్రు.

"మా కతంత 'బడ్డె' చెప్పతడు – బడ్డెనడుగుండి" అన్నారు వారు. కష్టపడి బడ్డెను పట్టుకున్నాం. 'బడ్డె' వాళ్ల పురోహితుడు. అతడు కొన్ని వివరాలు చెప్పాడు. అప్పటికి అక్కడే ఆపాం. చాలరోజులయింది. పినిరెడ్డి గూడెం తిరిగి రానున్నాం.

"రేయంత – కొండమీద – నెమళ్లు – కూసినయి – వాన తగులుకుంటది – బిన్న గూటికి చేర్నని" అని దొరలు మమ్ము సాగనంపిన్రు.

'ఎండ బాగా కొడ్తుంటే వానంటా రేమిటి? పిచ్చివాళ్లు' అనుకుంటూ నడక

సాగించాం. ఇంకా ఊరికి చేరుకోకముందే జోరున వాన తగులుకుంది. తడిసి ఇంటికి చేరుకున్నాం.

పశుపక్ష్యాదుల ప్రవర్తనలను బట్టి రుతువుల క్రమం తెలుసుకునే విద్య వారికి తెలుసు. ఈ విద్య కోసం కూడా ఎన్నో ప్రయోగాలు జరిగి ఉంటాయి. అది వంశ పారంపర్యంగా – సంప్రదాయబద్ధంగా వారికి అందుతున్నది. అవి మన సాంకేతిక పరిజ్ఞానం కన్న పరిపుష్టంగా ఉంటున్నాయి. ఎలుకలు – జిర్రపురుగులు ప్రవర్తన రానున్న భూకంపాన్ని తెలుపుతుందని చైనావారు రుజువు చేశారు. **ఆది మానవులనుండి మనం గ్రహించవలసింది చాల ఉంది!**

రెండురోజులు విశ్రాంతి. మళ్లీ బయలుదేరాం. అప్పుడు నక్కా సూరయ్య కోయల పురాణగాథలను డోలు వాయించి వినిపించాడు. ఆ డోలు – ఆ విన్యాసం – ఆ కథ చెప్పే పద్ధతి! ఓహ్ – హృదయంగమం!

"నాగలోకంల నాగేంద్రునికి రాచపుండు పుట్టింది. పన్నెండేండ్లనుంచి బాధపెడు తున్నది. నాగేంద్రుడు కోయదొరలను పిలిచిండు. నయం చెయ్యుమన్నడు. తాము కోరింది ఇయ్యాలెనన్నరు దొరలు. అట్లనే ఇస్తనన్నడు నాగేంద్రుడు. బెరంబోయిన రాజు సిరిబొద్దు చెట్టును తవ్విండు. రాచపుండుకేసి కట్టిండా, రాచపుండు నయమయిందా, నాగేంద్రుడు నిద్రపోయిండా, అట్లనే పన్నెండేండ్ల నిద్రపోయిండు."

పన్నెండేండ్లకు నాగరాజు లేచిండు. కోయ దొరలను కోరుకొమ్మన్నడు. బెరంబో యినరాజు ఏం కోరిండయా అంటే – నాగతంబళ్ల వాయిద్యం వాయించెటోడు కావాలెనన్నడు. వాడు నా ప్రాణం – నేనెట్ల ఇత్తును? అన్నడు నాగేంద్రుడు. అట్లయితే మాట తప్పె – మేం పోతున్నమన్నడు బెరంబోయినరాజు. నాగేంద్రుడు మాట తప్పలేదు, కన్నీరు కారుస్తనే పంపించినాడు!

*"నాగేంద్రుడు వాడిని సాగనంపినాడు.*
*వాడే కోయదొరలకు డోలువాడయినాడు –"*

అలా కథ చెప్తూపోయినాడు సూరయ్య. వారి విశిష్టత గమనించాలి. నాగేంద్రుని వారు ధనధాన్యాలు అడుగలేదు. వాద్యం అడిగారు మనసును కదిలించే వాద్యం అర్జించడానికి ఆదిమానవుని తపన గ్రహించాలి!

వల్లభదాసు నరసింహ, గుంగుల ముత్తయ్య జముకుమీద ఆదిశక్తి కథ వినిపించారు.

"జలప్రళయ మొచ్చింది. కలిఘమంత మునిగిపోయింది. సముద్రంమీదికి కలకోడి వచ్చింది, గుడ్డు పెట్టింది, అది వేయేండ్లకు చితికింది. కలకోడి దుఃఖించింది. ఇంకొక గుడ్డు పెట్టింది. అది వేయేండ్లకు చితికింది. కలకోడి దుఃఖించింది. మూడో గుడ్డు పెట్టింది, దానిమీద కూర్చున్నది, పొదిగింది, అప్పుడు గుడ్డు పగిలింది.

*పగిలిన పైచెక్క ఆకాశమయ్యింది*
*కిందచెక్క బోర్లపడి బూమి అయ్యింది*
*గుడ్డునుంచి కామధేనువు పుట్టింది*
*ఈశ్వరుడు పుట్టిండు విష్ణు పట్టిండు"*

సృష్టిని గురించిన వారి ఊహ ఎంత సొగసుగా ఉంది! ఎంత అందంగా ఉంది!!

కలకోడి అంటే కాలం అనే కోడి. ఆకాశం – భూమి ఏర్పడడాన్ని ఎంత అందంగా చెప్పాడు!!! వీటిని అన్నింటిని వివరంగా 'మోదుగుపూలు'లో చేర్చాను.

కోయల జీవిత వృత్తాంతాలు – విశేషాలు తెలుసుకోవడానికి పడుతున్న బాధలను గురించి భాయ్‌జాన్ చిరంజీవికి ఉత్తరం వ్రాశాను. వారు వ్రాసిన జవాబు రచయితలందరికీ వర్తిస్తుంది.

**"వ్రాస్తున్న నవల - వేదనలేందే వేదం కాదు కదా! ఎన్నో దృశ్యాలు మనస్సునీ, కాలాన్నీ కల్లోల పరుస్తాయి. ఇన్ని ఆలోచనల్నీ వేదలనల్నీ చీల్చుకుని, దూసుకుని వచ్చిందే కవిత - లేదా మరొకటి."**

**"వ్రాయి, మనస్సు ఉష్ణజలకాసారం కానీయ్, వ్యధార్త జీవుల ఆక్రందనల కొక రూపం రానీయ్, మూగ జీవుల మూగకళ్లకి, మూగబాసకి వెలుతురూ, ధ్వనినీ కల్పించు, అది లక్ష్యం. విడిచిన బాణాలు వెనక్కు రానీకు. గుచ్చుకోవలసిన చోట గుచ్చుకోనీ, చండప్రచండ వాతూలహతికి – పండుటాకులు ఎండుటాకులు రాలనీ, పోనీ. ప్రతి అధ్యాయం – ప్రతి పుట మానవేతిహాసాన్ని ప్రతిబింబించనీ! నెత్తురోడ్చే కళ్లలో, లోలో రేపటిపై ఆశ చిగురించనీ, రేపటి కలలు ఎదగనీ, పెరగనీ! ఏ ఇనుప చేతులు వాటిని దునుమలేవని రుజువుచేయ్. ప్రణయగాధావల్లరి పఠిస్తున్న ఈ తరానికి ప్రళయ ఝంఝానిలం తాకనీ!"**

కోయదొరల మధురాతిమధుర జీవిత విశేషాలు మూటకట్టుకుని గార్ల జాగీరులోని పినిరెడ్డిగూడెంనుంచి సికిందరాబాదు చేరుకున్నాను. ఆంధ్రప్రభలో 'మాయజలతారు' కన్న ముందు ప్రగతిలో మోదుగుపూలు రావాలని ఆశయం! పెద్దలు చంద్రగారిని నిరాశపరచరాదు, అదీ లక్ష్యం!

'మోదుగుపూలు' రచన 7–2–1970న ప్రారంభించాను. రాత్రింబవళ్లు వ్రాశాను. 18–5–1970న – అంటే, సుమారు నూరురోజుల్లో పూర్తిచేశాను.

'మోదుగుపూలు' మేము గార్లలో నిర్వహించిన పోరాటగాథకు కళారూపం మాత్రమే! అందువల్ల రచనా కాలంలో అందులో లీనం అయిపోయాను. ఒక అనంత సానుభూతి పొందాను. ఒక ఆవేశం, ఒక ఆవేదన, ఒక స్పందన – అది వర్ణనాతీతం!

'మోదుగుపూలు' పాత్రలు సుమారు వాస్తవాలు. అవి జీవం పోసుకున్నాయి! నా రచనతోపాటు ఎదిగాయి. ఒక దశలో అవి నా కలానికి లొంగలేదు, నేను చెప్పినట్లు వినలేదు. ఎదురు తిరిగాయి! భీష్మించాయి!! అప్పుడు వాస్తవంగా కోపం రావాలి! నాకు ఆనందం కలిగింది! ఆడాలనిపించింది. పాడాలనిపించింది! నేను సృష్టించిన పాత్రలకు వ్యక్తిత్వం వచ్చింది. అవి స్వతంత్రిస్తున్నాయ్! ఎంత సంతోషం! మనం కన్నబిడ్డలూ అంతే!

'మోదుగుపూలు' రచనలో అనేక అనుభవాలు – ఉసిళ్లపుట్టలా ముసురుకుంటున్నాయి! అన్నీ చెప్పను. ఒక్కటి మాత్రం చెప్పకుండా ఉండలేను:

తాసిల్దారు ఇంటిముందరి కట్టుగొయ్యకు వడ్డెర పీరయ్యను కట్టేశారు. విపరీతంగా కొట్టారు. రక్తపు ముద్ద అయినాడు. కట్టుగొయ్యవాడు గోరీలగడ్డకే పోతాడు. ఇది

మామూలు. కాని, ఈ కొలిమిలోంచి విప్లవం రాజు కోవాలి! అందుకు ఏం చేయాలి? ఏం చేయాలి? ఏం చేయాలి???

మూడురోజులు నిద్రాహారాలు లేవు. సిగరెట్లు పెట్టెలు పెట్టెలు భస్మం అవుతున్నాయి! టీ బిందెల కొద్ది తాగుతున్నాను. ఆలోచన రాదు, రాదు. ఆ బాధ – ఆవేదన – ఆ తపన – చెప్పరానివి! అది ప్రసవవేదన. నాకు పిచ్చెక్కుతుందని కమల భయం!

ఒకనాటి రాత్రి పడుకుని ఉన్నాను. నిద్రకాదు – కాని నిద్రలాంటి అవస్థ. కిటికీలోంచి ఒక వెలుగు వెల్లువ – అందులోంచి శిలువలు – శిలువలు వరుసగా వస్తున్నాయి. నాలో ప్రవేశిస్తున్నాయి. అలా కొంతసేపు జరిగింది. మెరుపులా ఆలోచన వచ్చింది! ప్రసవం జరిగిపోయింది! ఆనందమే – ఆనందం!

మోదుగుపూలునుంచే ఉటంకిస్తాను:–

“ “తమ్ముడూ నాగేశ్! ఇన్ని శతాబ్దాల తరువాత ఒక ప్రాణిని గురించి తపించేవారు ఈ రోజు వెలిసినారు. ఇది తక్కువా? ఈ ఆవేదన అందరిలో వస్తే నువ్వనుకున్న విప్లవం దానంతటు అదే వస్తుంది. ఏం చెయ్యాలె? ఇదే నేను ఆలోచిస్తున్న.”

“బాగా ఆలోచించు, మంచి నిర్ణయానికిరా” నాగేశ్.

“అందుకోసమే ఇంత తపన. తమ్ముడూ! కాస్త ఓపికపట్టు”

మళ్లీ మౌనం వెలిసింది. కాని అందులో భయం లేదు, ఆవేదన ఉంది, తపన ఉంది, తపస్సు ఉంది.

అమాంతంగా ఆలోచన వచ్చేసింది రఘుకు. నాగేశ్ బుజాలు పట్టుకొని ఊపుతూ అన్నాడు:–

“నాగేశ్! ఈ రోజు గుడ్‌ఫ్రైడే! క్రీస్తు శిలువకెక్కిన రోజు, అమరుడైన రోజు”

నాగేశ్ వెర్రిగా చూచాడు. అతనికేమీ అర్థం కాలేదు.

“శిలువ క్రైస్తవులకు పవిత్ర చిహ్నం. దాన్ని చూచి వారు క్రీస్తుపడిన యాతనలు గుర్తుకు తెచ్చుకుంటారు. పీరయ్య మనకు జీసస్, కట్టుగొయ్య మనకు శిలువ.”

“వహ్వా! మంచి ఆలోచన, అయితే ఏంచేద్దమంటరు?”

‘పీరయ్య సమాధి నిర్మించాలె. దానిమీద కట్టుగొయ్య పాతాలె. దాన్ని చూచి ప్రజలు తమ బాధ్యత గుర్తించాలె. అది దౌర్జన్యానికి చిహ్నం కావాలె. రాక్షసత్వానికి సమాధి కావలె. ఏమంటరు?”

‘ఇన్కిలాబ్ జిందాబాద్’ అన్నాడు నాగేశ్ పిడికిలి బిగించి.

అలా ముగించిన “మోదుగుపూలు” తొలుత భాయిజాన్‌కు చూపించాను. కాస్త విసుక్కున్నారు, చిరాకు పడ్డారు. లాంఛనంగా ‘మంచి నవల వ్రాశావు’ అన్నారు. ఒక్కొక్కసారి మనిషి వ్యక్తిత్వం గుణాలను - సిద్ధాంతాలను - తత్వాలను - మతాలను మూసేస్తుంది! గ్రహణం పట్టిస్తుంది!! రచన విషయంలో తమను సంప్రదించలేదని భాయిజాన్ అలక!!! సంప్రదించకపోవడానికి కారణం “మాయజలతారు.”

నేను చంద్రంగారిని సంతృప్తిపరచగలిగాను. 'మాయజలతారు' కన్న ముందుగానే 13–11–70 నుంచి ప్రగతిలో 'మోదుగుపూలు' సీరియల్ ప్రారంభం అయింది. 5–3–1971న ముగిసింది. 'మాయజలతారు' ఆంధ్రప్రభలో 6–1–1971న మొదలయి 14–5–1971న ముగిసింది.

'రఘులాంటి వ్యక్తి ఎలా మార్పుచెందుతూ వచ్చాడో చిత్రీకరణ బావుంది. మంగలి రాముడు వగైరా దుర్భరజీవితాన్ని సహించలేక చివరకు ఎలా బ్రతుకుదెరువుకోసం సాహస చర్యలకు దిగారో సహేతుకంగా సహజంగా నిరూపించాడు. కథాగమనంలో పాత్రల స్వభావాలు ఎలా మారుతూ వచ్చాయో చిత్రించడంవల్ల రచయిత అభిప్రాయాలు పాత్రలపై రుద్దుతున్నాడనే భావం పాఠకునికి కలుగదు. అదే ఉత్తమ రచనా విధానమని నా అభిప్రాయం – అందుకు మీకు అభినందనాలు."

*– మద్దుకూరి చంద్రశేఖరరావుగారు – ప్రగతి సంపాదకులు, 2–11–70.*

"మా చంద్ర రాజేశ్వరరావుగారు మిమ్ములను ఆంధ్రగోర్కీ అన్నారు. ఇక ఆ స్థాయిని మీరు ముందు ముందు నిలుపుకోవలసిన బాధ్యత మీపైన పడిందన్నమాట! అందుకు సంసిద్ధులుకండి." *– నిడమర్తి ఉమారాజేశ్వరరావు, 3–11–71.*

"Tales of great heroism are told with a passion for liberty and truth. The local colouring is genuine"

*- Achanta Janakiram, Indian Express, 8-2-1972.*

"నవలాసాహిత్యంలో పీరియడ్ నావెల్స్ అనే విభాగం ఉన్నట్లు పేర్కొంటారు. వాల్టర్ స్కాట్ 'వేవర్లీ' నవలలు ఆ జాతికి చెందినవే. స్కాటిష్ చరిత్రలోని ఉజ్వల ఘట్టాలను నవలలుగా రచించాడాయన. "చిల్లరదేవుళ్లు", "మోదుగుపూలు" నవలలు ఇటీవలి చరిత్రకు సంబంధించినవైనా వాటిని పీరియడ్ నావెల్స్‌గా పేర్కొనాలి. విప్లవోద్యమ చరిత్రకు ఇలాంటివి అవసరం. అది 'ఘాటెక్కిన గంధకధూమం.' ఆ కీలలూ, ధూమమూ జగమంతా వ్యాపించాలి – వ్యాపిస్తాయి."

*– సృజనరహి, జనవరి, 1972.*

విప్లవోద్యమ నిర్మాతల్లో ఒకరు కె. జి. సత్యమూర్తి. బహుశః 1975–76 లో వారు అరెస్టయ్యారు. వారిని ముషీరాబాదు జేల్లో ఉంచారు. వారిని చూడాలని గిరిగారికి చెప్పాను. వారు జేలు అధికారులతో మాట్లాడారు, ఏర్పాటు చేశారు.

గిరి, నేను మిఠాయిలు తీసుకుని జేలుకు వెళ్లాం. సత్యమూర్తిగారిని ఒక గదిలో కలిశాం. 'సత్యమూర్తి'ని చూడ్డమే నా సంకల్పం. చర్చించడం కాదు, గిరి – సత్యమూర్తి మాట్లాడుతున్నారు, నేను చూస్తూ కూర్చున్నాను.

'ఇతను ఎవరో తెలుసా. మా గురువు – దాశరథి రంగాచార్య' అని గిరి పరిచయం చేశారు. అది విన్న సత్యమూర్తి చప్పున లేచారు. వచ్చి నన్ను గట్టిగా కౌగిలించుకున్నారు. " 'మోదుగుపూలు' గొప్ప విప్లవ నవల వ్రాశారు. మేము అండర్ గ్రౌండులో ఎంతో ఉత్సుకతతో సీరియల్ చదివాం" అన్నారు. ఇంకా ఎంతో పొగిడారు సత్యమూర్తిగారు.

'తొలి నవలతోనే నవలారచయితలలో అగ్రేసరులయి సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన శ్రీ రంగాచార్యులవారు ఈ రెండవ నవల 'మోదుగుపూలు'తో భారతీయ

నవలా సాహిత్యంలోనూ పెద్దపీట వేసుకున్నారు.' – డాక్టర్ తిరుమల రామచంద్రగారు "మోదుగుపూలుకు సువాసన" సమకూర్చిన పీఠికనుంచి.

'మోదుగుపూలు' ప్రజాపోరాటాల్లో ప్రాణా లర్పించిన పవిత్రాత్మలకు అంకితంగా సమర్పించాను.

'మోదుగుపూలు' అందం అయిన బాపూ వేసిన ముఖచిత్రంతో 1971, 76, 85లలో మూడు ముద్రణలను 'విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్' వారు ప్రచురించారు.

'మోదుగుపూలు' రేడియో నాటకం 19–7–1984న ప్రసారం అయింది. శ్రీమతి శారదా శ్రీనివాసన్‌గారు నిర్వహించారు. నాటకంలో అనేక ఘట్టాలు శ్రోతలను కదిలించాయి. మంచి స్పందన వచ్చింది.

రేడియో నాటకం విన్నవారిలో కొందరు 'మోదుగుపూలు' సినిమా తీస్తామని వచ్చారు. గోపాలకృష్ణగారు ఎక్కువసార్లు వచ్చారు, శ్రద్ధ కనబరచారు. 'క్రాంతి పిక్చర్స్' వారికి సినిమా హక్కులు ఇచ్చాను. సంభాషణలు వ్రాసి ఇచ్చాను. వారు పాటలు రికార్డు చేసారు. కొన్ని సీనులు చిత్రీకరించారు. అంతటితో ఆగిపోయింది.

'మోదుగుపూలు' గురించి పరిశోధన జరిపారు శ్రీ P. S. ప్రకాశ్. తెలుగు విశ్వవిద్యాలయం, వారికి M.Phil ప్రదానం చేసింది.

ప్రగతిలో "చిల్లరదేవుళ్లు" "మోదుగుపూలు" సీరియల్స్ వస్తున్నప్పుడే సోదరి వాసిరెడ్డి సీతాదేవిగారి 'సమత' 'వైతరణి' సీరియల్స్‌గా వచ్చాయి. అప్పటినుంచీ మాకు మైత్రి ఏర్పడింది. కొంతకాలం వారు మా కుటుంబంలో మసలారు. నాకు అకాడమీ బహుమతి వచ్చిన తరువాత సంవత్సరంలో సీతాదేవిగారి 'సమతకు' అవార్డు వచ్చింది. మేము రచనలోనూ జీవితంలోనూ కొంతవరకు ఒకే అభిప్రాయం గలవాళ్లం. మేమిద్దరం చాల సభల్లో సమావేశాల్లో మాట్లాడాం. 'జననాంతర సౌహృదాని' అంటాడు కాళిదాసు.

సోదరి డాక్టర్ వాసిరెడ్డి సీతాదేవి 'మోదుగుపూలు' ఇంగ్లీషులోకి అనువాదం జరుగుతున్నదని చెప్పారు.

"చిల్లరదేవుళ్లు" 1938 పూర్వపు తెలంగాణ జీవితాన్ని, "మోదుగుపూలు" 1942–48 తెలంగాణా జనజీవిత సంగ్రామాన్ని చిత్రించాయి. తరువాతి ప్రజాజీవిత చిత్రణకు రంగం సిద్ధం చేసుకుంటున్నాను.

సరిగ్గా ఆ సమయంలో భారతదేశంలో "నక్సలైట్" ఉద్యమం మొదలయింది. యువకులనూ మేధావులను ఆకర్షించింది. ప్రపంచ వ్యాప్తంగా అందరూ తుపాకి గొట్టంల్లోంచి విప్లవం వస్తుందన్న మావో నినాదాన్ని గురించి ఆలోచన సాగించారు. ఆనాడు అది ప్రపంచాన్ని ముంచెత్తేట్లు కనిపించింది.

నేను ఒక సాయుధ విప్లవం – అది అవతరించిన సామాజిక పరిస్థితులను చూచాను – పాల్గొన్నాను. అవగాహన చేసుకున్నాను. అప్పటి – ఇప్పటి సామాజిక స్థితిగతుల్లో సాయుధ విప్లవం విజయవంతం అవుతుందని నేను విశ్వసించలేదు. **ప్రజాఉద్యమాలు ఒకరి విశ్వాసాలకోసం ఆగవు. కిస్‌కె రోకారుకాహై సవేరా? పొద్దు పొడుపును ఎవడు ఆపగలిగినాడు?**

**రచయితగా జరుగుతున్న పోరాటాన్ని అర్థం చేసుకోవడం నా కర్తవ్యం. రచయిత సమకాలీన ఉద్యమాల ప్రభావానికి దూరంగా ఉండరాదు, ఉండలేడు. ప్రత్యక్షంగానో - పరోక్షంగానో ఉద్యమాల ప్రభావం రచయిత మీద పడక మానదు. రచన చేయడం - చేయకపోవడం అతను స్పందించిన తీరును బట్టి ఉంటుంది.**

నేను నక్సలయిట్ల ఉద్యమంతో ప్రభావితుణ్ణి అయినాను. విశ్వసించలేదు. సమాజాన్ని ఒకసారి పరిశీలించి చూచాను. స్వాతంత్ర్యసముపార్జనా రంగంనాటి విలువలు – సమాజంలోని అన్ని రంగాల్లోనూ – అంతరించాయి. స్వార్థం సంకుచితత్వం – అవినీతి – దోపిడి – దిసమొలతో నృత్యం చేస్తున్నాయి. సమాజంలో 'దోపిడి' ఒక జీవిత విధానం అయింది. రాజకీయ నేతలు – తమ స్వప్రయోజనం కోసం – మతం – కులం – ప్రాంతం – భాషలపేర ప్రజలను చీల్చి తమ పబ్బం గడుపుకుంటున్నారు! దీన్ని సవాలు చేసినవాడు – ఎదిరించినవాడు లేకుండా పోయాడు.

అలాంటి నికృష్టదశలో నక్సలయిట్లు నిజాయితీతో సమాజాన్ని ఎదిరించారు. ఒక్క చరుపు చరచారు. అందరినీ ఆలోచించేటట్లు చేశారు! ఇది మహత్కార్యమే! అది విశ్వాసాలకు అతీతం అయింది. వాళ్ల ప్రయత్నాన్ని కనీసం అభినందించడం కర్తవ్యం అవుతుంది.

సమాజాన్ని విభిన్న దృక్కోణాలతో పరిశీలించాను. నా పరిశీలనలో ఈ సమాజంలోనే తీవ్రవాదం సృష్టించే లక్షణాలు కనిపించాయి. ఇప్పుడు ఉన్న పరిస్థితుల్లో యువతీ యువకులకు ఉన్నమార్గాలు రెండే. ఈ సమాజాన్ని మార్చడానికి నడుం కట్టి ప్రాణాలు అర్పించడం. ఇది నక్సలయిట్ల మార్గం. ఈ సమాజం మారదని తెలుసుకుని ఆత్మహత్య చేసుకోవడం. ఇది హిప్పీల మార్గం. ఉభయులను సిద్ధం చేసిన సామాజిక స్థితిగతులను వివరించదలచాను.

ఈ పూర్వరంగంతో ఒక నవల ప్లాను చేశాను. ఒక సాయుధ పోరాటం ముగియనున్న 1948 నుంచి మరొక పోరాటం రగలడం వరకు గల విస్తృతపరిధిలో రచన సాగించాను. రెండు సాయుధ పోరాటాల మధ్య ఉద్యమాల పేర అనేక అలజడులు వచ్చాయి. ఈ సందర్భంలో నిజాయితీగల భూదానోద్యమం లాంటివి వచ్చాయి. అమ్మలు – బాబాలు, మతకలహాలూ – ప్రాంతీయ ద్వేషాలు వచ్చాయి. అన్నింటినీ – 'పద్మపత్ర ఇవాంభసా' తామరాకు మీద నీటిబొట్టువలె – వివరించాను. నా స్వంత అభిప్రాయాలు రుద్దడానికి ప్రయత్నించలేదు. నిజాయితీగల నక్సలయిట్లు ప్రకాశం – గీత సిద్ధం కావడానికి దారి తీసిన పరిస్థితులను వివరించాను. ఆత్మవినాశానికి సిద్ధం అయిన 'గాంధీ' పతనానికి దారితీసిన పరిస్థితులు వివరించాను. ప్రకాశం – గాంధీ ఏదోరకంగా రామునికి పుట్టినవాళ్లే! రాముడు సామాజిక దౌర్భాగ్యాలన్నింటికీ ప్రతీక!

ప్రకాశం రామునికి పుట్టాడు. సాయుధపోరాటం నిర్వహించిన వీరభద్రం పోషణలో పెరిగాడు. సాయుధపోరాటం అణచడానికి అనేక హత్యలు చేయించిన పోలీసాఫీసరు కూతురు గీత! ఆమెకు ప్రకాశంతో మైత్రి!

ఈ నవలకు "జనపదం" అని పేరు పెట్టాను.

'జనపదం' అంటే పల్లె – దేశం. ఈ నవలకు భూమిక మాత్రం తెలంగాణం. ఇది సకల భారత సమాజానికి ప్రతీక.

'జనపదం' జనులపదం. పదం పాట అవుతుంది. పదం అడుగు అవుతుంది.

'జనపదం' జనుల లక్ష్యం. 'పదం' చేరవలసిన స్థానం. 'పరమపదం' అన్నింటికి మిన్నఅయిన స్థలము. జనపదం ప్రజల స్థలము.

జనపదంలోని పాత్రలన్నీ ఏదో ఒక విశ్వాసానికి – ఉద్యమానికి – దౌర్భాగ్యానికీ సంకేతాలు.

జనపదంలో కొన్ని పాత్రలకు విపరీత నామాలు వాడాను. బలరామయ్య బలం లేనివాడు. "రాముడు" సకల దుర్గుణ రాశి. "గాంధీ" దుర్మార్గుడు. "గీత" విప్లవ ప్రతీక. "వీరభద్రం" వీర్యం ఉడిగినవాడు.

సుమతి – సరస్వతి – ప్రకాశం సార్థక నామధేయులు.

"జనపదం" పెద్ద నవల. రెండు వాల్యూముల్లో 750 పేజీల నవల. తెలుగు పెద్ద నవలల్లో ఒకటి.

"జనపదం"లో అధ్యాయాలు లేవు. నవల నాలుగు భాగాలది. ప్రతి భాగం రెండు ఎన్నికల మధ్యకాలపు పతనాన్ని వివరిస్తుంది.

తొలి ఎన్నికలో విప్లవ ప్రతీక వీరభద్రం గెలుస్తాడు.

రెండో ఎన్నికలో వీరభద్రం ఓడిపోతాడు. బలరామయ్య దొర గెలుస్తడు.

మూడో ఎన్నికలో బలరామయ్య ఓడిపోతాడు. స్వార్థం కోసం ఎంత నీచానికయినా దిగజారే రామయ్య గెలుస్తాడు.

నవల చివరన ప్రకాశం వీరమరణం పొందుతాడు

'విప్లవం వర్ధిల్లాలె' గట్టిగా కేకపెట్టాలనుకున్నాడు ప్రకాశం, పెట్టలేకపోయాడు.

రక్తంలో వేలు ముంచాడు. నేలమీద రాస్తున్నాడు ప్రకాశం.

'విప్లవం వర్ధి....." చేయి వాలిపోయింది. తల వాలిపోయింది.

విగతాత్మకు వీడ్కోలు చెపుతున్నట్లు తుపాకులు పేలుతున్నాయి!

"పేలుతున్నాయి తుపాకులు

పేలుతుంటాయి తుపాకులు" – ఇవి నవల చివరి వాక్యాలు.

బలరామయ్య దొర, సాయుధ విప్లవానికి ఓడినాడు, పారిపోయినాడు. పోలీసు చర్య జరిగింది. సాయుధ పోలీసులతో ఊరికి దిగినాడు.

అమృతవాణి బలరామయ్య అడబాప. ఊరిలో అతనికి స్వాగతం చెపుతుంది. అసువులు బాస్తుంది.

రాముడు, బలరామయ్య – అమృతవాణిల సంతానం. దొరను ఎదిరించడానికి సాయుధుల్లో చేర్తాడు. సాయుధుల డబ్బు ఎత్తుకొని వస్తాడు. బలరామయ్యను – కర్దరును ఆశ్రయిస్తాడు.

వీరభద్రం సాయుధుల నాయకుడు. ఉద్యమం విరమిస్తాడు. ఎన్నికల్లో తొలిసారి గెలుస్తాడు. విచిత్ర పరిస్థితుల్లో మంగమ్మను చేరదీయాల్సివస్తుంది. మంగమ్మ కొడుకు ప్రకాశానికి తండ్రి కావలసి వస్తుంది. తుదకు కార్మిక నాయకుడుగాకూడా ఓడిపోతాడు.

ఉద్యమపు పరువంలో సరస్వతి – వీరభద్రం ప్రేమించుకున్నారు. విడిపోయారు. పరిస్థితుల విపర్యాసం సరస్వతిని ముసలి బలరామయ్య భార్యను చేస్తుంది. ఆమె భూదాన ఉద్యమాన్ని ఆశ్రయిస్తుంది. వంచనకు గురి అవుతుంది, ఓడిపోతుంది. 'అమ్మ' అయి ఆశ్రమం నిర్మిస్తుంది. అమెరికా వెళ్తుంది. 'అమ్మ' వెంట బలరామయ్యా వెళ్లిపోతాడు.

ఆస్తికోసం సుమతిని రామయ్య చేసుకుంటాడు. అనుమానంతో 'భర్త' ఆమెను వేధిస్తాడు. గాంధీ సుమతి కొడుకు. ఆమెకు కొడుకూ దక్కడు, భర్తా దక్కడు. భారతనారికి ప్రతీక.

సుమతి హిప్పీలతో స్పృహలేక పడివున్న తన కొడుకు గాంధీని చూచింది. 'నాయ్నా! గాంధీ!' అని చేతులు చాచి ఉరికింది. గాంధీ వినలేదు, లేవలేదు. "ఎవరు నువ్వు?" అడిగాడు గాంధీ. ఆ ప్రశ్న సుమతిమీద పిడుగులు కురిపించింది.

"నాయ్నా! గాంధీ! నేనురా! నేను నీ తల్లిని. తొమ్మిది నెలలు మోసి కన్నదాన్ని. నా రక్తం పంచుకొని పుట్టినవురా నువ్వు. నా పేగులో పేగువు, నేనే నువ్వురా, నువ్వే నేను. అమ్మా! అనరా నన్ను అమ్మా! అను."

గాంధీ నుంచున్నాడు. 'మీ సంబరంకోసం చేసిందాంట్లోంచి మేం బయటపడ్డాం. దానికి ఇంత కథ. ఇన్ని ముసుగులు! నీకూ నాకూ సంబంధం లేదు. నేను రాను, వెళ్లిపో' అన్నాడు. ఒక అమ్మాయి వచ్చింది. గాంధీని లాక్కుపోయింది." ఇది హిప్పీ ఉదంతం!

ఎన్ని ఉద్యమాలు వచ్చినా, విపత్తులు వచ్చినా, విపరీత పరిణామాలు సంభవించినా తామరాకుమీది నీటిబిందువువలె అంటక ముట్టక ఉన్నది సుమతి మాత్రమే! ఆమెకు ఏమీ లభించలేదు. ఆమెవి రిక్త హస్తాలు. ఆమెయే మన భారత నారి. ఆమె మన సంప్రదాయానికి ప్రతీక!

జనపదం రచన 30–5–1970లో ప్రారంభించి 20–8–1974లో పూర్తి చేశాను. నాలుగు సంవత్సరాల నిరంతర కృషి ఫలితం "జనపదం." ఈ కాలంలో వచ్చిన వివిధ రంగాల ఉద్యమాలను – అలజడులను, కల్లోలాలను అధ్యయనం చేయడానికి – అవగాహన చేసికోవడానికి ఎందరో మిత్రులు – కార్యకర్తలు సహకరించారు, యజ్ఞం ఒంటరిగా చేయలేం.

"జనపదం" 1974–75లో ఆంధ్రజ్యోతిలో సీరియల్‌గా వచ్చింది. అప్పటి ఆంధ్రజ్యోతి సచిత్ర వారపత్రిక సంపాదకులు పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు – నవలకు పాఠకులనుంచి సరియైన స్పందన లేదనీ, తొలి భాగంతో ముగిస్తామనీ వ్రాశారు. అప్పుడు నాకు డొక్క ఆపరేషను అయింది. ఆసుపత్రిలో ఆ ఉత్తరం చూచాను. ఎక్కువ శ్రమించి వ్రాసిన నవల. అప్పటి కాలపు కథ జనపదం. దాన్ని పాఠకులు ఆదరించడం లేదంటే బాధ కలిగినమాట వాస్తవం.

అయితే, తొలిభాగం ముగియక ముందే సుబ్రహ్మణ్య శర్మగారి నుండి మరొక ఉత్తరం వచ్చింది. వారి పర్యటన సందర్భంగా – జనపదం నవలను పాఠకులు అపారంగా ఆదరిస్తున్న విషయం అర్థం చేసుకున్నాననీ, సీరియల్ కొనసాగుతుందనీ వ్రాశారు. నవలలో మూడు భాగాలు సీరియల్‌గా వచ్చాయి.

"జనపదం" నవలను నవయుగ పబ్లిషర్స్‌వారు రెండు భాగాలుగా ప్రచురించారు.

నవల సీరియల్‌గా వస్తున్నప్పుడు తొలి సంచిక చదివి పెద్దలు మద్దుకూరి చంద్రశేఖరరావుగారు ఉత్తరం వ్రాశారు:–

"ఈ రోజు ఆంధ్రజ్యోతి వారపత్రిక సంచికలో మీ సీరియల్ నవల 'జనపదం' చదివాను. పూర్వస్మృతులు ఒకేసారి flash back అయినట్లుగా ఉత్తేజితుడనయ్యాను. "చిల్లరదేవుళ్లు" "మోదుగుపూలు" లాంటి ఉత్తమ కళాఖండాలకంటే ఉత్తమ శిఖరంగా వెలుగొందబోతున్న కళాఖండంగా నాకు ద్యోతకం అయింది. మీ రచనలో నేను చదివింది కొద్ది భాగమే అయినప్పటికీ మిమ్ములను అభినందించడానికి కారణమయింది."

ఆ తరువాత చంద్రంగారు పరమపదించారు!

"జనపదం" తొలిభాగపు ఆవిష్కరణ 24–8–76 మంగళవారంనాడు శ్రీకృష్ణ దేవరాయాంధ్రభాషానిలయంలో జరిగింది. దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించారు. ఇంకా సభ మొదలుకాలేదు. వారు నన్ను పక్కకు పిలిచారు. "మీరు గొప్ప విప్లవ నవల వ్రాసినారు. సర్కారు ఉద్యోగంలో ఉన్నారు. ప్రమాదం కాదు గదా!" అని అడిగారు.

"రామానుజరావుగారూ! నేను రచయితగా బ్రతుక దలచాను – ఉద్యోగిగా కాదు. నేను రోడ్డుమీదినుంచి వచ్చాను. మళ్లీ అక్కడికి పోగలను" అన్నాను.

"మీ సాహసమును అభినందించవలె" అన్నారు రామానుజరావుగారు.



దాశరథి రంగాచార్య నుంచి 'జనపదం' అంకితం
అందుకుంటున్న ఆళ్వారుస్వామి ధర్మపత్ని పట్టికోట యశోదమ్మ

నాటి సభలో 'జనపదం' వట్టి కోట ఆళ్వార్‌స్వామిగారికి అంకితం సమర్పించాను. సజల నయనాలతో వట్టికోట యశోదమ్మగారికి శాలువా కప్పి "జనపదం" అందించాను. అందుకున్న యశోదమ్మగారి కన్నీరు నిలువలేదు.

రామానుజరావుగారు – అడపా రామకృష్ణరావుగారు – వాసిరెడ్డి సీతాదేవిగారు నవలను ఎంతగానో ప్రశంసిస్తూ ప్రసంగించారు.

ఆ సభలో మా అన్నయ్య డాక్టర్ దాశరథి మాట్లాడారు. వారు ఆ రోజు నా జన్మదినం అని వెల్లడించి, నాకు ఒక పెన్ను బహూకరించడంతో సభలో ఉత్సాహ తరంగాలు ఉవ్వెత్తున లేచాయి. అన్నయ్య "జనపదం" గురించి గొప్పగా మాట్లాడారు.

ప్రచురణ కర్త ఆళ్ల సాంబశివరావుగారి కృతజ్ఞతలతో సభ ముగిసింది.

"జనపదం" నవలను పత్రికలు ప్రశంసించాయి. "జనపదం గొప్ప పుస్తకం అంటే చాలదు. కాని అంతకంటే ఏమనాలి? ఈ బాణుని కాదంబరితో ఆంధ్రులు మత్తిల్లిపోవాలి, పోతున్నారు కూడా" – ఆంధ్రజ్యోతి వారపత్రిక – లత.

'ఈ ఉద్యమాల పరిణామాలవల్ల ఒక గ్రామం తెలంగాణంలో ఎంత క్షోభకు, ఎటువంటి సంఘటనలకు స్థావరమైందో నవలా రచయిత అతి సూక్ష్మవిషయాల లోతులకుపోయి తమదైన ఒక ప్రత్యేక శైలిలో రచన చేశారు.' – ఆంధ్రప్రభ వారపత్రిక – రాడికల్ 19–12–76.

"దేశంలో భూసమస్య పరిష్కారం కానంతవరకూ, దున్నేవారికి భూమి దక్కనంత కాలం జనపదంలాంటి నవలలు గుర్తుకు వస్తూనే ఉంటాయి. దేశంలో సోషలిజం వచ్చేవరకూ ఇది అనుభవాలు పొదిగిన సాంఘిక నవలగా ఉంటుంది. సోషలిస్టు వ్యవస్థ ఏర్పడిన తరువాత ఇదీ, ఇకముందు రంగాచార్య కలం నుంచి ఉద్యమాలే ఊపిరిగా వెలువడే నవలలూ చారిత్రకాలు అవుతాయి. ఆ సత్తా అతనికి కలానికి ఉంది. ఉద్యమకాంతులకు ఎంత చక్కటి కళా సమన్వయం!" – ఈనాడు – ఏబికె – 28–9–76.

"రచయిత ఉద్రేకి. రచనలో ఉద్విగ్నత ఉంది. ఆవేశం ఉంది. చిత్తశుద్ధికి లోటులేదు. వీటన్నిటా పాఠకుడు రచయితను అభ్వానిస్తాడు. ముందే వివరించినట్లు వస్తువును ఎన్నుకోవడంలో రచయిత కొత్తబాట ఎన్నుకున్నారు. జీవితాన్ని విశ్లేషించే ప్రయత్నం సాగింది. అందుకవసరమైన శిల్పం రచయితలో కనిపిస్తుంది."

*ప్రజాశక్తి – శ్రీహరి, 21–11–1976.*

"కవితలో శ్రీశ్రీగారు నూతన పంథాలు తొక్కినట్లే నవలలో దాశరథి రంగాచార్యగారు అంతకంటే సరికొత్త మార్గాన్ని శోధించేరని జనపదం నవల చదివిన ప్రతి పాఠకుడు భావించక తప్పదు." – ఆంధ్రభూమి, *12–12–76.*

'జనపదం' గురించి వివిధ పత్రికల్లో ప్రత్యేక వ్యాసాలు వచ్చాయి. 'జనపదం' పరిశోధనకుగాను శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు Ph.D ప్రదానం చేశారు.

ఒకసారి కడపలో ఏదో సభకు వెళ్లాను. కారు దిగుతున్నాను. జి. ఎన్. రెడ్డిగారు చూచారు. పరిగెత్తుకు వచ్చారు. నన్ను కౌగిలించుకున్నారు. 'గొప్ప నవలలు వ్రాశారు' అన్నారు. రెడ్డిగారు అప్పుడు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖకు అధిపతి. వారు, కుమారి ప్రేమావతితో "చిల్లరదేవుళ్లు" M.Phil చేయించారు.

ఆమెతోనే 'దాశరధి రంగాచార్య రచనల్లో జనపదం' అనే విషయంమీద Ph.D చేయించారు. ఈ పరిశోధనలో కేతు విశ్వనాధరెడ్డిగారు ఎంతో సాయపడినారు. G.N. రెడ్డిగారు వైస్‌చాన్సలర్‌గా ఉన్నపుడు కుమారి డి.ఎం. ప్రేమావతికి డాక్టరేటు వచ్చింది. తరువాత G.N. రెడ్డిగారు ఆకస్మికంగా పరమపదించారు.

'దాశరధి రంగాచార్య రచనల్లో జనపదం' పరిశోధక వ్యాసం పుస్తకంగా వచ్చింది. 1988లో నా షష్టిపూర్తి సభలో ఆవిష్కరించబడింది.

పోరాటాలు జరుగుతునే ఉంటాయి. ఆదర్శ భారతదేశాన్ని దర్శించాలనే అపేక్ష నాకు కలిగింది. 'రామున్నది ఏది నిజం?' అనే నవల వ్రాశాను. 'రామున్నది ఏది నిజం – అది ఒకటే సోషలిజం' అనే దాశరధి పద్యపాదం ఈ నవలకు పేరు.

దేశంలో ప్రజా విప్లవం వస్తుంది. ఒక కార్మిక నాయకుడు ప్రధాని అవుతారు. పాత మంత్రిని అరెస్టు చేస్తారు. చెరసాలలో పెడ్తారు. 'పామం'కు ప్రస్తుత ప్రభుత్వం తమ విధానాలను వివరించడం 'రామున్నది ఏది నిజం?' ఇతివృత్తం. ఇది ఒక ఊహా చిత్రం. ఇంతకూ అది పామంకు వచ్చిన కల! మంత్రిగారు మేల్కొంటారు, దడుచుకుంటారు. తమ మంత్రి పదవి దక్కాలంటే –

"ప్రాంతీయాభిమానాలను రెచ్చకొట్టాలి!
భాష పేర జనాన్ని పురికొల్పాలి!
నదీజలాల వివాదాలు రెకేత్తించాలి!
సరిహద్దు తగాదాలు ఉసి కొల్పాలి!
మత మహమ్మారిని వ్యాపింపజేయాలి!"
ఇదీ నవల ముగింపు.

నేను వ్రాసినట్లే సోషలిజం కలగా మిగిలిపోవడం విచారకరం!

రామున్నది ఏది నిజం 'విశాలాంధ్ర'లో సీరియల్‌గా వచ్చింది 1973లో ఆంధ్రప్రదేశ్ యువజన సమాఖ్యవారు ప్రచురించారు.

"ఈ సోషలిజం ఊహా చిత్రంలో ఉందా? లేదా? ఉంటే ఎక్కడెక్కడ ఎంత శాతంలో ఉంది అనేది చర్చించుకోవడానికీ – చర్చించుకుని ఈ ఊహా చిత్రం రామున్నది ఏది నిజం అని తెలుసుకోవడానికి ఈ పుస్తకాన్ని అందరూ చదివి తీరాల్సిందే." (ప్రజావాహిని – కాకరాల – 11–12–1974)

"I deem this novel as one of the most convincing and effective writing to impress on people the good results of socialistic state. There is discernible discipline in the compositon of this novel."

- Indian Literature - D. Ramalingam - May, 1992.

"చీకటి తెరలు ఎకడివక్కడ విచ్చిపోతుంటే ప్రాభాత మందానిలాలతో కలిసి ఉషోదేవి అవతరించింది" – "చిల్లరదేవుళ్లు" చివరి వాక్యం.

ఉద్యమరూపంలో అవతరించిన ఉషోదేవి 'మోదుగుపూలు'కు ప్రారంభం.

'కులశేఖరరావు' రంగారెడ్డి ఖద్దరు ధారులయి దిగారు – మోదుగుపూలు ముగింపు వాక్యం.

ఖద్దరుధారి బలరామమయ్య గ్రామంలో ప్రవేశించడం జనపదం ప్రారంభం.

'పేలుతుంటాయి తుపాకులు' జనపదం ముగింపు వాక్యం.

ఉద్యమాలు సాధించిన సోషలిజం 'రానున్నది ఏది నిజం?' ప్రారంభం.

1938కి పూర్వం నుంచి బవిష్యత్ భారతదర్శనం దాకా సాగిన, సాగుతున్న, సాగనున్న ప్రజాజీవితాన్ని కళారూపంలో నవలలుగా రచించాను. ఇది జీవనధార, ఆలోచనా ప్రవంతి. ఒక స్రోతస్సునులా అధ్యయనం చేయాల్సినవి.

## ముప్పయి ఆరు

### కలం శ్రామికులు:

మానవచరిత్ర అనంతం అయింది. ఈ అనంత చరిత్రలో శ్రమను, శ్రామికుణ్ణి గురించి ఆలోచించి ఒక సిద్ధాంతాన్ని నిర్వచించిన తాత్త్విక శిఖామణి కారల్ మార్క్స్. ఆ సిద్ధాంతాన్ని కార్యరూపానికి అనువదించి రష్యాలో శ్రామిక విప్లవానికి విజయపతాక ఎగురవేసిన మహితాత్ముడు లెనిన్. రష్యాలో ఏర్పడిన సోషలిస్టు **ప్రభుత్వం** ప్రపంచవ్యాప్తంగా మేధావులను, ప్రజలను కుదిపివేసింది. ఆ ప్రభావంతో **భారతదేశంలో** కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించింది.

ప్రజా ఉద్యమాలకు రచనలూ – రచయితలూ ఉపకరిస్తారని తొలుత గ్రహించింది కమ్యూనిస్టు పార్టీ. ఆ పార్టీ ప్రభావంతో 1936 లో భారతదేశంలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. లక్నోలో జరిగిన తొలి సభలకు ప్రేమ్‌చంద్ అధ్యక్షత వహించారు.

యాభయి సంవత్సరాల క్రితం ఆంధ్రదేశంలోనూ అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. అరసం ఆనాటి రచయితలమీద అనంతం అయిన ప్రభావం వేసింది. నాడు ఉప్పెనవలె సాగిన అన్ని ఉద్యమాలకోసం రచనలు చేయడమేకాక రచయితలు ప్రత్యక్షంగా ఉద్యమాల్లో పాల్గొన్నారు. కవిత్వం మాత్రమే సాహిత్యంగా చలామణి అయినపుడు వచనంకూడా సాహిత్యం అనీ, వచన రచయితలూ ప్రభావం వేయగలరని నిరూపించింది అరసం.

నాలుగు – అయిదు దశకాల్లో అరసం సుమారు సర్వవ్యాపకం అయి విజృంభించింది. అరసం 'ఛాందసులు' అని ముద్రచేసినవారు సహితం అభ్యుదయులం అనిపించుకోవడానికి ఆరాటపడినారు!

**వ్యక్తి జీవితంలోనూ, సామాజిక జీవితంలోనూ, ఉద్యమాల చరిత్రలోనూ హెచ్చుతగ్గులు, ఒడిదొడుకులు, మిట్టపల్లాలూ తప్పవు.** పార్టీలు నడిపే పోరాటాల్లో ప్రజలు మాయం అయినారు. పదవులు ప్రాముఖ్యం వహించాయి. వాటికోసం కుమ్ములాటలు – వేర్పాటుల కథలు సాగేయి.

మన స్వాతంత్ర్య సంగ్రామం 1857–1947ల మధ్య 90 సంవత్సరాలు సాగింది. ప్రధాన పోరాటం మహాత్ముని నాయకత్వంలో సాగిన కాంగ్రెసు పోరాటమే! స్వాతంత్ర్య సముపార్జన కోసం – కాంగ్రెస్‌పార్టీ – అందిన ప్రతి రాతినీ అంగ్రేజు సర్కారుమీద విసిరింది. స్వాతంత్ర్యం ఏమిటి? అది వచ్చింతరువాత ఏం జరుగుతుంది? వివరించలేదు. అంగ్రేజువాడు పోవడమే పరమావధిగా ఉద్యమం సాగింది.

గాంధీవాదం వ్యక్తిగత జీవితానికి ఉపకరిస్తుంది. పారిశ్రామిక సమాజానికి అంతగా ఉపకరించదు. ఉద్యమ కాలంలోనూ కాంగ్రెస్ గాంధీజీని అనుసరించింది. గాంధీవాదాన్ని అనుసరించలేదు.

మనకు స్వాతంత్ర్యం వచ్చింది. అంటే స్వప్రయోజనపరులకు – పదవీ పరాయణులకు – దొంగ వ్యాపారులకు – టక్కుటమారు విద్యలవారికి స్వాతంత్ర్యం వచ్చింది. పండిత్‌జీకి ఇష్టం ఉన్నా లేకున్నా వారు భారతదేశంలో ప్రవేశపెట్టింది కేపిటలిజం – పెట్టుబడిదారీ విధానమే. సర్కారు పరిశ్రమలు సోషలిజం కాదు.

పెట్టుబడిదారీ విధానపు నిజస్వరూపం "లాభం." లాభంకోసం వారు రంగుల ప్యాకింగులో విషాన్ని విక్రయించగలరు! అది బలవర్ధకం అని నమ్మించగలరు!! నమ్మిస్తున్నారు!!! మనం ప్రస్తుతం పోషిస్తున్న కంపెనీలన్నీ మానవ వినాశకారకములే! అది తెలియడం బ్రహ్మను తెలియడమంత దుస్తరం!!

స్వాతంత్ర్యంమీద సామాన్యులు – సాధారణ ప్రజానీకం పెట్టుకున్న దురాశలు అడియాసలయినాయి. స్వాతంత్ర్య సమరవీరులే బికారులయినారు. సత్యమూర్తి – ప్రకాశం వంటివారిని వంచకులు మించిపోయారు. ఇదా స్వాతంత్ర్యం అని సామాన్యుడు విస్తుపోయేంతలోనే అతని బ్రతుకు బజారు పాలయింది. స్వాతంత్ర్యం వచ్చింతరువాత మనం విరివిగ గలిగినంత అభివృద్ధి జరిగింది. కాని అదంతా పేదవాని పాలిటి పెనుభారం అయింది.

యువత ఈ నికృష్ట పరిస్థితిని తిట్టుకుంది, దూషించింది. మంచి సమాజం కావాలని గగ్గోలుపెట్టింది. ఈ సమాజం కుళ్ళిపోయింది. ఇది కుష్ఠుసమాజం. ఇది సాధువచనాలకు వినదు. ఎహ్‌లోగ్‌సియాసీ దల్లాల్‌హై ఇస్ కా ఖాల్ బహుత్ మోటాహై – వీరు రాజకీయ దళారులు – వీరి చర్మం చాలా దళసరి. బూతులు తిడ్తేగాని వీరికి అర్థం కాదు అనుకున్నారు కొందరు తెలుగు కవులు. ఈ సమాజం 'సత్యం'కు పెనుదుప్పటి కప్పింది. దీనిని దిగంబరం చేయాలి అనుకున్నారు.

వారు ఆరుగురు కవులు. తమ పేర్ల బట్టలను కూడా తొలగించారు. 1. ఆకారం వీరవల్లి రాఘవాచార్యులు 'జ్వాలాముఖి'గా 2. యాదవరెడ్డి నిఖిలేశ్వర్‌గా 3. బద్దం భాస్కరరెడ్డి చెరబండరాజుగా 4. హృషి కేశవరావు నగ్నమునిగా 5. కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు మహాస్వప్నగా 6. మన్మోహన్ సహాయ్ భైరవయ్యగా అవతరించారు.

వీరు ఆరుగురు దిగంబర కవులు. వీరు సమాజాన్ని కవితలో అసహ్యంగా తిట్టారు. వీరి తిట్ల కవితను సకల భారత యువత ఆహ్వానించింది, అభినందించింది. దిగంబర కవులకు విశేషప్రచారం లభించింది. వారు అతిసామాన్యుని ఇముడ్చుకునే వినూత్న పద్ధతులను అవలంబించారు.

1965లో మే అర్ధరాత్రి ఆబిడ్స్‌సెంటర్‌లో 'నాంపల్లి పాండు' అనే రిక్షామనిషితో దిగంబర కవుల సంచిక ఆవిష్కరింపచేశారు. రెండవ కవితా సంపుటి 1966లో విజయవాడలో 'జంగాల చిట్టి' అనే హోటల్ సర్వర్‌తోనూ, మూడవ సంపుటి 1967లో విశాఖలో 'యడమనూరి యశోద' అనే వేశ్యతోనూ ఆవిష్కరణ చేయించారు.

ఆంధ్రదేశంలో నక్సలయిట్ల సాయుధపోరాటం శ్రీకాకుళంలో ప్రారంభం అయింది. సమాజాన్ని సహించలేకా – ఎదిరించలేకా తికమకలవుతున్న యువతకు ఒక మార్గం

కనిపించింది. దిగంబర కవులు సహితం సమాజం తిట్లకు అలవాటు పడిందని గ్రహించారు. సమాజాన్ని సాపుచేయడాని బుల్లెట్ కావాలనుకున్నారు.

అలా ఉండగా హైదరాబాదులో శ్రీరంగం శ్రీనివాసరావుగారిని పదివేలరూపాయిలతో సన్మానించడానికి ఒక సంస్థ నిర్ణయించింది. 4-7-1970 న జూబ్లీ హాలులో అనుకుంటా – సభ ఏర్పాటు చేశారు. శ్రీశ్రీగారు అందుకు అంగీకరించి హైదరాబాదు వచ్చారు.

దిగంబర కవుల్లో కొందరు – మరి కొందరు సాయుధ విప్లవం మీద విశ్వాసం ఉన్న యువకులకు – శ్రీశ్రీ వంటి విప్లవకవి ఒక సంస్థ సన్మానం పొందడం బాగనిపించలేదు. వారు ఆ రాత్రి శ్రీశ్రీని కలిశారు. వారి అధ్యక్షతన 'విప్లవ రచయితల సంఘం' స్థాపించారు. వారు తుపాకి గొట్టంనుంచి విప్లవం వస్తుందని విశ్వసించారు. అప్పటికి తెలంగాణమునకు పాకిన నక్సలయిటు సాయుధ పోరాటానికి సుమారు అనుబంధ సంస్థ అయింది విరసం.

విరసం యువకులను మేధావులను విశేషంగా ఆకర్షించింది. వారు విస్తృతం అయిన కార్యక్రమాలు నిర్వహించారు. రచన అంటే విప్లవ రచన అనేంత స్థాయికీ పాకింది విరసం.

సంప్రదాయ సాహిత్యాన్ని రక్షించుకోవాలని 'యువభారతి' సంస్థ విశేష కృషిచేసింది. వారి సభలకు రాజకీయసభల కన్న ఎక్కువ ప్రజ హాజరయింది. వారు క్రమశిక్షణతో అత్యంత ఆధునిక పద్ధతులలో పుస్తక ప్రచురణ – వితరణ చేపట్టారు. 'ప్రేమ్‌చంద్ జీవితం – సాహిత్యం' అని నేను రచించిన పుస్తకాన్ని వారు ప్రచురించారు. "చిల్లరదేవుళ్లు" ఆంగ్లంలో పరిచయం చేశారు.



సాహిత్యవాతావరణం ఇలా ఉన్నప్పుడు అభ్యుదయ రచయితల్లో ప్రధాన కవులు అరసంనుంచి విడిపోయారు. అరసంలో పార్టీ జోక్యం ఎక్కువయిందని ఆరోపించారు. వేరే అభ్యుదయ రచయితల సంఘం ఏర్పరచుకున్నారు. అలా విడిపోయినవారిలో ఆరుద్ర – సోమసుందర్ – దాశరథి మున్నగువారు ఉన్నారు.

ఈ పరిస్థితుల్లో 'అభ్యుదయ అధిపతులు' అరసాన్ని పునరుద్ధరించాలనుకున్నారు. అది ఎదురీత! హైదరాబాదు నగర అరసంతో ప్రారంభించాలనుకున్నారు. నన్ను నగర అరసం అధ్యక్షులుగా ఉండమని కోరారు. ఇది నాకు ఒక క్లిష్ట సమస్య. మా అన్నయ్య వేరే అరసంలో ఉన్నారు. యువభారతి – విరసంలో కూడా నాకు మిత్రులు ఉన్నారు.

నాకు తొలినుంచి అరసం అంటే అభిమానం. అరసం తొలిరోజుల్లో ఉభయ ఆంధ్రములలోని అనేకమంది రచయితలకు స్ఫూర్తి నిచ్చింది. మార్గనిర్దేశం కలిగించింది. అయితే అరసంలోకి చొచ్చుకుని నేను ఎన్నడూ పనిచేయలేదు. నాకు నాటినుండి నేటివరకు ఏ రాజకీయపార్టీ సభ్యత్వం లేదు. ఎవరి వల్లా నేను ఇసుమంత ప్రయోజనం పొందలేదు. ఆళ్వార్‌స్వామి – చిరంజీవికి నాకు ఉన్న బాంధవ్యంవల్ల నాకు ఒక రాజకీయ పార్టీతో సంబంధం ఉన్నదని కొందరు ముద్ర వేశారు. అది పచ్చి అబద్ధం.

అరసం వారి అభ్యర్ధనను నాకుగల అభిప్రాయాల దృష్టితో పరిశీలించాను. నాకు సాయుధ విప్లవం మీద విశ్వాసం లేదని మనవి చేశాను. విరసం వారు రచయితలు విప్లవం తేగలరని నమ్మారు. ఎంతటి విప్లవంలోనూ రచయిత పాత్ర ప్రజలను విప్లవోన్ముఖం చేయడం మాత్రమేనని నా నమ్మకం. విప్లవ నిర్మాత లెనిన్ అగును, గోర్కీ కాదు. నేను సిద్ధాంతపరంగా విరసాన్ని వ్యతిరేకించాను. కాని వారి చిత్తశుద్ధిని శంకించలేదు. అందరూ నావలెనే ఆలోచించాలనే మూర్ఖత్వం నాకు లేదు.

నాకు సంప్రదాయ సాహిత్యంతో అనుబంధం ఉంది. అభిమానం ఉంది. అది అభ్యుదయానికి – విప్లవానికి – ఆధునికతకు వ్యతిరేకం అని నేను భావించను. మన వారసత్వాన్ని మనం గౌరవించాలి. అంతేగాని, అదే సమస్తం అని భ్రమించరాదు. సంప్రదాయ సాహిత్యంతో ఎవరినో సాధించగలం అనుకోవడం బూటకం.

వీటిని అన్నిటిని దృష్టిలో పెట్టుకుని అరసం నాకు తగిన వేదిక అని నిర్ణయించుకున్నాను. ఇతర సాహితీ సంస్థలను – ముఖ్యంగా విరసంను దూషించరాదని చెప్పి, అరసం అధ్యక్ష పదవికి అంగీకరించాను. విరసం – అరసం లక్ష్యం ఒక్కటే – మార్గాలు వేరు. కాబట్టి అయిక్య వేదికకు పిలుపు ఇవ్వాలని 'నాయకత్వాన్ని' ఒప్పించాను.

హైదరాబాదు నగర అభ్యుదయ రచయితల సంఘ ప్రధమ మహాసభ 5–10–1072న ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో జరిగింది. నేను అధ్యక్షత వహించాను. వ్యక్తి అస్తి దుష్ఫలితాలను తెలియచెప్పడానికి అందరూ కలిసి కృషి చేయాలన్నాను. గజ్జల మల్లారెడ్డిగారు సాహిత్యంలో అతివాద, ప్రజాతంత్ర శక్తుల అయిక్యతకు పిలుపు ఇచ్చారు. యువరచయితల కవితా సంకలనం "అలజడి"ని తుమ్మల నరసింహామూర్తిగారు విడుదల చేశారు. విరసం ప్రచురించిన కొన్ని పుస్తకాలను ప్రభుత్వం నిషేధించడాన్ని నిరసిస్తూ తీర్మానం ఆమోదించబడింది.

సమావేశానికి రచయితలూ ప్రజలూ పెద్దసంఖ్యలో వచ్చారు. విరసం, యువభారతి మున్నగు సాహిత్య సంస్థలకు ప్రాతినిధ్యం వహించే రచయితలూ వచ్చారు.

నాకు గుర్తున్నంతవరకు – ఆ తరవాత – అరసంవాళ్లు విరసంను తిట్టలేదు. విరసం – అరసంను తిట్టడం మానలేదు.

హైదరాబాదు అరసం అధ్యక్షునిగా – ఆ సంక్షుభిత కాలంలో – నేను కొన్ని కార్యక్రమాలు నిర్వహించగలిగాను. యువతను ఉత్సాహపరచగలిగాను. అరసంకు హిమాయత్ నగరంలో ఒక కార్యాలయం ఏర్పడింది. నేను వారానికి రెండుసార్లు సాయంకాలాలు కార్యాలయంలో ఉండేవాణ్ణి. రాంభట్ల కృష్ణమూర్తి – బూదరాజు రాధాకృష్ణ – గజ్జల మల్లారెడ్డి వంటి ప్రముఖులతోపాటు యువతీ యువకులు వచ్చేవాళ్లు. అది ఒక చర్చాగోష్ఠిగా – కార్యశాలగా ఉండేది. అనేక విషయాలు చర్చకు వచ్చేవి. యువకుల – యువతుల రచనలు చూడడం, ప్రోత్సహించడం జరుగుతుండేది.

నగరంలో సగటున నెలకు ఒక సభ జరిపాం. వాటిలో సమాజాన్ని అభ్యుదయ పథంలో నడిపిన ప్రముఖ రచయితల జీవితాలు – రచనల గురించిన ఉపన్యాసాలుండేవి. ఆ రచయితలను గురించి యువకులతో వ్యాసాలు వ్రాయించి చదివించేవాళ్లం. అందువల్ల యువతలో ఉత్సాహం కలిగి, వ్యాసాలు కవితలు వ్రాసేవారు. అలా చేసిన ఉత్సవాల్లో వీరేశలింగం – గిడుగు – గురజాడ – గోపీచంద్ – గోర్కీ – ప్రేమచంద్ – మాడపాటి – వట్టికోట ఆళ్వార్‌స్వామి – నార్ల చిరంజీవి మున్నగువారిని గురించి వివరించడం జరిగింది.

ఆ ఉత్సవాల సందర్భంలో యువకులు వ్రాసిన వ్యాసాలలో కొన్నింటిని "కలం బొమ్మలు" పేర డిసెంబర్ 1973లో పుస్తకంగా ప్రచురించాం. అలాగే యువతతో కథలు వ్రాయించాం. చాలమంది కొత్తగా కలం పట్టినవాళ్లు మంచి కథలు వ్రాశారు. వాటిలో మంచివాటిని ఎన్నుకుని "కెరటాలు" అనే కథల సంపుటిగా ప్రచురించాం.

పాత పట్నంలో రచయితల సభలు జరిపాం. అక్కడి యువరచయితల కవితల సంపుటి ప్రచురించడం జరిగింది. సభల సందర్భంగా ప్రగతి నిరోధకులనుండి వచ్చిన అడ్డంకులను తిప్పికొట్టడం, అక్కడి రచయితలలో ఈ రోజు కొందరు ప్రఖ్యాత రచయితలు కావడం సంతోషం.

నగరంలోనే కాక ఆంధ్రదేశంలో వివిధ ప్రాంతాల్లో పర్యటించాను. అభ్యుదయ రచన – సామాజిక అవశ్యత గురించి వివరించాను. ఎందరో యువకులు ఉత్సాహంగా పాల్గొన్నారు. మంచి రచనలు చేశారు. యువతలో సామాజిక అవగాహన కలగడానికి కొంతలో కొంత తోడ్పడ్డాను.

ఆ రోజుల్లో విశ్వవిద్యాలయాలలో గ్రాంథికానికి తప్ప స్థానం లేకుండింది. విశ్వవిద్యాలయాలు ఆధునిక సాహిత్యాన్ని అంటరాదని మడి కట్టుకొని కూర్చున్నాయి. "విశ్వవిద్యాలయాల బూజు దులపండి" అనే ఒక విద్యార్థుల ఉద్యమం నిర్మించి నిర్వహించాం. ఉస్మానియా తెలుగుశాఖ ఆధునికాన్ని అసహ్యించుకుంది. అక్కడ అనేక గోష్ఠులు – సభలు నిర్వహించాం. ఇవి అధిపతులను కొంత చిరాకు

పరిచాయి. ఈ రోజు విశ్వవిద్యాలయాల పార్యాంశంలో ఆధుని సాహిత్యం చేరడానికి – కొంతవరకు – ఆ ఉద్యమం కారణం.

ఆకాశవాణినుంచి 'మాలపల్లి' నవల సీరియల్‌గా చదివించడానికి ఒక ఉద్యమం అవసరం అయింది. రచయితలం ప్రదర్శనలు – నినాదాలు చేయవలసి వచ్చింది. ఆకాశవాణి అధికారుల అభివృద్ధి నిరోధకత్వాన్ని ఎదిరించి, "మాలపల్లి" సీరియల్‌గా చదివించడంలో విజయం సాధించాం.




నార్ల చిరంజీవి గ్రంథాలయ ప్రారంభోత్సవం

హైదరాబాదులో నార్ల చిరంజీవి గ్రంథాలయం స్థాపించాం. దీన్ని సి. నారాయణరెడ్డిగారు ప్రారంభించారు. సికిందరాబాదులో వట్టికోట ఆళ్వార్‌స్వామి గ్రంథాలయాన్ని రావి నారాయణరెడ్డిగారు ప్రారంభించారు.

ప్రభుత్వం కొందరు విరసం రచయితలను అరెస్టు చేసింది. విరసంవారు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో ఒక నిరసన సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో నన్ను మాట్లాడమన్నారు. నేను అరసం అధినాయకులను అడిగాను. వారు వారించారు. రచయిత ఏ రంగు, రూపు, రుచి వాడయినా అతని నిర్బంధాన్ని నేను నిరసిస్తాను అన్నాను. S. B. గిరి M. P. సహితంగా ఆ సభలో మాట్లాడాం. 'పదకొండు వందల సంవత్సరాల ఆంధ్ర సాహిత్య చరిత్రలో రచయితలను నిర్బంధించిన దుర్మార్గం ఈ ప్రభుత్వం మాత్రమే చేయగలిగిందనీ – వెంటనే రచయితలను సగౌరవంగా విడుదల చేయాలని' అన్నాను.

నేను రెండు సంవత్సరాలు హై.అ.ర.సం. అధ్యక్షునిగా నా శక్తి వంచన లేకుండా కృషి చేశాను. పదవులను ఒకే వ్యక్తి కరచిపట్టుకుని కూర్చునే ప్రజాస్వామ్యం నాకు గిట్టదు. అందువల్ల అధ్యక్ష పదవిని స్వచ్ఛందంగా విరమించాను. అయినా కార్యకర్తగా అరసంలో శక్తిని మించి పనిచేశాను.

తరువాత పరిస్థితులు గుర్తులేవు. ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి పదివికి ఖాళీ ఏర్పడింది. ఆ బాధ్యత నన్ను నిర్వహించమని

కోరారు. నేను కొద్దిగా వెనుకంజ వేశాను. ఉద్యోగంలో ఉండి అంతటి బాధ్యత నిర్వహించగలను అనే నమ్మకం నాకు కలుగలేదు. అయినా 'నాయకత్వపు' వత్తిడికి లొంగవలసి వచ్చింది. నేను జబ్బుగా ఉన్నాను. నా అనుప స్థితిలో నన్ను ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు.

పార్టీ సభ్యుడు కాని అరసం ప్రధాన కార్యదర్శిని బహుశః నేనే నేమో!

ప్రధాన కార్యదర్శిగా – నాకు సంతృప్తి కలిగేంత పని చేయలేకపోయాను. వివిధ ప్రాంతాల్లో సభలు – సమావేశాల్లో పాల్గొనడం తప్ప నిర్మాణాత్మక కార్యక్రమం ఏదీ నిర్వహించలేకపోయాను. అయితే, ఆ వ్యవధిలో స్మృతి పథంలో నిలిచిపోయేది నాగార్జున సాగరంలో జరిగిన టాల్‌స్టాయ్ శతజయంతి ఉత్సవాలు! అక్కడ శ్రీ శ్రీగారు నేనూ ఒకే వేదికమీద మాట్లాడాం. ఒక రోజంతా ఆ మహాకవితో కలిసి ఉండి, మాట్లాడే–చర్చించే–కవితలు వినే అవకాశం లభించింది.

**నేను విశ్వనాథ వారితో - శ్రీ శ్రీతో - గద్దర్‌తో ఒకే వేదిక మీద మాట్లాడగలిగినాను. నాకు సాహిత్యం సొంతం ఒకటే! మనిషికీ, సాహిత్యానికీ గోడలు నేను సహించలేను. మెరపు ఎక్కడున్నా మెచ్చగలను. నాకు అడ్డుగోడలు గిట్టవు. దీవారేఁ తోడ్‌దో - దర్వాజే ఖోల్‌దో - గోడలు కూల్చండి - ద్వారాలు తెరవండి అంటాను. మంచి రచనకు గోడల అడ్డులేల? అంతములేని ఈ భువనమంతయు నాకు కళారంగమే!**

రెండు సంవత్సరాలు ప్రధాన కార్యదర్శిగా పనిచేశాను. స్వచ్ఛందంగా పదవి వదులుకున్నాను. అరసం అధి నాయకత్వానికి నాతో పని తీరింది. నన్ను కరివేపాకును చేశారు!

ఇందిరా గాంధీ విధించిన ఎమర్జెన్సీ అనేక విధాల నచ్చకున్నా – పేదలకు సాయం అందినంతవరకు నాకు నచ్చింది. స్వాతంత్ర్యం వచ్చిన్నాటినుంచి నాటివరకు సాధారణ ప్రజానీకాన్ని అంతగా గుర్తించినవారు లేరు. ఇందిర బంగ్లాదేశ్‌ను విడగొట్టారు – బ్యాంకులను జాతీయం చేశారు. రాజ భరణాలు రద్దు చేశారు. ఇంతటి సంస్కరణలు ఏ ప్రధానీ ఇంతవరకు అమలుపరచలేదు! ఇందిరా గాంధీ తన పదవిని రక్షించుకోవడానికి ఇదంతా చేసిందనేవారు. వారూ తాము గద్దె ఎక్కడానికే ఇందిరను గద్దె దించ ప్రయత్నించారు. పదవి నిలుపుకోవడానికయినా ప్రజలకు మేలు చేయడమే ప్రజాస్వామ్యం!

నాకు దేనివలనా కలుగనట్లే – ఎమర్జెన్సీ వలన సహితం – ఇసుమంత ప్రయోజనం చేకూరలేదు. పైగా, మరింత హాని జరగబోయి ఆగింది. 'జనపదం' నవల అప్పుడే వచ్చింది. నగరంలోని ప్రెస్సులలో దాన్ని అచ్చు కానివ్వలేదు. నవయుగ సాంబశివరావుగారు తెనాలిలో అచ్చువేయించారు. పైగా అఫ్సర్‌షాహీ – అధికారులు చెలాయించే ప్రభుత్వం – నన్ను విప్లవకారుల్లో చేర్చింది. నా రచనలు తెలిసిన అధికారులు ఉండడంవల్ల ఉద్యోగం ఊడలేదు. గండం గడిచింది.

ఆ రోజుల్లో నేను 'తూర్పు తెల్లవారింది' అనే ఒక రేడియో నాటకం వ్రాశాను. అందులో పల్లెపెద్దల దుర్మార్గాలను, ప్రజల చైతన్యాన్ని వివరించాను. Toorupu

Tellavarindi written in Telengana dialect, this play made the best listning. Yet on the 20 point Programme అని 'హిందూ' వ్యాఖ్యానించింది.

కె. చిరంజీవి రచించిన 1. కొక్కొరొకో 2. శాంతి సమరం 3. నీలిదీపాలు రేడియో నాటకాలను హిందీలో అనువదించాను. అదొక మరుపురాని సంఘటన. శారదా శ్రీనివాసన్ ఇంట్లో పెసరట్లు తింటూ, చాయ్ చప్పరిస్తూ, ఉర్దూ కవిత వినిపిస్తూ నేను చెప్పడం, శారదగారు వ్రాయడం. వారికి రాని హిందీలో చెమక్కులకు చిరంజీవిగారు వాహ్, వాహ్, అనడం. రోజులు రోజులు అలా వ్రాస్తూ గడిపేశాం. నేను అనువదించిన మూడు నాటకాలు ఢిల్లీ నుంచి జాతీయ కార్యక్రమంలో ప్రసారం అయినాయి. నేను చేసిన హిందీ అనువాదంనుంచి ఇతర అన్ని భాషలకూ అనువదించబడి ప్రసారం చేయడం జరిగింది. హిందీవాళ్లు మెచ్చేంత అందంగా వచ్చింది అనువాదం. అందుకు కారణం మూల రచయిత ముందున్నాడు. నేను మనసుపెట్టి అనువాదం చేశాను.

భాష ఒక సమస్యకాదు. మనసుంటే మార్గాలు అనేకం.

ఆకాశవాణి వారు "అఖండ దీపం" పేర గ్రామ విముక్తిని గురించి నన్ను మూడుగంటల నాటకం వ్రాయమన్నారు. పేరున్న సినీతారలతో నాటకం వేయించి, వారం రోజులపాటు సీరియల్‌గా ప్రసారం చేస్తామన్నారు.

నేను 'వెట్టినుంచి విముక్తి' సమస్యగా తీసుకొని రచించడానికి ప్రణాళిక సిద్ధం చేశాను. ఆ గ్రామంలో రామయ్య సావుకారు. ఆ ఊళ్లో మనుషులూ – పనిముట్లూ అన్నీ రామయ్య తాకట్టులో ఉంటాయి. ఊరు సొంతం అతనికి కట్టుబానిస. ఆ ఊరికి వచ్చిన టీచర్లు అతనికి లెక్కలు వ్రాస్తారు. స్కూలు భవనం అతనికి గిడ్డంగి అవుతుంది. రామయ్య ఆ ఊరి ఏలిక!

ఆ ఊరికి పావని టీచరుగా వస్తుంది. ఆమె రామయ్య లెక్కలు వ్రాయదు. ప్రజలకు పగలూ – రాత్రీ చదువు చెపుతుంది. చదువంటే అక్షరాలు మాత్రంకాదు. శ్రమ విలువనూ – శ్రామిక శక్తినీ వివరిస్తుంది. వారిని సంఘటిత పరుస్తుంది. చైతన్యవంతులయిన ప్రజలు రామయ్యను ఓడిస్తారు. ప్రాణంలేని ఆస్తికన్న ప్రాణం ఉన్న మనిషి మిన్న అని రామయ్య గ్రహిస్తాడు. గ్రామస్తులతో ఆస్తీ – ఆనందం పంచుకోవడానికి సిద్ధం అవుతాడు, అలాగే జీవిస్తాడు.

"ఇంత ఆనందం చూస్తుంటే పిచ్చెక్కేట్లుంది. సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అవుతున్నాను. అంధకారాన్ని మింగి, వెలుగులు చిమ్మే ఈ 'అఖండదీపం' వెలుగుతూనే ఉండాలి – ఆరిపోరాదు" అంటుంది పావని.

నాటకం వ్రాసి ఆకాశవాణివారికి ఫిబ్రవరి 1977లో ఇచ్చాను. మార్చిలో జరిగిన ఎన్నికల్లో సంజయ్, ఇందిర సహితంగా కాంగ్రెస్ చిత్తుగా ఓడిపోయింది. మురార్జీ ప్రధానిగా జనతా ప్రభుత్వం ఏర్పడింది. జనతా ప్రభుత్వపు ఛాయ 'అఖండ దీపం' మీద పడింది.

అంతకు ముందు ఆకాశవాణి ఈ నాటకాన్ని సినీతారలతో వేయించడానికి నిర్ణయించింది. అప్పటికి ఆ ప్రతిపాదన విరమించింది. ఆకాశవాణి నటీనటవర్గంతో నాటకం రికార్డు చేయడం జరిగింది. ప్రసారం చేసే తేదీకూడా ప్రకటించడం

జరిగింది. కాని, ఆ రోజు ప్రసారం కాలేదు. రేడియో స్టేషనులో విచారించాను. ఢిల్లీనుంచి ఆపుచేయించారని తెలిసింది. వివరాలు అప్పటికి అందలేదు.

వివరాలు తదుపరి తెలిశాయి. హైదరాబాదు ఆకాశవాణి ఇంకా ఇందిరాగాంధీ భజన కార్యక్రమాలు ప్రసారం చేస్తున్నదనీ – 'అఖండ దీపం' అలాంటి నాటకం అనీ – ఎవరో ఢిల్లీకి ఫిర్యాదు చేశారు. ఢిల్లీవారు ఆపుచేయించారు.

"అఖండ దీపం" భజన అంటే నాకు అనంతబాధ కలిగింది. జీవితంలో ఎవరినీ స్తుతించినవాణ్ణి కాదు. ప్రయోజనం పొందినవాణ్ణీ కాదు. నాకు నచ్చకుండా నేను నమ్మకుండా రచన చేయలేదు. 'భజనముద్ర' వదిలించుకోవడానికి ఉపక్రమించాను. కొందరు జనతాపార్టీ M.P. లను, MLAలను కలిశాను. నన్ను ఎరిగినవారు కావున భజన నమ్మలేదు. వారికి నాటకం ప్రతులు ఇచ్చాను, చదివించాను. వారు అర్థం చేసుకున్నారు. 'ఆస్తి కన్న మనిషి మిన్న' అన్న సత్యం ఉంది – భజన లేదు అన్నారు.

జనతా ప్రభుత్వంలో అద్వానీగారు సమాచార ప్రసారశాఖామాత్యులు. వారికి నేను వివరంగా వ్రాశాను – నన్ను గురించిన కథా కమామిషూ వివరించాను. నాటకం ప్రతి పంపించాను. అఖండదీపం చదివిన MLAలతో, M.Pలతో ఉత్తరాలు వ్రాయించాను. అద్వానీగారు "అఖండదీపం" ఇంగ్లీషు మతలబులు కావాలన్నారు. కథా, సంగ్రహము – వివరణ ఇంగ్లీషులో వ్రాసి పంపాను. ఆకాశవాణి నుండి అఖండ దీపం టేపు తెప్పించుకున్నారు. 'అఖండ దీపం' లో భజన లేదని ఎరిగినారు. అయినను సర్కారు కదా! నాటకమును కత్తిరించి ఒక గంటకు కుదించి ప్రసారము చేయమని హుకుము జారీ చేసినారు.

ప్రజాస్వామ్యం ఏనుగులాంటిది. రాజకీయ పార్టీలు అన్నీ గుడ్డివే! వారి చేతికి అందిందే ప్రజాస్వామ్యం. ప్రజలను గాలికి వదిలారు. పార్టీలన్నీ స్వామ్యములు అయినాయి.

*"ప్రజల రాజ్యమొచ్చె ప్రజలంత ప్రభులైరి*
*ప్రజల నెత్తిమీద పడెను బండ*
*ప్రభువు లెవ్వరయిన ప్రజలకు మిండలే!*
*విశ్వజనుల వాణి వినర రంగ"* అన్నాను – 1961లో ప్రచురితం అయిన జనరంగంలో.

"ఆకాశవాణి"వారు సర్కార్ హుకుం తామీల్ చేసిన్రు. 'అఖండ దీపం' గంట ప్రసారం చేసిన్రు!

ఉర్దూలో 'సర్' అంటే 'తల'; 'కార్' అంటే పనిచేసేవాడు. తల పనిచేసేవాడు సర్కార్! కత్తిరిస్తాడు. కొరుగుతాడు. మర్దన చేస్తాడు!

నాకు పడిన 'భజన' ముద్ర వదిలింది. అది వదిలించుకోవడానికి ఇంత కార్‌గుజారీ – కార్యక్రమం!

చతుర మాసపత్రిక సంపాదకులు – మిత్రులు చలసాని ప్రసాద్‌గారు నన్ను నవల వ్రాసి ఇవ్వమని కోరారు. వారికి 'అఖండ దీపం' కథ వివరించాను. దాన్ని నవలగా వ్రాసి ఇస్తానన్నాను. వారు అంగీకరించారు. 'పావని' పేరుతో అఖండ దీపం వస్తువును, నవలగా అలంకరించి ఇచ్చాను. ప్రసాద్‌గారు 'పావని'ని ఎంతో మెచ్చారు. 'పావని' నవలగా చతుర 1978 జూన్ సంచికలో ప్రచురితం అయింది.

పావని అనేక మందిని ఆకర్షించింది. ఒకరిద్దరు పావనని చలనచిత్రీకరించడానికి విఫల ప్రయత్నం చేశారు.

'అఖండ దీపం' నాకు తెలియకుండా దూరదర్శన్‌కు చేరిందని తెలియవచ్చింది.

1987లో నేను మంచం పట్టాను. అప్పుడు ఒక వ్యక్తి వచ్చాడు. 'అఖండ దీపం' దూరదర్శన్ ఆమోదం పొందింది అన్నాడు. అఖండ దీపం హక్కులు కావాలన్నారు. నాకు - రచయితకు - తెలియకుండా 'అఖండ దీపం' దూరదర్శన్ అనుగ్రహం ఆర్జించడం ఆశ్చర్యం కలిగించింది. డబ్బు అక్కరలో ఉన్నాను. పదిహేనువేలు అన్నాను, అంగీకరించాడు, వెళ్లిపోయాడు, పత్తాలేడు!

1988లో అనుకుంటా - అతను ఫోను చేశాడు. నా బ్యాంకు అక్కౌంటు నంబరు అడిగాడు - చెప్పాను. మళ్లీ ఫోను చేశాడు. అయిదువేలు జమకట్టానని తెలియపరిచాడు. వెనువెంటనే కర్చుపెట్టాం. అతను నన్ను కనీసం రశీదు అడగలేదు.

ఆ తరువాత ఇంకొక తను వచ్చాడు. హక్కులు కావాలన్నాడు. ఇంకొకరికి ఇచ్చానన్నాను. 'అలాగా!' అన్నాడు. వెళ్లిపోయాడు.

రెండేళ్లు గడిచిపోయాయి. ఎవరూ జాడలేదు. 1991లో ఒకతను వచ్చాడు. పదివేలు ఇచ్చాడు. కాగితంమీద సంతకం పెట్టించుకుపోయాడు. అప్పుడు నేను వికల మనస్కుడనై ఉన్నాను. మా పెద్దబ్బాయి విజయ్ గతించాడు. రిటైరయినాను. ఆ బాధల్లో ఉన్నాను. డబ్బు ఉపకరించింది.

19 ఏప్రిల్ 1991 శుక్రవారం సాయంత్రం ఏడుగంటలకు 'దూరదర్శన్'లో 'అఖండ దీపం' తొలి ఎపిసోడ్ ప్రసారం అయింది. అది చూచాను. నా గుండె లిప్త నిలిచింది! నేను చకితుణ్ణి అయినాను. ఏమీ అర్థం కాలేదు.

'అఖండ దీపం' ఆరిపోయింది. సీరియల్ పేరు, నా పేరు తప్ప అంతా అయోమయం! అది నా కథకాదు!!! ఆత్మహత్య - కల్లుదుకాణం - దుబాయ్‌పోవడం! నాకు తలకొట్టేసినంత పని అయింది.

అప్పటికి నేను దూరదర్శన్ డ్రామా అడ్వయిజరీ కమిటీ మెంబరును. డైరెక్టరు నాకు ఆకాశవాణినుంచి తెలిసినవాడు. టెలిఫోను చేయడానికి గంటల తరబడి నిరంతరం ప్రయత్నించాను. ఎవరూ అందరు! మా దొరల గడీల వలె దూరదర్శన్ దుర్భేద్యం అని అర్థం అయింది.

నా పేర మరొక కథ ప్రసారం! బహుశా చరిత్రలో జరిగి ఉండదు. ఆనాటి యాతన నేను జీవితంలో అనుభవించలేదు. వేదన నిద్రమాత్రలను మించింది. రాత్రి సాంతం నిదురలేదు!

తెల్లవారి "అఖండ దీపం నా కథ కాదు - నిలిపివేయండి" అని పత్రికా ప్రకటన విడుదల చేశాను. అన్ని పత్రికలూ ప్రచురించాయి. దూరదర్శన్ డైరెక్టరుకు, డైరెక్టర్ జనరల్‌కు - ప్రసార శాఖామాత్యులకు టెలిగ్రాములు ఇచ్చాను. దరఖాస్తులు పంపించాను. అప్పుడున్నది నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వం. మంత్రి సుబోధ్‌కాంత్ సహాయ్ అని గుర్తు.

ఒకనాడు ప్రొడ్యూసర్ కొంత డబ్బు నాకు ఇస్తానని వచ్చారు. నాకు కథ కావాలి, డబ్బు కాదు అని కచ్చితంగా చెప్పాను. ఢిల్లీనుండి వత్తిడి ఎక్కువయింది.

డైరెక్టరు నన్ను రమ్మన్నారు, వెళ్లాను. కథ మారుస్తాం. కొద్ది మార్పులకు అనుమతించండి అన్నారు, అంగీకరించాను. దూరదర్శన్‌కు అనువర్తించడానికి మార్పులకు అంగీకరించాను. అలా వ్రాసి ఇచ్చాను.

ఇంత జరిగినా కథ మారలేదు. కొందరు యువకులు దూరదర్శన్ ముందు ధర్నా చేశారు. డైరెక్టరును ఘెరావ్ చేశారు. నగరంలోని సాహిత్యసంస్థలు మాత్రమే కాక రాష్ట్రంలోని సంస్థలు ఈ అన్యాయాన్ని ఖండించాయి. దూరదర్శన్‌కు – ఢిల్లీకి ఉత్తరాల ఉద్యమం సాగింది.

అయినా 'అఖండ దీపం' నా కథ కాకుండానే నా పేర నిరాటంకగా ప్రసారం అవుతున్నది.

ప్రొడ్యూసర్లు కోర్టునుంచి 'నన్ను ఆటంకం కల్పించరాద'ని 'స్టే' ఉత్తరువులు తెచ్చారు.

క్రింది కోర్టులోనూ, హైకోర్టులోనూ నా మీద నేను వారిని మానహాని చేసినట్లు కేసులు పెట్టారు.

మా వకీలు నందిగం కృష్ణారావుగారు మానహాని కేసులు కొట్టివేయించారు. స్టే మాత్రం తొలిగింపజేయలేకపోయారు. ప్రసారం నిలిపివేయాలని దూరదర్శన్‌మీద కేసు పెట్టారు.

ప్రొడ్యూసరు పక్షం వకీలు చతురుడు. వాయిదాలు వేయిస్తూ కాలం గడిపారు. కొంతకాలం మెజిస్ట్రేటు శలవు పెట్టారు. ఒకనాడు కోర్టు ముందు గట్టిగా వాదించాను. ఈ కేసును దూరదర్శన్ కేసుతో కలిపి విచారించవలసిందని తీర్పు ఇచ్చి న్యాయమూర్తులు చాకచక్యంగా తప్పుకున్నారు.

ఈలోగా నేను జబ్బున పడ్డాను. సుగర్ బాగా పెరిగిపోయింది. ఆస్పత్రిలో పడ్డాను. పదివేలు కర్చయింది. బతికి బయటపడ్డాను.

దూరదర్శన్ కేసుకూడా, వాయిదాలు – న్యాయమూర్తి శలవు వగైరాలతో అఖండ దీపం సీరియల్ పదమూడు భాగాలు ప్రసారం పూర్తి అయింది.

**మన న్యాయ వ్యవస్థలో 'న్యాయం' బజారులో వస్తువులవలె డబ్బులకు లభిస్తుంది అని నేర్చుకోవడానికి ఇంత శ్రమ అక్కరలేదని అర్థం అయింది.**

వట్టి దూరదర్శన్ ఆమోదాన్ని లక్షలు లక్షలకు అమ్మకాలు జరిగాయని తెలియ వచ్చింది.

మరొక అత్యంత విచిత్రం జరిగింది. ఇంత జరిగిన 'అఖండ దీపం' మరొక పదమూడు ఎపిసోడుల పొడిగింపు ప్రసారం జరిగింది. అయితే వీటిలో నా పేరు చూపించలేదు.

ఈలోగా రాజీవ్‌గాంధీ హత్య – ఎన్నికలు జరగడం – కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడడం జరిగింది.

అకాశవాణి "అఖండ దీపం" వ్యవహారం కాంగ్రెస్ ప్రభుత్వంలో మొదలయింది. జనతా ప్రభుత్వంలో ముగిసింది. దూరదర్శన్ "అఖండ దీపం" వ్యవహారం నేషనల్ ఫ్రంట్ ప్రభుత్వంలో మొదలయింది. కాంగ్రెస్ ప్రభుత్వంలో ముగిసింది. ఇది యాదృచ్ఛికం కావచ్చు. కాని – గమనింపవలసినది.

అఖండ దీపం కథ అఖండం.

1976–77లో 'మానవత' నవల వ్రాశాను. పాల్ – జానకి ప్రేమించుకుంటారు, పెద్దలు వద్దంటారు. పోట్లాట – మామూలే.

జలప్రళయం వస్తుంది. ఊరు మునుగుతుంది. ఒకే బంగళాలో గ్రామం సాంతం నివాసం. అక్కడ కులాలూ, మతాలూ అడ్డురావు, కలిసి ఉంటారు, తింటారు. పంటారు. ప్రమాదంలో లేని అడ్డంకులు పెళ్లికి ఎందుకు? అనుకుంటారు. పాల్ – జానకి పెళ్లి జరిగిపోతుంది.

**మతం ముసుగు మాత్రమే! అది తొలగుతే దర్శనం ఇచ్చేది "మానవత" మాత్రమే!!**

'మానవత' విజయ మాసపత్రికలో వచ్చింది. నవయుగ బుక్ సెంటర్, విజయవాడవారు 1978లో పుస్తకంగా ప్రచురించారు.

ఆ రోజుల్లోనే 'శరతల్పం' నవల వ్రాశాను. వైష్ణవ నారాయణస్వామికి – హరిజన గురువయ్యతో స్నేహం ఏర్పడుతుంది. గ్రామం నారాయణస్వామిని వెలి వేస్తుంది. గురువయ్య ఊరిబయట నారాయణస్వామికి ఆశ్రమం నిర్మించిపెడ్తాడు. నారాయణస్వామి సాన్నిధ్యంలో గురువయ్యకు అధ్యాత్మిక ఆసక్తి కలుగుతుంది. భాగవతం వింటుండగా మధ్యలో గురువయ్యకు క్షయవ్యాధి వస్తుంది. నారాయణస్వామి గురువయ్యను ఆస్పత్రిలో చేర్పిస్తాడు. తనకు మందు కాదు – భాగవతం కావాలంటాడు గురువయ్య. తమ్ముణ్ణి తన ఇంటికి తెచ్చుకుంటారు నారాయణస్వామి.

"అన్నగారు! మీ రుణం ఎన్ని జన్మలకు తీరాలి?" అంటాడు గురువయ్య.

"తమ్ముడూ! గురువయ్యా! నీకు మరోజన్మ లేదయ్యా!" అంటారు నారాయణస్వామి.

నారాయణస్వామిని మించి ఎదిగినాడు గురువయ్య. నారాయణస్వామి భాగవతం వినిపిస్తున్నారు. చివరి పద్యం పూర్తి అయింది.

గురువయ్య నారాయణస్వామిని దరికి రమ్మని పిలిచిచాడు. నారాయణస్వామి గురువయ్య పక్కన నుంచున్నారు. గురువయ్య చేతులు నారాయణస్వామి పాదాలమీద పడ్డాయి. చేతులు చల్లబడ్డాయి.

"గురవయ్యగారు పరమదించిన్రు" – నారాయణస్వామి అన్నారు. కన్నీరు జలజల రాలింది!

ఇది శరతల్పం ముగింపు.

**స్నేహం – అనురాగం – అనుబంధం – ఆత్మీయత దైవస్వరూపాలు. ఇవి కులగోత్రాలకు అతీతములు.**

'శరతల్పం' జ్యోతి మాసపత్రికలో వచ్చింది. నవయుగ బుక్ సెంటర్, విజయవాడ వారు 1978లో ప్రచురించారు.

'శరతల్పం' రేడియో నాటకం అకాశవాణి హైదరాబాదువారు ప్రసారం చేశారు.

"విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః" (భగవద్గీత 5–18)

విద్యావంతుడు - వినయ సంపన్నుడు - బ్రాహ్మణుడు - గోవు - కుక్క - చండాలుడు - అందరి విషయంలో సమదర్శనం గలవాడే జ్ఞాని అవుతాడు.

## ముప్పయి ఏడు

### విరిగిన హరివిల్లు:

'అమ్మ' సమస్త ప్రాణిజాలాన్ని కంటుంది, పెంచుతుంది, పోషిస్తుంది. ఈ సృష్టి నిలిచి ఉండడానికి కారణం తల్లి-తండ్రి. మాతా పితరుల జంటయే ఈ సమస్త సృష్టి - స్థితికి కారణం.

సమస్త జంతుజాలపు సృష్టికి తల్లి-తండ్రి కారకులు. ఎక్కువ జంతుజాతుల్లో శిశుపోషణకు తల్లి మాత్రం బాధ్యత వహిస్తుంది. తన బిడ్డ రక్షణకోసం పిల్లి పులి అవుతుంది. కోడి డేగ అవుతుంది. తన బిడ్డను రక్షించడానికి తల్లి తన ప్రాణం తృణంగా అర్పిస్తుంది.

పశుపక్ష్యాదులు అన్నీ తల్లిని గుర్తిస్తాయి. పసిపిల్లలు తల్లిని వదలవు. వెంటనే ఉంటాయి. తల్లి నీడలో బ్రతకడం నేర్చుకుంటాయి. రెక్కలు వస్తే పక్షులు - బ్రతుకడం వస్తే జంతువులు తల్లిని వదిలేస్తాయి! తమ పని తీరింది కదా! గుర్తించవు!! అయినా తల్లి తన బాధ్యత మానదు!!!

నరులకు జ్ఞానం ఉంది. పసితనం నుంచే పిల్లలు తల్లిని తండ్రిని గుర్తిస్తారు. పిల్లల పెంపకంలో మాతాపితరులు ఉభయులూ పాలు పంచుకుంటారు. హెచ్చు తచ్చులతో నిమిత్తం లేకుండా - తమకు ఉన్నదానిని మించి పిల్లలను పెంచి పెద్ద చేస్తారు.

మానవ కుటుంబం - మానవ సంబంధాలకు - ప్రేమాభిమానాలకు - కృతజ్ఞత త్యాగాలకు శిక్షణాలయం. మానవునికి తెలివి ఉన్నది. కాబట్టి పిల్లలు సహితం తల్లిదండ్రుల విషయంలో కొంత బాధ్యత వహించాల్సింది. వారి బాధ్యతను గుర్తింపచేయడానికే 'మాతృదేవోభవ - పితృదేవోభవ' నేర్పారు.

మనం - ఈ కాలంలో వ్యాపార నాగరకతలో జీవిస్తున్నాం. మానవ సంబంధాలు - భార్యాభర్తలవి - తల్లిదండ్రులవి వర్తకమ్ములు అయినాయి! తల్లిదండ్రులతో పనితీరితే తనయులు - జంతువులవలె - వదిలి మాత్రం పోవడం లేదు. జీవితకాలం తల్లిదండ్రులను ఘోషింప చేస్తున్నారు. కొందరు సుపుత్రులు తల్లితండ్రుల ప్రాణాలు తీసి సైతం వారి ఆత్మలను విలవిలలాడిస్తున్నారు! వారికి తల్లితండ్రులు కాదు వారి ఆస్తులు ప్రధానం!

**నాగరకతలో ఎంతో ముందడుగు వేశామని విర్రవీగుతున్న నరజాతి - మానవ సంబంధాల విషయంలో - జంతువులకన్న కడుహీనంగా - కడునీచంగా - కడువంచనగా ప్రవర్తిస్తున్నది. తల్లితండ్రులు తమపాలిటి భూతాలుగా దయ్యాలుగా భావిస్తున్నది!!!**

మా పుత్రరత్నాలు ఇందుకు భిన్నంకారు. మేం వాళ్ళను ఇలా పోషించాం - ఇన్ని త్యాగాలు చేశాం అని చెప్పుకోవలసిన దుర్గతి మాకు పట్టింది. అయినా అవి

పెడచెవిని పెట్టి మమ్ములను బాధల పాలు చేయడానికి వినూత్న ప్రయోగాలు చేస్తున్నారు.

మేము కాలగతిని గమనించాం. పుత్రులనుంచి ప్రేమ – అభిమానం తప్ప ఏమీ ఆశించలేదు. అవి దొరుకుతే మేం బ్రతికిపోతాం అని, మా విషయంలో ద్వేషాన్ని విషం పోసి పెంచుతున్నారు వారు!

మాకు ఇద్దరు మగపిల్లలు – విజయ్, విరించి. వారిని ఎలా పెంచామో చెప్పడం చర్విత చర్వణం అవుతుంది. చదువుతుండగానే ఆడవలలో పడ్డారు. పెళ్లయిన – మొగుడున్న నాగమ్మ వలలో ఆమె గుంజినవైపు తిరిగినాడు విజయ్. ఉమను ప్రేమించానని ఆమె ప్యాంటు పాకెట్లో భద్రంగా ఉన్నాడు విరించి.

చదువులు పూర్తి అయినాయి. మాతో పని తీరింది. ఉద్యోగాలు సంపాదించు కున్నారు, ఉడాయించారు. అంతవరకు పశువుల ప్రవృత్తి. అంతటితో నయితే మేమూ సంతోషించేవాళ్లం. వాళ్లు మనుషులు కదా! మరికాస్త నీచంగా ప్రవర్తించాలి కదా! కథ అక్కడ మొదలవుతుంది.

15 మే 1983 ఆదివారంనాడు ఇద్దరు జతగా మా ఇంటికి వస్తే సంతసించాం. 'నేను ఉమను ప్రేమించాను. మీరు వెళ్లి ఆమె తల్లిదండ్రులతో మాట్లాడండి' అన్నాడు విరించి. ఆలోచించి వెళ్తాం అన్నాను నేను. కమల సహించలేకపోయింది. రౌద్రం దాల్చింది. నాగుపామూనూ – ఉమనూ నానాతిట్లు తిట్టింది. కొడుకులను ఒక్కమాట అనలేదు. ఆవేశంలో విరుచుకు పడిపోయింది. ముగ్గురం ఆమెకు ఉపచారాలు చేశాం, తేరుకుంది, కోలుకోలేదు.

వారు ఆ రాత్రి వెళ్లిపోయారు. నాగుపాము పడగనీడన చేరారు. మమ్ములను భయభ్రాంతులను చేయ తలపెట్టారు. రోజూ ఇంటి ముందు ఎర్రటి అన్నం – నిమ్మకాయలు – కొబ్బరి ముక్కలు ప్రత్యక్షం. నమ్మకాలు లేవు కాబట్టి బ్రతికి బయట పడినాం.

ఎట్టివారయినా మా కొడుకులు కదా! వారిమీద మమకారంతో మంచాలు పట్టాం. కోలుకోవడానికి కమలకు మరింత సమయం పట్టింది.

విరించికి కామెర్లు. నాగిని ఇంట్లో ఉన్నాడని వార్త వచ్చింది. కడుపుతీపి చెడ్డది! ఆ రాత్రే ఉరికాం. విరించిని బ్రతిమలాడాం, ఇంటికి రమ్మన్నాం. 'మీ ఇంట శాంతి లేదు. నేను రాను' అని పంపించేశాడు. వాడు అన్నందుకు కాదు – వాడు రానందుకు బాధపడుతూ తిరిగి వచ్చాం.

మా అత్తగారు రామ సీతమ్మగారు పరమపదించారు. విరించికి చెప్పంపాం. మా ఇద్దరిని తప్ప అందరినీ పలకరించాడు. బయటపడినాడు. ముందు తల్లి శవం – కొడుకు పొడిచిన పోటు. కమల విలవిల్లాడింది. సరిగ్గా పధ్నాలుగో రోజున మా మామగారు నారాయణాచార్యుల వారు దివంగతులు అయినారు. వార్త అందీ విరించి ముఖం చూపలేదు.

మనశ్శాంతి మరీచిక అయింది. అమ్మాయిలు ఉదయ – సుధ, అల్లుళ్లు మోహన్ – సురోత్తం, మనుమరాలు సహజ – మనుమడు ఉజ్వల్‌తో మొత్తం దక్షిణయాత్రలు సేవించి వచ్చాం. రాగానే కమలకు మోకాళ్లలో నీరు వచ్చింది. నీరుతీసే ప్రక్రియలో ఇచ్చిన ఇంజక్షన్‌తో షాక్ వచ్చింది. భగవదనుగ్రహం వల్ల బయటపడింది. వార్త

అందినా కొడుకులు రాలేదు. అది మరింత బాధాకరం అయింది కమలకు! గుండె జబ్బు వచ్చింది.

మళ్లీ మా సుపుత్రుల జాడ తెలియలేదు. వాళ్లు నాగిని ఇంటికి వస్తున్నారు, వెళ్తున్నారు. మాకు వార్తలు అందుతున్నవి. మనసులు కలక్కుమంటున్నవి! వాళ్లు మాత్రం మా వీధిముఖం చూడలేదు.

"యది పుత్ర నజాయేథా మమశోకాయరాఘవ
నస్మద్దుఃఖమతో భూయః పశ్యేయ మహమప్రజాః" 2–20–36.

"రామా! నాకు దుఃఖకారకుడవుగా నీవు జన్మించావు. నీవు పుట్టకుంటే నాకీ బాధలు ఉండేవికావు. గొడ్రాలిని అనే బాధ ఒకటే మిగిలేది" అంటుంది కౌసల్య!

కౌసల్యది కన్నీటి బాట. తల్లులందరిదీ కౌసల్య బాటయే!

నేను బాధపడ్తానని కమల నిబ్బరంగా ఉన్నట్లు కనిపిస్తుంది. గుండెలో మంటలు దాచుకుంటుంది. పెదవిమీద చిరునవ్వు నటిస్తుంది. నేనూ అంతే! పుత్రేషణ బహు చెడ్డది! అది మనతో పుట్టింది. మనతో పోవాల్సిందే! మంట ఆరినట్లనిపిస్తుంది. అది భ్రమ.

**చెడ్డ పుత్రులుంటారు. కాని చెడ్డ తల్లి లోకంలో ఉండదు.**

నా ఆరోగ్యం అంతంతమాత్రమే! కాలమొక్క రీతి గడపాల్సిందే! 74లో డొక్క ఆపరేషను అయింది. 86 లో విపరీతం అయిన అజీర్ణం పట్టుకుంది. ఎంతోమంది డాక్టర్లు అయినారు. వారు మందులు ఇవ్వగలరు. నయం చేయలేరు!

అజీర్ణం అలా ఉండగా మూత్రవ్యాధి పట్టుకుంది. మూత్రం సరిగా రాదు. రాత్రికి నిద్ర ఉండదు. డాక్టర్ల చుట్టు తిరగడం – టెస్టులు – మందులు. డాక్టర్లు మందులు ఇవ్వగలరు. నయం చేయలేరు!

అజీర్ణం – మూత్ర వ్యాధి ఉండగా – నాకు ఉండిన ఒకే ఒక ఆధారం ధైర్యం – ధైర్యం కోల్పోయాను. మనోవైకల్యం ఏర్పడింది. భయం – ఊరికే ఏడ్పు – ప్రాణం తీసుకోవాలని ఆరాటం!

భగవంతుడు కరుణామయుడు. కమల కల్పించుకున్న ధైర్యం నిలుపుకుంది. మా అన్నయ్య నీడలా మా వెంట ఉన్నాడు. మా అమ్మాయిలు, అల్లుళ్లు, మా బావమరిది రమణ కుటుంబం, మా చెల్లెలు శకుంతల, ఆఫీసు మిత్రులు దయాశంకర్, నందకుమార్, డాక్టర్ బుచ్చిలింగం, మరెందరో మిత్రులు అండగా నిలిచారు. వారి రుణం తీరేది కాదు.

అన్నయ్య, నేను, కమల డాక్టర్ ఖాన్ సైక్యాట్రిస్టు దగ్గరికి వెళ్లాం. అన్నయ్య అన్నీ వివరించాడు. "His sons have to come. There is no other way" అని పంపించాడు. అన్నయ్య నన్ను గురించి అంత బాధ ఎన్నడూ పడలేదు. మా ఉభయులకూ నమ్మకం లేని శని జపాలు – శని పూజలు – శని దానాలూ చేయించాడు!

అన్నయ్య మా మగపిల్లలు ఇద్దరికీ – పరిస్థితి వివరిస్తూ ఉత్తరాలు వ్రాశాడు. టెలిగ్రాములు ఇచ్చాడు. వారికి వార్తలు తెలుసు. ఇక్కడి పుట్టలు అందిస్తునే ఉన్నాయి! ఇద్దరూ అన్నయ్య ఇంట్లో దిగారు. మామీద విషం కక్కారు. "డాడీ

ఇక్కడికి వస్తే మాట్లాడ్తాం. డాడీకి ట్రీట్‌మెంట్ ఇప్పిస్తాం. మమ్మీముఖం చూడం. వాళ్ల గడపతొక్కం" అన్నారని అన్నయ్య వచ్చి ఎంతో బాధగా చెప్పాడు.

"తమ్ముడూ! మరదలు లేకుండా నువ్వు వాళ్లతో మాట్లాడ్డం నాకు సమ్మతం కాదు. వాళ్లు ఆకాశంలో విహరిస్తున్నారు. మనం పట్టుకోలేం. మరిచిపో" అన్నాడు. అన్నయ్యమాట కాదనలేం. భరించడానికే నిశ్చయించుకున్నాను. కమల మవునంగా ఉంది. మాట్లాడలేదు.

అన్నయ్య వెళ్లిపోయాడు. 'ఏవండీ! వాళ్లకు పనికిరానిది నేనే కదండి, మీరు వెళ్లండి. వాళ్లతో మాట్లాడండి. ఒకమార్గం ఏర్పడుతుందేమో?" అన్నది కమల బహు నిబ్బరంగా! ఆ తల్లి ఆశకు నా గుండె చెరువయింది! "కమలా! ఎంత ఆశయే నీకు?" అన్నాను. "మన బిడ్డలు గదండీ!" అంటే నా కన్నీరు నిలువలేదు. ఇద్దరం ఏడ్చాం.

మరుసటిరోజు – కమల మాట కాదనలేక – అన్నయ్య ఇంటికి వెళ్లాను. వెంట మా చిన్నల్లుడు సురోత్తం వచ్చాడు. విజయ్, విరించి – మేమందరం ఆశ్చర్యపడేతంట – ఆప్యాయంగా మాట్లాడారు. "డాడీ! ఏ కష్టం వచ్చినా ముగ్గురం కలిసి ఎదిరిస్తాం. మేము వచ్చాం. ధైర్యంగా ఉండు" అన్నారు. వాస్తవంగా నాకు కొండంత ధైర్యం వచ్చింది! ఇంటికి వచ్చి కమలకు చెపితే పొంగిపోయింది! ఆడ పిల్లలు ఆనందం పట్టలేక ఏడ్చారు.

మా మగ పిల్లల ప్రత్యేకత ఏమంటే – వాళ్లు మొత్తం కుటుంబంతో తెగతెంపులు చేసుకున్నారు. వారికి ఇద్దరు అక్కా, చెల్లెళ్లు – ఇద్దరు బావలు – అప్పటికి ఒక మేనకోడలు, ఒక మేనల్లుడు – నలుగురు మేనమామల కుటుంబాలు – ముగ్గురు మేనత్తల కుటుంబాలు – ఒక పెదనాన్న కుటుంబంతో ఎవరితోనూ సంబంధం లేకుండా పోయింది. ఇంతటి మొనగాళ్లు ఈ కాలంలో సైతం అరుదు!

25 అక్టోబరు 1986 నాడు మూత్రబాధ కోసం ఆపరేషను నిర్ణయం అయింది. రక్తంలో విపరీతంగా పెరిగిన చెక్కెరను కంట్రోలు చేయడానికి ముందుగానే ఆస్పత్రిలో చేర్చుకున్నారు.

24 నాటి రాత్రి విజయ్ అస్పత్రిలో నా గదిలో ఉన్నాడు. కమల వచ్చింది. 83 మే తరువాత తొలిసారిగా కొడుకును చూచింది! ఆమెలో ఎన్ని సాగరాలు పొంగి పొర్లాయో! 'నాయనా! బాగున్నావా?' అన్నది. అంతే – విజయ్ మండిపడ్డాడు. కమలను నానామాటలన్నాడు. నాగును – ఉమను ఆమె ఎన్నడో తిట్టినందుకు తల్లిని రాక్షసి – పిశాచి, అన్నాడు. లేచి వెళ్లిపోయాడు.

"నేను ఏమన్నానండీ?" అని కమల నామీద పడి భోరుమన్నది. నా స్థితీ అలాగే ఉంది. డాక్టర్లు చూస్తే ఇద్దరికీ రక్తపు పోటు పెరిగింది. 'రేపు ఆపరేషను – ఇలా అయితే ఎలా?' అని డాక్టర్లు చీవాట్లు పెట్టారు. మందులిచ్చి నిద్రపుచ్చారు.

ఆపరేషను నాడు మా అన్నయ్య నన్ను వెన్నంటి ఉన్నాడు. ఆపరేషను అయింది. థియేటరునుంచి తెస్తున్న నన్ను కమల చూచింది. విరుచుకు పడిపోయింది. డాక్టర్లు ఆమెను గదికి చేర్చారు. ఇంజక్షన్లు వగయిరా నానా తంటాలు పడ్డారు. జనంతో ఆమె గది నిండిపోయింది. విజయ్ – విరించి అటు తొక్కి చూడలేదు!

అనాడు ఆసుపత్రి మా బంధుమిత్రులతో నిండిపోయింది. ఒకటి రెండు రోజుల్లో కమల కోలుకుంది. విజయ్ వెళ్లిపోయాడు. విరించి ఉండిపోయాడు. వాడు కమలతో మాట్లాడితే ఆమె ఎంత పొంగిపోయిందో! విరించి నేను డిశ్చార్జి అయ్యేదాకా ఉన్నాడు. తానే ఆస్పత్రి బిల్లు కట్టాడు. నన్ను ఇంటికి పంపాడు. తాను రాలేదు, వెళ్లిపోయాడు.

మూత్రవ్యాధి తగ్గింది. డిశ్చార్జి అయిన్నాడు, 30–10–1986 గురువారం రాత్రి మా ఇంట్లో మిత్రులకు – డాక్టర్లకు ఒక పార్టీ ఇచ్చాను. మా అన్నయ్య, మా అల్లుళ్లు కూడా ఉన్నారు. ఆనాడు మద్యం వదిలేశాను. మళ్లీ ముట్టలేదు.

మూత్రవ్యాధి ఉపశమనం అయింది. కాని రక్తంలో చక్కెర పెరుగుతున్నది. ఇన్సులిన్‌కు కూడా లొంగడం లేదు. ఎంత తిన్నా చాలడం లేదు. ఆకలి ఆరడం లేదు. మానసిక వైకల్యం మరింత పెరిగింది. నిమిష నిమిషానికీ ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తుంది. టెస్టులు – సైక్యాట్రిస్టులు – ఇతర డాక్టర్లు విధించిన టెస్టులు – చికిత్సలు నిరవధికంగా సాగుతున్నాయి. అన్నయ్య ఎడతెరపి లేకుండా డాక్టర్ల చుట్టు తిరుగుతున్నాడు. కాస్త విషమస్థితిలో 1987 సెప్టెంబరులో ఆస్పత్రిలో చేరాను. డాక్టర్లు నిరంతరం ప్రయత్నిస్తున్నారు.

నాకు ప్రమాదంగా ఉంది. 9–10–87న విరించి ఆస్పత్రికి వచ్చాడు. నాకు ఎంతో బలం వచ్చినట్లయింది. వాణ్ణి పడకలో కూర్చుండ బెట్టుకుని – చేయి పట్టుకొని "నాన్నా, విరించీ! నా పరిస్థితి అంత బావుండలేదు. ఆఫీసునుంచి సుమారు రెండు లక్షలు వస్తాయి. నలుగురూ సమానంగా పంచుకోండి" అన్నాను.

"డాడీ! నేను ఉమను పెళ్లిచేసుకుంటాను."

"నాన్నా! నేను నిన్ను వద్దన్నానా?"

"మమ్మీ వద్దంటుంది."

"నువ్వు ఆమెను అడిగావా?"

"మమ్మీ ఉమను తిట్టింది కదా!"

నేను మాట్లాడలేదు. నాకు డిప్రెషన్ పెరిగిపోయింది. మనసు పరిపరివిధాల పోతున్నది. ఎంతో బాధగా ఉంది, చికాకుగా ఉంది, చింతగా ఉంది.

కమల వచ్చింది. నా పరిస్థితి చూచి కలవరపడింది.

"మమ్మీ! నేను ఉమను చేసుకుంటాను."

"నీ ఇష్టం, చేసుకునేది నువ్వు – అనుభవించేది నువ్వు" – చాలా నిబ్బరంగా సమాధానం చెప్పింది కమల.

అందుకే వచ్చినట్లు – ఎవరికో వార్త అందించాల్సినట్లు విరించి దిగ్గున లేచి వెళ్లిపోయాడు. కమల డాక్టరుకోసం పరిగెత్తింది.

నాలుగు రోజుల్లో డిశ్చార్జి చేశారు. మావెంట విరించికూడా మా ఇంటికి వచ్చాడు!

ఎందరో పెద్ద పెద్ద డాక్టర్ల వల్ల నయం కాలేదు – ఆనాటికి ఒక పిల్ల డాక్టర్ చంద్రశేఖర్ మందుతో ఉపశమనం మొదలయింది.

అదిగో, అప్పుడే మా అన్నయ్యకు గుండెపోటు వచ్చి ఆస్పత్రిలో చేరాడు. డాక్టర్లు నన్ను వారించారు. నిలువలేకపోయాను. ఆస్పత్రికి వెళ్లాను. అన్నయ్య బోనులో సింహంలా ఉన్నాడు. 'తమ్ముడూ! ఇలా అయిందిరా నా స్థితి' అని నన్ను పట్టుకున్నాడు. "పెద్దబాబూ! ధైర్యంగా ఉండాలె" అన్నది మా పెద్దమ్మాయి ఉదయ. "ఉదయక్కా! నాకు ధైర్యం లేదమ్మా!" అని ఆమెను పట్టుకుని పెద్దగా ఏడ్చేశాడు!

నేను నిర్విణ్ణున్ని అయినాను. మా అమ్మా – నాయనా పోయినప్పుడు కూడా అన్నయ్య ఏడవలేదు! మా అన్నయ్య సింహం. ఎవరికీ బెదరలేదు. ఇప్పుడు గుండె చెదిరాడు! నేనూ చెదిరియే ఉన్నాను. అయినా నిబ్బరం వహించాను. కన్నీటిచుక్క రాల్చలేదు!

అన్నయ్యా – నేనూ ఇద్దరం అనారోగ్యంగానే ఉన్నాం. అన్నయ్యకు గుండెపోటు తగ్గింది. ఆసుపత్రినుంచి విడుదల చేశారు. మా ఇంటికి రావలసినవాడు హైదర్‌గూడెంలోని వాళ్ల ఇంటికి వెళ్లాడు.

కమలా – నేనూ అన్నయ్యను చూడడానికి వెళ్లాం. అస్పత్రిలోకంటే బావున్నాడు. ఆపిల్ కోసి పెడ్తే ముక్కలు తిన్నాడు. చిన్ననాటి ముచ్చట్లన్నీ తోడిపోశాడు. "1950లో ఖమ్మం హీరాలాల్ ఇంట్లో జబ్బున పడ్డాను. నువ్వు నా మూత్ర పురీషాలు ఎత్తిపోశావు" అన్నాడు. మరెన్నో ముచ్చట్లు చెప్పాడు.

అన్నయ్య బాగవుతాడు. మళ్లీ మా ఇంటికి వస్తాడు, ముచ్చట్లు చెపుతాడు. చాయ్ తాగుతాడు. భోజనం చేస్తాడు అనుకున్నాం.

మళ్లీ మేం 1–11–87న వెళ్లాం. అన్నయ్య నన్ను తన మంచంమీద కూర్చుండ పెట్టుకున్నాడు. తాను వ్రాసినవి–వ్రాయదలచిన వాటిని గురించి ముచ్చటించాడు. "అన్నయ్యా! నీ జబ్బు నయం అయింది. కోలుకోవాలి అంతే" అన్నాను. "నేనూ అదే అనుకుంటున్నాను" అని ధైర్యం కనబరచాడు. సంతోషంగా తిరిగివచ్చాం.

5–11–87 కార్తీక పూర్ణిమ, వ్యాసపూర్ణిమ, గురుగోవింద్ జన్మదినం, మహమ్మద్ జన్మదినం. ఆరోజు మా అన్నయ్య బాత్‌రూంలో పడిపోయాడు. ఇందిర "నాన్నా! నాన్నా!" అంటూలోనికి ఉరికింది. ఇంకెక్కడి నాన్న? ఎక్కడినుంచో పిలుపు వచ్చింది. తిరిగిరాని లోకాలకు వెళ్లిపోయాడు!

ఆనాడు నామీద కొండలు కూలిపడినాయి. లోకం చీకటి మూకల మయం అయింది. అన్నయ్య వెళ్లిపోయీ మనం బతగ్గలమా? అనుకున్నాను.

*దేశేదేశే కళత్రాని దేశేదేశే చ బాంధవాః*

*తంతుదేశంऽనపశ్యామి యత్రభ్రాతా సహోదరః*

ఏ ప్రాంతంలో నయినా భార్యలుంటారు. బంధువులుంటారు. తొడపుట్టిన సోదరుడు ఉన్న దేశం కనిపించదు అని విలపిస్తాడు రాముడు – లక్ష్మణుడు మూర్ఛపోయినపుడు.

ఏడవడం తప్ప చేయగలిగిందేముంది? అందుకే ఏడ్చాం. ఏదీ తప్పదు. అన్నయ్యను అంబరపేట శ్మశాన వాటికలో అగ్నికి ఆహుతిచేసి వచ్చాం.

కవితా శరధి దాశరధి అస్తమించారు! ఈ వార్తను రేడియో, టి.వి., పత్రికలూ పతాక శీర్షికల్తో ప్రకటించాయి. సుమారుగా తెలుగు పత్రికలన్నీ సంపాదకీయాలు వ్రాశాయి. మేంచేయాల్సిన దినవారాదులు ముగించాం.

ఒక వెలుగుల రాశి ఆరిపోయింది
ఒక సింహరాజం కన్నుమూసింది.

"నిర్భయంగా వచ్చాను. నిర్భయంగా వెళతాను
ఉచ్ఛ్వసిస్తూ వచ్చాను. నిశ్వసిస్తూ వెళతాను
మృత్యువు నృత్యం చూపి జడిపిస్తారెందుకని?
భయమెందుకు? నా ఇంటికి నే వెళ్తాను"

అని నిర్భయంగా మృత్యువును తన ఇంటిని చేసికోగలిగిన మహా యోధుడు మా అన్నయ్య దాశరధి కృష్ణమాచార్య.

కాలానికి కనికరం లేదు. సాగిపోతూనే ఉంటుంది. అది దేనినీ పట్టించుకోదు.

నేను ఆఫీసుకు వెళ్తున్నాను. అప్పుడప్పుడూ విజయ్ వచ్చిపోతున్నాడు. నెల్లూరులో అయొడైజ్డ్ ఉప్పు ఫ్యాక్టరీ పెడ్తున్నామని చెప్పారు. అన్నదమ్ములు ఉద్యోగాలు వదిలేస్తారట. ఫ్యాక్టరీ నడిపించుకుంటామన్నాడు. ఫ్యాక్టరీ ప్రారంభోత్సవం జరిగింది. మమ్ములను పిలువలేదు. ఎంచేతంటే, నాగమణి – ఆమె మొగుడు అక్కడికి రాక తప్పదు.

ఆఫీసుకు ఒకనాడు ఆత్రేయ అన్నగారు వచ్చారు. వారిని చూచి మనసు వికలం అయింది. ఆ రీవి – ఆ గర్వం – కనిపించలేదు. జూలు తీసిన సింహంలా ఉన్నారు. నవ్వులో వెన్నెల వసివాడలేదు. దాశరధి గురించి ముచ్చటించుకున్నాం. ఇరువురి మనసులు చెమర్చాయి.

ఆత్రేయకు వీడ్కోలు చెప్పడానికి బయటిదాకా వచ్చాను. కారు కనిపించలేదు కారులేని ఆత్రేయను ఊహించడానికే మనసులో ముల్లు గుచ్చుకున్నట్లయింది! ఆటోలో వెళ్తాను అన్నారు. ఆ నవ్వు వెలవెలబోతున్నది! 'ఆటోకు డబ్బులున్నాయా' అడిగాను. 'అక్కడవాళ్లు ఇస్తారులే' అన్నారు. నా కళ్లకు గిర్రున నీళ్లు తిరిగాయి. ఆటో తెప్పించాను. నా దగ్గర ఉన్న డబ్బు వారి జేబులో పెట్టిపంపించాను. *'కాశికావిశ్వేశు కలిసె వీరారెడ్డి కనకాంబరంబు లేరాయడిచ్చు?'* అన్న శ్రీనాథుని చాటువు గుర్తుకు వచ్చింది.

ఆ తరువాత కొద్దిరోజులకే మనసు కవి ఆత్రేయ మనలను విడిచి వెళ్లిపోయారు – 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనగ.'

ఆంధ్రదేశం ఒక సుకవిని కోల్పోయింది. నేను మరొక అన్నను కోల్పోయాను!

31–3–1988 నా ఉద్యోగ విరమణ దినం. ముప్ఫయి సంవత్సరాల పైబడి సర్వీసులో చాల పదవుల్లో పని చేశాను. కాని ఎక్కడా ఎవరికీ హాని చేయలేదు. చేయగలిగినంత మేలు చేశాను. ఎంతటి పై అధికారికయినా తలవంచలేదు. తప్పు చేయలేదు. అందరూ అభిమానించారు.

ఈ జీవితంలోనే అనేక జన్మలుంటాయి. ఉద్యోగి జన్మ అంతరిస్తున్నది! నేను జీవన భృతి కోసం ఉద్యోగం చేశాను – అధికారం కోసం కాదు. అందువల్ల

నాకు అంతగా బాధ అనిపించలేదు. కొందరితో అనుబంధాలు పెంచుకున్నాను. అనుబంధాలు నా సంపద!

ఉదయంనుంచి చాలమంది వస్తున్నారు, కలుసుకోవడానికి. మధ్యాహ్నం విజయ్ వచ్చాడు. సాయంత్రందాకా ఉన్నాడు. సాయంకాలం ఆఫీసువాళ్లు వీడ్కోలు విందు ఇచ్చారు. పూలదండలు – ఫలములు – బహూమతులు – అర్ద్ర వచనములు! ఆఫీసు వదులుతుంటే మనసు 'కలుక్కు'మంది వెంట విజయ్ ఇంటికి వచ్చాడు! '83 తరవాత ఇప్పుడే అడుగుపెట్టడం!.

ఇంటి దగ్గరికి కూడా మిత్రులు, బంధువులు, వారూ పళ్లూ, పూలూ, వస్త్రాలు తెచ్చారు. వచ్చిన వాళ్లు వెళ్లేవరకు కొంత సమయం పట్టింది. అయినా కమల బయటికి రాలేదు. ఆమె వణకిపోతున్నది – విజయ్ వచ్చాడు, మళ్లేం గొడవో అని! **భగవాన్! ఎలాంటి పరిస్థితి కల్పించావు స్వామీ! కొడుకు వస్తే తల్లి సంబరపడలేని దశ!**

నేను కమలను బయటికి తీసుకొచ్చాను. భయం భయంగా వచ్చింది. కాని విజయ్ తల్లిని పలకరించాడు! మేమిద్దరం మురిసిపోయాం. **అంతేనండీ! ఒక్కమంచి మాటకోసమే మా తాపత్రయం!**

విజయ్ అప్పుడప్పుడూ వస్తునాడు. అంతే చాలును అనుకుంటున్నాం మేము!

రిటైర్మెంటు బాపతు నాకు రెండు లక్షలు వచ్చాయి. అందరూ వద్దంటున్నా నలుగురు పిల్లలకు సమానంగా యాభయివేల చొప్పున ఇచ్చాను. మనం ఉండగా **ఇస్తే మనకు, వాళ్లకు సంతృప్తి అని నా ఉద్దేశం!**

విజయ్ – ఆడపిల్లలు, అల్లుళ్లు, వాళ్లపిల్లలు మమ్ముులను అందరినీ నెల్లూరు తీసికెళ్లాడు. అన్నదమ్ములు అందరినీ ఆదరించారు. అందరం తిరుపతి వెళ్లాం. సుధా – సురోత్తములు పుత్రుడు సమీర్ పుట్టువెంట్రుకలు తీయించాం. ఆ నాలుగు రోజులు – కుటుంబం అంతా ఒకచోట – సంబరంగా గడిచిపోయాయి! తిరిగి వచ్చాశాం.

విభవ సంవత్సర అధిక శ్రావణ శుక్ల సప్తమి మంగళవారం 24–8–1928 నేను పుట్టినరోజు. మా పిల్లలు నా షష్టిపూర్తి జరుపడానికి నిశ్చయించారు. విజయ్, విరించి పేర ఆహ్వాన పత్రాలు అచ్చయినాయి. 24–8–1988 బుధవారం షష్టిపూర్తి అని అందరికీ ఆహ్వానాలు పంపారు.

24–8–1988 బుధవారంనాటి నా షష్టిపూర్తి ఉత్సవానికి బంధువులు – మిత్రులు అనేకమంది వచ్చారు. శ్రావ్య నాదస్వర వాద్యము, సంస్కృత – ద్రావిడ వేద ఘోషల మధ్య శాస్త్రోక్తంగా అయుష్యహోమం – సహస్రధార మున్నగునవి మహావైభవంగా జరిగాయి. కమలకు ఏడేళ్లుండగా మంగళసూత్రం కట్టాను. అది అంతగా గుర్తులేదు. ఆరోజు మంగళవాద్యాలు, వేదమంత్రాల నడుమ కమలకు మళ్లీ మంగళసూత్రం కట్టాను. సభ కరతాళధ్వనులతో ప్రతిధ్వనించింది. అందరూ భోజనాలు చేశారు. ఉత్సవం ఉత్సాహంగా ముగిసింది.

శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయం – అభ్యుదయ రచయితల సంఘం సంయుక్త అధ్వర్యంలో – ఆ సాయంకాలం భాషానిలయంలో – నా అభినందన సభ



దాశరథి రంగాచార్య షష్టిపూర్తిలో ధర్మపత్ని కమలకు మంగళసూత్రం కట్టడం

ఏర్పాటయింది. దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షత వహించారు. గజ్జల మల్లారెడ్డిగారు ముఖ్యఅతిథిగా విచ్చేశారు.

నగరంలోని అనేక సాహితీ సంస్థలు – నా మెడ వంచేటన్ని పూలదండలు వేసి – శాలువాలు కప్పి నన్ను సత్కరించారు.

"దేహదాసు ఉత్తరాలు" అనే నా గ్రంథాన్ని సాందీప్‌గారు, దాశరథి రంగాచార్య నవలల్లో 'జనపదం' అనే పరిశోధనా వ్యాసగ్రంథాన్ని కేతు విశ్వనాథరెడ్డిగారు విడుదల చేశారు.

నేను – మా అన్నయ్య దాశరథి, మామయ్య ఆళ్వార్‌స్వామి, భాయ్‌జాన్ నార్ల చిరంజీవిని స్మరించుకున్నాను.



షష్టిపూర్తి అభినందన సభ

సభ సంబరంగా ముగిసింది.

ఎందరో నన్ను అభినందించారు.

షష్టిపూర్తి తరువాత విజయ్ మళ్లీ నెల్లూరు వెళ్లలేదు. విరించి ఇక్కడ, అక్కడ ఉంటున్నాడు. మాతో సామరస్యంగానే ఉంటున్నాడు.

ఉమను కమల ఆనాడు తిట్టింది. కాబట్టి మమ్ములను లొంగదీయాలని ఉమ ప్లాను. మేము వాళ్ల ఇంటికి వెళ్లి అర్థించాలి. విరించిమీద వత్తిడి ఎక్కువయింది. విరించి మమ్మ వేధించినాడు. ఉమ తల్లితండ్రులు, మేము ఒక హోటల్లో కలుసుకున్నాం. అది ఒక పంతం. అక్కడ మాట్లాడాల్సింది ఏమీలేదు, ఆ లాంఛనం పూర్తిచేశాం.

వివాహం వ్యక్తుల కలయిక మాత్రంకాదు. వివాహం కుటుంబాల కలయిక. వివాహం శరీరాల కలయిక కాదు – మనసుల కలయిక. వివాహం వ్యక్తిగత విధి కాదు. సామాజిక విధి. వివాహం సంతాన ప్రాప్తికి కావలసిన పవిత్రబంధం. కలగ నున్న సంతానంమీద పై ఏడు తరాల ప్రభావం ఉంటుంది. పాశ్చాత్య నాగరికతకు ఈ పరిజ్ఞానం లేదు. అందుకే అక్కడ కుటుంబాలు కరిగిపోయాయి. మనం – **నిన్న పుట్టి ఇంకా వికసించని, పై మెరుగుల పాశ్చాత్య నాగరకత మోజులో – అనాదిగా వస్తున్న భారత సాంప్రదాయాన్ని – కాలదన్నుతున్నాం. ఇందుకు భావితరాలు మనను మన్నింపవు!**

విజయ్ తన సేవాతత్పరతతో మమ్ములను మైమరపించాడు. ఇంటి పనులన్నీ తానే చూచుకున్నాడు. మాకు కావలసినవి అన్ని సమకూర్చాడు. VCP తెచ్చిపెట్టాడు. రోజూ కాసెట్లు తెచ్చి పిక్చర్లు చూపించాడు. విజయ్ లేనిది క్షణం గడవదు అన్నట్లు ప్రవర్తించాడు. మాకు – ఏ తల్లిదండ్రులకయినా – అంతకుమించి కావలసినది లేదు.

విజయ్ తాను ఇంట్లో ఉండి – మమ్మెలను ఔరంగాబాదు పంపించాడు. మేము ఎల్లోరా, అజంతా వగైరాలు చూచి శిరిడి దర్శించుకుని వచ్చాం. మమ్మ ముంబాయి పంపించాడు. ఎలిఫెంటా గుహలు వగైరా చూచి వచ్చాం.

గయ వెళ్లి మా తల్లితండ్రులకు పిండ ప్రవానం చేసి రావాలని సంకల్పించాం. సికిందరాబాదునుంచి విజయవాడకు, అక్కణ్ణుంచి కలకత్తాకు విజయ్ రిజర్వేషను చేయించాడు. ఒకేసారి ప్రయాణం – అలసిపోతారు – ఖమ్మంలో దిగి, మా చిన్నమ్మాయి దగ్గర ఉండమని చెప్పాడు. 21 మార్చి 1989 మంగళవారం ఆటో తెచ్చి మమ్మెలను ఎక్కించాడు. వీడ్కోలు చెప్పేప్పుడు విజయ్ కనులు చెమ్మగిలడం కమల గమనించింది. 'విజయ్ మనను విడిచి ఉండలేకపోతున్నాడు' అన్నాను.

కమలా నేనూ కోణార్కలో సాయంత్రం అయిదింటికి ఖమ్మంలో దిగాం. ముంబాయినుంచి తెచ్చిన వస్తువులు పిల్లలకు ఇస్తున్నాం. సుధ చాయ్‌చేసి ఇచ్చింది, తాగుతున్నాం. సికిందరాబాదునుంచి ఫోను నేనే అందుకున్నాను. 'అంకుల్! విజయ్ సీరియస్ – వెంటనే బయలుదేరండి' – పక్కింటి మున్నా చెప్పాడు. పెట్టేశాడు. కమలకు చెప్పనేలేదు, గ్రహించింది. ఆమె వేళ్లు కొంకర్లు పోతున్నాయి. నా మనసు మల్లెతోట మీద పిడుగులు పడి ధ్వంసం అయింది. క్షణం చేష్టలుడిగాను. నాగిని విషపు కోరలు బుసకొట్టాయి. ప్రమాదం శంకించాను. ఎవరికీ ప్రాణాల్లో ప్రాణాలు, మనసులో మనసులు లేవు.

సురోత్తం ఒక టాక్సీ తెచ్చాడు. అందరం అందులో పడ్డాం, బయలుదేరాం. అది కాళరాత్రి, అధి సుదీర్ఘప్రయాణం, తెగదు. చాయ్‌లు, సిగరెట్లకు అంతులేదు. మనసులు కీడు శంకిస్తున్నాయి. ఎప్పుడో తెల్లవారు జామున ఇంటికి చేరుకున్నాం. ఇంటిముందు – అంతరాత్రి జనం! ఇంటిముందు అగ్ని!!

కమల ఆ వాతావరణం చూచింది. విరుచుకుపడిపోయింది. నా నోట మాట రాలేదు, కూలబడ్డాను. రమణ – లక్ష్మి, వదిన – ఇందిర, ఇతర బంధువులు మిత్రులు ఓదార్చారు! కాని పుత్రశోకాన్ని ఎవరు ఓదార్చగలరు? 'పుత్రశోకం పునఃపునః' అన్నారు. ఇది జీవితకాలం ఉండే గుండెమంట! ఇది వ్రాస్తుంటే గుండె భగభగ మండుతున్నది.

విజయ్ మమ్మెలను పంపించాడు. తాను ఉరి పెట్టుకున్నాడు. మేము విజయ్ శవం చూడాల్సివచ్చింది. విజయ్ అందగాడు! శవంగా కూడా ముద్దు వస్తున్నాడు! శవంమీద పడి గుండెలు పగుల ఏడ్చాం! అంతకు మించి ఏమీ చేయలేని అభాగ్యులం! దౌర్భాగ్యులం!!!

స్వామీ! చేయని యే నేరానికి ఈ శిక్ష!!!

విజయ్ మరణం ఒక మిస్టరీ! వాడు నాగు ఇంటికి వెళ్లి వచ్చి, ఉరిపెట్టుకున్నాట్ట! తన చావుకు ఎవరూ కారణం కాదని వ్రాసిన విజయ్ 'ఇప్పుడైనా అది నన్ను అర్థం చేసుకుంటుంది.' అని వ్రాశాడు. దాని పేరు 'నాగు' కాదు. ఒక పెళ్లయిన పిల్లను బద్నాం చేయరాదని మారుపేరు వాడాను. మా విజయ్ చావుకు అదే కారణం, అదే కారణం, అదే కారణం. ముమ్మాటికి ఆ రాక్షసియే కారణం.

తన కిమ్మగునంతకుదు
ర్జనుడిష్టుడ పోలె నుండి సర్పము పోలెం
దనకిమ్మగుడును గరచును
ఘన దారుణ కర్మ గరళ ఘన దంష్ట్రములన్. (మహాభారతము 1-6-113)

దుర్జనుడు - తనకు అనుకూలించనపుడు - అనుకూలునివలె కలిసి మెలిసి ఉంటాడు. తనకు అనుకూలించినపుడు పడగ విప్పుతాడు. దుర్మార్గపు కోరలతో కాటు వేస్తాడు.

విరించి నెల్లూరులో లేడు. అతడు బెంగళూరు వెళ్లిన విషయం విజయ్‌కి తెలుసు. బెంగళూరు టెలిఫోను నెంబరు కూడా ఇచ్చాడు! వాడు సాయంత్రానికిగాని చేరుకోలేదు. ఈలోగా గోదావరిఖనినుంచి మా పెద్దమ్మాయి ఉదయ, అల్లుడు మోహను - వాళ్ల పిల్లవాడు ఉజ్వల్ చేరుకున్నారు.

విజయ్ ఈ పనికోసమే ఇంటికి వచ్చినట్లున్నాడు. తన పని తీర్చుకున్నాడు. మమ్మలను నిండా ముంచాడు, వెళ్లిపోయాడు. మాకు కర్మ చేస్తాడని' 72లోనే విజయ్‌కు ఉపనయనం చేశాం. ఇప్పుడు నేను అగ్గిపట్టుకుని నడవాల్సి వచ్చింది. పసివాడు విజయ్ దేహానికి అగ్గిపెట్టవలసి వచ్చింది!

భగవాన్! ఇలాంటి విపత్తు ఏ తండ్రికీ రానీయకు!

విజయ్ అస్తినిమజ్జనానికని విరించి విజయవాడ వెళ్లాడు. అటునుంచి నెల్లూరు వెళ్లాడు. అన్నీ సర్దుకొని ఆలస్యంగా వచ్చాడు.

విజయ్‌కు ఉపనయనం చేశాం. కావున పరమపద ఉత్సవం సహితంగా పదమూడు రోజులు తీర్థతిరువధ్యయనాలు చేశాం. అయ్యో! ఏం చెప్పమంటారు! ఏటా తద్దినాలు కూడా పెడుతున్నాం.

విరించి నెల్లూరు చేరుకున్నాడు. విజయ్ ఆస్తికి వాస్తవ వారసుణ్ణి నేను. ఫ్యాక్టరీ వగయిరాలన్నీ చుట్టపెట్టుకున్నాడు. మా ఇంట్లో ఉండిన విజయ్ స్కూటరు సహితం అమ్ముకున్నాడు. నాకు కష్టానికి ఒక్కపైసా ఇవ్వలేదు, కాదు - చూపలేదు. పైగా, ప్రాణంమీదికి వచ్చిందని నా దగ్గరనుంచే పెద్దమొత్తం రాబట్టాడు!

5 అక్టోబరు 1989న విరించి - ఉమ పెళ్లిచేసుకున్నారు. పిలవకున్నా - సిగ్గులేక - మేం వెళ్లాం. తల్లితండ్రులకు సిగ్గు - లజ్జ ఉండరాదు. పెళ్లి చేసుకొని వెంకటేశ్వర ఆలయానికి వెళ్లారు. కనీసం మాతో చెప్పలేదు. పెళ్లినాడు కన్నీరు రాల్చరాదని దిగమింగాం.

విరించి - ఉమ లాంఛనానికి ఒక్కసారి ఇంటికి వచ్చారు. తరువాత నెల్లూరు చేరుకున్నారు. పత్తా లేరు!

4-12-92 శుక్రవారం సాయంత్రం విరించి - ఉమ వారి పసిబాలుణ్ణి తీసుకొని వచ్చారు. పిల్లవాడు ముద్దుగా ఉన్నాడు. 16-7-92న పుట్టాట్ట! శ్రేష్ఠ అనిపేరు పెట్టారట. ఇప్పుడు తీసుకొని వచ్చారు. మనుమని చూచి ఇద్దరమూ మురిసిపోయాం. వాళ్లు సికిందరాబాదు మారారట. మారేడు పల్లిలోనే ఉంటున్నారట. అప్పటినుంచి వచ్చిపోతున్నారు! శ్రేష్ఠకు మేమే అన్నప్రాశన చేయా లన్నారు. సంబరంగానే చేశాం. రాక తగ్గించారు. ఏం చేస్తాం? వచ్చిన్నాడు సంబరపడ్డాం.

శ్రీముఖ సంవత్సరంలో కమల పుట్టింది. ఆడపిల్ల లంటే అలుసు. వాళ్ల

పుట్టినరోజులు - జాతకాలు వ్రాసిపెట్టేవారుకారు. మా నాయన మా ఇద్దరి జాతకాలు మాత్రమే వ్రాశారు. ముగ్గురు చెల్లెళ్లది వ్రాయలేదు.

కమల నాకు ఛాయవలె వెన్నంటి నడిచింది. ఆమె సహకారం లేకుంటే నా ఈ బరువయిన జీవితం - దుర్భరం అయ్యేది. అందువల్ల కమలకు షష్టిపూర్తి జరుప సంకల్పించాను. ఆమె పుట్టినరోజు తెలియదు. కావున నా పుట్టిన రోజున జరుపాలనుకున్నాను.

ఆడవారికి షష్టిపూర్తి జరపడం ఆచారం కాదు. అంతేకాదు - సంప్రదాయ విరుద్ధం అన్నారు కొందరు. నా షష్టిపూర్తి జరిగినపుడే ఆమె షష్టిపూర్తి జరిగింది. మళ్ళీ జరుపరాదన్నారు మరికొందరు. విపరీత పరిణామాలు జరుగుతాయని భయ పెట్టారు ఇంకొందరు.

ఎవరు ఏమన్నా - ఏమి జరిగినా 24-8-1993న కమల షష్టిపూర్తి జరుపడానికి నిశ్చయించాను. విరించి - ఉమ, ఉదయ - మోహన్, సుధ, సురోత్తంతో చర్చించాను. ప్రయత్నాలు ప్రారంభించాను.

అదిగో, ఆనాటినుంచి విరించి - ఉమ రావడం మానేశారు. ఆహ్వానపత్రికలు నా పేర వేశాను. భర్త భార్యకు చేసిన షష్టిపూర్తి బహుశా ఇదే మొదటిది!

కమల షష్టిపూర్తి వేదఘోషలు - మంగళ వాద్యాలు - ఆయుష్యహోమం - సహస్రధార మున్నగు విధి విధానములతో - నా షష్టిపూర్తి కన్న - గొప్పగా జరిగింది. బంధుమిత్రులు అనేకులు వచ్చారు. ఆనాడు మా ఇద్దరికీ వేసిన పూలదండల్లో మేం మునిగిపోయాం. ఉదయ-సుధ వాళ్లు మామీద కనకవర్షం-పుష్పవర్షం కురిపించారు.

రచయిత బి. ఎస్. రాములు దంపతులకు సాహిత్యసత్కారం చేశాం.

చిరంజీవి కామేశ్వరరావుకు దాశరథి విజయకుమార్ స్వర్ణపతకం ప్రదానం చేశాం.

సుమారు వేయిమంది రుచికరమయిన సాత్విక భోజనాలు చేశారు.

కమల షష్టిపూర్తి మహత్ వైభవంగా జరిగింది. నేను ఒక కొత్త సంప్రదాయానికి శ్రీకారం చుట్టాను.

ఉదయ-మోహను స్వయంగా వెళ్లి, విరించి - ఉమలకు పత్రిక ఇచ్చి ఆహ్వానించి వచ్చారు. ఇందిర వెళ్లి ఉత్సవ పరిసమాప్తి సమయంలో వాళ్లిద్దరిని తీసుకుని వచ్చింది. ఆ తరువాత మళ్లీ బంద్.

విరించి, వాళ్ళు మారేడుపల్లిలో మా ఇంటికి సుమారు కిలోమీటరు దూరంలో ఉంటారు. అయినా ముఖం చూపరు! మేము వారినుంచి ఆశించింది "మంచిమాట" మాత్రమే! అదీ కరువయింది! శ్రేష్ఠను కనిపించనీయరు!

ఇప్పుడు మా గూటిలో మేము ఇద్దరమే! ఏప్రెల్ 1994 లో కమలకు గుండెపోటు వచ్చింది. ఆస్పత్రిలో చేరింది. ఆడపిల్లలు అల్లుళ్లు వచ్చారు. సేవలు చేశారు. చెప్పి పంపాం. విరించి - ఉమ ఆస్పత్రికి చుట్టపు చూపుగా వచ్చి వెళ్లారు. ఇంటికి రాలేదు!

వ్యాఘ్రీవ తిష్ఠతి జరా పరితర్జయన్తీ
రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తి దేహం
ఆయుః పరిస్రవతి భిన్న ఘటాదివామ్భో
లోకస్తథాప్యహిత మాచరతీతి చిత్రమ్. (భర్తృహరి)

వార్ధక్యం పులిలా నిలుస్తుంది, బెదిరిస్తుంది. వ్యాధులు శత్రువులు అవుతాయి. దేహాన్ని పీడిస్తుంటాయి. ఆయువు ఓటికుండలోని నీటివంటిది. వడిసిపోతుంటుంది. అన్నీ తెలుసు. అయినా లోకం అహితమే ఆచరిస్తుంది. ఎంత విచిత్రం!!!

## ముప్ఫయి ఎనిమిది

### విద్వాన్ సర్వత్ర పూజ్యతే:

ఈలోకం ఇలా నిలువడానికి రాజకీయం. శాసనం. బలప్రయోగం మాత్రం కారణాలు కావు. ఈ లోకం నిలవడానికి ప్రేమ - అభిమానం - అనుబంధం - అనురాగం - ఆత్మీయత వాస్తవ కారణాలు. మానసిక అనుబంధపు దివ్వెలను వెలిగించి వెలుగులు చిమ్మటకు ఉపకరించే సంప్రదాయం - సాహిత్యం సంస్కృతి ప్రధాన కారణాలు.

సాహిత్యం - సంస్కృతి మానవ సంబంధాలు మెరుగుపరచడానికి తోడ్పడ్తాయి. అందుకే సమాజం వాటిని అభిమానిస్తుంది, ఆదరిస్తుంది, పూజిస్తుంది.



భద్రాచలంలో దాశరది రంగాచార్యకు సన్మానం

ఆత్మీయత - అనుబంధములే నాకు సంపదలు అని ఇదివరకు విన్నవించి ఉన్నాను. మూడు దశాబ్దాలకు పైగా, మున్సిపాలిటీలో కొట్టుమిట్టాడాను. పదవీ విరమణ తరువాత పాత స్థలాలూ - పాత మిత్రులు - బంధువులు గుర్తు వచ్చారు. కమలా నేనూ బంధు - మిత్ర యాత్ర సాగించాం.

భద్రాచలంలో మా చెల్లెలు రమాదేవి ఇంటికి వెళ్లాం. జనక తనయా స్నానపుణ్యోదక స్థలం పర్ణశాల దర్శించుకున్నాం. భద్రాచలం గ్రామంలోనూ - ఆలయంలోనూ నన్ను ఆత్మీయంగా సత్కరించారు. మా తాతలనుంచి నాయన వరకు వారి జన్మస్థలం భద్రాచలం! అక్కడి సన్మానం నా మనసును పులకింపచేసింది.

పాలవంచలో మా మేనమామ శరగోపాచార్యులవారి ఇంటికి వెళ్లాం. వారు చూపిన బంధుప్రేమ పాతరోజులు పట్టి తెచ్చింది. పాలవంచ సాహితీ సంస్థలు ఎంతో అభిమానంతో నాకు సన్మానాలు ఏర్పాటు చేశాయి. పాత్రికేయులు ఆత్మీయతతో ప్రత్యేక వార్తలు ప్రచురించారు.

పూర్వం టీచరుగా పనిచేసిన గోకినపల్లికి వెళ్లాం. కురువృద్ధులు సీతారామరావుగారు - కవిమిత్రులు వెంకట్రామారావుగారు మా దంపతులకు ఘనంగా సన్మానం ఏర్పాటు చేశారు. ఆ సభలో నా నవలలను చర్చించడం నాకెంతో ఉత్తేజం కలిగించింది. ఆ సభలోనే నేను - హైదరాబాదు 400 సంవత్సరాల ఉత్సవాల పేర, కిరాతక నిజామును మహాత్మునిగా మార్చే ప్రయత్నం జరుగుతున్నదని హెచ్చరించాను. పత్రికలు ఆ వార్తకు ప్రాధాన్యత ఇచ్చాయి. నా శాపం తగిలింది. ఆ ఉత్సవాలు మంట కలిశాయి!

నేలకొండపల్లిలో నాకు టీచరుగా తొలి పోస్టింగు వచ్చింది. పెండ్యాల సత్యనారాయణగారి ఇంట్లో చాలరోజులు ఉన్నాను. అక్కడికి వెళ్లాం. సత్యనారాయణగారు పెద్దవారు అయిపోయారు. వారికి, వారి శ్రీమతికి బట్టలుపెట్టి, ఫలపుష్పాలు అందించి సత్కరించాం.

నేలకొండపల్లి కంచర్ల గోపన్న - రామదాసు - జన్మస్థలం. ఆ ఊరి దగ్గరలో విరాటరాజు దిబ్బ ఉండేది. ఆ గ్రామాన్నే విరాటపురం అనేవారు. అయితే ఈ మధ్య తవ్వకాలలో ఆ దిబ్బ బౌద్ధస్థూపంగా బయటపడింది. అది చూచాం. మనం బౌద్ధాన్ని ధ్వంసం చేసిన పద్ధతుల్లో అది ఒకటి.

మా చిన్నతనంలో ఖమ్మం వరంగల్లు జిల్లాలో భాగంగా ఉండేది. 1952 అక్టోబరు ఒకటవ తేదీన ఖమ్మం జిల్లాగా అవతరించింది. అప్పటి జిల్లా పరిషత్తు అధ్యక్షులు చేకూరి కాశయ్యగారు 1989నుంచి జిల్లా అవతరణోత్సవాలు జరిపే సంప్రదాయం ఏర్పర్చారు. అనేకమంది జిల్లా ప్రముఖులతో పాటు నాకు కూడా సన్మానం చేశారు.

పులుపుల వేంకటశివయ్యగారు మంచి కమ్యూనిస్టు నేత. 'పలనాడు వెలలేని మాగాణిరా' అన్న మంచి కవి. వారు మాస్కోలో పరమపదించారు. గుంటూరులో వారి పేర ప్రతి సంవత్సరం ఒక రచయితను సన్మానిస్తారు. 1990 సంవత్సరంలో నన్ను సన్మానించారు. పరుచూరి రాజారాంగారు అధ్యక్షత వహించారు. సభ రమ్యంగా జరిగింది.

పులుపుల వేంకట శివయ్యగారు, నేను నర్సరావుపేటలో ఒకే వేదికమీద మాట్లాడాం.

గుంటూరులో నార్ల చిరంజీవి సతీమణి నాగరత్నమ్మ వదినగారిని దశాబ్దాల తరువాత – దర్శించుకునే అవకాశం లభించింది. వారి ఫోటో తీసి తెచ్చుకున్నాను.

1991 లో మా జన్మస్థలం గూడూరునుంచి గాదేపల్లి మధు అనే యువకుడు వచ్చాడు. నాకు – మా వూరు చినగూడూరులో – సన్మానం చేస్తానన్నాడు. అర్ధశతాబ్దం దాటింది. మా ఊరు చూడక, చూడాలనే ఉబలాటం కలిగింది.

సన్మానం కోసం కాదు – మావూరు చూడడానికని అంగీకరించాను. 12 జనవరినాడు సన్మానం నిశ్చయించారు, తెలియపరచారు.

జనవరి 11న కమలా నేనూ బయలుదేరాం. మానుకోలు – మహబూబాబాద్ స్టేషనులో దిగాం. మా పిల్లలకు మా వూరు చూపదలచాను. వారు మానుకోట చేరుకున్నారు. నా బాల్యమిత్రులు గార్లవారు చందా భద్రం – కొదుమూరి వెంకటేశ్వరరావుకూడా వచ్చారు.

నిర్వాహకులు జీపు తెచ్చారు. అందులో అందరం 'కురవి' చేరుకున్నాం. అష్టభుజ వీరభద్రుని దర్శించుకున్నాం. గూడూరుకు సాగాం. సికిందరాబాదులోనే కమల వీడియో గ్రాఫరును తీసికెళ్దామంది. 'చిన్న ఊరు – నలుగురు కూడ్తారు. ఒక శాలువా కప్పతారు' అన్నాను. వీడియో మానేశాం. నా కెమెరాలో కూడా పూర్తి రీలులేదు.

గూడూరు దగ్గర పడుతున్నది. బ్యాండు – నాదస్వర వాద్యాలు వినిపించాయి. పెళ్లి కావచ్చు. ఊరు చేరితే అర్థం అయింది – అది మాకు స్వాగతం పలికే వాద్యమే! ప్రజలు తండోపతండాలుగా కూడారు. మమ్ములను పూలదండలతో



చినగూడూరులో సన్మానం

ముంచెత్తారు. వాద్యాలు ముందు నడువగా పెళ్లి ఊరేగింపులా మమ్ములను తీసికెళ్లారు. ప్రతి ఇంటిముందూ జనం నిలిచి చూచారు. దేవాలయానికి – పూర్ణకుంభంతో సమంత్రకంగా – మమ్మ ఆహ్వానించారు. అర్చన – ప్రసాద వినియోగం జరిగింది.

అంతటి ప్రజా సత్కారం – చూచి మేం పొంగిపోయాం. దేవాలయంలో వెల్లడించాను. సభ కరతాళ ధ్వనులతో స్వీకరించింది.

మేము విడిసిన ఇంటికి నిరంతర జనప్రవాహం. ఆ సాయంత్రం ఊరుచూడ బయలుదేరాం. వెంటజనం, మా మాతామహుల ఇల్లు మారలేదు. కాని, వారి వారు లేరు, అమ్ముకున్నారు. ఇంట్లోకి వెళ్లి చూచాం. మా వాళ్లకు వివరించాను. మా ఇంటి జాడలేదు, కూలిపోయింది. మేము పుట్టినామన్నచోట వేపచెట్టు ఎదిగింది. అక్కడనుంచొని ఫోటోలు దిగాం.

మేము తామరల చెరువుకు వెళ్లాం. తామరులు లేవు. చెరువులో నీరులేదు. కట్టమీద మోదుగులు లేవు. కట్టకింద నాగజముళ్లు లేవు. పశువులు ఇళ్లకు తిరిగి వస్తున్నాయి. ఆ దృశ్యం ఫోటోలు తీశాం.

మా అమ్మాయిలు – అల్లుళ్లు – మనవలు మహా సరదాగా ఉన్నారు. తెల్లవారి అందరం ఆకేరుకు వెళ్లాం.

ఆ ఇసుక – ఆ ఏరు – ఆ నీరు మైకంలో పడిపోయాం. నా బాల్యాన్ని గుంజుకురావడానికి విఫలప్రయత్నం చేశాను.

రాజకీయ కారణంగా సభ 13కు వాయిదా పడింది. అదీ మంచిదే అయింది. మా ఊళ్లో ఒకరోజు ఉండగలిగాను. జన ప్రవాహం కొనసాగుతున్నది. బుచ్చమ్మగారి మనవడొచ్చిండట – ఎక్కడ? అని ఒక పండు లంబాడీ ముదుసలి 'ఝూంకీ' వచ్చింది. మా నాయనమ్మ బుచ్చమ్మగారినాటి మనిషిని చూచి నేను పులకించాను. ఆమెను కౌగలించుకున్నాను.

ఝూంకీ కన్నీరు జలజలరాలింది.

నా గుండె పులకించింది. కన్నీరు రాల్చింది.

13నాటి సాయంత్రం సభకు ఊరేగింపు ప్రారంభం అయింది. చుట్టుపట్ల ఏడూళ్లజనం – ఏడూళ్ల వాద్యాలు! ఆ రోజు దుకాణాలు – ఊద్బులు అన్నీ బంద్. జనసాగరం చినగూడూరులో అవతరించింది. ప్రతి ఇంటిముందు నిండు బిందెలు – మా కాళ్లు కడగడం – పూలదండలు – వస్త్రాలు! జనం చెట్లెక్కి ఇళ్లెక్కి చూస్తున్నారు!

ఒకచోట జనం విరుచుకుపడే దశ వచ్చింది. 'బాబూ! ప్రమాదం జరిగేట్లుంది అన్నది మా పెద్దమ్మాయి. 'ఇది ప్రేమ ప్రమాదమమ్మా! అందరికీ లభించదు' అన్నాను. ఒక దశలో నాకు సుగర్ తగ్గుతున్నది అంటే బిందెలతో పాలు తెచ్చారు! అంతటి అభిమానం నా పిడికెడుగుండె భరించలేకపోయింది.

అంత చిన్న ఊళ్లో సభాస్థలి చేరడానికి అయిదుగంటలపైన పట్టింది. రాత్రి పదింటికి జనం కిటకిటలాడుతున్నారు. ఊరేగింపుతో వచ్చిన జనం నిలిచి చూడాల్సి వచ్చింది. సభకు స్థానిక యువ కవి గోవర్ధనం పురుషోత్తమాచార్యులు అధ్యక్షత వహించారు. సురేంద్రరెడ్డి M.P రెడ్యానాయక్ MLA వేదికను అలంకరించారు.

నన్ను గ్రామస్థులు అనేకులు ఆత్మీయంగా – అభిమానంతో సన్మానించారు. నా ఉపన్యాసం రాత్రి పదకొండింటికి మొదలయింది. జనం నిశ్శబ్దంగా ఉన్నారు.

నేను గూడురుకు – రామాలయానికి – ఆకేరుకు – తుమ్మెడి చెరువుకూ – తామరకుంటకూ నమస్కరించి ఉపన్యాసం ప్రారంభిస్తే సభలో కరతాళధ్వనులు ప్రతిధ్వనించాయి.

"మీరు కురిపించిన ప్రేమాభిమానాలు – తీర్చడానికి కాదు – అనుభవించడానికి మరిన్ని జన్మలు కావాలి" అని చిల్లర దేవుళ్ల పాత్రలు వాతావరణం మన వూరుదే అని వివరించాను.

రాత్రి పన్నెండుకు మొదలయిన అధ్యక్షోపన్యాసంలో "దేవుడు ప్రత్యక్షమైన ఏం కావాలి అంటే రంగాచార్యులవారు 'మరు జన్మలో చిన్న గూడురులో పుట్టించు' అనేట్లున్నారు. జన్మభూమిని అంతగా ప్రేమించారు" అని వక్కాణించారు అధ్యక్షులు.

అంతటి అభిమానం పట్టలేకపోయాను. ఆ రాత్రి నిద్రపోలేదు. తెల్లవారి మళ్లీ ఏట్లో స్నానాలు చేసి, ఆత్మీయములయిన పలకరింపులు – వీడ్కోళ్లతో మావూరు గూడూరును – అతిభారంగా – వదిలివచ్చాం.

మిత్రులు A.B.K ప్రసాద్‌గారి ప్రోద్బలంతో చిన్నగూడురు సత్కారాన్ని గురించి ఒక వ్యాసం వ్రాశాను. అది "నా చిన్నప్పటి చందమామ – చినగూడూరు" అనే శీర్షికన 9–2–91నాటి 'ఆంధ్రభూమి'లో ప్రచురించబడింది. అది చూచి గూడూరు వారు ఎంతో సంతసించాగు



గార్లలో సన్మానం

గార్ల మావూరు అని సగర్వంగా చెప్పుకోగలం. అక్కడ మేము అనేక ఉద్యమాలు నిర్వహించాం. మంగపతిరావు నాయకత్వంలో గార్ల యువకులు 6–6–1993 ఆదివారం

నాకు సన్మానం చేశారు. అప్పుడు ఉద్యమాల్లో పనిచేసినవారు – ఇంకా మిగిలినవారు – బహుకొద్దిమంది సభలో పాల్గొనడం విశేషాతివిశేషం.

స్టేషనుకు మమ్ము ఆహ్వానించడానికి అనేకమంది వచ్చారు. మల్లెల దండలు మాకు వేశారు. స్టేషను పొంతం గుబాళించింది. సభాస్థలి – వర్తకసంఘ భవనం – రమ్యంగా అలంకరించబడింది. రమ్యమైన నాటి సాయంతన సభకు మంగపతిరావు అధ్యక్షత వహించారు. గార్ల మిత్రులు – మిత్రుల పిల్లలు ఒక్కొక్కరే మల్లెలదండలు – శాలువలు ఉత్తరీయాలతో నన్ను సన్మానించారు. మల్లెల రాశి సభాస్థలిని గుబాళింపచేసింది.

కూలిన రాతిస్తంభాన్ని స్తుతించి నేను ఉపన్యసించాను. రాతిస్తంభం – తాసిల్దారు బంగళా కూలడం ఒక వ్యవస్థ కూలడం అన్నాను. గార్ల జీవితం కమ్మరి కొలిమి. బాలసంఘంనుంచి అనేక నిప్పురవ్వలు – కణికలు – మంటలు వివరించాను.

బాల్యమిత్రులు చందా వీరభద్రం – కొదుమూరి వేంకటేశ్వరరావు – మాటేటి శ్రీనివాసరావు మాట్లాడారు. సభ ముగిసింది. కలిసి భోజనాలు – వెన్నెట్లో డాబామీద అందరం పడుకున్నాం. రాత్రి పొంతం ముచ్చట్లే! తెగవు. తెల్లవారింది.

ఇలాంటి అదృష్టం అందరికీ లభించదు!

మిత్రులు – ఆప్తులు గండి మల్లికార్జునరావుగారు డోర్నకల్లులో 20–6–1993 ఆదివారం మా దంపతులకు సన్మానం ఏర్పాటు చేశారు. సన్మానం స్వాతంత్ర్య సమరయోధుల సంఘం పక్షాన జరిగింది. సభకు హీరాలాల్ మోరియా అధ్యక్షత వహించారు. గ్రామ పంచాయితీ – వివిధ సంస్థలు – పూర్వం నా దగ్గర చదువుకున్న విద్యార్థులు కమలనూ – నన్నూ బహు గొప్పగా సన్మానించారు. నేను అక్కడి మిత్రులను గురించి – నాటి పరిస్థితులను గురించి – 'శరతల్పం' రచనకు గురువయ్య జీవిత స్ఫూర్తిని గురించి మాట్లాడాను. గండి సత్యనారాయణ – మల్లికార్జునరావు – కొలిపాక మధుసూధనరావు – పుల్లాభట్ల వెంకటేశ్వర్లు ప్రసంగించారు. అప్పుడు రావూరి వీరయ్యగారు – బాల్య మిత్రులు – నాకు బంగారు ఉంగరం బహూకరించారు.

గండి మల్లికార్జునరావుగారు – తమ ఇంట్లో – సుమారు అయిదువందల మందికి రుచికరమైన భోజనం వడ్డించి తినిపించారు.

మా అమ్మాయిలు – అల్లుళ్లు – మనవలు – మనవరాలు గార్ల, డోర్నకల్లు సభల్లో పాల్గొన్నారు.

చావా శివకోటిగారిది గోకిన పల్లి. నా దగ్గర చదువుకున్నా నంటారు. ప్రఖ్యాత రచయిత. నేనంటే ఎనలేని అభిమానం. సాహితీ హారతి పక్షాన శ్రీముఖ పుష్యపూర్ణిమ – 27–1–1994న 'చంద్రునికి నూలుపోగు' పేర – చంద్రునంతటి ఘనమూ – ఆనందమూ – ఆత్మీయము అయిన సన్మానం ఏర్పాటు చేశారు. మా ఖమ్మం పట్టణంలో! అది మకుట సన్మానం – మా ఉభయులకు చేసిన సన్మానం.

సభాస్థలి – వర్తక సంఘ భవనం – చేరుకున్నాం. మేము వేదికవరకు వెళ్లడానికి కొత్త పంచెలు పరచి గులాబీలు పేర్చరచారు. ముందు మంగళవాద్యం – తరువాత వేదపఠనం – తరువాత పూర్ణకుంభం – ఆ వెనుక మా దంపతులను పెళ్లిపిల్లలలా నడిపించి, వేదికమీద ఆసీనులను చేశారు.



ఖమ్మం సన్మాన సభా వేదిక మీద శ్రీమతి కమల, రంగాచార్య, ఎ.బి.కె. ప్రసాద్ చంద్ర

సభకు చేకూరి కాశయ్యగారు అధ్యక్షత వహించారు. మా దాశరథికి మేము సన్మానం చేస్తున్నందుకు గర్విస్తున్నాం అన్నారు.

శివకోటిగారు స్వాగతం పలికారు. మా ఉభయులకు కలిపి ఒకే గులాబీల పెద్దదండ వేశారు. సభలో కరతాళధ్వనులు ప్రతిధ్వనించాయి. తరువాత వస్త్రాలతో సత్కరించారు. చందా వీరభద్రం – కొదుమూరి వేంకటేశ్వర దంపతులు – ఇతరులు మాకు బట్టలు పెట్టి, పాదాభివందనాలు చేశారు.

అనంతరం నిండు పున్నమి చంద్రుని సమక్షంలో – మంగళవాద్యాలు – వేద ఆశీస్సుల మధ్య శివకోటి – చిరంజీవి – రమణ కలిసి నా శిరసున వెండి కిరీటం అలంకరించారు. సభలో ఎడతెరిపిలేని కరతాళ ధ్వనుల మధ్య రజత కిరీట భారంతో నేను వారిని కౌగిలించుకున్నాను. వారు మా దంపతులకు పాదాభివందనం చేశారు.

ప్రఖ్యాత కళాకారుడు – రచయిత చంద్ర నాతో వారికి ఉన్న పరిచయాన్ని వివరించాడు. నా "చిల్లరదేవుళ్లు" చలనచిత్రానికి చంద్ర ఆర్ట్‌డైరెక్టరుగా పనిచేశారు. నాటి అనుభవాలను వివరిస్తూ వరంగల్లులో తన అనుభవాలను చెప్పుకున్నారు.

జ్వాలాముఖి సుదీర్ఘ ఉపన్యాసం చేశారు. విద్వాంసునికి ఎక్కడయినా ఆదరం లభిస్తుంది. కాని రంగన్నకు స్వంత ప్రదేశంలో ఇంత ఆదరం లభించడం అపూర్వం' అన్నారు. రామాయణ, భారత భాగవతాలు – చిల్లరదేవుళ్లు – జనపదం వంటి ఉత్తమ నవలలు రచించి దాశరథి మానవునిగా పరిపూర్ణత్వం సాధించారు. వారు తెలుగు జాతికి 'పరిపూర్ణ మానవుని' నవల అందించాలని కోరారు.

ప్రసిద్ధ సంపాదకులు ఏ.బి.కే ప్రసాద్ మాట్లాడుతూ, దాశరథి తమ నవలల్లో రానున్న పరిణామాలను సహితం సూచించడం ఆశ్చర్యకరం అన్నారు. పున్నమి చంద్రుని సాక్షిగా ఉన్న ఊళ్లో ఇంతటి సన్మానం అందుకోవడం దాశరథి మంచి

మనసుకు నిదర్శనం అన్నారు. ఆంధ్ర సామాజిక జీవిత చిత్రణకు ఉపకరించే తెలుగు నవలల్లో దాశరథి నవలలది అగ్రస్థానం అని కితాబు ఇచ్చారు. "రంగాచార్య జీవితమే ఒక ఉద్యమం – వారు తమ జీవిత చరిత్ర వ్రాసి ఆంధ్రజాతికి అందించాలని సభాముఖంగా కోరుతున్నాను" అని కరతాళ ధ్వనుల మధ్య ఉపన్యాసం ముగించారు. ఆ స్ఫూర్తితోనే ఈ రచన.

నేను నా అనుభవాలు – మా వూరి ముచ్చెట్లు గంటపైగా మాట్లాడాను. సభాసదులు – పున్నమి చంద్రుడు ఇంకా వింటామన్నా ముగించాను.

చిరంజీవి కృతజ్ఞతలు సమర్పించడంతో సభ ముగిసింది.

మా పిల్లలు ఉదయ – మోహన్ – ఉజ్వల్, సుధ – సురోత్తం – సహజ – సమీర్ సభలో పాల్గొన్నారు.

రవి స్వీట్సు శ్రీనివాస్ అందరికి ఆత్మకింపయిన భోజనం ఏర్పాటు చేశారు.

నా అదృష్టం ఏమంటే – మా ఊళ్లల్లో – మావాళ్లే ఎంతో ఆత్మీయంగా అభిమానించారు, ఆదరించారు. మా పూర్వుల భద్రాచలంలోనూ, మా జన్మభూమి చినగూడూరులోనూ – బాల్యం గడిచిన ఖమ్మంలోనూ – ఉద్యమాలు నడిపిన గార్లలోనూ ప్రజలు నన్ను అపూర్వంగా ఆదరించారు. సగంపైగా జీవితం గడిపిన జంటనగరాల్లో అనేక సత్కారాలు జరిగాయి. అయితే, ఈ మధ్య జరిగిన గోపీచంద్ సత్కారాన్ని మాత్రం వివరిస్తాను.

త్రిపురనేని గోపీచంద్ మహా మానవుడు. మహత్తమ రచయిత. యువకళా వాహినివారు గోపీచంద్ పేర ప్రతి సంవత్సరం ఒక రచయితకు అవార్డు ఇస్తారు. 1993 గోపీచంద్ అవార్డు నాకు ప్రదానం చేశారు.



రచయితకు గోపిచంద్ అవార్డు

బహుమతి ప్రదానోత్సవం 8–9–93 బుధవారం సాయంత్రం రవీంద్రభారతిలో జరిగింది. సభకు జె. బాపురెడ్డిగారు అధ్యక్షత వహించారు. సోదరి వాసిరెడ్డి సీతాదేవి ప్రారంభోపన్యాసం చేశారు. వాస్తుశిల్పి బి. ఎన్. రెడ్డిగారు నాకు సన్మానం చేశారు. డాక్టర్ పి. వి. రంగారావుగారు ముఖ్య అతిథిగా విచ్చేసి, నాకు అవార్డు అందించారు.

నేను తగురీతిని మాట్లాడాను. సంస్థ అధ్యక్షులు వై. కె. నాగేశ్వరరావుగారి కృతజ్ఞతలతో సభ ముగిసింది.

నేను గత అర్థశతాబ్దంగా సాహిత్యంలో కృషి చేస్తున్నాను. ఇప్పటికి ఎనిమిదివేల పేజీల పైగా ముప్ఫయి పుస్తకాలు ప్రచురణ జరిగింది. కాని, ప్రభుత్వంనుంచి ఇసుమంత సాయంకాని – ఆదరణకాని లభించలేదు. అందుకు నేను అవగింజంత బాధపడడం లేదు. ప్రభుత్వం ప్రతిభను కాక పైరవీని మాత్రమే గుర్తిస్తుందని చెప్పడం నా ఉద్దేశం.

జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తితేషాం యశః కాయే జరామరణజం భయం. భర్తృహరి

కవులు పుణ్యపురుషులు. వారు మంచి రచనలు చేస్తారు. వారు రసములను పండించగలరు. బంగారం చేసే రససిద్ధి వారికి ఉంది. కవుల కీర్తికాయానికి జరామరణ భయం లేనేలేదు.

## ముప్ఫయి తొమ్మిది

### భారతామృతం:

*ఇతిహాస ప్రదీపేన మోహావరణ ఘాతినా*
*లోకగర్భ గృహం కృత్స్నం యథావత్ సంప్రకాశితమ్.*

మహాభారత ఇతిహాసము జ్వాజ్జ్వల్యమానమై ప్రకాశించు దీపము. ఇది మోహాంధ కారమును దూరము చేయును. అంతఃకరణములను పునీతము చేయును. జ్ఞాన జ్యోతిని వెలిగించును.

భారతీయులంగా మనం భాగ్యవంతులం. మనకు అనంత చరిత్ర ఉన్నది. గొప్ప సంస్కృతి ఉన్నది. అంతం ఎరుగని సంప్రదాయం ఉన్నది. హిమాలయం ఉన్నది. వింధ్య ఉన్నది. గంగ ఉన్నది. యమున ఉన్నది. గోదావరి ఉన్నది. కృష్ణ ఉన్నది. కావేరి ఉన్నది.

అన్నింటినిమించి తరగని సాహితీభాండాగారం ఉన్నది. మనకు వేదములు – ఉపనిషత్తులు – బ్రాహ్మణములు – ఆరణ్యకములు – పురాణములు – కావ్యములు కొల్లలుగా ఉన్నవి. వీటి అన్నింటిని కాచివడపోసిన రామాయణ భారత భాగవతాలున్నవి. ఇంతకుమించిన సంపద లోకంలో ఏ దేశాని కుందండీ? లేదు, లేదు, లేదు. మనమే సంపన్నులం! క్షీయంతేఖలు భూషణాని సకలం వాగ్భూషణం భూషణం – అలంకారాలు అన్నీ నశిస్తాయి! నశించనిది విద్యాభూషణం మాత్రమే!!

మహా భారతం మనకున్న మహా. సంపద. అది మనలో ఆనందం కలిగిస్తుంది. ఆహ్లాదం నింపుతుంది. ఆత్మోన్నతిని కలిగిస్తుంది. మనసును పులకింపజేస్తుంది. కన్నుల నీరు నింపుతుంది. మహా జ్యోతిని ముందు నిలుపుతుంది. మననుపెంచుతుంది. పరవశింపచేస్తుంది.

మనసు మానవులను చేస్తుంది
మహోన్నతికి తీసుకుపోతుంది
పరమపదం చేతికి అందిస్తుంది.

వ్యాసభగవానుడు మహాభారతం రచించాడు. మానవజాతికి మహోపకారం చేశాడు. ఏమిచేసినా అతని రుణం తీరదు. అతడు మనకు అక్షయపాత్ర అందించాడు. మీరు ఇవ్వదలచుకున్నంత ఇవ్వండి. ఇంకా ఉంటుంది. అలాంటి వ్యాసభగవానునికి మనం ఏమీ ఇవ్వలేం. అందుకే నమస్కరింతాం.

వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తేః పౌత్రమ కల్మషం
పారాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిం.

భగవంతుడు నాకు రామాయణ, భాగవతాలు రచించే భాగ్యం కలిగించాడు. మిత్రులు పబ్బా శంకరయ్యగారు వాటిని ప్రచురించారు. వస్తు ప్రాధాన్యత – శైలీ సౌలభ్యం వల్ల అవి జనాదరణ పొందాయి. నాతో భారతం వ్రాయించవలసిందని అనేక మంది పాఠకులు కోరారు.

పబ్బా శంకరయ్యగారు నన్ను భారతం రచించమన్నారు. ఒక పుష్కరం మా ఇంటికి తిరిగారు, అర్థించారు. నేను పూనుకొనలేకపోయాను. ఒకనాడు శంకరయ్యగారు కోపంగా వచ్చారు. "రంగాచార్లూ! నేను బతికి ఉండగా భారతం వ్రాసిస్తావా లేదా?" అన్నారు.

"డొంక తిరుగుడు ఎందుకు శంకరయ్యా! నేను బతికుండగా భారతం వ్రాస్తావా? అని కదా నువ్వడిగేది? భగవంతుడు సంకల్పం కలిగించడం లేదు. ఏం చేయమంటావు?" అన్నాను.

"నీకు ఇష్టంలేదు. మధ్యన దేవుడెందుకు?" అని కోపంగా లేచి వెళ్లిపోయారు. అంతా ఉట్టిదే, బెదిరింపు. శంకరయ్య నాకు మిత్రులు. అనేకసార్లు మళ్లీ వచ్చారు!

కారణం తెలియదు. భారత రచన సాగలేదు.

1963 లో చందా రాజేశ్వరరావుగారు భారతం వ్రాయమన్నారు. గ్రంధాలు సమకూర్చారు. వ్రాయలేకపోయాను.

1981 లో సూర్యాపేట కాలేజీవారు నన్ను సన్మానించారు. ఆంధ్ర మహాభారతం బహూకరించారు. 'మీ శైలిలో మాకు భారతం కావాలి' అని సభాముఖంగా కోరారు. వాగ్దానం చేయలేదు. 13–3–1982న మహాభారత రచన ప్రారంభించాను. 1983లో ఆపదలు విరుచుకుపడ్డాయి. మగపిల్లలు వెళ్లిపోయారు. మా అత్తా మామలు పరమపదించారు. కమలకు ప్రాణాపాయకరమైన జబ్బు చేసింది. భగవదనుగ్రహం వల్ల బయటపడింది.

మహా భారతాన్ని గురించి మన దేశంలో ఒక అపప్రధ ఉంది. మహా భారతం పూర్తిగా చదవడంగాని – వ్రాయడంగాని అసాధ్యమే కాదు – అపాయకరం అంటారు.

అందువల్ల అప్పటికి ముగించిన విరాటపర్వంవద్ద నిలిపిచేశాను. మళ్లీ దాన్ని ముట్టలేదు. అనంతరం మా అన్నయ్య, మా విజయ్ ఒకరి తరువాత ఒకరు గతించారు. విరించి మమ్ము అంటక ముట్టక దూరంగా ఉన్నాడు.

1992 లో మనశ్శాంతికోసం కమలా – నేనూ కన్యాకుమారి వెళ్లాం. వివేకానంద ఆశ్రమంలో డిసంబరు 9 నుండి 17 వరకూ ఉన్నాం. అప్పుడు శ్రీమద్రామాయణం మరొకసారి అధ్యయనం చేశాను.

కన్యాకుమారిలో ఉండగా ఒకనాటి రాత్రి 'భారత రచన పూర్తిచేయాలి' అనే ధ్వని మరల మరల నా మనసులో సుడులు తిరిగింది. అమ్మవారు ఆదేశిస్తున్నారా? వివేకానందులు ప్రేరేపిస్తున్నారా? ఏమో! అది ఒక థ్రిల్! ఒక ఆవేశం! ఒక పూనకం!!!

ఇంటికి చేరుకున్నాం. ఆ ధ్వని వెన్నాడుతున్నది. విడువడం లేదు. ఈ జీవితం కర్మమీద ఆధారపడి ఉన్నది. కష్ట నష్టాలకు బాధ్యత కర్మది. అందుకు భారతాన్ని దోషిని చేయడం నా అజ్ఞానం అనుకున్నాను. జ్ఞాన జ్యోత్స్నలో 31–12–92 నుండి భీష్మపర్వంనుంచి భారత రచన ప్రారంభించాను. నిరంతరం రచన సాగించాను. రాత్రింబవళ్లు రచించాను. మళ్లీ ఆగరాదు. భారత రచన పూర్తి చేయాలి. అనారోగ్యాన్ని లెక్కచేయలేదు. రచన, రచన, రచన – అంతే. లోకం ఉన్నదని మరచాను. శ్రీముఖ వైశాఖ శుక్ల ఏకాదశి 31–5–1993 సోమవారంనాడు. భారత రచన పూర్తి చేశాను.

పబ్బా శ్రీనివాసప్రభు. పబ్బా శంకరయ్య కొడుకు. నన్ను శ్రీముఖ ఉగాది ఉత్సవానికి అధ్యక్షత వహించవలసిందని ఆహ్వానించడానికి వచ్చాడు. అప్పుడు నేను భారత రచనలో ఉన్నాను. నన్ను శంకరయ్య అడగడం – భారతరచన మున్నగునవి వివరించాను. మహాభారత ప్రచురణ విషయం ఆలోచిస్తామన్నారు.

29–5–1993 నాటి ఉదయం శ్రీకృష్ణ నిర్యాణం వ్రాశాను. అంతటి పరాత్పరునకు ఎలాంటి మరణం! మనసు వికలం అయింది. కనులు చెమర్చాయి. ఆ యోగీశ్వరుని నిర్యాణ సందర్భంగా ఒక బ్రాహ్మణునికి భోజనం పెట్టాలనిపించింది. అలా అనుకుంటుండగానే ద్వాదశ ఊర్ధ్వపుండ్రాలు ధరించిన ఒక వైష్ణవుడు ద్వారంలో కనిపించాడు. "సాపాటుకు వచ్చాను" అన్నాడు! అప్పటి నా సంభ్రమ – ఆశ్చర్యాలు వర్ణించడం అసాధ్యం! అంతే!! అంతకన్న చెప్పలేను.

ఆ స్వామికి సాపాటు ఉంచాం. వస్త్రము – దక్షిణ సమర్పించాను. వారికి పాదాభివందనం చేసి పరమానందభరితుణ్ణి అయినాను.

25–6–1993 న శ్రీ మహాభారత ఆరాధన సమారాధన ఏర్పాటు చేశాను. ఆ ఉత్సవానికి అనేకమంది బంధుమిత్రులు విచ్చేశారు. ఆనాడే 1473 పేజీలు – అయిదు వాల్యూముల శ్రీ మహాభారతం వ్రాతప్రతి శ్రీరామా పబ్లిషర్స్ శ్రీనివాస సోదరులకు అందించాను. వారు ప్రచురిస్తామన్నారు.

ఒక సందర్భంగా మిత్రులు ఎ.బి.కె ప్రసాద్‌గారు మాట్లాడుతూ, హరివంశం చేరిందే మహాభారతం అన్నారు. అధ్యయనం చేయగా "ఖిలేషు హరివంశం చ సంఖ్యాతాని మహర్షిణా" అని కనిపించింది. హరివంశాన్ని ఖిలపర్వం అన్నాడు వ్యాసుడు. భారత కథ సాంతం నిర్వహించిన శ్రీకృష్ణపరమాత్ముని కథ ఉండడం అవసరం

అనిపించింది. 24-12-93న ప్రారంభించి హరివంశ రచన 3-2-94న పూర్తిచేశాను. భారతంలో చేర్చాను. 1985-86 సంవత్సరాల్లో ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికకు వరుసగా 58 వారాలు - ఎన్నుకున్న భారత పద్యాల వివరణ - భారత సూక్తం - వ్రాశాను. గ్రంథం చివర వాటిని భారత సూక్తంగా చేర్చాను.

శ్రీమద్రామాయణ, శ్రీమహాభారత, శ్రీమద్భాగవతముల వంటి మహాగ్రంథాలను రచించే అవకాశం నాకు భగవానుడు కలిగించాడు. నేను గతజన్మలో యోగభ్రష్టుని కాకుంటే ఇంతటి మహత్కార్యం అసాధ్యం! ఇంతటి సుదీర్ఘ ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఒక్కరే ఆ మూడు గ్రంథాలు రచించినవారు అరుదు.

రెండువేలపై పేజీలుగల శ్రీ మహాభారతపు మూడు సంపుటాలు శ్రీభవ ఉగాది 11-4-94నాటికి అచ్చయి సిద్ధం అయినాయి. ఆనాడు శ్రీరామా పబ్లిషర్స్‌వారు సికిందరాబాదు మహబూబ్ కాలేజి ఆవరణలో అవిష్కరణ సభ ఏర్పాటు చేశారు.

రమ్య సాయంత్రాన శోభాయమానంగా అలంకరించిన సభకు శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులవారు అధ్యక్షత వహించారు.

నేను శ్రీమహాభారత గ్రంథాన్ని బదరిలో వేంచేసి ఉన్న నారాయణస్వామికి భక్తిపూర్వకంగా అంకితం సమర్పించాను.

రామకృష్ణమఠం స్వామి పరమార్థానంద గ్రంథాన్ని అవిష్కరించారు. చక్కని శైలిలో భారత ఆత్మయైన మూడు గ్రంథాలను రచించినందుకు రచయితను బహుధా ప్రశంసించారు. ప్రచురణకర్తలను అభినందించారు.

శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు గ్రంథపరిచయం చేస్తూ రచయిత వివరించిన "ఆలోచనామృతం" ఎంతో ఆసక్తికరంగా, ఉపయోగకరంగా ఉందన్నారు.

ప్రచురణకర్తల పక్షాన శ్రీ పబ్బా శివరామయ్య కృతజ్ఞతలతో శ్రీమహాభారత ఆవిష్కరణ సభ ముగిసింది.

## నలభై: వేదనాదం

వేదంలోనే సకలమూ - సమస్తమూ - సర్వమూ ఉందనే సనాతనులున్నారు.

వేదంలో ఏమీలేదు. అదంతా అవాస్తవం - మిథ్య - దోపిడీ అనే ప్రగతి వాదులూ ఉన్నారు.

ఈ ఉభయుల్లో ఎవరూ వేదం చదివి ఈ నిర్ణయానికి రాలేదని నా అభిప్రాయం.

ఒకరు కేవలం విశ్వాసంమీద ఆ అభిప్రాయం ఏర్పరచుకున్నారు. మరొకరు భారతదేశంలో చెప్పుకోదగింది ఏదీలేదనే సిద్ధాంతం మీద, పాశ్చాత్యులు రచించిన గ్రంథాల ఆధారంగా - తిరుగులేని అభిప్రాయాలు ఏర్పరచుకున్నారు.

ఇరవయ్యో శతాబ్దపు నాలుగు, అయిదు దశకాల్లో సమాజవాద సాహిత్య ప్రభావంతో నేనూ ప్రగతివాద భావాలనే నిశ్చయంగా నమ్మాను. 'మంచి గతమున

కొంచెమేనోయ్' అనుకున్నాను. "గతానికీ మతానికీ కళ్లు లేవు. మనిషికీ మనసుకూ కళ్లు లేవు" అన్నాను. వేదమూ, పురాణాదులూ బ్రాహ్మణులు, ప్రభువులను, వారి దోపిడీని బలపరచడానికి సృష్టించిన అభూత కల్పనలు అనుకున్నాను.

'సత్యం' మానవునికి అందేదికాదు. వాస్తవంకూడ తెలియడం దుస్తరం. వాస్తవం ఉపనిషత్తులందలి 'బ్రహ్మము' వంటిది. దానికి విద్వాంసులు ఏ రూపాన్నిస్తే సామాన్యులు ఆ రూపాన్నే చూడగలరు.

భారత చరిత్రలో బ్రాహ్మణులు – మేధావులు – ఏనాడూ ప్రభువుల దోపిడీకి సహకరించలేదు. ప్రభువుల దుశ్చర్యలను ఖండించడానికీ, వారిని సక్రమ మార్గాన నడిపించడానికీ తమ శక్తియుక్తులను ప్రయోగించారు – ఉపయోగించారు.

అందుకు స్వస్తి ప్రజాభ్యః – ప్రజలకు శుభం కలగాలి. 'పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీ మహీశాః' – పాలకులు ఈ భూమిని న్యాయ మార్గాన పరిపాలింతురుగాత! అనే నినాదం నిదర్శనం. విపులంగా చర్చించడానికి ఇది సందర్భంకాదు.

మధ్యయుగాల్లో యూరోపులోని క్రైస్తవ మతాచార్యులు ప్రభువుల దోపిడీకి సహకరించడానికి అనేక దుశ్చర్యలకు పాల్పడ్డారు. చనిపోయిన వారికి స్వర్గం కలిగించడానికీ వారసుల దగ్గర డబ్బు వసూలు చేసి స్వర్గానికి చీట్లు వ్రాసిచ్చారు. వారి దురంతాలకు వ్యతిరేకంగా ఒక మహోద్యమం వచ్చి, మతాన్ని ప్రభుత్వంనుండి విడగొట్టడం జరిగింది.

భారత సాహిత్య, సంస్కృతులను అధ్యయనం చేసిన పాశ్చాత్య విద్వాంసులు తమ చరిత్ర, నాగరకతలను దృష్టిలో ఉంచుకొని మన వాటిని వాఖ్యానించారు. ఆంగ్లేయులు మనను రాజకీయ బానిసలను మాత్రం కాదు – సాంస్కృతిక బానిసలను చేశారు. మనం వదిలించుకున్నది రాజకీయ బానిసత్వాన్ని మాత్రమే!

భారతదేశంలో మతం – ప్రభుత ఎన్నడూ కలసిలేవు. ఈ 'మతం' అనే పదం కూడా పడమటి దిగుమతియే! మనది ధర్మం. 'ధర్మం' 'ప్రభుత' రెండు ప్రత్యేక వ్యవస్థలుగా వర్ధిల్లాయి. విశ్వామిత్రుని వృత్తాంతం ఇందుకు నిదర్శనం. అతడు ప్రభుత్వాన్ని వదిలి ధర్మాన్ని వరించాడు. అలాంటి రాజర్షులు అనేకులు ఉన్నారు.

అనంత భారత చరిత్రలో 'ప్రవక్త'లను హింసించిన, ఉరితీసిన, శిలువలకు ఎక్కించిన ఉదంతాలు మచ్చుకైనా లేవు. క్రైస్తవం సుమారు బౌద్ధానికి అనుకరణమే! వేదాలను నిరసించినా – బుద్ధ భగవానుని, మహావీర వర్ధమానుని సకల భారతజాతి గౌరవించింది. వారి ముందు మోకరిల్లింది. ప్రభుత్వాలు వారికి దాసోహం అన్నాయి. **భారతజాతిది తాత్త్విక చరిత్ర – రాజకీయ చరిత్ర కాదు.**

జాబాలి, చార్వాకులు నాస్తికులు, హేతువాదులు. అయినా, భారతజాతి వారిని శిక్షించలేదు. వారి ఆలోచనా విధానాన్ని సహితం తుడిచిపెట్టలేదు. తనలో ఇముడ్చుకుంది!

క్రీస్తు, మహమ్మదు ప్రవక్తలకు ముందు చరిత్ర లేదా? ఉంటే – ఆ చరిత్రను ఆయా మతాల రంగు పులిమి అధ్యయనం చేయడం వాస్తవమగునా? సత్యమగునా? ఇది సంకుచితం కాదా?

ఒక విచిత్రం ఏమంటే – క్రీస్తు అవతరించి ప్రభవించిన ప్రాంతంలో మహమ్మదు ప్రవక్త ఆవిర్భవించేనాటికి క్రైస్తవ ప్రభావం లేదు. ఇస్లాం దావానలంలా ఆసియా, ఆఫ్రికాఖండాల్ను వ్యాపించేదాకా క్రైస్తవం జాడ కనిపించదు. నేటికీ ఈ రెండు ఖండాల్లో – క్రైస్తవపు జాడ నామమాత్రమే!

నాకు మతద్వేషమే కాదు – ఏ ద్వేషమూ లేదనే విషయం 'జీవనయానం' పాఠకులు గ్రహించి ఉంటారు. నేను నిత్యాన్వేషిని. నా అన్వేషణ ఈ జన్మతో మాత్రమే మొదలైంది కాదు. ఈ జన్మలో నిలిచిపోదు. నేను ద్వేషాన్ని ద్వేషిస్తాను. ప్రేమను ప్రేమిస్తాను.

"ఇష్క్ కోయీకిసీకె మర్నే సె మర్ జాతానహీ
రూహ్‌మెం ఘమ్‌బస్కె రహజాతాహై జాతానహీ"

(వలపు ఏ ఒక్కని చావుతోనో చచ్చేది కాదు.
మనసులో వలపు గూడు కట్టుకుంటుంది పోదు.)
నా అన్వేషణమూ ఒక వలపే.

భారతదేశపు ఉదార తాత్త్వికతను పాశ్చాత్యుల సంకుచిత దృష్టితో పరిశీలిస్తే అర్థం కాదు అనే విషయం సమాజవాదపు కోట ద్వారాలు తెరుచుకొని బయటపడ్డాక అర్థం అయింది.

అప్పుడు నాకు హిమవదున్నత భారత తాత్త్విక చింతన దర్శనం ఇచ్చింది. గంగవలె నిరంతరం నిర్మలంగా ప్రవహిస్తున్న భారత సంప్రదాయం దర్శనం ఇచ్చింది. గగనతలం కన్న విశాలమైన సాహిత్యం దర్శనం ఇచ్చింది. సముద్రంకన్న లోతైన భారత ఆలోచనా విధానం దర్శనం ఇచ్చింది.

ఇది మహా విశ్వదర్శనం. ఇది అనంత దర్శనం. ఇది అనాది దర్శనం. ఇది నన్ను చకితుణ్ణి చేసింది. సంభ్రమాశ్చర్యాల్లో ముంచింది. ఉక్కిరి బిక్కిరి చేసింది. సచేతనుణ్ణి చేసింది.

ఆ ప్రభావంతో – ఆ స్ఫూర్తితో – ఆ జ్ఞానంతో – ఆ చైతన్యంతో వాల్మీకి రామాయణం (1963), వ్యాస భాగవతం (1968), వ్యాస మహాభారతం (1994) సరళ తెలుగు వచనంలో సవ్యాఖ్యానంగా ప్రచురించాను. నన్నయకు ముందునుంచి నేటివరకు ఈ మూడు గ్రంథాలను ఒకే రచయిత రచించిన నిదర్శనాలు అరుదు. ఇది భగవానుడు ప్రసాదించిన శక్తి – కేవలం భగవదనుగ్రహం. కాకున్న నాలాంటి సామాన్యునికి ఇది దుస్సాధ్యం – అసాధ్యం. పూర్వజన్మ సంస్కారం అయినా కావచ్చు.

హరివంశ సహిత శ్రీమహాభారత రచన, ప్రచురణ తరువాత భగవానుడు వేదాలను అనువదించే సంకల్పం కలిగించాడు. భగవానుడే సంకల్పం కలిగించాడని ఎందుకంటున్నానంటే – వేయేళ్ల ఆంధ్ర సాహిత్య చరిత్రలో ఈ సంకల్పం కలిగిన జాడ అరుదుగానైనా కనిపించదు. నేను సామాన్యునికి అర్థం అయ్యే సరళ ఆంధ్రవచనానువాదం సంకల్పించాను.

నన్నయ భట్టారకుడు శ్రీమహాభారత ఆంధ్రానువాదాన్ని స్వచ్ఛందంగా చేపట్ట లేదు. సంస్కృతంనుంచి అనువదించడానికి వెనుకాడాడు. ఒక రాజకీయ ప్రయోజనంకోసం

రాజు అర్థించగా చేశాడు. తిక్కనామాత్యుడు ఆంధ్రమహాభారత రచన సాగిస్తూ, భగవద్గీతను అనువదించడానికి జంకాడు. కేవలం 42 గద్యపద్యాల్లో ముగించా ననిపించాడు.

అలాంటప్పుడు అనేక విధి నిషేధాలున్న వేదాలను సామాన్య పాఠకులకు అర్థం అయ్యేలా తెలుగులో అనువదించ సంకల్పించడం ఎంత సాహసమో గ్రహించాలి. అందుకే ఇది కేవలం భగవంతుడు కలిగించిన సంకల్పం అని విన్నవించాను.

అసలు సవ్యాఖ్యానంగా నాలుగు వేదాల్ను సంపాదించడం గగనం అయింది. తెలుగులో లేవు. దేవనాగరి సంస్కృతంలో అన్ని వేదాలనూ ఒకే ప్రచురణ సంస్థ ప్రచురించలేదు. గ్రంథాలు సాధించడమే ఒక యజ్ఞం అయింది. ఆ మహాయజ్ఞ విషయం శ్రీమదాంధ్ర వచన ఋగ్వేదసంహిత పీఠికలో వివరించాను.

యజ్ఞయాగాది క్రతువుల జోలికి పోలేక కేవలం భగవదారాధన చేసి, భవ పుష్య పౌర్ణమి 16-1-95న ఋగ్వేద సంహిత ఆంధ్రవచనానువాదం ప్రారంభించాను. నిద్రాహారాలు పట్టించుకోక నిరంతరం రోజుకి పది, పన్నెండు గంటలు శ్రమించి కృష్ణ యజుర్వేద సహితంగా నాలుగు వేదాల ఆంధ్ర వచనానువాదం ఈశ్వర పుష్య శుక్ల ఏకాదశి 24-1-98 ఉదయం 9.15కు ముగించినప్పటి మహానందం అనుభవించాల్సిందే! అక్షరానికి అందదు. ఆనాడు సకుటుంబ బాంధవంగా జీడికంటి రామచంద్రస్వామిని దర్శించుకొని, మరుసటిరోజు యాదగిరి లక్ష్మీనరసింహస్వామి వారి కళ్యాణం చేయించాం. చేయించడానికి మనం ఎంతటి వారలం? ఆ స్వామియే చేయించుకున్నాడు.

ఇంత తొందరేల? అంటే, నేను 70 ఏళ్లవాణ్ణి. జీవితపు చరమాంకంలో ఉన్నాను. వేదాలను అనువదించి, ఆంధ్రులకు అందించకుండా వెళిపోతానేమోనని భయం! "క్షుద్రం హృదయం దౌర్బల్యం" అన్నాడు కృష్ణపరమాత్మ. భగవంతుడే నీతో పూర్తి చేయించదలచినాక భయమేల? అంటే, అజ్ఞానం! నేను మానవమాత్రుణ్ణే!!

ఈ మహదనువాద కార్య మహాయజ్ఞంలో ఏ ఒక్కరూ నాకు సాయపడ్డవారు లేరు. వారించిన, ఆటంకపరచిన, దుష్పరిణామాలు చూపి భయపెట్టిన మహానుభావులున్నారు. కనీసం పుస్తకం వెదికి అందించినవారు లేరు. వ్యాస భగవానునికి గణపతి వ్రాయసకాడయినాడు. నాకు వ్రాయసగాడూ లేడు. ఈ వయసులో, అంతం మాత్రపు ఆరోగ్యంలో అయిదువేల పేజీలు వ్రాశాను! ఇది సామాన్యం కాదు!! ఇదీ ఈశ్వరుడు ప్రసాదించిన శక్తియే!!!

ఒకే వ్యక్తి ఆధునిక సాహిత్యపు నవలలు మున్నగునవి వ్రాసి; రామాయణ, భారత, భాగవతాలూ నాలుగు వేదాలూ అనువదించిన నిదర్శనాలు భారత సాహిత్య చరిత్రలోనే కొదువ! యావద్భారతంలోనూ ఒక్కడే నాలుగు వేదాలు అనువదించడం అరుదాతి అరుదు. ఇది వాస్తవాలు తెలియపరచడానికే! నాకు గర్వం లేదు. ఏలనన —

*పలికెడిది భాగవతమట*
*పలికించు విభుండు రామభద్రుండట నే*
*బలికిన భవహరమగునట*
*పలికెద వేరొండుగాథ బలుకగనేలా!*

నాది పోతన మార్గం. నన్ను నేను కర్మయోగిని అనుకుంటాను. నాది శ్రీనాథుని దారికాదు. కావుననే భగవదనుగ్రహం తప్ప అన్యం అంతగా ఆర్జించినవాణ్ణి కాదు. అయినా గ్రాస వాసో దైన్యం జాడలేదు.

## అనువాద యజ్ఞం:

అనువాదం కష్టం. వాదం సులభం, అనువాదం దుస్తరం. అందునా వేదానువాదం అసాధ్యం కాకున్నా దుస్సాధ్యం. 'సంస్కృతం' సొంతం ఒకే భాషకాదు. కావ్య, వైద్య, జ్యోతిష, పురాణాది సంస్కృతాలు వేరు వేరు. ఎవరికి వారికి వారి శాఖా సంస్కృతమే తెలుస్తుంది. సమస్త సంస్కృతం తెలిసినవా డుండడు.

నాకు కావ్య సంస్కృతం తెలుసు. ఆ పరిజ్ఞానం కరదీపిక అవుతుంది కాని పదార్థం కాదు. కాబట్టి వేద సంస్కృతం అర్థం చేసికోవడానికి అహరహం కృషి చేశాను. అయినా అది నాకు పరిపూర్ణంగా ద్యోతకం అయింది అనజాలను. సాయణాచార్య, మహీధర, ఉవటాచార్యుల వ్యాఖ్యానాల, అన్య అనువాదాల ఆధారంగా అనువదించాను.

'వేదం' సామాన్యం కాదు. పౌరుషేయం కాదు. అపౌరుషేయం. వేద మంత్రపు లోతు తెలియడం అసాధ్యం. అనువాద యజ్ఞం వంటరిగా చేస్తున్నపుడు ఒక్కొకసారి ఏడ్చాను. ఇంత మహత్కార్యానికి ఎందుకు పూనుకున్నట్లు? ఆ మేరు పర్వతాన్ని ఈ సామాన్యుడు మోయగలడా? అలాంటి దిగజారుడు, మానసిక బలహీనత, హృదయ దౌర్బల్యంలో ఒక తేజోకిరణం దర్శనం ఇస్తుంది. 'ఆగకు, సాగు' అన్నట్లు బోధిస్తుంది. కన్నీరు తుడుస్తుంది. ముందు నడుస్తుంది. నన్ను నడిపిస్తుంది!

నేను ప్రతి మంత్రాన్నీ అర్థం చేసికోవాలి. అనుమానాలను నివృత్తి చేసికోవాలి. మంత్రం తన పరిపూర్ణజ్యోతితో నాకు దర్శనం ఇవ్వాలి.

నాకు అర్థం కానిది నేను చెప్పలేను. అర్థం అయిన దాన్ని అనువదించాలి. తేటతెనుగులో అందరికీ అర్థం అయ్యే సరళభాషలో చెప్పాలి.

అందుకు నేనొక తపస్సు చేశాను. రోజుకు పది, పన్నెండు గంటలు శ్రమించాను. ఇరవై నాలుగ్గంటలు - నిద్రలో సహితం - మంత్రాల మననం. అర్థం వెదకడానికి పలవరింపులూ సహజమైపోయాయి! ఈ స్థితిని ఎవరు సహిస్తారు? కమల సహించింది!

వేదం ముందుంచుకొని కూర్చుంటాను. భయం - ముందు మహారణ్యం కనిపిస్తుంది. సింహాలు, పులులు, సర్పాలూ, మహా మృగాలు కనిపిస్తాయి. అందులో అడుగుపెట్టలేం అనిపిస్తుంది. కాగితంమీద కలం పెడ్తాను. మహారణ్యం రమ్య ఉద్యానం అవుతుంది. సింహాలు, పులులు, సర్పాలూ, మహామృగాలు - లేళ్లు కుందేళ్లు, నెమళ్లు, రంగురంగుల పక్షులు అవుతాయి. రాచబాటలు, పూపొదరిండ్లు, వృక్షచ్ఛాయలు, తామరల కొలనులు అవుతాయి. రచన అనాయాసంగా సాగిపోతుంది. ఏదో మహత్తమ శక్తి నాతో వ్రాయిస్తున్నట్లనిపిస్తుంది! వ్రాస్తున్నంతసేపు ఏదో చల్లని వెలుగు నన్ను నడిపిస్తుంది! కలం సాగుతుంది! మనసు పొంగుతుంది! ఉప్పొంగుతుంది! మహదానందం! 'ఆనందో బ్రహ్మ!'

ఎన్ని విచిత్ర, వింత, విశిష్ట సంఘటనలు! ఒక్కొక్కసారి వాక్యం ప్రారంభిస్తాను.

ముందుకు సాగదు. అయోమయం! లిప్తలో కలం వెంట వెలుగు పాయ! వాక్యం పూర్తవుతుంది! అది నాకే ముద్దొచ్చేంత ముద్దుగా ఉంటుంది.

శ్రీమదాంధ్ర మహాభాగవతంలోని 'సిరికింజెప్పడు' పద్యం సాక్షాత్తు శ్రీరామచంద్ర మూర్తియే పూరించా డంటారు. అలాంటి ప్రత్యక్ష అనుభవాలు నాకు కొల్లలు. స్వామి దర్శనం ఇచ్చాడని అబద్ధం చెప్పలేను. కాని, ఆ స్వామియే వ్రాయించిన అద్భుత, ఆశ్చర్యకర, అనిర్వచనీయ అనుభూతులు అనేకానేకం! అవి అక్షరాల్లో పట్టవు.

పిల్లలమర్రి పినవీరభద్రునివలె 'వాణి నా రాణి' అనే సాహసం చేయజాలను. కాని, పోతనవలె సరస్వతిని 'మదంబ' – మా అమ్మ అని సగర్వంగా చాటగలను.

నేను ఈ వేదానువాదానికి కర్తను కాను – ద్రష్టను మాత్రమే అనిపిస్తుంది. అనిపించడం ఏమిటి? అదే సత్యం, అదే నిజం, అదే వాస్తవం!

ఒక్కొక్కసారి మంత్రం నన్ను ముప్పతిప్పలు పెడ్తుంది. సాయణుని వ్యాఖ్య, అనువాదాలు కరదీపికలు కాలేవు. సతమతం అవుతాను. కొండ నెత్తిన కూలినట్లవుతుంది. ఇహ అనువాదం సాగదు అనిపిస్తుంది. గుబులు పుడుతుంది. అలాంటపుడు నిశ్శబ్దంగా ధ్యానంలోనికి సాగిపోతాను. పరిసరాల ధ్యాస ఉండదు.

అప్పుడు ఒక కాంతి బిందువు కనిపిస్తుంది! అది కాంతి బింబం అవుతుంది! కళ్లు తెరుస్తాను. మంత్రం అర్థం అవుతుంది! వివరణ విదితం అవుతుంది! అనువాదం వెలుగు వాగులా సాగిపోతుంది!

భగవానుడు అంతటి కృపాకటాక్షం కురిపించకుంటే ఇంతటి మహాయజ్ఞం, ఇంత కొద్ది వ్యవధిలో పూర్తికావడం అసాధ్యం – అనితరసాధ్యం – దుస్సాధ్యం!

## అనన్తావై వేదాః

'వేదం' ఏకవచనం. వేదం 'పవిత్రవిద్య' అని అధర్వవేదం, శతపధబ్రాహ్మణం, తైత్తరీయ బ్రాహ్మణం చెపుతున్నాయి.

'వేదాః బహువచనం' –

'చత్వారోవా ఇమే వేదా ఋగ్వేదో యజుర్వేదో సామవేద, బ్రహ్మవేద ఇతి' అని గోపథపూర్వము. వేదాలు నాలుగు. అవి ఋగ్వేద, యజుర్వేద, సామవేద, బ్రహ్మవేదములు. బ్రహ్మవేదమే అధర్వవేదము. యజుర్వేదం శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదం అనేది.

ఏవమిమే సర్వేవేదా నిర్మితాః ససంకల్పాః, సరహస్యాః, సబ్రాహ్మణాః, సోప నిషత్కాః, సేతిహాసాః, సాన్వాఖ్యానాః, సపురాణాః, సస్వరాః, ససంస్కారాః, సనిరుక్తాః, సానుశాసనాః, సానుమార్జనాః, సవాకోవాక్యాః – అని గోపథ బ్రాహ్మణం.

వేదాలన్నీ సంకల్పం, రహస్యం, బ్రాహ్మణాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, వ్యాఖ్యానాలు, పురాణాలు, స్వరాలు, సంస్కారాలు, నిరుక్తాలు, అనుశాసనాలు, అనుమార్జనాలు, వాక్కు యొక్క వాక్యాల సహితంగా నిర్మించబడినవి.

"అనన్తావై వేదాః" "ప్రాజాపత్యోవేదాః" అని తైత్తరీయం. వేదాలు అనేకం. వేదం ప్రాజాపత్యం.

'ప్రజాః సృష్ట్వాపాలయస్వేతి తస్మాత్ప్రజాపతి రభవత్' అని గోపథ పూర్వం. ప్రజలను సృష్టించి పాలించడంవల్ల ప్రజాపతి అయినాడు.

వేదాలుసహితం ప్రజాపతి కార్యాన్నే నిర్వర్తిస్తున్నాయి. "అపరిమితోషి ప్రజాపతిః" – ప్రజాపతి అపరిమితుడు. కావున వేదాలు అపరిమితాలు – అనన్తావై వేదాః!

## వేదమేకం చతుర్విధం:

వేదాలు అపరిమితాలు – అనంతాలు. అట్లయిన వేదాలు నాలుగు ఎట్లయినవి?

"ఏవం చకార భగవాన్ వ్యాసః కృపణవత్సలః
వ్యవధాత్యజ్ఞసంతత్యై వేదమేకం చతుర్విధం" – అంటుంది శ్రీమహాభాగవత పురాణం.

కృపావాత్సల్య పూర్ణుడగు వ్యాస భగవానుడు అజ్ఞులు, అవ్యవధానులగు సంతతుల కోసం ఒకే వేదాన్ని నాలుగుగా విభజించాడు.

వ్యాస భగవానుడు త్రికాలజ్ఞుడు. రానున్న తరాలవారు కేవలం భౌతికవాదులూ, విరామం లేనివారూ అవుతారని గ్రహించి, "చకార వేదమేకం చతుర్విధం" అన్నాడు.

'చకారవేదమేకం చతుర్విధం' అని ఒక్క వాక్యంలో చెప్పాడు వ్యాసుడు. కాని మానవ కళ్యాణమే ధ్యేయంగా తన జీవితాన్నంతటినీ కప్పూరంలా అర్పించిన వ్యాసుడు అందుకు ఎంత శ్రమించిందీ చెప్పుకొనలేదు!

అనంతములు, అపరిమితములగు వేదాలను నాలుగు 'వేదసంహితలు'గా విభజించడం మానవమాత్రులకు సాధ్యం అయ్యేపనిమాత్రం కాదు.

వ్యాసభగవానుడు – సూర్యదేవునివలె – మధ్యన ఆసీనుడై, గ్రహనక్షత్రాదులవంటి శిష్యగణము పరివేష్టించి ఉండగా ఒక్కొక్క మంత్రాన్నీ, సూక్తాన్నీ ఎందరో చదువుతుండగా నిర్ణయించి పరిష్కరించి ఉండవచ్చు. మనోఫలకంమీద వెలసిన ఆ దృశ్యమే అద్భుతం! ఆశ్చర్యకరం!! ఆనందకరం!!!

వ్యాసభగవానుడు ఎన్ని రాత్రులు, ఎన్ని పగళ్లు, ఎన్ని మాసాలు, ఎన్ని సంవత్సరాలు నిరంతరం కృషిచేసి వేదసంహితలు నాలుగని నిర్ణయించినాడో! ఇవి మాత్రమే వేదములు, అన్యములు కావు అని ఒప్పించడానికి వ్యాసమహర్షి, అతని అపారశిష్యగణము ఎంత శ్రమించినారో!! అందును గురించి కనీసం అంచనా వేయగల శక్తిస్తోమతలు మనకు లేవు. మనది అల్పబుద్ధి! మనం అల్పాయుష్కులం!!

వ్యాసభగవానుడు మానవజాతికి చేసిన అనంత సేవను గురించి చెప్పుకునే శక్తిలేదు ఈనాటి దౌర్భాగ్య కృతఘ్న మానవాళికి!

వ్యాసుడు భరతవంశం అంతరించకుండా రక్షించాడు. పంచమవేదమగు శ్రీమహాభారతాన్నీ, అందులో అమృత తుల్యమగు శ్రీమద్భగవద్గీతను కృష్ణపరమాత్మచే ప్రవచింపచేశాడు. మానవజాతికి శాంతిప్రదమగు భక్తిని శ్రీమద్భాగవతంలో ప్రవచించాడు. అనేక పురాణాలు రచించాడు.

వ్యాసుడు సంఘసంస్కర్త అయినాడు. భిషగ్వరుడు అయినాడు. రాజకీయవేత్త అయినాడు.

అతడుకానిది ఏది?

అతడు సర్వస్వమైనాడు!

ఇంతచేసిన వ్యాసుడు తనకోసం ఏమీ చేసికోలేదు! అతనికి కనీసం తన పుత్రుడు దక్కలేదు. ఏ గుడిశలోనో, ఏ చెట్టుకిందనో ఉండి, పిడికెడు మెతుకులు తిని ఇన్ని ఘనకార్యాలు సాధించి, కనీసం చెప్పుకొనలేదు. ఆ మహర్షికి మనం ఏమి ఇవ్వగలం?

*వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పుత్రమకల్మషం!*
*పారాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిం!!*

వ్యాసభగవానుడు దర్శనం ఇస్తే అతని పాదారవిందములను చుంబించాలని ఉంటుంది. నాకుగల అసాధ్యమైన ఆశ అది!

## వేద సంహితలు:

వేదాల్లోని సూక్తాలను అనేకమంది ఋషులు వారివారి సమయాల్లో దర్శించారు. ఋషులు మంత్రాలకు సూక్తాలకు ద్రష్టలు, స్మర్తలు మాత్రమే. స్రష్టలుమాత్రం కారు. పరాత్పరుడు ప్రవచించిన దానిని వారు విన్నారు. స్మరించారు – లిఖించారు.

తరువాత వచ్చిన మతప్రవక్తలంతా ఈ విధానాన్నే అవలంబించారు. బైబిల్, ఖురాన్ మున్నగు గ్రంథాలనుకూడా భగవంతుడు వెలువరించగా ప్రవక్తలు దర్శించి మానవాళికి అందించారు.

వేదాలకు ఇతర మతగ్రంథాలకు ఒక ప్రధామైన భేదం ఉంది. వేదం ఏ ఒక్క దేశ, ప్రాంత, మతానికి సీమితం అయిందికాదు. ఇది సకల మానవాళికి చెందింది. వేదాన్ని ఏ ఒక్క ప్రవక్తమాత్రం దర్శించలేదు. అనేకమంది ఋషులు దర్శించారు.

సాయణాచార్యుడు ఋషిని 'అతీంద్రియదర్శి' అన్నాడు. సాధారణ ఇంద్రియము లనుమించి దర్శించువాడు అని అర్థం. అట్టివారే అపౌరుషేయ వాక్కును దర్శించ సమర్థులు.

ఆ విధంగా అనేకమంది ఋషుల సూక్తాలను ఏర్చికూర్చినది 'సంహిత'. దీనినే మనం సంకలనం అంటున్నాం. వ్యాస భగవానుడు ఆ విధంగా నాలుగు వేదాలను సంహితలుగా కల్పించాడు.

1. ఋగ్వేద సంహితలో 10,589 మంత్రాలున్నాయి. ఋగ్వేదసంహిత దేవతల గుణగణాలను స్తుతిస్తుంది.
2. యజుర్వేద సంహితలో 1975 మంత్రాలున్నాయి. యజుర్వేదసంహిత వివిధ యజ్ఞవిధానాలను నిర్దేశిస్తుంది.
3. సామవేద సంహితలో 1875 మంత్రాలున్నాయి. ఇది దేవతలను ప్రసన్నులను చేయు గానవిధిని నిర్ణయిస్తుంది.
4. అథర్వవేద సంహితలో 5977 మంత్రాలున్నాయి. ఇది బ్రహ్మజ్ఞానం సంహితగా అనేకానేక లౌకిక విషయాలను వివరిస్తుంది.

వేదద్రష్టలగు ఋషులపేర్లు పురాణ ఋషుల పేర్లలో సామ్యం ఉన్నా వారూ, వీరు ఒక్కరు కారు. వేదాలకూ పురాణాలకూ కాలవ్యత్యాసం చాల ఉంది. వేద

విశ్వామిత్రునికీ – రామాయణ విశ్వామిత్రునికీ – పురాణ విశ్వామిత్రునికీ పేరులో తప్ప సామ్యం కనిపించదు.

## దేవతలు:

వేదసంహితలు దేవతలకు సంబంధించినవి. దేవతలను వివిధ రీతులుగా చెప్పడం జరిగింది. అయితే ముఖ్యంగా 'దేవామహిమానః' దేవతలు మహిమలు గలవారు. "అమృతాదేవాః" దేవతలు అమృతులు అని చెప్పకోవచ్చు.

"దేవతావావత్రయంస్త్రిణోశోష్టావసవః ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాః ఇమేఏవ ద్యావా పృధివీ" 8 మంది వసువులు + 11 మంది రుద్రులు + 12 మంది అదిత్యులు + 1 ద్యావా + 1 పృధివీ = 33 మంది.

ఈ ముప్పది ముగ్గురిలో:–

11 మంది అగ్నిమున్నగు భూలోకవాసులు

11 మంది ఇంద్రాది అంతరిక్షవాసులు

11 మంది సూర్యచంద్రాది ద్యులోకవాసులు.

దేవతల సంఖ్య ఇంతటితో ఆగినట్లు కనిపించదు. రోలుమండుకము, సోమము, ఋభువులు, రాజులనుకూడ దేవతలుగా పేర్కొన్నారు.

"యస్యవాక్యం సఋషిః యతేనోచ్యతేసః దేవతా" అన్నాడు కాత్యాయనుడు. చెప్పినవాడు ఋషి – చెప్పబడినవాడు దేవత.

ఈ సకల చరాచర ప్రకృతి ఏ శక్తులవలన, ఏ పదార్థములవలన జీవిస్తున్నదో వారందరు దేవతలే. వీరు రెండు విధముల వారు. ఒకరు స్వయం దేవతలు – సూర్యచంద్రాదులు, పృధివి, అకాశము, వాయువు, నీరు మున్నగువారు. రెండు – కర్మవలన దేవత్వమును సాధించినవారు. ఇంద్రుడు, అశ్వనులు, ఋభువులు మున్నగువారు.

**భారతదేశం 'కర్మభూమి.' 'కర్మ' అంటే అదృష్టాన్ని నమ్ముకొని చేతులు జోడించి కూర్చోవడం కాదు. 'కర్మ' అంటే శ్రమ, కృషి, నైపుణ్యం. కృషివలన దేవతలైన ఋభువులు మున్నగువారున్నారు. భారతీయ తాత్త్వక చింతన ప్రకారం మానవుడు దైవత్వాన్ని సాధించగలడు. 'అహం బ్రహ్మాస్మి' అంటుంది ఉపనిషత్తు.**

దైవత్వాన్ని సాధించడం అంటే ఈ లోకాన్ని గెలవడం కాదు – తనను గెలవడం.

*"లోకములన్నియున్ గడియలోన జయించినవాడ వింద్రియా*

*నీకము జిత్తమున్ గెలువ నేరవు"* అంటాడు ప్రహ్లాదుడు – తండ్రి హిరణ్యకశిపునితో.

చరాచర ప్రపంచంలోని సకల పదార్థాలకూ ప్రాణముందని భారతీయుల విశ్వాసం. "ఆత్మవత్సర్వభూతాని" – సమస్త ప్రాణులను నిన్నువలెనే భావించు, వానిని బాధించకు అనే సూక్తంమీదనే సమస్త ప్రకృతి శక్తులకు హాని కలిగించక అరాధిస్తూ మానవ జాతి లక్షల సంవత్సరాలు సుఖంగా జీవించింది. పాశ్చాత్యుల సైన్సు అనే దురాశాపూరితవర్తకానికి నేడు ప్రకృతి శక్తులు బలియై, మానవజాతి స్వవినాశపు దరిదాపులకు చేరుకున్నది.

దేవతలకు రూపాలు, ఆయుధాలు, వాహనాలు, స్థానాలు వేదంలో నిర్దేశించబడినాయి. చెట్టు, పుట్ట, గుట్టనుంచి ఇంద్రాగ్ని, సూర్యచంద్రాది దేవతలను యజ్ఞంద్వారానే పూజించడం, స్తుతించడం ఆరాధించడం జరిగింది.

ఆరాధనలన్నీ కోర్కెలు తీర్చుకునే కామ్య కర్మలే. కామ్య కర్మలు సాధారణంగా యజమానులు చేయరు. పురోహితులు వారితో చేయిస్తారు. కామ్య కర్మలన్నీ కాయకములు. మనసుతో వాటికి పని ఉండదు. మనసును గురించి వేదంలో చెప్పబడింది. కాని, ఉపనిషత్తులలో మనసునకు ఇచ్చినంత ప్రాధాన్యత ఇవ్వబడలేదు.

దేవతలు పురాణాలలో వలె ప్రత్యక్షంకారు – వరాలివ్వరు. తమ మహత్తులు చూపరు. ఒకరితో ఒకరు కక్ష సాధించడానికి యుద్ధాలు చేయరు. వారి అస్తిత్వం మాత్రమే కనిపిస్తుంది కాని ఆర్భాటాలు కనిపించవు.

**వేదంలో వాస్తవాలే ఉన్నాయి. కాని, ఆధునిక కాల్పనిక సాహిత్యంలో ఉన్నట్టి అవాస్తవాలు లేనేలేవు. దేవతలు చచ్చినవాణ్ణి బ్రతికించడం, కోపించి ఒకణ్ణి అణగదొక్కడం, ప్రసన్నులైన ఒకనికి అమాంతపు సంపద ప్రసాదించడం చేయరు.**

**వేదంలో – మనం అనుకుంటున్నట్లు వైరాగ్యం ఎక్కడా కనిపించదు. ఇహమును గురించే ఎక్కువగా చెప్పబడింది. యజమానులు దేవతలను సుఖసంపదలే అర్థిస్తారు. పరలోకాన్ని గురించి ప్రార్థించేది తక్కువ.**

స్వర్గాన్ని గురించీ, అమృతాన్ని గురించీ వేదంలో చెప్పబడింది. కాని పురాణాల్లోవలె స్వర్గభోగాలు, రంభా ఊర్వశులు పరిష్వంగాలు కనిపించవు. నరకము – అందులోని యాతనల వర్ణనలేదు. 'అకము' అనగా వ్యాధులు, దుఃఖాలు. అవి లేనిది 'నాకము.' స్వర్గము 'నాకం'గా చెప్పబడింది.

ఇంద్రుని రాజ్యము స్వరాజ్యం. స్వరాజ్యంలో దుఃఖాలూ, బాధలూ ఉండవు. కాబట్టి మానవుడు అలాంటి రాజ్యం కోరుకున్నాడు – "స్వరాజ్యవైరాజ్యం" అన్నారు.

వేదాల్లో వైరాగ్యం లేనట్లే, ఉపనిషదాదుల్లోకూడా వైరాగ్యం లేదు. మానవుని జీవితాన్ని సుఖసంతోషాలతో నింపడానికే భారత తాత్త్వికత, భారతసాహిత్యం నిరంతరం కృషి చేసింది. వేదాంతానికి వైరాగ్యం అనే అర్థంకూడా స్వప్రయోజనపరుల కల్పనయే! వైరాగ్యాన్ని గురించి చెప్పినా అది ఇహసుఖం కోసమే, పరలోకం కోసం కాదు. **సుఖశాంతులతో కూడిన సమాజాన్ని ఏర్పరచడమే భారతీయ మేధావుల, ఋషుల, మునుల, మహాత్ముల, యోగుల, పరమ యోగుల పరితాపం, కృషి, తపస్సు!**

వేదాల్లోని దేవతలు వేరువేరుగా గాని, అందరు కలసిగాని పరాత్పరుడు, ఈశ్వరుడు, సర్వేశ్వరుడు, భగవానుడు కాజాలరు.

పరమాత్మ సత్యస్వరూపుడు. మానవజాతి సత్యసాక్షాత్కారం – పరమాత్మ సాక్షాత్కారంకోసం – దేశకాలవ్యత్యాసాలు లేక నిరంతరం అన్వేషిస్తున్నది. సృష్టి, స్థితి లయకారకుడగు ఆ పరమాత్మ అనిర్వచనీయుడు, అగమ్యగోచరుడు. అతడు – ఆమె అందరు. అందని పరాత్పరునికోసమే అన్వేషణ. అందని, చూడని ఆ స్వామిని

సాకారుడని, నిరాకారుడని నిరూపించుటకు నిష్ఫలయత్నము చేసినాడు, చేస్తున్నాడు అల్పుడు మానవుడు.

మానవుని జ్ఞానము పరాత్పరుని ఎరుగుటకు అపర్యాప్తము.

**ఆ భగవతి - భగవంతుడు మహాసాగరము. మానవుడు కనీసము దోసిలి కాజాలడు. అతడు వంగిన నింగివరకే** సముద్రాన్ని చూడగలడు. సముద్రాన్ని దర్శించజాలడు.

ఆ పరమాత్మ – పరమేశ్వరియే ఈ సమస్త చరాచర ప్రపంచాన్నీ 'యద్‌దృశ్యతే, శ్రూయతేపినా' కంటికి కనిపించే, చెవికి వినిపించే వానిని సృష్టించారు. ఆధారము లేకనే భూమినీ సూర్య, చంద్ర, గ్రహ నక్షత్రాదులను నిలిపి ఉంచినారు.

ప్రకృతిని – తన ప్రకృతిని –ఎరుగలేని దుర్బల మానవుడు అన్నీ ఎరిగినానని బీరాలు పలుకుతాడు. మానవుడే అన్వేషణ – అన్వేషణయే మానవుడు! ఈ నిరంతర అన్వేషణ ఫలితమే దేవతలు!! అయితే మహాత్ములు, మహర్షులు చూపిన దేవతలను ఆరాధించడం తప్పుకాదు. అతడు అందడు. వారు అందినవారిని దర్శనము చేయించినారు.

పరమాత్మ సత్యము. దేవతలు విశ్వాసము

సత్యదర్శనము కానపుడు విశ్వాసమే మహత్తం.

దేశంలో ప్రభుత్వం అంతటా ఉంటుంది. గ్రామస్తునికి గ్రామాధికారే ప్రభుత్వం. అతనికిచ్చిన పన్ను ప్రభుత్వానికి అందుతుంది. గ్రామాధికారులవంటివారే దేవతలు!

మనం బహుదేవతారాధకులం. వేదం ఇది మనకు నేర్పింది. క్రీస్తుకు ముందు ప్రపంచం సాంతం బహుదేవతారాధన చేసింది.

మనం బహుదేవతారాధకులం. నాకు రామకృష్ణాద్యవతారాలతోపాటు ముత్యాలమ్మ, మరిడమ్మ, పోశమ్మ దేవతలే! ఈ విషయంలో మనం సిగ్గుపడాల్సిన అవసరంలేదు. ఏ ఒక మతాన్నో సంతోషపెట్టడానికి మనం ఏకేశ్వరోపాసకులం అని నిరూపించ ప్రయత్నించనక్కరలేదు.

"ఏకం సద్విప్రాబహుధావదంతి" – ఒకే సత్యాన్ని పండితులు బహువిధాలుగా చెప్తున్నారు – అనే వేద వచనాన్ని పట్టుకొని మనం ఏకేశ్వరోపాసకులం అని నిరసించడం మారేడుకు మసిపూయడంలాంటిది మాత్రమే!

ఒక విషయం స్పష్టం – సత్యం – ఋతం – ఒక్కొక్క మతానికి ఒక్కొక పరమాత్మ, పరాత్పరుడు, భగవానుడు ఉండదు.

**ఉన్నది ఒకే పరమాత్మ**

**ప్రవక్తలు అనేకులు.**

ఏ ప్రవక్తా తనను పరమాత్మునిగా చెప్పుకోలేదు. ప్రవక్తలు, అవతారాలు, మహాత్ములు, పరమహంసలు, పరమాత్ములు అంశామాత్రులు మాత్రమే!

'ఏకోవై బ్రహ్మనా ద్వితీయం' – బ్రహ్మము ఒక్కడే – రెండవవాడు లేదు.

## వేదార్థం:

కౌత్సఋషి వేదానికి అర్థం ఉండదనీ, తెలిసికోరాదనీ అన్నాడు.

క్రీస్తుకు వేయిసంవత్సరాల పూర్వపు 'యాస్కుడు' "నైవస్థాణోరపరాధః యదేనం అంధోనపశ్యతి. పురుషాపరాధః సభవతి' – స్తంభాన్ని చూడకపోవడం స్తంభపు తప్పు కాదు, మనిషి తప్పు అన్నాడు.

స్థాణురయం భారవాహః కిలాభూత్
అధీత్యవేదాన్ నవిజానాతి యోఽర్థమ్!
యోఽఅర్థజ్ఞఇత్ సకలం భద్రమశ్నుతే
నాకమేతిజ్ఞాన విధూతి పాప్మా!!

వేదం చదివి అర్థం తెలిసికోనివాడు తెలియని బరువు మోయు యంత్రం వంటివాడు. వేదం చదివి అర్థం చేసికొన్నవాడు జ్ఞానియై, పాపరహితుడై, స్వర్గాన్ని చేరుకుంటాడన్న యాస్కుడు రచించిన నిరుక్తమే నేటికీ వేదార్థానికి ఆధారం.

తరువాత స్కందస్వామి, ఉద్గీత, వేంకట మాధవులు వేదాన్ని వ్యాఖ్యానించారు. స్కందస్వామి వల్లభి నివాసి. వల్లభి ఖమ్మంజిల్లాలోని గ్రామం. కావున స్కందస్వామి తెలుగువాడని గర్వించవచ్చు.

వేదాలకు సాధికారిక వ్యాఖ్య రచించిన తెలుగువాడు ఆచార్య సాయణుడు (1315–1387). నేటి ప్రాక్, పాశ్చాత్య వ్యాఖ్యాతలందరు సాయణాచార్యుల వ్యాఖ్యాదర్పణంతోనే వేదాన్ని దర్శిస్తారు. పాశ్చాత్య ప్రభావంగల వేద విద్వాంసులు సాయణాచార్యుడు చెప్పిన వినియోగంకోసం అతన్ని విమర్శించడం కాదు – నిందిస్తారు. అయితే, గమనించాల్సిందేమంటే – ప్రతి వినియోగానికీ అతడు పూర్వప్రమాణం ఉదాహరించాడు.

వినియోగం అంటే వాడుక. ఏ సూక్తం దేనికోసం వాడాలో చెప్పడం వినియోగం. ఇందును గురించి ఎంతో చెప్పాల్సి ఉంది కాని ఇది సందర్భంకాదు.

సాయణుడు శుక్లయజుర్వేదాన్ని వ్యాఖ్యానించలేదు. మహీధర – ఉవటాచార్యులు వ్యాఖ్యానించారు.

నేను ఆంధ్రానువాదానికి సాయణ, మహీధర, ఉవట వ్యాఖ్యలనే అనుసరించాను.

దక్షిణాపథంలో అన్యమతస్థుల రాజ్యాలు స్థిరపడి విస్తరిస్తున్నపుడు విద్యారణ్యుడు హరిహర బుక్కరాయలచేత విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపింపచేశాడు. బుక్కరాయలు వేద ధర్మాన్ని ఉద్ధరించదలచి సాయణాచార్యులను వేదాలకు భాష్యం చెప్పమని అర్థించాడు. వేదవ్యాఖ్య మధ్యలో ఉండగానే బుక్కరాయలు అస్తమించాడు. రెండవ హరిహరరాయలుకూడా తన తండ్రివలె వేదవ్యాఖ్య బృహత్కార్యానికి సర్వవిధాల సహకరించాడు.

సాయణుడు ఆంధ్ర బ్రాహ్మణుడు. అతనిది భరద్వాజస గోత్రము. బోధాయన సూత్రము. మాయన – శ్రీమతి అతని తల్లిదండ్రులు. అతడు వేదసంహితలనే కాక 1. తైత్తిరీయ బ్రాహ్మణము 2. తైత్తిరీయ అరణ్యకము 3. ఐతరేయ బ్రాహ్మణము 4. ఐతరేయ అరణ్యకము 5. శతపథ బ్రాహ్మణము 6. తాండ్య బ్రాహ్మణము 7. సద్వింస బ్రాహ్మణము 8. సమవిధాన బ్రాహ్మణము 9. ఆర్షేయ బ్రాహ్మణము 10. దేవతాధ్యాయ బ్రాహ్మణము 11. ఉపనిషద్ బ్రాహ్మణము 12. సంహితోపనిషద్ బ్రాహ్మణము 13. వంశ బ్రాహ్మణములను వ్యాఖ్యానించాడు.

ఇన్ని కోట్ల సంవత్సరాల నిరంతర అన్వేషణలో వ్యక్తి తనను గురించి తెలిసికోలేకున్నాడు. డెబ్బైఏళ్ల జీవితంలో నన్ను నేను తెలిసికోలేకపోయాను. నా అభిరుచులేమిటి? రాగద్వేషా లేమిటి? అర్థం కాలేదు. "ప్రకృతిధర్మమగును పరిణామమందుట" అన్నాను. నా తత్వం నిశ్చితం కాదు. మార్పును గ్రహించలేకున్నాను.

ఆదిశంకరుడు తనకేమీ తెలియదు అంటారు. 'స్వామీ, మీరు జగద్గురువులుకదా తెలియదంటారేమిటి?' అని ప్రశ్నిస్తాడు శిష్యుడు.

'నాయనా! నాకేమీ తెలియదని నాకు తెలుసు నీకు అది సహితం తెలియదు' అంటారు ఆదిశంకరులు!

సత్యం తెలియడం జ్ఞానం – తెలియకపోవటం అజ్ఞానం.

'బహూనిమే వ్యతీతాని జన్మాని తవచార్జున
తాన్యహం వేదసర్వాణి నత్వం వేత్థ పరంతప'

అన్నాడు కృష్ణపరమాత్మ గీతలో.

(అర్జునా! నీకూ, నాకూ బహుజన్మలు గడిచాయి. గడచిన జన్మలన్నీ నాకు తెలుసు – నీకు తెలియదు.)

జ్ఞానికి సర్వం తెలుసు. అజ్ఞానికి ఏమీ తెలియదు. తెలియనిది లేదనడం మూర్ఖత్వానికి పరాకాష్ట!

**ఈ మూర్ఖత్వంతోనే నేటి 'రాక్షస ఉత్పత్తి' విధానం మానవజాతిని వినాశం వైపు తరుముతున్నది. అది తెలియని మానవజాతి దానిని 'ప్రగతి' అని నమ్మి వినాశం వైపు ఉరుకులు పెడుతున్నది.**

పూర్వ పరజన్మలు లేకుంటే అంతా శ్రమిస్తారు కదా! అందరూ అందలమేల ఎక్కరు? ఇది హేతువాద ప్రశ్న. హేతువాదులకు ప్రశ్నలే తెలుసు – ప్రత్యుత్తరాలు తెలియవు. ప్రకృతిలోనే ప్రశ్నలు మరిన్ని - ప్రత్యుత్తరాలు కొన్నే!

నాకు పూర్వం ఎన్ని జన్మలు గడిచాయో? రానున్న జన్మలెన్నో ఏం తెలుస్తుంది? నేనూ అజ్ఞానినే! అయితే, ఇదే చివరి జన్మ కావాలనుకుంటాను. మనం అనుకున్నవి కావుకదా!

"బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" – జ్ఞానవంతుడు బహుజన్మల తరువాత నన్ను చేరుతాడు అంటాడు పరమాత్మ. "బహు" అన్నాడు – ఎన్ని జన్మలో చెప్పలేదు!

"శ్రద్ధావాన్ లభతేజ్ఞానం" – శ్రద్ధగలవానికి జ్ఞానం లభిస్తుంది. శ్రద్ధ అన్నింటికీ అవసరం అని మన జీవితానుభవం. శ్రద్ధ ఉన్నంతమాత్రాన జ్ఞాని అవుతాడు అనడం లేదు. జ్ఞానం మాత్రం లభిస్తుంది అంటున్నాడు. నాకు శ్రద్ధ ఉంది. నాకు కొంత జ్ఞానం కలిగి ఉండవచ్చు. కాని, నేను జ్ఞానిని అని నమ్మలేను.

శ్రీ శుకుడు పుట్టుకతోనే యోగి అయినాడు. తల్లిదండ్రులను వదిలాడు. తన దారిన పడ్డాడు. తండ్రి వ్యాసభగవానుడు "కొడకా? కొడకా" అని వెంటపడ్డాడు. శ్రీ శుకుడు వినలేదు. తన దారి వదలలేదు.

వ్యాస, శ్రీ శుకుల్లో ఎవడు జ్ఞాని? ఎవడు అజ్ఞాని? జ్ఞానాన్నీ, ధర్మాన్నీ నిర్వచించడం అసంభవం. సమయసందర్భాన్నిబట్టియే వాటి అర్థం!

నాకు ఏదో పూర్వజన్మపుణ్యం ఉందనిపిస్తుంది. కాకుంటే భగవానుని నిర్హేతుక కటాక్షం కలిగి ఉండాలి.

అయతి శ్శ్రద్ధయో పేతో యోగాచ్చలిత మానసః।
అప్రాప్య యోగసంసిద్ధిం కాంగతిం కృష్ణగచ్ఛతి॥

'శ్రద్ధగలవాడే, నిగ్రహం ఉండదు. అలాంటివాడు యోగ భ్రష్టుడవుతాడు. అతనికి యోగం సిద్ధించదు కదా? వాడు ఏ గతికి చేరుకుంటాడు?' అని అర్జునుడు కృష్ణపరమాత్మను అడిగాడు.

భగవానుడు చెప్పుచున్నాడు :-

ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీః సమాః।
శుచీనాం శ్రీ మతాంగేహే యోగ భ్రష్టోఽభిజాయతే॥

(యోగభ్రష్టుడు శాశ్వత సమములగు పుణ్యకృత్ లోకాలను అనుభవించి శుచిమంతులగు శ్రీమంతుల ఇంట జన్మిస్తాడు.)

పుణ్యలోకాలు అనుభవించింది ఎరుగను - కాని శుచీనాం శ్రీమతాంగేహే జన్మించాను.

శ్రీమద్రామానుజ యతి తరువాత ఆచార్య పీఠాన్ని అధిష్టించిన 'దాశరథి' వంశం మాది. మాకు తెలిసినంతవరకు మా పూర్వులందరూ విద్వాంసులు, సద్వైష్ణవులు, నిష్ఠాగరిష్ఠులు.

భగవదనుగ్రహం, పూర్వజన్మసుకృతం లేకుంటే ఈ జన్మలో నేను పడినన్ని కష్టాలు, అనుభవించిన దుఃఖం తట్టుకొని జీవించడం దుర్లభం!

**నిజదారసుతోదరపోషణార్థం ఆర్జించడం తప్ప మిగతా జీవితం ప్రజాసేవకూ, మానవసేవకూ - ఫలాపేక్షారహితంగా - అంకితం చేశానని సగర్వంగా చెప్పగలను.**

తెలిసి ఇంతవరకు అబద్ధం ఆడలేదు. ఉపకారం తప్ప అపకారం చేయలేదు.

పరిపూర్ణమైన విశ్వాసంతో కమ్యూనిస్టుగా ప్రజాపోరాటాల్లో పాల్గొన్నాను. స్వాతంత్ర్యం వచ్చాక ఫలితాలకు ఆశించలేదు. బట్టవిడిచినట్లు రాజకీయాలు వదిలి, స్వయంకృషితో డిగ్రీలు తెచ్చుకొని ఉదర నిమిత్తం ఉద్యోగంలో చేరాను.

నేను ఎవరి 'శుశ్రూష' చేయలేదు. గురువును ఆశ్రయించలేదు. ఉపదేశం పొందలేదు. నాకు గురువులు లేరు - శిష్యులూ లేరు.

'నను కనిపెంచినట్టి తెలంగాణ'కు నా కర్తవ్యంగా తెలంగాణ ప్రజా జీవితాన్ని చిత్రించే నవలలు వ్రాశాను. ఇహ ఎవరూ రాయలేరు!

నాస్తికత్వ, హేతువాదాలనుండి స్వచ్ఛందంగా బయటపడి - శ్రీమద్రామాయణ, శ్రీమహాభారత, శ్రీమద్భాగవత, చతుర్వేదాల వచనానువాదం చేశాను. సుమారు పన్నెండువేల అచ్చుపేజీలు వ్రాశాను. ఎంత చదివి ఉంటాను!

భగవదనుగ్రహంలేక నావంటి సామాన్యునికి ఇది సాధ్యమా?

"ఎక్ ఖత్రా జిందగీకా సిఖాతాహై సబఖ్
కభీ షబ్నమ్ బనా కభీగోహర్ బనా కభీ అష్క్"

అంటారు ఇక్బాల్ మహాకవి.

ఒక బిందువు జీవితానికి పాఠం నేర్పుతుంది. అది ఒకప్పుడు మంచుబిందువు, ఒకపుడు ముత్యం, ఒకపుడు బాష్పబిందువు అవుతుంది.

తుహిన బిందువు బాల్యం. ముత్యం యవ్వనం, బాష్పబిందువు వార్ధక్యం.

నేను బాష్పబిందువుగా ఉన్నాను. అయినా సాహిత్యపరిశ్రమ కొనసాగిస్తున్నాను. "మైఁఅభీ జవన్‌హూఁ అభీ జవాన్‌హూఁ" అనాలనిపిస్తుంది.

1997 సెప్టెంబరులో విశాఖ సహృదయ సాహితివారు నాకు గురజాడ అవార్డు ఇచ్చి సత్కరించారు. అక్కడ నాకు చిత్రకవి ఆత్రేయ మైత్రి – శ్రీభాష్యం అప్పలాచార్యులవారి మంగళాశాసనాలూ లభించాయి.

1998 జనవరిలో కాకతీయ విశ్వవిద్యాలయం వారు కనులపండుగగా డాక్టరేటు ప్రదానం చేశారు. ఇంత కాలానికా? అన్నారు మిత్రులు. "దూర్‌సె ఆయా, దేర్‌సె ఆయా ఫిర్‌భీ ఆయా సుహాగ్‌కీరాత్" అన్నాను.

బహుధాన్య శ్రావణశుక్ల సప్తమి 30–7–98కి నాకు డెబ్బది నిండాయి.

మా మగపిల్లలో ఒకడు ఈ లోకం వదలిపోయాడు, ఒకడు మమ్ము విడిచిపోయాడు అని వ్యధగా ఉండింది.

15–2–1998న అనుకోకుండా మనుమడు "శ్రేష్ఠ" ఆరేళ్లవాడు తాతా, నాన్నమ్మా అని మీదపడ్డాడు. మేం పొంగిపోయాం.

11–5–1998 కోడలు ఉమ వచ్చింది. మేం స్వాగతం పలికాం. పల్లెత్తుమాట అనలేదు. ఇల్లు నిండుగా ఉంది.

22–5–1998న విరించి, ఉమ, శ్రేష్ఠ వచ్చి నాకూ కమలకూ పాదాభివందనాలు చేశారు.

సుమారు ఒకటిన్నర దశాబ్దం తరువాత ఇంటికి చేరుకున్నారు.

వాళ్లూ, మేమూ మా కూతుళ్లూ, అల్లుళ్లూ, మనుమలూ కలిసి సంబరాలు చేసుకున్నాం.

అంతంలేనిది జీవనయానం.

ఎంతకని చెప్పడం?

ముగింతాం ఇంతటితో.

సర్వేపి సుఖినస్సంతు – అంతా సుఖించాలి!

సర్వేసన్తునిరామయాః – అంతా వ్యాధిరహితులు కావాలి!!

సర్వేభద్రాణి పశ్యన్తు – అంతా శుభములే చూడాలి!!!

మాకశ్చద్దుఃఖ భాగ్భవేత్ – ఏఒక్కడూ దుఃఖభాజనుడు కారాదు!!!!

ఇది బహుధాన్య అషాఢశుక్లపంచమి 28–06–1998 ఆదివారం

★ ★ ★